# THE THEOSOPHICAL SOCIETY.

# బ్రహ్మవిద్యా సమాజము.

లోకమున మతధర్మము క్షీణించుచు నాస్తికత యెక్కువగుచుండ భగవద్గీతా వచనప్రకారము ధర్మము నుద్ధరింప నిప్పుడు ప్రాబల్యమున నుండు హూణులనుఖ ముగా ప్రసరింప నెక్కువగ నాదరణీయ మగునని యెంచి మన దయాసముద్రులైన రాజర్షి శ్రేష్ఠులు పశ్చిమదేశీయులైన బ్లావట్స్కీ యను స్త్రీని ఆల్కాటను పురుషుని నమెరికాఖండమున న్యూయార్కను పట్టణమున 1875 సంవత్సరము నవంబరు 17-వ తారీఖున నీసమాజమును స్థాపింప ప్రేరేపించిరి. మనదేశమున నీసమాజమునకు చెన్న పట్టణమున నడియారను భాగమున ముఖ్యకార్యస్థాన మేర్పాటుచేయబడి యున్నది. ఈసమాజమున రాజకీయవిషయములు చర్చింపబడవు. జీవజగత్తుల విషయమై మన ఋషులు ప్రతిపాదించిన దివ్యతత్త్వము సకలజనాదరణకై జన్మసాఫల్యమునకై యిందు నెల్లడిచేయబడుచున్నది. ఈసమాజముయొక్క ముఖ్యోద్దేశము లేవన:—

మొదటిది—జాతి, మతము, లింగము, కులము, లేక వర్ణభేదములు లేక సర్వమానవ కోటియొక్క సహోదరత్వమునకు నాకరము గలిగించుట;

రెండవది—లోకమున నుండుమతములను దత్వములను శాస్త్రములను సరిపోల్చి చదువుటను ప్రోత్సాహపఱచుట;

మూడవది—మనుజునియందలి యంతర్గతమైన శక్తులను ప్రకృతియొక్క గూఢమైన ధర్మములను బరిశోధించుట.

ఈ సంఘమున జేర 10 రూపాయలు ప్రవేశపు రుసు మివ్వవలెను. వెనుక నేదైన శాఖను జేరిన ప్రతి సంవత్సరమునకు 2 రూపాయలను, జేరకున్న మూడురూపాయలను చందా యివ్వవలసినది. ఇప్పటికి లోకమంతట నీసంఘము ననేకపట్టణముల 898 శాఖలున్నవి. దీనివిషయమై యితరసమాచార మెల్లెడల విచారించుకొనవచ్చును.

గలదు. ఈదేవత నుపాశించిన భక్తులు సిద్ధులను బొంది నిర్వాణమును గూడ జేరు దురు. సంస్కృత, మళయాళ, యాంధ్ర యరవభాషల గ్రంథములను రచించువా రందరీదేవత స్తోత్రమునకు నొకటి రెండు శ్లోకములను సమర్పించుచుందురు. మళయాళ దేశమున "ఓంగణేశాయనమః" యని యక్షరాభ్యాసము గూడ బాలురకు జేయు దురు. ఇట్లుసర్వసామాన్యమై వ్యాపించిన యీ దైవభావమునకు నేదైన పరమార్థ మున్నదా యను నెంక బొడముచున్నది. దానినిగురించి విచారించుదుము.

మొదట యాకారమును గురించి విచారింతము. ఇతని ముఖ మేనుగది. దేహ ము నరునిది. మన ధర్మశాస్త్రములయందు నచంచల స్వభావమునుబట్టి మనస్సును ఏనుగ తొండమునకు బోల్చ బడినది. ఈ మనస్సునకు స్థానము వాహనము మానవ శరీరముల నుండు బ్రహ్మదండము లేక వెన్నెముక, ఈదండము నెంత వృద్ధిజేసిన మనోభావము లంత యెక్కువగ బ్రకాశించును. ఆర్యహిందువులైన మనము సృష్ట్యాది నుండి కలిగిన మొదవ మూలజాతియొక్క మొదటిశాఖకు జేరినవారము. మనవారి యందే మొదట మనోప్రకాశ మెక్కువగ గలిగినది. ఈ బ్రహ్మదండముయొక్క యాకార మేనుగతల మొండెములను బోలియున్నది. గనుక మనోస్థానమైన బ్రహ్మ దండమును సూచింప నీదేవత ముఖమున కీరూపము సంజ్ఞగ నేర్పడియున్నది కాబోలు. అట్లు కాకున్న ఋషులు తమ ధ్యానమున నీదేవుని సంజ్ఞారూపమును బ్రహ్మదండము యొక్క సంకల్పరూపము బోలినట్లుగ గనియుండవచ్చును. ఇదియె మనకు ముఖ్యా చారముగ నేర్పడి పూజార్హమైనది కాబోలు.

గణపతి యనగా గణములకు లేక నామరూపములకు బ్రభువు. మనస్సువల్లనే కదా నామరూపాత్మకమైన ప్రపంచ మేర్పడును. బ్రహ్మదండముయొక్క కొనభాగ మున నుండు మూలాధార చక్రమునకు గణపతి యధిష్ఠానదేవత యగును. జీవశక్తికి నది స్థానము. దానిని జయించిన ననగా మనసును జయించిన సర్వమునకు గమ్యమైన మోక్షసిద్ధి యగును. ప్రతి దేవస్థానమున నుండు ధ్వజస్తంభము బ్రహ్మదండమును సూచించును. ప్రతిసంవత్సరమున మహోత్సవకాలమందు దానిచుట్టున గట్టబడు రక్త, శ్వేత, పీత వర్ణములు గల గుడ్డ బ్రహ్మదండమున నుండు యోగాభ్యాసమున వాడబడు కుండలిని శక్తియొక్క త్రివిధ ప్రాణములను సూచించును. ధ్వజస్తంభముయొక్క యడుగున గణపతి విగ్రహము నుంచబడి యుండును. ఈ దేవుని సూక్ష్మరూపము బ్రణ వము. సృష్టికాలమున కంతయు ప్రణవము ప్రాణము. ఈప్రణవోపాసనవల్ల భూర్భువ

స్వర్లోకానుభవములను బొంది నరుడు ప్రకృతియొక్క రూప లోకాతీతుడు గూడ గావచ్చును. సత్యసంకల్పుడు గూడనగును.

మన పూర్వీకులు మనోసంకల్పశక్తిని నెఱిగియుండిరి. "మనము దలచునట్లు మనమగుదు"మని ఛాందోగ్యోపనిషత్తు బలుకుచున్నది. "మనము సంకల్పించిన దాని ఫలము ననుసరించి మన ప్రకృతస్థితి గలిగినది. దీనికి సంకల్పము లాధారములు. ఇది సంకల్పభూత మైనది" యని బుద్ధుడు సెప్పియున్నాడు. కావున మన పూర్వీకులు ప్రతికార్యము జేయునపుడు కార్యము జేయురీతిని గార్యముయొక్క యుద్దేశమును మనసున స్థిరపరచుకొని యనగా సంకల్పముజేసి కర్మ ప్రారంభించు పద్ధతిని గార్యసాఫల్యమునకై యేర్పాటుజేసియున్నవారు. సంకల్పమునకు బూర్వమున ప్రాణాయామము విధించియున్నారు. (ప్రాణాయామమన నిప్పటికాలమునందు వలె సామాన్యముగా ముక్కును స్పృశించుట గాదు. దానివిధి ప్రత్యేకముగా నున్నది. చిత్తనిరోధ ఫలము నిచ్చునది. దాని నిచ్చట జెప్పబడలేదు). అచంచలమైన మనస్సును దృఢముజేసి శాంతిని వహించునట్లు జేయుట ప్రాణాయామముయొక్క ఫలము. మనస్సుండు చోట ప్రాణ ముండునని రాజయోగులు సెప్పుదురు. ప్రాణ ముండు చోట మనస్సుండునని హఠయోగులు సెప్పుదురు. గనుక ప్రాణాయామమున మనస్సును సమాధానపరచి సంకల్పము జేసి కార్యోద్యుక్తులు గావలెను. అపుడు మనస్సునకు నధిష్ఠానదేవతయైన గణపతి ప్రసాదమును బొందినవారగుదుము.

గనుక సర్వకార్యము లారంభించుటయందు గణపతిని బూజించెదము. యోగులు మూలాధార చక్రమును జయించి యందుండు గణేశుని యనుగ్రహ ప్రసాదములను గైకొనకున్న యోగాభ్యాససిద్ధిబొందుట యరుదని చెప్పబడియున్నది. త్రిపురదహనమందు, దేవతలవల్లను సురపద్మాసుర వధయందు సుబ్రహ్మణ్యునిచేతను, గణేశ పూజ సల్పబడినది యనుదాని రహస్య మిదియె. అద్వైత వేదాంతమునందుగూడ రూపాత్మకమైన మాయను జంపి బుద్ధి విశుద్ధత బొంది బ్రహ్మైక్యానుభవము బొందుటయె కార్యమని చెప్పబడి యున్నది.

కొన్ని దేవాలయములందు గణపతియొక్క తొండపు కొనయందొక పాత్రయు నతని తొడమీద లేక యతని ప్రక్క నొక యువతి యుండును. ఆపాత్ర యమృత కలశమును సూచించును. మూలాధార చక్ర సమీపమున నుండు కుండలినీ శక్తిని సూచించును. అమృతకలశము నామరూపాత్మకమైన ప్రపంచముయొక్క బీజ సము

దాయస్థానమును సూచించును. సాధారణముగ నీదేవతావిగ్రహ మశ్వత్థవృక్షముక్రింద నాగులతో గూడియుండును.

అశ్వత్థము సంసారప్రవాహమును సూచించును. ఆదేవత నామరూపాత్మకమైన ప్రపంచమునకు నెలవగును. నాగులు సర్పాకారముగల కుండలిని సూచించును. ఇట్లు మధురవాస్తవ్యులైన నారణయ్యగారీదేవతను గురించిన విషయమును పురాణ బ్రహ్మవిద్యా పత్రికయందు సంగ్రహించి యుండుటను జాలా ప్రశంసించుచున్నాము. దీని విషయమై మాకు దోచినది జేర్చి విరమించుచున్నాము.

1. సాధారణముగా నహంకారమునకు నేనుగును బోల్చుదుము. నిరహంకారమైన పరమాత్మస్వరూపము మొదటి యహంకారరూపమున బ్రసరించినది. గనుక యీదేవతకు నేనుగముఖ మేర్పడి యుండవచ్చును.

2. వాసిష్ఠమున,

శ్లో॥ జీవః పరం బ్రహ్మచాహ మితితత్వం విబోధయన్।
నరసింహాత్మనాభాతి యస్తం వందే జగద్గురుం॥

ఇట్లు గజాననుడు నృసింహావతారమువలె మృగముయొక్క ముఖమును మనిషి దేహమునుదాల్చి జీవుడనియు పరబ్రహ్మమనియు దానే ప్రసిద్ధుడై యున్నాడను తత్వార్థమును జనులకు దెలియజేయుటకు జిహ్నమై యున్నట్లున్నది.

3. మరియు వాసిష్ఠమున గజానను స్తోత్ర మిట్లు జేయబడినది,

శ్లో॥ జగద్గజ మితిప్రోక్తం గమనాజ్జననాదపి।
అనంగజా ననత్వాత్తో యస్తం వందే గణాధిపం॥

గ అనగా గమనము. జ అనగా జననము, ఆనగా యుత్పత్తిలయము. కావున గజాననుడన ఉత్పత్తిలయ స్వరూపుడని యర్థము. సత్పదార్థముయొక్క చిత్పరికాశము లేక అవ్యక్త సంకల్ప స్వరూపమైన వ్యక్తమును సూచించును.

4. ఈదేవుని గణపతి యందుము, గ అనగా గానము. ణ అన ధ్వని. జ అనినను ధ్వనియే. గనుక గజమనినను గణ మనినను అవ్యక్త స్వరూపమైన పరమాత్మనుండి పుట్టిన శబ్దబ్రహ్మమైన ప్రణవమును సూచించును. ఇట్లుదేవత సకలవిధముల రూపరహితమైన పరమాత్మనివల్ల మొదట గలిగిన రూపమును సూచించును. గనుక నేకార్యము జేయుటయందు సర్వాధారమై సర్వాంతర్యామియైన దేవుని స్మరణకు దెచ్చు నీదేవతాస్వరూపమును బూజించి కార్యములు జరుపవలసిన పద్ధతు లేర్పడియున్నవి.

కావున మనమందరము ప్రకృత ప్రయత్నమును సఫలముజేయ విఘ్నేశ్వరుని గూర్చి యేక గ్రీవముగ స్మరించి సాష్టాంగవందనము లాచరించుదము.

సద్గురవేనమః.

## స్వ వి చా ర ము.

లోకమున ననేక దేశములు దేశస్థు లున్నను మనదేశమున మన పూర్వదేశీయులవలె దివ్యజ్ఞానమును సంపాదించినవా రెవరును లేదని దృఢముగా జెప్పవచ్చును. అనేక విదేశీయు లొకరివెంట నొకరువచ్చి మనదేశమును బాలించసాగిరి. కాలక్రమముగా మనకు మనపెద్దలిచ్చిన జ్ఞానసామగ్రి దక్కువ యగుచువచ్చి యిప్పటిస్థితిని పూర్వస్థితికి బోల్చిచూడ మనగుండెలు బద్దలగుచున్నవి. హూణవిద్యాప్రచారమెక్కువై హూణవిద్యాప్రవీణులు హూణుల ననుకరించ వారి బాహ్యాచారములను మాత్రము నవలంబించి యింతనంత ముట్టక త్రిశంకస్వర్గమును జేరువారైరి. హూణుల లౌకిక కార్యాధిక్యముల చేత నిర్వైరగుచు స్వధర్మములను మానుచువచ్చితిమి. మనకు దగ్గియుండవలశినవారు హెచ్చిరి. మనము హీనులైతిమి. పిన్న పెద్దల తారతమ్యము నించుకయైన గానరాదు. సకాలమున వానలు గురియవు. పంటలు పండవు. మారి కాయుపాధి మహామ్మారి మొదలగు దుర్వ్యాధులు మెండైనవి. బీదసాదలకు సాధువులకు జీవనము గష్టమైనది. ఇట్టిస్థితియందు మనమెట్లు నడవవలసినది గోచరము గాక యున్నది. ముందుస్థితిని బొందగుమన్న గాలదేశములు వికటించునట్లున్నవి. నూతనమార్గము నవలంబించుమన్న జాతికులభేదభావములుడుగలేక, నవీన యంత్ర తంత్ర సాధనములచే లోకముయొక్క మూలనుండు సమాచారము గూడ శీఘ్రముగ దెలియవచ్చుచున్నది. లోకమునందుండు జాతివర్ణ కులభేదములను జూడ నెట్లు దరి జేరెదమని మనస్సు విహ్వాల మగుచున్నది. ఇట్టి వ్యాకులమైనస్థితి సముద్రమున మన నందరిని గట్టుజేర్చుటకు మనుఋషులు దయాసముద్రులై దివ్యజ్ఞాన సమాజమను రోడను లౌకిక పాలకులద్వారా మనకు బంపియున్నారు. ఆరోడయందు హూణ భాషాపరిచయము గలవారుమాత్ర మిదివరకు విహరించి మన పూర్వ గౌరవస్థితి నించుకగని సాధించుచున్నవారు గాని తదభావులకు గోచరము గాకయున్నది. గనుక

మనదేశమున నుండు సకలజనులకు మనధర్మములను దెలిపి మన పూర్వసుఖస్థితిని నీదేశమున మరల గలిగించుటకు నీప్రయత్నము జేయబడినది. గనుక నిరవు ప్రచురింపబోవు వార్తాసమూహమును మఱొక సంచిక వచ్చునంతలో జక్కాగా మనసున నిమిడించి వర్తించిన మనకు సర్వసౌఖ్యములు గలుగుటకు సందియములేదని మున్నూరుగా బలుకుచున్నాము. ఇందులో ప్రకృతముమన ధర్మశాస్త్రములను భగవద్గీతావచనమును ఆనిబెసాంటమ్మగారు రచించిన సంకల్పాక్తిని, మనగురుచరిత్ర బోధలను మొదలగు ధర్మసాధనములను బ్రచురించుట యగును. ఇవన్నియు గాలక్రమముగా వేరువేరు పుస్తకములుగా ననుకూలించునట్లు ముద్రింపబడును. తెనుగుదేశమున నుండు సకల జనులు దీని నాదరించుటకై స్వల్పచందా నేర్పరచియున్నాము గనుక నీసందర్భమును వ్యర్థముజేయక యెల్లెడల మీకు సాధ్యమైనంతవరకు బ్రచురించి ధన్యులగుదురుగాక యని యీశ్వరుని గూర్చి ప్రార్థించుచున్నాము. ఇందలి తప్పొప్పులను లోపాలోపములను మాకు దెలియజేసి మన్నించి యీప్రయత్నమును సాఫల్యము జేయ నీసామాజికు లందరికిని నితరవిద్వాంసులకును నతివినయమున విన్నవించుకొనుచున్నాము.



## మతమననేమి.

నానావిధములై విశాలమైన యీప్రపంచమున వివిధములైన ప్రాణివర్గము సృష్టిజాలమున్నదికదా? పైన, క్రింద, నన్నిప్రక్కల మనచుట్టు నాకస మావరించియున్నది. ఆకాశమున మన యుత్తకంటికి గోచర మగుచున్న యనేకకోట్ల నక్షత్రములు గాక ప్రతిదినమును శాస్త్రజ్ఞులచేత గొప్ప దూరదర్శన యంత్రములవల్ల దృష్టికి ననేక నక్షత్రములు గోచర మగునట్లు తెలియవచ్చుచున్నవి. సృష్టిజాలమునందుండు చేతనాచేతన పదార్థములను మనసున దలచినమాత్రమున నొకప్రాణి సముద్రమున నుండు జలకణముభంగి దాను దృణప్రాయముగా గనుగొనుచున్నాడు. ఇట్లు మనకు దృశ్య మగుప్రపంచమంతయు నగోచరముగా మనస్సునకు నగ్రాహ్యమై యాశ్చర్యముగా నున్నదికదా? ఒకవేళ మేఘము లావరించును. వాయువు వీచును. మెరుపులు బుట్టును. ఉరుములు ధ్వనించును. వాన గురియును. ఒకవేళ స్వచ్ఛమై యాకసము నిర్మలమై మందమారుతము సౌరభాన్వితమై మనోహరముగ బ్రసరించి యెక్కడజూచి

# మతమన నేమి.

నను సృష్టిజాలము నవ్వునట్లుగా మనస్సునకు నాహ్లాదమును బుట్టించును. సూర్యు డుదయమున నొకతట్టున బుట్టి కొంతకాలము వెలిగి ప్రకాశము నిచ్చి పశ్చిమమున నదృశ్యమై మరికొంతసేపు చీకటియుండి వెనుక మరల యుదయించి మరునా డనుదిం చును కదా? దృశ్యమంతయు నానావిధములై యగోచరముగ నున్నది. ఇట్లగోచరమై యున్న నేదో యొక ధర్మనియమమును సకలపదార్థము లనుసరించునట్లుగా బుద్ధికి దోచుచునే యున్నది. సూర్యుడు క్లుప్తకాలమున నుదయించి యస్తమించును. ఋతు తువు లొకటివెంట నొకటి ప్రతిసంవత్సరమున వచ్చి పోవుచుండును. అనేకలోక ములు తమతమ సంచారమున నొకటిమీద నొకటి పడక క్లుప్తమార్గమున సంచరించు చున్నవి. ఒక యొడారియందు నిసుకరేణువులవలె ప్రపంచము లసంఖ్యాకములుగ నున్నవి. ఇట్టి ప్రపంచములు వానియందు జరుగు విచిత్రము లెట్లు కలిగినవి? ప్రపంచ ములను సృజించి పెంచి జరుపుచుండు నియామకు డొకడు తెరలోపల నున్నాడా? మరియు మనచుట్టు జంతువులు వృక్షములు, తీగెలు, బుట్టిపెరిగి నశించునవి జూచె దము. ప్రతిమనిషియు దన జీవితకాలమున నితర జనులతో ననేకసంబంధముల వ్యవ హారములు జరుపుచుండ ననేకు లదృశ్యమగుచుందురు. మమ్ములను బోషించి ప్రేమించు వారు మనము జూచుచుండగనె మమ్ములను విడిచిపోవుచుందురు. మనతో జదివిన బాలురు సహచరులు స్నేహితులు మనతో నాటలాడి మనోహరముగ గాలము గడ పుచుండువారిని దటాలున క్రూరమృత్యు వెక్కడికో కొనిపోవును. అపుడు మనకు నపారమై వ్యసనము కలిగి మనము విహ్వలులై యుండ మనయింట నొకతమ్ముడో చెల్లెలో యగోచరముగ బుట్టును. ఇట్లు ప్రపంచనాటకమున వివిధవిలాసములతో బుట్టుట గిట్టుట మనము చూచుచున్నాముకదా? ఒక కోమలమైన శిశువు బుట్టి తన తల్లితొడపై పరుండి యెల్లరను సంతోషింపజెట్టును. వెనుక పిల్లవాడై, వీపున బుస్తక ముల సంచి దగిలించుకొని బడికిబోవ మనస్సులేక మెల్లగా నడచిపోవును. ప్రాయము వచ్చినవెనుక నొకకోమలాంగిని బెండ్లియాడి సకలసౌఖ్యముల ననుభవించుచు నొక గొప్పకుటుంబమును బోషించును. వెనుక ముసలివాడైన దన పూర్వసామర్థ్య ముడిగిన నుత్సాహ ముడుగక సౌఖ్యము లనుభవించ నింద్రియపటుత్వములను గానక దుఃఖిం చుచు దేహమునుండి ప్రాణము దర్లిపోవును. దేహము గాల్పబడును లేక మంటిలోని క్రిమికీటకములు భక్షించును. లోకమున గొందరు ధనికులు గొందరు సౌఖ్యవంతు లగుదురు. కొందరు దరిద్రులై కష్టపడుదురు. కొందరు రాజు లగుదురు. కొంద రధి

కూరులై కొందరు సేవకు లగుదురు. కొందరు గొప్పపదవుల ననుభవించుచు కొందరు గట్టెలనుగొట్టి నీళ్లు చేది జీవనము జేయుదురు కదా?

ఇట్టి భేదము లెందుకు గలిగినవి? మంచి యన నేమి? చెడ్డ యన నేమి? సజ్జను లెప్పుడు సుఖపడుదురా? దుర్మార్గు లెప్పుడు కష్టపడుదురా? ఇవన్నియు కేవల సాధారణమై చిత్రముగ గూఢముగా నున్నదికదా! మన మెంత లోకవ్యవహారమున మునిగి యున్నను మన స్నేహితులు బంధువు లెచ్చటినుండివచ్చి యెచ్చటికి వెళ్లిరి? ఈ ప్రపంచ మెట్లు కలిగినది? నే నెచ్చటినుండి వచ్చితిని? నేనెవరు? ఎచ్చట నున్నాను? ఎచ్చటికి వెళ్లెదను? ఈ సంశయములు మరలమరల మనలను బాధించుచున్నవి కదా? ఇట్టి ప్రశ్న లందరిమనస్సులకు దట్టుచున్నను సమాధానములను వెదకి సాధించువారు చాలా కొందరున్నారు. ప్రతిమనిషి తన పొట్టకు నాహారము సాధించుటయందును పుత్రకళత్రాదులకు ధనము గూర్చుటయందు నాసక్తిగలిగి కాలము పుచ్చుచుండ నేదో యొకయాపద సంభవించిన నిట్టి యోచనలు మనస్సునకు గోచరమై దాని నిదానించి విచారించెదనని ప్రయత్నము జేసినమాత్రమున దన పూర్వవాసనారూపకమైన లోక వ్యవహార మతనిని నీడ్చుకొనివెళ్లును. ఇట్లున్నాదుగా యన్న ప్రాణికోటిలో నక్కడక్కడ దివ్యస్వరూపమైన దేవుని యనుగ్రహమును సంపాదించి యీ సంశయములను నివారించుకొనిన మహానుభావులు గొందరు గలరు. వారిలో గొందరి చరిత్రలను బోధలను మరొకచోట బ్రచురించుచున్నాము. మన వేదములయందు పైకనిన ప్రశ్నలకు సమాధానము లనుగ్రహింప బడినవి. వేదమనగా జ్ఞానము. తత్త్వజ్ఞానమంను బ్రతిపాదించుటచేత వేదము లనిపిలువబడును. వేదములయందు పురుషప్రకృతి భేదములను, ద్వైతమును మనిష్యుని గురించియు, మన స్థితిగతులను సదాచార దురాచారములను, బుట్టిచచ్చువరకు మన మెట్లు నడచుకొనవలశినది, తల్లిదండ్రులెడ దారాపుత్రులెడ, సుహృదులెడ, బంధువులెడ, నితర ప్రాణికోటెడ, రాజ్యదేశములెడ, మన మెట్లు నడుచుకొనవలశినది బోధించుచున్నది. ఈ తత్త్వసిద్ధాంతముల సమూహమును దివిటీవెలుగే మతమనబడును. జ్ఞాను లనేకులు వివిధదేశములకు వారుండిన కాలమును బట్టి వివిధములుగా జనులకు నీతత్త్వములను బోధించియున్నారు. వారి బోధయే వివిధమతము లైయున్నవి. వీటియందు శాశ్వతధర్మమైన మన హిందూమత మున్నత దీపస్తంభమువంటిది. ఏఏదేశమున నుండువారికి నాయాదేశమున నుండు మతమే శ్రేష్ఠమైనది. నితర మతములు వారికి హానికరము లగుటచేత దమతమ మతములనే శ్రద్ధా

భక్తుల ననుష్ఠించిన శ్రేయస్సాధక మగును. ఇతరమతము లనుష్ఠించిన దుర్గతికి పాత్రులౌదురని,

> శ్రేయాంస్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
> స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥

గీతా వచనప్రమాణ మున్నదని తెలియుము.

## జ్ఞానసిద్ధినిరూపణ.

లోకమున ననేకమతము లున్నవని పైన జెప్పియున్నాము కదా? ప్రతిమతమును విచారించిన రెండుభాగములు, ప్రధానములని యప్రధానములని యున్నవి. ప్రతిమతమున నుండు సిద్ధాంతములు, నియమములు, క్రియలు, కర్మలు, వ్రతములు, పురాణేతిహాసములు మొదలగునవి యప్రధానములనబడును. అప్రధానమననిరుపయోగమనుట కాదు. కాని యవి యుండుటంబట్టియే యవి జీవులకు గొన్నిస్థితులయందు గావలశినట్లుగా నేర్పడుచున్నది. అయితే యాత్మజ్ఞానమునకు గావలశినపరికరము గాదని యభిప్రాయము. ఏమతనిభంధనలకు జేరక యేయాకర్మలనుశేయక యొకమనుజు డాత్మజ్ఞానిగా వచ్చును. ఏమతసిద్ధాంతమును నమ్మకున్న ధర్మనిష్ఠుడు గానుండుట సాధ్యమే. మతములముఖోద్దేశమును గనుగొనుటకు నివి యనివార్యములని యభిప్రాయపడువారు మతాధారములైన ముఖ్యనియమము లనుగ్రహించినవారు గారని చెప్పవలశియున్నది. ఆత్మప్రకాశములేక వారప్రధానములనే ప్రధానములని భ్రమించెదరు. ప్రధానములను విచారించి తెలిసి యనుదిన మాచరించు మహనీయులు భ్రమజెందక సమీపమార్గముగా సద్గతిబొందుదురు. ఆత్మజ్ఞాన మాత్మనిగ్రహ మని యిరుతెఱగులుగా బ్రధానము లున్నవి. ఆత్మజ్ఞాన మనగా మనుజుని శుద్ధాత్మయొక్క లేక దివ్యస్వభావముయొక్క జ్ఞానము. ఆత్మనిగ్రహమన మనుజుని మలినాంతఃకరణ లేక స్వప్రయోజన పరత్వ నిగ్రహము. ఆత్మ నిగ్రహసిద్ధి యైన నాత్మతత్వజ్ఞాన ముదయించును. మన పెద్దలీవిభాగమును గ్రహించియుండిరి. కావున జనులకు సాధారణముగా నుపయోగించు యప్రధానముల నుండి తమకు గావలశిన ప్రధానములను వారు వేరుగా నుంచియుండి యోగశాస్త్రమును గనిపెట్ట సామర్థ్యము గలవారైరి. యోగశాస్త్రమునందు బ్రధానములను గురించిమాత్రము జెప్పబడియున్నది. దీని ననుసరించియే మన వర్ణాశ్రమాచారము లేర్ప

డినవి. ఆత్మజ్ఞానము సంపాదించుకొనుటకు వివిధమార్గములను నాత్మనిగ్రహాభ్యాసరీతిని బోధజేయుట దాని యుద్దేశముగా నున్నది. ఆత్మ నిగ్రహము గలిగి యాత్మజ్ఞానసిద్ధి బొందినవాడు యోగి యనిపించుకొనును. గనుక యోగియప్రధానముల సాధనచేత దన శక్తిని వ్యర్థముజేయక మతముల నుద్దేశించిన యూర్ధ్వగతిని బొందును. అప్రధానములు పొట్టువంటివి. అవి లోపలి గింజ యనుతత్వమును మరుగుచేయును. అప్రధానములెక్కువైనచో మతధర్మ మనుష్ఠింపగోరు జనులీయప్రధాన మైనకర్మ లాచారములు మొదలైన సమూహము ననుష్ఠించవలయునని లోకులను నమ్మించుటకు నావశ్యకములైన మతసంప్రవర్తనలు గర్భావన లసత్యధర్మప్రతిపాదకము లెక్కువగును గనుక యోగశాస్త్రమున నీయప్రధానప్రశంస కనబడదు. ఇట్టి గురవస్థలడిగానదు. అది శుద్ధమై సులభమై యుండును. అదియాత్మజ్ఞానము వలయువారల నాదరించి తత్వజ్ఞాన సాధకమైన ప్రధానములను బోధించును. ఆత్మ నిగ్రహమన మలినాంతఃకరణనిగ్రహమని పైన జెప్పబడినది కదా? అట్లనగా జవుని యంతర్గత శుద్ధశక్తిని వృద్ధిజేసి పశుస్వభావమును నిగ్రహించుట. జీవుడు, రాయి, చెట్టు, క్రిమి, పశుజన్మములనుండి వెలువడి పెరిగి మనిషి రూపమును ధరించును గనుక మొదట పశుస్వభావమగు రాగద్వేషములను గలిగి క్రమముగా నాగుణములు పోవ నంతర్గత దివ్య స్వభావము ప్రకాశించి యుత్తమ గతులను బొందును. ఇంద్రియములకు లోబడి విషయవాసనలకుజిక్కి రాగద్వేషములచేత గర్మజేయువారికి నాత్మ నిగ్రహము దుస్తరము. ఆత్మ జ్ఞానమార్గమున నుండు నింద్రియశత్రువుల బాధల నణచి పశుప్రాయులుగాక నిగ్రహముగలిగియుండిన నవిచ్ఛిన్నమైన పరమపదశాంతిని బొందుదురు. సుఖస్థిర నిరాటంక మైనదిగాని పరతంత్రము గాదు. ఇంద్రియ పరవశులైనవారి కెట్లు సుఖమబ్బును. గనుక సుఖమునకు నాత్మనిగ్రహ మావశ్యకము.

తమహృదయములను శోధించి తమలోపములను గ్రహించి తమనడతను జక్కపెట్టుకొనువారికి నాత్మనిగ్రహము గరతలామలకముగాని యితరులకు నాకాశపుష్పము వంటిది. సుఖమును గోరుట దుఃఖమును దూరుట జంతువులవలె మానవులకు స్వభావము. అజ్ఞానదశయందుండి సుఖకారణమును దెలియజాలక, సుఖకారణము బాహ్యమైనది యంతర్గమైనది దెలియజాలక యుండువరకు దాను దాన్తైయుండడు గనుక సుఖకారణమును విచారించి గ్రహించిన నదియే యాత్మనిగ్రహమునకు సరియైనమార్గము.

(సశేషము.)

# జీవేశ్వరులు.

ఒక వృక్షముమీద రెండు పక్షులు స్నేహితులై యొకటిపండ్లను దినుచు మరి యొకటి పండ్లను దినక శాంతముగాను మౌనముగాను గూర్చున్నవి. క్రింది కొమ్మమీద దియ్యనైన చేదైనట్టిఫలములను దినుచు సుఖదుఃఖములనుభవించి యొకటి కాలము గడుపును. ఇంకొకటి గాంభీర్యముగా శాంతినివహించి యుండును. తియ్యనైన చేదైనఫలములనుదినక సుఖదుఃఖవశముగాక తనమహత్వమునమునిగి యుండును. ఇదిజీవునిలక్షణము. నరుడు తన జన్మముయొక్క సుఖదుఃఖము లనుభవించుచు బంగారమునకై యాసపడి నానాకష్టములు పడుచు నింద్రియవశుడై సకల కామాతురుడై నిరాశజెంది కాలము వ్యర్థము జేయును. ఇట్లుండ, నొకానొక సమయమున నేదైన గొప్ప యాపద సంభవించిన నప్పుడు సూర్యుని ప్రకాశమును మఱుగుపఱచు మేఘము విచ్ఛిన్నమైన నతని ప్రకాశ స్ఫురణ దెలియవచ్చునట్లు మనుష్యునకు సామాన్య ప్రాపంచిక వ్యవహారమునకు నింద్రియ వ్యాపారములకు సకల సుఖదుఃఖానుభవములకు సకల కోరికలకు మించిన పదార్థ మేదో యున్నదని మనస్సునకు స్ఫురించును. ఇట్లు మనస్సునకు దట్టిన క్షణమున నరు డాలోచించ దనలో నుండు యితర పక్షి తన మహత్వమున మునిగి సుఖదుఃఖానుభవాతీతమై తనంతను దాను తృప్తిజెంది సుఖియై యున్నట్లు కనుగొనును. ఆత్మయందు తృప్తిజెందినవారికి నితర పదార్థవాంఛ యుండదు. వారు జేయవలశిన పనియు లేదు. వారు కష్టపడవలశినది లేదని గీతావాక్య మున్నదికదా? ఇట్లు నరుడాక్షణమున దెలిసియు మరల మఱచిపోవును. మరల సుఖదుఃఖ ప్రవాహములబడి యాత్మ వైభవమును మఱచును. మరల నెప్పుడో యొకసారి క్రిందయుండు పక్షికి దెబ్బలు దగుల నితరపక్షిని సమీపించుచుండును. సుకృతవశమున హెచ్చుగు యాపదలు కలుగ గ్రిందిపక్షి యితరపక్షి సహవాసము విడువక యుండును. యీ సహవాస మెక్కువకాగా యితర పక్షియొక్క స్వభావము క్రమముగా దీనియందు జేరి కొంతకాలమునకు గ్రిందిపక్షి యదృశ్యమై పోవును. క్రిందిపక్షి యుండనే లేదు. పై పక్షియొక్క ఛాయయే క్రిందిపక్షిగా గనబడుచుండెను. ఆపైపక్షియొక్క మహత్వమిట్టిది. చక్కగా విచారించి గ్రహించుడు. లోక తుచ్ఛసుఖమున నుండువరకు మానవులు దెలివిగలిగి యఖండసుఖప్రాప్తికి యత్నించరు.

# మా పూలబుట్ట.

1. లోకమున నందరు సుఖమపేక్షింతురు. నియమింపబడిన మనస్సుగలవాడు దనకు సౌఖ్యముగా నున్నను యితరులు దుఃఖించుచుండ నిజమైన సుఖ మనుభవించ జాలడు. గనుక నితరులను సుఖింపజేయుటయే మనలను బూర్ణముగ సుఖింప జేసు కొనుట యగును. అట్టి కార్యమే సుఖమిచ్చునది.

2. కొందరికి నన్నమిడిన సుఖింతురు. రోగులకు నౌషధమిచ్చిన సుఖింతురు. కొందరికి బట్టలిచ్చిన సుఖింతురు. ఇట్లు చేయుట సామాన్యమైన క్షణికమైన సుఖ మిచ్చుట నెంతో ఫలదాయకమైన పుణ్యమందురు కదా? ప్రపంచ లక్షణమును దెలి యక యజ్ఞానాంధకారమున నుండి యనేక దుఃఖభాజకమైన సంసారమున బాధబడు వారికి జ్ఞానమను జ్యోతిజూపి శాశ్వతసుఖమును గలుగజేసిన వారి పుణ్య మింతయని చెప్పనగునా ?

3. ప్రతిప్రాణికి లోకమున జీవించుటకు ముఖ్యోద్దేశ మెద్ది? సుఖాన్వేషణము గదా? నీలోన సంతత మధురామృత ధార లొలుకుచుండ జూడక బహిఃప్రపంచ మున నింద్రియములద్వారా దానికై వ్యర్థముగ వెదకుదువు. వెలుపల వెదకుట మానుము.

4. మాయచేత ప్రతిప్రాణి తన నిజస్వరూపమును మరచియున్నాడని తెలివి బుట్ట మరల ద్వితీయపదార్థ స్ఫురణచేత మైమరవడు.

5. లోకమునకు జ్ఞాన మవివేకము. జ్ఞానమునకు లోక మవివేకము—సా మెత.

6. మనలో నుండుదానిని వెలుపల జూచెదము. మనలో దేవతలు లేనందున వెలుపల దేవతలను జూడము—ఇమర్సన్.

7. జ్ఞాన మెక్కువగాగ నెక్కువగ క్షమించెదము. ఎక్కువగ బరితపించు వారు జీవించియుండు సకలమునకు బరితపింతురు—స్టేల్.

8. మంచి జేయుటకు ధైర్యము లేకుండ యుండుట కష్టమని కాదు కాని మంచి జేయుటకు మనకు ధైర్యము లేనందువల్ల గష్టమగును—పెనిక.

9. విచారించజాలని వా డవివేకి. విచారించ నిచ్ఛయించనివాడు దురభిమాని. విచారించ ధైర్యములేనివాడు బానిస.

ఓం

శ్రీకృష్ణాయనమః.



# శ్రీ భ గ వ ద్గీ త.

## గీతామాహాత్మ్యము.

ప్రపన్న పారిజాతాయతోత్ర వేత్రైక పాణయే।
జ్ఞానముద్రాయకృష్ణాయగీతామృతదుహేనమః॥

### భూదేవివాక్యము.

స్వామీ! ప్రారబ్ధ మనుభవించు మనుష్యులకు నీయందు నవ్యభిచారభక్తి యెట్లు లభించును.

### శ్రీమహావిష్ణు వాక్యము.

ప్రారబ్ధ మనుభవించుచున్నను గీతాభ్యాసమునందు నాసక్తిగల పురుషుడు ముక్తుడై సుఖియై లోకమున దాను జేయు కర్మలచేత బద్ధుడుగాడు. గీతాధ్యానమువల్ల తామరాకును నీరంటనిభంగి మహాపాపములను జేసినవాడైనను బాపములు వాని నంటవు. గీతాపుస్తక ముండుచోట, దానిని జదువుచోట, ప్రయాగాది సర్వపుణ్య తీర్థము లుండును. అచ్చోట సమస్త దేవతలు ఋషులు యోగులు పన్నగములు గోపాల గోపికలు నారదోద్ధవులు వైకుంఠ ద్వారపాలకులు సహాయు లగుదురు. ఎచ్చట గీతాపఠనము విచారము శ్రవణ ముపదేశములు గలవో యచ్చట నేనుందును. గీత నాకు నాశ్రయము. నివాస స్థానము. గీతాజ్ఞాన మాశ్రయించినందున నేను ముల్లోకములను బాలించెదను. నిత్యమై బ్రహ్మస్వరూపమై నాశరహితమైన గీతాజ్ఞానము

నిస్సందేహముగ మోక్షవిద్య యగును. ఈ తత్త్వార్థమును జిదానంద ఘనుడైన శ్రీకృష్ణు డర్జునునకు నుపదేశించెను. ఈగీత వేదత్రయ స్వరూపముగా బరమానందదాయిగా దత్త్వ జ్ఞాన ప్రతిపాదకముగా నున్నది. అనుదిన మొకనరుడు గీతాధ్యాయము లైన పదునెని మిదియు జపించిన జ్ఞానసిద్ధి బొంది పరమపదము జేరును. అట్లు చేయుటకు శక్తిలేకున్న, నర్థము బఠించిన సందియములేక గోదానఫలము లభించును. అనుదినము నారధ్యాయి ములను బఠించిన గంగాస్నానఫలము లభించును. మూడధ్యాయములను బఠించిన సోమయాగఫలము లభించును. భక్తియుక్తుడై యొక యధ్యాయము బఠించిన రుద్రలోకమున బ్రమథగణములను జేరి చిరకాలము వసించును. ఒక యధ్యాయమున నాల్గవ భాగమును నరుడు నిత్యము బఠించిన నీలోకమున నొక మన్వంతరము జీవించియుం డును. పదియేడైను నాలుగు మూడు రెండొకటి యైనను లేక యర్థశ్లోకమైనను బఠించిన జంద్రలోకమును బొంది పదివేల వత్సరము లందు వసించును. గీతాపాఠ యుక్తుడై మృతిజెందిన పురుషుడు దేవత్వము బొందును. గీతాభ్యాసము మాటిమాటికి జేసిన నుత్తమమైన మోక్షమును బొందును. అంత్యకాలమున గీతాస్మరణ జేసిన నుత్తమ గతిని బొందును. గీతార్థశ్రవణాసక్తి గలపురుషుడు మహాపాపి యైనను వైకుంఠమున శ్రీ మహావిష్ణువుతో నానందించును. నిత్యనైమిత్తిక కర్మలను జేయుచు గీతార్థమును ధ్యానము జేయునతడు జీవన్ముక్తుడై దేహాంతమున పరమపదవిని బొందును. జనకాదులు గీతాజ్ఞానము నాశ్రయించి నిర్ధూతకల్మషులై పరమపదవిని బొందిరి. గీతాశాస్త్రము పఠించి యీమహాత్మ్యమును బఠింపకున్న శాస్త్రోక్తమైన ఫలము లేక వృథాశ్రమ యగును. ఈ మహాత్మ్యముతో గీతాభ్యాసము జేసిన దత్ఫలము బొందుటగాక యుత్తమగతిని గూడ బొందెదరు.

## సూతులవాక్యము.

నేను పూర్వమున జెప్పిన యీగీతామాహాత్మ్యము నీగీతా పఠనాంతమున బఠించిన నరుడాఫలమును బొందును. ఇట్లు వరాహపురాణోక్తమైన గీతామాహాత్మ్యము సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.

Continued in page 41

# మా భ క్త వి జ య ము.

## శ్రీరామకృష్ణ పరమహంస చరిత్రము.

ఉత్తరదేశమున జహనాబాదుకు 4 మైళ్లు పశ్చిమముగాను బరద్వానుకు 32 మైళ్లు దక్షిణముగా నుండు హుగ్లీ జిల్లాకు జేరిన కామార్పుకరను గ్రామ మున్నది. ఆగ్రామమున నెక్కువగ కర్మకారులు లేక కమ్మరు లధికముగ నుండుటచేత నా పేరు కలిగెను. అచ్చట గొందరు శిల్పకారులును గొల్లలు కాపులు గాణిగవారు గూడ నుండిరి. బ్రాహ్మణయిల్లొక్కటిమాత్ర ముండెను. ఆయింటి యజమానుడు కుదిరంచట్టోపాధ్యాయుడు. ఇతడు నిరుపేద యయ్యును కేవల ధర్మాచరణము దప్పి జీవించుటకంటె నుపవాస ముండుట యోగ్యమని తలంచి యుండెను. ఇతడు పరమ దైవభక్తుడు. సాత్వికుడు, సుందరవిగ్రహుడు, నిష్కపటుడు. పరతంత్రుడు గాని వాడై యుండెను. ఇతడు శుభాశుభములను, జెప్పినమేరకు జరుగుచుండెను. గనుక వాక్సిద్ధి గలిగియుండెను. అతడు మార్గమున బోవుచున్న సమయమున ద్రోవనుండు వారు లేచి నిలుచుచుండిరి. అతని సముఖమున నీచగోష్ఠినికూడ మాని యతనికి గ్రామమున జాలుగ మర్యాద జేయుచుండిరి.

తన పితురార్జిత సొత్తుండు దేరియను గ్రామమున నుండ దన స్వతంత్రగుణమును నతడు చూపెను. ఆగ్రామపు జమీందారు డతని నొక వ్యాజ్యమున దనకురము నాసాక్ష్యము జెప్పవలెనని కోరెను. అట్లు చెప్పకున్న నతని యాస్తి జప్తిజేయించి గ్రామమునుండి తరుముదునని కూడ నతనిని బెదిరించెను. కుదిరం అతనిని దిరస్కరించి గ్రామము విడిచి దేరి గ్రామమునకు రెండుమైళ్లు తూర్పున నుండు కామార్పురి జేరెను. జనులారా! యీకాలమున పల్లెటూరులనుండు బ్రాహ్మణు లెందరు బలవంతమైన రెడ్లను విడనాడి యిట్లు ధర్మమార్గమున బ్రవర్తించ యత్నించెదరు?

అచ్చట గొందరు స్నేహితుల సహాయముతో బీదజీకముగా గాలము బుచ్చుచుండెను. ఐన నందరిని బరామరిక జేయుచు బీదసాదలెడ మిక్కిలి యుదారస్వభావముతో నడచుకొనుచుండెను. సదా సాధుసంగము జేయుచు వివిధపూజలు సలుపుచు నాత్మసాక్షాత్కారము జేసుకొన ననేక ప్రయత్నములను జేయుచుండెను.

ఒకనాడిఇతడు 12 మైళ్లదూరమున నుండు యొక గ్రామమున దన కుమార్తెను

జూడ బ్రయాణమై పోవుచు దోవలో నొక బిల్వవృక్షమును జూచి కోమల దళములు చిగిరించి యుండ నతిసంతోషముతో నాచెట్టు నెక్కి యదివరకు నీశ్వరునకు బిల్వదళము లర్పించి చాలకాల మైనందున శివార్పణమునకై చాలినంత బిల్వపత్రమును గోసికొని ముందుపోను కాళ్లాడక తనగృహమునకు వెనుకకు దిరిగెను. నిజభక్తు లిట్లు దేవుని నితరవస్తువులకంటె నెక్కువగ బ్రేమించుచుందురు. ఇదియే నిజభక్తిలక్షణము.

ఇతడు. కేవల రామభక్తుడు ప్రతిసంవత్సరమున నతిడు దన చిన్నమడిలో నొండట రఘువీరుని పేరుజెప్పి కొన్ని గింజలు చల్లినవెనుక నతని రైతును దక్కిన ప్రదేశమున విత్తనము వేయ నాజ్ఞాపించును. ఆస్వల్పప్రదేశమున నతని కుటుంబమునకు జాలినంత ధాన్యము పండుచుండెనని యనుకొందురు. శ్రీరాముని నమ్మియుండెను గాని రేపేమి గతియని యొకనాడైన జింతజేసినవాడు కాడు.

అతని యిల్లాలు చంద్రమణిదేవి కూడ స్వాభావికముగానే నిష్కాపట్యమునకు దయాళుత్వమునకు దృష్టాంతముగ నుండెను. ఆమె కుమారుని ధనవంతుడగు శిష్యుడైన మధురనాథుడనువా డొకనాడు కొన్నివేల రూపాయల నామెకు నివ్వబోవ నామె యతనికి నాశ్చర్యమగు నట్లతని ప్రార్థనను నిరాకరించెను.

ఈ దంపతు లొకనాడు గయాయాత్రకు వెళ్లిన సమయమున విష్ణువు కుడిరామునకు బ్రత్యక్షమై తా నాతనికి గుమారుడై పుట్టునని వరమిచ్చినట్లు కలగనెను. కొంతకాలమునకు సంపన్నులైన యీదంపతులకు 1833 సంవత్సరమున ఫిబ్రవరి 20-వ దినమున రామకృష్ణు డుదయించెను. పూర్వము కల ననుసరించి విష్ణువునకు బర్యాయనామమైన గదాధరుడని బాలునకు నామకరణం బొనరించిరి.

దైవసంకల్పమే కాని యతని దర్శన మందరికి సంతోషమును గలిగించుచు దమబంధు మిత్రులకంటె నెక్కువ సుహృదత్వమును గలుగ జేయుచుండెను. ఆబాలుడు మతప్రయుక్తమైన దైవకీర్తనలను నాటకములను రాగయుక్తముగ నర్తనముతో నొక్కసారి విన్నమాత్రమున బూర్ణముగ గధనము జేయుచుండెను. అతని శారీరము మనోహర మైనది. రాగజ్ఞానము గూడ గలిగియుండెను. దేవుని విగ్రహములను బరీక్షించి గుణావగుణములను బెద్దలవలె నిశ్చయముతో విమర్శించు చుండెను. దేవతల పటములను వ్రాయుచుండెను. ప్రతిమలను జేయుచుండెను. కలకత్తా నగరమునకు నాలుగుమైళ్లుత్తరముగానుండు దక్షిణేశ్వరాలయమునందతడిటీవల జక్కజేసిన శ్రీకృష్ణ విగ్రహము నిప్పుడు జూడవచ్చును.

ఓం.

పరబ్రహ్మణేనమః.

# శ్రీరామకృష్ణ పరమహంసుల వచనములు.

## దైవస్వరూపము.

1. నూనె లేక దీపము వెలుగనిభంగి దేవుడు లేక ప్రాణి బ్రతుకజాలదు.

2. రాత్రియం దనేక నక్షత్రముల నాకాశమునందు జూచెదవు. సూర్యు డుదయించిన జూడవు. నక్షత్రములు పగటిపూట నాకాశంబున నుండవని చెప్పగలవా? అట్లు నీ యవివేకదశయందు దేవుని జూడకుండిన దేవుడు లేడని చెప్పకుము.

3. నీటిని నుదకము, పాణి, నీర్, తణ్ణీ యని వివిధ నామముల జేర్కొను భంగి కేవల సచ్చిదానంద స్వరూపమైన దేవుని నల్లాయని, హరియని, బ్రహ్మయని వాడుదురు.

4. ఒక తాటిచెట్టుమీద నుండిన తొండవర్ణ మొకడెఱుపనియు మరియొకడు నలుపనియు వేరొకడు నీలమనియు వాదులాడి సమాధానమునకై యాచెట్టుక్రింద సదా నివసించు ముసలివాని నడుగ దాని వర్ణము క్షణక్షణమునకు మారునని తెలిసి యుండినందున నందరి యభిప్రాయము సరియని యొప్పుకొనెను. ఇట్లు సచ్చిదానంద స్వరూప మనేకరూపములుగా నున్నది. సకలరూపములను గనుగొన్న మహాత్ములే యా నిజస్వరూప లక్షణ మెఱుగుదురు.

5. దేవుని నామము లనేకములు, రూపము లనంతములు. ఏనామరూపమును బట్టి భజించిన నానామరూపముల దేవుని గందువు.

6. ఏనుగను జూడ నలుగురు గ్రుడ్డివారు వెళ్లిరి. ఒకడు కాలుతడవి యేనుగు స్తంభాకారమై యున్నదనెను. ఒకడు తొండము తడవి రోకలివంటి దనెను. ఒకడు కడుపు తడవి గొప్ప కుండవంటి దదెను. నాల్గవవాడు చెవులుతడవి చేటవంటి దనెను. ఇట్లు దాని యాకార మూహింపజాలక వాదులాడుచుండ నొకతెరువరి మీ రెందులకు వాదులాడెదరని ప్రశ్నజేయ జరిగినదంతయు వారుచెప్పిరి. మీరెవ

రేనుగును గ్రహించలేను. ఏనుగు స్తంభమువంటిది కాదు. దాని కాళ్లు స్తంభము వలె నున్నవి. అది యొకకుండ కాదు. దాని కడుపు కుండవలె గుండ్రముగా నున్నది. అది చేటకాదు, దాని చెవులు చేటలవలె నున్నవి. అది రోకలికాదు. దాని తొండము రోకలివలె నిడువుగ లావుగ గుండ్రముగ నున్నది. ఇట్టి యంగములు కలది యేనుగు. అని యా తెరువరి వారిని సమాధానపరచెను. అట్లు దేవుని స్వరూపము పూర్ణముగ దెలియనివారు వాదించుదురు.

7. చక్కెర ననేక మృగపక్షిరూపములుగ జేయువిధమున ప్రకృతిస్వరూప మనేక నామరూపములచేత బూజింపబడుచున్నది. వివిధమతములు సర్వేశ్వరుని గనుటకు నేర్పడిన వివిధమార్గములు.

8. ఒక బంగారముతో ననేక నామరూపములు గల సొమ్ములను జేయువిధమున నానాదేశకాలములయందు ననేక నామరూపములతో దేవుడు పూజింపబడుచున్నాడు. ఇట్లనేకవిధములుగా బూజింపబడినను గొందరు దేవుని దల్లియందురు. కొందరు తండ్రియందురు. వివిధ సంబంధరూపముల చేత బూజింపబడు దేవుడొక్కడే.

9. ప్రతి మతముయొక్క దేవు డొక్కడైన పక్షమున దేవుని నెందుకు ననేకవిధములుగా వివిధమతస్థులు వర్ణింతురు? దేవుడొక్కడే. అయితే యతని యంశ లనేకములు. ఒక యింటిలో యజమాను డొకరికి దండ్రియని యొకనికి నన్నయని, యొకతెకు మగడని యనేకసంబంధములనుబట్టి పిలువబడు రీతిగా నెక్కొక్క భక్తునకు దేవుడు తన రూపమును ననుగ్రహించు దశనుబట్టి దేవుని నట్లు వర్ణించెదరు.

10 ఒక కుమ్మరిశాలయందు ననేక రూపము లాకారములు కల పాత్రలున్నవి. అవి యొక మంటితో జేయబడినవి. అట్లు దేవుడొక్కడు వివిధ దేశకాలములయందు ననేక నామరూపములుగా బూజింపబడుచున్నాడు.

11. దేవుడొక్కడే. అతని రూపములు మెండు. ఒక చేప పక్వము ననుసరించి వివిధరుచు లిచ్చునట్లు దైవస్వరూపము ననేకవిధంబులుగా భక్తులు భజించి యానందింతురు.

12. మానవుడొక తలదిండువంటివాడు. ఒకటియెఱ్ఱనై యొకటినల్లనైయున్నను నన్నియు దూదిచేతనిండియున్నట్లు సుందరుడొకడు. కురూపియొకడు, ఋషియొకడు, దొంగయొకడైనను వారందరియందు దైవస్వరూపము నెలకొని యున్నది.

సశేషము.

# సంకల్పశక్తి.

## దానినిగ్రహము-సాధన.

### ముందుమాట.

విద్యార్థి తన స్వభావమును బుద్ధికి సంబంధించినంతమట్టునకు జక్కగా విచారము జేయ సహాయభూత మగుటకు నీ చిన్నిపొత్తము ముద్దేశింపబడినది. ఇచ్చట నగు పఱచిన నియమములను సాధనజేసి గ్రహించిన దన జ్ఞానసాధనయందు దైవాజ్ఞ ననుసరించుటయ కాక, తనవృద్ధికి గావలసిన నిబంధనలను దెలియనప్పుడు సాధ్యమగుట కంటె నెక్కువ శీఘ్రముగ మనోదార్ఢ్యమును వృద్ధిజేసుకొన నగును.

ఇందలి యుపోద్ఘాతము లౌకిక చదువరికి గ్రాహ్య మగుటకు బ్రయాసకరముగా నుండవచ్చును. ప్రథమ పఠనమున దానిని దాటిపోవవచ్చును. ఐనను తన బుద్ధికిని నితరభావములకును బహిః ప్రపంచము నకును గలసంబంధమును విచారించువారికి నది బునాదిగానుండుటచేత నావశ్యకము. తన్ను దాను దెలియవలె నను లోకోక్తిని సాధించువారు కొంచము మనోప్రయాసకు సంకోచించకూడదు. సోమరితనముతో దెరచిన నోటిలోనికి మనోభోజనము సిద్ధమై యాకసమునుండి పడునని కూడ నిరీక్షించ గూడదు.

ఈ చిన్నిపొత్తము శ్రద్ధావంతులైన విద్యార్థులలో గొందరికి మాత్రము సహాయభూతమై కొన్ని సంశయములను నివారించినను దీని యుద్దేశము సఫలమైన దని యెంచబడును.

---

1. పూర్వజన్మములయందలి సంకల్పముల ననుసరించి మన ప్రకృత స్థితి గలిగినది. దీనికి సంకల్పమే యాధారము. ఇది సంకల్పాత్మకమే—ధమ్మపదం.

2. ఒకనరుడు నిజమనుకొనిన, నబద్ధము వాని మనస్సును బ్రవేశించదు. స్నేహమును దలంచిన విరోధము జేరదు. జ్ఞానమపేక్షించిన నజ్ఞానము మోహింపజేయదు—అనిబిసాంట్.

3. దేవుడు సకల రహస్యమునకు సకల జ్ఞానమునకు నతీతుడు. వాడంతరాంతరుడు. అతీతాతీతుడు. ఘనమునకు ఘనమైనవాడు. అణువునకు పరమాణువైన వాడు.

4. కవికి, జ్ఞానికి, తత్వవేత్తకు, సకలపదార్థము లనుకూలమైనవి, పావనములు, సకల కార్యములు లాభకరములు, అన్ని దినములు పవిత్రములు. సకల జనులు దివ్యమైనవారు—ఇమర్సన్.

## ఉపోద్ఘాతము.

నడవడిని బరిశుద్ధముజేసి గౌరవపరచునట్టి సామర్థ్యము ననుసరించి జ్ఞానముయొక్క యుపయోగము మదింపు జేయబడును. అక్కరగల విద్యార్థులందరు బ్రహ్మవిద్యా విచారణవల్ల లభించిన యవ్యవహార యోగ్యమైన జ్ఞానమును తమ స్వకీయమైన నడతయొక్క వృద్ధికిని తమ సహచరుల సహాయమునకు నుపయోగింప నిచ్ఛయించుదురు. తమ స్వకీయ బుద్ధిస్వభావమును నెక్కువగా దెలిసిన దానిలోని సుగుణములను నుద్దేశపూర్వకముగా వ్యవసాయము జేయుటకు నెడమిచ్చుటగాక దుర్గుణములను నిర్మూలము జేయునను కోరికతోనీ చిన్నిపొత్త మట్టి విద్యార్థుల కొరకు వ్రాయబడినది. బుద్ధియొక్క నిర్మలజ్యోతి నడవడియొక్క మార్గమును వెలిగించకున్న ధర్మమైన జీవనము జేయ బ్రేరేపించు మనోభావము సగము వ్యర్థమగును. ఏలన, నొకగ్రుడ్డివాడు దెలియక యొక కందకమున బడువరకు త్రోవదప్పి నడచునట్లు జీవుడజ్ఞానవశమున వివేకశూన్యుడై పాపకర్మ యను గుంతలో బడువరకు ధర్మమైన జీవనమార్గమునుండి తప్పినడచును. అవిద్య--జ్ఞానరహితత్వము—నిజముగా నేకత్వమునుంచి భిన్నత్వమునకు మొదటిమెట్టుగా నున్నది. అది క్షీణించ భిన్నభావ ముడుగును. అది యదృశ్యమైన శాశ్వతశాంతి మరల సిద్ధమగును.

---

## విచారణీయములగు సత్సంకల్పములు.

1. భగవద్భక్తిపరుల సహవాసము ముముక్షువుల యభ్యాసమునకు బ్రోత్సాహకరమైనది.

2. అందరి హృదయములందు సమముగ దేవుడున్నాడు.

3. సుఖమును వెదకుచుండు ప్రతిప్రాణియు దేవునినే వెదకుచున్నది.

4. అందరాంతర్యమైన ప్రాణమును యథార్థముగ వెలుపలి రూపమున వెదకుచున్నారు.

5. దుర్మార్గుల దుష్కార్యములయందు గూడ దేవుడున్నాడు.

6. కామము లేని హృదయముగలవా డందరియందుండు పరమాత్మను దనయందే యంతర్గతమై యుండునట్లు తెలియును.

7. కామ్యవస్తువులనుంచి కేవల బాహ్యవిముఖమువల్ల గామము నశించదు.

(సశేషము.)

శ్రీరస్తు.

# ధర్మశాస్త్రములు.

## పీఠిక.

ప్రపంచ సుఖప్రవర్తనకు ధర్మమాధారము. ఈకాలస్థితినిబట్టి విచారించిన, మన ధర్మముల నెంత మన మాదరింపుచున్నది యందరికి దెలిసినవిషయమేకదా! ఈ యనాదరణ ధర్మశాస్త్రజ్ఞాన రాహిత్యమునుబట్టి కలిగినది గాని వేరు కారణ మగుపడదు. అట్టిలోపమునకు ననేక కారణములున్నవి. వాని నిచ్చట జర్చింప ననవసరంబు. మన శ్రేయస్సు ధర్మాచరణము ననుసరించి యున్నదనుమాట స్వభావసిద్ధము గదా! కావున నాలోపమును మాన్ప గలకత్తాలోనుండు మన్మథనాథ దత్తగారు మన ధర్మశాస్త్రములను హూణభాషయందు నిప్పుడు తద్విద్యాపరిచయముగల మనకు సులభముగా గ్రాహ్యమగునట్లు ప్రచురించుచున్నారు. హూణభాషాప్రవీణు లీదేశమున కెక్కుడున్నను నావిద్య సామాన్య జనులకు దుర్లభముగానే యున్నది. సంస్కృతమున నుండు మన ధర్మశాస్త్రములను జదువ ననుకూలములు మనకు జాలకయున్నవి. కావున నందరికి సులభగ్రాహ్యమై యాచరణకు నుపయోగపడి మన పూర్వోన్నతస్థితిని బొంద నర్హు లగుటకు ధర్మశాస్త్రములను దేటతెనుగున నిందు వ్రాయబూని యున్నాము. జనులారా! మన ప్రకృతదరిద్ర దౌర్భాగ్యస్థితిని మనస్సునకు దెచ్చుకొనియది యధర్మాచరణ జన్యమైనదని దృఢముగా నమ్మి ప్రచురించబోవు ధర్మశాస్త్రములను శ్రద్ధగా గ్రహించి యుక్తాయుక్తములను యోచించి వర్తించినగాని మన యాపద లెన్నటికి దొలగవని తెలియుము. కావున సర్వాంతర్యామియైన పరమేశ్వరుని ధర్మాచరణ ప్రవర్తకు లగుటకు మిమ్ము ప్రేరేపించుగాతమని యన్నివిధముల బ్రార్థించుచున్నాము.

## ఉపోద్ఘాతము.

ధర్మాచరణమునకు గావలసిన విషయము లన్నియు శ్రుతిస్మృతియని ద్విరూపముగా నేర్పడియున్నవి. శ్రుతియనగా వినబడినది. మన చతుర్వేదములను శ్రుతి యనెదరు. మన వేదములు కొంతకాలము ముందువరకు లిఖితమై యుండలేదు. గురువు

శిష్యునకు స్వరయుక్తముగ దన ముఖద్వారమున నిచ్చుచుండెనుగాని పుస్తకములద్వారా నేర్పుచుండలేదు. స్మృతియన్ననో స్వాయంభువుడైన బ్రహ్మమనువునకునుపదేశించెను. ఆజ్ఞానము నతడు పదుగురు ఋషులకు నుపదేశించెను. స్మృతి యాచార వ్యవహార ప్రాయశ్చిత్త కాండములని త్రిభాగములుగా నున్నది. ఈస్మృతియే మనధర్మశాస్త్రము. ఈ ధర్మశాస్త్రము నిరువది మహాఋషులు సెప్పియున్నారు. వారి ధర్మశాస్త్రములకు ననేకులు టీకలు వ్యాఖ్యానములు వ్రాసియున్నారు. వానిని యనుసరించి యీ ధర్మశాస్త్రము లిప్పుడు సర్వజనోపయోగముగ వ్రాయబడుచున్నవి. ఈ స్మృతులన్నిటిలో మను స్మృతి సంపూర్ణమైనది దానియందు నన్ని విషయములకు సంబంధించిన ధర్మములు సెప్పబడి యున్నవి. ఇది కృతయుగమునకు సరియైనది. కలియుగమున ననుష్ఠించదగిన పరాశరస్మృతిని మొదట నిరూపించుచున్నాము.

## పరాశరస్మృతి.

ఒకానొక కాలమున హిమవత్పర్వత శిఖరమున దేవదారు వనమున సమాధియందు సుఖాసనాసీనుడై యున్న వ్యాసమహర్షిని గూర్చి కొందరు ఋషులిటు ప్రశ్నజేసిరి. ఈ కలియుగమున జనులచేత సులభముగా ఫలకారిగా ననుష్ఠించదగిన సదాచారప్రవర్తన, పరిశుద్ధత, ధర్మాచారముల ననుసరించిన నియమములను, సత్యవతికుమారుడా! మాకు దయజేసి చెప్పవా! యని యడుగ, సూర్యునివలెను ప్రజ్వలించు యగ్నివలె ప్రకాశించుచు శ్రుతిస్మృతులపారము దెలిసిన యామహర్షి, ఋషులారా! నేను సర్వజ్ఞుడను కాను. ధర్మనియమములను నేనెట్లు మీకు బోధించుదును. ఈ విషయమున మాతండ్రిగారిని యడుగవలె ననెను: వెనుక నాఋషులు వ్యాసపురస్సరంబుగా బదరికాశ్రమమునకు ధర్మనియమములను నేర్చుకొన నతికుతూహలులై వెళ్లిరి. విచిత్రమైన ఫలపుష్పపత్ర భరితమైన వృక్షములతో నిండిన యాయాశ్రమము మనోహరంబుగ నుండెను. ఊటలు, సెలయేళ్లు, నిర్మలజలమును గలిగి పారుచుండెను. లేడిమందలు నిర్భయముగ విహరించుచుండెను. సుందరమైన యీకలుగల పక్షులు శ్రావ్యముగ బాడుచుండెను. అచ్చట ననేక దేవాలయము లుండెను. ఆవనమున యక్షసిద్ధ గంధర్వులాటపాటల నానందించుచుండిరి. ఆవనమధ్యమున సకల దివ్యమునులచేత పరివేష్టితుండై సుఖాసనుడైన శక్తికుమారుడైన పరాశరమహర్షిని వ్యాసమహర్షి దర్శించి తనవెంటనుండిన మునులతో గూడ ప్రదక్షిణ నమస్కారము

గావించి వతనిని స్తోత్రములతో బ్రసన్నునిగాజేసెను. అప్పుడు పరాశరుడు వారి కుశల మడిగి తన యాశ్రమమునకు వారు వచ్చినందుకు చాలా సన్మానించెను. ఆ ఋషులకై వ్యాసమహర్షి వారి క్షేమలాభములను దండ్రికి దెలిపి యిట్లని పలికెను. భక్తవత్సలు డైన తండ్రీ, నీవు నా భక్తి మెచ్చినను లేక నామీద నుండు ప్రేమకైనను ధర్మాచరణము సదాచారములను గురించి దయజేసి బోధజేయుము. మనువు, వసిష్ఠుడు, కాశ్యపుడు, గార్గుడు, గౌతముడు, ఉశనసుడు, అత్రి, విష్ణువు, సంవర్తుడు, దక్షుడు, ఆంగీరసుడు, శాతాతపుడు, హారితుడు, యాజ్ఞవల్క్యుడు, కాత్యాయనుడు, ప్రచేతుడు, ఆపస్తంభుడు, శంఖుడు, లిఖితుడు మొదలగు మహనీయులు సేసిన ధర్మశాస్త్రముల నిదివరకు దమ యనుగ్రహముచేనే వినియున్నాడను. అవి నాకు కంఠస్థము లైయున్నవి. జరుగుచుండు యేడవ మన్వంతరమున కృత, త్రేత, ద్వాపర యుగములమాత్ర మీధర్మశాస్త్రములు బ్రయోజనకారిగా నున్నవి. (మన్వంతరమన 3,20,000 వత్సరములు. ఇది బ్రహ్మ దినమున పదునాల్గవ భాగము). సత్యయుగమునకు నేర్పరిచియుండు ధర్మనియమములు కలియుగమున మానిపోయినవి గనుక నీకలియుగమున నాలుగు వర్ణములవా రనుసరించ దగినధర్మనియమములను సామాన్యమైన సదాచార ధర్మములనుగూడ నాకునుపదేశింపుము. ఇట్లువ్యాసమహర్షి ప్రశ్నజేయ మహర్షియైన పరాశరులు దృష్టాంతపూర్వకముగా ధర్మనియమములను బోధించ నారంభించిరి. ప్రతి కల్పాంతమునను ప్రతి జగత్సృష్టి ప్రారంభమునను జరుగబోవు ప్రతియుగమునకు గావలసిన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు శ్రుతులు, స్మృతులు, సద్ధర్మనియమము లేర్పడును. వేదములకు గర్త లేడు జగత్పితృవైన బ్రహ్మ ప్రతిజగత్సృష్టిశయాంతమున వేదములను స్మరించును. ఆస్మరణమాత్రమే ముందువచ్చు యుగమున వేదములుగా బ్రసరించును. అలాగుననే మనువులుకూడ బ్రతిమన్వంతర ప్రారంభమున సదాచారధర్మనియమములనే స్మరించుచుందురు.

ధర్మనిష్ఠాపరత్వ నియమములాయా యుగముల యక్కరల ననుసరించి చతుర్యుగములయందు భేదములుగానున్నవి. కృతయుగమున బ్రాయశ్చిత్త పూర్వకమైన తపోనుష్ఠానము ధర్మము. త్రేతాయుగమున నాత్మజ్ఞానము ధర్మము. ద్వాపరమున యజ్ఞకర్మ ధర్మము. కలియుగమున దానము ధర్మము. కృతయుగమున మనుస్మృతి ప్రమాణము. త్రేతాయుగమున గౌతమ స్మృతియు, ద్వాపరమున శంఖలిఖిత స్మృతులును, కలియుగమున బరాశర స్మృతియు బ్రమాణములు.

సత్యయుగమున నొకపాపి సహవాసము త్యజించ నొకడు దేశము విడువ.

వలయును. త్రేతాయుగమున వాడు గాపురముండు గ్రామమును, ద్వాపరమున వాడు చేరిన కుటుంబమును, కలియుగమున నా పాపినే విడువవలయును. సత్యయుగమున పాపితో సంభాషణము, త్రేతాయుగమున వాని దర్శన మాత్రమును, ద్వాపరమున వాడు వండిన యన్నము దినుటయు పాప హేతువులు. కలియుగమున దానుజేయు కార్యమే దన్ను హీనస్థితికి దెచ్చును.

కృతయుగమున శాపమిడిన దినమే ఫలించును. త్రేతాయుగమున బదిరోజులలోగా ఫలించును. ద్వాపరమున నొక మాసమునను, కలియుగమున నొక సంవత్సరమునను ఫలించును. సత్యయుగమున దాతలు గ్రహీతలను వెదకి దానము సేయుచుండిరి. త్రేతాయుగమున దాతలు గ్రహీతల నింటికి పిలిచి బహుమానముల నిచ్చి పంపుచుండిరి. ద్వాపరమున యాచకులకు దానము లిచ్చుచుండిరి. కలియుగమున సేవకు బదులుగా బహుమతు లిచ్చెదరు. యాచకుని యింటికివెళ్లి బహుమానము లిచ్చుట శ్రేష్ఠము. దాతయింటికి పిలిచి యిచ్చుట మధ్యమమైనది. యాచించిన నిచ్చుట యధమమైనది. పనిజేయించి బహుమానము యిచ్చుట బహుమానము యనిపించుకొనక గణ్యముగానే గాదు. సత్యయుగమున ప్రాణ మెముకల నంశ్రితమైయుండును, త్రేతాయుగమున మాంసమునను, ద్వాపరమున రక్తమునను, కలియుగమున నన్నమున నుండును. శ్రద్ధ యశ్రద్ధచే సత్య మసత్యముచే రాజులు సేవకులచే బుద్ధిమంతులు స్త్రీలచే కలియుగమున జయింపబడుట సిద్ధము.

కలియుగమున నగ్నిహోత్రక్రియలు నశించును. పూర్వికులయొక్కయు గురువులయొక్క సేవ నశించును. తల్లులు సాధారణముగ నాడుబిడ్డలనే ప్రసవింతురు. వివిధములయిన యుగములనుండు నీ నియమములను నాయా యుగముల బుట్టిన బ్రాహ్మణులను దూషించకూడదు. ఏలన వారియందు యుగస్వరూప మవతరించి యున్నది. ప్రతియుగమున పాపియొక్క యోగ్యతానుసారముగ మునులు ప్రాయశ్చిత్తక్రియలను నియమించియున్నారు. అయితే కలియుగమున బరాశరులు నియమించినవి యనుష్ఠింపవలెను.

మునిశ్రేష్ఠులారా! కలియుగమున జతుర్వర్ణముల చేత ననుష్ఠింపదగిన ధర్మక్రియలను సదాచారములను నాకు జ్ఞాపకమున్నంతవరకు నేడు చెప్పుచున్నాను.

పరాశరుని నియమములు పావనములు, దివ్యములు, పాపచ్ఛేదకములు. బ్రాహ్మణుల క్షేమమునకై ధర్మస్థాపనమునకై ప్రతిపాదింపబడినవి. సదాచారము సకలవర్ణములవారికి నిజమైన ధర్మరక్షకమైనది. అది లేనట్టి మానవుడు సన్మార్గదూరుడగును.

సశేషము.

# మహాపురాణము.



1. ఒక లాంతరులోని దీపము ప్రకాశించుచుండ దానిచుట్టు నున్న పదార్థముల ప్రకాశము లాంతరుకునుండు యద్దముల వర్ణము ననుసరించి యుండును. అనగా యద్దముల వర్ణభేదముల ననుసరించి పదార్థవర్ణములు భేదించును. అట్లనే మనమొక యాకుపచ్చని పదార్థమును నెఱ్ఱనియద్దముగుండా చూచిన నది నల్లదిగా నుండును. పసుపద్దముతో నీలపదార్థము జూచిన నది నల్లదిగా గనబడును. అట్లనే మన దృష్టిని బట్టి యీ లోకమున నుండు పదార్థములస్ఫురణ మన మనోవైకల్యములననుసరించి యగుచుండును. ఎట్లన నొకనికి మనోహరమైనది మరొకనికి విషముగా నుండును. గనుక పదార్థముల నిజస్వరూపము కలుగుటకు మనశ్శుద్ధి కావలెను.

2. చక్కెరతో జేసిన బొమ్మ చిలుక కోడి యనుపించుకొనును. వానిపదార్థమగు చక్కెరను దీసికొనిన జిలుక మొదలగు భేదములు కానరావు. అట్లు నామరూపాత్మకమైన మాయాజగత్తు యొక్క పదార్థము ననుసరించి యున్నదిగని దానికి భిన్నమైన స్థితి కానరాదు.

3. ఒక నరబవాని గొఱ్ఱెలమందలో నొక పులిపిల్ల మేకలగుక్కల సహవాసమున పెరుగుచుండెను. గొఱ్ఱెలవలె సాధువుగానుండి పెద్దదియాయెను. ఒకనా డొక పులి యామందను సమీపించి యామందలోనున్న తనబోటి పులినిగని తాను గొఱ్ఱెలను సంహరించ యత్నించిన నది తన్ను బాధించునని తలచి దానితో స్నేహము జేయ యత్నించి దానిని మందబైటికి రమ్మనిపిలిచి నీవెందుకు గొఱ్ఱెలవలె సాధువుగా నున్నావు వాని నెందుకు జంపవని యడిగెను. అది తానొకపులియని యెఱుగక గొఱ్ఱెగాక వేఱుజాతికి జేరినదనియు తెలియజాలననెను. అప్పుడాపులి దానిని నదియొద్దకు దీసికొనివెళ్లి నీటియందు దాని స్వరూపమును తన స్వరూపముతో బోల్చిచూపెను. అప్పటి నుంచి యది తననిజస్వరూప మెఱిగి వర్తించెను. ఇట్లు ప్రతిజీవుడును నిజతత్వజ్ఞానసాధనకై యొకగురు వావశ్యకము. జీవాత్మ పరమాత్మైక్యభావము ననుభవవేద్యము జేయదగిన యోగ్యతగలవాడుగా నుండవలెను. జీవులందరు పరమాత్మ చైతన్యరూపులై యుండినను తత్వరహస్యబోధలేక తమ నిజస్వరూపము గనుగొనుట దుర్లభము.

# హంస.

ఈసమాజమునకు సంబంధించిన విషయము నిందు దేశ తెనుగున నీదేశస్థుల యుపయోగార్థమై గౌతమాశ్రమమునుండి ప్రతిమాసమున వెలువడుచున్నది. చందా సంవత్సరమునకు 1 రూపాయమాత్రమే. పోషకులకు 5 రూపాయలు.

# హంసావళి.

1. షట్త్రింశన్మంజరి—శ్రీశంకరాచార్యులు రచించిన భజగోవింద శ్లోకముల నాంధ్రభాషాణ పద్యాత్మకముగా రచింపబడినది. వెల 2 అణాలు.

2. ఏకాదిరత్నావళి—1 మొదలు 224 సంఖ్యవరకుగల విషయ విశేషము లిందు సంగ్రహింపబడినవి. (అయనద్వయము, వాసనాత్రయము, సాధనచతుష్టయము, షోడశకళలు మొదలుగునవి) వెల 4 అణాలు.

# హంస పుస్తకశాల.

ప్రకృతము మనదేశమున నుండు తెనుగుపుస్తకముల నన్నిటినిజేర్చి పరిశీలించి మనభాషాభివృద్ధికై సర్వజనులగు నితరదేశీయుల విద్యయొక్క యౌన్నత్యమును గలుగజేయగా వలసిన నవీనగ్రంథములను రచించుటకు యత్నము చేయబడును గనుక విద్యాభిమానుల యనుగ్రహము నికార్యమునకు ప్రార్థించుచున్నాము. సాధ్యమగు నన్ని పుస్తకములను బంప ప్రార్థించుచున్నాము.

వలయువారి విలాసము :—

హంసశాల,
అనంతపురంజిల్లా.

ప. స. హనుమంతరావు, గుత్తి.

## T. S. BOOKS UNDER TRANSLATION.

1. Advanced Text Book. V. S.
2. Elementary Text Book. V .V. S.
3. Thought Power
4. Thought Forms
5. Morning Thoughts for the year

(3–5) H. R.

# THE THEOSOPHICAL SOCIETY.

# బ్రహ్మవిద్యా సమాజము.

ఈ బ్రహ్మవిద్యాసమాజము విషయమై వివరించిన యుద్దేశములు గాక యింతి గూఢమైన యుద్దేశము లుండవచ్చునా యని కొందరికి శంక గలుగుచున్నది కదా? ఇది యాసభలో జేరిన ప్రతివానికిని కేవల ప్రాముఖ్యమైనదియే గనుక దీని సమ్యగ్విచారము కర్తవ్యము. మన సభాపథము చాలా విశాలమైనది. ప్రకృతము మన కగపడుచుండు నీసమాజప్రవర్తనలు ముందుగ రాబోవు నేదో మహాత్తును గూర్చి చేయుటకు నుపక్రమముగా నుండునట్లున్నది.

సాధారణముగా లోకమున బ్రతి పనికిని జనులకు గోచరమగు కారణముకన్న గూఢమైన కారణముండుట సహజముగదా? దానిని దెలిసి యాపనిని జేయువారక్కువ. ప్రయోజన కారణముగా నంగరు ఎటన, నొక యింటిని గట్టుటయు కట్టడము ముగిసిన, నవ [illegible] ము ముగిసెనని గా భావింతురు. అయితే యా కట్టడ ముద్దేశించిన శిల్పకారుడు దాయింటిలో నొకడు గాపురము సేయ నుద్దేశించి యున్నాడు. సౌఖ్యము పేరింత [illegible] ని మ వ్యాపారములు [illegible] లోకమున ప్రయోజనకారిగాను హేతుకారిగా నుండు సంఘము లొక గొప్ప శక్తికి వాహనముగా నున్నట్లగపడుచున్నవి. ఇట్టిసభలకు గోచరమైన దైవకారణముల సంబంధము గలిగి పరస్పర వార్తలు జరిగియుండిన నాసభలు శీఘ్రముగనే నశించిపోవుట సహజమై యున్నది. కేవల మాను యత్నము చేత నేర్పడిన సభలన్నియు నశించును [illegible] సహజమై యున్నదేకాని అయితే యదృశ్యమైన దైవ బలము గలిగియుండు నాచార నియములు గలసభలు [illegible] వృద్ధికి వచ్చుచుండును. ఇట్టిది మన బ్రహ్మవిద్యాసమాజ విషయము.

గొప్పమహాత్ములు గొందరిని స్థాపించినారని మనకందరికి దెలుసును. వారు మానవకోటియొక్క జ్ఞానశూన్యావశ్యకమును మనకంటె శ్రేష్ఠమైన మానవులు గలుగుటయు సాధ్యమని తెలిసి లోకమున మనద్వారా కొంత పని జరుగ ననుగ్రహించి యీ యేర్పాటు జేసియున్నారు. ఆమహాత్ముల యభిప్రాయము దెలిసి వారి సంకల్పములను సఫలముజేయ కంకణము ధరించుటయు నీసభలో జేరినవారి ధర్మముగా నుండును. మనము

ఓం


# హంస.

సత్యముకంటె నెక్కుడు ధర్మములేదు.

గుచ్ఛము 1.] ఫిబ్రవరి 1908. [సంచిక 2.


## నారదుడు.

లోకమున గొప్పసభల సంచయములు గలుగునపుడు, ఆపత్కాలమున, సర్వ శుభముహూర్తములయందు, లోకసంరక్షణమునకై సర్వోపాయములందు నప్రతిమానుఁడై వీణమీటుచు దైవనామ సంకీర్తన చేయుచు ప్రత్యక్షమగుచుండు నా శ్రీనారద మహాత్ముని స్మరించి మన ప్రకృతకార్య సాఫల్యమునకై వానికి సాష్టాంగ నమస్కారము లాచరించెదము.

మన సకలపురాణేతిహాసములయందు వీరివలె లోకసంచారమునం దత్యాసక్తు లైనవా రెవరిని గానము. వీరివలె నాత్మసుఖము నెంచక పరోపకారమును లోకహితమును జేసినవా రెవరు లేరని మన పురాణములను భాగవతచరిత్రలనుండి తెలియవచ్చుచున్నది. ఈ మహాత్మునియొక్క చరిత్ర పరిశీలించినపక్షమున మనదేశమున లోకమునకుగాను వారెవరు చేసిన హితమును సరిగాన కార్యమునకై యితనివల చరిత్రయందగుపడుటలేదు. ఇతని జీవనము బ్రహ్మయొక్క జీవనముతో సమానమైనది. అనేక కల్పాంతములవరకు జీవించియున్నది. ప్రస్తుతము బ్రహ్మ జీవిత కాలమున రెండవపరార్ధము ప్రారంభమైనది గనుక నారదుని యాయుస్సుగూడ నిప్పుడే యర్ధము ముగిసినది. అతడిపుడు జీవించియున్నాడు. అదృశ్యుడై లోకహితమునకుగాను పనులు చేయుచున్నాడు. ఇతడు సృష్టిప్రారంభమున బ్రహ్మయొక్క మొదటినుంచి కలిగినట్లు పురాణములయందు జెప్పబడియున్నది.

బ్రహ్మనుంచి యుద్భవించినది మొదలు నారదుడు లోకరక్షకునియొక్క దివ్య గుణములను గీర్తన జేయుచు గాలము గడుపుచున్నాడు. మొదటి బ్రహ్మయొక్క మానసపుత్రుడైన సనత్కుమారు డను సన్యాసివలన జ్ఞానోపదేశమును బొందెను. తన బోధను విని విశ్వాసముతో నడచుకొనుటకు నధికారు లైన వారికి నుపయోగమును గలుగజేయ లోకమున నట్టి యధికారుల వెదకుచు సంచరించుచున్నాడు. సన్మార్గులు గాని దుర్మార్గులు గాని సకలవిధము లయిన జను లతనిని తత్వవేత్తగాను జ్ఞానమార్గ ప్రదర్శకుడుగాను భావించి గౌరవించుచున్నారు. ధర్మరక్షణకొరకు సకల ప్రయత్నములు చేయుచు, ప్రత్యక్షమైన నీతిమార్గమును బోధించుచు గాని శుద్ధికొరకు వేరువిధముగా శిక్షజేయు సాధనములను బ్రయోగించుచు గాసి, దుర్మార్గులను మార్గమునకు దెచ్చుటకు బ్రయత్నించుచున్నాడు. ఒకవేళ, మానవుడుగాని రాక్షసపైశాచములయొక్క యౌన్నత్యమునకై కాలదేశభేదములను గమనించక యించుకయైన విసుకు జెందక నిరంతరము ప్రయాసపడుచుండును. ఒకవేళ భూలోకమున నొక సన్మార్గునకు సత్పురుషునకు గలుగబోవు యాపత్తునకై యుపై హెచ్చరిక జేయును. ఒకవేళ దుష్కృత్యములు జేయుచు బహుజనులకు దొందర గలుగజేయుచుండ వారి ప్రయత్నములయందు నపజయ మవమానములు కలుగునట్లు చేయుటకును ప్రమాదవిషయముల ననివార్యమైనతరి వారి నాశనముగూడ గలిగించుటకు యత్నము జేయుచుండును. ఒకవేళ స్వర్గమున భూలోకమున జరుగుచుండు దుష్కార్యములను దురహంకృతులను దెలియజేయుచుండును. ఒకవేళ లోకమున దుర్మార్గులను శీఘ్రముగా శిక్ష యనుభవించునట్లు జేయుటకై వారి దుర్మార్గములను నెక్కువ జేయుటకు నవకాశమిచ్చును. ఒకసమయమున కేవల ప్రవృత్తిమార్గాసక్తు లైనవారికి వారి నడవడి సరికాదని హెచ్చరిక జెప్పును. చిత్తశుద్ధిలేక జ్ఞానమార్గము నవలంబించువారికి వారి తప్పులను సూచింప జేసి కర్మమార్గమునకు నీడ్చును. జ్ఞానమార్గము నవలంబించువారికి నధికారులైన, జ్ఞానాభివృద్ధి గలుగుటకు ననేక యవకాశములు గలిగించును. ఇట్లు చేయుట యవివేకులకు ననర్థములుగా దోచవచ్చును. కొంచము విచారించిన నతని నడవడికయందు నేమి లోపము లేదు. అతనియొక్క ముఖ్యోద్దేశము ప్రతివాడును వానివానికి దగిన స్థితులయందు వానికి గావలసిన సాధన సామగ్రి చేర్పరుచుటయే. ఇట్లు కేవలగౌరవము లయినకార్యములను జేయుటవల్ల యధర్మవ్యాప్తి దగ్గించుట గాక యధికారు లైనవారికి ధర్మోపదేశము జేయుట యగును. ఇట్లు లోకహితము

జేయుచుండినను నారదుడనునామము మనము లోకమున సాధారణముగా కలహప్రియు డైనవానికి బ్రయోగించుచున్నాము గదా? అయితే యతనిని గురించి మన మిప్పుడు విచారించుదము. నరసంబంధం, నారం, అనగా నజ్ఞానము, దం యనఖండించువాడు. అనగా నజ్ఞానమును బోగొట్టువాడని యర్థము. మఱియు 'నరతీతి నరః ప్రోక్తం పరమాత్మా సనాతనః' అన్నట్లు సృష్టి స్థితి లయము లనయించువాడు, నరుడు, అతడే సనాతను డగు పరమాత్మ. ఈ ప్రమాణమునుబట్టి నారం అనగా పరమాత్మ విషయక మగు జ్ఞానమును, దః అన నిచ్చువాడు. అనగా జ్ఞానము నిచ్చువాడని యర్థము.

ఇతడు పూర్వజన్మమున నొక దాసీపుత్రుడు. తల్లి యొక యధ్యాపకుని యింట బరిచారికగా నుండెను. ఒకవేళ వానకాలమున నతని యింట జేరిన యొక భక్తుల సంఘమునకు నుపచర్యలు సల్పువాడుగా నియమింపబడెను.

ఇతడు బాల్యమునుండి సదాచార సంపన్నుడై కేవల సభ్యుడై యుండినందున నా భక్తులు సకలమును సమముగా జూచుచున్నను యతనిమీద మాత్ర మతడు సలుపు పరిచర్యలకు సంతుష్టులై పక్షపాతము గలవారైరి. కంటికి రెప్పవలె భక్తుల నెడతెగక నాదరించుచు నారాయణ నామకీర్తన సదాచేయుచుండ నతడు పాపవిముక్తు డాయెను. అతనియందు భక్తిభావము దినదినము ప్రవర్ధమాన మగుచుండ నామును లతనియెడ నపార దయాసముద్రులై యుండిరి. వారచట కొన్నాళ్లుండి వెనుక వారి మార్గమును బట్టుకొని పోవు సమయమున నారదుడు వారిని బ్రార్థించగా వారతనికి మోక్షోపాయ మగు జ్ఞానోపదేశము ననుగ్రహించిరి. ఆ మునులు కర్మబంధములు వజ్రమయ మైన సంకెళ్ల కంటె నెక్కువ శక్తిగల బంధము లనియు అపార సంసార ప్రవాహమున గొట్టుకొనిపోవ జేయునని యతనికి బోధించిరి. అట్టి బంధవిముక్తి సకలకర్మ లీశ్వరార్పణము జేయుటమాత్రమే యని జెప్పిరి. రోగమునకు గారణ మైనది రోగము పోగొట్ట జాలనట్లు కర్మకు కర్మ పరిహారముకాదు. రోగకారణమునకు సంబంధించని దాని ప్రయోగమువల్ల రోగనివారణ యగునట్లు కర్మలకు కర్మజన్యమైన ఫలములకు నౌషధము దైవభక్తియు సకలకర్మ లీశ్వరార్పణ జేయుట యగును. ఇట్టి యుపదేశము నామునులు నారదున కనుగ్రహించ నతడు ధ్యానపరుడై యుండ నియమించి వారు ప్రయాణమై వెళ్లిపోయిరి. అతని తల్లికి నతడొకడే కుమారుడై యున్నందున, నతని క్షేమసమాచారములందు గేవల ప్రేమ జెంది యుండెను. ఆమె గడుబీదరాలై యుండినందున నతని కేలాటి సుఖ మాన

హింపజేయ నామెకు వీలులేక యుండెను. అతడు గడుబాలుడై యుండి లోకవ్యవహారముల నించుకయైన దెలియనందున దనతల్లి బరిచారికము జేయుచుండిన గృహమునందు నతడు గూడ జీవించుచుండెను. ఒకనాడు రాత్రికాలమున నావును పాలుపిండి మరల వచ్చుసమయమున మార్గమున మృత్యువుచే బ్రేరేపింప బడినట్లు పాముచే గరవబడి యామెకు నే యుపచారములు పనికిరాక శీఘ్రముగానె ప్రాణము విడిచెను. నారదునియొక్క జ్ఞానసిద్ధికై పరమాత్ము డనుగ్రహించి యిట్లు సంభవింప జేసెనని చాలా సంతోషించి నారదు డుత్తరదిక్కునకు బ్రయాణమై వెళ్లి సర్వసమృద్ధియైన యనేక దేశములను గడచి యనేక పట్టణములు, జనపదములు, పల్లెటూరులు, కొండ, చరులు, మైదానములను దాటి యెక్కువ యాయాసముతో నొక యడవిని బోవుచుండ, నధిక క్షుత్పిపాసలచే వ్యసనపడువాడాయెను. ఆ సేద దీర్చుకొన నొక కొలనుయందు గల శీతల జలమున స్నాన మాచరించి యుల్లాసము పుట్టువరకు నా నిర్మలజలమును గ్రోలెను. అత డొక మేడివృక్షముక్రింద జేరి యాముని యుపదేశించిన రీతి ధ్యానపరవశు డయ్యెను. అచ్చటనే కొంతకాలము తపస్సుజేయుచు జ్ఞానసిద్ధి పొందజాలక చింతాక్రాంతుడై యుండ నొక యశరీరవాణి “అయ్యో! నీవు నన్ను జూడదగివు. నన్ను జూడ పరిశుద్ధమైన దృష్టి నీకులేదు. ఇంకను లౌకికవాసనలు నీమనసున బ్రబలియున్నవి. నే నిదివరకు నీకు గొంతకొంత ప్రసన్నుడనై యుండుట నీయొక్క విచారణను నెక్కువజేయుటకుగాని వేరుకాదు. హృదయభూమియందు పెరుగు సకల కామసర్పజములను ముముక్షువు నిర్మూలము జేయును కొంతకాలము నుంచి మాత్రము నీవు భక్తిసేలుపుచు నుండినను నీయందు దృఢమైన విశ్వాసము గలుగ జేయబడినది. నీవీ దేహము జాలించినవెనుక ముందుజన్మమున గేవల పవిత్రుడవై నాసభలో జేరినవా డగుదువు. నా యనుగ్రహమున నీభక్తి తరుగదు. నీజ్ఞప్తి ప్రళయమునగూడ సమయదు.” ఇట్లాకాశవాణి సెప్పి యంతర్గతము గాగ నతడు శిలపై వ్రాలి యీశ్వరుడు దయాసముద్రుడై యనుగ్రహించిన మాటలకై యతనికి సాష్టాంగ వందనము లాచరించి యతని దివ్యప్రభావమును గీర్తనజేయ నారంభించెను. అప్పటి నుండి నారదుడు హరిపాదకమలములయం దుంచిన మనస్సుగలవాడై ప్రాణావసాన సమయమునకు నోర్పుతో వేచియుండెను. కొన్నాళ్లకు నితని దేహ మూడి యతడు గేవల, పరమాత్మధ్యానపరుడై నిలిచెను. జగత్ప్రళయసమయమున మున్నీటి మీద సకల సృష్టిజాలము నంతర్గతము జేసుకొని విష్ణువు వటపత్రశాయియై యుండు

సమయమున నీశ్వరాకారాకారితమైన బ్రహ్మహృదయమున నతడు జేరినవాడాయెను. జగత్సృష్టిని సంకల్పించి బ్రహ్మ బహిర్ముఖుడుగాగ మహా సావర్తులు చతుర్యుగములు గడువ బ్రథమమానస పుత్రులైన మరీచి మొదలగు బ్రహ్మ ఋషులతోగూడ బ్రహ్మ వల్ల మరల బుట్టెను. అప్పటినుంచి బ్రహ్మచర్యవ్రతమున నుండి త్రిలోక సంచారియై నిరాటంకముగా విహరించుచున్నారు. భూలోకమున సామ్యము లేనటువంటి గానముతో నీశ్వర దివ్యప్రభావములను గీర్తనజేసినమాత్రమున స్ఫుతకీర్తి యగు నీశ్వరుడతనికి ప్రత్యక్ష మగుచుండును. దైవనామసంకీర్తనకంటె సంసారసముద్ర ములంఘ తారకమగు సాధన వేరులేదని యితడు నమ్మియుండెను. గనుక దైవనామ సంకీర్తన ప్రభావ మిట్టిదగును. అయ్యో! మనకు మనలో నుండు సూక్ష్మదృష్టి పూడియున్నది కాని లేకున్న నతడు సర్వదా చిరునవ్వు నగుచు దివ్యమైన ముఖవిలాసముతో దైవ నామ సంకీర్తన జేయుచు, మనోహరమైన గానము జేయుచు నెక్కడైన కార్యముండిన నక్కడ ప్రత్యక్ష మగుట మనము గనుగొనెదము. వ్యాధియున్న బాలుని ప్రార్థనను, కేవల కర్మమగ్నుడైన వృద్ధుని చింతనలను సమముగా వినును. ఒక గొప్ప జ్ఞానియించుక నధర్మమార్గప్రవర్తకుడైన, నమియు దోయని కేవల మూర్ఖుడైన మహాపాపికిని నాదరముతో జ్ఞాన బోధజేసెను. ఇతడు లేని మహోత్సవము గనబడదు. ఇతడు ప్రాముఖ్యముగా నడుచుకొననియంతరంగ శిష్యులు లేవు గనుక నే యితనికి నారదుడను నామము గలిగెను.

సశేషము.

## మత మావశ్యకము.

మతమన నేమి గురువది ముందు వివరించి యున్నాముకదా? మనుజునకు నెట్లు మత మావశ్యకము. ఏమత మవలంబించక మనిషి సుఖముగా జీవించి కాలము గడుపుట సాధ్యము గాదా? దైవవిశ్వాసముగల మనుజులెడ ప్రకృతి నియమములు వేరువిధముగా నడుచుకొనునా? దీనినిగురించి మనము విచారించుదము. ప్రకృతిశాస్త్ర మదృశ్యమైన లోక నియామకుని సరకుగొనక లోకనియమములను విమర్శించుచున్నది.

"రసవాదశాస్త్రి నియమముల ననుసరించి పరమాణువులు వేరు పరమాణువులతో జేరి యణువులై సంయోగశక్తివల్ల, గట్టి, ద్రవమైన, లేక వాయురూపమైన పదార్థము లేర్పడును. ఆకర్షణశక్తి ననుసరించి దూరమున నుండు పదార్థసంచయ మొకటి మఱొకటిని నాకర్షించి సంచారము జేయుచున్నవి. ఉష్ణము, వెలుతురు, విద్యుచ్ఛక్తి, సూదంటురాయి గుణము వీని ననుసరించిన నియమములు భూమ్యంతరిక్షములకు సంబంధించిన నియమము లదృశ్యమైన నియామకుని స్వాధీనమున నుండకనే ప్రవర్తించుచున్నట్లున్నది. మహాజ్ఞానియు కేవల నాస్తికుడును, దయార్ద్రహృదయుడైన లోకహితుడును, స్వార్థపరత్వ మగ్నుడైన వ్యక్తియు వివిధజాతుల నేలు రాజులును, నిత్యాన్నము సంపాదించుకొన కృషిజేయు రైతు అనియమములకు లోబడి యే మిన హాయింపు లేక ప్రవర్తించుచున్నారు గదా? రాజులు శిష్టుల రక్షణార్థము దుష్టుల శిక్షార్థము చట్టముల నేర్పరుచుదురు. ప్రకృతి ధర్మము లోక సర్వజ్ఞునిచేత నియమింపబడినవై మనుష్యుల యోగ్యతానుసారము నియమములు భేదాభేదములుగా నెంచుకు వర్తించుట లేదు. దేవు డున్నాడనుకొనెదము. వానిని నిర్భయముగా నిరాకరించి నేమియగును. లోకమున పెఱుగు లతావృక్ష గుల్మాదు లక్కడక్కడ యేండ్లకొలది దేవుని స్మరణలేకయె పుట్టి పెరిగి నశించునుకదా? తృణప్రాయమైన క్రిమికీటకాదు లొక్కొక్క దినప్రమాణము గూడ నాయువులేక, యుదయమునుండు మృగరాజనేక వసంత హేమంతఋతువులు గడుపుచు వనవిహారములు జేయుచు, దన్ను సృజించి నవా రెవరని యించుకైన చింతనలేక కాలము గడుపుచున్నవి కదా? వానివలె నేనును బుట్టిపెరిగి యే మతబంధములకు జిక్కక యేల చావకూడదు?" ఇట్లు ప్రకృతి శాస్త్రి తత్వజ్ఞుడు విచారించుకొనుచుండును. అయితే యట్టి విచారణచే మాత్రము జీవించ సాధ్య మా యని విచారణ జేయవలసి యున్నది. గనుక విచారించెదము. మొదటి యాక్షేపణ యేమన, పరమాణువులు బరమాణువులతో జేరి యణువులై వివిధపదార్థము లగునని యందురుకదా? నిజమే. అవి యెట్లు చేరునను ప్రశ్న పుట్టును కదా? అవి స్వభావముగా నట్లు చేరునని చెప్పవచ్చును. అయితే వానికి ప్రజ్ఞ యున్నదా? ఉన్నదన ద్వైతవాదము గెలుచును. లేదన నచేతన పదార్థము గార్యకారి యగుట యెట్లు? స్వాభావికముగా నవి చేరునని మీ రొప్పుకొనినను పదార్థములు సర్వ మేదో యొక ప్రజ్ఞగల కర్తయొక్క కుశలతగైన యేర్పాటు ననుసరించి పదార్థముయొక్క సృష్టి యగునట్లున్నది. ఆ యణువులకు యట్లు చేరుబుద్ధికుశలత యున్న

దని చెప్ప నా బుద్ధికుశలతయు దైవస్వరూప మొకటే యని తెలియును. గనుక సర్వపదార్థములు కేవల యణువుల మిశ్రమములని చెప్పువాదము వ్యర్థము.

రెండవ యాక్షేపణ యేదన:-- దేవు డొకడుండ నేల ధర్మనియమములు ప్రమనిషి ననుసరించ భిన్నములు గ లేవు? దేవు డొక్కనికి నొక నియమమును, మరొకని కొక నియమమును విధించజాలడు. దేవుడు సృష్టిజేసిన ధర్మనియమముల ననుసరించి తన శ్రేయస్సునకై విధేయుడుగా మనిషి నడుచుకొన వలయును. ఒక న్యాయమైన రాజు సర్వజనులకు న్యాయము గలుగజేయ దుష్టుల శిక్షణ సన్మార్గుల పోషణమునకై నియమములను విధించి యుండును గనుక శ్రేయస్సును గోరువారందరు వాని ననుసరించి నడుచుకొన వలయును గదా?

మూడవ యాక్షేపణేమన:-- దేవుని దిరస్కరించి యేమతము నవలంబింపక సుఖముగా కాలము గడుపుటకు సాధ్య మగునని చెప్పుటకదా? ఇట్లు చేయుట సాధ్యమా యని మనము విచారించవలెను. అట్లు జీవించుటకు బాహ్యపదార్థముల సహాయమును గోరక యొక్కనైన మనోదేహ స్థైర్యముల నుండవలయును. అయితే సాధారణముగా లోకమున నట్టి జను లుండుట దుర్లభమని మనకు ననుభవవేద్యము కదా? ఎంత బుద్ధిశాలులైనను దిన కృత్యములను వారు గోరునట్లు సిద్ధము జేసుకొనుట కడుదుర్లభమని యందరకు దెలిసిన విషయమే. నేడొక యేర్పాటు జేసి రేపు నేరుమార్పులను జేయుట సహజముకదా? మనిషి స్వసామర్థ్యము లేక యేదో యొక బలమును గోరుట సహజమే కదా? ఆ కోరికయే యేదో యొక బలమున్నదని సూచించుచున్నది. మనకు ననేక యాపదలు సంభవించినపుడు మన యత్నము లేక కష్టములు ప్రాప్తము లైనపుడు వాని కారణములను విమర్శ జేయనోపక యేదో యదృశ్యమైన కారణమునకు సకల మర్పించి నిరాశ కలవా రగుదుము కదా? ఆ యదృశ్యమైన బలమే దైవబలము. దైవము సర్వత్ర ప్రసరించి యున్నది. దైవము బాలుని ముద్దమాటను ముసలివాడైన యొక సన్యాసియొక్క తీవ్రతపమును రాజుయొక్క మనవిని పేదవాని న్యూనతను సమముగా నాదరించును. ఆ దైవస్వరూపమును మన వేదములు వెల్లడిజేయుచున్నవి. "అమంగళకరమైన పదార్థముతో మలినము గాని సూర్యునిపగిది దివ్యతేజ స్స్వరూపమయిన దైవస్వరూపమును నేను జూచియున్నాను. దైవస్వరూపమును నమ్మి భజించువా రమర్త్యు లగుదురు. మోక్షమునకు

వేరు మార్గము లేదని" వేదములు ఘోషించుచున్నవి. కృష్ణుడు గూడ నర్జునునకు "సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణంవ్రజ" యని చెప్పియున్నాడు. గనుక మనిషి దైవము నన్వేషించ యత్నించిన నతనిని జూచును. అతనిని జూడ వేదముల విధించిన నియమముల ననుసరించుట యావశ్యకము. ఆ నియమములే "మతమనబడును గనుక ప్రతిమనిషికి మత మావశ్యకము. మతముకంటె వేరు ధనములేదు. శ్రేయస్సులేదు గనుక గతిలేదు. ధర్మనియమములను మన మిపుడు వదలుటవల్లనే కదా లోకమున మన దేశమున నెంచుజూచినను దౌర్భాగ్య స్థితులు మెండుగా గనపడుచు మన మనస్సులన్నివిధముల విహ్వలత జెందుచున్నవి గనుక యుక్తమైన ధర్మము నవలంబించి పవిత్రులాగురని వేడుచున్నాము.

## జ్ఞానసిద్ధి నిరూపణ.

మొదట మన మనస్సుల ప్రకృతస్థితులను విచారింతము. ఇంద్రియములకు సుఖము నిచ్చునట్లుగాని మన కోరికల నీడేర్చు వస్తువులు స్వాభావికముగా మన మనస్సుల నాకర్షించును. సుఖ మించుకయైన గానరాకున్న వస్తువుల సంగమును గోరవు. ఇటువలెనే దుఃఖవిషయమున నివృత్తిగూడ బొందును. ఎట్లన, సుందరరూపమును జూడ నేత్రము లిచ్ఛయించును. సుస్వరమును విన జెవికోరును. వికారరూపమును జూడ నేత్రము లిచ్ఛయించవు దుస్స్వరమును చెవి వినుట కిష్టపడదు.

అదియునుగాక యొకనికి నింపయినది మఱొకనికి దుఃఖము గలిగించును. ఎట్లన శూద్రునికి మాంసభక్షణము సుఖకరము. బ్రాహ్మణుని కసహ్యము దేహారోగ్యము గలవానికి దూదిపరుపు సుఖమిచ్చునట్లు రోగికి సుఖ మివ్వదు.

ఇట్లు సుఖదుఃఖములు పదార్థ స్వరూపములు గావు కాని మన మనోదేహభావముల ననుసరించి యున్నవని ఖండితముగా దెలియవలెను. దేహస్థితి చాలామట్టుకు మనసు ననుసరించి యుండును. మనస్సున నొక భావము నాటిన దేహమును బూర్ణముగ వ్యాపించి మార్పును కలుగజేయును. ఒకవేళ నొక పదార్థమును సహించదు. మాంసభక్షకుడు మాంసభక్షణము నింద్యమని తిరస్కరించి మరల మాంసవాసన దగల వ్యాధిని బొందెడువానిగా గనబడును అతని యుదరముకూడ దానిని జీర్ణము

ప్రజ్ఞదప్పి, బుద్ధివికలమై పూర్వాపరజ్ఞానములేక పశువులవలె నడచుకొనెదరు. తాపమాశయొక్క విజృంభణస్వరూపము. ఆశానుభవమునకు నాటంకము గలిగిన నది కోపమగును. గనుక, ఆశ మొదటిమెట్టు, తాపము రెండవది, కోపము మూడవది. కోపమునుండి క్రోధము, యసహనత మొదలగు దుర్గుణము లనేకములు పుట్టి దుష్కార్యములకు హేతువు లగును. ఆశ నణచి తజ్జనితమైన దుర్గుణముల కెడమివ్వనివాడాత్మనిగ్రహము గలవాడగును. విషయసుఖము క్షణికమని యనిత్యమని యెరిగి సుఖము విషయాంతరము గాదని తెలిసి సుఖస్థానము తనమనస్సేయని యెరిగి యింద్రియముల ద్వారా బాహ్యవిషయములనుండి దొరకుసుఖమేవడపేక్షించడో వాడాశను ఖండించి పరమానందమును బొందును.

తాపము, కోపము, ఇచ్ఛయొక్క రెండవ మూడవ మెట్లులుకగా? అవి మానవుని యంతర్ప్రజ్ఞలో నిమిడి యుండునని యోగులు సెలవిచ్చెదరు.

ఇచ్ఛకు గారణమేమి? ఆశ యనునది యంతర్వాసనా ఫలము లేక వాసనల ప్రకాశము. ఇంద్రియములద్వారా విషయము లనుభవించెదము గనుక నా యనుభవకాలమందు మనసున వాసన లేర్పడును ఎట్లనగా, ఒక మామిడిపండు తిన్న నాపండు మధురభావము మనసున నిలుచును. ఒక రాగము విన్న నా మధురధ్వనమై ఖరి మనసున నిలుచును. ఇట్లనేక విషయానుభవములందు నాయా వాసనల సమూహము మనసున జేరి ముందు వచ్చు కర్మజాలమునకు బీజరూపకముగా నిలుచును. ఇదియే యిచ్ఛాస్వరూపము.

మనస్సు సముద్రము. ప్రజ్ఞ దాని పైభాగము. వాసనలు దాని యడుగున నుండునని యనుకొనెదము. అంతర్గత వాసనలు తమ ప్రకాశమునకు నవకాశము గలిగిన ప్రకాశించును. ఎట్లన ఒకడతని కనిష్టమైన కార్యము జేయ కోపాంకురము తనయందున్న కోపమును పైటికి దెచ్చును. చైత్రమాసమున మామిడిపండ్లు తిన నిచ్ఛగలుగును. ద్రవ్యమును జూచి దొంగబుద్ధి గలిగియుండిన దానిని దాచిపెట్టుకొనును. ఇట్లు, ఆయావాసనకు ప్రకాశమున కవకాశము గలుగ వాసన సముద్రపు పైభాగమున బుద్బుదరూపముగా నగుపడును. అది యిచ్ఛయొక్క సూక్ష్మరూపము లేక ప్రబుద్ధవాసన యగును. అది క్రమముగా వృద్ధియై మనస్సముద్రమున నాడుచు యలరూపమును గొని మనస్సముద్రమును గలతపెట్టును. అప్పుడు మనస్సు చంచలమై శాంతిచెడి వివేకము మందమగును. దానికి లోబడిన నావిషయవాంఛల పాలుజేసి యావా

సన మహాబలమై మన స్థైర్య మంతయు నపహరించి వాసనాప్రియమైన పదార్థమును
బొందువరకు ప్రజ్ఞ లేక జేసి గానిని బొంది దాని సుఖము క్షణికమని తెలియువరకు
మనసును భ్రమింప జేయును. వెనుక కొంత కాలమునకు నెమ్మది జెందును. ఇటు
వలెనే ప్రతి భావన గలుగునపుడు మనస్సున మార్పులు గలుగుచుండును. ఇట్టి భావ
నలు చంచల చిత్తునియం దధికముగ గలుగును. ఒకసారి యొక సుఖ మనుభవించి
నది తత్కాలమునకు మనస్సున లీనమై దాని వాసన మరల నొక కాలమున నదిగను
పంచుకొనును. దానినుంచి మరియొక వాసన పుట్టును. ఇట్లు వాసనాపరంపరలు గలుగును.
ఒకడు త్రాగను ప్రారంభించు మొదట లోకవిరుద్ధమైన రుచిగ నుండును. అది వాని మాంద్య
మును తొలగించి చురుకు గలుగజేసి వాని నరముల నున్న మెక్కువజేసి తాత్కాలము
నకు సుఖునిగా జేయును. వాని కిష్టుడుగా గానే యీ వాసనమాత్రము మనసున
నిలిచి యిచ్ఛారూపముగా మరియొకనాడు ప్రకాశించి రెండవసారి త్రాగును. దాని
వాసన మొదటివాసనను ప్రబలము జేయును. ఇట్లు కొంతకాలమునకు నాయభ్యా
సము ప్రబలమై వాడుక యగును ఇట్లు ప్రతిభావమును పలుమారు చింతించి
యనుభవించుటవల్ల వృద్ధిజెంది యొక నరునియొక్కయు జనసంఘముయొక్కయు
వాడుకలుగా నేర్పడును. ఇట్లు ఒక్క జీవితకాలమున జేరిన వాసనాసమూహము
దేహ మూడినంతట నాశముగాదు. అది చిదాకాశమున స్పష్టముగా చిత్రగుప్తులతో
వ్రాయబడి యుండును. ఇట్టి వాసనాసమూహము ననుసరించి పునర్జన్మమున దాని
భావనలు, యిచ్ఛలు నంతట యేర్పడుచున్నవి. గనుక నీప్రపంచమున నొక కులమున,
దేశమున, కుటుంబమున వివిధ స్వభావములు గలవారిని జూచుచున్నాము.

వాసన తెక్కువైన కోరికలు గూడ నెక్కువగును. కోరికలు గలిగిన దాపము,
కోపము, క్రోధము నెక్కువగును. అగ్నిలో నెన్నబోసిన చల్లారనట్లు విషయాగ్ని
విషయభోగానుభవమువల్ల నెక్కువగును గాని తగ్గదు. ఎంత వెన్నబోయ నంత ప్రజ్వ
లించునట్లు విషయముల నెంత యనుభవించిన నంత విషయాశ యెక్కువగును. లోక
మున నుండు పదార్థము లన్నియు నిచ్చిన నీమనసు గోరుట మానదు. కోటీశ్వరు
డెక్కువ ధనమును సంపాదించక యూరకుండునా? బీదవాడు ధనికుడు కావలె
ననును. ధనికుడు కోటీశ్వరుడు కావలె నను. కోటీశ్వరుడు హెచ్చుస్థితిని గోరును.
ఆశకు పార మెక్కడిది? సుఖమెక్కడ నిలుచును? సుఖానుభవమునకు మేర యెద్ది!

ఇట్లు సుఖానుభవమును సదా కోరుటయే మనోవ్యాధి. దాని చిహ్నాలే తాపము, డంభము అసహనము మొదలైన దుర్గుణములు.

అనేక తాపకోప రూపములను మనస్సును వశీంపకుండ జేయుటను హెచ్చు సాహసము మనోనైర్మల్యము గావలయును. విషయములకు లోబడినవాని మనస్సు యొక్క చంచల స్వభావమును సారాయి త్రాగిన, తేలుకుట్టిన, దయ్యముపట్టిన కోతికి బోల్చబడును. ఇట్టి చంచలస్వభావము గల మనస్సును జయించినవాడు వేయిజనమును వేయిమారులు జయించినవానికంటె శ్రేష్ఠుడగును. గనుక మనస్సుయొక్క స్వరూపమును విచారించి యిచ్ఛ బుద్ధిరూపమున నున్న సమయముననే గిల్లివేసి రాగద్వేషరూపమైన తాపముల ప్రవాహమును దాటి సర్వయాపేక్ష యింద్రియ సుఖములే మన గతియని నమ్మక మనస్స్వభావమును జయించి సద్విషయమున మనస్సును నెలకొల్పిన శుద్ధమైన సాధకుని ప్రకాశము దనంతట స్వభావముగ వెల్లడి యగును. నిశ్చయము.

## తలంపే నడత.

“మనుజుడు తన హృదయమందు నెటుల దలచునో యటులే తా నుండును” అను సామెతను పరిశీలించి చూడుడు. అది యితని జీవితపు స్వభావమును సూచించుటగాక వాని జీవమానములోని ప్రతియొక పరిస్థితిని దప్పక నిరూపించును. తన తలంపే తన నడత. తన నడతయే తన స్వరూపము. బీజములేక యొక వృక్షము దయించదు; బీజపు తోడ్పాటు లేక యుండదు. అట్లు మనుజుని ప్రతిచర్యయు దనలోన ప్రచ్ఛన్నముగా నుండు తలంపుల బీజముల నుండియే పుట్టును. యోచన పూర్వకముగా బుట్టిన చర్యలైనను మరియు హఠాత్తుగా జనించిన కృత్యములైన నట్టి బీజమును నెల్లపుడు సహకారిగా నుంచుకొని యుండును.

క్రియ యనునది తలంపుయొక్క పుష్పము; సుఖదుఃఖములు దాని ఫలములు. ఇట్లు మనుజుడు తన కార్య వ్యవసాయపు తోటలో బండిన ఫలములయొక్క తీపు చేదుల ననుభవించుచుండును.

మనిషి దన కర్మసిద్ధాంతము ననుసరించి వృద్ధిజెందిన రూపమేగాని యేదో యొక యుక్తిపూర్వకముగా సృష్టించబడిన యొక బొమ్మగాదు. ఈ దృశ్య ప్రపంచ

మెటువలె కారణ కార్య సిద్ధాంతమునకు లోబడి యున్నదో యటువలెనే తలంపను అదృశ్య ప్రపంచపు కారణ కార్యఫలములకు సృష్టినియమమునకు లోబడి యుండును. ఉత్కృష్టమైనదియు దైవయోగ్యమైనదియు నైన నడత యాకస్మికముగా దలచుకొన్న మాత్రమున వచ్చునది కాదు. లేక యేదో యొక కృపవల్ల బొందబడునదియు కాదు. క్రమమైన తలంపులు బహుకాల మెడతెగక తలంచుచువచ్చి దేవసంబంధపు తలంపుల నవ్యవహితముగా వృద్ధిజేయుచు వచ్చిన నట్టి లోకసమ్మతమైన గొప్ప నడతను బొందవచ్చును. నీచతలంపులు నీచ నడతనే పుట్టించును. ఇంద్రభవన పదముగాని లేక యమనరక గమనముగాని తన తలంపులకొలది గలుగును. శుద్ధమైన తలంపుల నేర్పఱచుకొని యభ్యసించు ప్రాణి పరమాత్మ సామీప్యమును జెందును. తద్వ్యతిరేకమైన నీచతలంపులలో మునిగి పొర్లుచుండు నతడు ఘోరమైన యడవి మృగపు స్థితిని జెందును. దైవసామీప్యమును బొందుటకు జెప్పబడి యుండు ననేక సాధనరూపములలో మనుజుడు తలంపుల సంయమనము, నడత సంధానమునకు కారణము, ఆత్మ వ్యక్తి నిరూపణకును యనుభవ సాధనము సర్వోత్కృష్టమైనది.

తాను మహాశక్తివంతుడుగాను, జ్ఞానవంతుడుగాను, కృపాళుడుగాను, తన తలంపుల నియామకుడుగా నుండుటంబట్టి తన భావ్యవస్థాగతులను తన యిచ్ఛను సారముగ నిరూపించుకొనవచ్చును. ఎంతటి కష్టములో నుండినను దాను పరతంత్రుడు కాదు. స్వతంత్రుడను భావమును ధైర్యముతో జ్ఞాపకము నుంచుకొని యాభావమున కనుగుణ్యముగా తన తలంపులను బొందిక జేసుకొని ప్రవర్తించు మనుజు డెప్పటికైనగాని దైవకృపకు బాత్రుడగును.

మంచి సుగంధపుష్పములను గాని రసికరమైన ఫలములను గాని యనుభవించగోరు మనుజు డాయావృక్షజాతుల మంచి విత్తులను సకాలములలో నాటుట గాక యాటుల నాటకమునుపు కొంకకు విరోధముగా పెరిగియుండు సస్యాదులను బెఱికి పారవైచి, తాను నాటిన వృక్షములై పుష్పఫలముల నిచ్చువరకు దృణాదులను బెంగనీయక తోటను జాగరూకతతో గాపాడిన బుష్పఫల వృక్షములు వృద్ధి జెందును.

అటువలెనే దుర్గుణములనెడు పనికిరాని గుల్మాదుల నిర్మూలించి యుడి మఱియు మొలవక చూచుకొనిన, సుగుణములనెడు ఫలవృక్షములు సమృద్ధిగా పెఱిగిన, నడతి యనెడు తోటను సమష్టిరూపమున గానించును. ఆదరముతో నెడతెగని కృషితో

గావించిన నొక సుందరమైన తోటకు ననాదరణీయమై ముండ్లచెట్లుగల్గి సర్పాదుల కాస్పదమైన యొక జనసంచారము లేని యడవి ప్రదేశమునకును గల తారతమ్యము మీ రెఱుగునది కాదు.

ఒకడు వేసిన తోటను దానును దన మిత్రబంధువర్గము మాత్రమే యనుభవించుట లేదు. అర్థ్యనేకులగు జను లనేకులు నితర మనుభవింతురు. చూచి యానంద మును జెందువా రెందరో. ఒకని మంచినడత యాత్మానందము నిచ్చుటయే కాక యతనితో వ్యవహరించువారికి నతనితో సంభాషించువారికిని, మఱియు నతని జూచు వారికి నైన నానందము నిచ్చును. మన మంచినడత యేకదేశ కాలములలో నివర్తించునది కాదు. మనతోను మనతో సంబంధపడు వారితో యిగియునది కాదు. మన సద్భావ సుగుణములు మన ముండు దేశమునందె ప్రకాశములు గాక యన్య దూర దేశములయందును వ్యవహారాదు పూర్వకముగా బ్రజ్వలించును. అనేకులు తామా నడత నవలంబింప గోరుదురు. తమ పిల్లలకు బోధించి యట్టి ధర్మమైన నడతను గఱపుదురు. దేశాంతరములలోనే కాదు. కాలాంతరములలో నిన్ని ప్రశంసించి లమతమ నడతలను దిద్దుకొనుచుందురు. అటుల గాకున్న గొప్పవారి చరిత్రములవలని ప్రయోజన మేమి? అవతారాదుల క్రియల విశేషమును వర్ణించు రామాయణ భారతాదులు నిష్ప్రయోజనములే కదా?

గృహకృత్య వ్యవహారములందు నెడతెగని సుఖ మొండిన మన మంచినడత యంతలి చక్కదనమును నెటుల విశదముగా సూచించునో, యటువలెనె మనము నివసించు నిరుగుపొరుగులందు నావీధులందు, నావీధులను గల పట్టణములందును, జనించు వివేక సుఖానందములకు మనమే యుత్తరవాదులముగా నుందుము. మన నడత ప్రభావ మెట్టిదనిన నదుల సమూహముచే సాగరము విస్తీర్ణ మగునటుల మన మెఱుగకనే, మనము గోరకనే, మనయొక్క యుద్దేశము లేశమాత్రము లేకనే యితరుల నడతలను వృద్ధిజేయును.

సుగుణాభివృద్ధి వ్యాపకముచే నైన యానందము నిదివరకనుభవించితిమి గదా! ఇపుడు సద్గుణరాజ ప్రభావ మెంతటిదని యరసిచూతము.

సుగుణ ప్రచారమునందుండు దుష్కరము దుర్గుణ వ్యాపకమునందు లేదు. ఇది మహా సుకరముగా వ్యాపించును. దుర్గుణ ప్రకోప మహాత్ములు యొఱుకలేనిదే ప్రతియొక దుర్గుణము సహస్రావధి దుర్గుణముల బుట్టించును. ఈ క్రొత్తగా జనించినవి

పెరిగి వృద్ధిజెంది తద్రీతిగనే కోట్లకొలది యవగుణములకు జనకరూపకముగా దమతమ వంతుల దీర్చుకొనును. ఇంతకు దార్ష్టాంతికము నొక సజ్జనుడు చెప్పియున్నాడు. అదే, మన దట్టముగా నుండు నొక యడవియందు బ్రవేశించి చూచిన స్వజాతీయ వృక్షములు వేర్వేరు ప్రదేశములందు వేర్వేరు సమూహములుగా నిలిచియుండును. అందుకు కారణ మేమని విమర్శించినట్లయిన నాయడవిని వేసి పెంచినవా రెవరు లేరు. ఆదరించి వృద్ధిబొందజేసినవా రెవరిని గానము. అనాది యనుటకు మొదలే లేంబలేక. దాని మర్మ మేమనగా వాతవృష్టి సాహసద్వారమున స్వసిద్ధముగా నాటుకొను విత్తులును, కాకాదుల పురీషాదిగ బీజములును నానాటికి నంకురించి వృక్షములై యుత్తరోత్తర పోషణములకు గారణమై మహారణ్యముగ సృష్టిజేసెను. ఈ యుపమానము నిర్గుణోపమేయమునకు పూర్ణోపమగా నెంచవచ్చును.

ఒక నిర్గుణమునకు, మన మొదలిచ్చిన దానిని గాలాంతరమున జూచుకొనునప్పుడు మహా ఘోర నిర్గుణ కౌననమై నేర్పడియుండును. ప్రథమ నిర్గుణమును వృద్ధిచెంచక పశుప్రాయుడుగా, గన్నుమూసికొని యుండిన జాలు అది వీని నడుగకనే, వీని యాజ్ఞను నిరీక్షించకయె తనపనిని దాను స్వేచ్ఛగా జేయుచుండును. ఈ స్వయంకృతాపరాధమైన జాతాంధకారసమాపన్నుని ముఖదర్శనమే దుఃఖకరము.

ఇట్టి నిర్గుణవంతుడు ప్రకృతి ప్రవాహమున గొట్టుకొనిపోవుట కాలాంతరాస్థాన ప్రభావద్వారమని యెఱుగక, తాను అసహాయ నిరంధరుడై యీదుచున్నాననియు, నానదీ ప్రవాహమున దనకు దటస్థమగు భోగాభోగములు స్వసామర్థ్య ఫలములనియు మాయావిష్టుడై విఱ్ఱవీగి స్వయంకర్తృత్వాభిమానుడై, అన్య సుభోగ నిగ్రహపరుడై యుండి యొకానొక కాలమున బూర్వార్జిత కర్మబలముచేత దాను బడిపోవులుచుండుట బంధిత్రమనియు యిది ప్రవృత్తి తరంగిణి యనియు దనను సాగరముఖద్వారమువరకు దెచ్చినదనియు, ఇక నావగింజంత యశ్రద్ధ యయిన ననంతపారావార ప్రాప్తి యగునను జ్ఞానము దెచ్చుకొని, కొట్టుకొని, ధృఢముగా నిలిచి, తత్తటినీ నివృత్తి శాఖలలో నొకటిని బ్రవేశించి యొడ్డుకు జేరుట ప్రారంభించును.

వి. సు. మొగలియార్.

గావించిన నొక సుందరమైన తోటను ననాదరణీయమై ముండ్లచెట్లుగల్గి సర్పాదుల కాస్పదమైన యొక జనసంచారము లేని యడవి ప్రదేశమునకును గల తారతమ్యము మీరెఱుగుదురు కాదా.

ఒకడు వేసిన తోటను దానును దన మిత్రబంధువర్గము మాత్రమే యనుభవించుట లేదు. అన్యదేశములగు జనులనేకులు గూడ ననుభవింతురు. మాచి యానందమును జెందువారెందరు! ఒకని మంచినడత యాత్మానందము నిచ్చుటయే కాక యతనితో వ్యవహరించువారికి నతనితో సంభాషించువారికిని, మఱియు నతని జూచువారికి నైన నానందము నిచ్చును. మన మంచినడత యేకదేశ కాలములలో నివర్తించునది కాదు. మనతోను మనతో సంబంధపడు వారితో ముగియునది కాదు. మన సద్భావ సుగుణములు మన ముండు దేశమునను ప్రకాశములు గాక యన్య దూర దేశములయందును వ్యవహారాను పూర్వకముగ బ్రజ్వలించును. అనేకులు తామా నడత నవలంబింప గోరుదురు. తమ పిల్లలకు బోధించి యట్టి ఘనమైన నడతను గఱపుదురు. దేశాంతరములలోనే గాక కాలాంతరములలో గూడ దానిని బ్రశంసించి తమతమ నడతలను దిద్దుకొనుచుందురు. అటులగానిచో గొప్పవారి చరిత్రములవలని ప్రయోజన మేమి? అవతారాదుల క్రియల నాశ్రయమును వర్ణించు రామాయణ భారతాదులు నిష్ప్రయోజనములే కదా?

గృహకృత్య వ్యవహారములందు నెడతెగని సుఖ ముండిన మన మంచినడత యంగలి చక్కదనమును నెటుల విశదముగా సూచించునో, యటువలెనే మనము నివసించు నిరుగుపొరుగులందు నావీధులందు, నావీధులను గల పట్టణములందును, జనించు వివేక సుఖానందములకు మనమే యుత్తరవాదులుగా నుందుము. మన నడత ప్రభావ మెట్టిదనిన నదుల సమూహముచే సాగరము విస్తీర్ణ మగునటుల మన మెఱుగకనే, మనము గోరకనే, మనయొక్క యుద్దేశము లేశమాత్రము లేకనే యితరుల నడతలను వృద్ధిజేయును.

సుగుణాభివృద్ధి వ్యాపకముచే నైన యానందము నిదివర కనుభవించితిమి గదా! ఇపుడు దుర్గుణరాజు ప్రభావ మెంతటిదని యరసిచూతము.

సుగుణ ప్రచారమునందుండు దుష్కరము దుర్గుణ వ్యాపకమునందు లేదు. ఇది మహా సుకరముగా వ్యాపించును. దుర్గుణ ప్రకోప మహాత్ములు రొయులకరేనిదే ప్రతియొక దుర్గుణము సహస్రావధి దుర్గుణముల బుట్టించును. ఈ క్రొత్తగా జనించినవి

పెరిగి వృద్ధి జెంది తద్రీతిగనే కోట్లకొలఁది యవగుణములకు జనకరూపకముగా దమతమ వంతుల దీర్చుకొనును. ఇంతకు దార్ష్టాంతికము నొక సజ్జనుడు చెప్పియున్నాడు. అదే, మన దట్టముగా నుండు నొక యడవియం బ్రవేశించి చూచిన స్వజాతీయ వృక్షములు వేర్వేరు ప్రదేశములందు వేర్వేరు సమూహములుగా నిలిచియుండును. అందుకు కారణ మేమని విమర్శించినట్లయిన నాయడవిని వేసి పెంచినవా రెవరు లేరు. ఆదరించి వృద్ధిబొందఁ జేసినవా రెవరును గారు. అనాది యనుటకు మొదలే తీరులేక. దాని మర్మ మేమనగా వాతవృష్టి వాహనద్వారమున స్వసిద్ధముగా నాటుకొను విత్తులును, కాకాదుల పురీషసహితబీజములును నానాటికి నంకురించి వృక్షములై యుత్తరోత్తర పాదపములకు గారణమై మహారణ్యమును సృష్టిజేసెను. ఈ యుపమానము దుర్గుణోపమేయమునకు పూర్ణోపమగా నెంచవచ్చును.

ఒక దుర్గుణమునకు, మన మెడమిచ్చిన దానిని గాలాంతరమున జూచుకొనునప్పుడు మహాఘోరదుర్గుణ కాననమై యేర్పడియుండును. ప్రథమ దుర్గుణమును వృద్ధింపజేసిన పశుప్రాయుడుగా, నన్నుపాసికొని యుండిన జాలు అది వీని నడుగక పోయె, వీని యాజ్ఞను నిరీక్షించకయె తనపనిని దాను స్వేచ్ఛగా జేయుచుండును. ఈ స్వయంకృతాపరాధమైన జాతాంగదోషము ముఖదర్శనమే దుఃఖకరము.

ఇట్టి దుర్గుణవంతుడు ప్రకృతి ప్రవాహమున గొట్టుకొనిపోవుట కాలాంతరాజ్ఞాన ప్రభావద్వారమని యెఱుగక, తాను అసహాయ శూరంధరుడై యీదుచున్నాననియు, నానదీ ప్రవాహమున దనకు దటస్థమగు భోగాభోగములు స్వసామర్థ్య ఫలములనియు మాయావిష్టుడై విఱ్ఱవీగి స్వయంకర్తృత్వాభిమానుడై, అన్య సుబోధ నిగ్రహపరుడై యుండి యొకానొక కాలమున బూర్వార్జిత కర్మబలముచేత దాను బడిపోవులుచుండుట బుద్ధితంత్రమనియు యిది ప్రవృత్తి తరంగిణి యనియు దనను సాగరముఖద్వారమువరకు దెచ్చినదనియు, ఇక నావగింజంత యశ్రద్ధ యయిన ననంతపారావార ప్రాప్తి యగునను జ్ఞానము దెచ్చుకొని, కొట్లాని, ధృఢముగా నిలిచి, తత్తటినీ నివృత్తి శాఖలలో నొకటిని బ్రవేశించి యొడ్డెక్కుటకు బ్రారంభించును.

వి. సు. మొదలియార్.

10. సుఖము విచిత్రమైన పదార్థము. ఒక డితరులకు దాని నిచ్చిన కొల్లల తనకు నెక్కుడుగా నుండునట్లు కనుగొనును.

11. జీవనమునకు నైకాగ్రచిత్తము ముఖ్యమైన వివేకమగును. చపలత కేవల దుఃఖకరము.

12. మతి మొకవిధముగ ప్రయోజనకారియగును. దానిచే మనుష్యుడు దేవుని దెలియ సర్వజ్ఞుడైన దేవుని సంక్షేపముగా జూపును. తత్వశాస్త్రము మరియొక ప్రయోజనమును జూపును. అది మనిషిని దేవుని పొవికి దెచ్చుటకు నాస్పదముగ నుండును.

13. నీవుకోరినది నీకు గలుగనియెడల, నీకు గలిగినదానితో తృప్తిజెందుము.

14. ఒకనేరు విద్యకు బదు నేర్లు వివేకము జేర్చవలెను.

15. గురువునకు శిష్యుడిచ్చు శ్రేష్ఠమైన దక్షిణ సాధనచతుష్టయసంపత్తిచే బరిశుద్ధమైన హృదయ మగును.

16. శ్రుతిస్మృతులు తరించిన గొప్ప మహానుభావులచే సంసార సముద్రమును దాట గోరువారికినుంచిన పడవలవంటివి.

17. నరులకు వారివారి యోగ్యతాను సారము పాపస్వరూపము గోచరమగును. జ్ఞాని నామరూపములచే మోహితుడై యంతరాత్మను మరుచుటయే పాపమని కేవల జ్ఞానికి దోచును.

18. పాలు మంచి పదార్థమైనను పాలు పాలని వీధుల నరచిన గావలసిన వారైన కొనెదరు. అట్లు తత్వముల నెంత వెల్లడి చేసినను ముముక్షువులే స్వీకరింతురు.

19. గాలి వీచునపుడు "తూర్పెత్తు" మను సామెతను జూడుడు. దేహమున వాయువు సంచరించుచుండగనె యాత్మను మరుగుపరచు కోశములను వడ్లనుండి పొట్టును వేరుజేయునట్లు విడదీయవలెనని స్ఫురించుచున్నది. అనగా చావునకు బూర్వమె యాత్మానుభవము గలుగజేసుకొనుట యావశ్యక మనుట యగును.

20. సకల సృష్టిజాలము పరమాత్మయందున్నది. అవి వేరుగా నున్నవని చూడక నాయందె యున్నవి చూడమని కృష్ణుడర్జునున కనుగ్రహించిన విశ్వరూప దర్శన రహస్య మిదియే.

21. ఒక వజ్రమును శుద్ధిజేసిన దాని ప్రకాశము వెల్లడి యగును అట్లు మనసును శుద్ధిజేసిన, అనగా, గుణములు లేకుండ జేసిన, ఆత్మ దనంతట దానె ప్రకాశమగును. ఆత్మ నిత్యశుద్ధమైనది. అవిద్యచే మలినమైనది.

Continued from page 14.

# గీ తా ప్రా రం భ ము.

## మొదటియధ్యాయము.

### అర్జునవిషాదయోగము.

### ధృ త రా ష్ట్రు ని వా క్య ము.

ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున నావారు పాండవులు యుద్ధసన్నద్ధులై కూడి, సంజయా! యేమి చేసిరి.

### సంజయునివాక్యము.

వ్యూహముగా బన్నిన పాండవసేనను జూచి రాజైన దుర్యోధనుడు ద్రోణాచార్యుని సమీపించి యీమాటలను బలికెను.• బుద్ధిశాలియై నీశిష్యుడైన ధృష్టద్యుమ్నుని చేత వ్యూహముగా బన్నిన యీ గొప్ప పాండవసేన, నాచార్యా, చూడుమా! ఇచ్చట యుద్ధమున భీమార్జునులకు సమానులైన గొప్ప ధనుష్మంతులైన శూరు లున్నారు, యుయుధానుడు, విరాటుడు, మహారథికుడైన ద్రుపదుడు, ధృష్టకేతువు, చేకితానుడు, పరాక్రమశాలియైన కాశీరాజు, పురుజిత్తుడు, కుంతిభోజుడు, నరశ్రేష్ఠుడైన శైబ్యుడు, వీరుడైన యుధామన్యుడు, శౌర్యశాలియైన యుత్తమౌజుడు, సౌభద్రుడు, ద్రౌపదేయులు, వీరందరు మహారథికులే. మన సేన రక్షకులలో శ్రేష్ఠులైనవారిని మీకు జ్ఞాపకార్థమై ద్విజోత్తమా! యికను జెప్పెదను. మీరును భీష్ముడును, కర్ణుడును, యుద్ధమున జయముగల కృపుడు, నశ్వత్థామయు, వికర్ణుడును, సౌమదత్తుడు, నింక నానా శస్త్రాస్త్రముల ప్రవీణతగలవారై యుద్ధమున విశారదులై నాకొరకు దమ ప్రాణములను ద్యజించిన యితరులనేక శూరులు గలరు. మన సేన భీష్మునిచేత రక్షితమైనను జాలన ట్లున్నది. వారిసేన భీమునిచేత రక్షితమైనను జాలిన ట్లున్నది. మీరందరును సకల వ్యూహమార్గముల వారివారికి నేర్పఱచిన స్థానముల నుండినవారై భీష్ముని నేర రక్షించవలెను. ప్రతాపశాలియై కురువృద్ధుడైన పితామహుడగు భీష్ము డతనికి హర్షము పుట్ట బిగ్గరగా సింహనాదము జేసి శంఖమును బూరించెను. అపుడు శంఖభేరులు డోలు మృదంగములు గోముఖములు మ్రోయ నాశబ్దము గొప్పమ్రోతగా గనబడెను. అప్పుడు తెల్లగుఱ్ఱములు కట్ట

బడిన గొప్పరథముననుండిన కృష్ణార్జునులు తమ దివ్యశంఖముల నూదిరి. హృషీకేశుడు పాంచజన్యమును, ధనుంజయుడు దేవదత్తమును, భయంకర వ్యాపారముగల భీముడు పౌండ్రమను మహాశంఖమును బూరించిరి. ధర్మరాజనంత విజయమును నకులసహదేవులు సుఘోష మణిపుష్పకములను, యుత్తమ ధనుస్సుగల కాశీరాజును మహారథికుడైన శిఖండియు దృష్టద్యుమ్నుడును, విరాటుడును, నిర్జయుడైన సాత్యకియు, ద్రుపదుడును ద్రౌపదేయులును, మహాబాహువైన సౌభద్రుడును వేరువేరుగా దమ శంఖముల నూదిరి.

భూమ్యాకాశములను బ్రతిధ్వని బుట్టించు నా సంకులధ్వని ధార్తరాష్ట్రుల హృదయములను భేదించెను. అపుడు, మహీపతీ! వరుసగా నిలిచి బాణములను వేయనున్యుక్తులైన ధృతరాష్ట్రపుత్రులనుజూచి కపిధ్వజము గల పాండు నందనుడైన యర్జునుడు దన వింటిని జేకొని కృష్ణునిగూర్చి యిట్లు పలికెను

## అర్జునుని వాక్యము.

అచ్యుతా! ఈ రెండు సేనల మధ్యయందు నా రథమును నిలుపుము. ఈ రణరంగమున నేనెవరితో యుద్ధము జేయవలెనో యుద్ధమపేక్షించి యిచ్చట వచ్చి నిలచిన వారలెవరో చక్కగా జూచెదను. దుర్బుద్ధిగల దుర్యోధనునకు యుద్ధమున హర్షము గలిగించ నిచ్చట యుద్ధ సన్నద్ధులై వచ్చిన వారలను జూచెదను.

## సంజయుని వాక్యము.

" ధృతరాష్ట్రుడా! ఇట్లర్జునునిచేత బ్రార్థింప బడినవాడై శ్రీకృష్ణుడు భీష్మద్రోణులు మొదలగు సకల రాజుల యెదుట రెండు సేనల మధ్యమున రథమును నిలిపి అర్జునా! ఇక్కడ చేరిన కౌరవసేనను జూడుమా యనెను. అప్పుడు రెండు సేనల నున్న పినతండ్రులను, పెత్తండ్రులను, తాతలను, గురువులను, మేనమామలను, సహోదరులను, కుమారుల, నన్నదమ్ములను, మనుమలను, మిత్రులను, మామలను, సుహృదులను జూచెను. ఈ సమస్త బంధువులనుజూచి కేవల దయాపరుడై దుఃఖించి యిట్లు పలికెను.

(సశే. ము.) *For Continuation see p. 65.*

# ఆత్మ—జ్ఞాత.

మానవుని స్వభావమును విచారించుటయందు వాడు వాడుకొను వాహనముల నుండి వానిని, అనగా, వాడు ధరించిన వస్త్రములనుండి జీవము గల యాత్మను మేము వేరు చేయుదుము. ప్రకృతియొక్క వివిధములైన పదార్థములవల్లను, వాని ద్వారా గాను పని జేయునపుడు సృష్టియొక్క రూపము లెన్ని భేదములై యున్న నాత్మ యొక్కటే. ఒక యాత్మమాత్ర మున్నదనుమాట, యా మాటయొక్క పూర్ణాభిప్రాయ ప్రకారము, సహజముగా సత్యమై యున్నది. సూర్యుని నుంచి కిరణములు వెలువడు నట్లు సత్యమైన మానవ స్వరూపులగు జీవులు బరమాత్మయొక్క కిరణములే. "నేను వాడ"ని ప్రతి జీవుడనుకొనవచ్చును. అయితే మన ప్రకృత విషయమునకు నొక కిరణమును గ్రహించుదము. అది రూపములలో దాచబడి యున్నను దాని భిన్నత్వమున గూడ దాని స్వకీయమైన యేకత్వమును మనము దృఢీకరింప నగును. ప్రజ్ఞ యొక్కటే. దాని విచారమునకై దానియందు మనము విభాగములు జేయుదము. ఆ విభాగము లధోలోకములయందు నడిపించు పనిచేయు నవయవములయొక్క ఖండమైన గ్రహణశక్తి నుంచి కలిగిన భ్రమలుగూడ నగును. జ్ఞానేచ్ఛాక్రియలను మూడుభావములవల్ల వివిధములుగా నాత్మనుంచి సృష్టిప్రకాశ మగును. వీనివల్ల వివిధములైన సంకల్పములు కోరికలు కార్యములు గలుగును. ఇందువల్ల నాత్మ పదార్థమున విభాగము గలుగదని మనము మనసున నుంచుకొని యెప్పుడు మరవకూడదు. పూర్ణాత్మయే తెలియును. పూర్ణాత్మయే యిచ్ఛయించును. పూర్ణాత్మయే కార్యకారి యగును. దాని కృత్యములు గూడ బూర్ణముగ భిన్నములు కావు. అది దెలియునప్పుడది యిచ్ఛయించి కార్యకారి గూడ యగును. అది కార్యకారి యైనప్పు డది తెలిసి యిచ్ఛయించును. అది యిచ్ఛ యించునప్పు డది గార్యకారి యగుటగాక తెలియును. ఒక సమయమున నేదో యొక కృత్యము ప్రబలమై కొన్ని వేళలయందు నితర కృత్యములను మరుగుపరుచునంత ప్రబల మగును. అయితే యామాటయందు గేవల భిన్నమైన తెలియుటయందు మాత్రము తీవ్ర యేకాగ్రత గలిగినను క్రింద జేయబోవు సమ్యక్పరిశోధనవల్ల విశద మగునట్లంతర్గతమైన కార్యకారి యగుట, యంతర్గతమైన యిచ్ఛయించుట, యని దేము సిద్ధమై యున్నది.

ఈమూటిని 'నాత్మయొక్క మూడుభావము'లని చెప్పితిమి. మరి కొంత విమర్శ జేసిన నిది సులభముగా గ్రాహ్య మగును. ఆత్మ యూరకున్న దాని సముఖమున నుంచు పదార్థముయొక్క పోలికను బొందిన దాని జ్ఞానభావము వెల్లడి యగును, ఆత్మ తన స్థితియందు మార్పుగోరుచు నేకాగ్రత బొందిన దాని యిచ్ఛ భావ మగు పడును. ఒక పదార్థ సముఖమున నాత్మ యా పదార్థమును దడవుటకు దన శక్తిని బ్రసరింప జేసిన దాని క్రియాభావమగుపడును. ఇట్లే మూడాత్మయొక్క వేరు విభాగ ములు గావనియు త్రివిధ పదార్థము లొకటిగా జేరిన మిశ్రమము గాదనియు,

అయితే మూడువిధములుగా వ్యక్తమగు నొక యవిభాజ్యమైన పూర్ణ పదార్థ మున్న దని స్పష్ట మగుచున్నది.

ఆత్మయొక్క మూల తత్వస్వరూపమును దానిని జేర్చుకొనుటకంటె విశదీకరించుట సులభము గాదు. మనలో బ్రహ్మానియందు దా నున్నానని తెలిసి భావించి నిరంతర ముండు నేకీభావ మాత్మ యగును. ఏమనిషియు 'దాను లేడ'ని యనుకొన జాలడు. 'నేను లేన'ని ప్రశ్నయందు దనకు దాను నిర్ధరించుకొన జాలడు. ఆత్మ జీవనమునకు ననివార్యమైన మొదటి యాధార మగును. శ్రీశంకరాచార్యులవారి శారీరకభాష్యమునకు భామతి యను వ్యాఖ్యానమున వాచస్పతి మిశ్రుడు సెప్పినట్లు 'నే నున్నానా' లేక 'లేనా' యని యొకడు సందేహించడని భగవద్దాసు సెప్పియున్నాడు. 'నే నున్నాను' అనెడి యాత్మభావ మన్నిటికంటె ముందు కలిగి సర్వవాదములకు మించి యతీతమైయున్నది. ఏవిధమైన రుజువు నాభావమును దృఢీకరించ జాలదు. ఏ ఖండన దానిని నగ్గలపరచ జాలదు. రుజువు ఖండన రెండును 'నే నున్నాన'ను దాని ననుసరించి కలిగినవి. 'నే నున్నాన'ను నది విభాగించుటకు వీలులేని కేవల 'అస్తి' భావము. దానినిగురించి వృద్ధిక్షయములు తప్ప వేరు చెప్పుటకు వీలులేదు. 'నే నెక్కువ' యనునది సంతోషముయొక్క ప్రకాశము. 'నేను తక్కువ' యనునది దుఃఖముయొక్క ప్రకాశము.

'నే నున్నా న'ను దానిని మనము పరిశీలించిన నది మూడు భాగములుగా ప్రకాశించుట గనుగొనెదము. 1. అనాత్మయొక్క యంతర ప్రతిఫలము, జ్ఞానము, సంకల్పముల మూలము, 2. అంతర యేకాగ్రత, యిచ్ఛ, కామముల మూలము, 4. బహిఃప్రచారము, క్రియాశక్తి, కార్యముల మూలము. 'నేను దెలిసికొందును' లేక 'నేను సంకల్పించుదును' 'నేనిచ్ఛయింతును' లేక 'నేనుగోరెదను' 'నేను గార్యకారి యగుదును' లేక 'నేను గర్మజేయుదును', ఇవి యవిభాజ్యమైన యాత్మయొక్క లేక 'నే నున్నాన'ను దానియొక్క మూడువిధములైన రూఢియైన వాక్యములు. సృష్టి జాలమంతయు నీమూడువిభాగములుగా నేవిధముననైన నేర్పడిచ నగును. ఆత్మలోకములయందు నీమూడు విధములుగా మాత్రమే వ్యక్త మగుచున్నది. త్రివిధప్రధానముల నుండి సకలవర్ణములు గలుగునట్లు, ఆత్మయొక్క జ్ఞానేచ్ఛాక్రియాశక్తులవల్ల నసంఖ్యాకము లైన సృష్టిజాలము సిద్ధమగుచున్నది. ఆత్మ ఇచ్ఛయించువాడు. ఆత్మ కర్త. ఆత్మ జ్ఞాత. శాశ్వతముగ నుండువా డతడొకడే. దేశకాలములయందు భిన్నత్వమునకు నతడే మూలము. ఆత్మయొక్క సంకల్పభావము లేక జ్ఞాతభావమును మనమిప్పుడు పరిశీలించ యత్నించుచున్నాము.

37. అనుదినము షట్కర్మలు చేయుచు దేవతలను నతిథులను దృప్తి జెందించి హోమశేషమును భుజించు బ్రాహ్మణుడు దురవస్థల నెన్నడు పొందడు.

38. సంధ్యోపాసనము, స్నానము జపము, హోమము, వేదాధ్యయనము, దేవతాపూజ, వైశ్వదేవ యజ్ఞము, అతిథి సత్కారము, బ్రాహ్మణునికి విధించిన షట్కర్మలు.

39. వైశ్వదేవము జేయుచున్న సమయమున నింటికి నెవడైన వచ్చిన పండితుడుగాని మూఢుడుగాని, మనోహరుడుగా నియాదరణీయుడుగానున్న నతిథి యజమానుని సద్గతిజేర్చును గనుక నతని నతిథిగా భావించవలెను.

40. దూరప్రయాణముచేత, నాయాసముచేత ( మసడి డస్సిన మనిషి వైశ్వదేవహోమసమయమున నింటిదగ్గరకు వచ్చిన నతని నతిథిగా భావించవలెను. ఆసమయమునకు ముందువచ్చినవా డతిథి గానేరడు.

41. అతిథిని నతని వ్రతము నడత గోత్రము గురించి ప్రశ్న జేయకూడదు. అతిథి దైవస్వరూపము గనుక గృహస్థు డతిథిని నధికప్రసంగముచేత నేమియు ప్రశ్నజేయక పరామరిక చేసి సత్కరించవలెను.

42. ఒకని స్వంతగ్రామమున వసించు బ్రాహ్మణుడుగాని పనిమీద నొకని యింటికి వచ్చిన బంధువుగాని యతిథి గాడు. అకస్మాత్తుగా వచ్చినవాడే యతిథి యని యెంచుకొనదగును.

43. ఆదినమున నాతిథ్యము మఱొకచో నంగీకరించని యతిథియు, వ్రతమును నుసరించు బ్రాహ్మణుడు, ననుదినము వేదములు చదువువాడు అపూర్వ యతిథులన బడుదురు.

44. వైశ్వదేవ హోమము జేయుచున్న సమయమున నింటికి నొక సన్యాసి వచ్చిన వైశ్వదేవమునుండి యొక కబళము నతనికి నివ్వవలెను.

45. యతులు బ్రహ్మచారులు భిక్షము గానన్న కబళము లివ్వదగును. ఈ యిరుతెగల సన్యాసులకు నన్నమిడక భుజించువారు చాంద్రాయణ వ్రతము సలుపవలెను.

46. యతికి మొదట నర్ఘ్యమిచ్చి పిదప నన్నమిడి మరల నర్ఘ్య మివ్వవలెను. ఇట్లిచ్చిన భిక్షము మేరుపర్వతమువలె నున్నతమై యర్ఘ్యము సముద్రమువలె నపారమగును.

47. వైశ్వదేవ హోమమును జేయునప్పుడు కలిగిన లోపమును హరింప సన్యాసి సమర్థుడు. అయితే సన్యాసికి గలుగజేసిన దుష్కృతము వైశ్వదేవ కర్మవల్ల నివారణ కానేరదు.

48. వైశ్వదేవమును జేయక భుజించు ద్విజులు నరకబాధ లనుభవింతురు, వారి కర్మలు వ్యర్థములు.

49. ఒకడు దలమీద రుమాల బెట్టుకొని తినుననట్టియు, దక్షిణముతట్టు ముఖము ద్రిప్పుకొని తినునట్టియు, యెడమకాలిమీద నెడమచేతిని మోపుకొని తినునట్టియు తిండిని రాక్షసులు దినెదరు.

50. బ్రహ్మచారికి మడిచిన విడెమిచ్చినను, యతికి బంగార మిచ్చినను, దొంగను మన్నించినను, పరలోకమున నొకరికి నరకప్రాప్తి యగును.

51. పాపి, చాండాలుడు, పితృహత్య జేసినవాడైన నతిధి వైశ్వదేవము జేయు సమయమున నొకని యింటికి వచ్చిన నాతను స్వర్గపదవి గలిగించువానిగా గౌరవించవలెను.

52. అతిధి నిరాశతో నొకయింటినుండి వెనుకకు దిరుగ యజమానునియొక్క గతించిన పితృదేవతలు వేయిసంవత్సరము 'లన్నపానాదులను స్పృశింపరు.

53. వేదపారగులైన యోగ్యులను విడిచి యున్నము భుజించు బ్రాహ్మణుడు పాపమునే భుజించును.

54. ముండ్లు మడుగు (Swampy) లేని పొలమునకు బ్రాహ్మణుని నోరును బోల్చవచ్చును. అట్టి భూమియందు విత్తనము వేయువాడే సరియైన వ్యవసాయ పరుడు.

55. మంచి పొలములందు విత్తనములను వేయవలెను. సుపాత్రులకు దాన మియ్యవలెను. మంచి భూమిలోగాని సుపాత్రునకుగాని యిడినది క్షీణించదు.

56. వేదములను నిర్లక్ష్యముజేసి భిక్షాటనమువలన జీవనముజేయు బ్రాహ్మణు లుండు గ్రామనివాసులను రాజు దండించవలెను. ఏలన వారె బ్రాహ్మణరూపమున నుండు దొంగలను బోషించుచుందురు.

57. క్షత్రియులు తమకు లోబడిన జనులను రక్షించవలెను. తమ శత్రుసైన్య మును మహాపౌరుషముతో జయించి ధర్మనియమముల ననుసరించి దేశమును పాలించ వలయును.

58. రాజ్యమును భోగమును స్థిరముగా స్థాపించినను వంశపారంపర్యముగా నుండజాలను. కత్తితో జయమును బొందుము. రాజ్యభోగము వీరులకుమాత్రము తగినది.

59. తోటలోని పుష్పవృక్షములనుండి యొక్కొక్క పుష్పము నేరి సంగ్రహించి పూలవాడొక హారమును గట్టుభంగి తన ప్రజలకు దొందర గలిగించక ప్రతిరైతునకు తేలికగైన పన్నుగట్టి రాజు వసూలు చేయవలెను. తోటలోని చెట్లనన్నిటిని గొట్టి బొగ్గులను జేయు బొగ్గులవానివంటివాడు రాజు కానేరడు.

60. రత్నములను, లోహములను వ్యాపారము చేయుట, పశువులను బోషించుట, వర్తకము, వ్యవసాయము, ఇవి వైశ్యుడు చేయవలసిన వృత్తులు.

61. శూద్రులయొక్క యుత్తమధర్మము బ్రాహ్మణులను సేవించుటయే. వారితరధర్మముల ననుష్ఠించుట వ్యర్థము.

62. ఒక శూద్రు డుప్పును, దేనెను, నూనెను, పాలను, పెరుగును, మజ్జిగయు, వెన్నను, విక్రయించుట వల్ల బాపము లేదు.

63. శూద్రుడు నిషేధమైన వస్తువును దినకూడదు. నిషేధించిన స్త్రీతో సంయోగము జేయకూడదు. అట్లు కాకున్న వాడు నరకమున శిక్షింపబడును.

64. నల్లావుపాలు ద్రాగిన, బ్రాహ్మణస్త్రీని పరిచయము జేసికొన్న, వేదములను బఠించిన, శూద్రుడు నరకమున శిక్షింపబడును.

## రెండవయధ్యాయము.

1. మహానుభావుడైన పరాశరులచేత జెప్పబడిన ప్రకారము గృహస్థుని ధర్మములను విశదపరచుచు కలియుగమున చతుర్వర్ణములవారికి నిర్బంధములయిన ధర్మములనిక జెప్పుచున్నాను.

2. అనుదినము షట్కర్మనిరతుడైన బ్రాహ్మణుడు జీవనాధారముకై కృషి జేయవలయును.

3. ఒక మడకకు ఎనిమిదియెద్దులు గట్టుట మిక్కిలి ధర్మమైనది. ఒకమడకకు నాలుగెద్దులను గట్టుట ధర్మముగాదు. పాపహేతువుగూడ గాదు. నాలుగెద్దులచేతనొక మడక నీడ్వజేయువారు క్రూరులె. ఒకమడకకు రెండెద్దులు గట్టినవారిని యెద్దులను జంపువారని తెలియవలయును.

4. ఆకలిగొని, దప్పిగొని, లేక యాయాసము జెందిన యెద్దును మడకకు గట్టకూడదు. అంగహీనమైన, వ్యాధినొందిన లేక బీజములు దీసిన యెద్దును బ్రాహ్మణుడు తనబరువు మోయించుట కుపయోగించకూడదు.

5. ఆరోగ్యము గలిగి బలమైన యవయవములు గలిగి బీజములను దీయని యొక శక్తిగల యెద్దును మధ్యాహ్నమువరకు మడకకు కట్టవచ్చును లేక గంతవేయ వచ్చును. ఆకాలము మీరినతరువాత నట్లు చేయరాదు. పిమ్మట ద్విజుడైన యజమానుడు స్నానము చేయవలయును.

6. ఆవెనుక నతడు జపహోమ దేవతాపూజ మొదలగు నిత్యకర్మలను గమనించవలయును. వేదములను జదువవలయును. ఒకడిద్దరు, ముగ్గురు, లేక నల్గురు స్నాతక బ్రాహ్మణులను భుజింపజేయవలయును.

7. తాను కన్ని వ్యవసాయము జేసినపొలములోన తన స్వంతప్రయాసచేత సార్జించిన ధనముతో ద్విజులు పంచయజ్ఞములను నిత్యధర్మయజ్ఞములను జేయవలయును. క్రతువు జేయుటకు మస్త్రములను దెలిసికొనవలయును.

8. నూనెనుగాని, యితర కూరగాయల రసమును బ్రాహ్మణు డమ్ముట ధర్మవిరుద్ధము. అయితే వస్త్రము, యితర కాయధాన్యము, గడ్డి, ద్రాను, వంటచెరుకులు మొదలయినవి విక్రయింపవచ్చును.

9. ఒక చేపలు పట్టువాడు సంవత్సరము పొడవున చేపలను జంపి కట్టుకొను పాపము నెంతయును గొనయందు గలిగిన మడకతో భూమిని గన్నిన వ్యవసాయపరుడొక్కదినమున గట్టుకొనును.

10. ఒక పాశకుడు (వలపన్నువాడు), చేపలవాడు, వేటకాడు, పక్షులను బట్టువాడు, లోభి, వ్యవసాయపరుడు, వీరందరొక పాపమునే, సమానమైన పాపమునే చేయుదురు.

11. ప్రాణహాని గలిగించు రోలు, విసరరాయి, పొయ్యి, నీటికుండ, చీపురుకట్ట, యివియైదును గృహస్థునియింట పంచసూన లనిపించుకొనును.

12. ఒక ధర్మయజ్ఞము జేయుటవలన భూమి గున్ని చెట్లుకొట్టి, మృగకీటకములను జంపిన పాపముల నుండి విముక్తుడగును.

13. ధాన్యరాశియొద్ద కూర్చుండినవాడు బ్రాహ్మణులకు దానము చేయకున్న బ్రహ్మహత్య చేసినవాడగును.

సశేషము.

వారిని నమ్మక వారి బోధనలను నమ్మి కైకొనక వారి చర్యలను వారు మనకెట్లు గతిజూపునది వివేకవిచారములు లేక వివిధసంశయ విపరీతభావనలచే మతిభ్రమణము జెందిన నామమహాత్ములుద్దేశించిన కార్యమునకు మనము సాధనభూతములుగాక మనసభ కేవల లౌకికసభయయి లోకమున కొంత మేలును జేయునుగాని లోకమును పాలించు మహానుభావులయొక్క కూటముయొక్క కార్యమును నిర్వహించుటకు మనకు గలిగించిన సమయమును వ్యర్థము జేయగలవారగుదుము. బ్లావెట్స్కి యనునామె ఆల్కాటను నతనిద్వారా యీబ్రహ్మవిద్యాసమాజమును లోకపాలకులయిన మహానుభావులు సంస్థాపించిరి. వారే యిప్పుడు పోషకులై యున్నారనుటకు సందియం జేమియును లేదు. ఈ కాలమున నందు గానికంటె శ్రేష్ఠమైన నాగరికత ముందు కలుగబోవుటకు గిదా యిట్టిప్రయత్నములు చేయబడుచున్నవి. అట్టి నాగరికత గలుగుటకు నిప్పటి సాగర్యముల నుండు నాటంకములను లోకమున నుండు ననేక విధములయిన మతాభిప్రాయములను మనిషి మనిషిని వేరుజేయు ననేక విధములయిన యభిప్రాయములను విమర్శజేసి, యీదృశ్యప్రపంచమువలెనే మన యింద్రియములకు గోచరముగాని వురియొక ప్రపంచము సత్యముగా నున్నదని జ్ఞానదృష్టిచేత నమ్మకము బుట్టునట్లు జేసె యీభేద బుద్ధులను నివారించవలసి యున్నది. ముందు రాబోవు స్థితికి విశేషప్రయత్నము గావలసి యున్నది. గనుక ఆ మహానుభావు లీసభామూలకముగా నట్టిప్రయత్నమును జేయ బూనుకొని యున్నవారు. ఈ సభయందు బోధించు సకలాభిప్రాయములు భక్తితో నివ్వబడును. వానిని నందరు విచారణలేక నమ్మవలసిన పనిలేదు. ఆధారములేని విషయములని కొందఱు తలచవచ్చును. అయితే శ్రద్ధగా సాధనజేసిన సిద్ధుల యనుభవజన్యమైన సిద్ధాంతములుగా తెలియ నిర్ధారణము జేసుకొన్నవారికి ననుభవవేద్య మగువిషయములుగా నుండును గనుక గమనించి యింగు వ్రాసినవి యము నారగించి జీర్ణించుకొనవలయును.

## మా పురాణము.

నారదుడు త్రిలోకసంచారికదా? అతడనుదినము త్రిమూర్తులను సేవించుచుండును. ఒకనాడు కైలాసమునకు నుండు శివుని దర్శించి వెళ్లెను. అతడు వెళ్లగానే యతడు కూర్చుండిన ప్రదేశమును గోమయముతో శివుడు శుద్ధిజేయుచుండెను. ఇట్లు చేయుట కొన్నాళ్లవరకు నారదునికి దెలియలేదు. ఒకనాడాకస్మికముగ శివుని దర్శించి పోవుచుండ నెందుకో వెనుకకు దిరిగి చూచెను. శివుడు యథాప్రకారముగా నతడు నిలుచున్న ప్రదేశమును శుద్ధిజేయుచుండగని యా మెందుకిట్లు శుద్ధిజేసెదవని శివుని నడిగెను. నీవు

గురువులేడు. గనుక నీవశుద్ధుడవనెను. అంతట నారదు డాశ్చర్యపడి యనుదినము లోక జీవనులైన త్రిమూర్తులను సందర్శించుచున్నను నాకు గురువులేడని యిట్లు చెప్పుట విచిత్రముగా నున్నది. దయ చేసి నన్ను శిష్యునిగా గైకొనవలెనని యనేక విధముల శివుని బ్రార్థించెను. అప్పుడు శివుడు దయార్ద్రహృదయుడై నీవు రేపు ప్రాతఃకాలమున మొదట జూచువాడె నీకు గురు వగునని యనుగ్రహించెను. అంతట నారదుడు వెళ్లెను. మఱునాడు ప్రాతఃకాలమున సమాధినుండి బహిర్ముఖుడై యుండ నొక జీర్ణవస్త్రము ధరించిన రొయ్యలు పట్టువానిని జూచెను. అప్పుడు నారదుడు దిగ్గున లేచి యతని పాదపద్మముల శరణు నొందెను. ఆ చేపలవా డాశ్చర్యపడి నారదుని ననేకదుర్భాషల దిట్టి తాను గురువగుటకు యోగ్యత యించుకయైన దనకు లేదని తిరస్కరించెను. అంతట శివుని యాజ్ఞానుసారమున దాను జూచిన మొదటి వానిని గురువుగా [illegible] గొని యున్నను తెలివిలేక యా చేపలవాని తిరస్కారమునకు సంతృప్తి [illegible] యా చేపలవాని వేషమును యతని యసహ్యమైన గర్వాపలపి సహింప వివేకములేక తన దారిపట్టుకొని వెళ్లెను. రెండవనాడు మరల నారదుడు తాను ముందటికంటె నెక్కువ పరిశుద్ధతగలవాడని యెంచి శివుని దర్శింప గురువును గనుగొంటివా యని యడిగెను. నారదుడు మనఃపూర్వకముగా బ్రత్యుత్తరము జెప్పనంతన నారదుడు వెళ్లగానె యతడు కూర్చున్న స్థలమున నొక మోకాలి బంటిలోతు త్రవ్వి యక్కడి మంటిని వెలుపల పారవైచ నాజ్ఞాపించెను. నారదుడు దానిని గని శివుని బ్రార్థించెను. "నీవు గురుద్రోహివి" నూటయెనుబది జన్మము లెత్తిగాని నీ పాపపరిహారము గాదని శివుడు సెలవిచ్చెను. నారదుడు చిన్నవాడై సంసార సుఖము లనుభవించ సామర్థ్యము లేదని యా పాప పరిహారమునకు సులభసాధ్యమైన ప్రాయశ్చిత్తమును విధించవలయునని పలువిధముల శివుని బ్రార్థింప నీగురువు నడుగుమని సెలవిచ్చెను. అప్పుడు నారదుడు దీనుడై విచారముతో గంగానదీతీరముజేరి యచ్చట పుణ్యాగ్రము కనిన చేపలవానిని దర్శించి "ఓ మహానుభావా! నాపాప పరిహారము జేయుమార్గమును సెలవిమ్మ"ని ప్రార్థించెను. అప్పుడు చేపలవాడు తనకి తెలియదని యనేకవిధముల నారదునకు బ్రత్యుత్తరమిచ్చెను. అయినను నారదుడంతతో తృప్తిబొందక పలుమాఱు వివిధముగ ప్రార్థింప నతడు నీకు శివుడు విధించిన జన్మముల సంఖ్యగలిగిన నమస్కారములు శివునికి జేయ నీ పాపపరిహార మగునని సెలవిచ్చి యంతర్ధాన మాయెను. అప్పుడు నారదుడు సంతోషచిత్తుడై కైలాసముజేరి శివునికి నూటెనిమిది నమస్కారములు జేయ నతడు సంతోషించి యొక మనుజుని నొక గురువే యుద్ధరించునుగాని సద్గతిబొందుటకు వేరుమార్గము లేదని బోధించెను.

'Registered No. M 716.'

SWAN SERIES No. 3.

ఓం





A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఒక యాంధ్ర బ్రహ్మజ్ఞాన మాసపత్రిక.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 1.] మార్చి 1908. [సంచిక 3.

విషయసూచిక.

పుట.



చెన్నపట్టణము :

వైజయంతీ ముద్రాశాలయందు ముద్రింపబడినది.

గుత్తి హంసశాల మానేజరుగారికి వ్రాసుకొనవలయును.

సంవత్సరమునకు చందా 1 రూపాయ.

# THE THEOSOPHICAL SOCIETY.

# బ్రహ్మవిద్యా సమాజము.

మానవకోటి యెక్కువ వృద్ధిని బొందుటకు దగిన బుద్ధికుశలతయును నీతిని బహుశా పొందియుండవచ్చును. దానిని పొందుటకు మానవుడు తన స్వభావమును గురించియు దానియందు నంతర్గతమైన సిద్ధులయొక్క జ్ఞానమును దెలుసుకొనుట యావశ్యకము. తా నొకభాగముగా నుండు జీవకోటి వృద్ధియొక్క జ్ఞానమును వానికి వెల్లడిజేయుట యావశ్యకమైయున్నది. ఈ యుద్దేశమును బట్టియే కొబో లిప్పుడు బ్రహ్మవిద్యా సమాజముయొక్క పుస్తకములయందు గల యద్భుతమైన తత్వములను వెల్లడి జేయబడినది. వానియందు జీవుని గొప్ప యాత్రను జక్కగా వ్రాయబడియున్నది. అదిగాక దైవత్వమును సంపాదించుటకు వాడు సేయవలసిన గొప్ప సాధనములు గూడ సూచింపబడి యున్నవి. ఇట్లు వెల్లడిజేయుట యెందుకు? రహస్యముల నెందుకు నిట్లు కొంత వెల్లడిజేయబడినది? ఈ బ్రహ్మవిద్యాసభ యుద్దేశమెద్ది? ఎందు కిది గలిగినది? వానికి దెలుపు నియముల జ్ఞానము ద్వారా సృష్టియొక్క సంకల్పమున దా నెట్టికార్యమును నిర్వహింపనున్నవాడో దానిని దెలిసి తనయొక్క గతిని నిర్ధారము చేసుకొని గొప్ప సంకల్ప నిర్వాహమునకు దైవసంకల్పము ననుసరించి యాకార్యము నిర్వహించుటకు దానుగూడ సంతోషముగా జేయునని యుండగూడదా? ఆ మహానుభావులు మానవుల వృద్ధిని జాగ్రతతో గనిపెట్టుచు నొక పావన కూటముగా జేరి లోకులకు గనబడక తెలియబడక జనులయొక్క వృద్ధికి సాధనభూతులయి కాలము గడుపుచున్నారు. ఇప్పు డీమానవకోటి యుండు స్థితినిబట్టి క్రొత్తమార్గ మవలంబించి సహాయమును జేయుచున్నారు. యీ ప్రపంచముయొక్కగతిని సన్మార్గమున నడుపువారి మహాకార్యమునకై మానవులయందు వారితో సహకారులను వెదకుచున్నారు. వారి మహోద్దేశమును సాధించుటయందు కుశలతగా సహాయముజేయ ప్రారంభించుటకు సమయమును గలుగజేయుచున్నారు. సాధారణముగా మన యనుభవమునందు గార్యసాధకులు విశ్వాసపరులై యొద్దికగా జేరి కార్యోద్యుక్తులై జేయవలసిన కార్యములను జక్కగా దెలిసిన నేపనియైన సులభమైనట్లు ఆ మహానుభావుల కార్యముగూడ నొకరికొకరు సహాయము జేసికొని వారియందు విశ్వాస ముంచి నేర్చుకొనుటకు యిష్టపడి వారుజెప్పినత్రోవ నడచి స్వార్థపరత్వములేక లోకమున సహాయము జేయుటకు సిద్ధమై యుండిన వారిపనికూడ సులభముగా నుండును. ఇట్లు చెప్పుటచేత మనకుండు స్వతంత్రశక్తిని పోగొట్టుకొని మనయందు విశ్వాసముగాని సాధనగాని లేక నిరాశ్రయమైన సాధనములను నేర్చుటయని చెప్పుట గాదు. మరియొకరిని నమ్మి వాని ననుసరించువారికంటె నెక్కువ యుప

ఓం

# హంస.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 1.] మార్చి 1908. [సంచిక 3.

## నారదుడు.

అనేక యుగములపర్యంతము వ్యాపించియుండు నితని నెలకొలది వివిధములయిన పరోపకారములను పరిగణించుటకు నాదిశేషునకైన నలవికాదు. ఈ దివ్య మహర్షి నడతనుగురించి పైన జెప్పిన వరములు సర్వోన్నతమైనవి సత్యమైనవి యని నిరూపించుటకు కొన్ని వృత్తాంతములు మాత్రము పేర్కొనుచున్నాము.

పూర్వకాలమున ప్రాచీనబర్హిస్సను రాజొక డుండెను. అతడు యజ్ఞముల ననంతములుగా జేయవలెనని ప్రతిజ్ఞ జేసికొని యుండెను. అసంఖ్యాకములైన పశువులను జంపి యాగము చేసినను, అతడు తృప్తినొందక యింక నధికముగా జేయుచుండెను. యజ్ఞము లేదా యొకగతికి సాధనభూతమనియు, విధ్యుక్తము కంటె నెక్కువగ జేసిన పాపహేతు వనియు దెలియజాలకుండెను. ఆ రాజుయొక్క నియమములకును వేదోక్తమైన కర్మకాండమున నధికమై దృఢమైన విశ్వాసమునకు మెచ్చి యతడు చేయు ననంతమైన పశువధకు జాలిజెంది రాజునకు ధర్మమార్గము సూచింప దయాపరుడై నారదు డతనియెదుట ప్రత్యక్షమై కేవల యజ్ఞకర్మానుష్ఠానముల వ్యర్థమును బోధించెను. ఆ రాజు మహర్షిచే వినిన ధర్మసూక్ష్మములను గ్రహించజాలక యుండిన నామహర్షి యతనికి దివ్యదృష్టి ననుగ్రహించె నా రాజు దాను జంపిన పశువులన్నియు భయంకరాకారములతో నిప్పులవలె మెఱయుచున్న కంటిచూపులతో గుమిగూడి తన్ను జీల్చుటకు సిద్ధముగా నున్నట్లు జూచెను. అప్పుడు రాజు భయపడి 'నారదా నన్నురక్షింపుమా' యని వేడుకొనిన, నతడు మోక్షమార్గమునకు కేవల కర్మానుష్ఠానము చాలదని నిరూపించి శ్రేష్ఠమైన జ్ఞానమార్గ మతనికి నుపదేశించి తృప్తి జెందునట్లు చేసెను.

# నారదుడు.

మానవజాతియొక్క మూలపురుషులలో నొకడైన దక్షునికి యనున గూడ నిట్టి ధర్మనియమములను నారదు డుపదేశించెను. దక్షుడు లోకమున ప్రజలను వృద్ధి జేయుటకైయ నేక శిశువులను బుట్టించెను. అతడుద్దేశించిన కార్యములకువారు ఉద్యుక్త లగుటకు ముందు తగిన సామర్థ్యమును సమకూర్చుకొనుటకై కొంతకాల ముగ్రత పస్సు జేయు, వా రతని యాజ్ఞను గైకొని తపస్సు సలుప నారంభించిరి. అప్పుడు నారదుడు వారికి బ్రత్యక్షమై జ్ఞానమార్గము వారిదృష్టికి గోచర మగునట్లు చేసి, వా రుద్దేశింపబడిన కార్యములను నిర్వహింప జాలకుండునట్లు చేసెను. ఇట్లు మరల దక్షుడు రెండుమార్లు ప్రయత్నము జేసినను విఫలము సేయబడెను. తుదకు నామహర్షి జేయు విఘ్నములకు గోపోద్దీపితుడై తానే యాప్రయత్నమునకు బూనుకొన దలచు చుండ నారదు డతనియెదుట బ్రత్యక్షమై యతని కొమారులకు దాను జేసిన కృత్య ములు న్యాయములనియు, కర్మకంటె జ్ఞానము శ్రేష్ఠమనియు బోధించి యెంత ప్రయత్నము జేసినను సఫలము కానందున జ్ఞానమునకు దక్షు డధికారి కాడని తెలిసి సంసారమున మునుంగ బంధములు జేసుకొన నతనిని స్వేచ్ఛగా విడిచెను.

తండ్రి ధృవుని తన తొడపై నిడుకొనుట లేదనిన, నాబాలుడు కేవల విచారి ముతో నెవరు దిక్కులేక నిరాశ జేసుకొని దైవమును గూర్చి ప్రార్థించ బితృవాత్స ల్యముతో చిరునవ్వు నవ్వుచు దయాపరుడై, తండ్రి తిరస్కరించిన ఖిన్నుడైన నతనిని నూరడించ, వీణ మీటుచు నాకాశమునుండి దిగ నాప్పుడు సంతోషపరవశుడై యతనికి వందన మాచరించెను. ఆమహర్షి యాబిడ్డను గౌగలించుకొని వాని కన్నీళ్లు దుడిచి వాసుదేవుని మహాత్మ్యమును దేటమాటల నతనికి దెలియజేసెను. నాబాలుడు తపస్సుజేసి కొంతకాలమున దైవసాక్షాత్కారమును బొంది శాశ్వతమైన పదవిని బొంది యున్నాడని మనకందరకును దెలిసిన విషయమేకదా.

మా కల్పాదియందు ధృవుని మేనమామయైన ప్రియవ్రతుడను రాజు రాజ్య మును సన్యసించి యడవికి వెళ్ల నారదుడే యతని మార్గమున సమీపించి జ్ఞానోపదే శము జేసెను.

దేవపతియైన యింద్రుడు హిరణ్యకశ్యపుయొక్క గర్భవతియైన భార్యను బలాత్కారముగా బట్టి యామె గర్భమున నుండిన శిశువు దేవతలకు త్రిలోకములకు బాధలు గలుగజేయకుండ నడ్డగించ యత్నించి యామెను జంప నుద్దేశింప నారదు డతని నెదుర్కొని వ్యసనాక్రాంతురాలై దిక్కులేని యామెను దన యాశ్రమమున

రక్షించెను. అచ్చట నామెకు సకలమత ధర్మములను బోధించి భక్తిమార్గప్రవర్తకు రాలుగ జేయు, నామె గర్భమున నున్న శిశువు ప్రహ్లాదుడై పుట్టెను. ప్రహ్లాదుని ప్రభావము మనకందరికిని దెలసిన విషయమే కదా?

జ్ఞానమార్గ మవలంబించుటకు నసమర్థులైనవారిని గర్మమార్గాసక్తుల జేయుటకు గూడ నితడు ప్రయత్నించినా డనుటకు గూడ ననేక దృష్టాంతము లున్నవి. ధర్మపుత్రుని రాజసూయాగమున నియమించెను. ఆయాగము జరుగుచుండు సమయమున శ్రీకృష్ణుండు శిశుపాలుని వధజేయ నతడు శ్రీకృష్ణునియందు నైక్యము గాంగా నాశ్చర్యపడిన ధర్మపుత్రునకు జ్ఞానమార్గ మించుక సూచించెను. అట్లనే కృష్ణుని తండ్రియైన వసుదేవుడు మోక్షోపాయము నుపదేశింపుమని నారదుని ప్రార్థింప నతడు వసుదేవుని యాధర్మ్యమునకు విచారించి యొక యాగ మతనికి నియోగించి వెనుక సకలచరాచరములకు శ్రీకృష్ణుడే దైవస్వరూపమని తెలిపెను. వసుదేవు డత్యాశ్చర్యమొంది యప్పటి నుండి శ్రీకృష్ణుని సామాన్యముగ దన కొమరుడని భావించుటయం దజాగ్రతతో నుండెను. ఇట్లు నారదుడు గొందరిని గర్మయందు నియోగించుచు వెనుక కర్మవిముఖులుగా జేసి క్రమమైన జ్ఞానసాధనపరులుగా జేయుచుండెను. అతడు న్యాయమును సత్యమును బరిపాలించుటయందును, పాపులను దుర్మార్గులను శిక్షించుటయందు విచిత్రములైన మార్గములను బ్రయోగించును. శ్రీకృష్ణుని బాలలీలల సమయమున నత డెట్లు నడచుకొనిన దానిని దెలిసిన విచిత్రముగా నుండును. వసుదేవునకు దేవకీదేవికి జరిగిన వివాహకాలమున నాకాశవాణి వారిరువురకు బుట్టు నెనిమిదవ శిశువు దేవకీదేవి యొక్క సహోదరుడై యతిక్రూరుడై దుర్మార్గుడైన కంసుని జంపునని జెప్పినది ప్రసిద్ధము కదా? ఆధ్వనివిని, తన మరణకాలము నిశ్చయించుకొని యామె కనిన బిడ్డలను నెంచుచుండెను. అయితే అతనికి నారదుడు ప్రత్యక్షమై “కంసా మొదటిశిశువునుంచి నీవు లెక్కించుట తప్పు. దేవకికి పుట్టిన శిశువులలో నెవ్వడైన యెనిమిదవది కావచ్చును. నెవ్వడైన నీమరణమునకు హేతువు కావచ్చును గనుక దేవకికి బుట్టినవన్నిటిని జాగ్రతగా జూచి సంహరించవలెనని కంసునికి నారదుడు సెప్ప' బుట్టిన శిశువు లన్నిటిని నరుకుచు మైమరచి వాటివిషయమై యంత గమనము బెట్టక విఱ్ఱవీగుచుండెను. ఇట్లు నారదు డుపదేశించినందువల్ల కంసుడు పుట్టినబిడ్డను దెచ్చి హాజరుచెయ్యవలసినదని యాజ్ఞాపించి నిశ్చింతతో పరామరిక దప్పియుండెను. గనుక శ్రీకృష్ణమూర్తి దక్కి వానిని జంప వీలయ్యెను. ఇట్లు నారదుడు చేయుట యసంగతమని మొదట మనకు

దోచవచ్చును. అతని చర్యయొక్క తత్వము వేరుగానున్నది. దేవకికి మొదట బుట్టు నేడ్గురు దేవత లేదో యొక యల్పపాపమునకై గర్భనరకప్రాప్తి పొందవలసినట్లు శాపమును బొందియుండిరి. గనుక నారదు డిట్లు వారు భూలోకమున బుట్టగానే వారి సంహారమునకు దగిన యేర్పాటు సేయకుండిన నాదేవతలు వారి స్వకీయమైన సుఖములను విడనాడి ప్రపంచదుఃఖము లనుభవించవలసి యుండెను గనుక నారదుడు జేసినది చాలా న్యాయమైనది. అదియుగాక కంసుడు దన సంహారమునకై తగుమైన వాడు గావలసి యుండెను. గనుక నతనిని శీఘ్రముగా నట్టి దురవస్థకు దేవలయునని యతడుద్దేశించినందున నట్లు చేయుటయెంతయుపకారము జేసినట్లాయెనో యోచింపుడు.

(సశేషము).

## మతభేదము.

ఇదివరకు మనకు మత మత్యావశ్యకమైనదని విమర్శించినాము కదా! మత విషయక విధి నిషేధములను బాగా దెలుసుకొని యాప్రకారము ప్రతివాడు నడుచు కొనినయెడల శ్రేయస్సగును. మతవిషయకమయిన నియమములను మనము దెలిసి వర్తించ వలయును. మన మనుసరించవలసిన నియమములు బుద్ధికి న్యాయమైనవిగా దోచును. అవి యనుభవమునకుగూడ విరుద్ధముగా లేక సహకారిగానే యుండును. వానిని శ్రద్ధతో నాచరించిన సంసార ప్రవాహమును దాటి సులభసాధనముగా నుండును.

ఈ విషయమున మన కనేక సందేహములు గలుగును. మతము బుద్ధికి ననుభవమునకు ననుగుణ్యమైన శాస్త్రముగా నుండినయెడల యేల లోకమున ననేక మత భేదములు గలవని మొదటి శంక గలుగును. ఈ మతము లనేకములై వేర్వేరు విధములు గాను, పరస్పర వ్యతిరిక్తముగాను గనబడుచున్నవి. బుద్ధికి ననుభవమునకు ననుగుణ్యమైన శాస్త్రమిటువంటి భేదములను వ్యతిరేకములు గల విషయముల నెట్లు బోధించుచున్నవి యను శంక గలుగును. ఈ కాలమున ప్రకృతి భౌతికశాస్త్రమును ముగ్గు రభ్యసించుచున్నా రనుకొనెదము. ఆముగ్గురిలో నొకరు పాఠికభాగమును

## మతభేదము.

మఱియొక రర్థభాగమును, మూడవవాడు ముప్పాతిక భాగమును శాస్త్రజ్ఞానము సంపాదించి రచించినట్లను కొనెదము. వారందఱు దమకు దెలియనిదంతయు లేదని యనుకొనెదరు. ఇట్లు భిన్న భిన్నమైన విషయముల తునక లెట్లు సమగ్ర శాస్త్రమని మన మంగీకరించనగును? అదిగాక కేవల ప్రపంచ సంబంధమైన దీనిని, దెలియని మనము దేనిని నిజమని భావించ నగును? లోకమున నుండు మతబోధ లన్ని యొక్కటి యైన, తత్వము దెలియని విచారపరుడు (1) వీటిలో నేదో యొకమతము సరియైన దనియు దక్కినవి తప్పనికాని (2) అన్ని మతములు తప్పుదారులనికాని (3) ప్రతి మతము కొన్ని తత్వాంశములు మాత్రము గలిగి పూర్ణతత్వమును గలిగి యుండవని కాని నిర్ధారము జేసుకొనును. ఈ యభిప్రాయములలో నేది సరియని నిర్ధారము జేయుటకు ముందు లోకమున నుండు మతములలో భేదములైనట్టి వ్యతిరేకములైనట్టి నియమము లున్నవా యని యోచించవలసి యున్నది.

ఒకని దేవుడు నీలవర్ణుడై, ఆజానుబాహుడై, సమగ్రమైన యవయవములు గలిగి, చేత, ముసలమును ధరించి, నిగ్రహానుగ్రహ శక్తి గలిగినవాడుగా నుండును. ఒకని దేవుడు స్వర్గమున సింహాసనాసీనుడై భూలోకి వాసులకు నాజ్ఞలను బంపును. మఱియొకడు దేవుని సర్వదయాపరుడై సర్వశక్తిమంతుడై సర్వజ్ఞుడై సర్వాంతర్యామియై యణువున మేరువున సమముగా నుండువానిగా భావించును. ఇదియునుగాక సర్వము దైవముదప్ప యితరము లేదని భావించువారుగూడ గలరు

వీరందరు సృష్టిజాలరూపమున నున్న ప్రకృతి నెట్లు భావించుచున్నారో విచారించుదము. ఒకడు దేవుని సంకల్పమాత్రమున సృష్టి యైనదనియు సంకల్పమాత్రమున నశించుననియు జెప్పును. సృష్టి యనాది యనియు, శాశ్వత మైనదనియు, దానిని దేవుడు సృజించలేదనియు, అయితే దేవుని యాజ్ఞకు లోబడి యతనితో గూడ శాశ్వతముగా నుండుననియు మరియొకడు నిరూపించును. ప్రపంచము లేనే లేదనియు క్షణక్షణమునకు ప్రతివాని మనోభావములు బైటి ప్రపంచరూపమున నగుపడుచున్న దనియు మఱొకడు భావించును. వీరందరు తత్వము నెరుంగరు. ప్రపంచమంతయు మిథ్య భ్రమయేకాని వేరు కాదని మరకొందరు నిరూపించుచున్నారు.

జీవుని విషయమునగూడ నిట్లు భిన్నాభిప్రాయములు గలవు. జీవులు భిన్నములనియు శాశ్వతులనియు నేదో యొక న్యూనతను నివారించుకొనుటకై కొంతకాల మీలోకమునకు వచ్చి యనంతమైన శాశ్వత సుఖానందమునకు నర్హులగుదురని యొకడు

చెప్పును. జీవుడు శాశ్వతుడనియు ననేక జన్మములు గడచిన వెనుక వాని సుకృతధర్మవిశేషమున నీశ్వరానుగ్రహముచేత ధన్యుడై యీశ్వరుని సద్గుణములలో గొన్నిటిని బడసి యతని సామీప్యమున నతని దయాపాత్రుడై యమృతము గ్రోలుదురని కొందరు వచింతురు.

సకలజీవు లభిన్నమనియు, చైతన్యరూపమనియు మాయావశమున బ్రహ్మజీవుడు దాను మనుష్యమాత్రుడనుకొనునని కొందరు నిరూపించుదురు.

ఈ యభిప్రాయములలో నెద్ది నిజమను శంక బొడముచున్నది. వీనినిజక్కగా బరిశీలించిన ప్రతి యభిప్రాయమున వానివాని యోగ్యతానుసారము కొంతకొంత నిజమున్నదని దృఢీకరించనగును. వీరవిషయము కోడి, యెద్దు, లేక మూడు నాపిల కథవలె గాదు. అయితే కత్తియొక్క రెండుప్రక్కల కథగాని, యేనుగు గ్రుడ్డివారి కథగాని యగును. లోకమున బ్రహ్మవిషయమును జాలా కొందరు బూర్ణముగ బరిశోధింతురు. అనేకుల సంపూర్తిగ విచారించి వాదింతురు.

లోకమున నొకనిముఖము మఱొకని ముఖమును బోలలేనట్లు కదా? యీ సృష్టి యద్భుతమును జూడుడు. ఒకని భావనలు, వాసనలు యోగ్యత మఱొకనియందు గానరావు. ఒకని దేహసామర్థ్యము, ఇంద్రియగ్రహణశక్తి, మనస్సుయొక్క యోగ్యత మఱొకనియందు గానరావు. ఒకనియందు స్పర్శశక్తియు, ఒకనియందు ఘ్రాణశక్తియు, మఱొకనియందు రాగజ్ఞానశక్తి యెక్కువగ నుండును. ఒకడు సూక్ష్మగ్రాహియై యొకడు మందబుద్ధియై యుండును. ఒకడు పాకశాస్త్రమును గనిపెట్టును. ఒకడు మొండి గఱ్ఱయై యేదివేసినను మెక్కును. ఇట్లు మనోవిషయమున గూడ ననేక భేదము లున్నవి. ఒకడు గణితశాస్త్రప్రవీణుడు. ఒకడు భౌతికశాస్త్ర ప్రవీణుడు. ఒకడు కావ్యగీత ప్రియుడు. ఒకవిషయము నొకడు సులభముగా గ్రహించును. మఱొకడు గ్రహించ జాలడు. ఒకడసంపూర్తిగ గ్రహించును. ఇట్లు దృశ్యమైన లోకవిషయమున భిన్నాభిప్రాయములు వివేచనము లనుభవవేద్యములై యుండ ననంతచైతన్యస్వరూప జ్ఞానవిషయమున భిన్నాభిప్రాయము లుండుట యెట్లు విచిత్రమగును? సర్వాంతర్యామియై సర్వజ్ఞుడై, సర్వశక్తియుతుడై సర్వనియామకుడై యుండు మహానుభావుని నెట్లు పూర్ణముగ దెలియజేయ సాధ్యము.

మోటువాని బాలుని దండముతో శిక్షించ దెలివిదెచ్చుకొనును. నాగరికత హెచ్చు దుర్భాషలతో, క్రూరదృష్టిచేత, బాలురను శిక్షించ సన్నద్ధు లగుదురు. మఱి

కొందరికి కేవల దయారసమును జూపిన సజ్జను లగుదురు. ఇట్లు మతవిషయమునగూడ వివిధమార్గముల వికారం బేర్పడియున్నవి.

ఇట్లు ఉద్దేశములుగూడ భిన్నములుగా నున్నవి. కొందరు కేవలానందమునకై, కొందరు గౌరవమునకై, భాగ్యమునకై, విద్యగోరుచునట్లు కొందరుత్కృష్టజన్మమును బొందుటకు, కొందరు స్వర్గాది భోగము లనుభవించుటకు, కొందరమృతత్వమును బొంది యూర్ధ్వలోకముల నుండు భోగము లనుభవించుటకు గోరుచుందురు. కొందరభిమానవర్జితులై ప్రభుసేవయే ముఖ్యమని భావించుదురు. ఇట్లిహపర యనుగ సర్వము సన్నమైనని పరవిద్యయను గూడ ననేకవిధములుగా నుండుట యెంతయు విచిత్రముగాదు. అందరికి నుత్కృష్టగతిని జూపుట సామాన్యమైనయట్టి జన సముదాయమును నిరాకరించుట యగును. వీరికిమాత్రము దారిజూపుచున్న గ్రంథముల నుపవాస ముండు నట్లు చేయవలె మగును. కనుక రెండువిధముల వారికి సాధనమార్గముల నేర్పడ బ్రయత్నము చేయవలెను.

లోకమున నుండు మతములయొక్క స్వభావ మెట్టిదైన సకలమతములకు సమ్మతమైన శాస్త్ర మెట్లున్నదని యొకడడుగవచ్చును. చిన్నపాఠశాలయందు జదువు బాలునకు, శాస్త్రశాలయందు జదువు బాలునకు, శాస్త్రశాలయందు నభ్యసించు పండితునకు, శాస్త్రపారగులైన విద్వాంసునకు, వారభ్యసించు రసవాద శాస్త్రము వివిధములైన యుండ రసవాదశాస్త్రము సంపూర్ణమైనదని యెట్లు చెప్పనగునని మరల వానిని మనమడుగవచ్చునుకదా. దినదినమునకు నానాశాస్త్రములన పరిచయము గలవారు నవీన నియమములను గనుగొనుచున్నారు. గొప్ప శాస్త్రజ్ఞుడుగూడా నాశాస్త్ర నియమములను దెలియనివాడనవచ్చును. అట్లనే, మతరహస్యములలో గొప్ప రహస్యములను వివిధ మతముల నుద్ధరించిన మహానుభావులు గొంతమాత్రము దెలిసియుండిరి. దేవుని యొక్క మహాత్మ్యమును సంపూర్ణముగా నతనికె తెలుసునుగాని యితరులకు గోచరమగుట సాధ్యమా? ఈ మహానుభావులు మతతత్త్వములను దెలిసియుండిన వారి బోధ యొకటిగా యుండవలయునని వాదించుట తప్పుగా నుండును. వారందఱుమతముల నొక్కవిధముగా బోధించి యుండిరేగదా. జనుల యోగ్యతానుసారము వివిధములుగా బోధించియున్నారు. లెక్కలు ప్రారంభించిన బాలునకు రేఖాగణితము నేర్పుట యసంగతముకదా? ఒకే యౌషధము సర్వులకు బ్రయోగించుట వైద్యుని తప్పుగదా? కాలదేశ

యోగ్యత ననుసరించి వివిధములుగా దత్వములను బోధించి యున్నారు. గనుకనే వివిధమతము లుండుట యత్యావశ్యకము. ఒకమతమువారు మరొక మతము వారితో బోట్లాడ బనిలేదు. ప్ర మతము మానవు డుండుస్థితిని యనుసరించి యున్నది. జ్ఞాన సాధనయందు గావలసిన యుపయోగమైన పదవి యనుకొనవలయును. ఇట్టి సకల గుణవిశిష్టమైనది హిందూమతము. అన్నివిధముల యంతస్థులవారికి ననుగుణ్యమైనది యితరమతములోనివారి నంగ జేరుమనుట లేదు. శ్రేష్ఠమైన మతమునకు హీనమతస్థుని జేర్చుట హీనమతమునకు శ్రేష్ఠుని జేర్చుటయు స్వాభావికముగా నుండదు. "ఓంనమః" యని ప్రారంభించువానిని శాస్త్రిపాఠశాలయందు నిచిన నెట్లు ప్రయోజనకారి కాదో యట్లు వారివారి వివముయొక్క యోగ్యతానుసార మాయా మతములయందు వర్ణభేదములయందు బుట్టిన వారిత రవర్ణముల నపేక్షించుట యసంగతమై యుండును. హిందూ మతస్థుడు సకలమతములవారికి నొకటేగ గలవారని భావించును.

గనుక లోకమున జనులయొక్క కర్మానుసారముగ వారివారి గుణములను బట్టి వారికి దగిన మతములు వర్ణాశ్రమములు గలుగును. తమతమ ప్రకృతస్థితులను కోర్చి వారివారి వర్ణాశ్రమాచార ధర్మముల ననుష్ఠించి క్రమముగా జ్ఞానసాధన జేసిన శ్రేయస్కర మగును. గనుక శ్రీభగవద్గీతయందు.

శ్లో॥ చాతుర్ వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః॥ అని యుండుట ప్రసిద్ధముగదా?

## విచిత్రమైన వృక్షము.

"ఒక వృక్షమున కొకపాదియు రెండుఫలములు, మూడువేళ్లు నాలుగు రసములు, అయిదు ఊడలు, ఆరు తొర్రలు, ఏడు పొరలు, ఎనిమిది కొమ్మలు, తొమ్మిది రంధ్రములు పదియాకులు గలిగి రెండుపక్షులచే నాశ్రయింపబడి యున్నది." ఈ వృక్షము పైనుండెడి పక్షులు రెండు నొకదానినే యాశ్రయించి యుండినను వృక్షము భిన్నమై పోయినప్పుడు తాము మాత్ర మొకదాని నొకటి యాశ్రయించి యుండును.

పైన జెప్పినది శరీరమే గాని మరియొకటి కాదు. శరీరమునకు పాది ప్రకృతి (మాయ). సత్వరజస్తమోగుణములు మూలములు ధర్మార్థకామమోక్షములు రసములు పంచేంద్రియములే ఊడలు. షడూర్ములు తొర్రలు సప్తధాతువులు పైపట్టలు చేతులు,

కాళ్లు, శిరస్సు, కంఠము, వక్షస్సు, కడుపును నెనిమిదికొమ్మలు. నవరంధ్రములు ప్రసిద్ధము ప్రాణాపాన వ్యానోదాన సమాన నాగ కూర్మ కృకర దేవదత్త ధనుంజయవ లను దశవాయువులే పత్రములు. పైవానిం గలిగి చూచుటకు విచిత్రమై జీవేశ్వరుల పక్షులచే నాశ్రయింపబడి సుఖదుఃఖములను రెండుఫలములను భుజించుచు వృక్షవ శిథిలము గాగా దానిం దిగద్రోసి పక్షు లెగిరిపోవును. ఇట్లు ఏటేటను దినదినము ప పోవు ననేక వృక్షముల జూచుచు నిట్టివే మనకు గావలయునని కోరు టెంత వెఱ్ఱి తనము? కావున జనులందరు పై వృక్షమందుండిన రెండు ఫలములలో నొకటియగు సుఖఫలమును మాత్రము బొందగోరి తదాశ్రయుడగు పరమాత్మ నెల్లప్పుడును ధ్యాని చుచుండిన నిట్టి వృక్షము లప్పుడప్పుడు పడిపోవుటయు కలుగుట లేక శాశ్వత వృక్షమగు పరబ్రహ్మాశ్రయము గలిగి యుండున ట్లందరును యత్నింతురుగాక.

ఆ॥ సం॥

# ఆత్మబోధ.

## మొదటి పాఠము.

అంతట దేవుడున్నాడు. దేవుడు లేని చోటు లేదు. జగత్తున నుండు సకలము దైవస్వరూపమే. మనిషి యా దైవస్వరూపముయొక్క యంశము. ప్రపంచము వేరు రూపముగా జగత్తున గనబడుటకు నేడువిధములైన కప్పులను లేక యావరణ ములను గలిగియుండును. మనిషి యందుండు చైతన్యస్వరూపమైన జీవ మేడుప్రా కారములు గల శరీరమను గుడియందున్నది. ఇయ్యేడిటిని వాహనము లనియు కోశము లనియు జెప్పవచ్చును. మనిషి యీ వాహనములను శుద్ధిజేసుకొనిన దన యజ్ఞానమును బోగొట్టుకొని నిజస్వభావమైన దైవస్వరూపమును మరల బొందును. ఈ వాహన ములను వేరువేరుగా జెప్పుటకు సాధ్యమగుట గాక యనుభవరూపమునగూడ దెలుసు కొనవచ్చును. దివ్యదృష్టి గలవా డీయేడిటిని, వేరువేరుగా నుండునది కన్నులార జూచును. మన మిప్పు డయిదువాహనములను మాత్ర ముపయోగించుకొనుచున్నాము. తక్కిన రెండువాహనముల నుపయోగింప సామర్థ్యములేదు. కదాచిత్తుగా నిప్పుడిట్టి సామర్థ్య మక్కడక్కడ కలుగుట వినుచున్నారము.

నార్వేదేశమున పదునాల్గేండ్లు వయస్సుగల జాన్ స్లెట్టం యను కాప చిన్నవాడు ముప్పదేండ్లకు ముందు పోగొట్టుకొన్న వస్తువులను గూడ గుర్తించి చెప్ప గలడు. దేశద్రిమ్మరులు గొనిపోయిన బాలురనుగూడ గుర్తించి తెప్పించి యిచ్చియున్నాడట మరియు ఐరోపా దేశమున నొక బిడ్డ తొట్లలో నాడుచు "దైవమా మరియొకసారి యీలోకమున నీసుఖమును గలిగించితివి కదా? వసంత ఋతు వెంత మనోహరమైనది" యని పాడ దాని తల్లి విని "బిడ్డా యేమంటివి యని" యడుగ నేమియు లేదని ప్రత్యుత్తరము జెప్పెను. ఆబిడ్డ యదృశ్యమైన పురుషులను జూచి మాట్లాడించును. దూరదేశమున నుండు స్నేహితులను బంధువులనుగూడ జూచి వారి సమాచారములను జెప్పుచుండునట. ఇట్లు కొన్ని దృష్టాంతములు గలవు. మనిషి దన కిష్టమువచ్చినట్లు పైకనిన వాహనముల నొకొక్కొక్కటియందు వేరువేరుగా విహరించ నగును. ఒకటి యం దుండునపుడు తక్కినవాటియం దుండక పోవచ్చును. సాధారణముగా దేహమున నేదైన గాయము గలిగిన బాధ గలుగును. అయితే రణరంగమున శౌర్యముతో యుద్ధము జేయునప్పుడు గాయమైనను ఆ నొప్పి గనబడదు. అప్పుడు ప్రజ్ఞ శౌర్యమునందు నెలకొని యుండును. తత్వవేత్తయె తత్వమును నాలోచించునప్పుడు దేహమున గలుగు నితర భావములు స్ఫురించుట లేదు. అప్పుడు ప్రజ్ఞ బుద్ధియందు నెలకొని యుండును. ఇట్లు ప్రజ్ఞ వేరువేరు స్థితులయం దుండునప్పుడు వేరువేరు వాహనములు నుపయోగించుకొనుచుండును.

ఈ వాహనము లెవ్వియన (1) స్థూలశరీరము (2) సూక్ష్మప్రతిబింబము (3) ప్రాణము (4) కామశరీరము (5) మనస్సు (6) బుద్ధి (7) ఆత్మ. మొదటినాల్గును నశించిపోవునవి. తక్కిన మూడు శాశ్వతమైనవి.

## 1. స్థూలశరీరము.

మనుజుని శరీరము స్థూలశరీరము. ఈ శరీర మనేకయణువులు జేరి యైనది. ప్రతి యణువున ప్రాణమున్నది. మూడవ వాహనమైన ప్రాణ మీప్రాణులను జేర్చి దేహరూపమున నిల్పియున్నది. ఒక యణువు మరియొక యణువుతో జేరక వేరువేరుగా నుండి వాటి స్థలములయందవి చలించుచుండును. వీటి చలనము చేతనే చెమట మల మూత్రములు మొదలగు దుస్సహమైన పదార్థములు గలుగును. దీని పవిత్రతకై స్నాన మావశ్యకము. శరీరమున నుండు నణువులు క్షణక్షణమునకు మార్పులు బొందుచుండును. యేడు సంవత్సరముల కొకతూరి దేహమున సంపూర్ణమైన మార్పు గలుగు

చుంగును. ఇందుకు గాబోలు? "జన్మనాజాయతే శూద్రః" యను వచనమును బట్టి మన పెద్దలు మనకు నేడుసంవత్సరముల కుపనయన విధి విధించి యున్నారు. ఈలాగుననే ప్రపంచమున నుండు సమస్త పదార్థములు ప్రాణములుండు నణువులు జేరి యైనవని తెలియవలయును. ఈయణువుల నుండు ప్రజ్ఞయు దేహమునుండు ప్రజ్ఞయు వేరైనవి దేహమునగలుగు గాయములను మాన్పుటకుగలిగిన శక్తి యణువులది యౌను. దేహమున గాయమైన దాని నొప్పి దెలియు శక్తి దేహమున నుండు ప్రజ్ఞది యగును. మూడవ వాహనమైన ప్రాణము దేహమునువిడువ నణువులు దమంతటతాము వేరై దేహము నశించును. మరణానంతరమున నీ యణువులు జేరి వేరు శరీరము లగుచుండును.

(సశేషము)

## పురాణసారము

### పీఠిక.

మనము పూర్వమున గొప్ప ఋషుల వంశీకులయ్యును, ప్రకృతము వారి గణ్యాతి నించుకయైన నోప జాలక యున్నాము. మనలో గొందరికి మన పెద్ద లెట్టి భక్తులైనది వారెట్లు నడచుకొనుచుండినది మనకు స్పష్టముగా తెలియదు. లోకమున నెట్టి యధర్మము లుండినది దాని నివృత్తికై యెందరు మహానుభావులు పాటుపడు చుండినది కూడ తెలియదు. పూర్వము లోకమున నుండు దుఃఖించు జీవులకొరకు దేవతలుగూడ భూలోకమున మనుష్యులతో గూడి సంచరించుచు వారి కష్టములను నివారించుచుండిరన మనము నవ్వుచు పరిహసించుదుము కదా? ఈ నాగరికతయైన కాలమున నట్టి చిత్రకథలను జెప్ప నమ్మువారెవరును లేరు. పూర్వధర్మశాస్త్రములకు సంబంధించిన కేవల తత్వవిచారములు, విచిత్రమైన యితిహాసములు గల పుస్తకములు మాత్ర మిప్పుడు మనకు శేషించి యున్నవి. వానియందు గల యతిశయోక్తులను, నమ్ముటకు సాధ్యము కానివిషయములను, దేశకాల నిర్ణయములేని యనేక విషయములను, జూడ నవి యాచరణకు విచారమునకు దగునైనవి గాదని మన బుద్ధికి స్ఫురించు చున్నది. ఇది మన తప్పుగాదు. బాలునికి జ్ఞానమును జూపక యజ్ఞానమున బడద్రోసిన నది దండ్రి తప్పుగాని బాలుని తప్పెన్నటికిని గాదు కదా? ఆలాగుననే మన పూర్వీకు లెంత గొప్పవారైనది మనకు దెలియకుండిన మన తప్పేమియును లేదుగాని మనకు

నేర్పిన విద్యాభ్యాసముయొక్క ఫలితముగా నున్నది. ప్రకృతిశాస్త్రములను నేర్చి దృశ్యమగు ప్రపంచముకంటె వేరు లోకము లున్నవని నమ్మజాలక యున్నాము. కొద్దికాలమున జరిగిన చరిత్రవిషయములను జదివి యుగాంతరముల జరిగినవిషయములను గ్రహించజాలక, మన యితిహాస పురాణ వేద శాస్త్రముల నెండదేశమునబుట్టిన వైతత్యదోషములని భావించుచున్నాము. ప్రపంచమున నుండు సకలదేశీయుల చరిత్రల కంటె మనదేశపువారి చరిత్ర నెక్కువగా విశ్వసించదగినదని తెలియవలయును. ఈ దృశ్యప్రపంచమువలెనే సత్యమైన యితర లోకము లున్నవని దృఢముగా దెలియ వలయును. మనపెద్దలు దృశ్యాదృశ్య వివేకమును జక్కగా దెలిసి ఋజువైన మార్గ మును గ్రహించి తత్వసాధన జేసి నిరభిమానులై లోకరక్షణకై పాటుపడుచుండిరని తెలియవలయును. సర్వనియామకుడైన దేవుని నమ్మి లోకమున గొలువుసేయని జ్ఞానము, సుగుణము బనికిరావు. మనదేశమున బూర్వమున నుండిన మహానుభావుల నడతలను వారిచరిత్రలవల్ల మనము తెలియవలసినది. అందువల్ల మన రామాయణ భారత భాగవతములను సంక్షేపముగా నిందు వ్రాయ బూనుకొని యున్నాము. వానివల్ల పూర్వమున మనదేశమున మన పెద్ద లెట్టి దైవిక లౌకిక జ్ఞానమును గలిగి యుండిరది, యెట్టి నాగరికతను సంపాదించి యుండిరది, అధర్మ మెట్లు శిక్షింపబడి నది, దేవతల యవతారములవల్ల ధర్మమెట్లు ఉద్ధరింపబడినది తెలియవచ్చును. అవి ప్రకృతము మన మనస్సులకు నగోచరముగ నుండును. అయితే అవి నిజముగా జరిగినవే. వానివల్ల లోకమున దేవు డెట్లు తన ప్రాణులను పోషించునదియు, అధర్మము వృద్ధియైన నధార్మికుల నెట్లు శిక్షించునదియు తెలియును. మరియు అవి ధర్మనియమ ములను తల్లిదండ్రులెడ, గురువులెడ, అన్నదమ్ములెడ, అక్కచెల్లెండ్రెడ, భార్యలెడ, బంధుమిత్ర సహచరులెడ, నెట్లు నడచుకొనవలసినది సూచించును. ధర్మాధర్మములను, సుకృత దుష్కృతములను, సుగుణ దుర్గుణములను బరిశీలించి తెలుపును. ఆపత్కాల మున నెట్లు ధైర్యముతో నడచుకొనవలసినది తెలియజేయును. దయాగుణము నెక్కు వగును. బుద్ధివిశుద్ధ మగును. ధర్మము హెచ్చును. ధర్మమున పుణ్యము. భక్తివృద్ధి యగును. ఎక్కువ జెప్పనేల. వేదములవలె పావనము లైనవి గనుక శ్రద్ధాభక్తులతో వాని నాచరించవలయును. ఈ కాలమున వ్రాయు చరిత్రలవలె, దేశకాలములను నిర్ణయించి ముఖ్యరాజులయొక్కయు, ముఖ్యమైన సేనాధిపతులయొక్కయు లౌకిక కార్య ధురంధరులయొక్కయు చరిత్రలను జెప్పనట్లు మన పూర్వ గ్రంధములయం

దట్టి చరిత్ర లెందుకు వ్రాయబడలేదని మనకు శంక గలుగును గదా? ఇప్పటి చరిత్ర నేదో యొక కాలమును నిర్ణయము జేసుకొని దానిని ముఖ్యముగా వర్ణింప యత్నించుచున్నారు. మన యితిహాస పురాణములన్ననో యనేక యుగముల చరిత్రను సంక్షేపముగా జెప్పుచు నప్పుడప్పు డుండిన రాజులు మొదలగు వారిగుణములను ప్రధానములైనవని గ్రహించక, లోకులకు సమ్మతమైన దానిని మాత్రము మన పురాణేతిహాసములయందు వ్రాయబడి యున్నది. ఇట్టి గొప్ప ప్రయత్నమున కాలనిర్ణయమువల్ల నేమి ప్రయోజనమో మీరే యోచించుడు. కేవల కాలనిర్ణయములు, కొందరి మనుష్యుల చరిత్ర లెట్లు దేశచరిత్రయని యనుపించుకొనును. ఈ యభిప్రాయమును బట్టి యిప్పుడుండు చరిత్రలు సరియైనవి కావు గాని మన పురాణేతిహాసములే సరియైన చరిత్రముల. మన చరిత్రములయందు గల యద్భుత విశేషములు నమ్మదగినవిగా నిప్పటి స్థితికి మనకు గోచర మగుచున్నది. అయితే యవి మన పూర్వీకులకు సర్వసాధారణమైన కార్యములుగా నుండినవి యని నిశ్చయముగా నమ్మవలెను. యిప్పుడు గూడ మనము దగిన సాధనములను సంగ్రహించినపక్షమున నట్టి యద్భుతములను సాధారణముగా జేయుటకు శక్తి గలుగును. పూర్వమువలె దేవు డవతరించి యెందుకు నిప్పుడుండు, నధర్మమును బోగొట్టడని మరియొక శంక మీకు గలుగవచ్చును. దేవుడు సమయములను గనిపెట్టి యెప్పు డెప్పు డెట్టివారిచేత ధర్మము నుద్ధరింప నగునో యట్టి ప్రయత్నములు దేవు డప్పుడప్పుడు చేయుచుండును. అనేక మహానుభావు లిప్పుడుగూడ మనకు జ్ఞానోదయము జేయించుటకు దేవునివల్ల నేర్పడినారని భావింపవలెను గాని అన్యథా యోచింప గూడదు.

కావున నిట్టి విశేషాభిప్రాయములచేత వ్రాయబడిన మన భారత, భాగవత రామాయణాది మహాచరిత్రలను కేవల భక్తిపురస్సరంబుగా నాదరించిన ననంతశ్రేయస్సాధక మగునని నమ్ముట కించుకయైన సందియంబు లేదు. కావున మన మిప్పుడు సావధానముగా తదేకనిష్ఠతో వాటిని గ్రహించుటకు యత్నించుదము.

---

## మాపూలబుట్ట.

22. అన్ని నీళ్లయందు నారాయణు డంతర్యామి యైయున్నను త్రాగుటకు నన్ని యర్హములు కావనట్లంతట బరమాత్మ నిండియున్నను మనుష్యునకు నన్నిచోట్లు

దర్శనీయములు కావు. కొన్ని నీళ్లు కాళ్లు కడుగ నుపయోగించును. కొన్ని స్నానమునకు గొన్ని త్రాగుటకు నుపయోగింపబడును. కొన్ని స్పృశించుటకు గూడ ననర్హములు. అట్లనేకవిధములైన ప్రదేశములున్నవి. కొన్నిటిని సమీపింప వచ్చును. కొన్నిటిని బ్రవేశించవచ్చును. కొన్నిటిని దూరమునుండి నిరాకరించవలెను.

23. పులిలోగూడ దేవుడుండుట నిజము కాని దాని నెదుర్కొనగూడదు. అట్లు దుర్మార్గునియందు గూడ దేవు డున్నను వారి సాంగత్యము జేయగూడదు.

24. గౌరవింపబడు, మర్యాదింపబడు, యనేక జనులను విధేయులుగా నడిపించుకొనువారియందు నితరులయందుకంటె నెక్కువ దైవత్వ మున్నదని తెలియవలెను.

25. భగవంతుని భాగవతమును భగవద్భక్తులను నొక్క విధముగానే పూజింపవలెను.

26. ప్రతి ప్రాణియు నారాయణుడే. మనిషి లేక జంతువు, ఋషియు, దొంగయు, సకలసృష్టిజాలము పరమాత్మస్వరూపము

27. అనేకులు మంచుగడ్డయని వినియుందురు గాని చూచియుండనట్లుగా ననేక మతబోధకులు దేవుని గుణములను పుస్తకముల జదివియుందురు కాని వారు వానిని సాధించియుండరు. అనేకులు మంచుగడ్డను జూచియుందురు కాని రుచించియుండనట్లు కొందరు గురువులు దైవసంపల్లక్షణములను గొంచము గనియుందురు కాని దాని సారగ్రహణము జేసియుండరు. మంచుగడ్డ దిన్నవాడే దానిపోలి యుండునని చెప్పగలడు. దేవుని సహవాసమును భృత్యునివలెను స్నేహితునివలెను భక్తునివలె నైక్యము బొందియైన ననేకవిధముల గొలిచినవాడు దేవుని మాహాత్మ్యమును జెప్పగలడు.

28. దేహ మొక కాగుకుండవంటిది. మనస్సు నింద్రియములును లోని నీరు, బియ్యము, వంకాయవంటిది. ఈపదార్థములతో కుండను వెచ్చజేయ దానిని ముట్ట వ్రేలును గాల్చునంతటి యుష్ణముగా నుండును. ఐతే యా యుష్ణము కుండదికాదు దానిలోని పదార్థము లదికాదు. అది యగ్నిలోనిది. అట్లు మానవునిలో నుండు బ్రహ్మాగ్ని మనస్సు నింద్రియములను దమతమ పనులను జేయునట్లు చేయును. ఆ యగ్ని కార్యకారి కాకయున్న నింద్రియము లవయవములు నిలిచిపోవును.

29. కఱచు పాము నేనే. మాన్పు మాంత్రికుడు నేనే. దండన విధించు తీర్పరి నేనే. శిక్షను జరిపించు నేర్పరి నేనే యనిదేవుడు చెప్పును.

## 1. శ్రీరామకృష్ణపరమహంస చరిత్రము.

ఒక నాటకముజూడ దన తోడి బాలురను గుమిగూర్చి వారి నొక్కొక పాత్రముగ నియమించి చేనులలో, జెట్లక్రింద దానిని మరల ప్రదర్శించును, ఒకవేళ శివుని విగ్రహము జేశి బాలురతో జేరి బూజించును. ఆరుసంవత్సరముల వయస్సు ననె రామాయణము, మహాభారతము, భాగవతము, పౌరాణికులనుండి వినుటవలన వానియందు నెక్కువ పరిచయము గలవాడై యుండెను.

పూరీ మహాక్షేత్రమునకు యాత్రకై పోవు మార్గమున నతని గ్రామ మున్నందు వలన ననేక సన్యాసులు, యోగులచ్చటి ఛత్రమున గుంపులుగుంపులుగా నప్పుడప్పుడు విశ్రమించుకొనుచు నుండుటవల్ల నితడు వారితో ననేక మతప్రసంగములు జేయుచు వారి యాచారములను గ్రహించుటకు నవకాశము గలిగియుండెను.

ఇతడు దన జ్యేష్ఠభ్రాత పెట్టిన పాఠశాలయందు విద్యగరచుచు కొన్నాళ్లకు నక్కడ నేర్పుచున్న విద్యజూచి వినుకుకొని సృష్టిప్రళయ లక్షణము, మాయాబ్రహ్మ స్వరూపము, జీవన్ముక్తిలక్షణము నెక్కువగ నాకలాడుదురుగాని యనుభవమునకు దెచ్చుకొను ప్రయత్నము గనబడదని తెలిసి కొన్నికాసులు ధాన్యరాసులు సంపాదించుటకై యున్న యీ విద్య నాకవశ్యకంబు లేదని యన్నతో దెలపొంది పాఠశాలను విడిచెను.

ఒకసమయమున నాగ్రామపు జమీందారుని యింట నుత్తరక్రియలు జేయ ననేక విద్వాంసులు జేరియుండ నొక మతవిషయకమైన సందియ మొక్కటి యొనగూడ నేకీభవమునకు రాక వాదించుకొనుచుండ రామకృష్ణుడు బాలుడై యుండినను తన ముద్దుపలుకులతో నంద రాశ్చర్యపడ నాసందియంబు నివారించెను. మరియు బాల్యమున నొకనాడు చేనులయందు విహరించుచుండ స్వచ్ఛమైన యాకాశమున నొక కొంగల వరుస యెగిరిపోవుచుండ వాని వర్ణభేదముల నాలోచించుచు దైవసృష్టి ప్రభావమునకు నానంద పరవశుడై కొంతకాలము స్మృతిలేక యుండెను. 1858-వ సంవత్సరమున కలకత్తా కుత్తరమున 5 మైళ్ల దూరమున నుండు గంగాతీరమున దక్షిణేశ్వర మను ప్రదేశమున నొక దివ్యమైన కాళికాలయము ప్రతిష్ఠింప బడినది. అచ్చట రామకృష్ణుని యన్న ధర్మకర్తగ నాచార్యునిగ నియమింపబడెను. ఆ దేవాలయమును రాణి రాచమణి యను హీనజాతిస్త్రీ కట్టించినది గనుక రామకృష్ణుడు నా గుడి

యందు దన యన్న యాచార్యునిగ నుండుటకు నాక్షేపించెను. ఆగుడియందు కాళికా విగ్రహమును ప్రతిష్ఠజేయు మహోత్సవమున వేలకొలది జనము మృష్టాన్నభోజనముల దృప్తిజెందుచుండ రామకృష్ణుడొక డుపవాసముండి యా దేవాలయమున వండిన యన్నమును గ్రహించుట నిషేధమని రాత్రిగాగానే సమీపమున నున్న యంగడికి వెళ్లి యొక పైసాకు నటుకులుగొని యన్నను విడిచి కలకత్తా జేరెను. అయితే భ్రాతృవాత్సల్యతనుంచి మరల నొక వారమునకు నన్నను జేరి యతని ప్రార్థనానుసారముగ దానక్కడ యుండు గంగాతీరమున నన్నము వండుకొని తిని యుండు షర్తుపైన నుండ నొప్పుకొనెను. వెనుక గొన్నిమాసములకు నతని యన్న వ్యాధిపీడితుడై గుడిలో గార్యములను జరుపజాలక రామకృష్ణుని బ్రార్థించ తుదకొప్పుకొని కాళికాదేవికి బ్రశిద్ధపూజారి యాయెను. యితడేకార్యము నైన మనఃపూర్వకముగ జేయువాడు గనుక ద్రవ్యాపేక్షతో దాను నొక్కని పనియు జేయుటలేదు. పూజారి యగుటకు నొప్పుకొని కాళికాదేవి విగ్రహమును దన తల్లిగాను లోకమాతగాను భావించి యామె దాను దనచేతులారా నిడిన యన్నముచేత మాత్రము జీవించుచున్నదనుకొనెను.

దిన కట్టడి గంగా నే యా గుడిలో ఘంటలకొద్ది కూర్చొని కీర్తనలు పాడుచు స్తోత్రములను బఠింపుచు బాలునివలె నాదేవితో స్వేచ్ఛగదప్పువరకు మాటలాడుచు వేడుచు నుండెను. తనమనోభీష్టప్రకారము దేవి దన సంపూర్ణమూర్తిని జూపనందున ఘంటలకొద్ది యేడ్చును. దానిని జూచి యనేకు లనేక విధములుగ ననుకొనుచుండిరి. కొందరు పిచ్చివాడనియు, గొందరు భక్తుడనియు, వాని వెర్రిచర్య భక్తిప్రచారమనిరి.

అతనికి బెండ్లిజేశి సంసారబాధ గలుగజేశిన నతని మనస్సుస్థిమితపడునని యెంచి పుట్టిన గ్రామమునకు నతని తల్లి మొదలగువారు బిలుచుకొని వెళ్లిరి. తగిన బిడ్డకుగాను వారు వెదకుచుండ నతడు రామచంద్ర ముఖోపాధ్యాయుని కూతురైన శారదమణిదేవి దైవసంపల్లక్షణములు గలిగియున్నది గనుక నామె దనకు సరియైన భార్యయని యేర్పరచుకొని నందున నామె నాతనికి నిచ్చి పెండ్లిజేశిరి.

(సశేషము).

Continues from page 42.

## అర్జునుని వాక్యము.

యుద్ధాపేక్ష గలవారై నిలుచున్న బంధుజనులను జూచి, కృష్ణా! నాయవయవములు విలవిల బోవుచున్నవి, నోరెండుచున్నది. దేహము వణకుచున్నది. వెండ్రుకలు గగ్గురుపాటు పడుచున్నవి. గాండీవము చేతినుండి జారుచున్నది. చర్మము మండునట్లున్నది. మనస్సు భ్రమించుచున్నది. నిలువ నశక్తుడనై యున్నాను. కేశవా, అపశకునములను జూచుచున్నాను. యుద్ధమున బంధువుల జంప బొందు సుఖము నాకు తోచలేదు. కృష్ణా! జయమునుగాని, రాజ్యమునుగాని, సుఖమునుగాని నేను గోరను. గోవిందా! రాజ్య మెందుకు, సుఖమెందుకు, భోగము లెందుకు, జీవించుటకూడ నెందుకు. ఎవరికొరకు రాజ్యమును భోగమును సుఖములను గోరెదమో వారె యుద్ధ ప్రాణములను ద్యజించి యిచ్చట యుద్ధమునకు నిలిచియున్నారు. ఆచార్యులు, తండ్రులు, పుత్రులు, తాతలు, మేనమామలు, మామలు, మనుమలు, బావమరుదులు, ఇతర బంధువులు, వీరలు నన్ను జంపవచ్చినను త్రిలోకాధిపత్యమునకు గూడ నేను వారిని జంపగోరను. భూమండలాధిపత్యమునకు నట్లగునా? ఈ దుర్యోధనాదులను జంపి జనార్దనా! మనకు నెట్టి ప్రీతి గలుగగలదు. ఈ యాతతాయినులను జంప మనలను పాపమే యాశ్రయించును. గనుక, బంధువులతో గూడుకొనిన కౌరవులను మనము జంపదగదు. స్వజనులను జంపి, మాధవా! మనమెట్లు సుఖింపగలము. వీరు లోభముచేత చెడిన మనస్సుగలిగి కులక్షయకృత దోషమును మిత్రద్రోహపాతకమును దెలిసికొన జాలకున్నను, జనార్దనా! కులక్షయకృత దోషమును దెలిసిన మన మిట్టి పాపమునుండి మరలుటకు నేల ప్రయత్నము జేయకూడదు. వంశనాశమువలన ననాదియైన కులాచారములు నశించును. కులధర్మము నశించుటచేత నాకులమును నిస్సందియముగా నధర్మ మావరించును. కృష్ణా! అధర్మాధిక్యమువలన కులస్త్రీలు దోషయుక్తులగుచున్నారు. స్త్రీలు దోషయుక్తులైరేని వర్ణసంకరము గలుగును. ఈ సంకరమువలన కులము చెరచినవారికిని, కులమునకును నరకప్రాప్తి యగును. ఏలన, వారి పూర్వీకులు పిండోదక క్రియాలోపముచేత నధోలోకమును బొందెదరు. వర్ణసంకర కారకులైన కులఘ్నుల దోషములచేత శాశ్వత కులజాతి ధర్మములు నశింపబడును. జనార్దనా! కులధర్మములు చెడిన నిత్య నరకవాసు లగుదురు. ఇట్లు మనము వినుచున్నాము. అయ్యో! మహత్తైన పాపము జేయుటకు సిద్ధమైతిమి. రాజ్య సుఖ లోభముచేత స్వజనసంహారమున కుద్యుక్తులైతిమి. ఏమి యీ యాశ్చర్యము! ధృత

రాష్ట్రుని పుత్రులు నిరాయుధుడనై యెదిరించనివాడనై యున్న నన్ను యుద్ధమున సంహరించిరేని నాకు మిక్కిలి క్షేమకరము.

### సంజయుని వాక్యము.

యుద్ధరంగమున నర్జును డిట్లు పలికి దుఃఖాక్రాంతుడై ధనుర్బాణములను వదలి యూరక కూర్చుండెను. ఇట్లు దివ్యభగవద్గీతయందు నర్జునవిషాదయోగమను మొదటియధ్యాయము సమాప్తము.

## రెండవ యధ్యాయము - సాంఖ్యయోగము.

### సంజయుని వాక్యము.

దుఃఖాక్రాంతుడై కన్నీరు గార్చుచున్న యర్జునునిజూచి దయాపరుడై కృష్ణు డిట్లు పలికెను.

### శ్రీకృష్ణుల వాక్యము.

అర్జునా! ఇట్టి విషమసమయమున, ననార్యమైన యస్వర్గ్యమైన, యకీర్తికరమైన, యీ వ్యాకుల మెట్లు నీకు గలిగెను. అశక్తత పాలు గాకుము. పార్థా! అది నీకు దగదు. తుచ్ఛమైన హృదయదౌర్బల్యమును విడనాడి యుద్ధమునకు లెమ్ము.

### అర్జునుని వాక్యము.

శత్రుసంహారకుడైన కృష్ణా! పూజ్యులైన భీష్మద్రోణుల నెదిరించి బాణముల ప్రయోగించి యెట్లు యుద్ధము జేయగలను. మహానుభావులైన గురువులను జంపుట కంటె యీలోకమున భిక్షాన్నమున జీవించుట యుత్తమము. ఈ గురువులను జంపి రక్తమిశ్రమమైన భోగము లనుభవించువార లగుదుము. మనము వారిని జయింతుమో లేక వారు మనలను జయింతురో యేది శ్రేయస్కరమో మనకు దెలియదు. ఎవరిని జంపి మనము బ్రతుక నిచ్ఛయించమో యట్టి ధార్తరాష్ట్రాదులు మనయెదుట యుద్ధసన్నద్ధులై యున్నారు. నే నిప్పుడు కార్పణ్యదోషముచేత చెడిన మనస్సు గలవాడనై ధర్మము దెలియనివాడ నైతిని. ఏది యుక్తమని నిన్నడిగెదను. ఏది శ్రేయస్కరమో దృఢముగా సెలవిమ్ము. నేను నీకు శిష్యుడను నిన్ను శరణు పొంది యున్నాను గనుక బోధించుము. భూమండలాధిపత్యము గాని యింద్రత్వముగూడ లభించినను నా యింద్రియములు శోషింపజేయు నీ మహాదుఃఖ మెట్లు నివర్తించునో నాకు గానరాదు.



Continued in page 93.

## సంకల్పశక్తి.

### అనాత్మ, జ్ఞేయము, తెలియబడునది.

జ్ఞానమే స్వరూపముగా గల యాత్మ దనయందనేక రూపములు ప్రతిఫలించినట్లు కనుగొనును. ఆరూపములతోను వాటిగుండా తాను దెలియజాలననియు, కార్యకారి కాజాలననియు, యిచ్ఛయించ జాలననియు ననుభవమువల్ల దెలుసుకొనును. వాడు బాహ్యపదార్థ రూపములను, వాసనా బలముచే గ్రహించును. వాటిని తనవి యని యభిమానించును. అయితే యవి తనకు బాహ్యముగ స్వాధీనమునకు రావని కూడ గ్రహించును. వానికి పదార్థజ్ఞానమే గలిగినను పదార్థరూపములు సంకల్పించ జాలవని తెలియును. వాడిచ్ఛయించినను రూపములు వాని యిచ్ఛానుసారము కోరికలను జూపవు. వాడు గార్యకారియయినను, రూపములయందా భావము గనబడదు. ఆ రూపములయందు "నేను తెలిసికొనుచున్నాను, నేను గార్యకారి యగుచున్నాను, నేనిచ్ఛయింతు" నను భావములు లేవని కనుగొనును. అట్లు తెలిసి సకలపదార్థములను తనకంటె భిన్నములుగ నెరిగి యా పదార్థములను లోహములని, వృక్షతరుగుల్మాదులని, పశువులని, మనుష్యులని, దేవతలని, విభజనజేసి వీటినంతయు ననాత్మయని నిర్ధారము జేయును. వీటికంటె దాను భిన్నుడనియు నవి దాను గాదనియు, వీటియందు దాను దెలిసి, కార్యకారియై, యిచ్ఛయించినవాడనియు, నిర్ధారము జేసుకొనును. "అనాత్మ యనగా నేమి"? యను ప్రశ్నకు "నేను తెలిసి, ఇచ్ఛయించి, కార్యకారి యగు భావమును తెలియజాలని పదార్థమను" యుత్తరమగును. క్రమముగా దీర్ఘవిచారమువల్ల దనకు నుండు వాహనము లన్నియు, అనాత్మకు సంబంధించినదిగా, అనగా, దెలియదగిన పదార్థములుగా, అనగా జ్ఞేయముగా దెలియును. పరమాత్మనుంచి తన్ను వేరుజేయు మొట్టమొదట జీవుడను భావమును గలిగించు సూక్ష్మశరీరమును మాత్రము తనకు వేరని తెలిసికొనుట చాలాకష్టము. ఏలన తానను భావము పోయిన పరమాత్మయందు లీనమగుటయే కదా? భేదభావమునకా శరీర మావశ్యకము.

### జ్ఞానము తెలియుట.

ఆత్మ జ్ఞాత యగుటకును అనాత్మ జ్ఞేయ మగుటకును నిరంటికిని యొక నిర్దిష్టమైన సంబంధ ముండవలెను. అనాత్మ యాత్మను స్పర్శజేయును అందుకు బదులుగా

ఆత్మ యనాత్మను స్పర్శజేయును. ఈరెంటికి పరస్పరమైన వ్యాపార ముండవలెను. ఆత్మకు ననాత్మకు గల సంబంధము జ్ఞానము, అనగా, తెలివి యగును. ఈ సంబంధ స్వభావము మన మిప్పుడు విచారించుదము. జ్ఞానమన నొక సంబంధమని మొదట బాగుగ గ్రహించవలయును. ఇట్లు చెప్పుట రెండుపదార్థము లున్నవని స్మరించు చున్నది. అవి యేవన, ఆత్మయొక్క ప్రజ్ఞ, అనాత్మను నంగీకరించుట, యీ రెంటికి గల సంబంధము జ్ఞానమనబడును.

## జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము.

సంకల్పశక్తియొక్క ముఖ్యోద్దేశమైన లోకోపకారము చేయదలంచినవారీ మూటిని జక్కగా విమర్శజేయవలయును. పశ్చిమదేశీయుల శాస్త్రమున మనస్సు దలియు కర్తయగును. తెలిసిన పదార్థము కర్మయగును. కర్త, కర్మలకు గల సంబంధము తెలియుట యగును. జ్ఞాతయొక్క స్వభావమును జ్ఞేయముయొక్క స్వభావమును, వాటికి గల సంబంధముయొక్క స్వభావమును ఆసంబంధమెట్లు కలుగునని మనము విమర్శ జేయవలయును. వీటిని దెలిసిన, ఆత్మ జ్ఞానము దెలియ నించుక ప్రయత్నముజేసినవారగుదుము. అప్పుడు మన చుట్టునుండు లోకమునకు సహాయము జేయ సమర్థు లగుదుము. ఇదియే జ్ఞానముయొక్క ముఖ్యోద్దేశము. ప్రేమతో జేరిన జ్ఞానము లోకమును దుఃఖమునుండి తేరింపజేసి సర్వదుఃఖ రాహిత్యమైన తెలివిని బుట్టించును మన ప్రకృత విచారముయొక్క యుద్దేశ మిదియే. మన పూర్వికులు గూడ 'తత్వశాస్త్రముయొక్క యుద్దేశము దుఃఖనివృత్తియని' సత్యముగా జెప్పియున్నారు. అందు జ్ఞాత సంకల్పించును. అందుకే జ్ఞానమును మరలమరల సంపాదించ కోరుదుము. తత్వశాస్త్రముయొక్క ముఖ్యమైనగురి దుఃఖరాహిత్యమును జేయుటయే. శాంతిని గలిగించ జాలనిది సత్యమైన జ్ఞాన మెన్నటికిని గానేరదు.

---

8. కామ్యపదార్థానుభవమువల్ల గామము నణచుట యగ్నిని వెన్నవేసి యార్చ బ్రయత్నము జేసినట్లగును.

9. బాహ్యకర్మ జేయమివల్ల గాక యంతరాపేక్ష విడిచి కర్మమార్గ మవలంబించ వలయును.

10. దేహముతో గర్మ జేయకుండుటవల్ల గర్మ విమోచన గలుగదు.

11. ఉదారమైన యీవిలేనిచోట దేవు డుండజాలడు.

12. ప్రేమ దానముజేయుటదప్ప నితర మపేక్షించదు.

## పరాశరస్మృతి.

14. రాజునకు తన పంటలో నారవభాగమును, బ్రాహ్మణులకు యిరువదియొకటవ భాగమును, దేవతలకు ముప్పదవభాగము నిచ్చిన వ్యవసాయపరుడు పాపముల నుండి విముక్తుడగును.

15. క్షత్రియుడైన వ్యవసాయపరుడు గూడ దనపొలములో బండిన ధాన్యముచేత దేవతలను బ్రాహ్మణులను దృప్తిచేయవలెను. వైశ్యుడు గాని శూద్రుడుగాని వర్తకముచేతగాని, వ్యవసాయముచేతగాని చేతిపనిచేతగాని జీవనము చేయవలెను.

16. బ్రాహ్మణుల నేవిధముగా సేవ చేయక నుండుటవల్లను, హీనమైన కర్మలు జేయుటవల్లను, శూద్రుడు పాపాసక్తి గలవాడై చచ్చినవనుక నరకమును బొందును. ఈ ధర్మములు నాల్గువర్ణములవారికి నిర్బంధములు.

## మూడవయధ్యాయము.

1. జననమరణాశౌచకాలమును గురించి యికమీద జెప్పబోవుచున్నాను.

2. ఒక కుటుంబమున జననముగాని మరణముగాని సంభవించిన నాశౌచకాలము బ్రాహ్మణుని విషయమున మూడుదినములనియు, క్షత్రియుని విషయమున పండ్రెండు దినములనియు, వైశ్యునివిషయమున పదునైదు దినములనియు, శూద్రుని విషయమున ముప్పదిదినము లని మను పరాశరులు విధించియున్నారు.

3. బ్రాహ్మణునిదేహము దేవతాపూజవల్ల పరిశుద్ధమౌను గనుక నతని యింటను గలుగు జననాశౌచకాలమున నతనిదేహమును స్పృశింపవచ్చును.

4. జననాశౌచకాలము బ్రాహ్మణుని విషయమున పదిదినములనియు, క్షత్రియుని విషయమున పండ్రెండు దినములనియు, వైశ్యుని విషయమున పదునైదు దినములనియు, శూద్రుని విషయమున ముప్పదిదినములై యున్నది.

5. వేదాధ్యయనము జేయుచు నగ్నిహోత్రమును గల బ్రాహ్మణు లొక్కదినమున బరిశుద్ధు లౌదురు. వేదాధ్యయనము మాత్రమె సలుపువారు మూడుదినములవఱకు యపరిశుద్ధులుగా నుందురు. పైరెండుతరగతులకు జేరనివారు పదిదినముల పరిశుద్ధులుగా నుందురు.

6. తన వర్ణమునకు ధర్మమైన క్రియలను జేయక యనుదినము సంధ్యావందనము గూడ సలుపక నామమాత్రము బ్రాహ్మణుండుగా నుండు బ్రాహ్మణుని విషయమున జననా శౌచకాలము పదిదినములు వరుసగా నుండును.

7. వేరువే రిండ్లయందు వారివారి భార్యయలతో నివశించుజ్ఞాతుల విషయమున జననా శౌచకాలము పదిదినములు వరుసగా నుండునని భావించవలెను.

8. ఈ రెండుసందర్భములయందు నాకుటుంబములయొక్క యన్నమును దినకూడదు. ఆకాలమున దానము ప్రతిగ్రహము, హోమకర్మ వేదాధ్యయనము మానవలెను.

9. జననాశౌచకాలము జ్ఞాతులవిషయమున పైనిక్రింది నాలుగువంశములవరకు పూర్ణముగా లెఖపెట్టివలశినది. సంబంధ బంధము రక్తసంబంధమైన యేడవతరమున నివర్తించును.

10. నాల్గవతరమువరకు జ్ఞాతులు పదిదినములా శౌచముండవలెను. ఐదవతరమువారు యామరాత్రుల శుచిగా నుండవలెను. ఆరవతరమువారు నాల్గు దినముల శుచిగా నుండవలెను. ఏడవతరమువారు మూడుదినముల శుచిగా నుండిన జాలును.

11. ఐదవతరము జ్ఞాతు లొకని శ్రార్ధక్రియల సమయమున నిచ్చు భోజనము నంగీకరించకూడదు. ఆరవతరము జ్ఞాతులట్టి భోజనమును గైకొనవచ్చును.

12. ఉన్నత ప్రదేశమునుండి పడియో, అగ్నివల్లనో, దూరదేశమున నుండియో, శిశువుయొక్కయో, లేక సన్యాసియొక్క మరణమున కశుచి యొకదినమే.

13. జ్ఞా జచ్చిన పదిదినము లైనతర్వాత, ఆ సమాచారము వినినదినము నుండి మూడుదినము లా శౌచము ననుష్టించవలయును. చావుదినమునుండి యొక సంవత్సర మైనవెనుక వినిన దనమీదనున్న బట్టలతో గూడ స్నానము జేసిన నాదినమె శుచి యగును.

14. దూరదేశమున జచ్చిన సగోత్రుని చావు వినగానె యొక డొకదినమశుచిగా నుండును.

15. మూడు పక్షములు వయసున్నగల బిడ్డ చచ్చిన విషయమై యశౌచకాలము మూడురాత్రులే. ఆరునెలలు వయసున్నగాక ముందుచచ్చిన బిడ్డ విషయమున నశౌచ మొకపగలు రాత్రియే. ఏడునెలలు మొదలొక సంవత్సరమువఱకు వయసున్నగల బిడ్డ జచ్చిన నశౌచ మొక్కదినమే.

16. పండ్లు పుట్టుటకు ముందుగాని పుట్టగానే చచ్చిన బిడ్డల శవములను గాల్చకూడదు. అట్టి శిశువులకు నుదక దానము జేయగూడదు. వారి మరణమునకు నశౌచము గూడ లేదు.

17. గర్భ విచ్ఛిన్నమైన గాని పిండ మూడిపడిన విషయమున, ననుష్ఠించవలసిన యశౌచకాల మెన్నినెల లామె గర్భవతిగా నుండెనో యన్నిదినము లుండవలయును.

18. గర్భవతియైనది మొదలు నాలుగుమాసములలోగా గర్భస్రావము గలుగును. ఆరునెలలలోగా పిండమూడును. ఆకాలమైనవెనుక బిడ్డ పుట్టిన ప్రసవ మనబడును. దీనికి నశౌచకాలము పదిదినములు.

19. ప్రసవాంతమున దల్లి జీవముండు శిశువును గనిన జ్ఞాతులు పదిదినము లశౌచము గలవారగుదురు. జీవములేని శిశువు పుట్టిన, దల్లికిమాత్ర మట్లశౌచము.

20. ముట్టుగాని, చావుగాని, ప్రసవముగాని రాత్రికాలమున సంభవించిన నశౌచకాలము పూర్వదినమునుండి లెక్క పెట్టవలయును.

21. పండ్లు వచ్చినవెనుక గాని, చూడాకర్మము జరిగినవెనుక గాని చచ్చిన శిశువు శవమును యథావిధిగా కాల్చవలయును. అట్టి చావువిషయమున మూడుదినము లశౌచము.

22. పండ్లు పుట్టుటకుముందు చచ్చినశిశువు విషయమున నశౌచ మొక్కదినము మాత్రమె. చూడాకర్మక్రియ జరుగుటకుముందు చచ్చిన, నొక్కపగ లొక్కరాత్రియె. ఉపనయనముగాక ముందు చచ్చిన మూడుదినములును, తరువాత చచ్చిన పదిదినము లశౌచ ముండవలయును.

23. ఒక మొగశిశువు తల్లిగర్భమున జచ్చిన పదిదినముల శౌచమున్ను, తల్లి గర్భమునుండి వెలువడి పుట్టినతరుణము జచ్చిన నొక్కదినము మాత్రమె.

24. అన్నప్రాశనము, చూడాకర్మక్రియలు చేయకముందు చచ్చిన పడుచు తండ్రియొక్క జ్ఞాతులకు చచ్చినదినముమాత్ర మశౌచము. ఆమె పెండ్లియైన తరువాత జచ్చిన, వారు మూడుదినము లశౌచ ముండవలయును.

25. తన యింట దనకు సంబంధములేక యగ్నిహోత్రక్రియలు సలుపుచుండిన యొక బ్రహ్మచారి చచ్చిన యాగృహస్థు డశౌచ ముండ బనిలేదు.

26. జననమరణాశౌచములు బంధుత్వ బంధముల ననుసరించి బ్రాహ్మణునికి గలిగినవి. బంధుత్వము లేకున్న నశౌచము గూడలేదు.

27. శిల్పికారులు, చేతిపనివారు, వైద్యులు, దాసీలు, పరిచారికలు, మంగలవారు, శ్రోత్రియులు, రాజులు, తమ జ్ఞాతు లెవ్వరైనను జచ్చినగాని పుట్టినగాని యాదినమే స్నానము జేసిన శుచి యగుదురు.

28. యజ్ఞమును జేయు, దానముజేయు, యెవరివల్లనైన బ్రాహ్మణుపబడిపోవు బ్రాహ్మణు డాసమయమున బరిశుద్ధుడుగా నుండవలయును. ఇది ఋషులమతము.

29. క్రమముగా ధర్మక్రియల నాచరించు బ్రాహ్మణ గృహస్థుడు దనకుమారుని జననకాలమందు పురిటింటి స్పర్శ లేకున్నట్లయితే, యాదినమే స్నానము జేయుటవల్ల పరిశుద్ధుడౌను. తల్లి పదిదినము లశౌచ ముండవలయును.

30. సహావ్రతుడు, క్రమముగా నగ్నిహోత్రక్రియలు సలుపునతడుగాని వేద మంత్ర పారాయణముచేత పావనమైన దేహము గలిగినట్టిగాని బ్రాహ్మణుడు రాజు, రాజాజ్ఞను బొందినవాడు, వీరికి జననాశౌచము లేదు.

31. కుమారుడు చనిపోయిన, తల్లిదండ్రులకు మరణాశౌచము పదిదినములు. బిడ్డయొక్క జననాశౌచముచే దల్లి మైలయగును. తండ్రి స్నానముజేసిన తక్షణము పరిశుద్ధత్వము నొందును. ఒక బ్రాహ్మణగృహస్థుడు తన భార్య ప్రసవించిన వెనుక యామె నేవిధముగానైనను స్పృశింపకున్న స్నానము జేయుటవల్ల పరిశుద్ధు డగును. అతని భార్యకు పదిదినము లశౌచము గలదు.

32. షడంగములతోగూడి వేదపారగుడైన బ్రాహ్మణుడైనను భార్య ప్రసవించినపిదప నామె నంటిన జననాశౌచము బొందును.

33. బ్రాహ్మణుడు మలినస్పర్శచేతనే యపరిశుద్ధుడగును. గాని వేదవిధముగా నపరిశుద్ధుడు గాడు గనుక బ్రాహ్మణుడన్నివిధముల మైలయంటులను మానవలయును.

34. జరుగబోవు పెండ్లికిగాని మతక్రియల సందర్భమునగాని దానమున కుద్దేశింపబడిన వస్తువులు వాస్తవముగా నివ్వబడియున్నట్లయితే మధ్యమున సంభవించు జననమరణాశౌచములచేత నపవిత్రము గానేరవు. అట్టి దానము లాంతర్యమైన జననమరణాశౌచములచేత మార్పుబొందవు.

యోగమైన కార్య ధురంధరత్వజ్ఞానము గల బలవంతులను మహాత్ములు వెదకుకొనవలసియున్నది. మన యాత్మ వృద్ధియు నభిమానమును విడువగూడదని వైనను యుక్తమమైన వారి యాజ్ఞా ననుసరించి నడువజాలనివారుగా నుండగూడదు. మనయందు పరమాత్మ యున్నదని యొకవేళ దెలిసినను, ఇతరులయందు గూడ పరమాత్మయున్నదనుమాట మరచిపోదుము. ఒకవేళ మరల నొక జ్ఞాని సంపర్కము గలిగినగాని యాస్మరణ మరల బుట్టును. మన చుట్టుప్రక్కల నున్నవారి సహాయము లేక జీవనమార్గ మెక్కజాలము. మనకు దెలియకయే యిట్టి సహాయము ప్రతిక్షణమునకు గలుగుచు దాని నుపయోగించుచు దాని ఫలము బొందుచున్నాము. ఈ విషయమున మనకంటె నెక్కువ జ్ఞానముగల్గి మోక్షమార్గము మనకు జూపువారికి మనము కృతజ్ఞులుగా నుండవలశినది, ఈ విషయము నిజమైనది. దాని నంగీకరించుట మనకెంతకు నిష్టము లేకుండవలయును. అది యోచనలేనితనముయొక్క కృతఘ్నతయే. ఒక యుత్తమమయిన పిలుపువచ్చినప్పుడు మనకు నుండు వాసనలను అభిప్రాయములను నిర్భయముగా విడిచెదము. మనకు స్ఫురించు జ్ఞానమును భయపడక నమ్మి మలినాంతఃకరణ సంబంధముగాక యుండునట్లు జాగ్రతగా జూచుకొనెదము. గనుక నీ సమాజము యొక్క యుద్దేశము కేవలాంతర్యమైనది. ఈ సమాజము బహిఃప్రచారమున జ్ఞాన సాధనమార్గముగా లోకమునకు సహాయముగా నుండవలెను. దైవమును గురించిన విషయముల కాకరముగాను జ్ఞానమునకును ప్రపంచమునకును సంబంధమును గలుగజేయునదిగాను మహాత్ములు దిమ పనుల నుపయోగించు సాధనముగాను జేయవలయును. అట్టి గొప్ప యుద్దేశముతో సర్వులు యీ సమాజ కార్యములు నిర్వహించవలెను. ఈ సమాజ మగ్నిహోత్రమువంటిది. జీవనామృత పాత్రయైనది. దీనిని శుద్ధిగాను ప్రకాశమానముగాను సాధ్యమైనంత లోపరహితముగా జేయవలయును. అట్లు చేసిననది జీవభూతమై చాలాకాలముండి లోకమున దాని కార్యమును జేయునని నమ్మియున్నాము.

మా పు రా ణ ము.

5. దేహమున ననేక సాధనము లున్నవి. దేహముగూడ నొక సాధనమగును. వినుటకు జెవు లున్నవి, చూచుటకు గన్నులున్నవి, తినుటకు నోరున్నది, రుచించుటకు నాలుక యున్నది. సర్వకాలమున మనము శుభమును గోరుచుందుము. శాశ్వితసుఖము ననుభవించుటకు దేహమున సాధనమున్నది. అజ్ఞానము మనలను ప్రతిక్షణము వంచించుచుండును గనుక శాశ్వత సుఖమును సాధించుటకు మనము ప్రయత్నించవలయును.

6. జాగ్రదవస్థయం దనగా మేల్కనియుండ ననేకముల ననుభవింతుము. నిద్రసమయమున స్వప్నమున ననేకముల ననుభవింతుము. సుషుప్తియందు సుఖముగా నిద్రించెదము. ఈ మూడవస్థలను నేనను పదార్థము సమముగా జూచుచున్నదికదా? అదియే శాశ్వతమైన పదార్థము. దానిని బొందుటకు ననేక జన్మములు గావలశియున్నవి. ఇది మిగుల విచారింపదగిన విషయము గనుక గమనించవలయును.

7. ఒకానొక కాలమున నొక రాజు దనకు గురువు గావలయునని గోరి సకల భోగభాగ్యములతో దేశమంతట దిరుగుచుండెను. అతనికి నొకరును గనబడ లేదు. పిమ్మట లోకమున దనకు గురువగుటకు నెవ రధికారులు లేరని దన పట్టణమున జాటించుటకు నాజ్ఞాపింప నట్లే చారుడు చాటించెను అప్పు డొక సందులో నివశించుచున్న నొక ముసలివా డా చాటించువాని బిలచి సమాచారము దెలిసికొని నీవు జాటించునది తప్పుగా నున్నది. రాజిట్లు అభిప్రాయపడి యుండడు సరియైన శిష్యుడు లేడని చాటింపుమని చెప్ప నాచారు డట్లె చాటించ సాగెను. దానిని రాజు దెలిసి యట్లేల చాటించుచున్నావని యడుగ నాముసలివానికథ నాతనికి జెప్పెను. అంత నారాజు శీఘ్రముగ నాముసలివానిని సమీపించి నన్ను శిష్యునిగా నను గ్రహించవలయునని ప్రార్థించెను. అతడు దయాపరుడై నన్ను నీకు జూపిన చారునకు మొదట మ్రొక్కుమనెను. తరువాత నతడు రాజును శిష్యునిగా గైకొని రాజ్యమును వానిబంధువుల కప్పగింప జేసి తన వెంటబెట్టుకొని యనేక పట్టణములుదాటి యొక గ్రామమున నుండు నొక వేశ్యాగృహము జేరి యావేశ్యతో గొన్ని రాగినాణ్యముల నప్పుగా గైకొని యారాజు నక్కడ కుదువబెట్టి తానెచ్చటకో యేగెను. అంత నారాజు దన గురుపదాంబుజములందు స్థిరమైన బుద్ధిగలవాడై కేవల ముముక్షువై నందున దాను నీచకర్మములు చేయ నియోగింపబడినను కొంచమైనను దైన్యము జెందక కాలము గడపుచుండెను. ఒకనా డతడు జలదారిగల ప్రదేశమున నొక తిన్నె మీద పరుండియుండ నాభోగముదాన్ని ముసలితల్లి యాజలదారియందు మురికినీళ్లను బారవైచ నవి జలదారిలో బడక యతనిమీద పడి యతని శరీరమునుండి కొన్ని బిందువులు నాముసలిదానిమీదికి జిలుకరించినట్లు కాగా నామె యొక్క వయోవంతు రాలైన పడుచాయెను. అంత నాశ్చర్యపడి నాముసలిది జరిగిన సమాచారము నాబిడ్డతో జెప్ప నంతసూక్ష్మమున దనతల్లికి గలిగిన సౌఖ్యము నాలోచించుచు నతనితో రమించిన నెంత సుఖమబ్బునో యని చింతించి అంగలకు బ్రయత్నించి యారాజును వేశ్య పాన్పుపై గూర్చుండ బెట్టిన సమయమున నెక్కడికో వెళ్లి యుండిన నాగురువా సమయమునకు సరిగా నచటికి వచ్చి యిదిగో నీవిచ్చిన రాగి నాణ్యము గొని నారాజును నాకిమ్మని రాజును విడిపించుకొని వెళ్లిపోయెను. ఆగురువు దన శిష్యుడు బ్రవర్తించిన మార్గమంతయు గ్రహించి బ్రహ్మేతరపదార్థాపేక్ష లేని వానిగా దెలిసి వానికి గావలసిన జ్ఞానబోధ జేసెను. అట్లు సర్వసంగ పరిత్యాగము గలిగి విషయాపేక్ష స్మరణరహితుడై తదేకనిష్ఠుడుగా నుండినగాని జ్ఞానము లభ్యము గాదని నిశ్చయముగా దెలియవలయును. దీనినుంచి మఱి యనేక సుగుణముల నూహించనగు.

'Registered No. M 716.

SWAN SERIES No. 3

ఓం






A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఒక యాంధ్ర బ్రహ్మజ్ఞాన మాసపత్రిక.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 1.] ఏప్రిల్ 1908. [సంచిక 4.

విషయసూచిక.



చెన్నపట్టణము:
వైజయంతీ ముద్రాశాలయందు ముద్రింపబడినది.

గుత్తి హంసశాల మానేజరు గారికి వ్రాసుకొనవలయును.
సంవత్సరమునకు చందా 1 రూపాయ.

## హంసావళి.

1. షట్త్రింశన్మంజరి:—శ్రీశంకరాచార్యులు రచించిన భజగోవింద శ్లోకముల నాంధ్రభాషాణ పద్యాత్మకముగా రచింపబడినది. ఆబాలవృద్ధులకు నానందకరమైనది. వెల 2 అణాలు మాత్రమే.

2. ఏకాదిరత్నావళి:—1 మొదలు 224 సంఖ్యవరకు గల విషయవిశేషములిందు సంగ్రహింపబడినవి (అయనద్వయము, వాసనాత్రయము, సాధన చతుష్టయము, మొదలగు 1008 విషయములు) వెల 4 అణాలు మాత్రమే.

3. హంస:—ఇది మాసతెనుగు పత్రిక 1908 జనవరినుండి వెలువడుచున్నది. ఈ జన్మసార్థకము జేసుకొనగోరువారు దీనిని నిరాకరించజాలరు. చందా సంవత్సరమునకు నొక రూపాయియే.

హంసశాల,
గుత్తి, అనంతపురం జిల్లా.

హ. సుబ్బరామయ్య,
కార్యదర్శి.

# THE THEOSOPHICAL SOCIETY.

# బ్రహ్మవిద్యా సమాజము.

ఈ సమాజము నానాటికి ప్రపంచమంతట శాఖోపశాఖలుగ ప్రసరించుచున్నది. ఈ దేశమున పూర్వమాది శంకరులద్వైతమతమును స్థాపించిరి. పిమ్మట శ్రీరామానుజాచార్యులు విశిష్టాద్వైతమును కల్పనజేసిరి. ఆపిమ్మట శ్రీమధ్వాచార్యులు ద్వైతమును నిర్దేశించిరి. మనప్రకృతకాలమునకు బ్రహ్మవిద్యాసమాజ మేర్పడియున్నది. ఈ సమాజ మీదేశమునకు ముఖ్యముగా నుండినను లోకమున ననేక మతము లందు వివిధ దేశములకు సమ్మతముగా నుండునట్లు కనుగొనబడుచున్నది. ఈ సమాజమున బోధించు తత్త్వార్థములు సర్వమతములకు సమ్మతిమై మూలాధారమైయుండును. ఈ సమాజముయొక్క యుద్దేశమును కార్యములును బ్రహ్మవిద్యయన నేమైనది కొంచము విచారింతము. ఈ సమాజము, సర్వవ్యాపకమైయుండు పరమాత్మయొక్కడే గనుక సోదరభావమును గొప్ప యాధారముగ గలిగియున్నది. ఈ విషయమును మాత్రము సమాజమున జేరినవారందరు దెలిసియొప్పుకొనవలసియున్నది. ఇతర విషయ

ఓం



సత్యమునకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 1.] ఏప్రిల్ 1908. [సంచిక 4.

## పురాణభక్తనిచయము.

### 2. నారదుడు

నలకూబరుడు, మణిగ్రీవుడను నిద్దరు గంధర్వులు సిగ్గులేక విఱ్ఱవీగుచుండ వారి గర్వభంగమునకై మధురాపట్టణమున రెండు చెట్లుగ బుట్టుగాక యని యా నారదుడు శపించెను. వారిద్దరప్పుడు నారదమహర్షిని శాపవిమోచనమునకై యుపాయంబు దయ చేయుమని ప్రార్థింప, నక్కరుణ శ్రీకృష్ణుఁడవతరించి యతని స్పర్శగలిగిన శాపవిమోచన మగునని యతఁడనుగ్రహించెను. అంతట వారిద్దరు రెండుచెట్లై, యనేకయుగములు కాచుకొని యుండ కృష్ణావతారము సిద్ధమైనదాగా, శ్రీకృష్ణమూర్తి తన్ను కట్టివేసిన రోటిని యీడ్చుకొనివెళ్లి యా రెండు చెట్లమధ్య ప్రవేశించినఁ బెల్లగింపబడెను. అప్పుడా యిద్దరు గంధర్వులు శాపవిమోచనులై నిజరూపంబులం బొంది, శ్రీకృష్ణమూర్తికి నమస్కరించి, తమకు గర్వభంగమైనగాని భగవత్సాక్షాత్కారమైనదని చాలా సంతోషించి విహరింప వెళ్లిరి.

రావణుడు లోకమున జయభేరి గొట్టుచు నిరాటంకముగ విహరించుచు ననేక రాజులను జంపుచు నున్నసమయమున నారదుఁ డతనికి బ్రత్యక్షమై భూపతులెన్నఁడైన నొకనాడు జచ్చువారు గనుక వారిని జంపుట నీకేమియు పరాక్రమమైన పనిగాదు. నీవు ఘనుడవై పరాక్రమశాలియని కీర్తివహింప నిచ్చయుండెనేని మృత్యుదేవతయైన యముని జయించ ప్రయత్నముజేయుమని సెలవిచ్చెను. రావణుఁడంత మంచిదని సంత

సించి, యమలోకమునకు వెళ్లి యమునితో నేండ్లకొలది యుద్ధము చేయసాగెను. ఇటు కొంతకాలము భూలోకమున నితని బాధలేక విశ్రాంతి గలిగియుండెను.

ఒకానొక సమయమున రావణుడు లోకములకు నెక్కువబాధలు గలిగించు చుండ శ్రీహరిభక్తులుండు శ్వేతద్వీపమునకు వెళ్లమని నారదమహర్షి యతనికి బోధ జేయ నతడక్కడికి వెళ్లెను. అచ్చట స్త్రీలందరతనిని పుట్టచెండును నాడునట్లు పరిహ సించి, లాఘవముగా నొనర్చి యతని గర్వభంగము జేసిరి. ఆహా! ఈ ఋషియొక్క ప్రవర్తనలెంతాశ్చర్యకరమైనవి, యెంత కుశలతగా జేయబడినవి.

ఇంద్రుడు దనశౌర్యపరాక్రమములకు జాలాగర్వితుడైయుండి కృష్ణునికంటె నధికుడని విఱ్ఱవీగుచుండ నారదుడతని గర్వభంగముజేయబూని యొకనాడు సువాసన గల పారిజాతపుష్పమును జేతగొని శ్రీకృష్ణునకు సమర్పించెను. అంత శ్రీకృష్ణమూర్తి దనప్రియురాలైన రుక్మిణికి దానినిచ్చెను. సత్యభామ యది జూచి యోర్వలేక దనకు గూడ నట్టి పుష్పము గావలయునని గోరెను. ఆమెను తృప్తిపరచుటకై శ్రీకృష్ణమూర్తి యామె యుద్యానవనమున దేవలోకమునుండు పారిజాతవృక్షమును దెప్పించి యామె దనవిదిర నచ్చట నుంచెదనని వాగ్దానముజేసెను. అంత శ్రీకృష్ణమూర్తి స్వర్గమునుండు పారిజాతవృక్షమును భూలోకమునకు బంపవలయునని నారదుని ద్వారా యింద్రునికి జెప్పిపంప నింద్రుడాసంగతివిని స్వర్గమునకుండవలసిన పారిజాత వృక్షము భూలోకమునకు నెట్లు పంపనగునని శ్రీకృష్ణుని యాజ్ఞను దిరస్కరించ శ్రీకృష్ణమూర్తి స్వర్గమునకు వెళ్లి యింద్రునితో బోరాడి మొదటిదినమున నోడించెను. రెండవనాడు మరల యుద్ధము జేయ నింద్రుడాలోచించు సమయమున నారదుడును, కశ్యపుడును, ఇంద్రునివద్దకు వెళ్లి శ్రీకృష్ణుని మహాత్మ్యము నతనికి బోధించి యతనితో బోరాడదగ దనిజెప్ప మరునాడింద్రుడు నమ్రుడై శ్రీకృష్ణునియొద్దకు వెళ్లి యపరాధంబును క్షమింపు మని వేడుకొనెను.

లోకమున నెవరికైన నేదైన బోధజేయబూనుకొన్న నారదుడనుకూలమైన యవకాశములన్ని గలిగించి వారికి నా బోధ చక్కగా నాటునట్లు చేయుటకు నను కూలముగూడ గలిగించును. భర్తయొక్క యాయుస్సు నెక్కువగ నుండగోరు స్త్రీదన మగనిని నొక మహాపురుషునకు నొక పవిత్రమైన చెట్టుక్రింద దానముజేసి, ఆమహా పురుషుడు గోరుదానిని నిచ్చి మగనిని వెనుకకు దీసుకొనవలయునను వ్రతము శాస్త్రమున

విధింపబడియున్నదనిచెప్పి దానిని సత్యభామ నాచరింప ప్రేరేపించి నారదుఁడు దానే యా దానమును గైకొనువాడుగా నొప్పుకొనెను. అప్పుడు గర్వించిన సత్యభామ శ్రీకృష్ణమూర్తిని పారిజాతవృక్షముక్రింద నునిచి దానము చేసెను. అంత శ్రీకృష్ణమూర్తిని వెనుకకు నివ్వ నతనిన్నారదునకు సత్యభామ నగల నిచ్చిన వెనుకకు నిత్తునని నారదమహర్షి నిర్ధారము జేసెను. అప్పుడొక గొప్ప త్రాసును దెచ్చి యొక తట్టు శ్రీకృష్ణుని గూర్చుండబెట్టి మరియొక తట్టు సత్యభామయొక్క భూషణము లన్నియు పెట్ట నారంభించిరి. శ్రీకృష్ణమూర్తి యుండినతట్టు నెక్కువ భారముగ నుండెను. రుక్మిణి తప్ప యితరభార్యలందరు తమతమ యాభరణములు దెచ్చి పెట్ట నేయు శ్రీకృష్ణమూర్తినించుకయైన గదలదయ్యె. అప్పుడందరు స్త్రీలు సత్యభామను యాప్రతి మాంచరించినందుకు దిట్టసాగిరి. అంతట రుక్మిణి దనచేత నొక తులసీదళమును గైకొని యా త్రాసును సమీపించి యా తులసీదళమును నగలుండిన తట్టులో వైచుటకు బ్రయత్నించె నంతట రామెయొక్క వల్లీతనమునకు విస్మయమొందుచుండ, దానిని యామె చేసి పెట్టగా, యా తులసీదళము భూషణములుండు త్రాసున భక్తిపూర్వకంబుగా నునచ, శ్రీకృష్ణమూర్తి దానిసమముగ దూగినవాడాయెను. అప్పుడందరు మారాణికి రుక్మిణియొక్క శ్రేష్ఠత్వమును గని సత్యభామ గర్వమణచి, శ్రీకృష్ణమూర్తి రుక్మిణికి జేసిన సత్కారమునుగురించి యితరస్త్రీలు కొనియాడుకొనుచుండిరి. ఇట్లు నారదుడు సత్యభామయొక్క గర్వభంగము చేసెను. మానవులజ్ఞానోదయమునకు నితడు పాటుపడుటగాక సర్వలోకముల యౌన్నత్యమునకై పాటుపడుచుండును. నారదసూత్రములయందు భక్తివిషయమున గల యనవాభిప్రాయములను లోకమునకు గాను నిరూపించియున్నాడు. అతని యనుగ్రహముచేతనే వ్యాస వాల్మీక మహర్షులు భాగవత రామాయణములను లోకముల బ్రసరింప సామర్థ్యముగలవారైరి. తమసానదీతీరమున సమాధిని మునింగియున్న వాల్మీకి మహర్షి క్రౌంచపక్షిని జంపిన బోయవానిపై యప్పై తన నోటినుంచి జారిన "మా నిషాదప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీస్సమా । యత్క్రౌంచమిథునాదేక మవధీః కామమోహితం" యను శ్లోకార్థమును ధ్యానించు సమయమున బ్రహ్మ యతనికి ప్రత్యక్షమై నారదుడతనికి జెప్పబోవు సంక్షిపరామాయణమును గ్రహించి రామాయణ మహాకావ్యమును రచించ నాజ్ఞాపించెను. నారదుడు దన తండ్రియైన బ్రహ్మయొక్క యాజ్ఞానుసారముగ రామకథను వాల్మీకికి సంక్షిప్తముగ జెప్పెను. అంత వాల్మీకి రామా

యణ మహాకావ్యమును గావించెను. అట్లనే వ్యాసుడు వేదముల నేర్పరిచి యుండి నను మహాభారతమును వ్రాసియుండినను దాను గోరినప్రకారము మనో నిర్మలత్వము సమాధానమును బొందక యుండి మనసున నేదో యొక విచార ముండునట్లు దోచి దన ధర్మమును తాను జేయవలసిన కర్మను దా జేయలేదని మనసున జింతబుట్టి యుండు సమయమున నారదమహర్షి యతనియొద్దకు వెళ్ల నదివరకు నతడు కర్మమార్గాసక్తులకు విధులను నేర్పరిచితివి గాని కర్మగర్భమైన మోక్షోపాయమునకు నే దారి జూప నైతివి. గనుక భక్తిమార్గంబును సమగ్రంబుగ జూప భాగవతంబు రచింపుమని జెప్ప వ్యాసు డట్లుచేసి బుద్ధివిశుద్ధత్వమును బొంది కృతకృత్యు డాయెను.

నారదుని జీవన మనేక యుగములను వ్యాపించి యున్నది. గనుక నతని చరిత్రము సంపూర్ణముగ జెప్ప నెవరికిని నలవిగా . అతి దివ్యజ్ఞాని లోకమునకు హితమును జేయువాడై సంచరించుచున్నాడు. ఇతడు ప్రకృతిమున మన కెవరికిని గన్పడలేదని మన మనుకొనవచ్చును. అయితే మనకు నట్టి మహానీయుల దగ్గర మబ్బుటకు మనకు సరియైన యోగ్యత యున్నదా యనువిషయమును మాత్రము మనము విచారింపవలసి యున్నది. అవిషయము ప్రతివాని మనస్సునకే గోచరము. ఈ కాలమునగూడ ద్రావిడ దేశమున త్యాగరాజను ప్రసిద్ధికెక్కిన పాటకు డిప్పటికి నేబదియేండ్లముందు తంజావూరుజిల్లాలోని తిరువాడియను గ్రామమున నుండు దేవాలయమున భక్తిసలుపుచుండ నారదు డతనికి ప్రత్యక్షమై గానవిద్య నుపదేశించినట్లు వాడుక యున్నది. అట్టి యనుగ్రహము లేకున్న నతని కృతులు లోకమున నెచ్చటజూచినను బ్రసిద్ధమై యతిమనోహరంబుగను శ్రావ్యమై యుండుటకు వేరు కారణం బూహింప నసాధ్యంబని మనకు దోచుచున్నదికదా? ఇట్లు మహానుభావుల యనుగ్రహమునకు పాత్రు డగువాడు నూటికి కోటికి నొక డుండునో లేదో. వాడే ధన్యుడు. అట్టి ధన్యత్వమును మనము సంపాదించుకొనుటకు సదా ప్రయత్నించుచుండవలెను. సురల నారద మహర్షికి వందన మాచరించి కార్యసిద్ధికై ప్రార్థించుదము.

# ఏకాగ్రత ధ్యానము.

ఇంద్రియ నిగ్రహము గలిగి, విషయములను త్రెంచివేసి, దైవసంపత్తును సంపాదించిన మానవుడు జ్ఞాని యనబడును. అట్టి పదవి సంపాదించ వివిధమార్గము లున్నవి. ఈ మార్గములకు యోగమని పేరు. ఏకాగ్రతయు, ధ్యానముగల యోగము రాజయోగ మందురు. ఇదియే శ్రేష్ఠమైన యోగము గనుక రాజయోగ మనబడును. ఏకాగ్రత వల్ల గలుగు శక్తికంటె నెక్కువైన శక్తి వేరులేదు. లోకమున మనస్సే సర్వశక్తి యని రాజయోగము బోధించును. లోకమున మనము జూచు పదార్థములు వాటి నిజస్వరూపములు గావు. మనస్సును క్రమమైన మార్గమున నిగ్రహించి దృశ్యమును జూచిన పదార్థముల నిజస్వరూపము అప్పుడు వెల్లడి యగును. దృశ్యమున నుండు పదార్థముల క్రింది ఆధారమైన నియమములుగూడ గోచరమగును. అనేక పదార్థములను ప్రకాశింపజేయు విద్యుచ్ఛక్తి దీపముయొక్క రశ్మివలె మన మనస్సుయొక్క శక్తి చెదరి యున్నది. దీపముయొక్క రశ్మియంతయు నొక కిరణముగా జేర్చి యుపయోగించిన దూర పదార్థములుగూడ స్పష్టముగా గనబడును. యోగియొక్క ఏకాగ్రమైన చిత్తము కొండలను బట్టు లాంతరువలె బోల్పవచ్చును. అదృశ్యమై యజ్ఞాతమైన లోకములయందలి సూక్ష్మపదార్థముల నేకాగ్రచిత్తమున గ్రహించవచ్చును. ఆత్మజ్ఞానమునుగూడ సంపాదించవచ్చును. ప్రతిమనిషియందు నేకాగ్రత గలదు. తెలిసియో తెలియకయో నిత్యము పనులలో దాని నుపయోగించును. సాధారణముగా నేకాగ్రత యన గమనమనబడును. విను విషయములయందు గమనము పెట్టని యెడల నావిషయములను గ్రహించము. ఒక పుస్తకమును జదువ వేరొక దానిమీద నున గమనము పోయిన జదివినది మనసున నాటదు. నీతో నెవ్వరైన మాటలాడుచుండ, నీవు గమనించకున్న నా మాటలను వినవు. ఇట్లు సర్వవిషయములను గ్రహించుటకు గమనము ముఖ్యము. లేకున్న విషయములను గ్రహించజాలవు. కొందరికి గమన మెక్కువగ నుండును. కొందరికి దక్కువగ నుండును. మనస్సుతో గూడనదియు జన్మాంతరఫల జన్యమగును. ఇట్టి యేకాగ్రమైన గమనము సాధారణముగా జీవకోటి యందగుపడుచున్నది అయితే దాని పరిమితియందు హెచ్చుతక్కువ లున్నవి కాని [illegible] భావమునందు భేదము లేదు. జంతువులన్నియు దమ యాహారము బొందుటకు

గమనమును సాధించును. ఒకగ్రద్ద కోడిపిల్లను గ్రహించుటను ఖకము చేపను బట్టుటను పిల్లి యెలుకను దినుటను బరీక్షించ వాటి యేకాగ్రమైన గమనమాశ్చర్యముతో గ్రహించెదము. ఆసమయమున నితర పదార్థముల స్మరణలేక యాహారవిషయమును మాత్ర మవి గమనించి పొందును. ఇట్లు జంతువులయందుగూడ నేకాగ్రతవలననే సర్వము సంపాదింపబడుచున్నది. ఇట్లనే మనుష్యుల విషయమునందుగూడ, సర్వమేకాగ్రమైన మనస్సుచేత సకల పురుషార్థములు సాధింపబడుచున్నవి గాని దిక్కుల దిక్కుల మనో గమనమును వెదజల్ల నేవస్తువును బొందజాలక పోవును. మన శక్తిని ననేక విషయమార్గముల విడువక యొక రాజమార్గమున నడిపించిన గోరినది సాధించ నఖండమైన శక్తి గలుగును. కమ్మరవాడు పనిజేయుటయందును పొగబండి నడుపువాడు బండిని నడుపుటయందును, గుర్రము సవారిజేయుటయందును, పాడుట, నాట్యమాడుట, చిత్రములు వ్రాయుట, కవనము జేయుట, జలమలాదులు విసర్జించుట మొదలగు మానవుడు సేయు సర్వకార్యము లేకాగ్రమైన మనస్సుచేత నగుచున్నది కాని వేరు కాదు. బ్రహ్మాండమున నున్న లోక సంచారము, సకల సిద్ధులు ఆత్మజ్ఞానము గూడ, నేకాగ్రమైన మనస్సుచేత సాధింపబడును కాని వేరు కాదు. గనుక ప్రతి మనుజునియందుండు గమన గుణము నెరిగి దానిని వృద్ధిజేయ మనోవాంఛ లన్నియు దీరును గాని యితరమార్గముల మన కోరిక లీడేరవు. లోకమున నుండు పొగబండి తంతిసమాచారము వివిధవాద్య ధ్వనులు మొదలగు ననేక చిత్రములైన కార్యము లేకాగ్రమైన మనస్సుచేతనే సృష్టింపబడినది కాని యితరపదార్థ సంచయమువల్ల గలుగలేదని విచారపరులకు స్పష్టమే కదా. ఈ గమనము లేకబోవుటవల్ల నేకదా మనకు ననేక బాధలు వ్యాధులు గలుగుచున్నవి. ఒక శిశువులు బాల్యమున మొదట ప్రయత్నములేక ప్రకాశమానమైన వస్తువులమీద, పిమ్మట దమ తల్లి ముఖముపైన గమనము బెట్టును. వెనుక దమకు నాహారము సంతోషము నిచ్చు వస్తువులమీద వారి గమనము ప్రసరించును. ఇట్లు క్రమక్రమముగా ప్రపంచవస్తువులమీద మనఃపూర్వకమైన గమనము వ్యాపించ మనస్సున వాసన లేర్పడి ధృడపడును. ఆ గమనమును సుఖసాధకమైన నీతులయందు సత్కార్యములందు నిలువ పేతిపరు డగును. ఇట్టి సన్మార్గమున మనఃపూర్వకముగా నడచిన మనము సద్గుణ సంపన్నులై ధార్మికు లగుట గాక యాత్మజ్ఞానముగూడ వృద్ధి బొందును. ఇట్లు సర్వాంతర్యామి యైన పరమాత్మునిమీద నేకాగ్రమైన గమన ముంచినను త్తమమైన జ్ఞానము ప్రాప్తించును. అజ్ఞానమువల్ల

నజ్ఞాన మాయాబంధనములు వీడి యపారమైన సుఖవృత్తి ప్రాప్తించును. ఈ యఖండానందమే యాత్మజ్ఞానము, దైవప్రజ్ఞ ఈ కాలమున మనుజానకు గలిగిన యభివృద్ధి నాగరికత, ప్రబలత్వము, బుద్ధికుశలత ఇహసుఖ సాధనము లేకాగ్రచిత్త జన్యఫలము గాని వేరుకాదు.

‘ ఒకని జీవనము నగణ్యమైనది యేకాగ్రత. అచంచలబుద్ధి యాపద. రాజ్య పాలనయందు, రణమందు, వ్యాపారమందు, సర్వ వ్యవహారములందు, జయప్రదమునకు గారణమైన రహస్య మేకాగ్రతయే, యని యొక తత్వజ్ఞుడు సెప్పియున్నాడు.

ఆహా! సర్వమును లభింపజేసుకొన నిట్టి సులభోపాయము మనయందేయుండ దీనిని దెలియక మనకు నేదో యొక బాహ్య కారణమునుంచి మనకు సుఖదుఃఖములు ప్రాప్త మగునని యెంచుట నెంత మూఢత్వమో విచారించవలయును. ఈ ధర్మసూక్ష్మమును గ్రహించి మనస్సు నొక మార్గమున బ్రవర్తింపజేసిన నేకాగ్రత యనబడును. దీనినే ధారణ యందురు. ధారణ యనగా మనస్స నేకరూపములు వహించక యెదో యొక పదార్థము మాత్రము గ్రహించి యుండుట యని పతంజలి సెప్పియున్నాడు. అంతర్బాహ్య విషయముల స్వాధీన మీ యేకాగ్రతవల్ల గలుగును. క్రమక్రమముగా మనస్సుయొక్క చలన స్వభావమును దక్కువయగునట్లు చేసి, యొక పదార్థముమీదనే మనస్సు నిలుపుట ధారణ యగును. ఇట్టి యేకాగ్రతయొక్క ఫలము దానికి విషయమైన పదార్థము ననుసరించి యుండును. తాను లభించగోరు దానిని విశదముగా దెలియుట, తనయందు నమ్మకము, దృఢమైన ఏకాగ్రతకు విషయమైన పదార్థవివేకము ప్రజ్ఞ సాహసము గలిగియుండుట, యివి యేకాగ్రతకు గావలశిన ముఖ్యమైన సాధనములు. ఈ సాధనలుండిన శీఘ్రముగా మన మనోవాంఛ లన్నియు జేకూరును.

తన్ను దాను దెలిసికొనుటయే మనుష్యునకు నుత్కృష్టమైన కార్యము గనుక యోగియైనవాడు ప్రపంచ సుఖములమీద నేకాగ్రమైన మనస్సు నుంచడు. క్షణకాలము తనకు సుఖకరమైన పదార్థములను సంపాదించుకొనకుగూడ మనోబలమును వ్యర్థము జేయుడు. లౌకిక భోగములకై కాని స్వప్రయోజనమునకు గావలశిన పదార్థములకైకూడ మనోబలమును వ్యర్థముజేయడు ఏవిధ పదార్థములకొరకు గూడ మనోబలమును వ్యర్థముగ వెదజల్లక యాశక్తిని గొప్పసాహసముతో జేర్చినగాని జ్ఞాన

సాధనగాదని పెద్దలు చెప్పుదురు. ప్రపంచవాసనలు జ్ఞానమార్గమునకు నాటంకములు. సత్యాసత్యములు, నిత్యానిత్యములు, పురుషప్రకృతులవివేకము గలవాడే నిజమైన యోగి. వాడు పరమపదవిని జేర యత్నించును గనుక నతని యేకాగ్రతయే సమాధి యనిపించుకొనును.

ఏకాగ్రత, క్షిప్తము, మూఢము, విక్షిప్తము, నిరుద్ధమని మనోగతి యైదురీతులుగా నున్నదని యందురు (1) క్షిప్తమనగా:— చలించుట. మనోచాంచల్య మెక్కువగా నుండుట. అట్టి చిత్తచాంచల్యము గలవారికి చిత్తమును దడయజేయుమని జెప్పిన నేదో ప్రమాద మగునని, యుదాసీన భావము వహించుట చావుగాని నిద్రగాని యగునని తలంచెదరు కాని యట్లు చేయుట శ్రేయస్కరమని తలంచజాలరు. (2) మూఢమన మనో వైకల్యము:—బుద్ధి కేవల జబ్బుగా వెఱ్ఱిగా మాంద్యముగా నుండుట యగును.

(3.) విక్షిప్తమన:—కొన్నివేళల క్షిప్తము కొన్నివేళల మూఢముగా నుండు మనస్సు గలిగియుండుట. (4) ఏకాగ్రమన:— నొకదానియందె మనస్సు నుంచుట. (5) నిరుద్ధమన:—నియమింపబడిన మనస్సు గలిగియుండుట. జ్ఞానికి నేకాగ్రమై నిరుద్ధమైన మనస్సే సాధనము. మన స్సేకాగ్రమైన పదార్థముల నిజస్వరూపము దెలియును. దుఃఖము గలిగించు మనోవికారములు క్షీణించును. ఇంద్రియ సుఖములు లౌకిక యాశాపాశములు వదలును. సమాధానమును వృద్ధిజేయును. పిమ్మట మనస్సు నిరుద్ధస్థితిని జెంది నిగ్రహ మగును. గనుక ముముక్షు వీరెండుస్థితులను వృద్ధిజేసుకొనవలశినది.

మనస్సు సంపూర్ణముగా నిగ్రహమైనగాని యాత్మస్ఫురణానందము గోచరముకాదు. తక్కువస్థితులయందుండిన మనము మనోవికారములను మనవియని యభిమానించుచుందుము. ఈ యభిమానమె సంసారబంధము, దుఃఖకారణము నగును. మనము సుఖదుఃఖముల నంటనివారమయ్యును వానియం దభిమానముచేత సుఖదుఃఖము లనుభవించుచున్నము.

నిప్పులో గాలిన యినుపముద్దయెఱ్ఱగా వేడిగా నుండునుకదా! దానిని జూచి నవివేకి దానిని నిప్పుగా భావించును. అట్లు దేహము మనోబుద్ధులతో ప్రజ్ఞజేరిన వాటినే యవివేకి ప్రజ్ఞ యనుకొనును. ఇనుమునుండి యగ్నిని వేరుజేయ దాని కపిలవర్ణము గోచర మగునట్లు సమాధియందు దేహ మనోబుద్ధులనుండి ప్రజ్ఞను వేరు జేయు వాటియనుపయోగమును గనుగొనెదము.

## ఏకాగ్రతధ్యానము.

7753

ఒక స్ఫటికము సమీపమున నొక రంగుగల పదార్థముంచిన నా స్ఫటికమున నా రంగుండినట్లుగా గనబడును. ఆ పదార్థమును దూరమున దొలగించిన దానియందు రంగగుపడదు. ఇట్లు మనోవైకల్యముండువరకు నాత్మయందే యవి యుండునట్లగు పడును. నిత్యానిత్య వివేకము గలుగుటవరకు నాత్మయొక్క శుద్ధత్వము గోచరము గాదు. ధ్యానమన నేదో యొక స్వరూపముమీద నేకాగ్రమైన మనస్సు నుంచుట యగును.

మనోవైకల్య మొకక్షణమైన లేకుండ జేసుకొనిన నాత్మ దక్షణమె గోచరమగును. ఈ యనుభవము సిద్ధమగుటకు నేకాగ్రత, ధ్యానము లావశ్యకములు. వీనిని నేర్చుటకు మార్గములు గురుముఖముగా దెలుసుకొనవలెను కాని పుస్తకముల ద్వారా అల్పజ్ఞులవద్ద లభింపజాలవు. ఈ సాధనవిషయమున జాలా జాగ్రత గలిగి యుండవలెను. ఈ రెండు లేక యెవడు జ్ఞానిగాజాలడు. దీనిని నేర్వవలెనని మనము దృఢమైన సంకల్పము జేసిన గురువు దప్పక మనయింటికి వచ్చి యావిద్యను లభింప జేసును గనుక మనము దగిన శిష్యులగుటకుమాత్రము ప్రయత్నించుచుండవలయును.

## తలంపేనడత.

ఈప్రకారము నివృత్త్యభిముఖుండై, పరమానంద ప్రాప్త్యున్ముఖుడైన జిజ్ఞాసువు ప్రవృత్తిపరాఙ్ముఖ రూపావలోకన మాత్రముచేవిస్మయుడై తనలో దానిట్లు చింతించెను:—

ప్రవృత్తిమార్గమున నేనుండువరకు నెరవేరగక వీపంటి దీనినిబొంది యెన్నడు సుఖమనుభవింపుమనని వ్యవధానరహిత ప్రయత్నముతో నలుముక బోవుచున్న యజ్ఞుడైన నన్నుభవగాణి జూచి చిరునవ్వుతో "ఒరియాజ్ఞా, నా పేరు సంసారము అది నాయన్వర్థాభిదానము. మోహాంధుడైనా వెనక దగులువానికి నేనెన్నడును జిక్కు దాననుగాను. నాయందు ఘనతవహించి నా చూపు చక్కదనపు బూటాటకమును తిరస్కారబుద్ధిచే జూచువానిచే నేవరింతును. నాతో వ్యవహితముగా నుండువరకు నానావిధవిక్షేప మిథ్యారూపానందముల జూపుచుందును. నన్ను బొందినతోడనే సత్యానుభవమునిత్తును. నాయందలి యభావచిత్తమే పరమసుఖము.

“నాప్రియమాతృక పేరజ్ఞానము. ఆమెకు సదాశ్రయమైన బ్రహ్మమే నాపిత. వారిద్దఱివలనే ననాదివర్గములో జేరినదాన. నాపితమాత్రమనంతుడు. నామాతృక వర్గపువారందఱు సాంతములే. మావంశనాశకుడు జ్ఞానరాజు. నామాతృప్రేరణతోనే నీలోకమున జీవించుచు యజ్ఞానులపాలిదైవమై పూజింపబడుచుందును. నాపిత కదాచితుగా తన మెలకువకాలమందు నాతల్లియొక్క సహవాసముతో నుండునప్పుడు నాతో కొద్దిగా ప్రియోక్తులాడును. నాకతని సామాన్య సామీప్యమేగాని విశేష సామీప్యమెన్నటికిని లేదు.

“నాతల్లి విషయమటులగాదు. అహోరాత్రులు. జాగ్రత్స్వప్నావస్థలనక నన్ను గారాబముతో బెంచుచు, లోకవ్యవహారములందు సంసక్తసహాయము లిచ్చుచు, నాకు భయభక్తుల గఱపుచు, నన్నువలచినవానియందశ్రద్ధగానున్నానను సంశయము లేశమాత్రము తగిలిన నన్ను కౌగలించుకొని యిట్లని పలుకును.”

“ఓముద్దుకొమ్మా నీకిది బుద్ధికాదు. నాయుదంతమును కొద్దివినుము. నిన్ను మోహించినవానిపాటికి నీవు మోహినిగా నుండవలెను. నీయందు ఆవంతయజాగ్రత కలిగిన వానియందు సర్వజాగ్రత పుట్టును. ఆజాగరూకతయే నీస్వరూపమును బైలు వేసును అందువలన జ్ఞానరాజునకు స్థానస్థిరత్వమున కెడమగును ఆక్షణమే మనయిద్దఱికి దేశభ్రష్టత్వమగును.”

“లేదా, ఓవిషయానందవల్లీ!! నిన్ను నిగ్రహించిన పిదప నీచెల్లెండ్రైన స్వర్గానందవల్లియొక్క ఒడిలోపడిగాని, లేక, యోగానందతల్లిపంచన జేరిగాని సుఖాబ్ధిమగ్నులై యుండును. అప్పుడుమనము వారి బానిసలై నీచచావలనిపించుకొని మానహీనులై మనవలసివచ్చును. అంతకన్న మనకనాశ్రితమైన కాననముజేరి ప్రాణ హానిజేసుకొనుట మేలు”

అనిమాయారాజ్ఞినాతో పలుమారు పలికిన కాలమువెనకాయె. అయిన నాయభి ముఖమున బ్రతీతమైయుండు నివృత్తిలోకమును జూడ దేహాకంపితమగుచున్నది. ఇదియే నాపూర్వప్రవృత్తి జగత్తుకదా. అటుండిన నింతనవీనముగా గనుపడుటకు గారణమేమి? ఓహో మఱేమియులేదు. నేబూర్వము విషయానందా విష్టుడై, కన్నుమిన్నెఱుంగక, వనితావిహారపరుడై, ద్రవ్యమే బ్రహ్మమనుచు, క్రవ్యమధ్వాదులే యోగకల్పామృతములనివచించుచు, అవ్యక్తములగు ముక్తిమార్గముల గలలోనైన విచారింపక “నేబట్టినకుందేటికి మూడేకాళ్లు” అనుచు, “మాదేశపు పుచ్చకాయకు కన్నుముక్కు

ఉగలవు" అనిస్థాపింపుచు పెద్దలమాటల సోమరిసుద్దులని పెడచెవిని బెట్టినిరాకరిం
చుచు ఊరిదేవర పేరయచ్చువేసిన ఆబోతువలె బోరరించి ద్రిమ్మరుచుంటినిగాన
నాకు వస్తుతత్వము యదృశ్యంబైయుండె.

ఇపుడుగదా ప్రకృతిలోకపు క్రూరస్వరూపమును జూడ్కనైతి నాసమ్ముఖమై
నన్నావరించియుండు ఈభయంకర ప్రదేశము స్వయంకృతాదోషఫల రూప ఘోరాటవి
కాబోలు. దీనిమధ్య నేనేకాంగినై బంధుమిత్రులబాసి ధీరత్వమువదలి భీరుడనై నిలు
చుండ అయోధ్యాయను వారులేరైరి. నావిజ్ఞాత విశ్రుతనామ జన్యగర్వంబుగూర్చి పరాకు
జెప్పునారదృశ్యులైరి. సర్వదుఃఖముల దీర్చువారివలె నటించుచుండిన రమణీమణు
లేలోకము జేరిరో, నాహర్మ్య శృంగారవనంబు లెవరిపాలాయెనో, ప్రకృతము
వాయువేగతుల్యమైన నాప్రియాశ్వమొకటియుండిన యీయాపదనొక క్షణమాత్ర
మున నివర్తించియుండునుగదా. ఈగాఢాంధకారమునుండి నన్ను వెలుదీయువా రె
వరు. నాకొకగురువుండిన యీదుర్గతివచ్చి యుండదుగదా." యనిపలువిధముల
విలపించుచు, వెఱగంది, విస్మయజెంది, భూస్థితుడై ఇకనే నోర్వలేను. విముఖుండనై
ప్రవృత్తిమార్గమునకే మరలి యేగుదునని నిర్ధరించి యుద్ధితుడాయె.

వెండియు జ్ఞాపితునివలె స్మరణదెచ్చికొని ఇదేమియున్మాదము. అత్యంతాపదవలె
దోచు ఈ నాప్రాప్తిని స్థైతుకమగునా, అపరిమితదుఃఖభయానకములేగదా గురుదే
వాది ప్రాప్యశుభసూచనలు. మకరివాతంబడిన కరిరాజుకెపుడు కృష్ణచక్రము ప్రాప్త
మాయె. యమపాశబద్ధుడై ప్రాణములుడిగి నిశ్చేష్టితుడైనెప్పుడుగదా మార్కండే
యునకీశ్వరుడు దర్శనమిచ్చె. ద్రుపదనందన తనపంచ శూరుల గర్వసంపదను విడనాడిన
పిదప ఆకాశవాణిపలికె. నాప్రియరాజింతకాలమువఱకు రాడాయె. రాక్షసుల
పాలై మానహానిబొందజాల నాయాశవిడచి నన్ను బొత్తిగమఱచి తన సహోదరునికి
నేజేసిన యవమాన పూర్వకాగ్రహమును దెచ్చుకొని తన ప్రియమాతృకల మాటలవిని
అయోధ్యకేగి పట్టాభిషేకము గావించుకొని సుఖముగానుండు నాతని నే నెదురు
జూడనేల. ఇకప్రాణహత్య జేసికొనడమే సరియని అశోకవృక్షపడుగును విడచి బైలు
దేరిన పిమ్మటగదా వాయుపుత్రుడు సమ్ముఖమాయె. ప్రహ్లాద భీష్మాదులచరిత్రల
నెఱుగగా హరిశ్చంద్రనలాదులను కాపాడిన స్వామి అంతకుముందే వారిని కాపా
డలేక పోయెనా.

నేబట్టిన బట్టును చిరక్రియుఁడై ముష్కరముగాబట్టి నిర్ధార్యుఁడై సాధించి విడుచుదునుగాని పరిత్యాగ రూపక భయావహమాత్రములైన యీరీతులకు భీతిల్లను. పట్టిననివృత్తిమార్గమును కొనసాగించడమే సరియని నిర్ధారణదెచ్చుకొనిన క్షణమే యొక అశరీరవాక్కుద్భవించినదాయె. "అదిగో నీవామభాగమున తేజరిల్లు జ్యోతి! కనుగొనుము" అనువాణి చెవినబడగానే, అహహా!! ఇదేమి యాశ్చర్యము దృఢచిత్త ప్రభావమింతయని యిదివఱకు దెలియదాయె. మనోదార్ఢ్యము పొడమిన మాత్రాననే గురుదర్శన జ్ఞానము లుదయించునని వినియుంటినిగాని స్వానుభూతికిపుడుగదా వచ్చినది. ఈ యానందమగ్నుఁడై కాలహరణంబు జేయక ఆతేజస్సుదిశను దృష్టిసారించి ఏకాగ్రచిత్తుఁడై, ఆ ఆకాశవాణియందు, శ్రద్ధాసంయుక్తుఁడై, నిర్మలమానసికుఁడై, ఇయ్యది నిరుద్దేశ్యప్రాప్యము గాదు. కర్తవ్యంబు పరిశీలించి కనుగొనవలయునని యనుకొని నడుము బిగియగట్టి సర్వసిద్ధుఁడై యాలోచించుచు నిలుచుండ అగాఢాంధకారము మంధాంధకారమయ్యె. అప్పుడే అనలుగు వైపున కొన్ని యడుగుల త్రోవయొకటి నిర్మాణమయ్యెను.

నేను ధన్యుడను దిక్కుదెలిసెను. మార్గమేర్పడెను. ఈ సూచనా ప్రామాణికమును చెయిపిడువరాదు. ఇకను చిత్తవిభ్రమ విశ్వాసలోపములు యేమాత్రము కలిగిన నేనుండుచోటనే దిక్కులేక నశించిపోదును. ప్రకృతము జనించిన ఉత్కంఠేచ్ఛ యొక్క వేడిమి కొంచెమైన తగ్గరాదు. తగ్గిన నేనెన్నటికిని కృతకృత్యుడను గాను.

ఆహా!! మఱియొక దివ్యాంశము మనసుకు గోచరమగుచున్నది. ఇదివఱలో మూర్ఖుడనై యింతదట్టమైన యడవిని పూర్ణముగా నిర్మూలముజేసినగదా నేను బయలుపడవలెననుకొనుచుంటిని. ఇపుడు నేను చూచుచుండగనే ఏర్పడిన మార్గపు కిరుప్రక్కల సావధానముగా పరిశీలించిచూడ సమస్తకానన వినాశన మక్కఱలేదనియు, నేను నిర్గమించుట కావశ్యకమైనంత త్రోవజేసికొనిన జాలుననియు సిద్ధమైనది. ఇక నీవిషయమున సంశయ విపర్యములు లేవనుచు కొంతదడవు విశ్రమించుకొందమని కూర్చుండి ఆకస్మికముగా వెనక జూడ ఎవడో యొకడు చెయిజాపి పిలుచుచుండెను.

వ. సు. ముదల్యారు.

22-2-08.

(సశేషము).

# ఆత్మబోధ.

## రెండవపాఠము

## 2. స్థూలప్రతిబింబము.

లోకమున పదార్థములు గట్టిగను, ద్రవరూపముగాను, వాయురూపముగా నుండుట మనకు సహజముగా దెలుసునుకదా. ఈ మూడుస్థితులుగాక సూక్ష్మమైన రూపము మరియొకటిగలదు. దానిని నాకాశ రూపమందురు. ఈ నాల్గువిధపదార్థములందు ననేక భేదములున్నవి. అవి శాస్త్రజ్ఞులకు సులభగ్రాహ్యములై యుండును. ఎట్లన, మంచుగడ్డను ద్రవముజేసిన నీరగును. నీళ్లను కాచిన నావిరియగును. ఆవిరికి ద్రవముజేసిన సూక్ష్మమైన యాకారము మరియొకటి యగును. ఇట్లు ప్రతిపదార్థములకు వివిధములైన మార్పులను గలుగజేయవచ్చును. ఈ యాకాశరూపము సూక్ష్మమైనది. దానియందేడుతరగతులు లొకటికంటె నొకటి యసూక్ష్మములుగానున్నవి. ఈ సూక్ష్మ యాకాశములయందు స్వర్గాది లోకములున్నవి. ఆ యాకాశ సూక్ష్మరూపముల నిక్కడ సవిస్తరముగాజెప్ప నవసరములేదు. స్థూలప్రతిబింబశరీర మీయాకాశరూపమైన పదార్థముచేతనై స్థూలశరీరముయొక్క యాకారమును బోలి, కన్నులకు నదృశ్యమై యుండును. అది స్థూలశరీరప్రతిబింబమై దానితో నొక సూత్రముచేత సంబంధము గలిగియుండును. స్థూలశరీరమునుండి యిదిచాలాదూరము పోవచాలదు. అయినను దీనిని స్థూలశరీరమునుండి వేరుజేయవచ్చును. సాధారణముగా నారోగ్యము గల పురుషునినుండి యిదివేరగుట కష్టతరము. అయితే మూర్ఛరోగము గలవారి దేహమునుండి సులభముగా నిది వేరుగా గనబడును. దానిని సూక్ష్మదృష్టి గలవారు చక్కగా జూడవచ్చును. ఈ శరీరము ప్రాణమునకు స్థానము గనుక, యీదేహము స్థూలశరీరమునుండి వేరైనప్పుడు స్థూలశరీరమున, చైతన్యము తక్కువయై జబ్బుగానుండును. అది స్థూలశరీరమునుండి వేరైయుండినప్పుడు గొప్పశబ్దములుగాని తొందరగాని గలిగించకూడదు. అట్లు గలిగించిన నిది స్థూలశరీరమును రభసముతో జేర వానికిగల సూత్రము తెగి, యందుచే చావుగూడ గలుగవచ్చును. గనుక ధ్యానపరవశులైన వారుండు చోట నెక్కువ శబ్దములుగాని తొందరలుగాని చేయగూడదని వాడుకలున్నవి. సూక్ష్మదృష్టిగలవాడు స్థూలశరీరమునుంచి దీని నెడమపార్శ్వమున బైటికి వెళ్లుట స్పష్టముగా జూచును. స్థూలదేహమున గాలుగాని, చేతినిగాని దెగనరికి పారవేసిన,

నరికిన భాగముయొక్క సూక్ష్మరూప మేమార్పును బొందియుండదు. అనగా స్థూలప్రతిబింబమును ఛేదించుటకు వీలులేదు. దీనికిని స్థూలశరీరమునకు గల సూత్రము మరణముననే తెగిపోవును. లోకోక్తియగు "నీతాడుదెగ" యనుమాట నెంతప్రమాదకరమైనదో దీనివల్ల దెలియును. అది చావును సూచించును, గనుక దీని ప్రయోగము మానుట శ్రేయస్కరము. వెనుక నీస్థూలప్రతిబింబముననుండు ప్రాణ మాకాశమున జేరిపోవును. పిమ్మట దానిలోనుండు నణువులు క్రమక్రమముగా వేరై, నితరశరీరము లేర్పడుటకు ప్రయత్నించుచుండును. ఈ స్థూలప్రతిబింబమును శవముల సమీపమునను, పాతిన స్థలములందును, నీల మెరుపురంగుగల, లేక, ఊదారంగుగల, యాకారమును సూక్ష్మ దృష్టిగలవారు సాధారణముగా జూతురు. ఈ స్థూలప్రతిబింబము శీఘ్రముగా భిన్నమగుట యావశ్యకము గనుక శవములను పాతిపెట్టుటకంటె దహించుట శ్రేష్ఠము. గనుకనే మనయందు దహించుపద్ధతి గలదు. దీనిని నితరజాతులవారు గూడ ననుష్ఠించుచున్నారు.

## 3. ప్రాణము.

సకలబ్రహ్మాండములు, సకలలోకములు, సకలమానవులు, పశువులు, చెట్లు చేమలు, సకలలోహములు, సకలాణువులు, సకలసృష్టిజాలము, కన్నులకగుపడు సకలపదార్థము లొకశాశ్వతమై, అనంతమై, విచ్ఛిత్తిలులేని చైతన్యమున నున్నవి. ప్రతిపదార్థముననుండు చైతన్యము ప్రాణమనబడును. ఎట్లన నీటియందు సముద్రపు నురుగును వేసిన దానిలో నీరిమిడి, ప్రతి సంధిన నీరు పట్టుకొనియుండి దానిచుట్టును లోపలవెలుపల నీరుండునట్లు సకలము ప్రాణముననున్నవి. దీనిని మూడవ వాహనమందురు. ఇది స్థూలప్రతిబింబమున నుండును. ఇది ప్రతియణువున నెలకొని యున్నది. ఈ యణువులు వివిధముగా జేరి, వివిధపదార్థములై, రూపములు మారుచుండును. గనుక సకలమునకు ప్రాణమాధారమైయున్నది.

## 4. కామము.

కోరికలు, భావములు, ఆశలు జేరి కామశరీరమగును. ఆకలి, దప్పి, విషయాపేక్ష, క్రోధము, మాత్సర్యమసహనములు మొదలైనవి యీశరీరమగును. ఇదియే భూలోకమునకును, జీవునకును సంబంధము గలిగించును. ఇదియే పశుస్వభావము. పశువులకు నీనాలుగు శరీరములు గలిగియుండును. ఈ కామము ప్రాణముతో జేరి

యుండును. కామము, ప్రాణముజేరి యింద్రియములకు స్థానము. ఈ శరీరము చిదాకాశమున గార్యకారియగును. స్థూలశరీరమునకు స్వతంత్రములేదు. దానిలోనుండు కామశరీర మెట్లాడించిన నది యట్లాడును. బాహ్యపదార్థములస్ఫురణ స్థూలశరీరమున నుండు నింద్రియగోళకములకు దగల, వాటిని ప్రాణము చలింపజేయు, కామశరీరము, మన మనస్సునకు పదార్థజ్ఞానము బుట్టించుచు. కామశరీర మొకవిధమైన యాకాశపదార్థము చేత చేయబడినది. కామశరీరము మేఘమువలె నుండెను. దానివర్ణము భావనల ననుసరించియుండును. కోపమెక్కువగనుండిన నెఱ్ఱగాను, క్రోధముండిన నల్లగాను, భక్తియుండిన తెల్లబారిన నీలముగాను, ధర్మాత్ముడైన యాకాశమువలె నీలముగాను, ఇట్లనేక వర్ణములుగలవిగా నగుచుండును. ఎవడు గామములను నిగ్రహించునో వాని కామశరీరము స్పష్టముగా నేర్పడును. మరణానంతరము కామశరీరము మనుష్యుని జీవితకాలమున కోరిన కోరికల కొలది యెక్కువ కాలము నశించక, చిదాకాశమున నుండును. దుర్మరణము సంభవించిన, ప్రాణము దానిని శీఘ్రముగ విడువదు. అట్టిజీవులే పిశాచములుగాను, భూతములుగాను నేర్పడును. జీవము గూడ నాశరీరమును శీఘ్రముగ విడువదు. జ్ఞానికి గోరికలెక్కువగ నుండవు, గనుక జీవుడు కామశరీరమును త్వరగా విడుచును. జీవుడు విడిచినపిమ్మట కామశరీరము మేఘమువలె కొంతకాలము చిదాకాశమున నుండి భిన్నమగును. అది భూతచేష్టలు గలవారిని, దనస్వభావమే గలవారిని, జేరి దుష్కార్యములకుగూడ ప్రేరేపణజేయును. గనుక, అట్టి కామశరీరములు బంధువుల నాశ్రయించుట సహజము గనుక మనయందు మరణాశౌచములు ముఖ్యముగా విధించబడినవి. ఇట్టికామరూపములు పిండాదిక్రియలు జేయునప్పుడు చిదాకాశమున మనకదృశ్యమైయుండి దమగోరికలు సాఫల్యమగు వరకు పిండములను కాకులు ముట్టనివ్వక చేయుచుండును. ఇది కొన్నివేళల మనము గనుగొందుము. కాకులకు సూక్ష్మదృష్టిగలదు అవి యమదూతలనిగూడ వాడుక కలదు. "యమరాడ్దూత శిఖావతంసము, చిరప్రాణంబు దూరప్రియా గమశంసి కాకశీకలనమేకప్రక్రియా పాతదీక్షము శీతర్తు బలీయమనీ" దీనిని దెనాలిరామకృష్ణుడు పాండురంగ మహాత్మ్యంబున వర్ణించియున్నవాడు. జీవులయొక్క కోరికలను సాఫల్యముజేసి యీలోకముల యందలి బంధములను దప్పించునట్లు జేయుటకై పిండాదిక్రియలు విధించబడినవి గనుక వానిని మన మక్కరతో జేయుట యావశ్యకము.

ప్రతి జీవుడణువులతోఁ జేరి మొదట రాయిగాను, పిమ్మట చెట్టై, తరువాతపశువై, తుదకు మానవుఁడై జన్మమెత్తును. పశుజన్మము వరకు పైనజెప్పిన నాల్గుశరీరములు ప్రసిద్ధముగనుండును. వీటితో మనసు జేరినగాని మానవజన్మముగలుగదు. మానవుని యందుండు కేవల పశుస్వభావమగు కామశరీరము నిశ్శేషముగ శుద్ధియైనగాని తన నిజస్వరూపమైన దైవత్వమును బొందజాలఁడు. గనుక ఆశాపాశములను రాగద్వేషములను విడుచుట శ్రేయస్కరము.

## పురాణసారము.

## అవధూతయదు సంవాదము.

ప్రాయోపవేశము జేసికొనిన పరీక్షన్మహారాజునకు శుకబ్రహ్మర్షి పరమాత్ముడైన నారాయణుని స్వరూపరూపగుణ విభూతులను వివరించు భాగవతార్థములను పది స్కంధములలో బోధించి, శ్రీకృష్ణమూర్తియొక్క లీలావతార చరిత్రము సమాప్తియగు నవసరములో పరమభక్తుడైన యుద్ధవుడు శ్రీకృష్ణమూర్తి సన్నిధిని జేరి, తాను కృతార్థుడగుటకు హితోపదేశము జేయగలయునని ప్రార్థించగా, దానికి శ్రీకృష్ణుడు సకలార్థముల నుపదేశించెను. ప్రథమమున నాత్మయే ముఖ్యగురువను విషయమును దెలియపఱచు "అవధూతయదు సంవాద"మను నది భాగవతములో నేకాదశస్కంధములో నిరూపించబడినది.

### శ్రీకృష్ణుల వాక్యము.

అత్రాప్యుదాహరంతీమ మితిహాసంపురాతనం।
అవధూతస్యసంవాదం యదోరమిత తేజసా॥ ౧.

ఓ యుద్ధవా! నావంశమున ప్రథమమున జనించిన యదుమహారాజు బ్రహ్మజ్ఞానమును సంపాదించుకొనుటకు నొక యవధూతతో జేసిన సంవాదమును జెప్పుచున్నాను వినుము. ఆ రాజు చంద్రవంశోద్భవుడు; బ్రహ్మనిష్ఠాచార్యుల గుణలక్షణములను విని యెఱిగి సాయుజ్యముక్తిని బొందెనని యొక పురాతన యితిహాసముగలదు.

(సశేషము).

30. దొంగలించువాఁడు దేవుఁడే. దొంగవచ్చినాఁడని యింటి యజమానునికి హెచ్చరికనిచ్చువాఁడు దేవుఁడే.

31. దేహమునందెట్లు దేవుఁడువసించును. చిమ్మన గొట్టములోని బరడువలె వసించును. అనఁగా దేహములోపలనున్నను భిన్నముగానుండును.

32. దేవుఁడు సూదికంటిలో నేనుఁగుదూరునట్లు చేయఁగలఁడు. అతఁడు దా గోరినది చేయును.

33. తీఁగలు పాచినిండిన కొలకులలో నాఁడుచేపలు వైటికికనఁబడని విధమున మానవదృష్టికి గోచరముగాక మాయాచ్ఛాదనముచేత మానవుని హృదయమునందదృశ్యముగా దేవుఁడు క్రీడించును.

34. జమీనుదారుఁడు ధనికుఁడయ్యును భక్తిపూర్వకమైన ప్రేమతో దనబీద కాఁపువాఁడొకచిన్నబహుమానము తెచ్చిన నధికసంతోషముతోను, సంతృప్తితో నంగీకరించును.

35. ఒక ఘంటకొట్టఁ దానిశబ్దములు స్ఫుటముగా వినవచ్చును. ఘంట కొట్టకున్న దానిశబ్దముస్ఫుటముగా నుండనట్లు, దేవుఁడుసరూపముగా,అరూపముగా నుండును.

36. ఒకపిల్లవాఁడు తాను చిన్నయక్షరములు సుందరముగా వ్రాయుటకుముందు గొప్ప వంకరటింకర వ్రాఁతనేర్చుకొనునట్లు, మొదలు రూపములను ధ్యానముచేసి మనసు నిలుపుటకు ప్రయత్నించవలెను. దానియందుసిద్ధి బొందిన వెనుకరూపరహితమైన బ్రహ్మమును ధ్యానముచేయ సులభసాధ్యముగా నుండును.

37. ఒక వేటకాఁడు గుఱినేర్చుకొనుటకు మొదట పెద్ద పెద్ద వస్తువులయందు గుఱిపెట్టికాల్చుచు నాశక్తివృద్ధిపొంద చిన్నచిన్న వస్తువులను సులభముగాగుఱిపెట్టి కాల్చునట్లు రూపముగల యాకారములను ధ్యానముచేయ సాధ్యమైనప్పుడు రూపములేని యాకారమును ధ్యానముచేయ మనసునకు సులభసాధ్యముగ నుండును.

38. దేవుఁడు కేవలనిర్గుణ శాశ్వతబ్రహ్మము. జగజ్జనకుఁడు. అవిభాజ్యమైన బ్రహ్మము గట్టులేని మహాసముద్రమువంటిది. దానిలోపోరాడిమునిగెదము. లీలాసహితమైన మూర్తిని గనుఁగొన్న మునిగెడివాఁడు దరిఁజేరువానివలె మనకుశాంతికలుగును.

39. దేవుఁడు రూపరహితుఁడు, రూపసహితుఁడు గూడయగును. రూపారూపములకతీతుఁడు. తానెట్టివాఁడో వాఁడె చెప్పఁగలఁడు.

40. భక్తిమార్గమునందుండువాఁడొకవేళ మూర్తియుక్తమైన దేవునిఁజూచి తృప్తిఁగనును. తరువాత రూపరహితమైన తత్వములోతృప్తిచెందును.

41. మూర్తియుక్తమైన దేవుడు దృశ్యమగును. స్నేహితునివలె సకలాంగములు స్పర్శజేయవచ్చును.

42. నేనొకప్పుడు నగ్నమైయొకవేళ నుడుపులతోయుండులాగున బ్రహ్మము ఒకప్పుడొకగుణముగాను మఱొకపుడు నిర్గుణముగానుండును.

43. నీళ్లుగడ్డకట్టిన మంచగునట్టుగా దేవుని దృశ్యమైనరూపము సర్వవ్యాపకమై రూపరహితమైన బ్రహ్మముయొక్క మూర్తిమత్తైన ప్రకాశము. సచ్చిదానందము గనీభవించినదని చెప్పవచ్చును. మంచు, నీటిస్వరూపముగనుక, నీటిలోకొంచపు నేపుండిన నరగునట్టుగా మూర్తిమత్తైన ద్వైవస్వరూపభాగమే మూర్తిరహితస్థితికలిగి, తుదకు దానిలో నంతర్గతమై యదృశ్యమగును.

44. దేవుని పేరు జ్ఞానము అతని నెలవు జ్ఞానము అతడు జ్ఞాన స్వరూపమే.

45. ఇదినాది అదినాది యని సహోదరులు తమ కుటుంబసొత్తును భేదించు సంకెల్లను తీసివేయునపుడును రోగి చావు సమయమున వైద్యుడు తానురోగనివారణచేసెదనని చెప్పినపుడును ఈరెండు సమయములయందు దేవుడు సంతోషించును.

46. పిచ్చివాడు త్రాగుబోతులు, బాలురు దేవునిచేత ప్రేరేపింపబడినరీతి కొన్నిసమయములందు నిజముచెప్పెదరు.

47. భూమికంటె సూర్యబింబము చాలగొప్పది. దూరముండుటంబట్టి మనకు చిన్నదిగా నుండునట్టుకనబడుచున్నది. అట్లుదేవుడు గొప్పవాడు. వానినుంచి చాలా దూరముగా నున్నాము గనుక యతని మహాత్మ్యమును గనుగొన యోగ్యతలేకయున్నాము.

48. తెలిసియొ తెలియకయొ బుద్ధిపూర్వకముగానొ లేక స్మృతిలేకయొ, ఏస్థితిలోనైన నతనినామస్మరణజేసిన నాఫలము బొందుదుము. నదిలోనికి స్వేచ్ఛగా వెళ్లి స్నానముచేసిన నొకడు స్నానఫలముపొందును. అట్లు నదిలోనికి బలవంతముగా వెళ్లి స్నానము చేసినవాడును నిద్రపోవుచుండ వానిమీదనీళ్లు పోయించికొనినవాడును ఆఫలమును అనుభవించుచున్నాడు.

49. హరినామస్మరణము చేయు నింటియందు పిశాచాధిపతి ప్రవేశించడు.

# మొదటి యధ్యాయము.

## సంకల్ప స్వభావము.

జ్ఞానమే స్వరూపముగా గల ప్రజ్ఞామూలకముగను, జ్ఞానమునకు సాధనభూత మైన రూపగుల మూలకముగను, ఈ రెండంశముల యూలకముగ మనము సంకల్పము యొక్క స్వభావమును విచారింపవచ్చును. రూపములందు మార్పులు గలుగుటచే జ్ఞానము లభించుటకు సాధ్యమై యున్నది. ఇట్లు సాధ్యమై యుండుట తత్వశాస్త్రి మున రెండు విపరీతములకు గారణమై యున్నది. ఈ రెంటిలో నొకటి మరియొక దాని యొక్క సృష్టి సిద్ధాంతమును స్వీకరించుచున్నది. గనుక మనము రెండు విపరీత ముల నాదరించకూడదు. ప్రజ్ఞకు నుపాధియై దాని భిన్నభావమును సాధ్య మగునట్లు జేయు రూపము యొక్క ప్రాధాన్యమును నిరాకరించి, సర్వము ప్రజ్ఞా స్వరూప మని, యొకటి నిర్ధారము జేయును. తనయందు ప్రజ్ఞ నెలకొని యుండుటవల్ల దనరూప మేర్పడుటకు గారణ మైనదని తెలియక ప్రజ్ఞను నిరాకరించు సర్వ మునకు రూపమే ప్రాధాన్యమని మరియొకటి నిర్ధారముజేయును. రూపము చైత న్యము, ప్రకృతిపురుషులు, ఉపాధి ప్రజ్ఞయు, సృష్టియందు భిన్నములైన పదార్థ ములు, ఇవి పరమాత్మయందంతర్గతమై యుండి, యవిభాజ్య జ్ఞాన భావముల గును. పరమాత్మ ప్రజ్ఞగాని యుపాధిగాని కాదు. అయితే యీ రెంటికి మూలజ్ఞాన పదార్థము. ప్రజ్ఞను నిరాకరించి రూపములద్వారా సకల సృష్టిజాలమును విశదీ కరించ బ్రయత్నించు తత్వశాస్త్రము కొన్ని విషయములను విశదీకరించజాలక నిష్ఫల మగును. రూపములను విడనాడి సకల సృష్టిజాలమును ప్రజ్ఞాస్వరూపమని విశదీకరించ ప్రయత్నించు తత్వశాస్త్రముగూడ గొన్నివిషయములను మనస్సునకు గోచర మగునట్లు చేయజాలనది యగును. ఈ విషయమున తత్వసిద్ధాంత మేమన, ప్రజ్ఞయు దాని యుపాధియు, చైతన్యము, రూపము, పురుషప్రకృతులు, కేవల యుపాధి రహితమైన సత్పదార్థముయొక్క రెండు భావములయొక్క క్షణికమైన ప్రకాశములై యున్నవి. భిన్నులైన సకల జీవులకు మూలాధారమైన ప్రత్యగాత్మగాను, సకల సృష్టిరూపములకు మూలాధారమైన మూలప్రకృతిగాను మన శాస్త్రమున నివి ప్రసిద్ధములై యున్నవి. సృష్టి యగునపు డంతయు, ఈ ప్రత్యగాత్మ త్రివిధప్రజ్ఞను

బుట్టించును. ఈ మూలప్రకృతి త్రివిధ పదార్థమును బుట్టించును. ఉపాధి విశిష్టమైన ప్రజ్ఞకు నగోచరమై ఏకమైన సత్పదార్థము ఈ రెంటికి మూలాధారమై యున్నది. ఒక కొడయందు బుట్టి యది లేకున్న దానుండుటకు వీలు లేనప్పటికిని, పుష్పము దన మూలమును దెలుసుకొనజాలదు.

జ్ఞాతయగు నాత్మ దనలో ననాత్మను ప్రతిఫలించు లక్షణమును గలిగియున్నది. స్వరూపము (Photograph) దీయు యంత్రమున నుండు నద్దముమీద పదార్థముల రూపములు ప్రతిఫలించ, నారూప మద్దమున నంటించియుండు ద్రావకములు మార్పు బొందునట్లు చేసి యాపదార్థ రూపము లద్దముమీద నేర్పడునట్లు, దృశ్యమగు ప్రపంచము ఆత్మ జ్ఞానభావమున నట్లుండును. ఆత్మ దనకు గల యుపాధియందు పరమాత్మనుంచి ప్రతిఫలించిన ప్రకాశమును అనాత్మద్వారా పొంది తనకంటె భిన్నముగా నుండు వాటియొక్క ప్రతిఫల రూపములను యుపాధిమీద నగుపడునట్లు చేయును. జ్ఞాత దన ప్రజ్ఞయొక్క బాల్యావస్థలయందు పదార్థములయొక్క నిజస్వరూపములను దెలియదు. స్పర్శశక్తి గల తన యుపాధిమీద అనాత్మయొక్క కార్యమువల్ల గలుగు పదార్థములయొక్క యాకారములగు మాత్రము జ్ఞాత దెలియును. గనుక జ్ఞాత యగు నాత్మయొక్క యుపాధి యగు మనస్సును, అద్దమునకు బోల్చబడును. దాని ముందుంచిన పదార్థముల రూపములు దానియందు గనబడును.

మనకు పదార్థముల నిజస్వరూపములు దెలియవు. మనకు దెలియునది మన ప్రజ్ఞయందు నవి గలిగించు భావము మాత్రమగును. మన మనస్సులందు పదార్థములు లేవుగాని వాటియాకారములు మాత్రమున్నవి. అద్దమున బదార్థములున్నట్లు లోకముననుండు పదార్థములను మనస్సు దెలియునప్పుడు, దానిలో బదార్థములు లేవుగాని వాటియాకారములు మాత్రముండును.

## సత్సంకల్పములు.

13. సిద్ధుడైన భక్తుడెవరిచేత హాని చేయబడడు.

14. అతడు పరబ్రహ్మయొకటె. ప్రేమయమృత జీవనము.

15. తగినమైన సంకల్పములకు నావశ్యకమైన వాటిలో శ్రద్ధతోగూడిన కచ్చితమైన పరిశీలన కొందటిది.

Continued from page 66.

## సంజయుని వాక్యము.

శత్రుసంహారకుడైన యర్జును డిట్లుపలికి గోవిందునకు యుద్ధము జేయనని చెప్పి మౌనము వహించెను. అప్పుడు శ్రీకృష్ణు డుభయసేనల మధ్యమున దుఃఖించు నర్జునునకు చిరునవ్వుతో నిట్లు చెప్పెను.

## శ్రీకృష్ణుల వాక్యము.

నీవు దుఃఖింపగూడని వారిని గూర్చి దుఃఖించుచున్నావు. అయినను వివేక వాక్యములను బలికెదవు. జ్ఞానులు మృతులైనవారిని గూర్చిగాని జీవించియుండువారిని గూర్చిగాని దుఃఖించరు. నేను, నీవు, ఈ రాజు లెప్పు డుండనివారము గాము. ముందుండక పోవువారు గాము. ఈ దేహమున దేహికి బాల్యము యవ్వనము ముసలితన మెట్లు కలుగునో దేహాంతర మట్లు ప్రాప్తించును. ధీరు డందులకు మోహము జెందడు. అర్జునా! సంయోగ వియోగములు గలిగి విషయ స్పర్శములు శీతోష్ణ సుఖ దుఃఖముల నిచ్చును. ఇవి యనిత్యములు. భారతా! ధైర్యముతో వీనిని సహింపుము. ఇవెవనిని బాధించవో యా మనుజుడు సుఖదుఃఖములయందు సమానుడై ధీరుడైనవాడే మోక్షార్హుడు. లేని పదార్థము గలుగుట లేదు. ఉండు పదార్థము లేకపోవుట లేదు. ఈ సదసత్తుల నిర్ణయము తత్వజ్ఞానులచేత గ్రహింపబడినది. దృశ్యమున వ్యాపించియుండు వస్తుతత్వమును నాశరహితముగా దెలియుము. అవ్యయమైనయా వస్తువు నెవడు నాశము సేయజాలడని తెలియుము. నిత్యుడై, నాశరహితుడై ప్రమాణాతీతుడైన దేహికినీ దేహము లంతముగలవి గనుక, అర్జునా! యుద్ధముజేయుము. దేహి చంపెడువాడనియు, చంపబడువాడనియు తలచువా రిరువురజ్ఞానులు. వాడు చంపడు, చంపబడడు. వాడు పుట్టడు, చావడు. ఉండియుండి యుండక పోవువాడు గాడు. అజుడు, నిత్యుడు. శాశ్వతుడు పురాణపురుషుడు. దేహము నశించినవాడు నశించడు. పార్థా! ఎవడు వానిని నాశరహితునిగా, శాశ్వతునిగా, పుట్టుకలేనివానిగా క్షయరహితునిగా దెలియువా డెట్లు చంపును చంపించును? మనుజుడు జీర్ణవస్త్రములను బారవైచి నూతన వస్త్రములను ధరించుభంగి దేహి జీర్ణదేహములను వదలి నూతన శరీరములను ప్రవేశించును. ఈ యాత్మ నాయుధములు ఛేదింపజాలవు. అగ్ని దహింపజాలదు. జలము దడుపజాలదు. వాయువు శోషింపజాలదు. ఈ యాత్మ భేధింపదగదు, దహింపదగదు. శాశ్వతమై, సర్వవ్యాపియై, స్థిరమై, అచలమై, సనాతనమై యున్నది. ఈ యా-

చూడ నగోచరమై, మనసున కచింత్యమై యింద్రియములకు విషయము కానిదై యున్నదని తెలియుము. అట్లు తెలిసి నీవు దుఃఖించకూడదు. ఆత్మకు జననమరణములు గలవని నీవొకవేళ తలచితివేని, అర్జునా, నీవు దుఃఖించ బనిలేదు. ఏమనగ పుట్టినవానికి మరణము నిశ్చయము. చచ్చినవానికి జన్మము సిద్ధము. ఇట్లు తప్పించరాని వాటికి నీవు దుఃఖించుట దగదు. అర్జునా! ప్రాణికోటియొక్క జన్మ పూర్వస్థితి వ్యక్తముగాదు. మధ్యస్థితిమాత్రము గోచరముగా నున్నది. నశించినవారి స్థితి యగోచరము. ఇట్టి స్థితివిషయమై దుఃఖమేమనకు. ఒకడాత్మ నత్యద్భుతవస్తువుగా జూచును. మఱొకడద్భుతవస్తువని చెప్పును. వేరొకడద్భుతవస్తువని వినును. ఇట్లు విని, చూచి, పలికియు నెవ డెరుంగడు. ప్రతియొకని దేహమున నుండు నాత్మ యెప్పటికిని సంహరింపబడునది కాదు. గనుక, భారతా! నీవు ప్రాణికోటికై దుఃఖింపగూడదు. మఱియు నీధర్మమెరిగి నీవు గలత నొందగూడదు. ఏలన, క్షత్రియునకు ధర్మసంగరముకంటె శ్రేయస్కరమైనదిలేదు. పార్థా! తెరచిన స్వర్గద్వారమై యప్రయత్నపూర్వకముగా నిట్టి యుద్ధము లభించిన క్షత్రియులు ధన్యులు. అయితే యీ ధర్మయుద్ధమును నీవు జేయకపోతివేని నీధర్మమును కీర్తిని పోగొట్టుకొని పాపము బొందుదువు. ఇంతియె కాక నీ శాశ్వతమైన యపకీర్తిని ప్రాణులు చెప్పుకొనుచున్నారు. గౌరవస్థులకు నపయశస్సు మరణముకంటె నశక్యమైనది. నీవు భయముచేత యుద్ధమునుండి తొలగితివని మహారథికులు దలచెదరు. వారిచేత నింతవరకు సన్మానింపబడిన నీవు లాఘవమౌదువు. నీశత్రువులు నీసామర్థ్యమును దూషించుచు జెప్పగూడని మాటలనేకములు చెప్పెదరు. అంతకంటె దుఃఖకరమేది? సంహరింపబడిన, నీకు స్వర్గము ప్రాప్తించును. జయించితివేని, భూమండల మనుభవించెదవు. గనుక యుద్ధముజేయ నిశ్చయించి, అర్జునా! లెమ్ము. సుఖదుఃఖములను లాభాలాభములను, జయాపజయములను సమముగాం జేసి యుద్ధముజేయ సిద్ధము గమ్ము. అట్లు చేసిన నిన్ను పాపమంటదు. ఇదివరకు చెప్పబడిన బోధ సాంఖ్యవిచారము ననుసరించినది. యోగమార్గ మనుసరించినది యిక చెప్పబడును. ఆబోధను వినిన, పార్థా! కర్మబంధమును నివర్తించుకొనెదవు. ఇందుకు ప్రయత్నవిఫలము లేదు. ఉల్లంఘన లేదు. ఈ జ్ఞాన మించుకగ్గైనను మహాభయమునుండి రక్షించును. ఈ యోగమున నిశ్చయాత్మకమైన బుద్ధి, అర్జునా, ఒక్కటె. నిశ్చయములేనివారి బుద్ధు లనంతములు, వివిధములు, స్వర్గసుఖము తప్ప వేరులేదని వేదార్థవాదములందాసక్తులైన యవివేకులు, పార్థా, పుష్పములవలె రిత్త

35. ఒక బ్రాహ్మణుడశౌచమునను న్నప్పుడు జననమరణాశౌచములు గలిగిన పదిదినములే మాత్ర మశౌచముగా నుండును. మొదటి యశుచి దినమునుండి పదిదినములు లెక్కపెట్టవలెను.

36. బ్రాహ్మణునిగాని చెరపెట్టబడిన పశువులనుగాని రక్షించుటయందు ప్రాణము పోగొట్టుకొన్నవాని విషయమునను యుద్ధమున చంపబడిన వాని విషయమునను అశౌచకాలమొక్కదినమే.

37. శత్రువుల ధనుర్బాణ సంయుతమైన సైన్యమధ్యమున భయపడక యేవిధమైన దీనస్వరమునకు నెడమివ్వక చచ్చినవీరులు శాశ్వతముగా స్వర్గమున వాసము చేయుదురు.

38. జయమువల్ల నొకడు గీర్తిదేవతను సంపాదించును. రాజోత్తకడు యుద్ధమున చచ్చుటవల్ల స్వర్గసువాసినుల శాశ్వత యాలింగనమునను నుండును. దేహమశ్వరమగుటవల్ల నొకడు చావునకుగాని యుద్ధమునకుగాని ఎందుకు భయపడవలెను.

39. పరివ్రాజకులును, వీపున గాయపు గుర్తులు లేక యుద్ధమునఁ జచ్చు వీరులును వీరిద్దరు సూర్యమండలమును భేదించుకొని యూర్ధ్వలోకమునకు వెళ్లుదురు.

40. యుద్ధమున నోడినవెనుక యోడిన సైనికులను జేర్చి రక్షించువాడు అశ్వమేధయాగ ఫలమందును.

41. యుద్ధమున దేహముపైన కత్తిచేత ఘాతలను బాణములచేత గలిగిన రణములను, ముసలముచేతగలిగిన దెబ్బల గుర్తులను గలవాని నప్సరసలు కౌగిలించుకొని వాని ప్రభావములను గీర్తించుదురు.

42. యుద్ధమున జంపబడినవాని జీవమును సుందరమైన వేలమంది నాగకన్యకలు, అప్సరసులు, ఆతురతతో పరుగిడి వాడు నామగడగునని యరచుచు కౌగలించుకొనెదరు.

43. సంగ్రామ యజ్ఞమున దనయుండటనున్న రణమునుంచి స్రవించు నుష్ణరక్తధారను గ్రోలువాఁడు పవిత్రమైన సోమరసముఁ ద్రాగినవాఁడగును. స్వర్గమున వాని పుణ్య మసమానము.

44. ధర్మయుద్ధమున ప్రాణము గోల్పోయిన వీరునియొక్క జీవుడు శ్రద్ధాభక్తులతో జ్ఞానమువల్ల యథావిధిగా జేయు ధర్మానుష్ఠానమువల్ల భక్తులు, జ్ఞానులు పొందు లోకమును బొందును.

45. స్నేహితులు లేని పేదబ్రాహ్మణుని శవమును దహనముకొఱకు మోసుకొని వెళ్లు ద్విజులు రుద్రభూమికట్టు పెట్టు ప్రళయదుగునకు వేదములయందు జెప్పబడిన పరంపరగా నుండు ధర్మయజ్ఞములు చేయుటవల్ల గలుగు ఫలమును బొందుదురు.

46. తనకు నితర సంబంధముగాని జ్ఞాతిగాగాని బంధుత్వము లేనట్టి బ్రాహ్మణుని శవమును మోసిదహించిన బ్రాహ్మణుఁడు ప్రాణయామను సల్పుటవల్ల పరిశుద్ధుఁడగును.

47. ఈ సందర్భములయందు మంచి యాత్రయమునకు సంబంధించిన ధర్మకార్యములను నిర్వహించుటకు బ్రాహ్మణులు అనుపయుక్తులుగారు. వారు స్నానము జేసినమాత్రమున పరిశుద్ధ లగుదురని స్మృతులు ఘోషించుచున్నవి.

48. జ్ఞాతియొక్క గాని యితరునియొక్క శవమువెంట వెళ్లిన నొక స్నానమువల్లను, అగ్నిని స్పృశించుటవల్లను, నేతిని త్రాగుటవల్లను పరిశుద్ధుఁడగును.

49. చచ్చిన క్షత్రియుని శవము వెంబడి స్మశానమునకు నిష్ప్రయోజనముగ వెళ్లిన నొక బ్రాహ్మణుఁ డాదినమంతయు నపరిశుద్ధుఁ డగును. పంచగవ్యము గ్రహించుట చేత శుద్ధుఁ డగును.

50. మూఢత్వమున వైశ్యుని శవము వెంబడి స్మశానమునకు వెళ్ల, నొక బ్రాహ్మణుఁడు రెండుదినము లపరిశుద్ధుఁడగును. తర్వాత నారుసారులు ప్రాణయామము జేసిన శుచియగును.

51. బుద్ధిహీనతవల్ల శూద్రుని శవము వెంట స్మశానమునకు వెళ్ల నొక బ్రాహ్మణుఁడు మూడురాత్రు లశుచి యగును.

52. ఆ మూడురాత్రులు గడచినవెనుక సముద్రమున బడు నదియొక్క ముఖమునకు వెళ్లి యచట నూఱుమారులు ప్రాణయామము జేసి నెయ్యి త్రాగినంతట శుచి యగును.

53. బ్రాహ్మణులు శూద్రుని శవమును దహించి యింటికివచ్చు శూద్రులన నొకభావి, గుంట, లేక, చెరువుగట్టునుండి వెంబడించవచ్చును. ఇట్లు వేదము తెలిసిన వారు జెప్పుదురు.

54. గనుక శూద్రుని శవమును ద్విజులు తాకకూడదు. వెంబడించకూడదు మోయకూడదు. దహించకూడదు. శూద్రుని శవమును స్మశానమునకు మోసుకొనిపోవ

ములయందు భిన్నాభిప్రాయములు గలిగియుండుటకు ఆక్షేపణ యేమియుండదు. స్వతంత్రులుగానుందురు. బ్రహ్మవిద్యకును, మతమునకును, జనసంఘమునకును రాజకీయ విషయమునకును శాస్త్రమునకును గల సంబంధము నిందుక విచారింతము. లోకమున సర్వమతముల యొక్క తత్వమొక్కటే. దేశకాలాచారములనుబట్టి యనేక భేదములను గన్పట్టుచున్నది. మతమునకును, బ్రహ్మవిద్యకును గల సంబంధము మొదట విచారింతము. బ్రహ్మవిద్యయన, దివ్యజ్ఞానము లేక దేవునిని దెలియుట. పూర్వము గ్రీసు దేశమున దీనిని దెలివియని వాడుకొనుచుండిరి. ఇంద్రియాతీత మైన తెలివిలేదను వాదనకు వ్యతిరిక్తమైన తెలివినినది సూచించుచుండెను. ఇప్పటి ప్రకృతి శాస్త్రతత్వజ్ఞులు తమ యింద్రియములకు గోచరమైన విషయములు, పదార్థములుదప్ప నితరములుండిన నుండవచ్చును గాని మనిషి వాటిని దెలిసికొనుటకు సాధనములు లేవని చెప్పుదురు. అట్టి జనులప్రత్యక్ష వాదములను ఖండించుటకై యీబ్రహ్మవిద్యా సమాజమేర్పడి మన కన్నులకు గోచరముగాని ప్రపంచములున్నవనియు, బ్రయత్నముచేసిన వాటిని మనిషి జూడజాలుననియు జెప్పను. ఎట్లన, యింద్రియములు, బుద్ధిగాక దేహమున మనిషియనిపించుకొను పదార్థమొక్కటి వేరుగానున్నది. అగియుపరమాత్మ యొక్కటే గనుకనే ప్రతిమనిషి పరమాత్మను దెలిసికొన వీలున్నది. యీజిప్టు దేశమున గూడ నీబ్రహ్మవిద్య దెలివియని వాడుకలో నుండెను. మన దేశమున నది బ్రహ్మవిద్యయనుపించుకొనుచున్నది. బ్రహ్మవిద్యయన నేమైనది ఉపనిషత్తులయందు జక్కగా విమర్శజేయబడియున్నది. ముండకోపనిషత్తున ఆంగీరసుడు దేనిని దెలియుటవల్ల సర్వము దెలియునని యడుగబడి "బ్రహ్మవేత్తలు రెండు శాస్త్రములున్నవని చెప్పుదురు. మొదటిది వేదములను, వేదాంగములను దెలియుట; రెండవది, యవ్యయమైన పరమాత్మను దెలియునట్టి శాస్త్రము" లని ప్రత్యుత్తరము జెప్పెను. మొదటిది అపరవిద్యయన బడును రెండవది పరావిద్యయన బడును. ఈ పరావిద్య రాజయోగమన బడును. రాజవిద్య రాజగుహ్యమనబడును. రాజయోగముయొక్కగతి యిదియే. ఏకమై, పరమశాశ్వతమై, వికారరహితమైన పరబ్రహ్మజ్ఞానమిదియే బ్రహ్మవిద్య. మనిషి దేవునిని దెలియగలడని బ్రహ్మవిద్యచెప్పుచున్నది. సకల పదార్థముల జ్ఞానము గలుగుటకు నొకటే మార్గమున్నది. అదేదన, తెలుసుకొనవలసిన పదార్థమునకు సంబంధించిన స్వభావము మనయందు గలిగియుండినట్లైన నాపదార్థజ్ఞానము మనకుగలుగును. మనిషి దేవుని జూడజాలిన, అనగా పరమాత్మ స్వరూపము నొందుటకు మనుష్యునికి సాధ్యమైనట్లైన, అనగా బ్రహ్మవిద్య గొందరికి పట్టిన పిశా

చావేశముగాని, పైత్యదోష వికారముగాని కాక సత్యమై స్వానుభవజన్య పరమా
నంద స్వరూపమని యేర్పడినది గనుక ప్రతిమనిషియొక్క హృదయ కుహరమున
పరమాత్మయొక్క యంశము ప్రజ్ఞారూపమై ప్రత్యక్షముగా నుండుటచేత పరమాత్మను
దెలిసికొనుటకు మానవులకు వీలున్నది. దీనిని బట్టియే ప్రతిమనిషికి పరమాత్మను
దెలియుట సాధ్యమైయున్నది. ఈ విషయమునే మనపూర్వికుల పురాణములు, ధర్మ
శాస్త్రములు, మతములు, మాటిమాటికి బోధించుచున్నవి. మరియు శ్రీకృష్ణులు గూడ
భగవద్గీతయందు "మమైవాంశః" అనగా జీవుడు పరమాత్మయంశమని వెల్లడి
జేసియున్నాడు. ఉపనిషత్తులందును మహావాక్యములను నిర్ణయము జేసికొన్నందున
యభిప్రాయమునే సూచించుచున్నారు. ఈ విషయమిప్పుడు లోకమున ప్రత్యక్షరంగ
ములు బలమై మాసిపోవుచుండ దయాసముద్రులైన మహానుభావులు లోకహితమునకై
యీసమాజముద్వారా యుద్ధరింప బూనియున్నారు. బ్రహ్మవిద్యయన మతాభిప్రాయ
ముల గుంపుగాదు. మనుష్యులు వాదించుమతనియమములు, ప్రత్యేకమైన వాడుకలు
సాంఘిక సంకేతములు గావని కృషిముగా దెలియవలయును. అది పరావిద్య. ప్రయత్నాన
పురుషు శివస్వరూపమును బొందవచ్చునని తెలుపుచున్నది. ఈ సమాజమున దెలిపిన
దంతయు మూఢభక్తితో నమ్మవలసిన పనిలేదు. ప్రతివాడు ప్రతివిషయమును శోధించి
సాధనజేసి తన యనుభవరూపకమున గ్రహించి తెలియవలసినది. ప్రయాస మెండుగ
నుండును. అయితే ప్రయాసలేక తృణముగూడ లభించుట దుర్లభమని యందరును
దెలిసినవిషయమేకదా!

## మాపురాణము.

8. ఉండునదంతయు దేవుడే అని గురువుచెప్ప శిష్యుడు దాని యాంతర్యము
గ్రహింపక సామాన్యార్థమును గ్రహించి వాడు వీధియందు బోవుచుండ నొక యేను
గును చూచెను. దానిపై నున్నమావటివాడు గోవనుండు వానిని పోపొమ్మని హెచ్చరిక
చేయుచుండెను. 'నే నెందులకెడ మివ్వవలెను.' నేను దేవుడు. ఏనుగుగూడా నావలె
నే దేవుడే. నన్నుజూచి యెందుకు భయపడును అని శిష్యుడు తర్కించుకొనుచు నెడ
మివ్వక నిలిచెను. ఆ యేనుగు సమీపించి వానిని తొండముతోడ బట్టి యావలవేయ,
వానిశరీరమున గాయము లాయెను. ఆ శిష్యుడు గురువుకడకు వెళ్లి జరిగినదంతయును
జెప్ప, అంతయు సరే నీవు దేవుడు. ఏనుగుగూడ దేవుడే. అయితే మావటివాని రూపమున
నున్న దేవుడు హెచ్చరిక చెప్పుచుండెను గదా. ఆ హెచ్చరిక నెందుకు నిరాకరించి
తివి యని గురువు శిష్యుని నూగడించెను.

'Registered No. M 716.'
SWAN SERIES No. 3

ఓం





# హంస.

A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఒక యాంధ్ర బ్రహ్మజ్ఞాన మాసపత్రిక.

సత్యమునకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 1.] మే 1908. [సంచిక 5.

## విషయసూచిక.



---

చెన్నపట్టణము:
వైజయంతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

---

ప్రత్తి, హంసశాల మానేజరుగారికి వ్రాసుకొనవలయును.

సంవత్సరమునకు చందా 1 రూపాయి.

## హంసావళి.

1. షట్త్రింశన్మంజరి:—శ్రీశంకరాచార్యులు రచించిన భజగోవింద శ్లోకముల నాంధ్రహూణ పద్యాత్మికముగా రచింపబడినది. ఆబాలవృద్ధులకు నానందకరమైనది. వెల 2 అణాలు మాత్రమే.

2. ఏకాదిరత్నావళి:—1 మొదలు 224 సంఖ్యవరకు గల విషయవిశేషములిందు సంగ్రహింపబడినవి (అయనద్వయము, వాసనాత్రయము, సాధన చతుష్టయము, మొదలగు 1008 విషయములు) వెల 4 అణాలు మాత్రమే.

3. హంస:—ఇది మాస తెనుగు పత్రిక 1908 జనవరినుండి వెలువడుచున్నది. ఈ జన్మసార్థకము జేసుకొన గోరువారు దీనిని నిరాకరించ జాలరు. చందా సంవత్సరమునకు నొక రూపాయిమే.

హంసశాల, గుత్తి, అనంతపురం జిల్లా. | హ. సుబ్బరామయ్య, కార్యదర్శి.

# THE THEOSOPHICAL SOCIETY.

# బ్రహ్మవిద్యా సమాజము.

ఈ కాలమున ప్రత్యక్షవాదము మూఢభక్తి ప్రబలముగా నున్నది. ఇవి ప్రబలమై మన దేశముననున్న దివ్యజ్ఞానమును మరుగుపరచి యున్నవి. ప్రత్యక్షవాదమున, మన బాహ్యేంద్రియములకు గోచరమగు ప్రపంచములు తప్ప యితర సూక్ష్మపదార్థములు లేవనియు వాటిని మనిషి దెలియ సాధ్యముగాదనియు వాదించుట. మనయందు ప్రజ్ఞా కౌశల్యమును సామర్థ్యమును విపరీత సంశయభావనలచే విశ్వసించక వ్యర్థముగా వితండవాదముల వినోదించుట కూడ యగును. అదియునుగాక తనకు దెలిసిన ప్రపంచ జ్ఞానవిషయకమైన వార్తలను దృఢీకరించుకొనుటగాక తనకు దెలియని వార్తలను నమ్మక తనకు దెలియనదంతయు లేనేలేదని తిరస్కరించు భావముగూడ

ఓం

# హంస.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 1.] మే 1908. [సంచిక

## మా భక్తవిజయము.

### రామకృష్ణుడు.

ఆడువారిలో కొందరు దైవగుణములను కొందరు అసురగుణములను గలిగియుందు రని రామకృష్ణుడు చెప్పుచుండెను. దైవగుణము గలవారు వారి యజమానులను ధార్మికులుగ జేసి మోహబద్ధులుగ విషయాసక్తులుగ జేయరు. వీక్షణమాత్రమున నట్టి స్వభావమును నతడు గనుగొనుచుండును. కొన్ని సంవత్సరములకు బిమ్మట నతనిని జూడ నొక పరిచయములేని స్త్రీ దక్షిణేశ్వరమునకు వచ్చెను. ఆమె గొప్ప వంశమునకు జేరి ఘనత జెందిన యొకని భార్య. ఆమె బలుపగు నగలను గలిగియుండినను రూప వంతురాలుగా పశిదిగా నుండెను. ఆమె దైవసంపత్తు గలదిగా నెఱింగి దానిని శిష్యులకు ఋజువుచేయుటకు బూని యామె యెదుట సాపము వేశి యామె పాదములను పుష్పములతో బూజించి తల్లీ! యని స్తోత్రము జేయ బ్రారంభించెను. అప్పుడామె యదివరకు ధ్యాన మెరుగకున్నను ధ్యానపరవశురాలై యతనిని దీవించుటకో యన హస్తము లెత్తిన దాయెను. కొన్నిఘంట లట్లు స్మృతిలేక యుండ, రామకృష్ణు డామె భర్త దనను నిందించునని భయపడి యెప్పటివలె స్మృతిదెచ్చుకొన గాళీదేవిని బ్రార్థించెను. అప్పుడామె ప్రజ్ఞదెచ్చుకొని బండిలో గూర్చుని యింటికి వెళ్లెను.

మగవారి విషయములలో గూడ రామకృష్ణు డట్లనె చెప్పుచుండెను. అతనిని జూడ గుంపులు గుంపులుగా వచ్చువారిలో వీడు త్వరగా జ్ఞానము బొందుననియు వీడు

గోస్వాళ్లు ప్రపంచ సుఖమనుభవించవలయునవియు వీడు పూర్వజన్మమున రాజై యుండి ప్రపంచ సుఖదుఃఖములను బూర్ణముగా ననుభవించినాడు గనుక యీ జన్మమున గడతేరునని విధవిధములుగా వారివారి యోగ్యతను దెలియ జెప్పుచుండెను.

... పెండ్లిజేసుకొని కలకత్తానుజేరి కాళికాదేవిగుడిలో సేవ మరల నారంభించెను. వాని భక్తి యించుకయైన దక్కువకాక వేయంతలు ప్రబలమాయెను. వాని హృదయమంతయు కాళికాదేవియందు మగ్నమై యామె దర్శన మపేక్షించుచు నశ్రువుల ప్రవాహములు కార్చుచుండెను. ఒకబిడ్డ గలిగి యది చచ్చిన నేడ్చు తల్లియుగూడ నంత వ్యసనాక్రాంతయై యుండియుండదు. అనేకు లతని జుట్టుకొని యోదార్చినను, దేవాలయములోని ఘంటలశబ్ద మనుదినము వినరాగా 'అయ్యో, తల్లీ! ఈ దినము వ్యర్థముగా గడచిపోయెనె, నీవు నాకగుపడ లేదే' యని బిగ్గరగా నేడ్చుచుండును. జనులు వానిని కొందరు పిచ్చివాడనియు లేక యేమో బాధపడు చున్నాడని యనుకొను చుండిరి. కాని ధనదారేషణలు గలిగి, పేరునకు ప్రఖ్యాతికి గాలము గడుపుచున్న నాకికునికి దేవుని నతడత్యంత భక్తితో దాము తమ భార్యను పిల్లలను ప్రేమించునట్లు గొలుచుచున్నాడని కనుగొనుట కెట్లు సాధ్యము. ఆ దేవాలయమును గట్టిన రాణి రాచమణియొక్క యల్లుడు మధుర నాథుడను వాడతని యందు మిక్కిలి భక్తి కలవాడు గనుక నతనిని, గలకత్తాలోని వైద్యులకు జూపి యతని వెఱ్ఱితనమునకు నౌషధమిప్పించెను. అయితే ప్రయోజనము లేకపోయెను. డక్కా పట్టణమున నున్న యొక వైద్యుడు మాత్ర మతడు గొప్ప యోగి యనియు యతనికి యేమందు పనికిరాదని చెప్పెను. గనుక నతని స్నేహితులు చెడిపోయినా డని యతని యాశ విడిచిపెట్టిరి.

రామకృష్ణుని భక్తి దినదినమునకు హెచ్చి యొకనాడు కాళికాదేవి వియోగమునకు చాలా ఖిన్నుడై తన యేకాంతమును గాళిజాలక చంపుకొనుట మేలని చింతించుచు బహిః ప్రజ్ఞలేక పడియుండ గలలో కాళికాదేవిని జూచినట్లాయెను. ఇట్లప్పుడప్పుడు కలలో దేవి ప్రత్యక్షమగుచుండగా నతడు శాంతచిత్తు డగుచు వచ్చెను. కొంతకాల మా కలలను నమ్మక "ఇటువంటిది జరిగిన నిజమని నమ్ముదును" యని యనుకొనుచుండ నిట్లనే జరుగుచుండెను. 'నా కిదివరకు బరిచయములేని రాణి రాచమణియొక్క పసిబిడ్డలిద్దరు గుడియొద్దకు వచ్చి యీ మఱ్ఱి వృక్షముక్రింద గూర్చొని నన్ను పూట్లాడించిన నీ దర్శనము నిజమని నమ్ముదును గాని లేకున్న నా పిచ్చి భ్రాంతి

యని తెలియుదు' నని యొకనాడనుకొనెను. అతడనుకొన్న సమయమునకు సరిగా నతనిని పేరుబెట్టి పిలుచుచు కాళికాదేవి ప్రసన్నురాలై యనుగ్రహించునని నతనిని వారూరడించి వెళ్లిపోవ నతడు చాలా యాశ్చర్యము నొందెను. ఆ బిడ్డ లదివరకు వారి యంతఃపురము విడిచి బైట వెళ్లివచ్చినది లేకున్నను, ఆనాడు దేవాలయమును జూడ ప్రేరేరింపబడి తల్లి యాజ్ఞనుగొని దేవాలయమునకు వచ్చిరి. దైవానుగ్రహ మున్ననే కార్యము జరుగుట దుర్లభము!

ఇట్టి స్వప్న దర్శనములు నానాటి కెక్కువై యెక్కువ కాలముండునదిగా నేర్పడి దినచర్యలు కూడ సలుపుట కవకాశములేక వచ్చెను. ప్రతి దినము పూజ ప్రారంభమున దేవిని నావాహనము జేసికొన పుష్పమును తన శిరస్సుమీద పెట్టుకొన గానె నతడు ప్రజ్ఞతప్పి దీర్ఘకాల మట్లు ధ్యానపరవశుడై యుండును. దేవికి నిచ్చు నాహారమును మై మరచి తానె యంగీకరించును. దేవికి నలంకారము జేయుచు స్మృతి దప్పి తానే యలంకరించుకొనును. మధురనాథు డతని చర్యలను కొన్నా ళ్లాక్షేపించుచుండెను. తర్వాత యతడు వాని నొకనాడు శివుని రూపముగా గనబడ నాటినుండి యాక్షేపణలు మాని, యతనిని ప్రత్యక్ష దైవముగా భావించుచు, రామ కృష్ణుని యల్లుని పూజారిగా నియమించి రామకృష్ణుని స్వేచ్ఛగా విడిచెను.

రామకృష్ణుడు సప్న దర్శనముల దృష్టి జెందక పూర్ణానుభవమును బొంద పాటుపడుచుండెను. పండ్రెండేండ్లు ఘోర తపమును ప్రారంభము చేసెను. తపస్సు చాలించిన వెనుక యా కాలము దీర్ఘమని యతనికి దోచలేదు. ఈ కాలమంతయు రెప్ప మూయనే లేదు. ఆవు లింతకూడ లేకుండె. సర్వదా చలించని పౌర్ణిమ దృష్టి గలిగి యుండెను. ఒక్కొకసారి దేహమలసి వ్యాధి వచ్చినట్లు మనసున దోచ, నద్ద మున జూచుకొని యీడ్చుకొనిపోయిన కంటి పల్లములలో వేళ్లుపెట్టి రెప్పల నీడ్చి మూసిన నవి మూయకుండెను. ఒక్కొకసారి నిరాశజేసుకొని 'తల్లీ' నిన్ను పిలిచి నమ్మినందుకు నిది యీ ఫలమని ఘోషించుచుండెను. అప్పుడు "బిడ్డా! తృణ సదృశ మైన యహంకారము దేహాభిమానము పెట్టుకొనియుండువరకు నీవెట్లు దివ్య తత్త్వ మును బొందగోరదవని" యొక శబ్దమతనికి వినవచ్చును. 'అప్పుడొక జ్యోతి యతని హృదయమునినుండి మార్గము సాధింప ధైర్యమిచ్చుచుండెను.' 'తల్లీ! ఈ యధర్మ ప్రవర్తకులై మానవులయొద్ద నేర్చినది యేదియును లేదు, నీవె నాకు, బోధించుమూ' యని దేవిని ప్రార్థింప, 'నిజమే' యని యామె చెప్పెను.

"దేహ సంరక్షణ నొకసారియైన జేసుకొన ప్రయత్నించ లేదు. నా వెంట్రుకలు బెరిగి నాకు దెలియకనే జడలు కట్టెను. నా యల్లుడు నా వద్దకు నాహారము దెచ్చుచుండెను. ఒక్కొకనాడాహారమును తినుచుంటిని, ఒక్కొకనాడు నా గొంతులోనికి నాకు దెలియకనే యాహారమును ద్రోయుచుండెను. ఒక్కొకసారి పరిచారకుల గదులలోనికి వెళ్లి నా చేతులతో నూడ్చి శుభ్రము జేయుచుంటిని. తల్లీ! నేనొక గొప్పవాడను బ్రాహ్మణుడను యహంభావమును నాయందు లేకుండ ననుగ్రహించుము. నీవె సర్వరూపముల ప్రకాశించుచున్నావు" యని చెప్పుచుండెనని రామకృష్ణుడు సెప్పుచుండెను.

ఒక్కొకవేళ గంగాతీరమున గాలముగడపుచు, కొన్ని బంగారు వెండి నాణ్యములొకచేత నురియొకచేతి నా ప్రక్కనున్న తృణమును బెట్టుకొని, "మనసా! రాణితల గల నిన్ను ద్రవ్యమనిగురు. బియ్యము చేటలో కొనుటకును, బీదల కాదరించను, గృహములు కట్టను, ప్రపంచమున గణ్యమైన కార్యములు జేయ నుపయోగపడునుగాని, సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మానుభవము నిచ్చెదవా యనుచు చేతులనుండు దుడ్డును తృణమును దుడ్డు తృణమని పలుమారు చెప్పుచు రెంటికిని భేదము దెలియక స్మృతిదప్ప గంగలో వైచుచుంటిని. నన్ను పిచ్చివాడను కొనిరి" యని కూడ రామకృష్ణుడు సెప్పుచుండెను. అతని భక్తుడైన మధురనాధుడతనికి 1,500 రూ॥ వెలగల యొక బంగారంచుసరిగ యంచులుగల శాలువతో నలంకరించ, సంతోషించినట్లుగుపడి, తర్వాతదానిని క్రింద వేసుకొని దానిమీదనుమ్మివేసి,దానితో తనగదిని శుద్ధి జేసి 'శాలువా! నీవు నా యభిమానమును వృద్ధి జేసెదవు కాని, సచ్చిదానంద పదవినిబొంద సహాయభూతవౌదువా? వేలిక కంటె నెక్కువకావ'ని చెప్పుచుండ నతడు వినెను. ఒక సమయమున నతని దేహమున దహింపబడునట్టి బాధ కలిగెను. అప్పుడు గంగానదియందు నీటిలో గడ్డమువరకు నిలిచి తలమీద దడి బట్టను బెట్టుకొని దినమంతయు గడపుచుండెను. అప్పుడొక బ్రాహ్మణస్త్రీ వచ్చి యతని బాధ మూడుదినములలోన నివారించెను. అతని దేహమున గంధము దీసిపూసి పుష్పములచే నలంకరించి నా బాధ దీరెను. ఈమె చాలా సాధారణమైన పాండిత్యముగల బంగాళీ స్త్రీ. ఈమె పురాణములను తత్వశాస్త్రములను జక్కగా శోధించి, యనేక గ్రంధములను కంఠపాఠముగా జెప్పుచుండెను. గొప్ప పండితులతో బ్రసంగము ధైర్యముగా జేయగలిగియుండెను. ఒడ్డు పొడవుగాను సుందరవతిగా నుండినదిగాక దేహదార్ఢ్యమును మనో

దార్ఢ్యమును గలిగి శిష్యులకు దివ్య బోధజేయు సామర్థ్యమును గలిగియుండెను. ఆమె శారీరము మనోహరముగా నుండెను సంగీత శాస్త్రమునగూడ ప్రవీణురాలుగా నుండెను. లోకమును ద్యజించి, యోగ మభ్యసించి, కొన్ని యోగసిద్ధులను సాధించి సన్యాసియై కావి వస్త్రములను ధరించి లోకమున సంచరించుచుండెను. ఆమె యెక్కడ యేకుటుంబమున బుట్టినది. పేరేమైనది దెలియదు. ఆ విషయమున నామెను విచారించ నందరికి భయముగా నుండెను. లోకములో దుఃఖములను పాపములను నివారించి యందరిని సిద్ధులజేయ నీ లోకమున నవతరించిన దేవతయో యన ప్రకాశించు చుండెను. జ్ఞానమార్గమునను౦డిన ముగ్గురిని జ్ఞానసిద్ధిని బొందింప నామె పనిగా గ్రహించి యుండెను. రామకృష్ణునకు నీమెవచ్చి జ్ఞానమార్గము బోధించునని కాళికా దేవి సూచించి యుండెను గనుక నామెను దక్షిణమె యరిగినదానిగా గ్రహించెను. ఆమె కూడ నిద్దరిని నప్పుడే కనుగొంటినిగాని నిన్నుగూర్చి చాలా వెదుకుచుండి నేడు కనుగొంటిని యని యీమె సెప్పెను. అంతవరకు నితనియమానుష్టమైన తీవ్రభక్తిని పరిపూర్ణమైన నిర్మలత్వమును గ్రహించువారి నెవరిని రామకృష్ణుడు కనియుండ లేదు గనుక నీమె రాక యతనికి నత్యంతానందమును గలుగజేసెను. ఆతని భక్తి విశ్వాసము లనంత మాయెను.

• (సశేషము)

## మతముల నైక్యము.

మతవిషయమై యిదివరకు నిరూపించిన ప్రకారము మతమొక శాస్త్రమని రూఢియగుచున్నది కదా? ఈ శాస్త్రమున సంపూర్తిగ గ్రహించుటవలన లోకమున ననేకమతము లేర్పడుటకు గారణమైనది. ఈ మతభేదములను సన్వయించుకొనుటకు వీలు లేనిపక్షమున నేమతమును ననుసరించుట నిరుపయోగముగా నుండబోవును. ఏలన మతములు వివిధములుగా నున్నను వాటియందు నైక్యక నియమ మిమిడి యున్నదిగాన మతభేదములుండుట నాయాకాలదేశములు, జనులనుబట్టి యావశ్యకమే? ఇట్టి భేదములుండుటవలన "లోకో భిన్నరుచిః" అన్నట్టు సకల జనులకు నడచుకొనుటకు చాలా యనుకూలముగా నున్నది. అన్ని మతములందు ప్రధానాంశము లొక్కటే. లోకమున సకల వ్యవహారములయందు నేకీభావమొకటి, సిద్ధమై యుండును. దీనికి దృష్టాంతముగా నీవు జేరిన కుటుంబమును దలచుకొనుము. నీ యింటి

యందుండు వారందరు సేయు కార్యములను, దలంచు నుద్దేశములను, ధ్యానించు విషయములను విచారించుము. కొందరు వ్యాపారమువల్లను, కొందరుకృషివల్లను, విద్యావంతులై ధనమునుసంపాదింతురు. వారివారి కిచ్చవచ్చినట్లు పనులను నిర్ధారముచేసుకొని యోగ్యతను సంపాదించుచుందురు. వ్యాపారము చేయువారికి విద్యాభివృద్ధియందు మనస్సు పోదు. విద్యావంతునికి కృషివ్యాపారముల వాసన యుండదు. కృషి జేయు వానికి విద్యావ్యాపారములు విషమగును. ఇట్లొకడు సేయుపనిని మరియొకడు గానక యుండును. కొందరు పనిజేయక పై వారు సంపాదించినది తిని యూరకుందురు. వారిలో వృద్ధులు సంసారకార్యముల నిర్వహింతురు. పురాణ పుణ్యకథల రాబోవు జన్మములకు గతిసిద్ధము జేసుకొనుచుందురు. బాలురు చదువుచుగాని యితర పనుల నేర్చుటకుగాని ప్రయత్నించుచుందురు. ఇట్లు నీ కుటుంబమున నున్నవా రనేకవివిధములైన కార్యములు జేయుచున్నను, వారందరొక్కటియుద్దేశమునే గలిగియున్నారు. ఒకరికి నొకరు సహాయము చేసుకొనుచుందురు. ఇన్ని కార్యము లందరి సంరక్షణకై పొయ్యిమీద నుంచిన తపెల కాగుటకే గదా? యీ యొక యుద్దేశము వీరందరికి గలుగుటవల్లనే వివిధ కార్యములందుకు జేయుచునున్నవారు. ఇట్లు లోకముననుండు సకలవిషయము లేదో యొక యుద్దేశమునుబట్టి జేయబడునట్లు మనము నిర్ధారము జేయవచ్చును. ఇట్లనే మత విషయములందు గూడ నేకీభావము మనము నిర్ధారము జేయవచ్చును.

మతములు వివిధములుగా నున్నను, వాటి ముఖ్య నియమములలో నొకదానితో నొకటిని సరిపోల్చి విచారించిన, నవి భేదములుగా నుండవు. ముఖ్యాంశము లొక్కటిగా నున్నవి. దేశములలోని జనులు వివిధ తరగతులలో నున్నారు గనుక అన్ని మతములకు సామాన్యమైన ప్రధానాంశములను వివిధముగా నేర్పింప నావశ్యకమేర్పడి వివిధ మతములుగా బ్రసరించియుండుట యావశ్యకమే కదా? కాలదేశ జనుల భేదములనుబట్టి మహనీయు లాయాదేశమున నవతరించి వారికి వారికి దగినరీతి జ్ఞానోపదేశము చేసియున్నారు. అట్టి యుపదేశములను సామాన్యమైన నీతులలోనె కలిపి యిచ్చియున్నారు. ప్రతి మతము దనంతట దాను మోక్షదాయికమే. ఈమతములలో ముఖ్యమైన యంశమేమన, కొన్ని మతములలో గేవల తత్వాంశములనే చెప్పుదురు. కొన్ని మతములలో గేవల నీతిమార్గమును బోధించుచు నక్కడక్కడ తత్వాంశములను వెదజల్లియున్నారు.

మతములన్నియు పరమగతిని యొక్క విధముగా వర్ణించుచున్నవి యను విషయమును కొంచెము విచారింతము.

ఒక యీతకునుగాని, నాగులనుగాని, పిల్లినిగాని పూజించువాడు, వాటియందేదో శక్తి యున్నదనియు, నది దన్ను తన బంధువులను గాపాడుననను నమ్మకముతో బూజించుచున్నాడు, ధైర్యశాలియై జీవించి పోరి చచ్చినవీరులను గొందరు బూజించుదురు. వారి జ్ఞానశౌర్యములు తమకు నావాహన యగునని పూజించుదురు. లోకోపకారమునకై పాటుపడి శ్రమనొందినవానిని గొందరు తమకు నట్టి సాహసము పూనిక సమకూరగవలయుననను నుత్సాహముతో గొలిచెదరు. ముముక్షువులు సర్వతత్వములను వాగ్రుచ్చిన మహానుభావుల జ్ఞానామృతమును సంపాదించి మై మరచుదురు. ఇట్లు నానావిధములుగా ననేకులు బూజించినను, వారియందరి యభిప్రాయముల నిట్లు మనము సంగ్రహింప నగును.

1. అన్ని మతములు చర్మాస్తిమాంస పూరితమైన శరీరమునకు భిన్నముగా నుండు నాత్మ లేక పరమాత్మయను నొక శాశ్వతమైన పదార్థ మున్నదని యొప్పుకొనుచున్నవి.

2. ఏదో యొక గొప్ప శక్తి యున్నదనియు దాని యనుగ్రహమువల్ల సంసార దుఃఖ నివృత్తియై యఖండ జ్ఞానసౌఖ్య సంపదలు సమకూరునని యొప్పుకొనుచున్నవి.

3. పాపము చెడ్డదనియు, పుణ్యము మంచిదనియు, ప్రతివానికి దనకు దెలిసినది నడచుకొనుటకు గష్టమని దోచినను, నమ్ముచున్నారు.

4. సాధారణముగా ననేకులు స్వార్థపరత్వ ప్రాబల్యమువల్ల లోకమున హాని గలిగినదనియు దీనిని ద్రుంచివేసిన దుఃఖముల మదృశ్యమగుననియు నొప్పుకొనియున్నారు.

5. స్వార్థపరత్వము లేక లోకమును సన్యసించి వారిని మహానుభావులనియు స్వర్గసోపానములనియు నందరు నమస్కరించుచున్నారు.

6. ప్రతివాడు దేనికంటె నెక్కువ లేదో దానినే గొలుచుచున్నాడు.

ఇట్టి యభిప్రాయము లన్ని మతములందుండుటంబట్టియే యొకదానవి యన్నియు ముఖ్యముగా నొక్కటియై పరస్పర మిత్రత్వమును గలిగియున్నది. గనుక యొక మతస్థుడు మరియొకనిని సహోదరుడనియు సహచారియనియు భావించవలెను. విరోధునిగా భావించకూడదు. ఈ విషయమును జక్కగా దెలిసి గ్రహించిన లోకమునందు

మతవిరోధములు, మాత్సర్యములు, యుద్ధములు, కలహములు, మరణములు నశించి యీ లోకము యమలోకముగాక స్వర్గతుల్యమై యుండునుకదా! ఆహా! అజ్ఞాన మెన్నిదుఃఖము లూరక కలిగించుచున్నది. అయ్యో! ఇట్టి దురవస్థలుమాని లోకమంతయు సహోదరభావము వృద్ధిపొంది సర్వ సుఖదాయకమైజేయు సహాయభూతమగుటకు సదా సర్వాంతర్యామియైన యీశ్వరుని ప్రార్థించుచున్నాము.

## ఆత్మబోధ.

### 8-వ. పాఠము.

### మనస్సు.

మన్ అనునది సంకల్పించుట యను మాటనుంచి పుట్టినది. మనలోనుండు సంకల్పించు చైతన్యమున కీపేరు కల్గినది. గనుక మానవుడనుమాట గల్గినది. మనసే జీవుడు, నశించని పదార్థము. ఇదియే యనేక శరీరములను ధరించును. పరమాత్మ చైతన్యము ప్రకృతి వశమున ప్రపంచమున సృష్టియై, పైకనిన నాల్గుశరీరములను దాల్చి రాయి, చెట్టు, చేమ, క్రిమి, కీటక, పశ్వాదులై లోకానుభవముపొంది, వెనుక నానా శరీరానుభవములచే పూర్ణమైయుండు సమయమున, పరమాత్మయొక్క జ్ఞాన స్వరూపము వెల్లడియగుటకు ననుకూలమైన శరీరము మానుషశరీర మనుపించుకొనును. ఈ మనస్సు శుద్ధ మశుద్ధమని ద్వివిధము. ఇవి రెండును వేరు వేరుగా నుండును. అశుద్ధమైన మనస్సు ఒకతట్టు శుద్ధమనస్సుతోను, మరియొకతట్టు కామముతో నంటి యుండును. శుద్ధవాసనలు బలమైన, నూర్ధ్వగతి బొందుటకు గారణమగును. కామ వాసనలు బలమైన నధోగతి సిద్ధముగ నుండును. ఈ యశుద్ధ మనస్సు దనకునుండు నీ రెండు సంబంధములను జక్కగా విచారించి శుద్ధమనస్సుతట్టు అభిముఖము గాం వలెను. పదార్థములమీద, పూర్వోత్తర విచారములేక మనస్సు ప్రసరించుటయే వాసన యనబడును. ఈ వాసనల ననుసరించి జన్మజన్మమున బుద్ధియొక్క గ్రహణశక్తి యేర్పడుచుండును. గనుక శుద్ధవాసనలను సాధనజేసిన సౌఖ్య పదవులు గలుగుచుం డునుగాని, నీచమై దుర్మార్గమైన వాసనలు ప్రబలిన నధోగతిని నిస్సందియంబుగ దెచ్చును. ఈ విషయమున ననేకులు లోకమున సాధారణముగా నెఱింగి యుండినను

# ఆత్మబోధ.

బలవత్తరమైన కామశక్తిచేత నీడ్వబడి, దానిని విచారణజేయుటకు నించుకయైన బ్రయత్నించక, యథ్యోగమునకి క్షణక్షణమున నవకాశము గలిగించుకొను చుందురు. ఈ వాసన లనుసరించియే, స్థూలదేహపటుత్వము, ఆరోగ్యము లేర్పడుచుండును. అన్నివిధముల శ్రేయస్సును గోరువారు శుద్ధవాసనలను హెచ్చరిక గలిగి వృద్ధిచేసుకొనుచుండవలయును. మనలోనుండు భిన్నములుగా నగుపడు చైతన్యములు, అభిన్నమై యఖండాకారమైయున్న యొక పరమాత్మ ప్రకాశములైనను, ఆ భిన్నాంశములైన జీవులయొక్క యనాది వాసనలననుసరించి దేహములు సిద్ధములై యుండును గనుక, ఆత్మయొక్క పూర్ణశక్తి వాటిద్వారా ప్రసరింప నవకాశములేక యున్నది. ఇది అశుద్ధ యగు మనస్సు తప్పుగాని, శుద్ధమగు నాత్మయొక్క తప్పుగాదు గనుక "మనయేవ మనుష్యాణాం కారణంబంధమోక్షయో" అను దానికి మనస్సే మన సద్గతికి దుర్గతికి గారణమై యేర్పడియున్నది. సామాన్యముగా సకల కార్యములుజేయుటకు గామముతో జేరిన మనస్సే కర్త. ఆ భావమే నేననుకొంచుకొనును. కీర్తికైనను ప్రేమకైనను, లోకోపకారమునకైనను, యే కార్యమైనను నాదియన భిన్నభావముచేత జేసినదిగూడ శుద్ధమనస్సును జేరినది గానేరదు. కామముయొక్క ఛాయ యందులో మిశ్రమమై యుండును. ఆత్మయొక్క చలనస్వభావము మనస్సనబడును. నిశ్చయ స్వభావము బుద్ధియనబడును. భిన్నభావ మంతఃకరణ మనబడును. ఒక్కొక జన్మమునజేయు కర్మలయొక్క ఫలము వాసనారూపకముగా మనస్సునజేరియుండి మరొక జన్మమున ననుభవించు ఫలములకు బీజములుగా నేర్పడును. ప్రపంచమున ప్రతిమనిషి యనుభవించు సుఖదుఃఖములు దనచేత జేసుకొనబడినవియేకాని యాకస్మికముగా నగునవి గావు. మరియొకనిచేత మనకై చేయబడినవి కావు. ప్రకృతి ప్రయత్నమువల్ల మన మనుభవించు ఫలములయందు గొంచెము మార్పులు గలుగజేసుకొన వచ్చునుగాని దానిని సంపూర్ణముగ మార్పుజేసుకొనుటకు మనకు శక్తి లేదు. ముందు రాబోవునది మన చేతిలోనున్నది. గనుక మనము జేయబోవు కార్యములను చక్కగా క్షణ క్షణమునకును విచారించి మనకుముందు హానియు గలుగకుండునటుల జేసుకొన బ్రయత్నించుచుండవలయును. దుర్మార్గములు, దురాలోచనలు, పరస్త్రీ, ధనాపేక్ష మొదలగు దుర్విషయములు ప్రీతిగా నగుపడి మనలను వాటియందే వర్తించునట్లు చేయుచున్నవి. మనము హెచ్చరికదెచ్చుకొని వాని ఫలములకు భయపడి నిర్వర్తించిన గేవల సుఖముగా సద్గతిని బొందనగును.

# మనమాతృభూమి నెట్లుద్ధరింపవచ్చును?

దేశవత్సలులనేకులు మన భరతభూమి నెట్లుద్ధరింపవచ్చునని విచారించుచు నానామార్గములందు ప్రవేశింప బూనియుండుట సమస్తులకు వేద్యముగనున్నది. దేశోద్ధారమునకై యేర్పడ్డసంఘములు గూడ భిన్నభిన్నమార్గములలోనే పనులు చేయుచున్నవి. అట్టి సంఘములలో, ఆర్యసమాజము, బ్రహ్మసమాజము, హిందూ జనసంస్కారిణీసభ, మరియు లోకమంతయు వ్యాపించియుండు బ్రహ్మవిద్యాసమాజము, వన్నెకెక్కినవి. వీటియందు దేశోద్ధారమునకుగాను సభికులు పడుచుండు పాట్లన్నియు చిరస్మరణీయములగానున్నను పూర్వ సంప్రదాయములను తిరస్కరించుప్రయత్నములు మాత్రము ఖండనీయములగానె యుండునని కొందరభిప్రాయ పడుదురు. కారణమేమన లోకరహస్యము నెరిగిన మన పూర్వజులగు మహర్షులచే పరికల్పింపబడిన సంప్రదాయములు దైవికముగను ప్రపంచోన్నతికి హేతువు గనుండునని యభిప్రాయము. మన పూర్వజులగు, ఋషులు ప్రాపంచిక జ్ఞానమందుగాని, పారమార్థిక జ్ఞానమునందుగాని, యసమానులై యుండిరని యిప్పటి నాగరీకప్రపంచ మందంతట బొగడబడుచున్నారు. ఇట్టి దైవజ్ఞులగు మహానుభావులచే నివ్వబడిన లోక నియమములు శ్రేయస్కరముగ నుండునని చెప్పుట ప్రమాదముకాదు. ఇది యటుండగాక, ఋషిప్రోక్తములగు నాచారవ్యవహారాది సంప్రదాయముల ననుసరించి నడచిన నీల, నల, మాంధాత, రామచంద్రాది రాజవర్యులు, పురాణములయందు ప్రసిద్ధములగు నితరవర్ణపువారు, సీత, సావిత్రి, మొదలగు పతివ్రతాశిరోమణులెట్టి యసమానమైన నడతను పొందియుండి లోకహితమును గావించిరో చూడుడు. కేవలము నాస్తికజ్ఞులగు పాశ్చాత్యులుగూడ ఈ మహానుభావుల చరిత్రలను జదివి చదివి విసుకు చెందకున్నారు. ఇట్లుండ మన మాతృభూమి పూర్వమునందు గొప్పస్థితిలో నుండినందుకు పెద్దలచే చెప్పబడిన సత్సంప్రదాయములే కారణములైయున్నవని గ్రహించుటయందు దోషమేమి యగపడను. ఈ కారణమునుబట్టియే మన దేశోద్ధారమునకు ప్రాచీన సంప్రదాయముల నుద్ధరించుటయె ముఖ్యకారణమని తెలియుచున్నది ఆప్రాచీన సంప్రదాయములెవ్వి? అవి యిప్పుడేరూపముగ నున్నవి? వాటినిప్పుడుద్ధరించుటెట్లు? ఈప్రశ్నలు పుట్టుచున్నవి. సంప్రదాయము లనేకము లుండుటంబట్టి

ప్రకృతము మన హిందూసంఘమును జక్కపరచుటకు కేవల యావశ్యకములగు పద్ధతులను మాత్రము విచారింతము.

## వర్ణాశ్రమపద్ధతి.

మన ఆర్యనాగరీకతను వన్నెకెక్కించిన పద్ధతులలో వర్ణాశ్రమ పద్ధతి మొదటిదిగనున్నది. దీని సహజమైన సౌందర్యమును, అసమానమైన కట్టుపాటును, జీవుని పురోభివృద్ధికి సాధనమైనశిక్షాబలమును, మనమూహించుటకుగూడ వరము కాకయున్నది. యుగయుగములందు జనులకు సుఖమిచ్చుచు వచ్చినది. ప్రాఙ్మన్వంతరమందు ఇది లోకహితమును గలుగజేసినది. శైథిల్యము నొందిన యిప్పటి మనకాలమునందు గూడ నాదరముతో ననుసరించినవారికి, సుఖప్రదముగనే యున్నది. ఇట్టి యసమానమైనపద్ధతిని గల్పించినవా రెవరు? ఏకారణమును పట్టి కల్పింపబడినది? దీనిస్వరూపమెట్టిది? ప్రకృతమిది యేరూపముగనున్నది? దీనిని నిజరూపమునకు దెచ్చుటెట్లు? అనునీసంగతులను విచారింతము. శ్రీమద్భగవద్గీతయొక్క నాల్గవ యధ్యాయమునందు నీరీతిగ జెప్పబడియున్నది.

శ్లో॥ చాతుర్వర్ణ్యంమయాసృష్టంగుణకర్మవిభాగశః।
తస్యకర్తారమపిమాంవిద్ధ్యకర్తారమవ్యయం॥

అనగా గుణకర్మవిభాగముల ననుసరించి నాల్గువర్ణములు నాచేసృజింపబడెనవి. అకర్తగాను అవ్యయుడుగా నుండినను వాటికి నన్నుకర్తగా దెలుసుకొనుము. ఇట్లు నాలుగువర్ణము లుత్పత్తికి దామేకర్తయని శ్రీకృష్ణుడానతిచ్చినాడు. ఇప్పటివారనేకులు చెప్పునట్లు సంఘముయొక్క ప్రయోజనమునకుగాను జనులు దమంతట దామే యేర్పరచుకొన్న పద్ధతి కాదని దీనివల్ల వ్యక్తమగుచున్నది కదా! ఇట్లుండ, దైవనియామకమగు నీ వర్ణాశ్రమపద్ధతిని నిప్పటి విద్యమానమునకు ననుగుణమగునట్లు వ్యత్యాసపరచుటకు ప్రయత్నపడవచ్చునా? దేశచరిత్రములను వ్రాసిన పండితులు ఈ విషయమై పడిన యభిప్రాయములన్నియు శ్రీకృష్ణభగవానుల వాక్కుచే నీట గలసి పోవుచున్నవి. అయితే శ్రీకృష్ణభగవాను లానతిచ్చిన పైశ్లోకములో నీ నాల్గువర్ణములను తమ యిచ్ఛకువచ్చినట్లు సృజించలేదనికూడ నభిప్రాయమగుచున్నది. ఏలనన "గుణకర్మవిభాగశః" అను పదప్రయోగమునందు గుణకర్మవిభాగముల ననుసరించి నాల్గువర్ణముల నేర్పరచినట్టును, "అకర్తారంవిద్ధి" యనుటయందు దాను గర్త గాడనియు భావమగుచున్నది. అనగా దన మనఃపూర్వకముగ నీ నాల్గువర్ణములను

విధించలేక. గుణకర్మములనుబట్టి ఏర్పఱచినట్లు స్పష్టమగుచున్నది. గుణకర్మలెట్టివి? ప్రకృతియందు కొన్ని ముఖ్యమైన గుణములు గలవు. వాటి ప్రాబల్యముచే జేయ బడు కర్మలు కొన్ని ఫలములను దప్పక యిచ్చుచున్నవి. ఈ రెంటి యాధారముల నుండియే నాల్గువర్ణములేర్పరచబడినవి. ఇవి సహజమైన విభాగములు. ప్రకృతియందు కలపదార్థ తారతమ్యమునుండియు కర్మలవలన గలుగు ఫలభేదములనుండియు కలిగిన వని స్పష్టమగుచున్నది. కొందరు మహానుభావులు ప్రతి వర్ణమునకు వేరు వేరు గుణములు సహజముగ నుండునని చెప్పుదురు. ఆయా వర్ణమునకు నియామకమగు గుణము లాయా వర్ణస్థునియందు లేనియెడల యా వర్ణమునకు వాడు సేరినవాడు గాడని మరికొందరు చెప్పుదురు. మహాభారతమునందు బ్రాహ్మణాది నాలుగు వర్ణము లకు సహజమైన గుణములను బ్రతిపాదించినతరువాత గురువు శిష్యునికి జెప్పిన దేమన:—“బ్రాహ్మణునియందుండవలసిన గుణములు వానియందు లేక శూద్రునియం దుండిన నా శూద్రుడు శూద్రుడు గాడు బ్రాహ్మణుడు బ్రాహ్మణుడు గాడు.” ఈ ప్రమా ణమునుబట్టి వర్ణాశ్రమపద్ధతి స్వభావమునందుగల కొన్ని గుణ తారతమ్యములచే స్థాపింప బడినదని వ్యక్తమగుచున్నది.

ఈ పద్ధతిని గొంచము జాగరూకతతో విచారింతుమేని జీవునియొక్క వృద్ధిమార్గ మునకు సోపానప్రాయముగా నున్నదనికూడ దేటబడును. హిందూదేశమునకు మాత్రము, అథవా హిందూమతమునకుమాత్ర మిది యేర్పడిన పద్ధతియని తలచరాదు. సమస్త భూమండలములోనుండు సమస్త దేశములకును, సమస్తమతములకు నిది గ్రాహ్య మైన పద్ధతిగానున్నది. అయితే మన దేశమునకును విదేశములకు ని పద్ధతి వాడుకకు వచ్చియుండుటలో కొంచము భేదము కలదు. మన దేశమందు వర్ణతారతమ్యములు స్పష్టముగా గ్రహింపబడి మన హిందూ సంఘమంతయు వాటి యాధారముచేత నె రచింపబడినది. ఇతర దేశములందన్నను, మానవసంఘ మిట్టి స్పష్టమైన క్రమముచే రచియింపబడలేదు మనదేశమున వర్ణాశ్రమ పద్ధతి యాచరణకువచ్చినట్లు ఇతరదేశముల యందు మనుష్యతరగతులేర్పడినవి. అనగా ఒక క్రమమును బట్టి గుణాభివృద్ధియగుట మన దేశమందును గుణములే స్వతఃప్రకోపమగుట యితరదేశములందును తటస్థించును. ఎట్లైనను ఒక క్రమమును బట్టి జీవుడు పైకెక్కుట కేవల గ్రాహ్యమైనది. వర్ణాశ్రమ పద్ధతి యిట్టిదగుటంజేసి యిప్పటి మానవసంఘమునకుగూడ నెంతో ప్రయోజనకారిగా నుండుటయే గాక దాని దృఢత్వమునకును పరస్పరస్పర్ధలో గలుగు యోగ్యతా ప్రదర్శనమునకును సంఘోన్నతికిని గారణమగును.

ఫ్రాన్సుదేశపు తత్వజ్ఞుడగు ఆగస్టుకోం యనునతడు తన తత్వశాస్త్రము నను సరించి ఋషిప్రోక్తమైన యీ ప్రాచీనపద్ధతినే మరల ప్రక్షాళించియున్నాడు. అతనిచే ప్రతిపాదింపబడిన తత్వశాస్త్రమునందు మన బ్రాహ్మణవర్ణమునకు సరిపోవు నొక బోధకుల తరగతియును వైశ్యశూద్రవర్ణములకు దగు తరగతుల నేర్పరిచియున్నాడు. మనయందువలె నితని పద్ధతియందు సమస్తవ్యాపారములు జీవనోపాయములు మన వైశ్యవర్ణస్థులను బోలియుండు నొక తరగతివారె చూడ వలెనని నియమించినాడు. లోకహితమునకు నవశ్యకమైన దేహశ్రమచే గాదగిన పనులన్నియు మన శూద్రవర్ణస్థునికి బోలియుండు తరగతిని నియమించినాడు. అయితే యితనిపని నవీనపద్ధతియందు మన క్షత్రియవర్గమునకు బోలినతరగతి యొక్కటి మాత్రములేదు. కారణమేమన సంఘము నెమ్మదిస్థితిలోనుండుటంజేసి యుద్ధముజేయ వలసిన యవశ్యకము వచ్చుట సంభవించుటలేదని యితనితరగతిని స్థాపించలేదు. అయి నను శాస్త్రీయమైన మన వర్ణాశ్రమపద్ధతియే కొంచెము హెచ్చుతక్కువగ నితనిచే మరల ప్రతిపాదింపబడినదని చెప్పవచ్చును. (Positive Society) 'పాజిటివ్ సొసయిటి' యనిపిలువబడు సంఘపువారి ముఖ్యోద్దేశమేమన:— "ఒక క్రమమును బట్టి యభివృద్ధిచెందవలెనని." మన వర్ణాశ్రమ పద్ధతియందిట్టి యుద్దేశమే స్పష్ట ముగనున్నది. జీవుని విద్యాభ్యాసమునకుగానె యిది నియమింపబడినది. పునర్జన్మము కలదను సిద్ధాంతము దీనియందు సూచింపబడినది. తనకు స్వభావసహజములుగా నేర్పడినగుణకర్మముల ననుసరించి జీవుడొక వర్ణమునుండి మరియొక వర్ణమునకు బోవును. ఒక జన్మములో సంపాదించిన యనుభవముచే ముందు జన్మములో దాని ఫలమును బొందుచు వృద్ధిమార్గములోనే జీవుడువోవును. అభ్యాసి.

(సశేషము).

---

## పురాణసారము—అవధూతయదుసంవాదము.

అవధూతం ద్విజంకంచిచ్చరంత మకుతోభయం
కవిం నిరీక్ష్యతరుణం యదుః పప్రచ్ఛధర్మవిత్ ॥

ఆనిర్వాణ సన్యాసి స్వతేజస్సుచేత మహాప్రకాశము గలవాడై, బ్రహ్మానంద ములో మునిగి, బ్రహ్మసూత్రమును ధరించినవాడై, భయశంకలు దనకు బొందనీయక, పంచప్రాణములు బహిర్ముఖములుగాక, ప్రాణాపానములను స్వభావసిద్ధముగా

సమానముగా నుంచ నెఱిగి, దృశ్యమైన వానిని దృశ్యత్వముతో జూడనివాడును, చూచువానిని జూచువాడును, కర్మకార్యకర్తలు తానేయైనవాడును, దేహమందు అహంతనుంచి దానిని మిథ్యయనిచూచి, సమూలముగా బోగొట్టినవాడును, నిత్యహోమద్వారమందు బ్రహ్మాగ్నిని నేకాగ్రముగా బ్రజ్వలింపజేసి, నాలుగాశ్రమముల గాల్చి నిరాశ్రమమైనవాడును, ఆయాశ్రమములందు శాస్త్రశ్రవణ విధివాదములు దహనమై భస్మీకరమైనను, ఆభస్మము చేకంటకుండువాడునునై, నిజసుఖముచేత విహరించుచుండు నొక యవధూతను యదుమహారాజు సంధించి యీక్రింద జెప్పుమేఱకు విన్నవము జేసికొనెను.

ఎవడు అహమును ధ్వంసము జేసికొనునో వాడే యవధూత. వాడేయోగి, వాడే పునీతుడు. అహంకారగ్రస్తుడై యుండువాడు జన్మకర్మయుతుడు. నిజబోధ యొక్క సత్తాచేత నవధూత ద్వైతమును జయించును. అటుల సంకలేక వర్తించుటచే భయము సర్వదాలేదు. జననమరణభయము వదలినందున వేరుభయమే లేదు.

యదు వాక్యము.

కుతో బుద్ధిరియం బ్రహ్మన్నకర్తుస్సువిశారదా
యామాసాద్య భవాల్లోకం విద్వాంశ్చరతి బాలవత్ ॥ 3.

ఓ స్వామీ! అపూర్వమైన బుద్ధి మీయందు జూచితిని. యమనియమాది ధర్మము లాచరించువారలకు లభింపని యట్టి యుగ్రములను గుర్తెఱిగి నిశ్చలబుద్ధిచేత నిష్కామ కర్ములై యుండువారివలె నున్నారు. ఆత్మబోధయందు బాలుడు అహేతుకకర్మగా నున్నట్టు అకర్తగానున్నారు. అన్నియు నంటకుండునటుల నుండు బాలునివలె కనుపించినను బాలబుద్ధి మీయందు లేదు. సర్వజ్ఞత్వముతో ప్రకాశించుచున్నారు. నరదేహమెత్తినందుకు సార్థకము పురుషార్థములను మీయందే జూచితిని.

ప్రాయోధర్మార్థకామేషు వివిత్సాయాంచమానవాః।
హేతునైవసమీహంతే ఆయుషోయశసశ్శ్రియః॥ ౪.

ప్రాయశః, ఈ లోకమందు జనులు ధర్మార్థకామములకైయే జ్ఞానము నుపయోగించెదరు. మేము స్వధర్మమును జక్కగా నాచరించెదమని యితరులు మెచ్చునటుల బాహ్యకర్మములతో ప్రకాశించుదురు. ద్రవ్యము పొందుటకొఱకు వారు గాయత్రి జపమును జేసినను వేదార్థముగా దాము దానిని చేసినటులను వేదమార్గమును స్థాపించుటకు నాకర్మములను జేసినటుల నితరులతో జెప్పడము మాత్రమేగాని, నిజ

ముగా జీవికాయోగమే జేసి స్వర్గలోక భోగములను కోరుదురు. మఱికొందరు మేము కర్మనిష్ఠులని చెప్పుకొనుదురు. కుశమృత్తికలను జలములో పడవైచుటయే విశేషముగా నుంచుకొని సమయమునకు వచ్చిన భిక్షుకుని కన్నము బెట్టరు. మఱికొందరు డాంభికముగా వైష్ణవచిహ్నలను ధరించి పూజపాత్రలను ఘళఘళాయమానముగా తోమి తామహింసాధర్మము నవలంబించినవారని యితరులకు ప్రచురపరచుచు ననేక జీవరాసులను మనస్సునకించుకయైన సంశయములేక జంపితినని తేపులిడుచు మహోద్గారములు చేయుచు, దొంతిమీది పట్టు వస్త్రములను, తలమీది శిఖలను చక్కబెట్టుకొనుటయే జీవాత్మ పరమాత్మల విచారమని యెఱిగి మహాస్వేచ్ఛగా యీలోకమున ప్రవర్తించుచున్నారు. మఱికొందరు ప్రఖ్యాతికొఱకు తులాపురుషదానము చేయుదురు. మఱికొందరు తమ దేహములు మలమూత్రపూరితములైన వనుచు వానిని సమతూనిక ధనమునకు విక్రయించుదురు. ఆత్మతత్వమును మఱచి వివేకమును పోగొట్టుకొని భ్రష్టులైతిరుగుదురు. యిదేమి యాశ్చర్యము ! పైతెగవారందరు ధనమునకుగాను మహాలక్ష్మోపాసన జేయుదురు. శ్రీలక్ష్మీనాయకుడైన నారాయణుని ద్రవ్యహీనుడని యెంచి భజింపరు. రోగనివారణార్థము, ఆయుర్వృద్ధ్యర్థము సూర్యోపాసన జేయుదురు. దేహము సహజముగా నశ్వరమని యెఱుగక యక్షరుని ధ్యానము మానుకొనెదరు. వేదాంత విషయములను కంఠోక్తిగా జేసికొని ప్రలాపాను పూర్వకముగా బ్రహ్మవిషయమును ప్రతిపాదించుచు బ్రహ్మ సాక్షాత్కారము ననుభవించువారివలె నటించుచు తమకామ్యకర్మములకొలది దీర్ఘాయు కీర్తియశస్సులను, స్త్రీయిత్యాది భోగములను బొందుదురు. తాముసంపాదించిన శాస్త్రార్థ జ్ఞానములను, అనుభవములేని కారణముచే నితరులకు విక్రయముచేయుదురు. మఱికొందరు యోగులని చెప్పుకొని వాయుధారణాదుల నితరులకు జూపి యేకాగ్రచిత్తముతో ధ్యానమునందుండునటుల నటించుచుందురు. యిట్లు నిష్ప్రయోజన సాధనములను సాధించి తమ తమ కాలములను గడుపుచుందురు. మీరు, అట్టిమార్గములనేదియు నవలంబించక, యాత్మసుఖము ననుభవించుచున్నారు. జీవతత్వమును తృణమాత్రముగా నెంచి, వాక్యవిషయములను త్యజించి నిజాత్మసుఖానందముతో స్థాయిగా నిలిచియున్నారు.

> త్వంతుకల్పకవిర్ధక్షః సుఖగోమృతభాజనః।
> నకర్తానేహ నేకించిజ్జడో న్మత్తపిశాచవత్ ॥ ౫.

మీరు సర్వము నెఱుగ జ్ఞాతయైతిరి. అజ్ఞానమును దలఱె త్తనీక నాశము జేసి వేసితిరి. సంకల్పనాశము సంపూర్ణముగా గావించితిరి. నిజశాంతిని జడత్వరూపముగా చూపెదరు. సర్వదా సాక్షిమాత్రముగా నిలిచి చలన రాహిత్యము జెందితిరి. అంగములో వ్యంగమును, రూపములో స్వరూపమును గంటిరి. జ్ఞానసహాయముతో మీరే కొంగిరై నిలిచితిరి. అద్వైత విశ్వాస సహాయముచే పరదేశియైతిరి; సకర్ములుగా నుండినను, అకర్ములనుపించు కొంటిరి; ఇవియే మీయందు గల యుత్కృష్ట లక్షణములు. బ్రహ్మరసమని జెప్పబడు నమృతమును సదా పానముజేయుచు నానందపడుచున్నారుగదా. మరియు బ్రహ్మానంద జనిత పిత్తపు తోడుతో నున్మత్తులైతిరిగదా, తమ దృష్టికి స్థావర జంగమములన్నియు నగోచరములేకదా. అహంకార మమకార త్యాగము జేసి యీ భువియందు పిచ్చివానివలె ప్రవర్తించుచున్నారు. ప్రాప్యజ్ఞానముతో సిద్ధినొంది పరమానంద మగ్నులై సంచరించుచున్నారు. యోగాభ్యాసముచేత విషయములనుండి ద్రిప్పబడిన మనస్సుగలవారై ధ్యానాభ్యాసము వలననే ఏకాగ్ర చిత్తమును బొందినవారే, పరిశుద్ధమైన మనస్సుచేత పరంజ్యోతి స్వరూపమైన యాత్మను సాక్షాత్కరించి మీలోనే యానందమును బొందుచు ధ్యానయోగమందు స్థిరచిత్తము కలవారే, యింద్రియములకు గోచరము కానట్టి, ప్రజ్ఞచే గ్రహింపబడదగినదియు, అంతములేనిదియు నగు సుఖము నెఱిగి, స్వానుభవమునుండి బొత్తిగా మరలక, స్వానుభవమునకంటెని పరలాభములను, అనగా, నశ్వరములైన భూలోక స్వర్గలోకాది సుఖలాభముల నధికమైనవానిగా దలంపక, రోగశోకాది దుఃఖములచే గదల్పబడక, నిరావరణ బ్రహ్మానందములో మునిగియున్నారుగదా! మీసుఖమే సుఖము, మీ యానందమే యానందము!

భక్తియన పూజ మొదలగు నాటియందలి యనురాగమని వ్యాసుడున్నుదైవవిచారమందలి శ్రద్ధయని గార్గుడున్ను పై రెండును గలిసిన యాత్మ ధ్యానమందలి శ్రద్ధయని శాండిల్య మహర్షి ప్రాయపడినారు. సకల కర్మలు భగవదర్పణము సేసి భగవంతుని మఱచిన, గొప్ప యాపద దుఃఖము గలిగినప్పటి యంత దుఃఖభావము గల్గుట యని నారదుడు సెలవిచ్చియున్నాడు. సాధారణముగా భక్తియన చెప్పినట్టు వినడముగా దెలియవలెను.

(సశేషము).

జ్ఞాత దన యుపాధియందు గలుగు నాకారములనె పదార్థములుగ దెలియును. తనలో నవి మరల నేర్పడుటవల్ల దెలివిగలుగును. మనస్సు నద్దమునకు పైన జెప్పినరీతి బోల్చుట సరిగాదని తోచుచున్నది. ఏలన, నద్దము ముందటనుంచు పదార్థముల యాకారము నది ప్రతిఫలించును. అద్దమున నే మార్పుగలుగదు. అయితే మనస్సుయొక్క ముందటనుండు పదార్థముల జ్ఞానము గలుగుటకు ముందు మనస్సు వాటి రూపమును వహించును. పదార్థముల పోలికను మనస్సుపొందిన నా రూపమును జ్ఞాత నొందును. అట్లు జ్ఞాత పదార్థాకారాకారితమైన, వాటి జ్ఞానము గలిగినట్టగును. ఇట్లు మనకు గలుగు జ్ఞానము పదార్థముల యాకారజ్ఞానమే కాని యా పదార్థ నిజస్వరూప జ్ఞానము కలుగుటలేదు. దీని విషయము రెండవ యధ్యాయమున విశదముగ సూచించబడును.

అయితే యెప్పటికి నిట్లులుండునా? పదార్థముల నిజస్వరూప మెన్నటికి మనకు దెలియకుండునా? యను ప్రశ్నలు గలుగును. ఈ ప్రశ్నలను విశదీకరించుటకై మనము, ప్రజ్ఞకు ప్రజ్ఞయుండు నుపాధికిగల భేదమును జక్కగా విమర్శించిన, నీ స్వభావ జన్యమైన ప్రశ్నలకు నుత్తరము సిద్ధమగును. అనేక జన్మానుభవము వలన దృశ్యజ్ఞానము సంపూర్ణముగ ప్రజ్ఞకు గలుగ, దానికినుండు భేదోపాధి వీడును. వెనుక జ్ఞానస్వరూపమైన ప్రజ్ఞ దానును, తన చుట్టు వృద్ధిజెందుచున్న యితర జీవులొక్కటే యనియు, అన్ని జీవులకు నొక విధముగానె సంబంధము గలిగిన ప్రకృతి తానుగాదనియు దెలియును. ఆ పుణ్యాదిన మెప్పుడబ్బునో నాడే జ్ఞానసిద్ధియగును. నాడే ప్రజ్ఞ దన్ను, ఇతరులను దెలియుటకాక యితరులు దానేయని తెలియును. ఇట్టి యేకీభావమువల్ల జ్ఞానసిద్ధి గలుగును. అప్పుడచ్ఛలమైన సర్వ సమత్వము, మరుపులేమి, జీవునకు సిద్ధమగును. అప్పుడు భేద భావముడిగి జ్ఞాతృజ్ఞానజ్ఞేయము లొక్కటి యగును.

సంకల్ప స్వభావమును దెలిసికొనుటకై జ్ఞానముచేత మనయందు వృద్ధిబొందుచున్న జీవునియొక్క యీ యున్నతస్వభావమునే మన మిప్పుడు దెలియ వలెను. మాయాతీతుడగుటకై మాయ నాశ్రయించు నిమిత్తము మాయ స్వభావమును జక్కగ గుర్తెరుంగవలెను. కావున జ్ఞాతకు జ్ఞేయమునకు సంబంధరూపమైన జ్ఞానమెట్లు సిద్ధమగునది యిప్పుడు మనము విచారింతము. దానివలన సంకల్ప స్వభావము విశదమగును.

## జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ పుంజము.

మన శాస్త్రములయందువలెనే పాశ్చిమాత్యుల ప్రకృతి శాస్త్రములందు కంపమను మాట కలకముగా నున్నది. సకలమునకు చలనము మూలము. ప్రాణమున చల

నమే. ప్రజ్ఞయన చలనము. ఈ చలనము ప్రకృతికి దగుల కంపమగును. ఏకాకారమై సర్వమైయుండు పరబ్రహ్మ కేవల మచలమగును. ఒకటియందు రెంటికి నవకాశము లేకుండుటవలన చలనముండదు. భేదముగలిగిన గాని కాలానుగుణమై స్థానభేదరూపకమైన చలనమును మనము భావించ జాలము. ఒకటి యనేకములు గాగ, చలనము సిద్ధమగును. చలనము ఋజువుగా క్రమముగానున్న నారోగ్యము, ప్రజ్ఞ, జననము సిద్ధముగా నుండును; అది క్రమము దప్పిన రోగము, ప్రజ్ఞారహితము, మరణము సిద్ధమగును. దృశ్య స్వరూపమైన చలనమువల్ల జననమరణమను సంసార ప్రవాహము పుట్టియున్నది.

## సత్సంకల్పములు.

16. రూపములనుంచి నరుడు విమోచనబొంది శాంతస్థితి జేరుటకు నేకాగ్రత సాధనము.

17. మన మనస్సులయందు సంకల్పములను పరీక్షించిన, మనము వాడుకగ ప్రోత్సాహము జేయునవియే యని కనుగొనెదము.

18. సత్సంకల్పములను వాడుకజేయ మన మనస్సు దుష్టమును నిరాకరించుచు సత్కృతము నాకర్షించును.

19. ధ్యానముజేయువాడు లోకమున శ్రేష్ఠమైన కార్యసాధకుడు.

20. ధ్యానముజేయువాడు గాలము వ్యర్థము చేయడు. శక్తిని వెదజల్లడు. సమయమును దప్పడు.

21. ధ్యానముజేయువాడు దివ్యజీవనము బొందును గనుక దివ్యశక్తిని గూడ బొందును.

22. స్థిరమైన యోగసాధని యభ్యాసముచేత సంకల్పశక్తి వృద్ధియగును.

23. ఆత్మయొక్క జ్ఞానభావము ప్రశాంతనియందు వసించును. పూర్ణముగ వెల్లడియగుటకు నది యత్నించుచున్నది.

24. సంకల్ప రాహిత్యమును నేర్చుటయు, మనస్సును స్థిమితపఱచుటయు, అమూల్యమైన సంగ్రహమగును.

25. మనమందర మొక గొప్ప చైతన్యపు భాగములు, అపజయముగాని ప్రయత్నముయొక్కయు సామర్థ్యముయొక్కయు విఫలముగాని యిందు లేవు.

Continued from page 94

మాటలు పలికెదరు. కామాసక్తులు స్వర్గమే గతిగా గలిగి జన్మమునే కర్మఫలముగా నిచ్చు భోగైశ్వర్య ప్రాప్తికై బాహుళ్యమైన క్రియావిశేషములను నిర్ణయించుచున్నారు. భోగైశ్వర్యముల నాసక్తిగలవారికి, ఆమాటలయం దాసక్తి గలవారికిని సమాధియందు వ్యక్తమైన స్థిరబుద్ధి యెన్నడు కలుగదు. వేదములు త్రిగుణవిషయాత్మకము. అర్జునా! త్రిగుణాతీతుడవు, ద్వంద్వాతీతుడవు, శాశ్వతసత్వగుణ విశిష్టుడవు, యోగక్షేమ రహితుడవు, ఆత్మజ్ఞానియు గమ్ము. బావుల జలము వేరువేరు పనులకు నుపయోగించును. జలమయమైన ప్రదేశ మన్నికార్యములకుపయోగి మయినట్లు వేదోక్తము లయిన కర్మఫలములను జ్ఞాని యాత్మీయమందే పొందుచున్నాడు. కర్మతో మాత్రము నీకధికారముగాని కర్మఫలముతో నెన్నటికిని లేదు. ఫలోద్దేశముతో గర్మ జేయకుము. అట్లని కర్మ జేయకుండకుము. యోగివై సంగత్యాగివై, జయాపజయములయందు సముడై, కర్మజేయుము. ధనంజయా, యీ సమభావమే యోగ మనబడును.

కర్మయోగముకంటె కర్మనికృష్టమైనది ఫలాపేక్ష గలిగి కర్మ జేయువారు దీనులు. గనుక ధనంజయా! శుద్ధబుద్ధిని శరణు బొందుము. యోగబుద్ధి గలవాడై సుకృతదుష్కృతముల నిందు విడుచుచున్నాడు, గనుక యోగయుక్తుడవు కమ్ము. కర్మయందు కుశలత్వమే యోగ మనబడును. యోగబుద్ధి గల విద్వాంసులు కర్మజన్యమైన ఫలములను త్యజించి జన్మబంధమునుండి విముక్తులై నిరుపద్రవమైన పదవిని బొందుచున్నారు. ఎప్పుడు నీమనస్సు మోహమువల్ల గలిగిన చిక్కునుండి తప్పించుకొనునో వినినదానికి వినదగుదానికి నుదాసీను డగుచున్నావు. ఎప్పుడు వేదశ్రవణము చేత కలతజెందిన నీమనస్సు సమాధియందు స్థిరమై యచంచలమగునో యప్పుడు యోగము బొందగలవు.

### అర్జునుని వాక్యము.

ఇట్లు సమాధియందు స్థితప్రజ్ఞుడైన పురుషుని లక్షణమెద్ది? కేశవా! అతడెట్లు మాట్లాడును, ఎట్లుండును, ఎట్లు నడచును.

### శ్రీకృష్ణుని వాక్యము.

ఎప్పుడు మనోగతములైన సమస్త కామములను విడిచి తనంతట తాను సుఖపడునో యప్పుడు వాడు స్థితప్రజ్ఞుడని చెప్పబడును. దుఃఖములచేత వికలముగాక సుఖములయం దుదాసీనుడై, భయక్రోధ రాగరహితుడై యుండువాడు స్థితప్రజ్ఞుడనబడును, సకలవిషయములందు సంగములేనివాడై సకల సుఖదుఃఖములు గలిగిన

నిష్టానిష్టములను బొందడు. వాడు స్థితప్రజ్ఞ గలవాడు. తాబేలు తన యంగములను లోపలికి జేర్చుకొనుభంగి యింద్రియవిషయములనుండి యింద్రియములను మరలించినవాడు స్థితప్రజ్ఞు డగును. ఆహారము విడుచువారికి నింద్రియవిషయములు నివర్తించుగాని వాటియందలి యభిలాష వదలదు. ఆత్మస్వరూపమును గనుగొనిన నాయభిలాషకూడ వదలును. కౌంతేయా, ప్రమాదహేతువులైన విద్వాంసుని యింద్రియములుగూడ నాత్మజ్ఞానప్రాప్తికొరకు ప్రయత్నించుచున్న నతని మనస్సును జలింపజేయును వాని నన్నిటిని నిగ్రహించి, యోగియై, నన్నే పరమగతిగా నమ్మియుండవలసినది. ఎవరికి నింద్రియనిగ్రహము గలదో యతడు స్థితప్రజ్ఞ గలవాడు. విషయములను జింతించిన తదాసక్తి కలుగును. ఆసక్తినుండి భోగేచ్ఛ కలుగును. భోగేచ్ఛనుండి క్రోధము కలుగును. క్రోధమువల్ల నవివేకమును, అవివేకమువల్ల విస్మృతియును, విస్మృతివల్ల బుద్ధినాశము గలుగును. బుద్ధినాశముచేత నతడు నశించును. అయితే రాగద్వేష రహితుడై మనోనిగ్రహము గలిగి యింద్రియవిషయముల నింద్రియములను వర్తింప జేయువాడు శాంతిని బొందును. ఆ శాంతస్థితియందు సర్వదుఃఖక్షయము వానికి గలుగుచున్నది. అట్టి శాంత మనస్సుకలవానికి త్వరగా బుద్ధి స్థిరమగును. నిగ్రహము లేనివానికి యాత్మవిషయ బుద్ధిలేదు. నిగ్రహము లేనివానికి యాత్మ ధ్యానములేదు. ధ్యానము సేయనివానికి చిత్తోపరతి లేదు. చిత్తోపరతి లేనివాని కెట్లు బ్రహ్మానందము గలుగును? చలించు నింద్రియముల స్వాధీనమై యుండు మనస్సు నీటిమీద నోడను గాలి త్రిప్పునట్లు అతని ప్రజ్ఞను జలింపజేయును. గనుక, అర్జునా! ఇంద్రియవిషయ ములనుండి పూర్ణముగ మరలించబడిన యింద్రియములు గలవాని ప్రజ్ఞ స్థితప్రజ్ఞ యనుపేంచుకొనును. సర్వభూతములకు రాత్రియైన కాలము జ్ఞానికి మేలుకవకాలము, ఇతరప్రాణులు మేల్కొనియుండు, నాకాలమాత్మైక్యానుసంధానము గల జ్ఞానికి రాత్రివంటిది. అనేక నదీజలము సముద్రము బ్రవేశించినను హద్దుమీరక యచంచల ముగా నున్నట్లు, ఇంద్రియవిషయముల చంచల మనస్సుగల పురుషుని బ్రవేశించినను శాంతచిత్తుడై యుండును. విషయాసక్తుడైన పురుషుడు శాంతిబొందడు. సమస్త కామ ములు వదలి, కోరికలు లేక, యహంకార మమకారములు విడిచిన పురుషుడు శాంతి బొందును. పార్థా! ఇదియే బ్రహ్మతత్వము. ఈ తత్వము లభించిన మోహము బొందరు. అవసానకాలమున నిది లభించినను శాశ్వత నిర్వాణపదవిని జేరును.

సాంఖ్యయోగము సమాప్తము.

సమయమున నాకస్మికముగ పడిన దృష్టికూడ సూర్యుని తట్టు చూచుటచేత పాపపరిహారమగును. ఈ సందర్భమున బ్రాహ్మణుఁ డిట్లు శుచికావలసినది.

## నాలగవ యధ్యాయము.

1. అమితమైన గర్వమునుంచి నిగ్రహింప నసాధ్యమైన ప్రేమచేతగాని యధికమైన భయముచేతగాని లేక కోపముచేతగాని యురివేసుకొని యాత్మహత్య జేసుకొన్న పురుషునికిని స్త్రీకిని ప్రాప్తించు గతి ఇప్పుడు చెప్పఁబడును.

2. అరువదివేల సంవత్సరముల కాలము, ఆత్మహత్య చేసుకొన్న జీవునకు రక్తమును దుర్గంధమైన చీమును నిండిన నరక ప్రాప్తి గలుగును.

3. అట్టి దుర్మరణము జెందిన వానివిషయమున నశౌచ మనుష్ఠింప బనిలేదు. ఆత్మహత్య జేసుకున్నవాని శవమునకు దహనక్రియగూడ విధింపఁబడలేదు. అట్టివాని విషయమై కన్నీరు రాల్చుకూడదు. ఉదకదానముగూడ జేయకూడదు.

4. అట్టివాని శవమును మోయువారు దహించువారు మెడనున్న యురిని దెగ వేయువారుగూడ తమ యశౌచమును తప్తకృచ్ఛ వ్రతముచేత పోగొట్టుకొనవలెనని ప్రజాపతి సెప్పియున్నాడు.

5—6. అట్టివాని శవమును, స్పృశించు, మోయు, దహించు, యురిని తెగ గోయు బ్రాహ్మణులు దమ పరిశుద్ధత్వమును బొందుటకు తప్తకృచ్ఛ వ్రతమును బ్రాహ్మణులకు సంతర్పణయు, ప్రాయశ్చిత్తరూపముగా జేయవలెను.

7. అట్లు చేయు బ్రాహ్మణులు బ్రాహ్మణునకొక యావును ఎద్దును దానమిచ్చి, యావ్రతముయొక్క మొదటి మూడుదినములు వేడినీళ్లు త్రాగి యుండవలెను. వెనుక మూడుదినములు వేడిపాలమీదను వెనుక మూడుదినములు వేడినేయిమీదను మూడుదినములు గాలిమీదను (ఇది తప్తకృచ్ఛవ్రతము). తుదకు జీవించియుండవలెను.

8—9. అనిష్టముతో హీనుడైనవానితో భుజించినగాని వ్యవహారము జేసిన నొక బ్రాహ్మణుఁడు తానును వానివలె నొక పక్షముగాని, మాసముగాని, ద్విమాసములుగాని, ఌణ్మాసములుగాని లేక యొక సంవత్సరముగాని కులభ్రష్టుడైయుండును.

10—12. అట్టి యపరిశుద్ధము జేయు స్పర్శగలిగిన మొదటి పక్షమున మూడు దినము లుపవాసమున్ను, రెండవ పక్షమున కృచ్ఛవ్రతమున్ను, మూడవ పక్షమున కృచ్ఛ సంతపనవ్రతమున్ను, నాలవపక్షమున దశరాత్రవ్రతమున్ను, అయిదవపక్షమున పరాకవ్రతమును, ఆరవపక్షమున నొక చాంద్రాయణవ్రతమును, ఏడవపక్ష

మున నట్టిరెండు చాంద్రాయణ వ్రతములున్ను, యెనిమిదవ పక్షమున నారునెలలు కృచ్ఛ్రవ్రతమును అట్లు ప్రాయశ్చిత్తము చేసుకొనువాఁడు కులభ్రష్టుల సహవాసమెన్ని పక్షములుండునో యన్ని సువర్ణమయ్యైన దానములను బ్రాహ్మణులను నివ్వవలెను.

13. ముట్టుస్నానము చేసిన స్త్రీ నాల్గవనాడు తనమగనితో శయనించకున్న మరణము నొందిన తర్వాత నరకము జేరును. ముందు రాబోవు జన్మములయందు వైధవ్యదుఃఖము ననుభవించును.

14. ముట్టు స్నానముజేసిన నాల్గవదినము తన భార్యతో శయనించని పురుషుఁడు పంచమహాపాతకములు జేసిన భయంకరమైన పాపమును బొందును.

15. యవ్వనమున నుండు పతివ్రతయై ముగ్ధయైన భార్యను విడుచువాఁడు ముందేడు జన్మములు స్త్రీగా జన్మించి ప్రాణదానియందును వైధవ్యదుఃఖములను భవించును.

16. తన మగని పేదరికమునకు, మూఢత్వమునకు, వానిని చులకనగా భావించిన యాడుది ముందుజన్మములయం దు స్త్రీసర్పముగా బుట్టి యట్టి భయంకరమైన యవతారమునకూడా వైధవ్య సంకటములచేత శిక్షింపఁబడును.

17. ఒకమడియొక్క స్వంతగాడు తన మడిలో గాలికివచ్చిపడుబీజము మొలకెత్తి ఫలించిన నాఫలము వాఁడనుభవించునుగాని బీజపు స్వంతగాడనుభవించ నట్లొక స్త్రీయందు యితర పురుషునిచేత శిశువుగలిగిన దానిమగడే యాశిశువు యొక్క స్వంత గాడగును.

18. ఇట్లు పుట్టిన శిశువులు కుండగోళకులని యిరుతెగలుగానున్నారు. మగని జీవితకాలమున నొక స్త్రీకి పరపురుషునివల్ల శిశువుపుట్టిన కుండుఁడనఁబడును. మగఁడు చచ్చినవెనుకఁ బుట్టిన గోళకుడనఁబడును.

19. ఇంకను పుత్రులనేకవిధములుగా నున్నారు. ఒకనికి పుట్టినవారౌరసులనియు, ఒకని భార్యయందు నితరులకుఁ బుట్టినవారు క్షేత్రజులనియు, తల్లిదండ్రుల యనుజ్ఞచేత పుత్రత్వమునకు గానివ్వఁబడినవాఁడు దత్తకుఁడనియు, కల్పితమైనవాఁడు కృత్రిముఁడనియు చెప్పఁబడుదురు.

20. తనకంటె పెద్దవాని పెండ్లికి ముందు తాను పెండ్లి జేసుకొనువాఁడు, పెండ్లి జేసుకొనిన బిడ్డయు, ఆబిడ్డ నిచ్చిన తండ్రియు, అట్టివివాహము జరిపిన పురోహితుఁడును, ఆజ్యేష్ఠభ్రాతయు వీరైదుగురు నరకముఁ బొందుదురు.

21. జ్యేష్ఠభ్రాత పెండ్లికిముందుగా పెండ్లి జేసుకొనిగాని యగ్నిహోత్రక్రియలు జేయు కనిష్ఠుఁడు పరివేత్తయనఁబడును. జ్యేష్ఠుఁడుపరివేత్తియనఁబడును.

22. వారి పాపపరిహారములకు పరివేత్త రెండు కృచ్ఛ్రవ్రతములను పెండ్లి జరిపించు పురోహితుఁ డొకచాంద్రాయణవ్రతమును సలుపవలెను.

23. జ్యేష్ఠుఁడు గూనివాఁడుగాను నపుంసకుఁడుగాను, లేక పిచ్చివాఁడుగాను, లేక యంధుఁడుగాను లేక బధిరుఁడుగానుండిన, వాని పెండ్లికంటె ముందు కనిష్ఠుఁడు పెండ్లి చేసుకొనుట పాపకరముగాదు.

24. జ్యేష్ఠుఁడు తన తండ్రియొక్క జ్యేష్ఠభ్రాతయొక్క కొడుకైనను లేక సవతి తల్లికొడుకైనను లేక తన తండ్రికి నితరుని భార్యయందుఁ బుట్టిన భ్రాతయైనను కనిష్ఠుఁడు వానికంటె ముందు పెండ్లి జేసుకొనుట పాపకరముగాదు.

25. పెండ్లికాని జ్యేష్ఠభ్రాత యావజ్జీవము బ్రహ్మచర్యవ్రతము జేయనిశ్చయించిన నతని యనుజ్ఞగైకొని కనిష్ఠుఁడు పెండ్లి యాడవచ్చునని శంఖుని యభిప్రాయము.

26. ఒక స్త్రీ తనమగఁడు చాలాకాలము వినరాకున్నను లేక చచ్చినను లేక సన్యాసియైనను లేక వీర్యరహితుఁడైనను లేక కులభ్రష్టుడైనను యీయైదు యవసరముల యందు రెండవ మగని గ్రహింపవచ్చును.

27. తన మగఁడుచచ్చిన వెనుక బ్రహ్మచర్యవ్రతమును సలుపుచుండు విధవ మరణానంతరము బ్రహ్మచారులవలె స్వర్గము చేరును.

28. తన మగనితో గూడఁ జితాగ్నియందు సహగమనము చేయు విధవ మానవ దేహమునందుండు నూరులక్షల నెండ్రుకలకొలది యన్ని సంవత్సరములు స్వర్గమున నివసించును.

29. పాములవాఁడు బలవంతముగా పామును బొక్కనుండి బట్టి యీడ్చునట్లు తన మగఁడు మరణము నొందిన వెనుక వెంబడించుభార్య నరకకూపమునుండి వివేక శూన్యమైన జీవుని లేవనెత్తి స్వర్గమున నతని సహవాస సుఖమనుభవించును.

ఐదవ యధ్యాయము.

1. ఒక కుక్క, నక్క, లేక తోడేలు కఱచిన బ్రాహ్మణుఁడు స్నానమాచరించి వేదమాతయైన గాయత్రీజపము సలుపవలయును.

2. కుక్క కఱచిన నరుఁడు నదీముఖమున శంఖముద్గిన నీటియందుగాని స్నానము జేయుటవలనను లేక సముద్రమును జూచుటవలనను శుచియగును.

3. ఒక బ్రాహ్మణుని కుక్క కఱచిన వేదాధ్యయనము ముగిసిన వెనుక లేక వ్రతము ముగిసిన వెనుక సువర్ణతప్తోదకము చేతను నేతిని బుచ్చుకొనుటచేతను శుచియగును.

4. ఒక వ్రతమనుష్ఠించు సమయమున నొక బ్రాహ్మణునిఁ గుక్క కఱచిన మూడుదినము లుపవాసముండవలయును. దర్భలతో కడిగిన నేతిని భుజించి వ్రతము సాంగము జేయవలెను.

5. ఒక బ్రాహ్మణుఁడు శిఖ కలిగియుండినగాని లేకున్నను కుక్క కఱచిన వెనుక ముగ్గురు బ్రాహ్మణులకు మ్రొక్కి వారిదృష్టివలన శుచికావలెను.

6. దేహభాగము నొక కుక్క యాఘ్రాణించిన, నాకిన, బరకిన నాభాగమును నీళ్లతోఁ గడిగి యగ్నితో చురక వేయవలెను.

7. ఒక బ్రాహ్మణస్త్రీని కుక్క, తోడేలు, లేక నక్క కఱచిన చంద్రుని తట్టు నక్షత్రముల తట్టు చూచిన శుచియగును.

8. అట్టి చంద్రుఁడు లేక కృష్ణపక్షదినమున కఱచిన చంద్రుఁడా నాడుండ వలసిన దిక్కున జూడవలయును.

9. బ్రాహ్మణుఁడు లేని గ్రామమున నొక బ్రాహ్మణుని కుక్క కఱచిన వాఁడు స్నానముజేసి యొకవృషభముచుట్టు ప్రదక్షిణము జేసిన శుచియగును.

10. ఒక గోవుచేతగాని, చండాలునిచేతగాని, రాజుచేతగానిఁ, జంపబడిగాని లేక విషము తినుటచేత నాత్మహత్యచేసుకొన్న సాగ్నిక బ్రాహ్మణుని శవమును మంత్రోచ్చారణ లేక లౌకికాగ్నియందు దహనము చేయవలయును.

11—12. అట్టి బ్రాహ్మణుని సపిండ బంధువులు యతని శవమును స్పృశించిన, మోసిన, లేక దహించిన, నొక ప్రాజాపత్యము జేసి వెనుక బ్రాహ్మణులయొక్క యనుజ్ఞచేత యతని యస్థిపంజర శేషమును పాలగిడిగి మంత్రోచ్చారణములచేత నతని యగ్నియందు మరల దహించవలెను.

13—14. ఋషిశ్రేష్ఠుఁడా, సాగ్నిక బ్రాహ్మణుఁడు దూరదేశమున జచ్చిన వాని యింటియందు నతని పావనాగ్ని ప్రజ్వలించుచుండ వానిపిమ్మట యమైచేయవలశిన యగ్నిహోత్రక్రియలను వేదములఁ జెప్పినప్రకారము ఇప్పుడు చెప్పుచున్నాను.

ప్రత్యక్షవాదులు పొందియున్నారు. ఎవరైనను తమకు దెలిసినది మాత్రమున్నదనుకొనవచ్చును. తెలియనిది లేనేలేదని వాదించుట యసంగతము గదా మీరే యోచింపుడు. ఇట్టి ప్రత్యక్షవాదము ప్రబలమగుచు వచ్చినది. ఏలన, ఇప్పటివారికి, రాగా రాగా, బుద్ధి కుశలత వృద్ధియై, మనలోనుండు నాచారములు, వ్రతములు, యజ్ఞములు మొదలగువాటి తత్త్వములను వాటి యుపయోగములను నిర్ణయముగ విచారింప సాగిరి. వారి సందేహములను నివర్తింప, బెద్దలు లేకైరి. ఇట్లు ఋషులు మహానుభావులు చెప్పుచున్నారని సహేతుకముగ దెల్పకపోవుటవలన మన పూర్వ పద్ధతులు శిథిలమై పోవుటకు గారణమైనది. దీనివల్లనే పూర్వపద్ధతులు పనికిమాలినవని నిశ్చయించి ప్రత్యక్షవాదము ప్రబలమాయెను. అదియునుగాక యీ కారణమువల్లనే మూఢభక్తి గూడ మెండాయెను. మూఢభక్తియన ప్రాధాన్యమును దెలియక, అప్రాధాన్యమునె ప్రాధాన్యముగా గ్రహించుట. మూఢభక్తియన దేనియందైనను విశ్వాసముంచుట కాదు. ముఖ్యమైన వాటినివిడిచి కేవల తృణప్రాయమైన వాటిని గణ్యముగా నెంచుట. వస్తువులను తలక్రిందుగా జూచుట గూడనగును. దీనిని విశదీకరించుటకై యొక యితిహాసము గలదు.

ఒక ఋషి తపోవనమున గాలముగడుపుచుండెను. అతడు దయాపరుడు గనుక అతని యింటియందనేక పశువులుండెను. వాటిలో నొక పిల్లిమాత్ర మతనికి నెక్కుడు ప్రేమగా నుండెను. అతడు జపతపాది క్రియలు సలుపు సమయమున నది యతనిని దొందరపెట్టుచుండెను గనుక దానిని నొక మంచముకాలికి గట్టివేసి తన హోమాది క్రియలు సలుపుచుండెను. ఇట్లు కొన్నాళ్లు జరిగినవెనుక ఋషి సమాధినొందెను. వెనుక హోమాదులు చేయునప్పుడంతయును మంచముకాలికి పిల్లిని కట్టివేసి చేయవలయునను పద్ధతి యేర్పడెను. ఇట్లు కొన్నాళ్లు జరిగినవెనుక హోమాదిక్రియలు మాసిపోయి మంచపుకాలికి పిల్లినిమాత్రము కట్టు పద్ధతి నిలిచెను. ఇట్లు ప్రాధాన్యమును మరచి అప్రాధాన్యమును సరకుగొనుట మూఢభక్తి యనబడును. ఇట్లు సహేతుకమైన దివ్యపద్ధతులన్నియు క్రమముగా మాసిపోయి వాటికి సరియైన కారణములు తెలుపు వారరుదైనందున నీ కాలమున నిట్టి విపరీతబుద్ధులు పుట్టినవి. వీటివల్ల మన మతమంతయు చెడిపోవుచు వచ్చినది. గనుక దయాపరులైన మహానుభావులు బ్రహ్మవిద్యా సమాజము నుద్ధరించి పూర్వజ్ఞాన సంపదను మనకు నివ్వ బూనియున్నారు. ఆ మహానుభావులే లోకమునందంతట జ్ఞానము నప్పుడప్పుడుద్ధరించుచున్నారు. అట్టి మహానుభావుల సంఘమొకటి యున్నది. వారే యీ సమాజమును మనకుగాను ఏర్పాటు

చేసికొన్నారు. ఈ సమాజము బోధించు విషయములను సంగ్రహముగ వివరించు
దము. సకలమునకు మూలమైన పరమతత్త్వమొకటి యున్నదనియు, ఆ తత్త్వము సృష్టి
సమయమున త్రిమూర్త్యాత్మకమగుననియు, అనేక దేవతలున్నారనియు, వారీశ్వరుని
యాజ్ఞను నిర్వహించుచున్నారనియు, జీవేశ్వరైక్యమును, బహుజన్మాంతర సుకృతము
వల్ల జీవుడీశ్వరుడగుననియు, జననమరణ ప్రవాహరూపమైన సంసారము కర్మము
నియమము ననుసరించి యున్నదనియు, జీవుడు త్రిలోక సంచారియనియు, సంసార చక్ర
మున దిరుగుచుండుననియు తెలుపుచున్నది. ఈ విషయములన్నియు మతములయందు
శాశ్వతమైన సిద్ధాంతములు, ఇది సర్వవ్యాపకము. తెలిపిన దానిననుసరించి యుండు
లోని యే విషయమైన నొక మతమున నుండక పోవచ్చును. ఈ విషయములకు
నన్యములైనవి యా యా మత గ్రంథములు నిర్ణయించుకొన్న విశిష్టసిద్ధాంతములు, ప్రత్యేక
నియమములు గలవు. ఇట్లు నిర్ణయింపబడిన విశిష్టసిద్ధాంతములను ప్రత్యేకముగ నుదాహరించి
వాటి తత్త్వమును వెల్లడిచేయుచున్నది.

## పురాణగాథలు.

9. కల్పవృక్షము క్రింద కూర్చున్న వాడు రాజుగావలెనని సంకల్పించిన క్షణ
మున నొక రాజాయెను. రాజైన క్షణమున నొక సుందరాంగిని కలిగి నొక కోమ
లాంగి ప్రక్కన నిలచెను. ఇప్పుడు పులి వచ్చి తినివేయునను కొన్న తక్షణము పులి నోట
నుండెను. దేవుడు కల్పవృక్షమువంటివాడు. అతని సన్నిధానమున వేడెడు వారు
దరిద్రుడని ధనము లేనివాడని యనుకొన్నట్లనే యుండును. తన లోపములను దేవుడు
మన్నించి నా పాపమునని నమ్మిన సకల కోరికలు దేవుడు వానికిచ్చును.

10. ఒక బ్రహ్మహత్యజేసిన రాజు ప్రాయశ్చిత్తము నేర్పరచుకొనుటకై యొక
ఋషియొద్దకు వెళ్లెను. ఋషి యింట నుండలేదు. అతని కుమారుడుండెను. ఆ కుమా
రుడు, రాజును విచారించి, రామనామ స్మరణ మూడుమారులు జేసిన నీ పాపము
పోవునని చెప్పెను. ఋషి యింటికిరాగానే జరిగిన సమాచారము విని అనేక జన్మ
సంచితమైన పాపరాశి (యొక్కసారియే రామనామ స్మరణజేయు) పరిహారమగుచుండ,
మూడుసారులీ నామమును స్మరింపజేయు నీ భక్తి యెంత హీనమైనది. ఈ తప్పుకు
నీవు చండాలుడవౌదువు గాక యని కుమారుని శపించెను. ఆ కుమారుడే రామాయణ
మున కనబడు గుహక చాండాలుడాయెను.

'Registered No. M 716.'

SWAN SERIES No. 3.

ఓం





# A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఒక యాంధ్ర బ్రహ్మజ్ఞాన మాసపత్రిక.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 1.] జూన్ 1908. [సంచిక 6.

విషయసూచిక.



చెన్నపట్టణము:

వైజయంతీ ముద్రాశాలయందు ముద్రింపబడినది.

గుప్తి, హంసశాల మానేజరుగారికి వ్రాసుకొనవలయును.

సంవత్సరమునకు చందా 1 రూపాయ.

## హంసావళి.

1. షట్త్రింశన్మంజరి :—శ్రీశంకరాచార్యులు రచించిన భజగోవింద శ్లోకములనాంధ్రభాషాణ పద్యాత్మకముగా రచింపబడినది. ఆబాలవృద్ధులకు నానందకరమైనది. వెల 2 అణాలు మాత్రమే.

2. ఏకాదిరత్నావళి:—1 మొదలు 221 సంఖ్యవరకు గల విషయవిశేషములిందు సంగ్రహింపబడినవి (అయనద్వయము, వాసనాత్రయము, సాధన చతుష్టయము, మొదలగు 1008 విషయములు) వెల 4 అణాలు మాత్రమే.

3. హంస:—ఇది మాస తెనుగు పత్రిక 1908 జనవరినుండి వెలువడుచున్నది. ఈ జన్మసార్థకము జేసుకొనగోరువారు దీనిని నిరాకరించ జాలరు. చందా సంవత్సరమునకు నొక రూపాయి చే.

హంసశాల, గుత్తి, అనంతపురం జిల్లా.

హా. సుబ్బరామయ్య, కార్యదర్శి.

# THE THEOSOPHICAL SOCIETY.

# బ్రహ్మవిద్యా సమాజము.

(1) దైవాంశమైన జీవుడు దేవుడు గాగలడనియు (2) సకలమతములకు సామాన్యమైన సిద్ధాంతములు గలవనియు (3) ప్రతిమతమున నేక భేదములై యప్రధానమగు నాచారభేదములు గలవనియు, బ్రహ్మవిద్య బోధించుచున్నది. మన దేశప్రకృత హీనస్థితి యందరికి దెలిసినదేకదా? జ్ఞానము శిథిలమైనందున నీ స్థితిగలిగినది. కావున నీ సమాజము లోకోద్ధారమునకై జ్ఞానమును వృద్ధిజేయ నేర్పడినదకాని యన్యథాకాదు. ఈ సమాజమును వేరు దృష్టితో జూచి మనల నీ కాలమున నింకొక విధముగా జెడుపుటకు నేర్పడినదను శత్రుభావము వదలవలయును. సకలజనులీసమాజమున జేరి మన దేశమునందుండిన పూర్వస్థితిని మరల కలుగునట్లు చేయుటకు జాలా

ప్రచురించిన నంతఫలమిచ్చెద సంశయంబు వలదు, వలదు, మీలో నొక్క రొకరు పదిమంది చందాదారులను జేర్చిన నెట్టిప్రయోజనకారి మీకునగుదునో మీరేచూచెదరు. రిత్తమాటల నేమిఫలము. బ్రహ్మవిద్యాసమాజ ఫలముయొక్క నిజమెఱింగి యుండిన సామాజికులందరు నాగతియెరిగియుందురు. నిజమెరిగినవారుగాని నన్నితరులు పోషించరని నాకు నమ్మకము. నేనిన్నాళ్లు ఇంగ్లీషు భాషయందు గూయుచున్నను బహుమంది యీ దేశమున నింగ్లీషును దెలియనందున నెక్కువ ప్రయోజనకారియగుటకు వీలులేక పోయినది. కావున దెనుగున గూయ నారంభించియున్నాను. నన్ను వినిన వారితరులకు దెల్పుట యత్యావశ్యకము. సుఖావహము. ఆనందదాయకము. దయయుంచి, నన్నీదేశమంతట దిరుగ ననుకూలంబు గావింపుదురని సహస్రసాష్టాంగ నమస్కారంబులు దినదినము గావించెద. ఒక రూపాయ యొక్కడనో దోవలో బడెనని విచారము జెందక నన్ను పోషింపుడు. మరవకుడు. ఉదాసీన భావము వహింపకుడు. ఇది దేశపు మేలుకు సమయము.

---

## మాభక్తవిజయము.

## రామకృష్ణుడు.

ఈ స్త్రీయొక్క విచిత్రమైన నిపుణతకు నందరాశ్చర్యపడిరి గాని యీ పిచ్చి పట్టిన రామకృష్ణుని దనకంటె నెక్కువగా నెట్లు భావించెనో వారికి నగోచరముగా నుండెను. వైష్ణవగ్రంధములను జేర్చి వానిని దెప్పించి చదివించి భక్తుల చర్యలను గురించిన విషయములను జదివించి రామకృష్ణుడు పిచ్చివాడుగాడని యీమె రుజువు చేసెను. ఇట్లనే శ్రీచైతన్యుడుగూడ నాలుగునూర్ల సంవత్సరములక్రింద నడచినాడని చరిత్రయందు వ్రాయబడి యున్నది. రామకృష్ణునికి గలిగిన యగ్నిజ్వాల బాధ పూర్వము నిరపరాధిరైై కేవల భక్తురాలగు రాధకుగూడ నిట్లయినదని భాగవతమున జెప్పబడియున్నది కదా! శ్రీ కృష్ణ చైతన్యునకుగూడ నిట్లు సంభవించినది యని విన్నాము. వ్యాధికాదని నిర్ధారపరచి నిజభక్తుల కందరకు నిట్టి దేహబాధ సంభవించుట స్వభావమని యామె సెప్పుచు శ్రీ గంధమును పూలనుపయోగించుచు నతని బాధ నివారించెను.

మరియొక సమయమున నామె సముఖమున నతనికి నసహ్యమైన క్షుద్బాధ గలిగెను. ఎంత తినిన నతనికి నాకలిదీరలేదు. ఇట్లు చైతన్యుడు మొదలగు యోగులకు

సంభవించినది. అహోరాత్రములయందు నతనిగది చుట్టు భోజనపదార్థముల నుంచవల శినదిగా నేర్పాటు చేసెను. ఇట్లు కొన్నాళ్లు ఆహార పదార్థములను యథేచ్ఛముగా బెట్టియుండ నతని యాకలి క్రమముగాదగ్గి బాధ నివారణ యాయెను. ఆమె యతని వద్ద గొన్ని సంవత్సరములుండి యతనికి గావలశిన యోగసాధనలను నేర్పెను. రామ కృష్ణుడు యోగాభ్యాసమును బ్రారంభముజేసి యష్టవిధ ప్రాణాయామంబును సాధిం చెను. అతడు స్వల్పకాలముననే యోగసిద్ధిని బొంద నతని గురువు లాశ్చర్యపడిరి. ఒక రాత్రివేళ యోగమభ్యసించు సమయమున, రెండు కండల నెత్తురు నోటినుండి రాగా నతడు భయపడెను. కాళికాదేవి గుడియందప్పుడు పూజ సలుపుచున్న నతని దాయాది హాలధరియనునతడు గొప్ప పండితుడుగా నీశపరుడుగాను వాక్సిద్ధిగల వాడుగా నుండెను. కొన్ని దినములకుముందతని నడతయందు లోపములను రామకృష్ణుడు జూపించి యతనికి నాగ్రహము దెప్పించియుండినందున నతడు నీ నోటినుండి రక్తము పడుగాక యని శపించియుండెను. గనుక రామకృష్ణుడు జాలా భయపడెను.

అయితే సమీపమున నివసించు నొక యోగి యతని సమాచారము చక్కగ దెలిసికొని యతనికి నట్లగుట మేలైనదని చెప్పెను. అతడనేకులకు జ్ఞానమార్గమును బోధింపవలసిన విధి యుండెను గనుక నతడు నిర్వాణసమాధిని బ్రవేశించకుండనట్లు జరిగినదని తెలిసికొనిరి. నిర్వాణ సమాధియందు మెదడునకు రక్తమెక్కి చైతన్యము నిర్వికల్ప సమాధియందు జేరి యాత్మైక్యమును బొంది బహిః ప్రజ్ఞను మరల బొందదు లోకహితముకొరకు దైవానుగ్రహమువల్ల గొందరుమాత్రమట్టి సమాధి జేరరు. వారి విషయమున తలకు రక్తమెక్కి యాత్మైక్యమును గొంతకాలమనుభవించి మరల లోక ప్రజ్ఞ బొందుదురు.

ఆ బ్రాహ్మణస్త్రీవద్ద నామె నుపదేశించునంతయు నెరిగి, తత్వమును దెలియ నతడపేక్షించుచుండ నొక జ్ఞాని యతని ననుగ్రహించి వేదాంత రహస్యమతనికి నుప దేశించెను, ఇతనిని తోటపురియందురు. ఇతడొక సన్యాసి బాల్యముచుంచి సన్యాసియై యుండుటవల్ల వేదాంత తత్వము నతికష్టముతో సాధించియుండెను. అతడు నగ్నుడు గానుండెను. అతడొక గృహముననైన విశ్రమించక యుండును. అతడు గోరిన, రాజ గృహద్వారములైనను దెరవబడుచుండ, నతడొక వృక్షముక్రిందగాని లేక బయలుని గాని వానకాలమునను చలికాలమునను రాత్రులనుగడపుచు నొకచోట మూడు దిన ములకంటె నెక్కువ నిలువక యెవరిని యాహారమునకై యాచించక ప్రొద్దుబుచ్చు

చుండెను. గాలివలె స్వేచ్ఛగా దేశమంతట తిరుగుచు, నెక్కడనైన యాసక్తిగల వైరాగ్యపరులను జూచిన బోధించుచు, ప్రోత్సాహపరచుచు, తాను సంపాదించిన జ్ఞానమును వారొందుటకు దగిన సహాయమొనర్చుచుండెను. వేదాంతమనుభవజ్ఞానమని చూపుటకు యితడు జీవించిన నిదర్శనము, గంగాతీరముననున్న శ్రీ రామకృష్ణునిజూచి గొప్ప యోగిగా దెలుసుకొని పరమజ్ఞాన తత్వబీజములను నాట పరిపక్వమైన బుద్ధి ప్రదేశముగలవాడని యెంచి 'కుమారుడా మోక్షమార్గమవలంబించ గోరెదవా? యట్లుయిన నీకు బోధించెద'నని రామకృష్ణునినడుగ నతడు జగన్మాతయైన కాళికాదేవి నడుగక యేమిపనిజేసినవాడు గాను కావున నామెనడిగి వచ్చెదనని శెలవుబుచ్చుకొని వెళ్లి కొన్ని క్షణములలోపలనుండి మరలివచ్చి తాను సిద్ధముగానున్నట్లతనిని ప్రార్థించెను. తోటపురి హస్తమస్తకంబుగావించి ప్రతిజ్ఞగైకొనకే ధ్యానమార్గమవలంబించి యాత్మైక్యంబు గనుమార్గంబుపదేశించెను. మూడు దినములభ్యసించిన మాత్రమున నతడు దృగ్దృశ్య వివేచనములేని నిర్వికల్ప సమాధినిబొందెను. అతడంత శీఘ్రములోన జ్ఞానసిద్ధిబొందినది జూచి 'కుమారుడా, నలువది సంవత్సరంబులుగా గష్టపడి సాధించిన జ్ఞానమును మూడు దినములలోన నీవు గ్రహించితివి, నిన్ను శిష్యునిగా నెట్లు భావించెదను. నాసహచరియనుకొనెదనని యతడు సెప్పెను. తోటపురి శ్రీరామకృష్ణునితో నచ్చట బదునొకొండు మాసములుండి యతనివద్ద ననేకవిషయములు గ్రహించెను. తోటపురి యగ్నిహోత్రపరుడు. అతడగ్నిహోత్రమును జాలా పావనముగా నుంచుకొని యుండెను. ఒకనాడగ్నిహోత్ర సమీపముననుండి శ్రీరామకృష్ణునితో మాటలాడుచుండ నొకడు వారిని సమీపించి యగ్ని హోత్రమున దనచుట్ట నంటించెను. అట్టి దూషణీయమైన కార్యమునుజూచి యా సన్యాసి గోపావేశ పరవశుడైన నంతట రామకృష్ణుడు 'మీ బ్రహ్మానుభవ మిట్టిదియా? అగ్ని మనుజుడును బ్రహ్మ స్వరూపము గాదా? జ్ఞానదృష్టియందు హెచ్చుతగ్గులున్నవా'యని సన్యాసిని నుపశమింపజేయ నతడు సిగ్గుపడి 'నీవు చెప్పునదిసరియే. నేటినుండి నాయందు మరెప్పుడును కోపము జూడకుందువ'ని శపథముజేసెను. ఆ సన్యాసి కాళికాదేవినిగూర్చి రామకృష్ణుడు జేయుచున్న భక్తిస్వరూపమును గనుగొనజాలడయ్యెను. కేవల బ్రహ్మమునందు నీవు నేనను భేదములు లేదనియు అవాఙ్మానస గోచరమైనదనియు, రామకృష్ణుడతనికి జెప్పు సమయమున నా సన్యాసి యది దుర్భావనయని పరిహాసముజేయుచుండెను. ఇంచుక భేదభావనయుండువరకు బ్రహ్మము వాఙ్మానస గోచరమైన తత్వమనియు, ఆ సర్వసాక్షి

ద్వైన నిరుపాధిక ప్రజ్ఞాచైతన్యమే దేవుడనియు కాళికాదేవియనియు శ్రీరామకృష్ణుడు భావించియుండెను. తోటపురి రామకృష్ణునివిడచి వెళ్లిన తరువాత రామకృష్ణుడు సాధారణముగా నిర్వికల్ప సమాధియందే యుండుచు వచ్చెను. సాధారణ జనులకు దుర్లభమైన స్థితియందు నతడారు నెలలుండెను. సాధారణ జనులా సమాధిని గను గొన్న బహిఃప్రజ్ఞ మరలబొందుట లేదు. వారి శరీరములు మనస్సులాస్థితిని దాళ జాలవు. అతని దేహము కేవల సత్వాంశజనితము గనుక మిక్కుటమైన శ్రమను తాళ జాలెను. ఆ యారు నెలల కాలమున లోకస్మరణలేక యుండెను. అతని దేహమాహా రములేక యూడిపోవుటకు సిద్ధముగానుండె నొక సాధువతని సమాధిస్థితిని గనుగొని దేహమునుకాపాడ చాలా శ్రమపడి మూడుదినములచ్చట యతనికి ప్రజ్ఞలేకున్నను గావలశిన యుపచారములు చేసెను. ప్రతిదినము నాహారమునుదెచ్చి దేహమున నించుక నైన ప్రజ్ఞ కనుపడకుండయుండ నతనికి నించుకయైన ప్రజ్ఞ తెప్పించుటకై యొకలావు కర్రతోగొట్టి నతనికి నించుకప్రజ్ఞవచ్చిన తత్క్షణమే యొకటి రెండు కవళముల యాహా రమును నతని నోట మరల సమాధి పావశుడగుటకుముందు దూర్చును. బిగ్గరగా నతని దేహమునుదడవినను ప్రజ్ఞ గానరాకున్న నతనికి నాహారమివ్వ సాధ్యములేక కొన్నిదినము లూరకుండ వలశివచ్చెను. ఆరు నెలలయిన తరువాత జరిగిన యక్రమములకై నతని దేహారోగ్యము చెడి యతిసారరోగ మతనికి ప్రాప్తించెను. ఈ వ్యాధిరాగా నతని క్రమ క్రమముగా బహిర్ముఖుండగుచువచ్చి యొకటి రెండుమాసములలో లోకప్రజ్ఞ పూర్ణముగా వచ్చినవాడాయెను.

పిమ్మట నతని రోగమును వైద్యులు నివారణజేయ నతని భక్తి మరొకమార్గమును ప్రవేశించెను. అతడు వైష్ణవసిద్ధాంతము ననుసరించిన భక్తిమార్గమున దైవసాక్షాత్కా రమునుబొంద సాగెను. ఆ వైష్ణవ సిద్ధాంతమున యజమానునికి సేవకునివలెను స్నేహి తునికి మరొక స్నేహితునివలెను, తల్లితండ్రులకు బిల్లలవలెను, పిల్లలకు దల్లిదండ్రుల వలెను, భర్తకు భార్యవలెను, నరునకు దేవునికిని భక్తిమూలకమున సంబంధము గలుగు నని వైష్ణవులు సెప్పుదురు. జీవుడు దేవుని, భార్యభర్తనువలె ప్రేమించ శ్రేష్టమైన భక్తియే రూపమందురు. కృష్ణునియందు రాధకునట్టి భక్తియే యుండెను. ఇంద్రియ విషయాసక్తి రహితులైనగాని వారిద్దరికినుండినట్టి భక్తి స్వరూపమును గ్రహింప దుర్ల భము. విషయాసక్తి ప్రవాహమునందు వారు రాధాకృష్ణుల యానందమును సూచించు పావనగ్రంథములను జదువ నాక్షేపించెదరు. ఆ భక్తి రసానుభవంబు చవిగొన నిష్క

యించిన రామకృష్ణుడ నేక దినములు చీరలు గట్టి స్త్రీ వేషము ధరించి స్త్రీ యనుకొని సాధన జేశి యా సుఖానంద స్ఫూర్తిగనుగొనెను. శ్రీకృష్ణుని సుందరరూపమును స్వప్నమున దర్శనముజేసి తృప్తిబొందెను. యిట్లు వైష్ణవసిద్ధాంతప్రకార మానందమనుభవించి హిందూ దేశమున ప్రచురమైన యితర మతసిద్ధాంతములనుగూడ నాశ్చర్యమగునట్లు కొంతకాలములోనే యాయా తత్వానుభవంబు బొందెను. ఏ మతముయొక్క సిద్ధాంతమును దానవలంబించి నేర్చుటకు సంకల్పించిన మాత్రమున నా మతమునకుజేరిన నొక గొప్ప పండితసార్వభౌముడతనికి లభించి యతడామార్గమును సొంతముగా నేర్పుచు వచ్చెను. ఇతని జీవితకాలమున జరిగిన యద్భుతములలో నిదియొకటి. పంచవటిక్రింద కూర్చుని తన మతాచారము నవలంబించి దాని తత్వమును కనుగొనగోరిన మాత్రమున నచ్చట యేకాంతమైన స్థలమును గనుగొని నిరాటంకముగా నా సాధనకుపక్రమింప సాధ్యములు గలిగెను. అచ్చట యొక చిన్నపూరికొట్టము కట్టించ సంకల్పించినమాత్రమున గంగానదీ ప్రవాహమున దానికి గావలశిన బొంగులు కట్టెలు పగ్గము మొదలగు పదార్థములన్నియు కూర్చున్నచోటికి కొంచముదూరముగా వాయువులుదెచ్చివైచెను. ఆ సామానులన్నిటి ససంతోషముతో కైకొని దేవాలయములోని తోటవాని సహాయముతో నొక పర్ణశాల గట్టించుకొని యక్కడ యోగమభ్యసించెను.

(సశేషము).

---

## ఆత్మబోధ - మనస్సు.

ప్రతిమనిషియు సాధనజేసి తన స్థూలశరీరమునుండి మనస్సును వేరుజేసి మాయావిరూపమను సూక్ష్మశరీరమునునుంచుకొని కోరినచోటికి బోనగును. కామము చే గూడ నిట్టి సూక్ష్మశరీరమును సృష్టించనగును. అయితే యిది చాలా దూరము పోజాలదు. మాయావిరూపమును పొందుటకు మహాత్ములే చాలుదురుగాని సామాన్యులకు నలవిగాదు. శంకరాచార్యులవారు పరకాయప్రవేశ మిట్టిరూపమునుగొని చేసియుండ వచ్చును. దూరముననుండు గురువులు శిష్యుల ననుగ్రహించుటకు నిట్టి రూపములచే సంచరించుచుందురు.

మనస్సుయొక్క ప్రభావమేమని చెప్పనగును. మనస్సున నొక సంకల్పము పుట్టగానే తదనుగుణ్యమైన వర్ణముగల రూపము చిదాకాశమున నేర్పడును. ఇట్లు మనో సంకల్పములన్నియు భూతములై వాటి కార్యములు కొంచమైనను గుతితప్పక

చేయుచు కర్తయనిపించుకొనును. మన మనుభవించునది యంతయు మన పూర్వ సంకల్పముల ఫలముగాని వేరుగాదు. మన మెట్లు కోరిన నట్లగుట సిద్ధము గనుక మనస్సే సర్వమునకు మూలము. ప్రతి సంకల్పము దగిన ఫలకారియగును. యీ నియమమే దైవమనిపించుకొనును. (దీని విషయము 'సంకల్పశక్తి,' 'సంకల్పరూపములు' ను పుస్తకముల విశదీకరింపబడును.)

ఈ మనస్సును జయించుట కష్టతరము. సాధించ నుద్యమించిన బహు సులభతరము. మనస్సునకు దృశ్యప్రపంచముయొక్క యస్థిరమును బోధించినగాని దానికి నుండు భ్రమదప్పదు. భ్రమదప్పక యింద్రియములు స్వాధీనముగావు. ఇంద్రియములు విషయములను చింతించునుగాని వాటి గుణదోషములను దెలియ సామర్థ్యము లేదు. అంతఃకరణమునకు నింద్రియములు చింతించు విషయముల గుణదోషములను దెలియు సామర్థ్యముగలదు. గనుక మనస్సే ప్రాధాన్యమైనది. గనుక మనస్సుయొక్క యాధీనమున నింద్రియములున్నవి. దీనిభావన ననుసరించి విషయములు ప్రకాశించును. కావున సమస్త ప్రపంచము మనస్సునకాధీనమని చెప్పబడియున్నది. మనస్సు పరాఙ్ముఖమైయుండ నెదుటనున్న పదార్థముగూడ లేనట్లగును గనుక మనస్సే ప్రపంచరూపమున గనపడుచున్నదని తెలియవచ్చుచున్నది. నూగులయందు నూనెవలె సూర్యునియందు కిరణమువలె, అగ్నియందు తాపమువలె, బీజమున నంకురమువలె, మనస్సునందే ప్రపంచమున్నదని ధృడముగా దెలియుము. మనస్సు సకలమును చింతించుటవల్ల ప్రపంచము గలుగుచున్నది. కావున పుట్టుట, చచ్చుట, ఉండుట, బంధము, మోక్షములను అనుభవించునది మనస్సేయని తెలియుము. దృశ్యాత్యంతాభావజ్ఞానమను సిద్ధౌషధముచే మనస్సనురోగము నివారణయైన మనస్సు బ్రహ్మభావమొంది సర్వము బ్రహ్మమను సిద్ధాంతమనుభవగోచరమగును.

## 6. బుద్ధి, 7. ఆత్మ.

పైనచెప్పిన మనస్సు, ఆత్మ, బుద్ధి, నీమూడును పరమాత్మ యొక్క భిన్న నామములై, కార్యముల ననుసరించి యున్నట్లు తోచుచున్నదిగాని, వస్తుతః వాటి స్వరూపములను విశదీకరించుట కష్టతరముగానే యున్నది. వీటిలో నొకటొకటికి పరస్పర భేదములేదు. వీటి స్వరూపము, అవాఙ్మానసగోచరము. కేవలానుభవగోచరము. ఈవిధముగా ప్రతిమనిషికి నేడు వాహనములు గలవు వానివాని సామర్థ్యము కొలది యొక్కొకవేళ నొక్కొకటిని నుపయోగింప యత్నించనగును. ఈసృష్టి

సంసార పరంపర లెందుకుగలిగినవి యనుప్రశ్నకు మాత్రము తృప్తికరముగా సమాధానము జెప్పుటకు వీలులేదు. ఏలన మన గ్రహణశక్తి కేవలభిన్నమై యనేక యావరణములలోనున్నది. ఆయావర్ణములన్నియు వీడినగాని యానిరాటంక స్థితియు, నాస్థితిలోనున్న దైవలీలయు దెలియుట యసాధ్యము. అట్టి ప్రశ్న జేయుటవల్ల నేమిఫలము? మనకు ప్రకృతము సిద్ధమైయుండు, సంసారదుఃఖమును నివర్తింప జేసుకొను కార్యము నకుగదా మన మిప్పుడు పూనుకొనవలయును. రోగికి నౌషధ మెట్లగునది, ఎట్లు ఫలము నిచ్చునది మొదలగు విచారమువల్ల నేమిఫలమగును? రోగముండునపుడు సుఖస్థితి నెట్లనుభవింపనగును. ఔషధము సేవించి రోగము నివారణమైనగాని సుఖస్థితి గలుగనట్లు సంసారదుఃఖ నివృత్తికై జ్ఞానులజేరి, జ్ఞానౌషధము భుజించిన నజ్ఞానము వీడి, సంసార దుఃఖమెట్లు కలిగినది, ఎట్లు నివారించుకొనవలసినది స్ఫుటమై యేర్పడును. గనుక వ్యర్థాలాపంబుల, వాదంబుల మాని, క్షణభంగురమైన యాయుస్సును సార్థకంబు జేసుకొనవలెను.

---

(సశేషము).

## వేదసారము.

ఋగ్యజుస్సామాధర్వణ ములనివేదములు నాలుగున్నవి. ప్రతివేదమున సంహిత, బ్రాహ్మణము, ఉపనిషత్తులని మూడుభాగములు గలవు. సంహితను మంత్రమనికూడ యందురు, మంత్రమన మననముజేసిన కర్మజ్ఞానసిద్ధుల నిచ్చునది యని యర్థము సంహితభాగమున వివిధకర్మల నుపయోగింపదగిన మంత్రములున్నవి.

ఋగ్వేద మన స్తోత్ర శ్లోకములుగలదని యర్థము. యజుర్వేదమున యాగాది క్రతువుల నుపయోగకరమైన మంత్రములు గలవు. ఇది కృష్ణ, శుక్లమని ద్వివిధము. ఋగ్వేదములోని మంత్రశ్లోకములు దీనియందు గొన్నిగలవు. దీనియందు వచనరూపకమైన మంత్రములుగూడ గలవు. సామవేదమున సోమయాగమునకు సంబంధించిన మంత్రములు గలవు. అథర్వణవేదమున మొదటి మూడు వేదములలోని మంత్రములే గలవు. గనుక మొదటిమూడువేదములు త్రయీవేదమని చెప్పుదురు. అథర్వణవేదమును బ్రహ్మవేదమందురు. ఏలన యజ్ఞమున బ్రహ్మస్థానమునఁనుండు నతడు ప్రయోగింపవలసిన మంత్రములు దీనియందున్నవి; అదిగాక బ్రహ్మ స్వరూపమును నిరూపణజేయు ముఖ్యమైన యుపనిషత్తులు దీనియందున్నవి. మొదటి మూడు వేదములలోని ముఖ్యమైన

మంత్రములు దీనియందువున్నవి. వాటిని సాధించిన ననేకసిద్ధులు గలుగును. యజుర్వేదమును అధ్వర్యువేదమని యందురు. ఏలన అధ్వర్యుడు అనగా యాగమును నడిపించువాడు దెలియదగిన యంశములన్నియు దానియందున్నవి. దీని సంహితయందు 1886 శ్లోకములుగల 40 అధ్యాయములున్నవి.

ఋగ్వేద సంహితయందు 1017 సూక్తములుగల 10 మండలములు గలవు. దీనియందు యజుర్వేదమున గల మంత్రములలో సగమున్నవి. యాగమున హవిస్సు నిచ్చువాడు హోతయనబడును. అతడు ఋగ్వేదమంత్రములతో నాయా సమయమునకు రావలశిన దేవతను బిలుచును. ఆయా దేవతలకు నర్పితమగు మంత్రములుగాక పరమాత్మకు నర్పింపబడిన మంత్రములుగూడ నీ వేదమునగలవు. సామవేదమనగా గానము. యాగమున హోతమంత్రముచేత దేవత నావాహనజేసిన, నా దేవతను మంత్రములతో సత్కరించువాడు ఉద్గాత్రియనబడును. ఉద్గాత్రి చెప్పుమంత్రము లీ వేదమున గలవు. ఈ వేదమున 32 అధ్యాయములుగల్గి 460 సామములుగల 15 భాగములు గలవు. ఇది (1) ప్రకృతి (2) ఊహ (3) రహస్య (4) అరుణమని నాల్గుభాగములు గల్గియున్నది. అథర్వవేదమున 731 స్తోత్రములుగల్గి 20 కాండలున్నవి.

బ్రాహ్మణములయందు యాగములను చేయవలశిన విధమును, మంత్రముల దేని దేనికి నెట్లు ప్రయోగింపవలశిన విధులును, విధి నిషేధప్రాయశ్చిత్తములను దెల్పుచున్నవి. సంహితభాగమునకు వ్యాఖ్యానరూపముగా నివి యేర్పడినవి. బ్రాహ్మణములను విచారించిన విధులుగాను అర్థవాదములుగా నేర్పడుచున్నవి. విధియనగా కర్మయాగములు చేయవలశిన నియమములు. అర్థవాదమనగా కర్మ ఫలాఫలములను దృష్టాంతములతో నిరూపించుట.

బ్రాహ్మణములయొక్క కడపటిభాగమున నారణ్యకములను వేదభాగములున్నవి. ఆరణ్యకములన నరణ్యములయందు జెప్పబడిన బోధయని యర్థము. ఈ భాగమున ముఖ్యమైన యుపనిషత్తులున్నవి. సంహితలందు బ్రాహ్మణములందు కర్మభాగములు ముఖ్యముగా నున్నవి, ఆరణ్యకములందు బ్రహ్మ స్వరూపవిషయము సంసార విముఖులగు వారికి ననుకూలమైన తత్వబోధలున్నవి.

(సశేషము.)

# మోహము.

---

శ్లో॥ దుస్సంకల్పవికల్పకూలయుగళా ధైర్యద్రుమోన్మూలినీ।
కల్లోలైరభిమానమత్సరముఖైష్షడ్భిః పరీతోద్ధతా।
ఆవర్తైర్మమతాదిభిః పరివృతా దుఃఖైకధారార్పితా।
పూర్ణా మోహపయస్వినీ వనిభృతం చేతస్థితిర్మాయినామ్॥

అనగా మోహము దుస్సంకల్ప వికల్పములనెడు రెండొడ్డులు కలది. ధైర్యమను చెట్టును పెల్లగించునది. కామక్రోధాది ట్కమనెడి వేళ్లచేత వ్యాపింపబడినది. అహంకార మమకారములు మొదలగు సుళ్లుగలది. దుఃఖమనెడి ప్రవాహముగలది. కాబట్టి మాయావశులగు జనులయొక్క చిత్తస్థితి యట్టి మోహనదియందు మునిగియున్నది. భూతభవిష్యద్వర్తమానములనెడు త్రికాలములయందు ప్రవాహరూపమై, జ్ఞాన ప్రతిబంధకమైన మోహముచే సకలప్రాణులును పరమాత్మస్వరూపము నెరుంగ జాలరు. ఎట్లన స్థూలదేహోత్పత్తికాలమందు తదనుకూల పదార్థములందిచ్ఛయును, ప్రతికూల పదార్థములందు ద్వేషమును, అను నీ రెంటివలనబుట్టినదియు, సుఖదుఃఖము, స్వర్గనరకము, ఇహపరము, బంధమోక్షము, ఆదియనాది యనుద్వంద్వములకు హేతువై నదియునైన యజ్ఞానమయమైన మోహముచేత, సకలప్రాణులు పుట్టుచు గిట్టుచు నవ యవములచేత నిర్మింపబడిన శరీరమే తామనియు, సుఖులనియు, విషయాభిమానమును బొంది మాయచే మోహింపబడి సంసారాసక్తులై యుందురుగాని, పరమానంద భరిత మైన యాత్మజ్ఞానవిషయములో ప్రవర్తించుటలేదు. సంసారమనగా అంతఃకరణ రూపములగు నింద్రియములనెడు నవిద్యాజన్యోపాధులతోడి జీవునకు సంపర్కముగలిగి మోహితుడగుటయే. మోహమన దృశ్యప్రపంచమున నశించు సకలవస్తువులందు తన కంటె భిన్నమైన భేదభావముబొందుట. ఈ భావమునకు గారణము సుఖదుఃఖ ములు వీటికి కారణము లిచ్ఛాద్వేషములు. వీటివలన కామము జనించును. ఈ కామాసక్తిచే జీవునకు దేహగృహదారాత్మజాదులందు మోహమధికమై విషయవార్తల యందు ప్రవృత్తిగలిగి వ్యర్థమగు దుష్కార్యములు జేయుచు పాపకర్ముండై యవిద్యను బాయక కర్మమూలమగు క్లేశంబైన దేహంబునొందుటచే సంతతానందము బొందరు.

మరియు నట్టి దేహికి స్వస్వరూప స్మృతిశూన్యమై, సంసారతాపములబొంది, విషయ వాంఛజేయుచు, ఐహికంబులను మనంబులగోరుచు, అల్పసౌఖ్యముల కన్యోన్యవైరము లంది, దుఃఖములజెంది భ్రమమూలమైన జగత్తునబుట్టుచు చచ్చుచు, కామాంధుడై బా యకుండు. ఇట్లు కామాతురుడైన దేహి భార్యలచే సంతత దుఃఖము నెడబాయక మోక్షమార్గమునకు దవ్వుగనుండు ఇక్లిష్టతగని సంసారమునుండి దేహి యెప్పుడు భక్తిచే ముక్తిచింతనజేయునో యప్పుడా సంసారంబును బాపుటకై సర్వాంతర్యామి యైన పరమాత్మునకు కరుణగలుగును. ఇట్లు దేహిచేయు ధ్యానముచే నెప్పుడా పర మాత్మ కరుణించునో యప్పుడే దేహికి దైవత్వము సంభవించును. ఎట్లన్న సూదంటు రాయికి యినుము సమీపించిన తినవద్దకు లాగుకొనునట్లును, సూర్యకాంత మాణిక్యము సూర్యునికెదురుంచిన కరగునట్లు, విషము నన్నమునకు సమీపించినంతమాత్రముననే నా యన్నము విషమగునట్లు నిరంతర బ్రహ్మభావనలచే జీవునికి బ్రహ్మత్వము సంభవిం చును. మరియు దేహి దేహావసాన కాలమున నేది స్మరించునో యా రూపము ధరించుట నైజము. పరమదయాళుడైన శ్రీకృష్ణమూర్తి మోహపీడితుడైన అర్జునునిగూర్చి యిట్లు జెప్పెను.

"అర్జునా! జీవితకాలమంతయు దేహి యెట్టి స్మరణయందభ్యాసము గలదిగా నుండునో యంత్యకాలమందట్టి స్మరణే గలుగును. అందుచే నట్టిదేహమే ధరించునుగాన నీవు మోహమువదలి నీ జీవితకాలమంతయు నన్నే పరమగతిగా నెంచి స్మరించుచు నీ స్వధర్మవిహితమగు యుద్ధముజేయుము. నీవు సకల కర్మనాచరించుచు నా ధ్యానమును నెడబాయని సంతతాభ్యాసముచే నంత్యకాలమున నన్నుదలంచి శరీరమును ద్యజించిన నన్నే జెందుదువు. ఇందుకేమాత్రము సందేహించకుమని పరమరహస్యముగా నుప దేశించినట్లు శ్రీభగవద్గీతా ప్రమాణమున్నందున సంతతము దేహికి మోహమయమైన విషయవాంఛలచే తప్పక దుఃఖరూపమైన జనన మరణములు గల దేహమే సంభవిం చుట నైజముగాన నట్టి ప్రవాహరూపమైన భవసాగర మీదుటకు కరుణాసముద్రుడగు సర్వేశ్వరునియందెడతెగని భక్తిచే గాక "నయజ్ఞానచతీర్థాని నోపవాసవ్రతానిచ దైవతానిచ సర్వాణి త్రాతుంతంశక్నుయుఃక్వచిత్" అన్నట్లు యజ్ఞయాగాదులు, తీర్థోప వాస వ్రతాదులచే నట్టి పదవిబడయుట దుర్లభముగాన మనఃపూర్వకమైన భక్తినే సంత తాభ్యాసమునకన్న నితర సులభమార్గము గానరాదు. మరియు మోహముచే భ్రాంతి జెంది వ్యాకులచిత్తుడైయున్న పరీక్షిన్నరేంద్రుని యజ్ఞానము బాపుటకై కరుణాసముద్రు

డైన శుకయోగీంద్రుడొక యితిహాసంబానతిచ్చె! ‹ రాజేంద్రా, పురుషుండు నిద్ర జెందిన సమయమున రాజభృత్య, జన, వర్గ రూపములచే సంచారమొనరించునట్లును, మేల్కాంచిన యెల్లయు మిథ్యయైనట్లు సర్వప్రపంచము మాయామూలము. మరియు గలను గన్న స్వల్పకాలమందనేక సంవత్సరములు గడచినట్లు భ్రమ యట్లు గలుగునో యట్లనే జాగ్రదవస్థయందు నీ ప్రపంచభ్రమ మాయా చమత్కారమని యెరుగుము. అందు దేహి విషయవాంఛలచే నానావిధ యోనులయందు బుట్టుచు నెట్టకేలకు మనుష్య దేహంబు ధరియించి, యిందధర్మంబుచే శునకసూకరాదితిర్యగ్జంతు యోనిద్వారంబుల నొంది, తుదకు మనుష్యుండై బుట్టును. ఇట్టి జననమరణాదులు విషయవాంఛాదులచే గలుగుగాన వాంఛ లేకుండవలయును. మరణకాలమందు లేడిని స్మరించిన భరతునకు లేడి జన్మము వచ్చిన దృష్టాంతము దెల్పెద వినుము. తొల్లి భగవంతుండగు నారాయణుండు మేరుదేవికి ఋషభుడను నామంబుచే పుత్త్రుడై జనియించి కొన్నికాలము రాజ్యము చేసి జయంతియను కన్యను బరిణయంబై యామెయందు భరతుడాదిగ నూర్వురు సుతులను గాంచి వారందరికి జ్ఞానోపదేశంబు జేసి తుదకు జ్యేష్ఠుండైన భరతునకు పట్టంబుగట్టి తా శరీరంబు బాసె. పిదప భరతుడు తన తండ్రి లేనికరణి రాజ్య పరిపాలనాదులందు సమర్థతగాంచి శుభలగ్నంబున పంచజనియను కన్యను బెండ్లియాడి, అహంకారంబున పంచతన్మాత్రలు జనించిన చందంబున నామెయందు సుమతి రాష్ట్రభృత్సుదర్శనావరణ ధూమ్రకేతువులను నేవురు పుత్త్రులంగాంచి సకలకర్మలు పురుషోత్తమార్పణంబుగ జేయుచు వాసుదేవునియందు ననుదినము నెడతెగని భక్తిచే ధర్మయుక్తుడై నేబదిలక్షల వేలేండ్లు రాజ్యంబుజేసి, పితృపితామహులార్జించిన ధనంబును పుత్త్రులకు బంచియిచ్చి, సంతతానందమునకై, సుపుత్త్రులను బహువిధ సంపదలతోగూడిన గృహంబును బాసి, సాలగ్రామ సన్నిధియగు గండకియను నదీతీరమునందు రమ్యంబైన పులహాశ్రమంబున కేగి యచ్చట శ్రీహరిసేవ జేయుచు తనివిదీర తపంబాచరించుచుండె. అంత నొక్క నాడా భరతుండా మహానదియందు స్నానమాచరించి ముహూర్తత్రయంబా నీటి ప్రణవోచ్చారణము సేయుచుండు సమయమున నొక నిండు గర్భిణియగు హరిణి జలార్థియై నదీతీరంబున జలపానంబు జేయుచుండ, నా సమీపంబున నొక మృగపతి గర్జింప నా భయంకరారావమునకు బెదరి ప్రాణభీతిచే నుల్లంఘింప గర్భంబు స్రవించి జలంబులం బడియె. నా హరిణియు గిరిదరింబడి శరీరంబు బాసె.

(సశేషము.)

---

## శ్రీమద్రామాయణము, బాలకాండము.

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః॥

పూర్వమున మహోన్నతికి నెక్కిన యిక్ష్వాకు వంశ మొకటి యుండెను. ఆ వంశమున దశరథుడను మహారాజుండెను. ఇప్పుడు ఉత్తర పశ్చిమ రాష్ట్రమని పల్కబడు సరయూ నదీతీరమున కోసల దేశమున నయోధ్యయను పట్టణము రాజధానిగా జేసుకొని యనేక వత్సరము లతడు రాజ్యము చేసెను. ఆ పట్టణముననుండిన జనుల లక్షణ మించుక వివరించెదము. మనస్సంతోషము గలిగి, ధర్మ స్వభావులై, యధికముగ శాస్త్రాభ్యాసము జేసి, స్వకర్మలు జేయ బ్రాప్తించిన ధనంబుల దృప్తిజెందుచు సత్యవాదులై యుండిరి. కొంచము కోరికగలవారును, బ్రాప్తించని పదార్థములుగల వారును, గోవులు గుఱ్ఱములు ధనధాన్యములు లేనివారును, గొప్ప కుటుంబికులుగాని వారును, అక్కడ నుండిరి లేదు. కాముకులు, లోభించిన దనవారిని పీడించువారు, క్రూరులు, పండితులు గాని వారు, పరలోకము లేదను వారిచ్చట గనబడిరి లేరు. ఇంద్రియనిగ్రహముగలవారై, సుస్వభావులై, సదాచారనిరతులై, మహర్షులవలె పరిశుద్ధులైయుండిరి. కర్ణభూషణములు లేనివారును, శిరోభూషణములేనివారును, పుష్పములు ధరించనివారును, అల్ప భోగులు, అభ్యంగనము లేనివారు, మైపూతలేని వారు, సువాసనలేనివారు, కడుపునిండ భుజింపనివారు, దాతగానివారు, బాహువులందు బంగారు బతకములను ధరించనివారు, హస్తమున గడియములు లేనివారు, జితేంద్రియులుగాని వారచ్చట గనబడలేదు.

అధారమనము సేయనివారు, యాగము సేయనివారు, నీచులు, దొంగలు, వర్ణ సంకరము గల వారచ్చట గనబడరు. బ్రాహ్మణులు స్వకర్మ నిరతులై జితేంద్రియులై దానాధ్యయనశీలులై ప్రతిగ్రహమందు సంకోచముగలవారై, భార్యలందు నియమము గలవారైయుండిరి. గుణములందు దోషము నాలోచించువారుండలేదు. అసమర్థులజ్ఞానులుండలేదు. షడంగములు దెలియనివారును, చాంద్రాయణాది వ్రతములను దెలియనివారును, సహస్రజనసంతర్పణచేయనివారును, దైన్యముగలవారు, చిత్తోపరతిలేనివారు, రోగులుండలేదు. కొంటెలేనివారును, కురూపులు, రాజునందు భక్తిలేనివారుండలేదు. సకల వర్ణములవారు దేవతల నతిథుల బూజించుచు నుపకార

ష్ఠులై యుదారముగ దానములు సేయుచు మిక్కిలి పరాక్రమముగలిగి యుద్ధములందు వెనుదీయనివారై జయము బొందుచు దీర్ఘకాలము జీవించుచు, ధర్మసత్యముల నవలంబించుచు, కొడుకులను, మనుమలను బడసి సుఖులైయుండిరి. క్షత్రియులు బ్రాహ్మణుల ననుసరించియుండిరి. వైశ్యులా క్షత్రియుల ననువర్తింపుచుండిరి. శూద్రులు మొదటి మువ్వురిని నాశ్రయించి శ్రద్ధాభక్తులు గలవారైయుండిరి. ఇది సదాచారసంపన్నులైన జనులలక్షణము. గమనించి యాచరించిన సకల సౌఖ్యావహముగదా!

ఆదశరథ మహారాజనేక సంవత్సరములు రాజ్యముచేసి సంతానము లేనివాడై వగచుచు తనమంత్రి పురోహితుల యాజ్ఞానుసారముగ బుత్రకామేష్టి యాగమున కుపక్రమించెను. అప్పుడతని మంత్రియైన సుమంత్రుడు దానిదివరకు నతనికిగలుగు పుత్రప్రాప్తి విషయమై సనత్కుమారుడను మహర్షివల్ల వినినదానిని దశరథునకు జెప్పెను. అది యెట్లన ముందు రోమపాదుడను రాజు ధర్మము దప్పి రాజ్యము చేయ ననావృష్టి సంభవించెను. అప్పుడు ప్రాయశ్చిత్తమునకై తనమంత్రి పురోహితులతో నాలోచించ బుష్యశృంగమునిని పిలుచుకొనివచ్చి తన బిడ్డయైన శాంతనిచ్చి పెండ్లిజేసిన ననావృష్టిదోషము నివారణమగునని తలచిరి. ఆమహామునిని దెచ్చుట కష్టమని యెంచి, యోచనజేసి వారకాంతలనంపి, వారి విలాసములచేత మోహింపజేయ, నతడు వారిని వెంబడించి రోమపాదుని రాజ్యమును బ్రవేశించిన మాత్రమున గేవల తపస్సంపన్నుడు గనుక యానావృష్టి దోషము దొలగెను. అంత నారాజు దనకుమార్తె నాతనికిచ్చి వివాహము సంతోషముతో గావించెను. ఆరోమపాద రాజునకు నిక్ష్వాకు వంశమున బుట్టు దశరథునకు సఖ్యముగలుగును. దశరథునకు బుత్రులులేక యశ్వమేధయాగము జేయనిశ్చయించును. బుష్యశృంగ మహర్షి యజ్ఞము చేయించిన నలుగురు పుత్రులు గలుగుదురు. గనుక బుష్యశృంగ మహామునిని బుత్విజునిగా నేర్పరచుకొమ్మని సుమంత్రుడు చెప్ప, దశరథుడు దనమంత్రి పురోహితపరివార పురస్సరంబుగ నారోమపాదునివద్దకు వెళ్లి యతని యనుజ్ఞబడసి యతని యల్లుని బిడ్డ నయోధ్యకు గొనివచ్చి యజ్ఞమునకు సిద్ధముజేయ నారంభించి సమగ్రంబుజేసెను. పిమ్మట పుత్రప్రాప్తికై వేరుహోమమును జేయ, యజ్ఞపురుషుడు పాయస పూరితమైన కలశము నామహారాజునకు నిచ్చి నీభార్యలకు బంచిపెట్టుమని యాజ్ఞాపించి యంతర్ధానుడాయెను.

(సశేషము).

**50.** బుద్ధిపూర్వకముగానో లేక స్మృతిలేకనో, అమృతకలశములో బడిన నతడు చిరంజీవియగును. అట్లనే దేవనామస్మరణ యిష్టముచేత లేక మనసుకు తెలియకుండ చేసినను అమృతత్వము పొందును.

**51.** సముద్రపు నీటియందొక గొప్పబలవంతమైన పొగయోడ నడచుటయందనేక తెప్పలను పెద్దపడవలను నడపురీతి యొక లోకరక్షకుడు పుట్టి యనేక వేల జనులను మాయాసముద్రమును దాటించును.

**52.** వెల్లువ వచ్చిన నదులు వంకలు వాగులు నిండిపొర్లి భూప్రదేశము జలమయముగా జేయును. అయితే వానవచ్చిన, నియామకమైన కాలువలయందు పారును.

**53.** ఒక నదియందొక తెప్పవేసిన నూరుగురిని మునుగకుండ మోయగలదు. ఒక తేలుచున్న రెల్లుగడ్డిమీద కాకి కూర్చున్నను మునుగును. అట్లు ఒక లోకరక్షకుడు బుట్టిన, నతనాశ్రయించి యతని యనుగ్రహమున ననేక జనులు మోక్షసామ్రాజ్యమును పొందుదురు. సిద్ధుడు తానుమాత్రము చాలాకష్టముతోను కొందరతోను కడతేరును.

**54.** గమనశక్తిగల పొగయంత్రము చేరవలసిన స్థలము తాను చేరుటకాక తనతోకూడ గొప్పబరువుగల బండ్లనీడ్చుకొని చేరుచున్నది. లోకరక్షకులు అట్లనే చేయుదురు. లోకములోని యనేక సుఖములను కష్టముల ననుభవించు జనసమూహమును దేవుని పాదారవిందములను జేర్చుదురు.

**55.** శ్రీరామమూర్తి లోకమున యవతరించ సప్తఋషులుమాత్ర మతినిని మానవవేషము ధరించిన దేవుడేయని తెలుసుకొనిరి. అట్లు దేవుడు లోకమున నవతరించిన నతని దైవస్వరూపము కొందరే తెలుసుకొందురు.

**56.** సచ్చిదానంద వృక్షముమీద ననేక రాములు కృష్ణులు యేసుక్రీస్తులుందురు. వారిలో నొకరిద్దరప్పుడప్పుడు లోకమున నవతరించి గొప్ప మార్పులను గలుగజేయుదురు.

**57.** ఒక్కొక యవతారము దేవుని దూతయనవలెను ఒక గొప్ప మండలేశ్వరుని యొక్క ప్రతినిధివంటివాడు. ఒక దేశమునందు గలతలు గలిగిన రాజు తన ప్రతినిధిని దానినణచుటకు బంపునట్లుగా లోకమునందెచ్చటనైన ధర్మము క్షీణించ దేవుడొక్క రూపమున యవతరించును.

**58.** ఒక యవతారమొక్క ప్రదేశమున నవతరించి కృష్ణుడనిపించుకొనును. వేరొకచోటబుట్టి క్రీస్తు యనిపించుకొనును.

59. కొన్ని ఋతువులయందు మిక్కిలి లోతుగల భావులనుండిమాత్రము కష్టముతో నీళ్లు చిక్కును. వర్షాకాలమందు గొప్ప నీటిప్రవాహములు కలుగుటవల్ల నీరెల్లెడ సులభముగా దొరుకును. అలాగు సాధారణముగా కష్టతరమైన తపస్సును స్తోత్రములును దేవునిబొందుటకు గావలసియుండును. అయితే యవతారమను ప్రవాహము లోకమునగలిగిన దేవుడెక్కడను అంతటను కనబడును.

60. ఒక సిద్ధుడు పురాతన వస్తుశాస్త్రి ప్రవీణునివంటివాడు. అతడొక పూడిన పాత భావినుంచి మన్నువెళ్లదీసి బహుకాలముగా పెరిగిన యాకు అలములను దీసి శుభ్రము చేయును. అవతారమన్నదో గొప్ప యంత్రకారునివలె ముందు నీళ్లుండని చోట నొక క్రొత్తభావిని త్రొవ్వును. గొప్పవారు భక్తి సాత్వికబుద్ధిగూడముగాగల జనులకు మోక్షసాధన మివ్వగలరు. అయితే లోకరక్షకుడె వారివలె భక్తి విశ్వాస రహితమైన హృదయముగలవానినిగూడ కడతేర్చును.

61. రాముడు, సీత, కృష్ణుడు, రాధ, అర్జునుడు వీరందరు పూర్వమున్నవారే కాని మిథ్యాపురుషులు కారు. శ్రుతులకు అంతరార్థము మాత్రమున్నదని తలచకుము. వారు మీవలెనే రక్తమాంస పూరితమైన మానుష శరీరములను కలిగియుండిరి. అయితే వారు దైవస్వరూపులు గనుక వారి జీవనమును చరిత్రరూపముగాను జ్ఞానరూపముగాను వ్యాఖ్యానము చేయబడియున్నది.

82. దేవుడవతరించునప్పుడెంతయు దారిత్యాగము చేయునో యొకడు తెలియజాలడు.

63. సముద్రమునకు నలలువలె బ్రహ్మమునకు లోకరక్షకులు సాదృశ్యము.

64. సిద్ధుడెట్టి స్థితినిబొందును? ఉర్లగడ్డను లేక వంకాయను సిద్ధముచేయ, యనగా యుడికించ నది మృదువై కోమలమగునట్లు యొక మనిషి సిద్ధుడైన నమ్రతను దయాళుత్వమును బొందును.

65. హోమాయును నొక కల్పిత పక్షిజాతియైయున్నది. అది ఆకాశవీధియందు నతి ప్రీతితో విహరించును అది భూప్రదేశమునకువచ్చుట కిచ్ఛయించదు. వాటి గుడ్లు కూడా యాకాశమున పెట్టబడి భూమిమీదబడు నంతలోన మధ్యభాగముననె పొదగబడి పిల్లలగును. ఆ రెక్కలువచ్చిన పక్షి పిల్లలు తాము క్రిందికిపడుచున్నవని తక్షణమెరిగి తమ గమనిమార్చి పైనున్న తమ గృహమునకు నెగిరిపోవును. శుకుడు, నారదుడు, ఏసుక్రీస్తు శంకరాచార్యులు మొదలగు వారివంటి వారాపత్తులవలె బాల్యముననే ప్రాపంచిక విషయ సంగత్యాగముజేసి, సత్యజ్ఞానమును దివ్యస్వరూపమును బొందుదురు. వీరినే నిత్యసిద్ధులందురు.

ఏకమనేకమగువేళ చలనము సిద్ధమగుట యావశ్యకము, ఏలన, శాశ్వతమైన వస్తువు భిన్నములైనప్పుడు అనంతమైన చలనమావస్తువును సూచించవలయును, అనగా ప్రకృతియందు కేవలచలనము సిద్ధముగానుండును. ప్రకృతియొక్క తత్వము భేదభావము, పురుషతత్వము ఏకత్వము ఈ రెండొకటియందు పాలలో మీగడవలె నగుపడునప్పుడు, ఆవస్తువుయొక్క సర్వవ్యాపకత్వము ప్రకృతియందు తరుగనియు ననంతమైన చలనరూపముగా నేర్పడును. నియమము లేని చలనము ప్రతియణువు సర్వకాలమున సకల ప్రదేశములందుండుట విశ్రామమనగును. ప్రకృతిపురుషుల నుంచి యీ భేదములు గలిగినవి. పురుషస్థానమునుంచి విచారించిన, నుండునది యొక్కటే. ప్రకృతిస్థానమునుంచి చూచిన, ననేకములు గలవు.

ఈ యనంతమైన చలనము క్రమముగా ప్రకృతియందు సిద్ధమైయుండి ప్రతి జీవుని కొంత ప్రకృతి పదార్థమున చేర్చి యితర జీవులనుండి వేరుచేయుచున్నది. ఇట్లు మొదట భేదభావము సిద్ధమై వెనుక ప్రతిజీవు ననేకవిధములైన ప్రకృతిపదార్థ కబుసములను ధరించును. ఈ కబుసములు చలించినట్లంతయు నవి దమచుట్టునుండు పదార్థములను జలింపజేసి వెనుక నితర జీవుల కబుసములను జలింపజేసి తర్వాత నాజీవులను జలింపజేయును.

ఇట్టి చలనమువల్లనే యొకడు మఱియొకనిని దేయువిధము లేర్పడియున్నవి

ఒకడు మఱొకనిని దనలో ప్రతిఫలింపజేసుకొని వానిననుభవించురీతి దానను భవమునకు దెచ్చుకొనును. అయితే యీ యనుభవమునందు కొంచము భేదముగలదు. ఎట్లన నొకని భావము మఱొకనికి దెలియునపుడు మఱొకనియం దనేక భావములు స్వాభావికముగ సిద్ధమైయుండునందున నొకని భావము మఱొకనికి సిద్ధమైయుండు భావములలో మిశ్రమమై మిశ్రభావమేర్పడును. గనుక ఒకని భావము మఱొకని యందు సంపూర్ణముగ ప్రతిఫలించదు. పోలికలు మాత్రము గలుగుచుండునుగాని కోశములు సిద్ధమైయుండువఱకు నైక్యభావమెన్నటికి గలుగదు.

---

## సత్సంకల్పములు.

**26.** జీవులందఱొక్కటియని మనము భావించి పోషించినట్లగుదు నను భయము లేక మనోశాంతి మనదై యుండును.

**27.** తనచుట్టునుండు వారికి సహాయముజేయ నెక్కువ సామర్థ్యము గలుగుట సంకల్పశక్తికై యభ్యాసివొందు లాభములలో మిక్కిలి యెక్కువైనది.

28. తన మనస్సు హృదయములను శాంతి వహింపజేసుకొనిన వాడితరులకు సహాయముజేయ నర్హుడగును.

29. సుఖానుభవము లేక శక్తి వృద్ధి గాజాలదయ్యెను.

30. సుఖానుభవము లేక పరితాపము వృద్ధిగాజాలదయ్యెను.

31. పడిలేచినవారే పడినవారికి సహాయముజేయ జాలుదురు.

32. సాధారణమైన జనుల నడవడికయందు గలుగు సుఖములన్నియు వికారముబొందు నాశనమగు రూపముల కూడికవల్ల నగును.

33. ప్రతి సుఖమును మొగ్గ శక్తియను పుష్పముగా వికసించును.

34. మనమజులు, మరణములేనివారు, నిత్యులు, అవికారులు, శాశ్వతులు.

35. శాశ్వత యుద్యోగమునకై సాధనములను జేసుకొనుటకు నిచ్చటనున్నాము.

36. శాశ్వత సుఖానుభవము సిద్ధమగుటకు భేదభావముగల జన్మాకాంక్ష యావశ్యకము.

37. ప్రతి ప్రాణికి నెడతెగని సుఖాన్వేషణము గలదు.

38. కామ్యవిషయ సంయోగమున సుఖసారమున్నట్లగుపడును.

39. శాశ్వతముగాని యనేక జన్మరూపముల, నొక్క చైతన్యము వృద్ధి బొందుచున్నది.

40. ప్రతి జీవుడు దనస్వరూపమైన యీ చైతన్యమునే వెదకుచు ననేక రూపముల సంసర్గమును బొందును.

41. ఈ రూపములు భిన్నములుగానుండి తమలోనుండు చైతన్యముగూడ వేరుగానున్నట్లు చూపుచున్నవి.

42. ప్రాణులలో నొక్కొకటికి రూపములె భేదకారణములు.

43. జీవుడు సౌందర్యమునుగోరి సుందరరూపమునుబొందును.

44. రూపములతో జేరి యానందించును.

45. రూపముగళించిన నొక నిరాలంబమేర్పడును.

46. జీవుడు ప్రేమనువెదక ప్రేమాస్పదమైన రూపమునుబొందును.

47. రూపముతో జేరి సంతోషించును.

48. రూపము చెడిన మనస్సువిహ్వలమగును.

Continued from page 116.

# శ్రీభగవద్గీత.

## మూడవ యధ్యాయము - కర్మయోగము.

### అర్జునుని వాక్యము.

జనార్దనా జ్ఞానము కర్మకంటె శ్రేష్టమని తలచితివేని నన్నెందుకు నీఘోర కర్మయందు, కేశవా, నియోగించుచున్నావు. ఈసంశయవాక్యములచేత నీవు నాబుద్ధిని గలతబెట్టుచున్నావు. దేనిచేత నేను శ్రేయస్సు బొందుదునో దాని నిశ్చయించి నాకు జెప్పుము.

### శ్రీ కృష్ణులవాక్యము.

పాపరహితుడా! సాంఖ్యులకు జ్ఞానయోగమున్ను, యోగులకు కర్మయోగమున్ను ఈలోకమున ముందు నేను జెప్పినరీతిని రెండువిధములుగానున్నవి. కర్మారంభము చేయనందున పురుషుడు కర్మరాహిత్యము బొందుటలేదు. కర్మసంత్యాగ మాత్రమున జ్ఞానసిద్ధిని బొందుటయులేదు. ఎవడైన క్షణమైనను కర్మజేయక నుండజాలడు. ప్రకృతిలో బుట్టినగుణములచేత ప్రతివాడును యత్నములేక కర్మజేయనీడ్వబడును. ఎవడు కర్మేంద్రియముల నిగ్రహించి యింద్రియవిషయములను మనస్సున జింతించునో వాడు మిథ్యాచారముగలవాడు. వాడు కపటి. అయితే మనస్సుచేత నింద్రియములను నిగ్రహించి ఫలాకాంక్ష లేక, కర్మేంద్రియములచేత గర్మయోగము జేయునో, అర్జునా, వాడే శ్రేష్ఠుడు. నీవునియమింపబడిన కర్మను జేయుము ఏలన కర్మ చేయక యుండుటకంటె గర్మ జేయుట శ్రేష్ఠము. కర్మ లేకున్న శరీరయాత్రగూడ నసాధ్యము. అర్జునా, భగవదర్థమైనకర్మ దక్క, తక్కినకర్మ లోకబంధకము గనుక ఫలాపేక్షలేక కర్మను జేయుము. పూర్వము యజ్ఞములతో గూడి, ప్రజలను సృష్టించి దీనిచేత మీరువృద్ధిపొందుడు ఇవి మీకు సకలాభీష్టమిచ్చుగాతమని బ్రహ్మ చెప్పెను. ఈయజ్ఞములచేత దేవతలను బూజించినవారు మిమ్ములను వృద్ధిపొందింతురు. పరస్పరసహాయభూతులై మీరుత్తమ క్షేమలాభములనుభవింతురు. యజ్ఞముచేత సంతృప్తి జెందిన దేవతలు మానవులకు నభీష్టములయిన భోగములనిత్తురు. వారిచేత నివ్వబడిన భోగములను వారికించుకయైన సమర్పింపక యెవ్వడనుభవించునో వాడు చోరుడగును. యజ్ఞశేషమును భుజించు ధార్మికులు సర్వపాపవిముక్తులగుదురు. అయితే యాత్మార్థమై యాహారమును పచనము జేసుకొను నధార్మికులు వారు పాపమునే భుజింతురు. ప్రాణులన్నమువలన బుట్టును.

వర్ష దేవతవలన నన్నముపుట్టును. యజ్ఞమువలన వర్ష దేవతపుట్టును. యజ్ఞము కర్మవలన గలుగును. కర్మ వేదమువలన బుట్టినదిగా దెలియుము. వేదము పరమాత్మవలన బుట్టినది. శాశ్వతమై సర్వవ్యాపియైన పరమాత్మ యెల్లప్పుడు యజ్ఞమున ప్రతిష్ఠితమైయున్నది. ఈయాజ్ఞాచక్రము ననుసరించి నడువనివాడు పాపియై విషయాసక్తుడై, పార్థా, వ్యర్థముగా బ్రతుకును. ఆత్మయందాసక్తిగలిగి, యాత్మయందు దృప్తిబొంది, యాత్మయందే సంతోషించువానికి జేయవలసినది యేమియులేదు.

ఈలోకమునందు జేయబడిన కార్యములందుగాని, లేక, చేయబడని కార్యములయందుగాని యతనికి ఫలములేదు. అతడేపదార్థమును నాశ్రయింపబనిలేదు. గనుక సంగవర్జితుడవై ధర్మమైనకర్మ నెల్లప్పుడు చేయుము. అట్లుసంగరహితుడై చేసినరుడు పరమపదమును నిశ్చయముగాజేరును. జనకాదులు కర్మానుష్ఠానముననే జ్ఞానసిద్ధిని బొందిరికదా? గనుక నీవు లోకక్షేమమును దృష్టియుంచి కర్మజేయవలెను. ఉత్తముడేమి చేసిన దానినితరజనులుగూడ జేయుదురు. వాడు దేనిని ప్రమాణముగ భావించిన లోకులు దానిని ననువర్తింతురు. మూడులోకములందు నాకు గర్తవ్యమేదియులేదు. పొందదగిన పదార్థము పొందనిది యేదియులేదు. అయినను నేను గర్మయందు వర్తించుచునే యున్నాను. ఏలన నేను గర్మనెప్పుడు విసుకక జేయనైతినేని యంతటజనులు, పార్థా, నామార్గమనుసరించెదరు. నేనుగర్మనుజేయకున్న ఈలోకములునశించును. వర్ణసంకరమును గలిగించినవాడగుదును. ప్రజలనునశింప జేసినవాడగుదును. పామరులు ఫలాసక్తితో గర్మనుజేయునట్లు, భారతా, విద్వాంసుడు లోకోపకారార్థమై సంగరహితుడై కర్మజేయవలెను. కర్మాసక్తిగల మూఢులమనస్సును విద్వాంసుడు చలింపజేయరాదు. అయితే యతడు సంగరహితుడై కర్మజేయుచు సర్వకర్మలను వారిచే నాచరింపజేయవలయును. ప్రకృతిధర్మముచేత గర్మలుజేయబడును. అహంకారముచేత మోహితుడై జీవుడు నేను కర్తయని యనుకొనును. అయితే, అర్జునా, గుణకర్మవిభజనలను దెలిసిన తత్త్వజ్ఞాని యింద్రియగుణములు విషయగుణములయందు వర్తించునని యెరింగి సంగరహితుడగును. ప్రకృతిగుణములచేత మోహితులైన వారు గుణజన్యములైన కర్మలందాసక్తులగుదురు. జ్ఞానసిద్ధులు జ్ఞానములేని మూఢులను చలింపజేయగూడదు. సమస్తకర్మలను నాకునర్పించి పరమాత్మధ్యానమున మనస్సు నుంచినవాడై, నిష్కాముడవై, యహంకారరహితుడవై, మనస్సంతాపమును ద్యజించి యుద్ధమువకులెమ్ము. ఈనాబోధయందు సదా మగ్నులై విశ్వసించి యసూయలేకనుండువారుగూడ గర్మనుంచి విముక్తులగుదురు.

**15—18.** జింక చర్మముమీద దర్భపాచలను మనుష్యాకారముగా బఱచి యందుపైన తలమీద నలువది పలాశపత్రములను గొంతుభాగముమీద యఱువదియును, చేతులమీద నూరును వ్రేళ్లమీదపదియును, గొంతుమీద నూరును, కడుపుమీద ముప్పదియు, బీజముమీద యెనిమిదియు, పురుషముమీద నైదును, తొడలమీద యిరువది యొక్కటియు, మోకాలు చీలమండిపైన నిరువదియు, కాలివ్రేళ్లమీద నేబదియు, అంతు, యేడునూర్లు పలాశపత్రములను గ్రహించి పంచవలెను.

**19—20.** వెనుక అగ్నిహోత్ర క్రియలయందు వాడఁబడుసాధనములు నుపకరణములను నావిగ్రహముమీద నిట్లు పెట్టవలెను. బీజప్రదేశమున శమీకకఱ్ఱచేత చేయఁబడిన యగ్నిని మదించుకఱ్ఱను కుడిచేతిమీద జహువును, యెడమచేతిమీద వుపాసత్తును ఒక చెవిమీద ఒక రోలును, వీపుమీద రోకలిని, యెదమీద నొక రాతిబండను, నోటియందు నేతితోఁగలసిన బియ్యమునువ్వులగింజలును, మఱియొక చెవిమీద నొక ప్రక్షణియును, కండ్లమీద ఆజ్యస్థలియును, నోటిలోపల నాశికారంధ్రములు మొదలగు స్థలముల బంగారుతునకలును బెట్టవలెను.

**21—22.** వెనుక మృతినొందినవాని సహోదరుఁడు లేక సహచారుఁడైన సోమయాజివాఁడు దేవలోకమును బొందుగాకయని యాజ్యమర్పణఁ జేయవలెను.

**23.** శవముల దహనములకుఁ జెప్పఁబడ్డనియమముల ననుసరించి సర్వకర్మలును జేయవలెను.

**24—25.** పైనజెప్పినట్లుజేసిన చచ్చినవాని జీవుఁడు బ్రహ్మలోకము జేరును. ఈ దహనకర్మమును జేయుటకుఁ జేరుద్విజులు ఊర్ధ్వలోకములను జేరనర్హులగుదురు. ఈ నియమముల ననుసరించనివారు అల్పాయువులై మరణానంతరమున నరకము జేరుదురు.

## 6-వ యధ్యాయము.

1. ఇకమీద పశువులను పక్షులను మొదలగు వానిని జంపుటచేత గలుగు పాపములకు ప్రాయశ్చిత్తములను గురించి నేను జెప్పఁబోవుచున్నాను. పరాశరపుణ్యమూర్తి సవిస్తరగముస ముంను చెప్పినను మనుధర్మశాస్త్రమునఁగూడ విశదముగాఁ జెప్పఁబడియున్నది.

2. హంసను నీటికోంగను కోడిని జాతును శరభమును జంపిన నొక రాత్రియొక పగలుపవాసమున్న శుచియగును.

3. చిలుకను, నెమలివంటి పక్షిని కొంగను పావురమును చంపిన, నొక పగలుపూర్తి యుపవాసముండి రాత్రిభోజనము చేయవలెయును.

4. కొక్కిని, గువ్వను, భాసను, శారిని, లేక తిత్తిరిని, జంపిన నీటనిలిచి ప్రాతఃకాలమున సాయంత్రమున ప్రాణయామ మభ్యసించవలెను.

5. గద్దను, డేగను, నెమలిని, గుడ్లగూబను మొసలిని లేక చేపనుజంపిన, ఒక పగలు పూర్తివండిన యన్నమువిడిచి, మరునాటి రాత్రిగూడ నుపవాసముండవలెను.

6. ఊరబిచ్చుక, కోకిలను, ఖంజను, లావకమును, రక్తపిదమును జంపిన ఒక పగలు పూర్తి యుపవాసముండి రాత్రిభుజించ వలయును.

7. కారండవము, చకోరము, ఇంగలము, కురారము లేక భరద్వాజ జాతికి జేరిన పక్షిని జంపిన పాపము శివపూజవల్ల పరిహారమగును.

8. పిచ్చికను, భేరుండమును, క్షయవమును, భాసను, కపింజలమును లేక యితర జాతికి జేరిన నేపక్షినైనను జంపిన నొక్క రాత్రి యొక్కపగలుపవాసమును జేయవలయును.

9. పల్లిని, ముంగిసను, పాము, బోయమును, లేక గంధమును జంపిన ప్రాయశ్చిత్తమునకై కృసరముతోగూడ బ్రాహ్మణులకు సంతర్పణజేసి వారికి దక్షిణకై యినుపతునకలను దానము జేయవలయును.

10. ముండ్లపందిని, కుందేటిని, తాబేటిని, చేపను, లేక గోధను, జంపిన ఒక దినమున వంకాయలనుతిని కడపిన మరల శుచియగును.

11. తోడేలును, నక్కను, ఎలుగుగొడ్డును లేక శివంగినిఁజంపిన మూడు దినములుపవాసముండి బ్రాహ్మణునికి నూలుదానము జేయవలయును.

12. యేనుఁగును, గవయమును, గుఱ్ఱమును, ఎనుమును, లేక యొంటెను, జంపిన యేడు దినములుపవాసముండి ప్రాయశ్చిత్తమునకై బ్రాహ్మణులకు సంతర్పణ జేయవలయును.

13. దుప్పిని, అడవిపందిని, రురువును అబుద్ధిపూర్వకముగాఁ జంపిన మన్నినమడియందు పెరగని ధాన్యము నొక్కదినము దిన్న నాపాపము పరిహారమగును.

14. ఈలాగు అడవిలోని చతుష్పాద జంతువులను నేదైన జంపిన నాపాప పరిహారమున్నకై యగ్నికి పావనమైన మంత్రోచ్చారణము జేసి, ఒక్కదినము పూర్తి యుపవాసముండవలయును.

15. శిల్పిని, శూద్రుని, లేక స్త్రీని జంపిన రెండు ప్రాజాపత్యతపస్సులను జేసి పదునొకొండు వృషభములను పాపపరిహారమునకై బ్రాహ్మణులకు దానమివ్వవలెను.

16. నిరపరాధియైన వైశ్యుని లేక క్షత్రియుని జంపిన రెండు కృచ్ఛ్రతపములను జేసి యిరువదియొక గోవులను బ్రాహ్మణులకు దానము యివ్వవలెను.

17. తనవర్ణమునకు సంబంధించిన క్రియలను జేయని బ్రాహ్మణునిగాని వైశ్యునిగాని ధర్మనిరతుండైన శూద్రునిం జంపిన నొక చాంద్రాయణ వ్రతము సల్పి బ్రాహ్మణులకు ముప్పది యావులను దానము చేయవలయును.

18. చండాలునిగాని, నీచజాతి వానిలో నెవరినైనను గాని జంపిన క్షత్రియుఁడు, వైశ్యుడు, శూద్రుఁడు అర్ధకృచ్ఛ్రవ్రతమును సలుపవలయును.

19. దొంగను, శ్వపచుని, చండాలునిగాని జంపిన బ్రాహ్మణుఁడొక రాత్రియొకపగలుపవాస ముండుటచేతను ప్రాణాయామము జేయుటచేతను పాపరహితుఁడగును.

20. చండాలునితో సంభాషించిన బ్రాహ్మణుఁడు ఒక బ్రాహ్మణునితో మొదట సంభాషించి వెయిక గాయత్రీ జపము జేసిన పాపరహితుఁడగును.

21. చండాలునితో శయనించిన బ్రాహ్మణుఁడు మూడురాత్రు లుపవాసముండవలెను. చండాలుఁడు నడచిన మార్గమున నడచువాఁడు గాయత్రి మంత్రోచ్చారణమువల్ల శుచిత్వము నొందును.

22. చండాలునిఁ జూచిన నొక బ్రాహ్మణుఁడు సూర్యుని దర్శనము చేయవలెను. చండాలుని స్పృశించిన నొక బ్రాహ్మణుఁడు తాను ధరించిన గుడ్డలతో కూడ స్నానము చేయవలెను.

23. చండాలుఁడు కట్టించిన తటాకజలము గాని, ములేక త్రాగినను ఒక రాత్రి మరుసటిపగలు కూడ బ్రాహ్మణుఁ డుపవాసముండవలెను.

24. చండాలస్పర్శచేత నపరిశుద్ధమైన నూతి యుదకమును త్రాగిన నొక బ్రాహ్మణుఁడు యవలనుదిన గోమూత్రము త్రాగి మూడుదినములు గడపిన పరిశుద్ధుఁడగును.

25—26. చండాలుని పాత్రయందుంచి యిచ్చినది లేక త్రాగిన, పాపమునకు, ప్రాయశ్చిత్తము త్రాగిన తక్షణమే నీటిని విసర్జించి చాంద్రాయణ వ్రతము చేయవలెను. త్రాగిన నీరు కడుపునఁజేరి జీర్ణమైన కృచ్ఛ్రసంతపనవ్రతము సేయవలెను.

**27.** సంతపనతపస్సును బ్రాహ్మణులు చేయవలయునట్లు విధించిన విషయముల క్షత్రియులు ప్రాజాపత్యములను, వైశ్యులు అర్ధప్రాజాపత్యములను, శూద్రులు పాదిక ప్రాజాపత్యములనుఁ జేయవలెను.

**28–29.** నీచజాతివానియొక్క పాత్రయందుంచిన పాలను, నీటిని, పెరుగును తెలియక త్రాగిన ద్విజులైన వారందరును నుపవాసముచేసి బ్రహ్మ కూర్చముగావించి పరిశుద్ధము కావలెను. అయితే శూద్రుఁడట్టి సందర్భమున నుపవాసముజేసి శక్తికొలది దానము నివ్వవలెను.

**30.** చండాలుఁడువండిన యన్నము తెలియక యొకసారి భుజించినను పది రాత్రులు యవధాన్యము గోమూత్రమునఁదినిన యొక బ్రాహ్మణుఁడు పాపమును బోగొట్టుకొనును.

**31.** ప్రతిదినము గోమూత్రమున నానిన పిడికెడు యవధాన్యమును మాత్రము గ్రహించుచు పదియవవాడా వ్రతమును ముగించవలెను.

**32.** ఒక బ్రాహ్మణుని యింట నొక చండాలుఁడు దాచుకొన్నను తెలియక వసించినను తోడి బ్రాహ్మణులు యిట్లు వానిని పాపవిముక్తునిగా జేయవలెను.

**33.** ఉపన్యాస సంఘమును జేర్చి వారిట్లు వానికిఁ జెప్పవలెను. "ఋషుల ముఖములనుంచి విన్న పావన వేదములయందు విధింపఁబడిన ధర్మనియమములు సకల ప్రాణుల నాదరించుచున్నవి. ఓధర్మనిధుఁడా! యీ పాపమైన మైలనుంచి నివిప్పుడు మేమాదరించుచున్నాము."

**34.** మూడుదినముల పర్యంతరము యీ బ్రాహ్మణుల సహవాసమున పాలును, పెరుగు, నెయ్యి, గోమూత్రమున వండిన నువ్వులను భుజించి ప్రతిదినము రెండుసార్లు స్నానము చేయవలయును.

**35.** మొదటి మూడుదినములు గోమూత్రమున నూరవేసిన నువ్వులను పాలతో వండి తీసుకొనవలెను. రెండవమూడు దినములయందు పెరుగుతోను కడపటి మూడుదినములయందు నీటిలో వండిన నువ్వులను భుజింపవలెను.

**36.** ఒకఁడు తినిమిగిలిన యన్నమును పురుగుముట్టిన యన్నమును దుర్మనస్సుతో నివ్వఁబడిన యన్నమును భుజించకూడదు. మూడుపలములకంటె నెక్కువ పాలను పెరుగును ఒకపలము నేతికంటె నెక్కువ యొకసారి తీసుకొనకూడదు. పలమనగా యెనిమిది తులములు.

యనుకూలముగనున్నది. దీనియందు జేరుటవలన మన మతాచారములకు నేమియు హాని లేదు, గాని మన మతాచారములయందు జారిపోవుచుండు భక్తిపదిలమై యెక్కువ శ్రద్ధగలవారగుదుము. ఈ సమాజము స్థాపితమైన వెనుకనే హూణవిద్య నభ్యసించిన వారలలో ననేకులు జెడిపోక యిటీవల మన మతాచారములందు శ్రద్ధవిడువక యాచరించుచున్నవారు. ఈ సమాజమువల్ల నీ దేశమునకు జాలా మేలు గలిగినది. ముందెక్కువ మేలు గలుగబోవునని నమ్ముము. హిందూమతము బౌద్ధమతము గేవల శిథిలమై యుండెను. ఇప్పుడిప్పుడు మనలో ననేకులు గండ్లుదెరిచి మన మతములందు నెక్కువ శ్రద్ధగలవారమగుచున్నాము. మన మతాచారములను వాటి యుద్దేశములను ఫలములను దృష్టాంతములతో గూడ విశదీకరించుటవలన వాటి యోగ్యతను మనమిపుడు గనుగొనుచున్నాము. ఈ సమాజము లంకాద్వీపమును బ్రవేశించి నశించియుండిన బౌద్ధమతమును మరల నుద్ధరించినది. దీనివల్ల 18000 బౌద్ధులు దమ మతమవలంబించుచు సురాపానము వదలియున్నారట. దీనివల్ల సంవత్సరమునకు 7 లక్షల రూపాయల వరుమానము దక్కువైనదట. సురాపాన దుర్గుణములు ముందెక్కువగ వ్రాయుదము. ఇట్లు సుగుణమవలంబించిన నెంతలోకమున సుగుణమెక్కువగును మీరే యోచించుడు. మన దేశమున హూణవిద్య జదివినవారందరు మన మతమును హేళన జేయుచు హూణులవలె నాచారములు మెండుగ నేర్చుచు వచ్చుచున్నారు. అయితే యీ సమాజప్రభావము వల్ల హూణవిద్య నేర్చినవారలలో ననేకులీసమాజము ప్రచురించిన పుస్తకములద్వారా మన మతప్రభావములు దెలిసికొని క్రొత్తక్రొత్త యాచారములను గొంత గొంత దిరస్కరించుచు మన మతమునే వృద్ధిజేయ యత్నించుచున్నారు. అయితే హూణవిద్యావిశారదులు దేశమున జూచిన జాలాకొందరుండుటవల్ల నీ సమాజ మెక్కువ యుపయోగము జూపకయున్నది. దేశభాషలందు నాసమాజాభిప్రాయములను విశేషముగా దెలిసిన, జనసామాన్యము వాటిని గ్రహించిదెలిసి ప్రపంచవ్యవహారములు జరిపిన సర్వసుఖమిచ్చుట గలుగకుండుటకు కారణమేమి యుండదు. గనుక యీ సమాజవిషయమును సకలజనులకు దెలియ దేశభాషలయందు పత్రికలు, పుస్తకములు వ్రాయబడుచున్నవి. వాటిని నుపేక్ష చేయక తమకును లోకమునకును శ్రేయస్సాధనంబగు నట్లు గ్రహించి స్నేహితులకు దెలిపిన హెచ్చుప్రయోజనంబును బొందుదురుగాక యని క్షణక్షణమున గోరుచున్నారము.

## హంసావళి.

1. షట్త్రింశన్మంజరి:—శ్రీశంకరాచార్యులు రచించిన భజగోవింద శ్లోకముల నాంధ్రభాషాణ పద్యాత్మకముగా రచింపబడినది. ఆబాలవృద్ధులకు నానందకరమైనది. వెల 2 అణాలు మాత్రమే.

2. ఏకాదిరత్నావళి:—1 మొదలు 224 సంఖ్యవరకు గల విషయవిశేషములిందు సంగ్రహింపబడినవి (అయనద్వయము, వాసనాత్రయము, సాధనచతుష్టయము, మొదలగు 1008 విషయములు) వెల 4 అణాలు మాత్రమే.

3. హంస:—ఇది మాసపత్రిక 1908 జనవరినుండి వెలువడుచున్నది. ఈ జన్మసార్థకము జేసుకొనగోరువారు దీనిని నిరాకరించ జాలరు. చందా సంవత్సరమునకు రెండు రూపాయిలే.

హంసశాల,
వైజయంతిశాల.
*Mount Road, Madras*

పె. ఎ. హనుమంతరావు,
కార్యదర్శి.

# THE THEOSOPHICAL SOCIETY.

# బ్రహ్మవిద్యాసమాజము.

బ్రహ్మయనగా నేమి? ఈ విషయమును చక్కగా తెలిపిన నీసమాజ విషయము స్ఫుటముగా తెలిసి లోకమున నీసమాజమువారు చేయవలసిన కార్యములాలోచించి వారితో నితరులుగూడ జేరి జనసముదాయమునకు హెచ్చుగు ప్రయోజనంబు గలుగునని మా యభిప్రాయము. ఈ సమాజమున చేరిన వారిలో ననేకులు లోకమునందు సాధారణజనులుగూడ ప్రవర్తించని మార్గమునవర్తించుచున్నారని గాని ఈ సమాజమున జేరినవారెట్టిప్రయోజనమును బొందక స్వార్థప్రవర్తనల ప్రోత్సహించుచున్నారని లోకప్రతీతికలదు. సమాజముయొక్క ముఖ్యోద్దేశములు నియమములు సమగ్రముగ దెలియక [illegible]

ఓం



సత్యమునకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 1.] జూలై 1908. [సంచిక 7.

## స్వవిచారము.

వెనుకటి నెల సంచికయందలి నా విన్నపమును గైకొన్నారుగదా? ఇదివరకు చందాలు పంపనివారు దయచేసి త్వరలో చందాలను కార్యదర్శికి బంపుదురుగాక యని వేడుచున్నాను.

అదియునుంగాక సామాజికులకందరికి నన్ను దేశమున ప్రసరింప యత్నించుట గాక సర్వజనులకు హితకరముగా నుండుటకు, దగిన విషయమునగూడ సేకరించి మా కార్యదర్శికి బంపిన లోకోపకారము ఘటింపజేసినవారగుదురని విన్నవించుకొనుచున్నాను. ఈ విషయమునగూడ ఉపేక్షవహింపక సహాయభూతులగుదురుగాక యని ప్రార్థించుచున్నాను.

## కాలము.

మనము కాలప్రభావము నంతగా గమనించి యుండము. దీనికై యొక క్షణము వినియోగించుదము. ఆహా! లోకమున 84 లక్షల జీవరాసులున్నవని ప్రసిద్ధముగదా! ఈ జీవరాసులలో నొక్కొక్కటి దానిదానె శ్రేష్ఠమనియు, చిరంజీవి యనుకొని కార్యములు జరుపుచుండునుగదా! ఇది యేమి చిత్రతనము? ఎచ్చటి యజ్ఞానము. అనంతమైన కాలస్వరూపమున నొక జీవియొక్క జీవనకాలమెంత పరిమితిగలదో చూడుము, యోచించుము. తమ రోగులనుజూచి కనునుడి వేసిన వైద్యులెందరు చావలేదు? ఇతరుల చావులను గుర్తించిచెప్పిన జ్యోతిష్యులెందరు మడియలేదు? మరణము అను తత్వమునుగురించి వాదించిన తత్వవేత్తలెందరదృశ్యులు కాలేదు? అనేకుల తలలు

మోదిన వీరులెందరు దేహమును బాయలేదు? తాము చిరంజీవులనుకొని గుర హంకృతితో రాజ్యమాడిన రాజాధము లెందరు బొందివీడలేదు? మహా వైభవమున నున్న అయోధ్య, మధుర, ఇంద్రప్రస్థములను సభా స్థానములు వృష్ణయములుగాలేదా? అనేక వేల ఇంద్రులు, మనువులు, దేవతలు, బ్రహ్మరులుండి వెళ్లినారు. నదులలోని యిసుకనైన నెన్నవచ్చునుగాని యుండివెళ్లిన బ్రహ్మలనెంచదరమా? ఇటుండ ప్రాణిజీవి యుండు క్షణిక కాలమును వ్యర్థముజేయుట యెంత యవివేకము? కాలమెంతగడచి సమస్తము నాశము జేసినను, తాను చేసిన సుకృతము తప్ప మరియొకటి వెంటనంటదు. రేపుచేయవలశినది నేడు చేయుము. మధ్యాహ్నమున చేయునది ప్రాతఃకాలమున చేయుము. ఈ క్షణమును న్యాయమార్గమున జొచ్చి సంతోషమున గడుపుము. ప్రాణి జీవియు నల్పకాలమేదో యొక యనుభవమునకుగాను, ఈ లోకమునకు రావలశినదిగా ఏర్పడియున్నదని తెలిసికొనుము. ప్రాణిజీవికి ప్రజన్మమొకమార్గమున పనిచేయు కాలమని తెలియుము. విశ్రమస్థానము స్వర్గము. కాలనియతిని తప్పించుకొన నెవరికి సాధ్యములేదు. ఏలన, ' కాలోస్మి లోకక్షయకృత్ ' అని భగవానులు భగవద్గీత యందు దానె కాలస్వరూపమని తెలవిచ్చియున్నారు.

---

## మా భక్తవిజయము.

అపరవయస్సున నతడు క్రీస్తుమతాచారము నవలంబించయిష్టపడ, కలలో నేసుక్రీస్తును జూచెను. ఆవెనుక మూడుదినములు లతడతని భక్తివిషయముతప్ప నితరము మాట్లాడయోచించజాలక పోయెను. రాముడు, శివుడు, కాళి, కృష్ణుడు, ఏసుక్రీస్తు మొదలగు దేవతలయొక్కయు, జ్ఞానులయొక్కయు చర్యలిట్లుండును. ఇట్లు వివిధ మతానుభవంబులైన వెనుక, నన్నిమతము లఖండసచ్చిదానంద స్వరూపముయొక్క వివిధభావముల నొక్కొకటిని సూచించును గనుక యన్నియు సత్యమని నిర్ధారపరచి వివిధమతములు మోక్షమార్గములని బోధించుచుండెను.

ఈ కాలమంతయు దాను సంసారియని మరచిపోయియుండెను. తన దేహస్థితి భావమును మరచినవ్వాని కిదేమి యాశ్చర్యము. అతడు జ్ఞానసిద్ధిబొందినవేళకు నతని భార్య పదునేడు, లేక పదునెనిమిది సంవత్సరములు వయస్సుగలదాయెను. తన మగనికి పిచ్చిపట్టినదని జనవాక్యమువల్ల విని చాలా వ్యసనాక్రాంతురాలై యుండెను. తరువాత నతడు కేవలభక్తుడాయెనని విని యతనినిజూచి యతనినుండియే తన తలవ్రాత దెల్సి

యవలెనని నిశ్చయించి తన తల్లియాజ్ఞ గైకొని సుమారు నలువది మైళ్లదూరమునుండు దక్షిణేశ్వర దేవాలయమునకు బాదచారియై వెళ్లెను రామకృష్ణుఁడామె నత్యంత దయతో నాదరించి పూర్వపు రామకృష్ణుడు చచ్చినాడని యు క్రొత్తవాడు లోకమున నెవరిని భార్యగా గ్రహించ జాలడనియు నామెను జగన్మాతయైన కాళిస్వరూపముగాదప్ప నితరభావమున జూడజాలననియు నామెకు జెప్పెను. వెనుక నామెను అమ్మాయనిపిలచి పుష్ప సుగంధవాసనలతో నామెను బూజించి యామెనుండి వరములడిగి దీర్ఘసమాధి పరవశుడయ్యెను. ఇట్టి గౌరవపాత్రమైన నా భార్యయు మగనిగా నతనియొద్దనుండి యేమియు గోరలేదనియు, యతని సమీపమునుండి యతని యాహారము సిద్ధము జేయుచు నతనికి గావలశిన యుపచారముమాత్రము జేయ నిశ్చయించి వచ్చినాననియు దైవస్వరూపానుభవమార్గము దనకు జూపవలెననియు నతనినిగూర్చి ప్రార్థించెను. ఆనాడు మొదలుకొని యామె యా దేవాలయప్రాకారమున వాసముజేయుచు నతడు బోధించిన సాధనముల నభ్యసించుచుండెను రామకృష్ణుని భక్తుడైన మధురనాథుడామెకు పదివేలరూపాయల నివ్వ యత్నించ నామె దన మగడు సకలభోగభాగ్యములను నిరాకరించి సిద్ధిపొందినాడనియు, నామె యతనిమార్గము నవలంబించుచున్నదిగనుక యతని ప్రార్థనను నిరాకరించెను. ఆమె మగనిని దైవస్వరూపముగా భావించి యతని దివ్యబోధ ననేకశిష్యులకు బోధించుచు సదాచార ప్రవర్తనమున నిప్పటికి జీవితురాలై యున్నది.

రామకృష్ణుడు విద్యావంతుడుగాకున్నను, ఒకసారి విన్నమాత్రమున దానిని మరవడు. అపరవయస్సున నధ్యాత్మరామాయణమ వినగోరి తన శిష్యులలో నొకనిని దానిని జదువమనెను. అతడు వినుచుండ మరియొక శిష్యుడతనిని యా గ్రంథముగ్రాహ్యమగుచున్నదాయని యడుగ పూర్వము విన్నదానివలెనున్నదని యనెను. వెనుక ముందు వచ్చు శ్లోకమును దాను స్మరించి వాటి యర్థము జెప్పసాగెను. అతడు గొప్ప యోగసిద్ధులనుబొందియున్నను వాని నితరులకు ప్రదర్శింప ప్రయత్నముజేయడయ్యెను. యోగాభ్యాసమునుండువారికి నట్టి సిద్ధులు స్వాభావికముగా గలుగుననియు వాని విషయకమైన జనులవాక్యములను లక్ష్యపెట్టగూడదనియు నతడు సెప్పుచుండెను. ఆ సిద్ధులతో లోకము నానందింపజేయగూడదనియు, పరమజ్ఞానసిద్ధినిబొందుటకు ప్రయత్నముజేయవలెననియు, నట్టి విచిత్రములుజేయ జ్ఞానమార్గమునకు నాటంకములనియు శ్రద్ధాభక్తులను దగ్గించుననియు, నతడు సెప్పుచుండెను. అయితే సంకల్పము గ్రహిం

చుట, ముందుగా బోవునది జెప్పుట, మారదృష్టి, సంకల్పమాత్రమున వ్యాధి నివారించుట, మొదలగు సిద్ధులుమాత్రమతనియందు సాధారణముగా మెండుగానుండెను. దేహస్పర్శమాత్రమున నొకనిసంకల్పములు మారునట్లుజేయు సిద్ధిమాత్ర మతడు మనఃపూర్వకముగా బ్రయోగింపుచుండెను. ఈస్పర్శవల్ల గొందరు సమాధినిబొందుచుండిరి. కొందరికి దేవతాదర్శనములగుచుండెను. కొందరి మనోగతి వేరయి మతాచారములును నిరాటంకముగా నవలంబించ సాగనంబారయెను. విషయాసక్తులగువారు తమ పూర్వమార్గమున నడువనిచ్ఛలేనివారైరి.

ఆ సమయమున మధురనాధుడు తన కుటుంబముతో తీర్థయాత్ర వెళ్ల సిద్ధమై రామకృష్ణునితోగూడ బ్రయాణమైరి. బృందావనమువరకునున్న సకల దివ్యక్షేత్రములును జూచిరి. రామకృష్ణుడు దేవతాదర్శనముజేసుకొనుటయెగాక యచ్చటచ్చటనున్న మహనీయుల, సన్యాసుల పరిచయముజేసుకొనుచు, వారితో జ్ఞానప్రసంగములు జేయుచు, తన జ్ఞానదార్ఢ్యముజేసుకొనుచుండెను. అనేక సాధువులతని జ్ఞానమునకు మెచ్చి యతడు బ్రహ్మజ్ఞానిగాక యతిడొక గొప్ప మతాచార్యుడనియు. దేవునియవతారమేయనియుగూడ మర్యాదజేయుచుండిరి. బృందావనములోని దివ్య ప్రకృతి విలాసములనుగని యచ్చటి సహవాసములనుజూచి కవలానంద పరవశుడై యచ్చట నే నివాసముజేయ నుద్దేశించెనుగాని తన ముసలితల్లియొక్క స్మరణ మనసున నతనికి దగులమరలెను. తీర్థయాత్రలనుండి వెనుకకు దిరిగివచ్చునప్పుడు వైద్యనాథముదగ్గిరనుండు నొక పల్లెలో జనులు కష్టపడుచుండ జూడ నోర్వజాలక బిగ్గరగ నేడువసాగెను. ఆ జనులు సుఖితులుగాజేయువరకు నచ్చటనుండి పోవనిష్టపడకయుండిన మధురనాధుడా యూరనున్నవారికందరికి ననేకదినములాహారమిచ్చుచు వస్త్రము ధనములిచ్చుచు రామకృష్ణుడు ప్రీతిజెందిన తరువాత ముందు బ్రయాణమైరి. గులాబిపుష్పము వికశించి తన సువాసన చుట్టు బ్రసరింప తుమ్మెదలు దమంతట తామచ్చటికివచ్చును. తుమ్మెదలు వికసించిన గులాబిపుష్పము నపేక్షించునుగాని పుష్పము తుమ్మెదలనపేక్షించదు. అని శ్రీరామకృష్ణుడు చెప్పుచున్నప్రకారము అనేక జాతిమతములకుజేరిన ముముక్షువులతనిజాట్టు బోధను గ్రహింపజేరుచుండిరి. ప్రొద్దుపుట్టినదిమొదలు సూర్యాస్తమయమువరకు నాహారము తీసుకొన నవకాశములేక బోధయందును, ప్రోత్సాహపరచుటయందును, ఆకలిదప్పి గలిగిన వేలాంతరజనుల కొరతలు నివారించుటయందును కాలమతనికి జాలదయ్యెను. అమ్భుతయోగశక్తి గలిగిన పండితసార్వభౌముల నిరక్షరదక్షిణేశ్వర పరమహంస

యొద్దకువచ్చి యతనిజ్ఞానాధిక్య మంగీకరించి యతని కల్యాణసౌహార్దము శుద్ధనిరహంకారత్వము పరమతత్త్వములను బ్రతిపాదించు నవలసుఖకరశైలికి నాశ్చర్యపడి య నేకులతని గురువుగా గ్రహించిరి.

1866-వ సంవత్సరమున దక్షిణేశ్వర దేవాలయమునకు రెండుమైళ్లదూరమున నుండు బెల్గెరియా యను తోటయందు గృహముగాపించుకొని యేకాంతముగా గీషప్ చందర్ శేణ అనునతడు తపస్సుజేయుచుండ రామకృష్ణుడుపిని యతని జూడవెళ్లెను. రామకృష్ణుని జ్ఞానామృతసారభూతిమయిన మధురవాక్యములనువిని యతని యాశ్చర్యమైన దేవతాభక్తిని, సమాధిస్థితులను, విని యతనియొద్దకు, బలుమారు పోవుచువచ్చెను. అతడు రామకృష్ణుని పాదములసేవ ఘంటలకొలదిచేయుచు పరవశుడై యతని దివ్యవాక్యములను గమనించుచుండెను. అప్పుడప్పుడు రామకృష్ణుడు సమాధినిజెందుచుండ నితడు దాను పవిత్రుడగుననియెంచి పలుమారు పాదసేవజేయుచుండెను. ఒక్కొక్కవేళ పరమహంసుని దనయింటికి గొనిపోయి, యొకపడవనెక్కి కొంతకాలము నదిలో విహరించుచుండిరి. అప్పుడు తన సంశయములన్నియు మాన్పుకొనుటకు ప్రశ్నజేయుచుండెను. వారిద్దరి స్నేహమైక్యమై కేశబ్ యొక్క యభిప్రాయములుమారి రామకృష్ణుని బోధామృతసారమును సూచించు వాక్యములనే లోకమునకు బోధింపసాగెను. రామకృష్ణుని బోధలను సంగ్రహించి యితడు ప్రచురముజేసెను. అంతవరకు నీతనివిషయము కలకత్తాలోనుండు వారికగోచరముగానుండి యప్పుడు రామకృష్ణుని ప్రభావమందరికిని దెలిసినదాయెను. అప్పటినుంచి కలకత్తాలోని జనులతనియొద్దకుబోవ నారంభించి యతని బోధామృతముల గ్రోలి సంతసించిరి. రాత్రికాలమునగూడ గొందరు భక్తులతనియొద్దనుండుటంజేసి యతడు నిద్రమరచివిసుకక భక్తిజ్ఞాన విషయములందును తన యనుభవవిషయములందును జ్ఞానసిద్ధి యెట్లుపొందినదియు శిష్యులకు జెప్పుచుండెను. ఇట్లహోరాత్రులు ప్రయాసపడుటవల్ల దేహారోగ్యము జెడినను విశ్రమించక జనులగుంపు లెక్కువకాగా బూర్వమువలె బోధించుచునే యుండెను. ఒక జీవుని కడతేరునట్లు జేయ సాధ్యముండిన నెన్ని సహస్రబాధలనైనను బడుటకు నిష్టపడుదునని చెప్పుచుండెను.

1885-వ సంవత్సరమున యతనికి నొక గొప్పవ్యాధిగలిగెను. అతనిని గలకత్తాకు పిలుచుకొనివచ్చి గొప్పవైద్యులచే చికిత్సచేయించిరి. కేవల మౌనమును వహించవలెనని వారు జెప్పినను, అతనికి నూరకుండ సాధ్యములేకపోయెను. అనేక

స్త్రీలు పురుషులతని వెంబడింప నతని నోటనుండి వచ్చుమాట నత్యాసక్తితో వినగోరు వారి తాపములను జూచి యోర్వజాలక దయారస పరిపూర్ణుడు గనుక బోధజేయుచునే యుండెను. అట్లుండ సమాధిలో నప్పుడప్పుడు మునుగుచు, తన దేహవ్యాధి స్మరణలేక, ప్రజ్ఞతప్పి సమాధిలో మునుగుచు ప్రజ్ఞవచ్చిన వెనుక మునుపటివలె బోధజేయ ప్రారంభించెను. ద్రవరూపమైన యాహారముగూడ గొంతులో దిగకుండనుండునప్పుడు తాను మాట్లాడు ప్రయత్నము మానడు. అతడు సాధారణముగా నిర్భయుడై కేవలానంద పరవశుడై యుండెను.

1886-వ సంవత్సరమున నాగస్టు 16-వ తారీఖున రాత్రి పదిగంటలప్పుడు సమాధికి వెళ్లి మరల బహిర్ముఖుడు కాలేదు. అతని ప్రజ్ఞ మనకు గొప్పదుగాక !

శ్రీ కృష్ణార్పణం.

## మో హ ము.

అంత నా హరిణపోతము నీట దేలియాడుచుండుట భరతుండు గనిపెట్టి జూచి దయార్ద్ర హృదయుడై దానిని తన యాశ్రమమునకుం గొనిపోయి యధిక ప్రేమచే పెంచుచుండె. ఇట్లు నానాటి నాయది భోగణాలలందధిక ప్రేమజేయుచుండగ నాతని తపంబంతకంతకు క్షీణించుచుండె. మరియు, అహర్నిశంబులా హరిణిం జూచుచు సర్వావస్థలం దెడబాయక నధిక మోహంబుచే బెంచుచుండె నొక్కనాడా మృగంబు గానంబడదయ్యె. అంత నతడధిక వ్యాకులచిత్తుడై మనంబున దుఃఖించి యిట్లనియె: "ఈ హరిణంబు నా యాశ్రమంబునను దృశాలల దినుటకై యిటు నటు ప్రియముగా తిరిగియాడు; నే ధ్యానసమాధియందుండ కొమ్ములచే గోకుచు, పద్మాసనాసీనుడై యుండ తొడపై పవ్వళించి నన్ను సంతోషింప జేయుచు, దేవపూజా ద్రవ్యంబులు ద్రొక్కి నే కోపించిన నా వెనుక నుండు నే కరుణించి పిలిచిన నా మోమునం దన మోము జేర్చి కన్నీరుగార్చుచు మన్నింపుటకై దనయాటలం జూపుచు కాలంబు గడుపుచుండు. ఇట్టి హరిణపోతంబు నే నెట్లు గాంతు, నానాప్రకారంబులైన తన గతులచే నన్నెప్పుడానందమొందించునని యనేకవిధముల తనలో దాను ప్రలాపించుచుండిన సమయమున నా రాజర్షి యెదుట కెచ్చటనుండియో యామృగము హటాత్తుగ జనుదెంచి యాతని వియోగతాపంబు నివర్తింపజేయ నా భరతుండమందానంద భరితుడయ్యె. ఇట్లుండ కొంతకాలమునకు మృత్యువు సమీపింప దైవయోగంబున

ఘటించిన యాహారిణియం దధిక మోహితాత్ముడై తదేకధ్యానముచే శరీరము బాసి క్రమ్మర హారిణీగర్భంబున హారిణియైజనించి పూర్వ తపో మహిమచే నిట్లు జింతించె "శ్రీహరిశ్రవణ, మనన, కీర్తనారాధన తత్పరుడనై, యోగియైన నాకు మరణకాలమున హారిణపోత స్మరణసంప్రాప్తంబగుటంజేసి హరిణదేహినై మోక్షదూరుండనైతిననని" వ్యాకులచిత్తుడై క్రమ్మర సాలగ్రామ సన్నిధియగు గండకీతీరమున పులస్త్యాశ్రమమున తృణచయాదులచే సంతసింపుచు మృగదేహత్యాగావసానంబుగోరుచు కొంతకాలంబు గడపి కాలము సమీపింప దేహంబు బాసి వేదాధ్యయన సంపన్నుండును షట్కర్మ నిరతుండునగు నాంగీరసుండను బ్రాహ్మణోత్తముని గనిష్ట భార్యయందు బుత్రుడై జనించి విషయాత్మకమగు మోహము జన్మపరంపరలకు గారణంబని నిస్సంగుడై యున్మత్త వేషంబున జరించుచుండె.

ఇట్లుండిన కొమరునికి దండ్రి శిష్టాచారముగ వేదాధ్యయనాదు లుపదేశించి తాను మోక్షాసక్తుడై యుండు కొంత కాలమునకు దేహాతీతుండయ్యె. అంతట సవతి కొమరు లాతని వేదాధ్యయనముల బాప గృహకర్మములనియమించి చేనికావలి బెట్టిరు. మత్తుడగు నారాజర్షి స్వైరవశాత్తున ఘటించిన, నూక, తవుడు, పొట్టు, అను మొదలగు పదార్థముల మృతతుల్యముగ నెంచి భుజించుచు శ్రీహరిధ్యాన తత్పరుడై యా చేనియందు తపంబాచరించుచు సంతతానందుడై కావలి యుండ నొక్కనాడా దేశపురాజైన వృషలపతి సంతానకాముడై కాళికాదేవిని బూజించుచు నొక బురుష పశువును గాళికియ్యదలంచి భృత్యుల నాజ్ఞాపించ నాభృత్యులెచ్చటచ్చట వెదకుచు చేనియందు తపంబారించుచున్న నానిర్వైరుడైన యోగివర్యునిగొనిపోయి యభ్యంగనాదులు సల్పి, దివ్యాభరణాదుల నలంకరించి నూతనవస్త్రముగట్టి మృష్టాన్నము బెట్టి, సువాద్యములచే నాతనిగొనిపోయి గాళికనెదుట నిలుపివృషలపతి మనోభీష్టసిద్ధికై చేత ఖడ్గముబూని గాళిని సంతోషపెట్టుటకై నావిప్రవర్యుని బలియిచ్చుటకెత్తించ నాకాళి తన నెదుటయుండిన, ధూళిచే కప్పంబడిన మాణిక్యంబుబోలె గూఢోన్మత్తోచ్ఛాదియైన బ్రహ్మవర్చస్సుముంగని భయోత్పాదియై భృత్యజనవర్గ సమేతుడైన నావృషలపతిని కోపాగ్నిచే పృథ్విమీదగూల్చె అంత నాతపస్వి కాళికానిగ్రహముచే వెడలి స్వస్థానమున కరిగె. అంత కొద్దికాలమునకు రహూగణుడను సింధుభూపాలుడు కపిలమహర్షిచే తత్త్వము బడయగోరి సిబికారోహుడై జనుదెంచుచున్న సమయమున దోవమధ్యమున నొక సేవకుడు గానరానందున రాజు గోపించుననుభీతిచే మరొక సేవకుడచ్చట

చ్చట వెదకుచు తుదకు చేనియం దానందుడై ధ్యానపరుడైన యోగిపుంగవునింగని యితడర్హుడంచు దెచ్చి యాసిబికమును మోపింప నాతడు న్మత్తుకైవడి మారాదక మిట్ట పల్లముల నెంచక జనుచుండుట యారాజుగని దనకు శరీరాయాసంబు గలుగుట చే నాయున్మత్తుని గోపించి నిష్ఠురోక్తులు బలుక బ్రహ్మనిష్ఠా గరిష్ఠుండైన రాజర్షి నిట్లనియె; రాజేంద్రా! స్వభావజన్యమైన యజ్ఞానము నెడబాయ లేక వసుంధరాధి పతినైన నీవు నేదేహమున కలసట జెందించితనని కోపింప నక్కరలేదు. అందుల కై నేఖేదజెందను. ఏలన కామక్రోధములు, యిచ్ఛాద్వేషములు, జరామరణములు దేహం బులతోడజనియించు. మరియు రాజభృత్యసంబంధములు వివిధకృత్యములంజేసి శరీ రంబునకుగాని ఆత్మకుగాదు గాన నట్టియాత్మ సర్వాంతర్యామి యగుటంజేసి నీవు రాజను అభిమానముచేత నన్నాజ్ఞాపించుట నిరర్థకంబుగాన నాపూర్వకర్మశేషంబు పరిపాకంబగుట కీభారము మోపించుట కర్తవ్యంబని నాబల్లకి మోయుచు జను నెడ నారాజోత్తముడు తత్వజ్ఞానాపేక్షితుడైనందున, సర్వశాస్త్రసమ్మతంబయిన రాజర్షి వాక్యంబులు విని యమితానందుడై తటాలున బలకిదిగి యారాజర్షికి సాగిలబడి యిట్లనియె. విప్రోత్తమా! నిస్సంగుడవై యున్మత్తుకైవడి లోకరక్షణార్థమై యవ ధూత వేషంబున నీమహిమ నేనెరుంగనైతి నాకఠినోక్తులకై మన్నింప వేడెదనని శరణాగతుడైన రాజునుజూచి దయార్ద్రహృదయుడై యోగిపుంగవుండిట్లనియె. రాజోత్తమా! నిత్యానిత్య విచారము లేక, ఐహిక భోగములయందభిమానివై యుండుట చోద్యము. జ్ఞానస్వరూపమగు బ్రహ్మముకంటె వేరొండు సత్యరూపంబు లేదు. ఎట్లన్న పరమాణువుల సముదాయములచే ధరిత్రియైనరీతి, నవిద్యామనంబులచే భ్రమమూలంబైన జగత్తు గల్పింపంబడియె. భ్రమదీరిన ప్రపంచముదీరు. మరియు యనేక మేఘసమూహములచే నావరింపబడిన నిర్మలమైన యాకాశము మబ్బుగనగు పడుచుండి గొప్ప గాలస్పర్శచే నవి విచ్ఛిన్నమైన స్వచ్ఛమగు యాకాశపు నిర్మలత్వ మగుపడురీతి, నవిద్యచే నావరింపబడిన బ్రహ్మమునందే సకల మాయాప్రపంచ మున్నట్టుదోచి, యాయవిద్య విచ్ఛిన్నమైన బ్రహ్మస్వరూపమగుపడు. మరియు సముద్రమున గాలిచే గొప్పయలలుగన్పడి నాగాలి వీచనిసమయమున నలలు గన్పడని రీతి, నవిద్యాసంబంధ మున్నంతమట్టుకు ప్రపంచమున్నట్టు దోచి యాసంబంధము వీడ ప్రపంచము లేనిదగును.

గానీ నిట్టి మాయాప్రపంచంబున సకలప్రాణులు మోహవశులై యుండు రట్టి మోహముచే జీవులసంఖ్యాకములైన నీచజన్మాదులంబుట్టి గాలానుసారంబున సుఖ

దుఃఖంబు లనుభవింపంజేయుగాన నీవు నిరభిమానివై శ్రీహరిపదధ్యాన కుతూహలుండవై సంతతాభ్యాసంబువలన మోహంబు వీడిన మోక్షంబు సిద్ధించుననని యా రాజర్షి రాజునకుపదేశించి యంతర్ధానంబు నొందెను. గాన నీవును విచారంబులేని సంకల్పంబునకు జిక్కక సత్యంబగు బ్రహ్మంబును బుద్ధిచే విచారించి యసత్యంబగు దృశ్యంబును జక్కగా విడిచి, సచ్చిదానందమై నిర్వికల్పంబైన యాత్మతత్వంబొక్కటియే ప్రకాశింపుచుండ వ్యర్థంబుగా బద్ధుండవనిదలచి మోహంబు జెందకుండు'' మని శ్రీశుక యోగీంద్రుండుపరీక్షిన్నరేంద్రునకుపదేశించి, యాతని యజ్ఞానమును బాపెగాన విషయాత్మకమగు మోహము జన్మపరంపరలకు గారణము గనుక నట్టి జన్మాదులనతిక్రమించుటకు శ్లో॥ ''శృణ్వం గాయం గృణంత్యభీక్ష్ణశః। స్మరం నందం తవేహితంజనాః। తఏవపశ్యంత్యచిరేణతావకం। భవప్రవాహోపరమంపదాంబుజం॥'' అనగా అపరమాత్ముని చరిత్ర యెవ్వరు విందురో, స్తుతింతురో, పాడుదురో, తలతురో, మిక్కిలి సంతసింతురో వారలే త్వరలో సంసారప్రవాహమును హరించెడు నాతని పదాంబుజము గందురు. గనుక నట్టి పరమాత్ముని చింతించుటకు సకలేంద్రియములను బాహ్యవ్యాపారశూన్యములుగ జేసి, మనస్సును విషయాదులనుండి మరల్చి శ్రీపరమాత్ముని పాదపద్మమున లయమొనరించి, అంతర్నిష్ఠ సమాధినిష్ఠులై అత్యాదరముతో స్తోత్రము జేయు హృదయాకాశమునందు పరమాత్మ క్రమక్రమముగా దనసందర్శనమునకై యపరోక్షజ్ఞానమును గలుగజేయును గనుక పరమాత్ముడు సులభుడు. ఇట్టి శ్రీహరిస్మరణరహితులై, ఐహికాదుల మోహితులై, అజ్ఞానాంధకారమగ్నులై, నశ్వరమైన దారాపుత్రాదులంగూడి నెడతెగని దుఃఖముల జెందక భవసాగరమును దరించుటకు స్రక్చందనాద్యష్టైశ్వర్యంబులందాసక్తివదలి సాధువుల సంగమంబులందును సచ్ఛాస్త్రంబులయందు నాసక్తిగలిగి మనన, నిధి, ధ్యాసనాదుల నభ్యసించి నీసర్వంబును శ్రీపరమాత్మ మహిమయను సర్వోత్కృష్టమగుబుద్ధిని బొందుటకు భక్తి, అభ్యాసయోగాదులందాసక్తిగలిగి అభ్యసింపవలెను. మరియును మనస్సును విషయాదులనుండి మరల్చుటకు అభ్యాసము ముఖ్యసాధనమని శ్రీకృష్ణమూర్తి యర్జునునిగూర్చి:—

శ్లో॥ యతోయతోనిశ్చరతి మనశ్చంచలమస్థిరమ్
తతస్తతోనియమ్యైతదాత్మన్యేవవశంనయేత్॥

అనగా మనస్సు నిలుకడలేక చలనస్వభావము కలది గనుక యేవిషయములందు ప్రవర్తించుటకయి లోపలనుండి బయలువెడలునో ఆయావిషయములలో

నుండి యీమనస్సును ద్రిప్పి ఆత్మయందే నిలుచులాగున జేయవలసినది అట్లు గాకుండిన

శ్లో॥ అథచిత్తంసమాధాతుం న శక్నోషి మయిస్థిరం।
అభ్యాసయోగేనతతో మామిచ్ఛాప్తుం ధనంజయ॥

ఓ ధనంజయా, ఇంకను చిత్తము నాయందు స్థిరముగా నిలుపుటకు శక్తుడవు గాక పోతివేని, అటుపైన చలించెడి మనస్సును అన్యవిషయములలోనుండి మరల్చి మాటిమాటికి నాయందు నిలుపుటకు నభ్యసించుచు భక్తిచే నన్ను జేరుటకు కోరుమని బోధించినట్లు శ్రీగీతాప్రమాణమున్నందున యట్టి చలమైన భక్తిచే నతని ధ్యాన మభ్యసించుటతప్ప, ఆచారముగాని, వయస్సునకుగాని, విద్యనుగాని, జాతిగాని, రూపమునకుగాని, సౌందర్యపౌరుషాదులకుగాని, యింక మరదేనికైనను యీచిదానందుడు వశ్యుడుగా నేరడు. తొల్లి వ్యాసాదులును, వ్యాధుడును, గజేంద్రుడును, విదురుడును, కుబ్జయు, భక్తియుక్తమగు అభ్యాసముచే మోక్షము జెందిరి గాన విషయాత్మకమగు మోహమును నిర్మూలముజేయునట్టి భక్తి, జ్ఞాన వైరాగ్యములను సాధనముల నభ్యసించుటకు నా సచ్చిదానందుడెల్లరకు ప్రేరేపించుగాక.

ముముక్షువు.

## మనమాతృభూమి నెట్లుద్ధరింపవచ్చును.

జన్మ జన్మమునందు గలుగబోవు ననుభవమువల్ల జీవుడు క్రమముగా వృద్ధియగునని మెందరెరిగితిమికాదా! స్వభావమునకే విడిచి మేని బహుజన్మములు గడచుట వరకు జీవుడు పరిపాకము నొంద నేరడు. ఇది యటుండగాక, వివేక విచారములతోడ సులభముగ నేర్వగలిగిన యనేక పాఠములను సంకటపడి యిరుకులకు జిక్కియీగుట కసాధ్యమైన వివిధ దుఃఖములతోడ నేర్వవలసివచ్చును. ఈ రహస్యము నెరిగిన మన ఋషులు జీవుడభివృద్ధి జెందుటకు స్వభావశక్తులనే నుపయోగపరచుటకు వీలుగల వర్ణాశ్రమ ధర్మము సదుపాయమును గల్పించియున్నారు. ఈ వర్ణాశ్రమములయందు వేర్వేరు ధర్మముల నేర్పరచియుండుటయే గాక వాటి ననువర్తించి నడచువారికి జ్ఞానసంస్కారమగునట్లున్నది. మానవోన్నతికి నీవర్ణములు సోపానములగనున్నవి లోకహితమునకు నివియుపాయములుగనున్నవి.

మానవోన్నతిరచనయందు శూద్రవర్ణము మొదటి సోపానము. మనుష్యలోకమునందు వీరి చేతనే లోకహితము కావలెనను నియమముగలదు. శూద్రుడు

లోకహితమునకు గావలసిన దేహబలసామగ్రిని యొదగించవలెను. తత్వజ్ఞాన మార్గమునం బాలుడగు ని శూద్రునియందు వేరుశక్తులు ప్రబలియుండవు శక్తికొలది యివ్వవచ్చునేగాని తనశక్తిలేనపు డిచ్చుటతటస్థించదు. మొదట సోపానమునందు నిలిచియుండు అపక్వమైన శూద్రవర్ణపు జీవునికి మనస్సుగాని బుద్ధిగాని పరిపాకము నొందియుండవు గనుక నే వీరికి ధర్మములు కూడా సులభమైనవిగానున్నవి. లోకహిత కార్యమునం దితనికి నధికారముతక్కువ ఏలనన ఆంతరికశక్తి తక్కువగ నుండును. తనకంచితమైన ధర్మమును సరిగా నెరవేర్చిన తాను ఆదరించి లోకమును దరింపగలడు. ప్రస్తవర్ణమునకు విధించిన నియమములో మనుష్యుడు స్వప్రయోజనమును క్రమముగా విడువవలెనను గుణమును నేర్పుచున్నవి. నిర్బంధములు హెచ్చిన కొలది పరసహాయమునకు యోగ్యతను కలుగచేయును. శూద్రవర్ణస్థునికి నిర్బంధములు తక్కువ. అధికారము తక్కువ. లోకసేవయు తక్కువగనే యుండును. ఏలనన దేహబలముచేత గలుగు సహాయము మాత్రమే యితనివల్లగాదగ్గది. ఈ ధర్మమును మన పూర్వీకము గనాచరించెనేని శూద్రుడు కృతార్థుడై ఉత్తమవర్ణమునకుపోగలడు. తనకు యోగ్యమైన ధర్మము చేయని యొవడు దీని ననుసరించడో యట్టివాడు సంస్కారియగుట కష్టము. తనకిచ్చిన పనిని సరిగాచేయని సేవకునివలె దేవుడు దురభిమానముచేత తన ధర్మమును నెరవేర్చనివానినియాదరించడని "శ్రేయస్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్" అని శ్రీకృష్ణభగవానులు అర్జునునికి బోధించియుండుటంబట్టి తన ధర్మము విషముగ నున్నను పరధర్మమును సేయుటకంటె శ్రేష్ఠము. ఈ సంగతిని ప్రకృతము లోకులందరు బాగుగ దెలిసికొనవలసినది. ఈ వర్ణమునకు విహితమైన ధర్మములనాచరించెనేని, వృద్ధినొంది ఉత్తమమైన వైశ్యవర్ణమునకు జీవుడుబోవును. "పరిచర్యాత్మకం కర్మశూద్రస్యాపి స్వభావజం" అని గీతావాక్యముండుటంబట్టి శూద్రునికి సహజమైన కర్మముగనున్నది.

వైశ్యవర్ణమునందు జన్మించిన జీవుడు శూద్రవర్ణమునందు పరిచర్యముచే గలుగు ననుభవజన్యజ్ఞానమును గలిగియుండును. "కృషిగోరక్ష్యవాణిజ్యం వైశ్యకర్మస్వభావజం" అని గీతాశాస్త్రమునందు చెప్పియుండుటవల్ల వ్యవసాయము. గోసంరక్షణ, వ్యాపారము ఇవిమూడును వైశ్యునికి స్వభావధర్మములుగా నున్నవి, లోకసేవకు తనదేహబలమును మాత్రము దారబోసి యీస్థితికివచ్చిన జీవునికి లోకభారము హెచ్చినదేగాక దానికి తగునట్టి ధర్మములుగూడ సూక్ష్మములగును ఈ ధర్మములను సరిగా నెరవేర్చినచో జీవుడు సంస్కారియై పైకెక్కుటకు జనసముదాయ

మునకు గావలసిన యాహారాద్యుపపత్తులు ధర్మశాలలు వైద్యశాలలు మొదలగునవి యన్నియు వైశ్యవర్ణస్థులచే గావలసినది గనుక వైశ్యులు ధనికులగనుండవలెను. ధనికులుగనుండుటచే తమస్వప్రయోజనమును మాత్రము చూడవలెనని యర్థముకాదు. లోకమునకుగావలసిన సమస్తయుపపత్తులను దమ స్వాధీనమున నుంచుకొని యవశ్యకముకొలదిలోకుల కిచ్చుటయే వీనికి నియామకమైన ధర్మము. లోకమునందుగల సమస్తమునకును దేవుడొక్కడే యజమానుడు. అయితే తాను నిర్వహించవలసిన కార్యముల ననేకులకు బంచియున్నాడు. అట్లు పంచియుండిన వాటిలోనే నేకర్తయని నరభిమానముతో విఱ్ఱవీగుట జ్ఞానవంతులగు మనుష్యులకు యోగ్యమైనదికాదు. ఇంటియందు అనేక బొరియలున్నచో వాటిలో చేరియుండు ఎలుకలా బొరియలుతమవని భావించి యుండుటెట్లో యటులనే యీశ్వరాధనమగు లోకమును మనదనియెంచి పరిమితిగలుగ చేసికొనుట గనుక వైశ్యవర్ణమునందుగల జీవుడు ధనికులు గావలెననుటకు నర్థమేమన, లోకమునకు నవశ్యకమైన ధర్మశాలలును వైద్యశాలలునుగుడిగోపురములును, గట్టించి యాహారపదార్థములును జనసముదాయమునకు నుపయోగమగునట్లు సిద్ధపరిచియుండుటని యర్థము.

అభిమానత్యాగమునకు నిది రెండవమెట్టు. లోకహితమునకై దనశరీరమునే దారబోసిన శూద్రుడు దేహాభిమానమును వదలినవాడగును. ధనమును సంపాదించియు లోకహితమునకు నానాసుఖములుగ దారబోసిన వైశ్యుడు ప్రపంచపదార్థములయందు నిరభిమానుడగుట దటిస్థంచును.

వైశ్యవర్ణపు ధర్మమును సరిగా నెరవేర్చిన జీవుడు క్షత్రియవర్ణమునకెక్కును. జనసముదాయమునందు న్యాయనిబంధనములను వ్యాపంపజేసి వారి యాచారవ్యవహారములను బాలించుచు వారప్రాణమునకు హాసకలుగునెని తిన దేహమునైనన నిచ్చి కాపాడు క్షత్రియుడు సాక్షాత్ దేవునియొక్క ప్రతినిధిగనుండును. తన సుఖమునకుగాను రాజ్యమున్నదను క్షత్రియుడు దుఃఖియగును. శ్రీరామచంద్రునివలె లోకహితమే ముఖ్యమనియెంచి రాజ్యపరిపాలనచేయు క్షత్రియుడు సద్ధర్మపరిపాలకుడగును. ఇక్కడ స్వాభిమానమునకు నవకాశమెక్కడిది?

క్షత్రియధర్మమును బరిపాలించి యనుభవము జెందిన జీవుడు బ్రాహ్మణవర్ణమునకు బోవయోగ్యుడగును. బ్రాహ్మణుడు దరిద్రుడగును. ప్రాజ్ఞుడుగనుండవలెను. ప్రపంచవిషయములయందు మోహముగలిగియుండిన ప్రాజ్ఞకలుగదు. పరిపూర్ణముగ నభిమానత్యాగము ఈవర్ణమునందుగలుగును.

అభ్యాసి.

ఆ సమయమున యజ్ఞహవిస్సునంగీకరించ జేరిన దేవతాసభయందు దేవతలందరు లోక కంటకుడైన రావణుడు సేయు నుపద్రవములను మహావిష్ణువునకుమనివిజేయ నతడు భూలోకమున మనిషిరూపమున నవతరించ నొప్పుకొనెను. రావణుడు ఘోరతపస్సు జేసి యెవరిచేత జంపబడకూడదను వరమును బ్రహ్మనువేడునప్పుడు మానవునిచే దాను జంపబడినను నిశ్చయముతో నా వరమునుమాత్రము గోరకుండినందున రావణవధోపాయము సమకూరనని దేవతలు సంతోషించిరి. బ్రహ్మదేవుడు విష్ణువుయొక్క సహాయమునకై సకలదేవతలను బలముగలవారిని కామరూపులను, వానరరూపులగు పుత్రులను సృజింపుడని నా దేవతలందరాయాజ్ఞానుసారము గంధర్వాప్సరస స్త్రీలయందనేక వేలమంది వానరులను సృజించిరి. బ్రహ్మదేవు డావులించు సమయమున జాంబవంతుడను నెలుగుగొడ్డు బుట్టెను. ఇంద్రుడు వాలిని, సూర్యుడు సుగ్రీవుని, బృహస్పతి తారుని, కుబేరుడు గంధమాదనుని, విశ్వకర్మ నలుని, అగ్ని నీలుని, అశ్వినులు మైదద్వివిదులను, వరుణుడు సుషేణుని, పర్జన్యుడు శరభుని, వాయువు హనుమంతుని బుట్టించిరి. ఇంకను వేలకొలది వానరులను, దేవతలు, మహర్షులు, గంధర్వులు, గరుడులు, యక్షులు, దిగ్గజంబులు, కింపురుషులు, సిద్ధులు, విద్యాధరులు, నాలుగు నప్సరసలందు విద్యాధర స్త్రీలందు నాగకన్యలందు గంధర్వ స్త్రీలయందు బుట్టించిరి. ఆ వానరులందరు మహా పరాక్రమవంతులై యుండిరి. ఆ దశరథుడు యజ్ఞపురుషుడనుగ్రహించిన పాయసమును దన భార్యలగు కౌసల్య కైకయిలకు సమముగా బంచిపెట్టి వెనుక సుమిత్రకుగూడ వారినివ్వమని యాజ్ఞాపించ వారు చెరిసగము సుమిత్రకునిచ్చిరి. అంత నాముగ్గురు గర్భవతులై కౌసల్య కైకయిలు యొక్కొక కుమారుని సుమిత్ర యిద్దరు కుమారులను గన వారికి రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులని యతిముదంబుతో నా మహారాజు నామకరణం బొనరించెను.

వారు క్రమముగా యుక్తవయస్కులుగాగ వారికి వివాహ ప్రయత్నము దశరథుడు సేయ నాలోచించు సమయమున విశ్వామిత్రుడతనియొద్దకు వచ్చెను. అప్పుడు దశరథుడు మహర్షిని నెదుర్కొని యర్ఘ్యపాద్యాదులనిచ్చి సత్కరించి 'మహాత్మా! అమృత లబ్ధమైన, నిర్జలప్రదేశమున వానకురిసిన, సంతానములేనివానికినిజభార్యయందు పుత్రప్రాప్తియైన, నగపడని నిక్షేపము మగలదొరికిన, నుత్సవప్రారంభమున సంతోషము గలిగిన, నెట్టి యానందముగలుగునో యట్టి యానందము మీ రాకవలన నాకుకలిగినది. స్వాగతంబెద్ది? కోరినదియిచ్చెద? నని విశ్వామిత్రుని సన్మానించ, నామర్షి “ నేను

యాగదీక్షను వహించియున్నాను. నా యాగము సమాప్తినొందుసమయమున మారీచ సుబాహులను రాక్షసులు కామరూపులై మాంసరక్తమయమైన వర్షధారలచే నా యజ్ఞమును విఘ్నము జేయుచున్నారు. సుగుణాభిరాముడైన రాముడుదప్ప వేరెవరు వారినిజంపి నిర్విఘ్నముగా నా యజ్ఞమును బూర్తిజేయ జాలరు. రాముని మహాత్మ్యము నేనెరుంగుదును. నీ పురోహితుడైన వసిష్ఠుడెరుంగును. మనిషిమాత్రుడుగాడు. దయచేసి పదిరాత్రులతనిని నా వెంట బంపుమ''ని యా రఘుని ప్రార్థించెను.

అంత నారాజు పుత్రవియోగమునకు మనస్సమాధానమును జేసుకొనజాలక యా మహర్షి మాటలను విన్నమాత్రమున మూర్ఛిల్లి ప్రజ్ఞవచ్చిన వెనుక యతనితో నిట్లు విన్నవించెను.

'మహర్షీ! రాముడు బాలుడు, పదునేండేండ్లవయస్సు గలవాడు, శస్త్రాస్త్ర విద్యలందు నిపుణత నెరుగడు. సంపూర్ణమైన సైన్యముతో వచ్చి నేను రాక్షసులతో యుద్ధముచేసెదను. అరువేలేండ్లు రాజ్యముజేసి పుత్రులనుగానక, యజ్ఞముజేయ బుట్టిన కుమారులలో రాముడు శ్రేష్ఠుడు, ప్రియుడు వానిని విడిచి యొకక్షణమైన నుండజాలను. రావణుడనువాడు ఘోరతపస్సుజేసి యనేక వరములనుబొంది యనంత పరాక్రమముతో లోకమును బాధించు రావణ, సుబాహు, మారీచులనెట్లు రాముడెదురించును. వీరి నెదిరించుటకు నాకుగూడ శక్తిచాలదని తోచెడి. రాముని బంపజాల'నని యతిదీనముతో విన్నవించ, విశ్వామిత్రుడు కోపోద్దీపితుడై యగ్నివలె ప్రజ్వలించుచు 'కోరినది యిచ్చెదనని చెప్పి యిప్పుడు వెనుకకుదీయుచున్నావు. నీ వంశమున నిదివరకు నిట్లు జరుగలేదు. సుఖముగా నుండుమ'ని లేవ ప్రయత్నించెను. అప్పుడు పురోహితుడైన వసిష్ఠుడు 'రాజా పరమధార్మికమగు నిక్ష్వాకువంశమున నీవు జన్మించినావు. నీ వంశజులు ప్రతిజ్ఞాభంగము నెప్పుడు చేసినవారుగారు. ఇతనిచేత రక్షింపబడిన రాముడగ్నిహోత్రునిచేత రక్షింపబడిన యమృతమువలె నుండును. విశ్వామిత్రుండనేక శస్త్రాస్త్ర ప్రయోగనిపుణుడు. భృశాశ్వునకుబుట్టిన నస్త్రంబుల నీశ్వరుడితనికి నిచ్చెను. పూర్వము జయసుప్రభయను వారు రాక్షసుల సంహారమునకై కనిన చేరి యేబది కొడుకులతని స్వాధీనమున నున్నారు. అనేకశాస్త్రములను బుట్టింప నితడు సామర్థ్యముగలవాడు. రాముడుగూడ సామాన్యుడు గాడు. ఇతనివెంట వానిని బంప నిశ్చయించుమ''ని వసిష్ఠుడు సెప్ప దశరథుడు విశ్వామిత్రుని వెంట రామునిబంప నంగీకరించెను. అప్పుడు పుష్పవృష్టి కురిసెను. దేవదుందుభులు ఘోషించెను

66. ఋషులు దేవుని సమీపబంధువులు. వారు దేవుని స్నేహితులు. సహాపంక్తివారు. ఆంతర్యులు. ఇతరులు దేవుని జంతువులు. అతని బాహ్యాంకూటమునకు జేరినవారు.

67. తెంకాయను పగలగొట్ట లోపలి కొబ్బెరతోఁగూడ చిప్పపగులును, గిటకను పగలకొట్ట చిప్పమాత్రము పగిలికొబ్బెరకు హానికలుగదు. ఏసుక్రీస్తుగిటకవంటివాడు. అతని జీవుడు దేహమునకంటె విన్నుడైయుండెను గనుక నతనికి శత్రువులుబెట్టిన దేహబాధ లతనిని నంటలేదు.

68. సాధువు జనసమ్మర్దమైన వీధిలోఁబోవుచుండ నకస్మాత్తుగా నొకగృహస్థుని కాలు త్రొక్కెను. ఆగృహస్థుడు రోషావేశముతో నాసాధువు మూర్ఛబోయి క్రిందపడునట్లు దయారహితముగా గొట్టెను. అతని శిష్యులు చాలాకష్టపడి యతనికి దెలివి తెప్పించుటకు అనేక చికిత్సలు చేసిరి. అతనికి కొంచెము తెలివిరాగానే అయ్యా మిమ్ము నెవరిప్పుడు డాదరించుచున్నారని వారిలో నొకడడుగ నన్ను గొట్టినవాడని సాధువుపలికెను. సాధువులు శత్రుమిత్ర భేదములెంచరు.

69. హంస పాలునుండి నీరు వేరుజేయును. పాలుత్రాగి నీళ్లను ముట్టక విడుచును. యితర పక్షులకు అలాగుచేయవు. ఆలాగు దేవుడు మాయతో గలిసియున్నాడు. సాధారణమైన జనులు దేవుని మాయానున్న రిక్తుడని గ్రహించజాలరు. పరమహంసమాత్రమే మాయను దిరస్కరించి దైవమును గ్రహించును.

70. వాయువు వీచునపుడు శ్రీగంధపువాసనను, మలవాసనను గ్రహించినను, వాటిలో మిళితముకాదు. అట్లు ముక్తుడు వారు ప్రపంచములో జీవనము చేసినను దానిసంగము బొందడు.

71. ముక్తుడు నీటిలోని తామరాకువలె లేక, మంటిలోని కుమ్మరపురుగువలె నుండును.

యీ రెండును తాముండుపదార్థ స్పర్శనుచేత మలినము కావు.

72. నీళ్లు వంతెనలో పారునుగాని నిలువనట్లు ద్రవ్యము ముక్తులచేతుల దాచిపెట్టబడక విని యోగము చేయబడుచుండును.

73. కాల్పబడిన పగ్గము బూడిదయయ్యును దాని రూపమును చెడనట్లు ముక్తునికి నభిమానరూపమున్నను అహంకారముండదు.

74. చీకుబాతు మొదలగు నీటిపక్షులు నీటమునిగిన వాటి రెక్కలు తడువకుండునట్లు ముక్తుడు లోకములోనున్నను లోకము వానిని స్పృశింపదు.

75. గొర్రెతలను దాని మొండెమునుంచి భేదించిన దాని మొండెము జీవచిహ్నము చూపుచు కొంతకాలము, మెదలునట్లు ముక్తుని, యహంకారము చచ్చియున్నను లోకవ్యవహారము బ్రతికియున్నంతవరకు, జనుపుటకు, దాని చైతన్యము, మిగిలియుండును. ఆచైతన్యము లోకాభిమానము మరల కలిగించుటకు శక్తిలేక నుండును.

76. శుద్ధబంగారము చేత నగలు చేయుటకొరకు దానిలో నేదైన లోహము మిశ్రమము జేయవలెను. అట్లు కేవలము మాయారహితమైన మానవుడిరువదియొక్క రోజులకంటె నెక్కువగ జీవించడు. దేహమున్నంతవరకు లేశమాత్రమైన మాయయుండవలసినదే.

77. కన్నామూచి యాటయందు దొంగయాటలోని వారి నొకరిని స్పృశింప సమర్థుడైనవాడు మరల దొంగకానట్లు దేవుని నొక్కసారిచూచిన మానవుడు మరల ప్రపంచబంధమునకుఁ జిక్కడు. ఆయాటలో దొంగ యొకనిని స్పృశించిన వానివెంట నంటక స్వేచ్ఛగా విహరింప నిత్తురు. వాడు మరల దొంగకానట్లు ప్రపంచవిలాసమునందు దేవుని పాదారవిందములు స్పృశించినవానికేలాటి భయము లేదు.

78. స్పర్శవేదితో బంగారముగా జేయఁబడిన యినుము భూమితో పాతబడినను కసువుదిబ్బలో వేయఁబడినను బంగారముగానుండునుగాని పూర్వస్థితి బొందనట్లు దైవసాక్షాత్కారము బొందిన మానవుడు ప్రపంచవ్యవహారములోనున్న నిర్జన వనవాసము చేసినను మాలిన్యము బొందడు.

79. స్పర్శవేదితో నొక కుక్కకత్తి బంగారపుకత్తియగును. పూర్వరూపమునుబొందియున్నను హానిచేయ జాలనట్లు దైవసాక్షాత్కారము బొందినను నీవు నీరూపము చెడకున్నను కీడుజేయడు.

80. సముద్రముననున్న లోహపుకొండ ప్రయాణమైపోవు యోడనాకర్షించి దాని యినుపశీలల నీడ్చిపలకలను వేరుజేసి యాయోడను మున్నీటమునిగించు యఖండస్వరూపియను నాకర్షణశక్తి జీవుని యాకర్షించి యొకక్షణమున నతని యభిమానము స్వార్థంభరిత్వమును నిర్మూలనము జేసి దేవుని నఖండ దయాసముద్రమున ముంచును.

ఇట్టి చలనాత్మకమైన కార్యపరంపరలు ప్రకృతియందు మెండుగ గనబడుచున్నవి. ఆకాశపదార్థమున, నొక దీపము, వేడిమియని మనమనుకొను నొక విధమైన చలనమునకు నిధిగానున్నది. ఈ చలనము, అనగా, వేడియలలు చుట్టునుండు నాకాశపదార్థమున నలలు దమవలె గలుగునట్లుచేయును. వెనుక యీ యలలు సమీపమున నున్న యినుప తునుకయందలి యాకాశపదార్థమును దమవలె జలింపజేయ, నా యినుమునందలి యణువులుగూడ చలించును. అప్పుడాయినుము వేడియగుటగాక తాను వేడిగుణము నితరపదార్థములకు నిచ్చునదియగును. ఇటులనే చలన పరంపరలొక జీవుని నుంచి మఱియొక జీవునకు ప్రసరించుచుండెను. సకల జీవులిట్టి వలరూపకమైన ప్రజ్ఞాస్వరూపమున పరస్పర సంబంధము గలిగియున్నవి.

ఈ విధముననె భౌతిక ప్రకృతియందు గూడ ననేకవిధములైన చలనమును వెలుతురని యు, వేడిమియని యు, విద్యుచ్ఛక్తియనియు, శబ్దమనియు వివిధములుగ బేర్కొనుచున్నాము. ఇవియన్నియు నొకటే స్వభావముగలదిగా నున్నవి. అన్నియు ఆకాశపదార్థమునగలుగు చలనముయొక్క విధములుగా నున్నవి. అయితే యాయా చలనములు వేగమునందును విధమునందు భేదములుగానున్నవి. సంకల్పములు, కామములు, క్రియలు ఇవి ప్రకృతియందుండు జ్ఞానేచ్ఛాక్రియాశక్తుల స్వరూపములు.

అనగా నివిగూడ వివిధములైన చలనమునుంచి గలిగినవియనుట. అయితే వాటి భిన్నరీతి ననుసరించి ప్రకాశించుచున్నవి. ఒక ప్రత్యేకమైన పదార్థమున నొకవిధమైన చలన పరంపరలున్నవి. వీటిని సంకల్పచలనమందుము. మఱియొక పరంపరను కామచలనమనియు, వేరొక పరంపరను క్రియాచలనమనియు జెప్పుదము. ఈ నామములు కొన్ని సంగతులను స్ఫురణకు దెచ్చుచున్నవి. ఒక విధమైన యాకాశపదార్థము చలించి, దాని చలనము కంటికి గోచరమై వెలుతురనిపించుకొనును. ఇంకొక సూక్ష్మమైన యాకాశపదార్థమున చలనముగలిగి, యాచలనము మనసునకు గోచరమై సంకల్పమనిపించుకొనును. వివిధములుగా దట్టములైన పదార్థములు మమ్ములనావరించియున్నవి. వాటియందు వివిధ చలనములుగలిగి యవి మనయందుండు స్థూలసూక్ష్మదేహములనుండు నింద్రియములకు గోచరమగురీతిని నాచలనములకు బేరిడుచున్నాము. కంటికి గోచరమైన దానిని వెలుతురనుచున్నాము. మనసునకు గోచరమైన, సంకల్పమనుచున్నాము. ఒక వస్తువునుంచి మనకంటికి వెలుతురను యాకాశముచలించిన 'చూచుట'యను కార్యము గలుగును. ఒక వస్తువునకును మన మనస్సునకును మధ్యమున సంకల్పాకాశము చలిం

చిన 'సంకల్పము' సిద్ధమగును. ఒకటి మరియొక దానికంటె నించుకయైన గూఢమైనది గాదు.

సంకల్పతరంగములు మనసునకుగల మనస్సుయొక్క స్వరూపము మార్పులు బొందుచుండునని ను అదియొక వస్తువు నాలోచించుసమయమున తెటనుంచి పూర్వ సంకల్పములె మాటిమాటికి మనకు గోచరమగుననియు, మనస్సుయొక్క స్వరూపమును విచారించి, దెలియును. ఈ చలనములయందు జ్ఞాతకార్యకారియగును. ఇది ప్రకాశింపజేయునదియంతయు జ్ఞానమనిపించుకొనును. జ్ఞాతయొక్క మనసున జ్ఞాతగానిది, అనగా ఆత్మగానిది గిరిగింపు దన ప్రతిచలను సంకల్పమనిపించుకొనును. అగి తరంగచలనముల గుంపుచేగలిగిన రూపము, నిజమైన యాకారము. అనాత్మయొక్క భాగము చలించును. జ్ఞాత యాచలనములుగ్రహించిన నా భాగమును దెలిసినదగును. వాటి రెంటిమధ్యమునకునుండు ప్రకృతిపదార్థ చలనము వాటికి బరస్పర సంబంధముగలిగించి జ్ఞానముగలుగుటకు గారణమగును. ఇట్లు జ్ఞాతృజ్ఞానజ్ఞేయ పరంపరలు సిద్ధమై వెలయును.

## సత్సంకల్పములు.

49. రూపముల కూడికవల్ల సుఖమన్వేషించుట, యస్థిరమైన పదార్థసంచయ మధ్యముననుండుట.

50. ఉత్కృష్టమైన తత్వములలో గొన్ని త్యాగనియమము ననుసరించి యున్నవి.

51. ఇతరులకనుకూలముగునట్లు మన పూర్వకముగ సంతోషముతో జీవనము గలిగించుటయె త్యాగముయొక్క ముఖ్యస్వరూపమైయున్నది.

52. త్యాగియొక్క లోభత్వమువల్ల నె ఖాంకురము బుట్టును.

53. పరమాత్మ సంజ్ఞయిాపియగును.

54. ప్రతిశరీరమున చైతన్యరూపమున నుండునది పరమాత్మయె.

55. యోగసిద్ధిగలవాడు సుఖవిముక్తుడు.

56. మనిషి, రూపములతోగాక చైతన్యముతో నేకభావము బొందువరకు త్యాగమునకుగావలసిన సుఖనివృత్తికలుగదు.

57. ఆకస్మికమనునది లేనేలేదు.

58. ప్రతికార్యమునకు గారణము యుండును.

59. ప్రతిమనిషి దనకర్మను సిద్ధముజేసుకొనును.

Continued from page 140.



నా బోధయందసూయగలవారై దాని ననుష్ఠించని మూఢాత్ముల వివేకులై జ్ఞానశూన్యులై చెడుదురని తెలియుము. జ్ఞానవంతుడుగూడ తన ప్రకృతిని ననుసరించును. నిగ్రహామువల్ల నేమి ప్రయోజనము. ఇంద్రియవిషయములందగుపడు రాగద్వేషము లింద్రియములందుండును. యీ రెంటికి వశముగాగూడదు. యివి మార్గమునకు నాటంక హేతువులు. యథావిధిగా జేసిన పరధర్మముకంటె గుణహీనమైన స్వధర్మము శ్రేయము. స్వధర్మానుష్ఠానమున చావుగలిగినను శ్రేష్టము పరధర్మము భయావహము.

## అర్జునునివాక్యము.

దేనిచేత ప్రేరేపింపబడి, కృష్ణా! బలత్కారముగా నిరుకునబెట్టబడిన వానివలె స్వేచ్ఛములేనివాడైనను నరుడు పాపముజేయును.

## శ్రీ కృష్ణులవాక్యము.

రజోగుణ సంభూతిమ్ములైన కామక్రోధములే. యివి సర్వభక్షకములై, సర్వపాపహేతువులై, యీలోకమున మన శత్రువులుగా నున్నవని తెలియుము. పొగనిప్పును, మాలియద్దమును, మావినిండమును, గప్పినట్లు జ్ఞానమును నివి యావరించియున్నవి. అగ్నివలె తృప్తిలేని కామరూపమున నిత్య శత్రువుచేత జ్ఞానియొక్క జ్ఞానమావరింపబడినది. యింద్రియములు, మనోబుద్ధులు, వీనికి స్థానములు. యివి జ్ఞానమును గప్పి దేహిని మోహింపజేయును, గనుక, భరతశ్రేష్టుడా! ఇంద్రియములను మొదట నిగ్రహించి జ్ఞానవిజ్ఞాననాశహేతువైన యీ పాపకారిణములను విడువుము. దేహముకంటె నింద్రియములు శ్రేష్ఠమందురు. ఇంద్రియములకంటె మనస్సు శ్రేష్ఠము. మనస్సుకంటె బుద్ధి శ్రేష్టము. బుద్ధికంటె శ్రేష్టమైనది యాత్మయే. ఇట్లు బుద్ధికంటె శ్రేష్టమైనది యాత్మయని తెలిసి బుద్ధిచేత మనస్సు నిగ్రహించి సమీపింపరాని కామరూపమున నుండు శత్రువును సంహరించుము.

## నాల్గవ యధ్యాయము.

## జ్ఞానయోగము

## శ్రీ కృష్ణులవాక్యము.

ఈ యవ్యయమైన యోగమును నేను సూర్యునికి నుపదేశించితిని. సూర్యుడు మనువునకు నేర్పెను. మనువిక్ష్వాకునకు జెప్పెను. ఇట్లు పరంపరగా నిది నుపదేశింపబడి

రాజర్షులు దెలిసికొనిరి. ఈ యోగము బహుకాలమైనందున లోకమున నశించెను. నీవు నా భక్తుడవు, నా స్నేహితుడవని, యీ పురాతన యోగవిద్యను నీకు నిప్పుడుప దేశించితిని. అది పరమరహస్యమైనది.

## అర్జునుని వాక్యము.

ముందు సూర్యుడు పుట్టెను. వెనుక నీవు పుట్టితివి. యిట్లుండ పూర్వము నీవతనికి నుపదేశించితివని నేనెట్లు తెలియగలను.

## శ్రీ కృష్ణులవాక్యము.

అర్జునా! నీకును నాకు ననేక జన్మములు గడచినవి. వానినన్నియు నేనెఱుగుదును. నీవెఱుంగవు. పుట్టుకలేనివాడనై వికారరహితమైన యాత్మ స్వరూపుడనై ప్రాణులకు నియామకుడైనను నాస్వకీయమైన ప్రకృతి నవలంబించి నామాయాశక్తి చేత నేను బుట్టుచున్నాను. ధర్మము క్షీణమై యధర్మాభివృద్ధిగలిగిన, నర్జునా, అప్పుడు నేనవతరించుచున్నాను. శిష్టపరిపాలనకు దుష్టనిగ్రహమునకు ధర్మసంరక్షణ కొరకు బ్రతియుగమున నేనవతరించుచున్నాను. ఇట్టి నాదివ్యజన్మమును గర్మను యథార్థముగా దెలియువాడు దేహమును విడిచినవెనుక మరల జన్మము నొందడు నన్ను బొందును. రాగమును క్రోధమును భయమునువదలి నాస్వరూపులై నన్నాశ్రయించి జ్ఞానతపస్సుచేత పరిశుద్ధులై యనేకులు నాస్వరూపమును బొందియున్నారు. మనుష్యులు నన్నెట్లు గొలిచిన నట్లనుగ్రహించుచున్నాను. ఏలన సర్వప్రకారములుగా మానవులనుసరించు మార్గము నాదేను. భూలోకమున ఫలాపేక్షగలవారు దేవతలను బూజించుచున్నారు. ఈ మర్త్యలోకమున గర్మఫలము నిశ్చయముగా శీఘ్రముగా లభించును. గుణకర్మల వివిధవిభజనములచేత చతుర్వర్ణములు నాచేత సృజింపబడినవి. అకర్తనై యవ్యయమైన వాడనైనను వాటికి నన్ను గర్తగా దెలియుము. కర్మలు నన్నంటవు. కర్మఫలముల నాకు నిచ్ఛలేదు. నన్నీరీతిగా దెలిసికొనినవాడు గర్మబద్ధుడుగాడు. ఇట్లు తెలిసికొనిముముక్షువులైన మన పూర్వికులు సేసినరీతి నీవును గర్మజేయుము. కర్మయనగనేది, అకర్మయననేది, ఇందు విద్వాంసులుగూడ భ్రమించిరి. పాపమునుండి విముక్తి గలుగజేయునట్టి కర్మస్వరూపమును నేను నీకు బోధించుగలను. కర్మాకర్మ, నిషిద్ధకర్మలను, విచారించి తెలియుట యావశ్యకము. కర్మమార్గము దురవగాహము. కర్మయందు నకర్మను, అకర్మయందు గర్మను దెలియువాడు సమస్త

37. రాగికంచు పాత్రలను బూడిదతో శుద్ధిచేయవలయును. బట్టలనుఁ గుట చేత శుద్ధియగును. మంటిపాత్రలను పారవేయవలెను.

38. గనుక కుసుమపువ్వు, బెల్లముపాకు, దూది, పత్తి, ఉప్పు, నూనె, నెయ్యిని యాగృహద్వారమున పెట్టి పైకప్పుకట్టెలను కాల్చవలెను.

39. ఇట్లు పాపవిముక్తి జేసుకొని బ్రాహ్మణులకు సంతర్పణచేసి ముప్పది యావులు యెద్దులతో కూడా దానము చేయవలెను.

40. నేల నలికి యచ్చట జపహోమక్రియలు సలిపి శుద్ధిచేయవలెను. బ్రాహ్మణుఁడు నిలుచున్న స్థలమెన్నటికి నపరిశుద్ధము కాదు.

41. 42. చాకలిది, చెప్పులు కుట్టునది, వేటకత్తె, తెలియక పైనాలుగు వర్ణముల వారియింట వసించిన ముందుచెప్పిన విధులలో గది కాల్చుట తప్ప పరిశుద్ధత్వమునకుగాను వాటిలో సర్వము జేయవలెను.

43. చండాలుఁడు ప్రవేసించిన గదినుండి తక్షణము వెలువడి లోపలనున్న సకల మంటిపాత్రలను విసర్జించవలయును.

44. నూనె నెయ్యి మొదలగు పదార్థములు గల మంటిపాత్రలను విసర్జింపఁ బనిలేదు. వానిపైన పాలనీళ్లను, వెదచల్లి శుద్ధిచేయువలెను.

45. గాయమున చీముచెత్తురుయందు పురుపులుపడి బాధచెందుచున్న బ్రాహ్మణుని విషయమున పరిశుద్ధత్వమునకు చేయువలసిన కర్మయేది.

46. అట్టి పురుపులుపడిన బ్రాహ్మణుఁడు ఆవుపాలు పెరుగు నెయ్యి గోమూత్రమును మూడుదినములు తిని వానియందు స్నానముచేసిన పరిశుద్ధుఁడగును.

47. అట్టి సందర్భమున క్షత్రియుఁడయిన మాడలతూనిక గల బంగారును దానముజేసిన పరిశుద్ధుఁడగును. వైశ్యుఁడొకదిన ముపవాసముండి బ్రాహ్మణునకొక గోదాన మివ్వవలెను.

48. శూద్రుఁడుపవాసముండఁ బనిలేదు. శూద్రుని దానము పరిశుద్ధునిగఁ జేయును. లేక పంచగవ్యము గ్రహించి బ్రాహ్మణుని నమస్కరించిన పరిశుద్ధుఁడవును.

49. బ్రాహ్మణుఁ డుచ్చరించిన నచ్ఛిద్రమస్తుయను నాశీర్వచనమును వాని తలమీద మర్యాదపూర్వకముగా నుంచిన శూద్రుఁడగ్నిష్టోమ యాగఫలమును బొందును.

**50.** వ్యాధియందును, అపాయమునందును, క్షామమునందును, తెవులు సమయమునను, లేక అధిదైవిక తాపములయందును శూద్రుఁడు తానుపవాసముండి వ్రతము యజ్ఞము చేయుటకు బదులుగా బ్రాహ్మణుని వల్లు చేయించవలెను.

**51.** లేక బ్రాహ్మణులు తమయనుగ్రహ పూర్వకముగా వార నాశీర్వదించవలెను. బ్రాహ్మణుని యాశీర్వాదము సకల కర్మములను గూర్చిన ఫలముతో సరితూగును.

**52.** అట్టి యనుగ్రహము బలహీనులకును వృద్ధులకును బాలురకును జూపవలెను. ఇంకెవరికైన బ్రాహ్మణుఁడిచ్చిన, జూపిన యనుగ్రహము కోరినఫలమివ్వక పోవచ్చును గనుక నపాత్రుల ననుగ్రహించకూడదు.

**53.** ప్రేమ నుంచికొని ధనాపేక్షచేత భయముచేతగాని మూఢత్వముచేత నొక బ్రాహ్మణుఁడొక యోగ్యతలేని వానిననుగ్రహించినవాని యయోగ్యతనుసవారించును.

**54. 55.** ఒకఁడు చావు సమయమున ప్రాయశ్చిత్త కర్మము చేయుమని బుద్ధిచెప్పు బ్రాహ్మణులును, నారోగ్యము గలవారిని నుద్యోగాధిక్యముచేత మోక్షక్రియలను చేయకుండునట్లు ప్రోత్సాహపరచువారును, ఆరోగ్యము గలవారికై యట్టి కర్మలను తామే చేయను వ్యక్తులగు వారును, వారికి చెడుపుచేయువారగుదురు. అట్టి బ్రాహ్మణులు మరణానంతరమున నరకము జేరుదురు.

**56.** బ్రాహ్మణుని దూషించువాఁడు ప్రాయశ్చిత్త కర్మానర్హుఁడగును. వాని యుపవాసములు భక్తియు, ధర్మములు వ్యర్థములు స్వర్గదృష్టియందు వాఁడే యోగ్యత నెప్పటికి బొందజాలడు.

**57.** బ్రాహ్మణుఁడు విధించునది సదాచారధర్మము. బ్రాహ్మణుని యాజ్ఞను మీరువాఁడు బ్రహ్మహత్య జేసినవాఁడగును.

**58.** తనకొఱకు బ్రాహ్మణునిచేత క్రింద చెప్పిన కర్మలను చేయువాని యొక్క నుపవాసములు వ్రతములు, యాత్రలు, తపములు, ప్రాయశ్చిత్త కర్మలు స్నానములు గణ్యములైనవి.

**59.** ఒకఁడు చేయువ్రతములలో తపములలో యజ్ఞాదిక్రియలలో నేమైన లోపములుండ వాఁడు బ్రాహ్మణునితో తనకొఱకు వానిని జేయించిన నివారణ యగును.

60. బ్రాహ్మణులు సంచరించు పవిత్రవస్తువులు, ఏకాకులు సకలాభీష్టప్రదులు బ్రాహ్మణ వచనములను నీళ్లచేత నపవిత్రములైన వారి పాపములు శుద్ధిచేయఁబడును.

61. బ్రాహ్మణుని వచనములు దేవుని వచనములవంటివి. బ్రాహ్మణుఁడు, చలించు దైవస్వరూపము. అతని మాటలెన్నటికి నసత్యములు గాజాలవు.

62. పురుగుగాని యీఁగగాని యుండు యన్నమును మొదట నీటియందు గడిగి తినుటకుముందు భస్మముచేత స్పృశింపవలెను.

63. బ్రాహ్మణుఁడు భోజనముచేయు సమయమున తన యాకును చేతితో స్పృశించుటకు బదులుగా తనకాలిని బట్టినాని యుండనేని యిరగుని యన్నశేషమును భుజించినవాఁడగును.

64. కాళ్ల బాదరక్షలుతొడిగిగాని పరుపుమీఁద కూర్చునిగాని యన్నము తినఁగూడదు. భుజించుసమయమున నెుక కుక్కచేతగాని చండాలునిచేతగాని చూడఁబడిన తక్షణము భోజనము విడిచి లేవవలెను.

65. ఏయన్నము శుచియో యట్టియన్నము తినఁగూడదో పూర్వము పరాశరుఁడు చెప్పినరీతి యిపుడు నేను చెప్పెదను.

66. కాకిచేగాని కుక్కచేగాని తినబడిన ద్రోణ లేక ఆఢకొలది యన్నమెట్లు పవిత్రమగును. దీనిని బ్రాహ్మణులనడుగుము.

67. అపుడు ధర్మరక్షకులై వేదవేదాంగములఁ బరిచయముగల బ్రాహ్మణులు కాకి కుక్క తినిన లేక నాకిన ద్రోణకొలది యన్నము త్యజింపఁగూడదని వారు చెప్పుదురు.

68. ముప్పదిరెండుప్రస్థ లొక ద్రోణయగును. రెండు ప్రస్థ లొక యఢక యగును. స్మృతిస్మృతిపారగులైన పండితులు ద్రోణకొలది యన్నము ద్రోణాన్నమనియు, అఢకకొలది యన్నము అఢకాన్నమనియును జెప్పుదురు.

69. కాకిగాని లేక కుక్క తినిన లేక ఆవుగాని గాడిదచేతగాని వాసనచూపింపఁబడిన ద్రోణాన్నమునగాని అఢకాన్నమునగాని కొంతభాగము బ్రాహ్మణుఁడు విసర్జించి తక్కిన దానిని శుద్ధముగాను తపయోగ్యమైనదిగాను భావించవలెను.

70. అట్టి యపవిత్రమైన యన్నమును దీనివేసి యపవిత్రముగాని ద్రోణాన్నశేషమును సువర్ణోదకముచల్లి యగ్నియందు వెచ్చఁజేయవలెను. సువర్ణోదకముచేత

అసత్యమాడువారికైన సత్యమును చెప్పినట్లగును. ఈ సమాజమున జేరినవారు దుష్ప్ర వర్తనలు మానకున్నవారికే హెచ్చగు నపకీర్తివచ్చునుగాని సమాజమునకేమియు హాని లేదని నమ్మవలసినది. ఈ సమాజము కేవల మోక్షమార్గప్రదర్శిని గనుక దీని ముఖ్యాభిప్రాయముల నత్యంత భక్తితో దెలిసి యభ్యసించినగాని యించుకయైన ప్రయోజనంబు లేదని ఖండితముగా దెలియవలసినది. శ్రీకృష్ణభగవానులు గీతయందు వేయిపురుషులలో నొకడు ప్రయత్నించును. ప్రయత్నించిన వేలులో నొకడు సిద్ధిపొందునని చెప్పియున్నారుగదా! గనుక ఈసామాజికులలో నజ్ఞానమువల్ల జారి గనుగొనని వారిని గాంచి యీ సమాజమును దూషింపక దానిఫలము నందరు వివేకముతో నుపయోగించి ననుభవింతురుగాక యని ప్రార్థించుచున్నాము. ఈ సమాజము కల్పవృక్షము. కోరినదాని నిచ్చును. సంసార తాపికమునకు ప్రకృతికాలమున సులభోపాయము. పూర్వము మనదేశమున నుండిన గురుశిష్యన్యాయమిచ్చట వెల్లడి చేయబడినది. ఈ సమయమును పోగొట్టుకొన్న మనకు హెచ్చగు నరవస్థలు సంప్రాప్తమగును. ఈ సమాజమున జేరినవారందరు దాని నియమములను మనమున నాటించుకొని దుష్ప్రవర్తనలు మాని లోకమునకు శాంతి నొసగునట్లు ప్రయత్నించుచుందురుగాక యని మనసారగాను గోరుచున్నాము.

బ్రహ్మవిద్యయను నైవజ్ఞానము. నేడు మతములన్నియు శిథిలములైయున్నందున నది యిందూదేశమున ప్రవర్తించియున్నది. ఇది నేడు లోకమునంత వ్యాపించుచున్నది. ఆత్మయొక్క దేహీ జీవుడు వాని యంశమే గనుక తన్నుదాను తెలియవలెనను లోకోక్తి యిప్పుడు దీనివల్ల వ్యక్తపరచబడుచున్నది. ఆత్మజ్ఞానము ప్రధానము. ఇతరజ్ఞానమంతయు నప్రధానము. తన్ను దాను తెలిసిన, సర్వము దెలిసినట్లగును. ఈ బ్రహ్మవిద్య క్రొత్తదిగాదు. విదేశజన్యము గాదు. సకల మతములకు తత్వములకు శాస్త్రములకు బ్రహ్మవిద్య మూలాధారమైన జీవనమువంటిది. సకలమునకాధారమైనది. ఈ బ్రహ్మవిద్యవల్లనే సకలమతములు పోషింప బడినవి. బ్రహ్మవిద్య యందరిచిత్తముగనుక ఎట్టిమనసునైనను దృష్టిపరచుచున్నది. దీని వెల్లడిచేయు నీ సభ యేమతమునకు ప్రత్యేకముగా జేరినదిగాదు. దేవుని పాదారవిందములు జేరుటకు బ్రయాణమై వెళ్లువారల సముదాయమునకు సమీప మార్గమును జూపింప గట్టబడిన సోపానమని దీనిని దెలియవలెను. దీనిని జేరినందువల్ల నేమతస్థునకు హానిలేదు. మతభ్రష్టత్వ మెన్నటికిరాదు. ఒకపట్టణమునకు ననేకమార్గము లున్నట్లు సకల మతములవారికి నిది సన్నిహితమైన విశ్రమస్థానమగును.

ఓం



సత్యముకంటె నెక్కుడగు ధర్మము లేదు.

గుచ్ఛము 1.] ఆగస్టు 1908. [సంచిక 8.

## స్వవిచారము.

ఆర్యులారా! జూలై నెల సంచిక యాలస్యమైనందుకు మన్నన వేడుచున్నాము. కార్యదర్శిగారి స్థానచలనముబట్టి మదరాసు మా కార్యస్థానముగా నేర్పరచుకొనుట చేత జేయవలశిన మార్పులకై కొంత యాలస్యమైనదిగని వేరు కారణమేమియు గలుగలేదు. చదువరులందరు క్షమించవలయును. కొందరు చందాదారులు మా కార్యస్థానమునకు బంపినజాబులు వచ్చిచేరినవి. వారికందరి సమాధానములు నేటితో ముగించుకొను చున్నాము.

అదియునుగాక కొందరు మా పత్రికలు గతమాసములందు ముట్టలేదని యిప్పుడు వ్రాయుచున్నారు. చాలాజాగ్రతతో పత్రికలు రవాణచేయబడుచున్నవి. ఏల యిటి వ్యత్యాసముగలిగినది గానరాదు. ఏనెలలో ముట్టలేదో తక్షణము తెలిపిన విచారణకు నవకాశముగనుండునని తెలుపుట క్షేమమైనది.

## మహాసభ.

ఈ మదరాసు రాజధానికిజేరిన మధ్యజిల్లాలలోని బ్రహ్మజ్ఞాన సమాజమునకు జేరిన వారందరు అనంతపురములో ఆగస్టునెలయందు 22, 23 తారీఖున సభగాజేరు చున్నారు.

ఆదినములయందు ఇంగ్లీషుభాషలోను తెనుగుభాషయందు 'భక్తి' 'సత్యావద' 'స్వతంత్ర' మొదలగు విషయముల ఉపన్యాసములు చేయబడుచున్నవి. సామాజిక కార్యనిర్వహణ యాలోచనలు గూడ చేయబడును. లోకహితమునకై యీ సభజేయను

గాన అభిలాషగలవారు ఆసమయమునవచ్చి యానందించుదురుగాక యని కోరుచున్నాము.

---

## మా భ క్త వి జ య ము.

### 3. వివేకానందుడు.

ముందు వివరించిన శ్రీరామకృష్ణ పరమహంసయొక్క శిష్యులలో వివేకానందు డగ్రగణ్యుడనవలెను. ఈ కాలమున మన హిందూమతముయొక్క ప్రభావమును లోకమున వెల్లడిజేసిన మహానుభావులలో నితడొకడని యెన్నదగినవాడు. 1862-సం|| జనవరి 9-వ తేదిన పూర్వము ప్రసిద్ధికెక్కిన కాయస్థుల కుటుంబమునకు జేరిన సిమోలియాతోనుండు దత్తాయను కుటుంబమున వివేకానందస్వామి జనించెను. ఇతని పోలికనుండిన యితనితాత వృద్ధాప్యమువచ్చిన వెనుక సన్యాసియాయెను. ఇతని తండ్రి పేరు విశ్వనాధదత్తా. ఇతడు కలకత్తా హైకోర్టులో నొక గొప్ప వకీలుగానుండెను. ఇప్పటికిని జీవించియుండు నితనితల్లి యొకపాట నొకసారి విన్నమాత్రముననె కంఠగతముగా మరల నొప్పించు సామర్థ్యముగలిగిన యెక్కువైన జ్ఞాపకశక్తిగలదిగానున్నది. వారు కాశీ క్షేత్రమున చాలాకాలము శివుని పూజసేసి నితనిని బడసిరి. గనుక వీరేశ్వరుడని నామకరణంబుజేసిరి. వీడు పాఠశాల జదువునప్పుడు నోరేంద్రనాథుయని పేరు బెట్టుకొనియుండెను. ఇతని చిన్నతనమునందే యగ్భుత జ్ఞాపకశక్తియును, పేదసాదలయ్యందు నమితమైన ప్రేమయును వెనుక ప్రజ్వలించిన జ్ఞానాపేక్షయు బహువిశదముగా గానవచ్చుచుండెను. ఇతడు వయోవంతుడగుచు హూణతత్వశాస్త్రముల నెక్కువగ పరిశీలించి శాస్త్రిపాఠశాలయందు జదువుచుండినపుడె హార్బర్టు స్పెన్సర్ యను హూణమహాతత్వవేత్తయొక్క తత్వశాస్త్రి ఖండనమును వ్రాసి యతనికి బంపెను. ఆ స్పెన్సరు దానికి నాశ్చర్యపడి తత్వసాధనములందు నెక్కువ ప్రోద్బలమిచ్చెను. హూణతత్వశాస్త్రిజ్ఞాన మతనిని నాస్తికునిగాజేసెను. శాస్త్రిపాఠశాల విడిచిరాగానే బ్రాహ్మోయను నొక సిద్ధాంతమునకుజేరెను. కొంతకాలమునకు దానియందు నిజమైన తత్వస్ఫురణలేదనుకొని దానిని విడిచెను. ఆ వెనుక జ్ఞానమునుగనుగొన ననేక కష్టములుపడి యనేక మతగురువులయొద్ద విచారించి వారుబోధజేయు తత్వములను తమకు ననుభవవేద్యమై యున్నవాయని యడుగ నట్లులేదని తెలిసి జ్ఞానమును సంపాదించ నత్యాసక్తితో

దనసంశయమును మాన్పి యనుభవజన్యజ్ఞానమును బోధించు సద్గురువున్నకై యన్వే షించుచుండెను. అప్పటికి కలకత్తావిద్యాసభకుజేరిన బి. ఏ., పట్టపుపరీక్షలో గడదేరి వకీలగుటకు సిద్ధముచేయుచుండెను. ఈ తరుణమందు శ్రీరామకృష్ణ పరమ హంసుల శిష్యుడైయున్న యతనిపిన్నతండ్రి యతనిని నతనియొద్దకు నొకనాడు పిలుచు కొని వెళ్లెను. నరేంద్రుడమ్మహాత్ముని నవలసంశయబుద్ధితో జేరెను. రామకృష్ణుడు తానేనేక కాలముగా వేచుకుచునిరీక్షించుచున్న నాడితడేయని గ్రహించెను. హిందూ దేశమును నజ్ఞాననిద్రయందు మునిగియున్న దానుంచి మేల్కొనజేయ సామర్థ్యము గలవీరుడితడేయనుకొనెను. రామకృష్ణుడు వానిని నీవేమైన పాటలు పాడగలవాయని యడుగ నరేంద్రుడు తన దివ్యమైన కంఠముతో 2, 3 పాటలు పాడెను. వాటినివిని శ్రీరామకృష్ణుడు చాలాయానందభరితుడై కొంతసేపు ధ్యానపరవశుడై యుండెను. మఱియొకనాడొంటిగావచ్చెదనని చెప్పి యాతనితో సెలవుదీసికొని వెళ్లెను. పిమ్మట నతనిని గురువుగా గైకొని సకల తత్వార్థములును దెలియజేయగ బోధామృతమును స్వీకరించెను. శ్రీరామకృష్ణుడు 1886 ఆగష్టు 16-వ తేదిన సిద్ధిపొందెను. అతని శిష్యు లందరుజేరి యతడునడచిన దివ్యమార్గమున నడచి కడతేరవలెనని నిశ్చయించుకొనిరి. వారు తమ లౌకికవృత్తులనన్నిటిని తమ బంధువులెంతచెప్పినను వినక త్యజించి సన్యా సులై భిక్షాటనము చేయసాగిరి. నరేంద్రుడు జ్ఞానసిద్ధిబొందుట కేకాంతమున దపంబుసేయ హిమవత్పర్వతమునకు వెళ్లి యచ్చట యారువత్సరంబులు ఘోరతపంబు చేసి జ్ఞానసిద్ధిని బొందెను. ఆకాలమున టిబెటుయనురాజ్యమునకు గూడవెళ్లి బౌద్ధ మత విచారముజేసి వెనుక హిమవత్పర్వతముదిగి హిందూదేశమున సంచరింప ప్రారం భముజేసెను. ఖేత్రిదేశమునకు వెళ్ల నక్కడి మహారాజతని శిష్యుడాయెను. కొంత కాలము పశ్చిమతీరమున సంచారముచేయుచు దక్షిణమున త్రివేండ్రంపురమువరకు వెళ్లి యావెనుక చెన్నపట్టణము జేరెను. అక్కడ హిందూమత విషయమునందనేక యుపన్యాసములివ్వగా జనులత్యాశ్చర్యపడి యపుడమెరికా దేశమునందు చికాగో యను పట్టణమున జరుగబోవు ప్రపంచమతముల సంఘమునకు నితనిబంప చాలమేలగు ననియెంచి యచ్చట హిందూమతమును బ్రదర్శింప నతనిని వెళ్లుమని ప్రార్థించిరి. అతడు తన మతోద్ధారమగుననియు పాశ్చిమదేశీయులకు తన హిందూమత సౌష్ఠవము దెలుప నవకాశము గలిగనని చాలాసంతోషించి జనుల ప్రార్థనను గైకొని వారొ సంగిన ద్రవ్యము చేతదీసుకొని జపానుమార్గముగా నమెరికాదేశమునకు ప్రయాణమై

వెళ్లెను. చికాగో పట్టణము జేరినతోడనే యతనివద్దయుండిన కొంచెము పైకము ఖర్చయియుండి యుపవాసముండునంత కష్టమునకు వచ్చియుండెను. ఒకనాడు బాస్టన్ సమీపమునందు గ్రామవీధులలో నాదరించువారు లేరని వ్యసనముతో సంచరించుచుండ నతని యాకారమును నుడుపును జూచి యాశ్చర్యపడిన యొక ముసలియామె యతనిని దగ్గరకుబిలిచి యతనిపనియేమి యనియెను. తానెవడైనది యామెకుదెలుప పూర్వదేశపు మాదిరివి యనుకరించు నితనితో దనస్నేహితులకు సంతోషపెట్టుటకు యోచించి తన యింటభోజనము చేయుటకురమ్మని బిలిచెను. అతడు దమదేశములోనున్న నాగరికతకంటె నెక్కువగా ఘనమైన నడతను స్వాభావమైన జ్ఞానము గలిగియుండువానిగా గనుగొనిరి. అతనితత్వబోధలను తాముగ్రహించ జాలక యాయూరిలోనున్న తత్వశాస్త్రవేత్తను బిలిపించ నతనితో బ్రసంగము జేయుమనిరి. అతడు స్వామిని గనుగొని యతనియోగ్యతను గ్రహించి మతసంఘపు కార్యాధ్యక్షుడైన బ్యారోస్ అనువారి పరిచయమునుగలుగజేసెను. అతడు జరుగబోవు సంఘమున హిందూమతమును ప్రదర్శింప నితనిని నేర్పాటుజేసెను. ఆసంఘమున ననేకమత సారమును ప్రచురింప ననేకవిద్వాంసులు వచ్చియుండిరి. ఈస్వామి హిందూమతమును ప్రదర్శించి తన యుపన్యాసము నాసభలో జదువ నంద రాశ్చర్యపడి యతనిని చాలాప్రశంసించిరి. అనేక వార్తాపత్రికలతని వాచాగంభీరతను స్ఫురద్రూపము ననేకవిధముల వర్ణించిరి. అనేక సంఘములవా రనేకదేశములకు నతనిని బ్రతిమాలి యచ్చటచ్చట యుపన్యాసములు జేయుమని ప్రార్థించిరి. అమెరికా దేశమున నొక సంవత్సరములోపల యాదేశస్థులిద్దరతనిశిష్యులైరి. వారెవరన స్వామి అభయానంద యనిపిల్వబడు లూయియను నామెయును స్వామి కృపానంద యను పేరు గ్రహించిన లాండ్స్బర్గ అనునతడు రెండవవాడు. ఈస్వామి యనేక చోట్ల యుపన్యాసములిచ్చి వేదాంతశాస్త్రమును దేశమునందంతట వెల్లడిజేసెను. అమెరికానుండి యింగ్లండుదేశమునకు వచ్చి యక్కడ మూడుమాసములు గడపెను. ఆసమయమున ననేకులకు పాఠములుజెప్పుచు ననేకస్థలములయం దుపన్యాసములను జేయుచుండెను అచ్చటి మాక్సుమ్యుల్లరు సంస్కృతపండితుని పరిచయముజేసుకొని శ్రీ రామకృష్ణుని చరిత్రయు వచనములను దెలుపు నొకగ్రంథమును వ్రాయుమని ప్రేరేపించెను. మార్గరెట్ నోబిల్ యను నామెసిస్టర్ నివేదితాయను పేరుతో నతనికి శిష్యురాలాయెను. జే. జే. గుడ్విన్ నతడొక డాతనిశిష్యుడై వెంట సంచరించుచుండెను.

హిమవత్పర్వతము మీదనుండు మాయావతి గ్రామమునందు నద్వైతాశ్రమమును స్థాపిం
చుటకు సహాయభూతముగా నుండిన సేవియర్ యను సేనాధిపతిగూడ నతనిశిష్యుడ
య్యెను. ఇంగ్లాండు దేశమునుండి వచ్చుటదొరికిన శిష్యులలోగూడ తన జన్మ
భూమియైన హిందూదేశమునకు మరలివచ్చెను. మొదలు కొలంబోయను పట్టణ
మున కాలుపెట్టి ఉత్తరాగ్రముననుండు ఆల్మోరాయను పట్టణమువరకు మధ్యనున్న
యనేక పట్టణముల దిరిగి యచ్చటచ్చట సకల జనులకు వేదాంతమును గరతలా
మలకముగ నుపన్యసించుచు సంచారము జేసెను. తర్వాత నతడు చేసినకష్ట
మునకై యతనిదేహారోగ్యము చెడి కొంతకాలమే కొంత వాసియయి మరలనారోగ్యము
సమకూర్చుకొని తానుద్దేశించిన కార్యమును కొనసాగింపనారంభించెను. కలకత్తాకు
నారుమైళ్ళుత్తరముగా నొకస్థలమునందును మరియొకటి హిమాలయపర్వతమునందును
బ్రహ్మచారులకు విద్యనేర్పింప మఠములను గట్టించెను. రామకృష్ణమఠమని నొక
సంఘము నేర్పాటు జేసి లోకములోని ప్రజలకు సన్మార్గమును బోధింప ననేక
మార్గములను నిర్ధారపరిచెను. 1897-సంll క్షామమునందనేక స్థలములందు బీదసాద
లకు నాసంఘమూలకముగా క్షామనివారణకు నేర్పాటుజేసి కొంతకాలమునకు నతని
దేహారోగ్యము మరలచెడిన కొంతకాల మింగ్లాండులోను నమెరికాలోను, వాసము
జేసిన నారోగ్యమబ్బునని వైద్యశ్రేష్ఠులతనికి బోధింప మొదట ఇంగ్లాండున వెళ్ళి
తర్వాత నమెరికా చేరెను. కాలిఫోర్నియాలో కొంతకాలమున్న వెనుక యతనివ్యాధి
నివారణమై మరల నుపన్యాసములకు ప్రారంభముజేసెను. శాన్‌ఫ్రాన్సిస్కోయను
పట్టణమున నొక వేదాంత సంఘమును నొక శాంత యాశ్రమమని పిలువబడు
నొక యాశ్రమమును గట్టించెను. న్యూయార్కను పట్టణమున నుండువేళ
1900 సంవత్సరమున పారిస్ పట్టణమున జరుగ బోవు మతముల సంఘము
నకు నొక పిలుపురాగా దానికి యంగీకరించెను. హిందూ తత్వశాస్త్రవిషయ
మున నచ్చటి ఫ్రెంచిభాషయందు నుపన్యాసములు జేసెను. అచ్చటి నుండి
హిందూదేశమునకు మరలివచ్చి తనదేహారోగ్యమును మిక్కిలి చెదరియున్నను,
తనయుద్దేశములు నెరవేర్చుటకు తహతహపడుచుండెను. సాధువుల సహాయమునకై
రామకృష్ణ దేవాశ్రమమును స్థాపించెను. హిందూదేశములోని బాలురకు బ్రహ్మచర్య
వ్రతమును బోధచేయ కాశీక్షేత్రమున నొక యాశ్రమమును గట్టించెను, అచ్చటి
రామకృష్ణ పాఠశాలయను నొక బోధగృహమునుగూడ స్థాపించెను. ఆక్షేత్రమున

బీదసాదలకు నన్నము వేయు నొకమఠముగూడ నేర్పాటుచేసెను. తత్కాలమున జపాను దేశములో జరుగబోవు మతిసంఘమునకు రమ్మని పిలుపురాగా యతని యారోగ్యము చెదరియుండినందున నాప్రయాణము నిలిపివేసెను. 1902 సంవత్సరమున జూలై 4 వ తేదిన శాలాధ్యాయనపరుడై యుండెను. పగలు పాణినివ్యాకరణము పాఠము జెప్పి మధ్యాహ్నమున వేదప్రసంగము జేసి సాయంత్రము బహిర్యామికి వెడలి మరలివచ్చి ధ్యాననిష్ఠాపరుడై 9 ఘంటల కాలమందు మహాసమాధి జేరి యీ లోకము విడిచినవాడాయెను. లోకరక్షణమునకై యిట్టిమహానుభావు లప్పుడప్పుడు గనబడుచుందురు.

---

## కలలు.

జ్ఞాన, వైరాగ్య, పరలోక, శాస్త్రవిషయములు విన కుతూహల మందరకి నున్నను, అవి యనుభవము లేనందున స్వప్న నగరితుల్యమునుండి మనస్సున మాసి పోవును. జనులకు వాటియందనురాగము వృద్ధికాకున్నది. అయితే వాటిసారమును గ్రహించి తమ నిజస్వరూపమును దెలియ ప్రయత్నించువారు మిక్కిలి కుతూహలముతో దెలియుదురు. అయితే, ఇప్పుడు చెప్పబోవు విషయము అసామాన్య జనులందరికి గూడ రుచించవచ్చును. ఏలన, కలయనునది యందరు అనుభవించినదే. గనుక కల లెట్లగునది విచారింతము.

మొదట, దేహములరీతిని విచారించుదము.

స్థూలదేహములందు, మధ్యభాగమున క్రిందనుంచి తలలోని మెదడువరకు వ్యాపించి వెన్నెముక లేక బ్రహ్మదండమనునది యున్నదికదా! దానినుంచి దేహమంతట నరములు వెళ్లి వ్యాపించియున్నవి. ఆ నరములవల్లనే సకలభావములు మెదడునందుండు బుద్ధికి గోచరమగును. ఒక వేడిపదార్థమును చేయిదాక, వేడిగుణము తెలియునది చేయికాదు; చేతిలోనుండు నరముల వేడిభావము మెదడునందుండు బుద్ధికి దగిలి యాభావము గలుగును. అన్ని నరములు లోకవిధముగనె యున్నవి. అయితే అవియుండు చెవి, కన్ను మొదలగు స్థానములనుబట్టి వివిధ భావములను గలిగించుచున్నవి. అయితే అవి అన్నియు పనిచేయు విధమొక్కటే.

మెదడునందుండు బుద్ధి దేహారోగ్యము ననుసరించి యున్నది. దేహారోగ్యము రక్తసంచారము ననుసరించి యున్నది. ఎట్లన, మెదడునకు ఎక్కువరక్తము సంచరించ

నది గడ్డకట్టినట్టగును. రక్తము తక్కువయైన బుద్ధిమాంద్యమగును. రక్తముయొక్క గుణముకూడ దేహారోగ్యమునకు ముఖ్యము. రక్తము దేహమున సంచరించునపుడు సకలావయవములకు ప్రాణవాయువును ఆహారమును నిచ్చును. ఈ రెండుపనులలో ఏది తక్కువైనను అనారోగ్యము సిద్ధమగును. అనేకులు కలిసినచోట వాయుసంచారము మెండుగ లేనియెడ బుద్ధిమాంద్యమై నిద్రసంప్రాప్తమగునట్టు తోచును. ఏలన అందరు కలిసినచోట ఉచ్ఛ్వాసమెక్కువై అపానవాయువు మెండై ప్రాణవాయువు తక్కువగును మరియు ఆరోగ్యము రక్తసంచారవేగము ననుసరించి కూడ ఉన్నది. రక్తసంచారము మెల్లనైన మాంద్యము గలుగును. శీఘ్రమైన జ్వరమువచ్చును. గనుక ఈ స్థూలదేహము అనేకవిధముల మార్పును బొందుచుండును. అదిగాక ఒకవాడుక గలిగిన, మనయిచ్ఛ లేకున్నను దేహము ఆవాడుక ననుసరించును. ఇదియొక విచిత్రగుణము.

(సశేషము).

## వేదసారము.

ఋగ్వేదమునకు జేరిన బ్రాహ్మణములు రెండున్నవి. ఐతరేయమనియు కౌషీతకి యనియు—పంచకములను 8 భాగములై 40 అధ్యాయములను ఐతరేయము గలిగి యున్నది. ప్రతిభాగమున నైదధ్యాయము లుండుటవలన పంచకమందురు. దీనిలో ముఖ్యముగ సోమయాగమును గురించి చెప్పబడినది. మొదటిభాగము ఒకదినముపట్టు అగ్నిష్టోమమును, 360 దినములుపట్టు గవామయనమును, పండ్రెండు దినములుపట్టు ద్వాదశాహములను గురించి చెప్పుచున్నది. వెనుకటి భాగమందు అగ్నిహోత్రము మొదలగు వియమున్నది. కడపటిభాగము రాజుయొక్క పట్టాభిషేకవిషయమును పురోహితుని స్థానమును గురించియు చెప్పుచున్నది.

కౌషీతకి బ్రాహ్మణమునకు సాంఖ్యాయనమనికూడ యందురు. దీనిలోకూడ సోమయాగవిషయము చెప్పబడియున్నది. దీనిలో అగ్ని ఆధానవిధియు, అగ్నిహోత్రవిధియు, పౌర్ణిమ అమావాస్య కర్మవిధానమున్న నాలుగు మాసయజ్ఞములున్ను, కౌషీతకి మొదలగు చిన్నఉపనిషత్తులున్ను వున్నవి.

కృష్ణ యజుర్వేదమునకు మైత్రాయణీయమనియు తైత్తిరీయమనియు రెండు శాఖాంతరముల ననుసరించి బ్రాహ్మణమున్నది. మైత్రాయణీయమునకు సంహితలో

నక్కడక్కడుండు భాగమే బ్రాహ్మణముగా నేర్పడియున్నది. తైత్తిరీయులకు తైత్తిరీయబ్రాహ్మణమని మూడధ్యాయములు గలబ్రాహ్మణము ప్రత్యేకముగ నున్నది. ఈ బ్రాహ్మణమునకు చేరికగా తైత్తిరీయ అరణ్యక మొకటియున్నది. దీనిలోని కడపటి యధ్యాయములు తైత్తిరీయ ఉపనిషత్తును మహానారాయణ లేక యాగ్నికి ఉపనిషత్తును గలిగియున్నవి.

శుక్ల యజుర్వేదమునకు 100 అధ్యాయములుగల శతపథ బ్రాహ్మణమున్నది. దీనికికూడ మధ్యందిన మనియు కణ్వమనియు రెండుశాగము లున్నవి. మొదటిది 14 భాగములను రెండవది 17 భాగములును గలిగియున్నవి. వీటిలో కడపటియారు అధ్యాయములు బృహదారణ్యకోపనిషత్తైనది. శుక్ల యజుర్వేదముయొక్క కడపటి యధ్యాయమున ఈశోపనిషత్తున్నది. దీనిలో 17 ఉపనిషత్తులుకూడ వున్నది.

సామవేదమున తాండినులు తలవకారులు అనుశాఖభేదములుగల రెండు బ్రాహ్మణములున్నవి. తలవకారుల బ్రాహ్మణమున కేనోపనిషత్తు ఉన్నది. తాండినుల బ్రాహ్మణమునకు పంచవింశ బ్రాహ్మణమని పేరు. దీనిలో సోమయాగమును మరియు నితరచిల్లర యాగములకు చేరినవిధులున్నవి. వీరికిచేరిన ఛాందోగ్య బ్రాహ్మణమని మరియొకటియున్నది. దీని మొదటి రెండధ్యాయములయందు జనన వివాహవిధులున్నవి. తక్కిన 10 అధ్యాయములు ఛాందోగ్యోపనిషత్తైనది. దీనియందు మరికొన్నియుపనిషత్తు లున్నవి. అధర్వవేదమున పెక్కు ఉపనిషత్తులున్నవి. ముండకప్రశ్న మాండూక్య మొదలగు 27 ఉపనిషత్తులిందున్నవి.

(సశేషము.)

---

## ఆత్మబోధ

### 4-వ పాఠము.

ఇట్లు పైనచెప్పినరీతి మనిషియనిపించుకొను చైతన్యము ఏడుశరీరములు ధరించియున్నది. ఈ శరీరములు మనిషికాదు. మనము వేసుకొను అంగీలవలె వాటిని వేరని తెలియవలసినది. అంగీలను మనమనుకొనుట యసంగతమగునట్లు ఈశరీరములే మనిషియని భావించుట యజ్ఞానముకాని వేరుకాదు. ఈ శరీరములు మనము వేరని మొదట తెలియవలసినది. వెనుక తగుమైన సాధనవల్ల శరీరములనుండి మనము వేరగుటకు

నేర్చినప్పుడు మనము శరీరముకంటె భిన్నమైనవారని యనుభవమువల్ల గనుగొనెదము. ఒకసారి యట్టియనుభవము గలిగిన శరీరములే మనమనుభవమెన్నటికి మరల గలుగుటలేదు. ఈ నిజమైన విషయమును అజ్ఞానములో మునిగిన ప్రపంచపు జనులు తెలిసిన, వారి బ్రతుకుయొక్క లక్షణము మారి, సంసారదుఃఖమించుకయైన లక్ష్యపెట్టక, సన్మార్గమున నడచుచు లోకంబున దమకు నితరులకు సుఖము సిద్ధమగునట్లు నడచుకొనుటకు సదుపాయముగలుగును. భూమిమీద బోవుటకు బండిని, నీటబోవుటకు నోడను ఆకాశమున బోవుటకు పొగగుమ్మటమును మన ముపయోగించునట్లు సృష్టియందుండు లోకముల సంచరించ ప్రతిమనుష్యునికిని నీ యేడు శరీరములు సిద్ధమైయున్నవని తెలియవలెను. ఈ శరీరముల విషయమై మరికొంత సవిస్తరముగ విచారించుదము.

స్థూలశరీరము:—స్థూలశరీరమన స్థూలశరీరము స్థూలప్రతిఫలము ఈ రెండు శరీరములు చేరినవియని యనుకొననగును. ఏలన నివి స్థూలపదార్థముచేతె చేయబడి ప్రతిజన్మమునకు వేరగుచుండును. అదిగాక ఈ లోకమును విడువజాలకుండు వరకు నీ రెండు శరీరములనే ముఖ్యముగ వాడుకొనుచున్నాము. ఈ శరీరముల పదార్థము వేరు లోకములకుబోవ సమర్థతగాదు. ఈ శరీరములో ప్రజ్ఞయుండువరకు కాల దేశస్థితులకు గట్టుబడియుండును. ఈ శరీరములనుండి ప్రజ్ఞను కొంచెము వేరు జేయ సాధ్యమున్నను అట్లువేరుజేయుట యనుచితముగాదు. స్థూలశరీరము దాని ప్రతిఫలమును అవిచేయబడిన పదార్థము ననుసరించి గుర్తించ సాధ్యమగును. స్థూల ప్రతిఫలము స్థూలమునుబోలి, దానిచైతన్యమునకు గావలశిన ప్రాణమునకు స్థానముగా నున్నది.

ప్రకృతిపదార్థము ఏడు విధములుగనున్నది. అవి యేవన, గట్టి, ద్రవము, వాయువు, 4 విధముల ఆకాశము. ఒక విధము మరియొక విధమగుటకు అటంకమేమియులేదు. సాధారణస్థితిలో ఒకవిధముగానున్నను అనగా బంగారు గట్టిగాను, నీరు ద్రవరూపముగా, గాలి వాయురూపముగానున్నను, వాటిని వేరు విధములుగా అనగా బంగారును ద్రవముగాను, నీటిని గట్టిగాను, గాలిని గట్టిగాను చేయ సాధ్యమగును.

ఈ స్థూలదేహమునకు మాత్రము మనిషియేమిచేసినను, ఋషికాడు. అయితే యిది జ్ఞానమునకు సాధనము గనుక దీని శుద్ధిజేయవలశియున్నది. దీనిని శుద్ధిజేయకున్న జ్ఞానమును బొందుట కష్టతరమే. దేహము మనకుగాను ఉన్నదనియు మనము దానికి

గాను లేదనియు మొదట తెలియవలెను. మనము దానిని నుపయోగించుకొనవలెను. అది మనలను వుపయోగించుకొనకూడదు. గొప్ప శ్రేయస్సాధనమునకై దాని శుద్ధిచేసి మనకు నమ్రతగానుండునట్లు చేసుకొనవలయును. పూర్వవాసనలు వాడుకలు ఎట్టివైనను వాటిని లక్ష్యపెట్టక శరీరమును శోధించి మన యిష్టప్రకారము నడచుకొనునట్లు సిద్ధముజేసికొనవలయును. అది మనలను దానిరీతిబోవ నడపుటకు యత్నించిన తక్షణమే మన శ్రేయస్సు నాశనమగునని తెలియవలసినది. ఈ దేహమున నొక మంచి గుణమున్నది. అది యేదన, ఏదైన నొక వాడుక జేసిన దానినే యది యనుసరించును. ఈ గుణమువల్ల దానిని మన సేవకునిగా జేయుటకు సులభసాధ్యముగనున్నది. గనుక మనము మొదట కొంచము ప్రయత్నముచేసిన చాలును. ఆదోవనే యది యనుసరించును. గనుక సన్మార్గమునకు కొంత ప్రయత్నము చేయుము.

(సశేషము.)

## తలంపేనడత.

ఇది యేమిచిత్రము. ఆకనుపించునాతడు బహుదవ్వునలేడు చాచినచేయి ముడిచినవాడునుగాడు. మరలి నాకైపువచ్చుటకు ప్రతిబంధకమేమైన యుండునను కొందమా యట్టిదేదియు కనబడదు. మోసినమోతయో వేసటలేక ఘాసతృష్ణకులోబడిన రాసభమువలె దానుండినచోటనే యడుగులిడునుగాని పథికభావమించుకైన జూపడు. ఆపలలాశి * తలమీది వలికొప్పను † జూడ దేహము గలతరించు. మఱియు వానిలలాట లిఖితమును వెల్వరించు. పూర్వజన్మమున వీడొక లలాయముగనుండి యుండునుగాని వేఱొండుగాదు. త్రోవదప్పి ఈఘోరకాననముఁ జొచ్చి ఇయ్యది నిర్జనప్రదేశంబని తెలిసి ఆ మలదూషిత భారమును శిరమునుండి తప్పించి ప్రాణరక్షణ చేసికొనలేదు గదా! ఎంతటి లుబ్ధుడో నేనెఱుగ.

మఱియు నావైపుదృష్టివిడడు. నన్నుబిలుచుట మానడు. కదలియిటు రాడైన రాడు. విస్మయాన్విత లక్షణావిష్టుడై దిక్కుదిక్కుల దృష్టిసారించి స్వేచ్ఛావిహారపరుడై ఇంద్రియప్రకోపపూర్వకముగా వినయానందభరితచిహ్నల నగపరుచుగా! అహాహా మోసబోతిని. నాపాపమైపరీత్యంబేమి. యతని సుఖానంద సంభ్రమంబేమి! తా జెడినకోతి వనమెల్ల జెరిచెనను చందంబున ప్రవృత్తిమార్గ పరాఙ్ముఖుడై పడరాని

---

* రాక్షసుడు. † కొండ.

యిడుములబడి ప్రాణముల గోలుపోయి పొలదిండివాతంబడి జలజరించు నొక పోల తుక విధమున నామలినరీతుల నెల్లమాని జలదము నే నమ్మి నోరుదెఱచు చలచంచువు వలె నేకాగ్రచిత్తమున గురుసమ్ముఖము నే గోరుచున్న నాకుం బ్రాప్తంబైన యాయాప్త సూచనల జేగొని సిద్ధిబడయుదనను తరుణములో నీప్రవాహాతుడేర్పడెగదా. ఈ పాతకుని రాక నెదురుచూచుచు నే నిలుచుండిన యీఘోరారణ్యనివృతమును ఆయానంద † కానన నావృతమును యీజన్మమున బడయుదు.

నాయాకను దీర్చిన యా యాకాశవాణి నన్నేమనిదలచు. ఈ మహారణ్యమును నాపాలిటికి బ్రకృతిము గృహారామముగ గావించి నె నిర్గమించుటకు ద్రోవజూపిన యామహాలక్ష్మి నన్ను పేక్షింపక విడుచునా! అత్యాతురముగ గోరినని నన్నాదరించి పైసూచనల యర్థమును గ్రహించునిమిత్తము శుద్ధమ నిచ్చిన యాఘాతేశుడు నన్ను గృతఘ్నుడనకమానునా. ఇదివరకే జేసిన గాలక్ష్యమటుండె యిపుడింకను జేయు మాంద్య మునకు మన్ననయేలేదు. వీనిసంగతకమాని కౌననిర్గమ ప్రయత్నను శీఘ్రముగా గావించిన ఆమహాశక్త్యాగల క్షమకు పాత్రుడనగుదును.

అని నివృత్తిమార్గోన్ముఖుండైనిలచి ఓహో ఇది యెట్టికాలకృత విశేషము. ఇది నాజాగ్రతావస్థయేనా లేదా, అజ్ఞానబలమధికముగాగల స్వప్నావస్థయా? అథ వా స్వప్నమండైన నింతటి స్వాభిమానము తలంపుకు రాదగునా? పరార్థవైరము నార్యులు మహాదోషంబుల నొకటిగా గణింపక వాని కౌపల దానికొక యునికినేర్ప అచి యట్టి తమోగుణచంద్రమునికి ఆతపనమండైన వేఱొక క్రూరతమ ఏరువను వేఱుపరచి యుంచియున్నారుగదా! స్వార్థపరుని జన్మమొకజన్మమేనా? మనుజవర్గ ములో నుండునంత స్వార్థపరత్వము నీచవర్గములనుకొను క్రింది మృగాదిజాతులలో లేదు. వానికి దృష్టాంతనందములు సులభముగాగలుగునే. మఱియు పరోపకారము ఆజాతులకు స్వభావగుణముగా నుండునే.

చూడుము.—సింహవ్యాఘ్రాదులు కడుపాకతూరి నిండిన తమప్రక్కనపడి పఱుగిడు ముక్కుడిమృగముల లెక్కింపవుగా! మఱియు పారావారము తనయందలి నీరు లవణమిళితమని యెఱిగి క్షారనీరముల వేఱుపరచి దోషరూపమైన క్షారభాగ మును దానుంచుకొని శుద్ధనిర్దోషభాగపునీటితో మేఘమును గావించి తదనుపూర్వక ముగా ప్రపంచోపకారము జేయుచుండును. నీరుగానక నోఱుదెఱచుచు దూరకాసార

† కాశీ.

దారిఁ దప్పిన కాఁకెనుబోతుకు ఘోరదర్శన మొకటి సమ్ముఖముకాఁగా ఆ కారడవిని నొక దేవదారు లిచ్చురక్షణకంటెనా? ఆ కొసరమునకు తన పర్ణాశ్రయమునిచ్చి దాని నాచ్ఛాదించి సూర్యప్రతాపమును వారించి విజాతీయమనక దాని భయదుఃఖముల దీర్చి కాపాడినగుణము స్వభావగుణముగాక వేఱేమి? సజాతీయబంధుమిత్ర రాక్షసు లందరు మడిచినపిదప రామయుద్ధమునకు నే బోవననిన రాక్షసుని ప్రాణాపేక్షకన్న స్వార్థపరత్వము నిక నవనిలో మఱియొకటికలదా! చంద్రుడు తాఁజచ్చి యీ భూమండలమును తనప్రతినిధిగా సృజించి ప్రేతమయముగా దానుండినను సూర్యుని బోషించుచు అందుకు బరిహారముగా నతను దనకిచ్చు వేడిమిని శాంతబరచి మనకు దారబోయుచుండుట తెలియగమా? ఇదిగదా పరార్థము.

స్వార్థపరుడు నివసించుభూమి రుద్రభూమి. స్వార్థపరుని ముఖావలోకనము నరకము. వాని సహవాసము భూతగణబాంధవ్యము. ఇక వానితోడి భాషణమే అవసానకాలప్రలాపము. వానిని మదినిదలంచుటకన్న ముదమున నదీకాంతుని జేరుట మేలు. గార్ధభమైనను నొక సార్థవాహుని యథాశక్తిని గొలిచి జన్మసార్థకము గావించుకొనును. సృష్టిని నిరర్థకుఁడన యీస్వార్థపరుఁడొకడేను. ఈ గుణశిరోమణి యీ జన్మమందేగాక ఉత్తరజన్మల నేకములందాశాపాశపిశాచకుఁడై సర్వజనదాసుఁడై బంధుమిత్రుల గాసిపెట్టుచుండును.

పరోపకారార్థమై స్వవిషయమందలసుడనై నన హరిహరాదులైన నాగ్రహింతురా! ఈ నిర్జన కాననమునందొక సజ్జనుని విడనాడిన నాతనికి శాంతమూర్తిరూప నారాయణుడైన దన యాశ్రయము నీయడనుట విశ్రుతమగదా.

గనుక యీ కొఱమాలిన బుద్ధినిమాని యాపథికసహాయమునే మహాకర్తవ్యంబుగబూని వానికింగలుగు యిడుములు నాకునురానియనుచు వాడుండుచోటికి బోయి అయ్యా! నీవెవడవు. యిక్కడికి నేకాంగిగ నరుదెంచుటకు గారణమేమి. ఆతల మీద మూటనెక్కడ సంపాదించి కదలక నన్నును బోనీక చిత్తవిభ్రముడై యిక్కడ నీవు జేయుకార్యమైన నేమి. నీకు నావలని సహాయంబెయ్యది. నీవృత్తాంతమంతయు సవిస్తారముగా నాకు నివేదించుమాయని పలికెను.

(సశేషము).

వ. సుబ్బరాయముదల్యారు.

అంత దశరథుడు నగరులోనుండు రామునిని సభకు దోడితెమ్మని భృత్యులను బంప వారు రాముడుండు విచిత్రస్థితిని దెలిసి యతనిని గొనివచ్చిరి. అతడు దీర్థయాత్ర లన్నియు జరిపి మరల నయోధ్యకురాగానే కేవల వైరాగ్యంబుగలిగి విచారంబున నుండెను. రాముడు సభలోకివచ్చి తన మనోగతి నివర్తించ విశ్వామిత్రుని యాజ్ఞానుసారముగ వసిష్ఠుడతని మోహముపోలగ జ్ఞానోపదేశముజేసెను. (ఈ జ్ఞానోపదేశము వాసిష్ఠరామాయణమను మహాగొప్ప గ్రంథముగా నేర్పడినది అందలి విషయము ముందు వ్రాయబోవుచున్నాము).

తర్వాత విశ్వామిత్రుడు దన యాశ్రమమునకువెళ్ల నతనివెంట రాముడును లక్ష్మణుడును వెంటనంటిరి. కొంతదవ్వు వెళ్లి సరయూనదీతీరము జేరి, విశ్వామిత్రుడు కేవల దయాపూర్వక ప్రీతిగలవాడై, రాముడా, బలాతిబలయను విద్యలను జెప్పెదను. వానిని నెఱింగిన భూమండలమందు బాహుబలంబున నీకెవ్వండును సాటికాజాలడు. ముల్లోకంబుల నీకు నెవడు సమానుడుండడు. నీకు నలసటగాని దప్పిగాని మారు రూపముగాని కలుగదు. నివు నిద్రబోయినను మఱపుదగిలినను నిన్ను రాక్షసు లెదిరింపనోపరు. లోకమున సౌందర్యమున సామర్థ్యమున దెలివియందు, బుద్ధిచే గార్యాకార్యంబుల నిశ్చయించుటయందు, నుత్తరప్రత్యుత్తరములందు నీకు సరియైనవాడుండడు. ఈవిద్యలు సమస్తజ్ఞానదాయకములు. వీటిని బ్రహ్మదేవుడు సృజించియున్నాడు. నీవు ధార్మికుడవు. నీ వీవిద్యలకు బాత్రుడవు. గొప్పతపస్సుజేయ నాకు లభించినవిద్యల నీహృదయమున వేసి సాఫల్యము జేయుదును. అనంతఫలముల నిచ్చునని చెప్పి రామునకీవిద్యలుపదేశించెను. ఆ నదితీరమున నారాత్రిగడిపి కర్తవ్యందైవమాహ్నికమ్మని విశ్వామిత్రుడు వారికిజెప్ప రామలక్ష్మణులు స్నానసంధ్యావందనాది క్రియలుదీర్చి ముందు ప్రయాణమై గంగాసరయూనదుల సంగముముజేరి యచ్చట బూర్వమీశ్వరుడు దపస్సుజేయు సమయమున మన్మథుడు విఘ్నముజేయ నగ్నినేత్రంబున నతనిజూడ నాతనిశరీరంబు నీఱైనచోటిది. మన్మథుడనంగుడైనందున నీ ప్రాంత్యమున కంగదేశమని పేరైనది. ఈశ్వరుని యాశ్రమంబిదియని యనేక యాశ్రమములను విశ్వామిత్రుడు వారికి జూపుచు గంగానదిజేరి యచ్చటనున్న మునులు వారికి శిద్ధముగానుంచిన శుభాస్నావంయన మంచి నావనెక్కి గంగానదిని దాటిరి. (పూర్వకాలమున నావలుగూడ మన దేశమందుండినవని దీనివల్ల బ్రశిద్ధమగుచున్నది గదా)! వారుముగ్గురు గంగానదినిదాటి పోవుచుండ జనసంచారము లేని యడవిని

జూచి రాముడు విశ్వామిత్రుని ‘నీయడవి పేరేమి’యని యడుగ, “రాముడా! ఇంద్రుడు వృత్రాసురుని జంపినపిమ్మట నశుచిత్వము, నాకలియుంగలిగి బ్రహ్మహత్యాపాపము నొందెను. అంతట దేవతలు, ఋషులతనిని గంగాది పుణ్యతీర్థముల నభిషేకించి యతని యశుచిత్వము నాకలిని నీ దేశమున విడిపించిరి. అంత దేవేంద్రుడు దృప్తిబొంది ధనధాన్యాదికంబుల వృద్ధినొంది కరూశదేశంబని లోకంబున బ్రశిద్ధివహించు గాత మనివరంబిచ్చెను. కామరూపిణియగు వేయేన్గుల బలంబుగల తాటకయను కొమార్తెనిచ్చెను. ఆపెను సుందుడనువాడు పెండ్లి యాడెను. ఆసుందుడగస్త్యమహ ర్షిని నెదిరించి చంపబడెను. తాటక కోపించి యగస్త్యునిమీదికి వెళ్ల దాని కుమారు డగు మారీచుని రాక్షసుండవు గమ్మనిశపించెను. తాటకను దాని రూపంబుచెడి మానుష మాంసమును భక్షించుచు వికృతంబగు శరీరమును, ముఖమును గలిగియుండును గాక యని మహర్షి శపియించె నధిక కోపంబువహించి మంగళకరంబగు నీ దేశంబు నంతయు నిర్జనముగా జేయుచున్నది. దీనిని నీవు జంపిన నాలుగు వర్ణములవారికి హితము జేయువాడవగుదువు. పూర్వము విరోచనునికూతురగు మంథర భూమింజంప గోరిన నింద్రుడు దానింజంపెను. ఇంద్రునినిజంప యత్నించిన శుకునితల్లియగు భృగు మహర్షి భార్యను విష్ణువు జంపెను. గనుక నీ వెట్లు స్త్రీని జంపుదునను సందియంబు మానుము. అదియునుగాక,

> శ్లో॥ నృశంసమనృశంసంవా ప్రజారక్షణకారణాత్।
> పాతకంవాసదోషంవాక ర్తవ్యంరక్షతాసతా॥
> రాజ్యభారనియుక్తానామేషధర్మస్సనాతనః।
> అధర్మ్యాంజహి కాకుత్స్థధర్మోహ్యస్యానవిద్యతే॥

అనగా ధార్మికుడైన రాజు జనులను రక్షించుకారణమున క్రూరమైనదిగాని క్రూరముగానిది కాని మహాపాపముగాని, అపవాదము వచ్చునదిగాని, యేది ప్రజలకు హితమో దాని నవశ్యము జేయవలయును. ప్రజారక్షణ నిమిత్తమై యేకార్యమైనను జేయుట రాజ్యభారము వహించిన వారికి నెడతెగని ధర్మము. అధర్మములోనుండు నీ తాటకను జంపుట ధర్మ”మని విశ్వామిత్రుడు రామునకుజెప్పెను. అంతట రామ లక్ష్మణులిద్దరు తాటకతో బోరాడి దానిని జంపివేసిరి. ఆనాటిరాత్రి యక్కడ విశ్రమించి మరునాడు విశ్వామిత్రుడనేకాస్త్రములను బ్రహ్మాస్త్రముతో గూడ సమ గ్రంబుగనన్నియు వారికినుపదేశించెను. రాముడు సంతోషమునొంది మహర్షీ! వీటిని దెలిసికొనినందున దేవతలను నెదురింప గూడనివాడనైతిని. ఈ యస్త్రముల బ్రయోగము

81. నీళ్ల బాలుకలిపిన పాల వేరుజేయజాలకుండ మిశ్రమైపోవునట్లు జ్ఞానము సంపాదింపగోరు నభ్యాసి ప్రాపంచిక వ్యవహారమున మగ్నులైనవారితో వివేకము లేక కలసి మెలగిన తన యుద్దేశమును పోగొట్టుకొనుటగాక తన పూర్వపుభక్తి విశ్వాస శ్రద్ధలుకూడ నిర్నామముగ మాసిపోవును. పాలను వెన్న జేసిన నీటిలోకలియక తేలు నటు జీవు డాత్మసాక్షాత్కారము బొందిన నెట్టిసహవాసము జేసినను దుర్వాసనలు వానినంటవు.

82 శిశువు కలుగునంతవరకు నొక స్త్రీ తన యింటిపనులయందు పూర్ణముగ మగ్నమైయుండును. శిశువు కలిగినవెంటనే తన యింటిపనులను విడిచి వాటి యందేలాటి సంతోషమును బొందదు. అయితే దినమంత యాశిశువును ప్రేమించి యధికోల్లాసముతో ముద్దులాడుచుండునట్లొక మనుజు డజ్ఞానదశ నుండువరకు ప్రాపంచిక వ్యవహారములు జరుపుచుండును. దేవుని జూడగానే అవిరుచింపవు. దేవుని సేవజేయుట యతనికార్యములు నిర్వహించుటయే వాని సంతోషములుగానుండును.

83. సంతనుండి దూరముండువరకు నొక మనుజుఁడు హీహో! యని గొప్ప పెద్దముకొని శబ్దముమాత్రము వినుచుండును అయితే సంతను ప్రవేశించిన నట్టిగద్దలము లేక యొకఁడు వంకాయలను, ఉర్లగడ్డలను, పండ్లు ఫలములను బేరము జేయుట స్పష్టముగా జూచునట్లు దేవునినుండి దూరముండువరకు న్యాయము, తర్కము, వీటిసంభ్రమముననుండును. దేవుని సాన్నిధ్యముఁ జేరనన్ని న్యాయములు, తర్కములు, వివాదములణగి దివ్యస్వరూప మహిమను స్పష్టముగా ననుభవించును.

84. అల్లాహో! దైవమా! కృష్ణా! యని గట్టిగా నరచునంతవరకు దేవునిని గనుగొనలేదని తెలిసికొమ్ము. ఏలనన, దేవుని గనుగొన్నవాఁడు నిశ్శబ్దముగానుండును.

85. తుమ్మెద తామరరేకుల వెలుపలనుండి దాని మకరందపు చవిజూడ నంతవరకు యాపుష్పముచుట్టు తిరుగుచు ఝుంకరించుచుండును. పుష్పములోపల బ్రవేసించిన నది దాని యమృతమును నిశ్శబ్దముగా గ్రోలునట్లు మతముల నిబంధనలు సిద్ధాంతములనుగురించి వాదులాడు వరకు నిజమైనతత్త్వామృతపు చవిజూచియుండడు. చవిచూడగానే మౌనియగును.

86. గదిలో పనిబాలురు బొమ్మలతో నిష్టమువచ్చినట్లు వేడుకల నాడుచుండి తల్లిరాగానే యాబొమ్మలనవతలికిద్రోచి యమ్మాయని తల్లిని జేరునట్లు మీరందరు ధనము, గౌరవము కీర్తియను బొమ్మలవేడుకల మగ్నులై యితర చింత

లేక మెలగుచున్నారు. అయితే దైవప్రకృతి మీమనసున జేరిన నీటియందాసక్తి విడిచి యాపె సాన్నిధ్యమున జేరవరు.

87. తోటపురియను నగ్నఋషి యొక యిత్తడిపాత్ర ననుదినము శుభ్రము జేయకున్న జిలుముపట్టునట్లు దేవుని ధ్యానము నిత్యము జేయకున్న మనుజుని హృదయము మలినమగునని సెలవిచ్చెను. సరే, కాని బంగారు పాత్రమైనట్టైన నిత్యశుద్ధి యవశ్యకములేదు. దైవస్వరూపము కనుగొన్న మానవునికి దైవసంకీర్తనలుగాని తపములుగాని యనావశ్యకములని రామకృష్ణుడు బదులిచ్చెను.

88. స్వచ్ఛమైన స్ఫటికమువలె గడ్డకట్టిన కండచక్కెరను దిన్నమనుజుడు బెల్లపుపాగును రుచించనట్లును నగిరునందు పరుండినవాడు పూరిగుడిసెయందు నిద్రించుటకు నిచ్చయించనట్లు పరమానంద స్వరూపము ననుభవించిన జీవుడు ప్రాపంచిక తుచ్ఛసుఖములనిచ్ఛయింపడు.

89. రాజును ప్రియునిగా జేసుకున్న సొక మానవుని యొక మార్గభిక్షుకుని సన్మానము గైకొననట్లు దేవుని కృపాకటాక్షము బొందిన జీవుడు ప్రపంచతుచ్ఛ సామగ్రిని గమనించడు.

90. మైదానముననుండు మనుజుడు తగ్గుగానున్న గడ్డిని, గొప్ప దేవదారు వృక్షమును జూచి వృక్షమెంత గొప్పది గడ్డి యెంతచిన్నది యని యనును. అయితే వాడొక పర్వతము నెక్కి దాని శిఖరమునుండి గ్రిందజూడ గొప్ప దేవదారు వృక్షమును చిన్నగడ్డిని భేదములేని పచ్చపైరువలె జూచునట్లు ప్రాపంచికజ్ఞానమున హెచ్చు తక్కువ యంతస్థభేదములు కనబడునుగాని దివ్యదృష్టికలిగిన నిట్టితారతమ్యములు కానరావు.

91. ఉత్తపాత్రయందు నీళ్లను బోసిన బుగ్గలశబ్దము కలుగును. పాత్రమునందు నీరునిండియుండిన నట్టిశబ్దము కానరానట్లు దివ్యస్వరూపమెరుగనివాడు వ్యర్థాలాపములను జేయును. దివ్యస్వరూపమును కనుగొన్న పరహంకారమణగి మౌనియై పరమానందభరితుడగును.

92. మగనితో ప్రతిదినములాడు సరసములను తన సహచరులకు తప్ప నందరికి దెలుప నొక యువిద స్వాభావికముగా సిగ్గుపడునట్లు యోగసమాధియందనుభవించు పరమానంద వైఖరులను నిజభక్తితరులకు దెలుపనిచ్ఛయించడు. ఒకవేళ తనవంటి వారికికూడ తన యనుభవము దెలుపుట సహించడు.

## ౩-వ అధ్యాయము.

## మాయను కల్పించువాడు.

"అభ్యాసి, విషయములందు దాసీనభావము గలవాడై, యింద్రియముల కు రాజును సంకల్పకర్తను, మాయను కల్పించువానిని వెదకవలెను. మనస్సే సత్యమును విశేషముగ హతముజేయును." బ్లావట్స్కీ లోకమునకు ననుగ్రహించిన వాటిలో శ్రేష్ఠమగు బంగారు నీతులను పుస్తకమున నిట్లు వ్రాయబడియున్నది. "మాయను కల్పించువాడు" దీనికంటె మనసునకు వేరు సార్థకమైన నామములేదు.

మనస్సు జ్ఞాతకాదు. ఈ రెంటి భేదమును జ్ఞాపకమున నుంచవలయును. జ్ఞాతకును జ్ఞానసాధనమైన మనస్సునకు గల భేదమును జ్ఞాపకమున నుంచనందువల్ల నభ్యాసి కొందరలను కలతలను బొందును. శిల్పకారుని వాడుపయోగించు సమ్మెటయని యనుకొనినట్లగును.

మనస్సు ప్రకృతికి సంబంధించినది. ద్వివిధమైనది. ఒక సూక్ష్మపదార్థముచేతనైన యావరణముగలిగి కారణశరీరము మనస్సు అని పిలువబడుచు నిరవయవమై యొక విధముగను, స్థూలపదార్థముచేతనైన యావరణముగలిగి మనశ్శరీరము మనస్సు అని పిలువబడుచు సావయవమై మరియొకవిధముగ నున్నది.

ప్రకృతియందు ఆత్మయొక్క జ్ఞానభావ ప్రతిఫలమే మనస్సు. మనస్సు జీవుని భిన్నము చేయుచున్నది. జీవుని ప్రజ్ఞ వృద్ధిజెంద దనచుట్టు నన్ని ప్రక్కల ప్రతిబంధకము లున్నట్లు కనుగొనును. కొండొక కార్యాచరణమునకై యొకడు చెయిజోడు ధరించి వస్తువులను సుఖముగ స్పృశించను చిన్నవస్తువులను గ్రహించుటకును సౌకర్యలేకుండుటయును, గొప్పవస్తువులను మాత్రము తడవుటకును బరువైన మోతలను గ్రహించుటకు మాత్రము సాధ్యమున్నదని మేనుగొనును. మనస్సును ధరించిన జ్ఞాత లక్షణమిట్టిదే. చేయి, చేయి జోడు రెండున్నను చే గ్రహణశక్తి తక్కువైనది. అట్లనే మనస్సు జ్ఞాతయున్నను జ్ఞాతయొక్క శక్తిస్ఫురణకు పరిమితి తక్కువైనది.

యీ క్రింద చెప్పబోవు దానియందు మనశ్శరీరము మనుస్సునుగురించి చెప్పబడుచున్నది.

మనస్సు పూర్వజన్మ సంకల్పఫలము. ప్రకృతజన్మమునందలి సంకల్పములచే నది మార్పును బొందును. అది పూర్వజన్మార్జిత కార్యఫలములగు శక్త్యాశక్తులన్ని బలాబలములనుగలిగిన నిర్ధారమైన యొకవస్తువు. అది మనము చేసినట్లున్నది. దానిని మెల్లగా

తప్ప మార్చజాలము. ఇచ్ఛాప్రయత్నముచే దాని నతిక్రమించ జాలము. దానిని వద లించుకొనజాలము. దాని న్యూనత లొక్కొక్కటిగ జక్కబెట్టజాలము. అది యుండు నట్లు, మనదియగును. అది మనము గ్రహించి కావించుకొన్న యనాత్మరూపము. దాని ద్వారా గానే మనకు జ్ఞానముపరిణమించగలగు.

పూర్వసంకల్పముల ఫలములు సర్వము మనోరూపమున మనవద్ద యిప్పుడు సిద్ధమైయున్నవి. ప్రతిమనస్సు వివిధముగా దనకుదగినట్లు చలించుచున్నది. చలనము యొక్క గతి, రీతి, పరిమితి ప్రతిమనస్సు ననుసరించి భేదములుగానున్నవి. ఆచలనము వివిధరూప పరంపరలను సిద్ధము చేయుచున్నది. బాహ్యమునుండి మనకు గలుగు ప్రతిభావము చలనరూపమైన మనస్సునుదగల, నప్పటికి సిద్ధమైయుండు చలనము బాహ్యభావమున మార్పుగలుగ జేయుటగాక తానును మార్పును బొందును గనుక దానిఫలమేమన, క్రొత్తభావము మనస్సున శుద్ధముగ బ్రతిఫలించుట లేదుగాని దాని యొక్కయు మనసున నదివరకు గల వాసనాచలము యొక్కయు సమ్మేళనమైన భావము సిద్ధమగును. దీనికై యొక శాస్త్రిదృష్టాంతమును చూతము. మనకండ్లయెగుట నొక యెఱ్ఱయద్దమునుంచుకొని యాకుపచ్చని పదార్థములను జూచిన, నవి నల్లగా నుండునట్లగుపడును. ఎఱుపురంగు భావమునిచ్చు చలనములు, ఆకుపచ్చభావమిచ్చు చలనముచేత మరుగుచేయబడి, కన్ను పదార్థమును నల్లగా గ్రహించునట్లు మోస పోవును. ఇటులనే ఒక పసుపురంగుగలయద్దముద్వారా నొక నీలపు వస్తువును జూడ నది నల్లగానుండు నుండునట్లగుపడును. ఈ విధమున రంగులద్వారా రంగుగల పదార్థము లను జూడ కంటికి వేరే రంగులుగలదిగా గనబడును.

---

## సత్సంకల్పములు.

60. తన్ను బంధించు సంకెళ్లను దాను జేసుకొనుచున్నాడు.

61. ప్రతిశక్తియు దానికి సంబంధించిన లోకమున వర్తించును.

62. కార్యమునకంటె నుద్దేశమె కేవలప్రాధాన్యము.

63. తనకు రాగూడదని దుఃఖమెన్నటికి మానవునకురాదు.

64. కర్తవ్యముంగ ఫలాపేక్షబంధకారణము.

65. కార్యము మాత్రము జీవునకు బంధకారణము గాజేరదు.

66. దైవత్వమును బొందువరకు మనిషికి కామముయొక్క ప్రోత్సాహ మావశ్యకము.

Continued from page 164



కర్మలుచేయుచున్నను వాడే నరులలో బుద్ధిమంతుడు, యోగి. ఎవనికర్మలు గామ సంకల్పవర్జితములో, యెవనికర్మలు జ్ఞానాగ్నిచేత దహింపబడునో వానిని పండితుడని విద్వాంసులందురు. కర్మఫలాపేక్షను విడిచి, నిత్యతృప్తుడై, నిరాశ్రయుడై, కర్మలు జేయుచున్నను కర్మజేసినవాడుకాడు. దేనిని గోరక, మనోబుద్ధులను నిగ్రహించి ప్రవృత్తిమార్గమునకు విముఖుడై శరీరపోషణకొరకు మాత్రము యుక్తమైన కర్మజేయుపురుషుని నీ పాపము స్పృశింపదు. ప్రయత్నములేక లభించిన దానితో సంతృప్తుడై, ద్వంద్వాతీతుడై, మత్సరములేక సిద్ధ్యసిద్ధులయందు సముడై కర్మజేసినను కర్మబద్ధుడుగాడు. సంగరహితుడై, ముక్తుడై జ్ఞానమున స్థిరబుద్ధిగలవాడై, భగవత్ప్రీతికొరకు జేయువాని కర్మని శ్శేషముగ నశించును. బ్రహ్మాగ్నియందు బ్రహ్మముచేత బ్రహ్మమను హోమద్రవ్యమును బ్రహ్మార్పణము జేయబడును. తనకర్మయందు బ్రహ్మమును ధ్యానించువాడు బ్రహ్మానేచేరును. కొందరు యోగులు దేవతలగూర్చి యజ్ఞమును జేయుదురు. మరికొందరు బ్రహ్మాగ్నియందు నుపాధివిశిష్టాత్మను హోమముజేయుదురు. మరికొందరుయోగులు నిగ్రహమను నగ్నియందు జ్ఞానేంద్రియములను యజ్ఞముజేచున్నారు. మరికొందరు శబ్దాదివిషయముల నింద్రియములను నగ్నియందు యజ్ఞముచేయుచున్నారు. మరికొందరు సర్వేంద్రియములను విషయములను ప్రాణాదివాయువులయొక్క కర్మలను జ్ఞానముచేత ప్రజ్వలింపబడిన యింద్రియ నిగ్రహముచేత లభించిన యోగాగ్నియందు యజ్ఞముచేయుచున్నారు. ఇంక గొందరు ద్రవ్యయజ్ఞమును, తపోయజ్ఞమును యోగయజ్ఞమును, స్వాధ్యాయ యజ్ఞమును జ్ఞానయజ్ఞముజేయుదురు. కొందరేకాగ్రచిత్తులై సాఫల్యమైన వ్రతమును కలవారగుదురు. మరికొందరపానమునందు ప్రాణమును, ప్రాణమునందు నపానమును, మరికొందరు ప్రాణాపానవాయువుల గతులను ప్రాణాయామ పరాయణులై లయింప జేయుదురు. మరికొందరు మితాహారులగుచు తమ ప్రాణవాయువుల నంతటనుండు ప్రాణవాయువుల లయింపజేయుదురు. వీరందరు యజ్ఞకర్మలను దెలిసినవారు. వీరు యజ్ఞములచేత పాపరహితులుగా జేసుకొనెదరు. ప్రాణదాయకమైన యజ్ఞశేషమును భుజించువారు శాశ్వతమైన బ్రహ్మపదమును జేరుదురు. యజ్ఞముజేయనివానికి నీలోకము ప్రయోజనకారిగాదు. కౌరవశ్రేష్టుడా! ఇంక పరలోకమెట్లగును? ఇట్లనేక విధములైన యజ్ఞకర్మలు బ్రహ్మమునందు వ్యాపించియున్నవి. ఇవన్నియు కర్మజన్యములని తెలియుము. ఇట్లు తెలిసిన నీవు విముక్తుడగుదువు. పరంతపా! పదార్థయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము శ్రేష్ఠము సకల కర్మలు, పార్థ! సంపూర్ణమను జ్ఞానమున సమాప్తినొందును. దీనిని శిష్యుడవై

విచారముచేత శుశ్రూషలంజేసి నీ వభ్యసించుము. తత్త్వవిదులైన జ్ఞానులు జ్ఞానమును నీకునుపదేశించుదురు. అర్జునా! దీనిని తెలిసిన మరల నీవు మోహపడవు. ఏలన దీనివల్ల వినాయింపులేక సమస్త భూతముల నాత్మయందును, గనుక, నాయందు గనుగొనెదవు. పాపిష్టులలో నీవు మహాపాపివైనను సమస్తపాపమును, జ్ఞానమను తెప్పచేత నీవు దాటగలవు. జ్వలించునగ్నికట్టెలను భస్మముజేయునట్లు, అర్జునా! జ్ఞానాగ్ని సమస్తకర్మలను భస్మముచేయును. ఈలోకమున జ్ఞానమువలె పావనకారి యేదియులేదు. యోగసిద్ధుడు దానిని కాలానుగుణ్యముగా నాత్మయందు గనుగొనుచున్నాడు. శ్రద్ధాయుక్తుడైన మానవుడు జ్ఞానమును బొందును. ఇంద్రియ నిగ్రహము గలవాడు గూడ బొందును. జ్ఞానమునుబొంది వాడు త్వరగా బరమశాంతిని బొందును. అయితేమూఢుడును శ్రద్ధావిహీనుడును సంశయాత్మకమైన వాడును చెడిపోవుదురు. సంశయాత్మకునకు నిహపరలోకములుగాని సుఖములుగాని కలుగవు. యోగముచేత గర్మవిడిచిన వానిని, జ్ఞానముచేత సంశయ విముక్తుడైనవానిని, ఆత్మవశ్యుడైనవానిని, ధనంజయా! కర్మలు బంధింపవు. నీ మనసున నెలకొనియుండు నీ యజ్ఞానజన్యమైన సంశయము నాత్మజ్ఞానమను ఖడ్గము చేత దెగనఱికి యోగయుక్తుడవు గమ్ము. భారతా! యుద్ధమునకులెమ్ము.

ఇట్లు దివ్యభగవద్గీతయందలి జ్ఞానయోగమను నాల్గవయధ్యాయమునకు మంగళము.

## ఐదవయధ్యాయము.

### అర్జునునివాక్యము.

### కర్మసన్న్యాసయోగము.

కృష్ణా! కర్మసన్న్యాసమును నీవు ప్రశంసించి మరల యోగమునుగూడ ప్రశంసించెదవు. ఈ రెండింటిలో నెద్ది శ్రేష్ఠమో దానిని నాకు దృఢముగా నిశ్చయించిచెప్పుము.

### శ్రీకృష్ణుల వాక్యము.

కర్మసన్న్యాసము, కర్మయోగము ఈ రెండును బరమ శ్రేయస్సాధకములే. ఈ రెంటిలో గర్మసన్న్యాసముకంటె గర్మయోగము శ్రేష్ఠము. ఇష్టానిష్టములు లేక ద్వంద్వరహితుడైన కర్మయోగిని నిత్యసన్న్యాసిగా దెలిసికొనవలెను. అర్జునా! వాడు

11. బ్రాహ్మణుఁడకస్మాత్తుగా నొక చండాలునిగాని, ప్రసవించిన స్త్రీనిగాని, సూర్యాస్తమయమైన వెనుక కులభ్రష్టపురుషునిగాని, స్పృశించిన పరిశుద్ధతనొందు విధమును నేనింక జెప్పుచున్నాను.

12. అట్టివాఁడగ్నినిగాని బంగారమునుగాని లేక యాకాశమున చంద్రపక్షమునుగాని చూడవలయును. బ్రాహ్మణులసంఘమును వెంటబెట్టుకొని వెళ్లి నదియందు స్నానముజేయవలెను.

13. ముట్టైనసమయమున నొక స్త్రీ మఱియొక స్త్రీని యంటిన మూడు రాత్రులుపవాసముండిన శుచియగునురు.

14. ముట్టైన బ్రాహ్మణస్త్రీ, ముట్టైన క్షత్రియస్త్రీని యంటిన నర్థకృచ్ఛ్రవ్రతము ప్రాయశ్చిత్తముగా సలుపవలెను. క్షత్రియస్త్రీ శుచిత్వమునకు పాదకృచ్ఛ్రవ్రతమును సలుపవలెను.

15. ఒక బ్రాహ్మణస్త్రీ వైశ్యస్త్రీని స్పృశించిన పాదోనకృచ్ఛ్రవ్రతమును సలుపవలెను. వైశ్యస్త్రీ పాదకృచ్ఛ్రవ్రతమును సలుపవలెను.

16. శూద్రస్త్రీని తాకిన బ్రాహ్మణస్త్రీ కృచ్ఛ్రవ్రతమును సలుపవలెను. శూద్రస్త్రీ దానములచే శుచియగును.

17. ఒక స్త్రీ ముట్టైన నాల్గవనాడు స్నానముచేసిన వెనుక శుచియగును. అయితే ఆమెకు విసర్జనము పూర్ణముగ నిలుచువరకును దైవపిత్ర్యకర్మ ననుష్ఠించు నధికారముగలుగదు.

18. ఏదో వ్యాధివల్లగాని అంగదోషమువల్లగాని ద్రవించుట వలన యుండిన ముట్టునకలుగు విసర్జనమునకు సంబంధపడనేరదు.

19. ఒక స్త్రీ ముట్టైన మొదటిదినమున చండాలివలె నీచురాలుగాను, రెండవదినమున బ్రహ్మఘాతినిగాను మూడవదినమున రజకగాను నాల్గవదినమున శుచియగును.

20. నాల్గవదినమున నొక స్త్రీ, ముట్టైనస్త్రీ వ్యాధివల్ల స్నానముజేయజాలకయుండిన నామెను మఱియొక శుచియైన స్త్రీ పదిమారులు స్నానముజేసి ప్రతిస్నానమయిన పిదప యామెను స్పృశింప నామె శుచియగును.

21. భోజనముచేసిన వెనుక నోటినిగడుగుకొన్న శూద్రుని దేహమును బ్రాహ్మణుడెవ్వైన ముట్టిన శుచియగుటకు స్నానము చేయవలెను. భోజనముచేసిన వెనుక నోటిని కడుగుకొనుటకు ముందు స్పృశించినవాఁడు ప్రాజాపత్యవ్రతమును సలుపవలెను.

22. భోజనానంతరమున నోరుకడుగుకొనుటకు ముందు నొక కుక్కనుగాని, శూద్రునిగాని నొక బ్రాహ్మణుఁడు స్పృశించిన నొక దినముపవాసముండి శుచియగుటకు పంచగవ్యము గ్రహింపవలెను.

23. సారాయివల్ల పవిత్రముగానట్టి కంచుపాత్రను బూడిదెతో దోమిన శుద్ధియగును. అట్లుపవిత్రమైన నగ్నిస్పర్శచే దగ్ధమైన శుచియగును.

24. ఆవు లాఘ్రాణించినగాని, కుక్కలు కాకులు మొదలగునవి ముట్టినగాని శూద్రులన్నముతినిన కంచుపాత్రలను పదిదినములబూడిదెతో తోమిన శుచియగును.

25. ఒకడు కాళ్లు గడుగుకొనినగాని పుక్కిలించి వుమ్మివేసిన కంచుపాత్ర నుపయోగపరుచుటకు ముందు భూమిలో నారు నెలలు పూడ్చవలెను.

26 27. ఇనుపపాత్రలు ఒక చోటనుండి మరియొకచోటికి స్థానభేదము చేసిన శుచియగును. సీసపాత్ర లగ్నిస్పర్శజేసిన శుచియగును. కోరలు, దంతములు, కొమ్ములు, వెండి, బంగారము, రత్నములు రాతితో జేసినపాత్రలు నీటిచేత గడిగిన శుద్ధియగును.

28. మంటిపాత్రలు నిప్పున వేడిజేసిన శుద్ధియగును. వడ్లు రాపిడివల్ల శుద్ధియగును.

29. విశేషమైన వడ్లు వస్త్రము లేవిధమునవైన నపరిశుద్ధమైన వానిమీద నీళ్లను చిలుకరించిన శుద్ధియగును. అవి కొంచెముగానుండ నీట గడుగుటవల్ల శుద్ధియగును.

30. వెదురు చర్మము, బొచ్చు, నార, దూది, పట్టుతో చేయఁబడిన వస్త్రములు నీట వద్దువల్ల మాత్రము శుచియగును.

31. పరుపును తలదిండ్లు, పచ్చని, యెఱ్ఱని వస్త్రము లెండలో వేయుటవల శుచియగును.

32. జంబుతోగాని, ముంజతోగాని చేయఁబడిన కుండలక్రిందనుంచుచుట్టలు, చీపురుకట్టలు, చేటలు, సానబెట్టుతోలు, సానరాళ్లు, కట్టెలు, గడ్డి మొదలగు వానిని కట్టుపగ్గములను నీటఁగడుగుటవల్ల శుచియగును.

33. పిల్లులు, ఈగెలు, పురుగులు, క్రిమికీటకములు, కప్పలు, శుద్ధాశుద్ధ వస్తువుల రెంటిని స్పృశించినను వాని స్పర్శవల్ల పదార్థముల శుచి కావు ఇది మను సిద్ధాంతము.

34. ఒక ప్రవాహముగాని, మరియొక ప్రవాహముతోజేరి ప్రవహించు ప్రవాహము నీటిని యొకఁడు వాడుకొన్న నా నీటిని నపరిశుద్ధముగా భావింపకూడదు. ఇటులనే యితరులుపయోగించ మిగిలిన నూనెను నపరిశుద్ధమని భావించకూడదు. ఇది మనుసిద్ధాంతము.

35. తమలపాకులు, చెరుకు, నూనె విత్తులు, నూనె, మదుపర్కము, తైలము, సోమరసము యొకఁడు వాడుకొనియున్నను శేషించియున్న భాగమపరిశుద్ధము కాదు. ఇది మనుసిద్ధాంతము.

36. బాటలనుండు బురదనీళ్లు, పడవలు, గడ్డి, కాలినయిటికెలు, వీని నెండకు గాలికి నారవేసిన శుచియగును.

37. గాలికి కొట్టుకొనివచ్చిన ధూళియు విశాలమైన నీటిప్రవాహముల శుచి కావు. స్త్రీలు, పసిబాలురు, వృద్ధపురుషులు, సదాశుచియైనవారు.

38. తుమ్మిన, దగ్గిన, యుమ్మివేసిన, లేక దేహముయొక్క భాగమును కోరికిన పిదప దన కుడిచెవ్విని స్పృశించవలెను.

39. అగ్నిదేవుఁడు, వేదములు, సూర్యచంద్రులు బ్రాహ్మణుని కుడిచెవియందు వసింతురు.

40. ప్రభాస, గంగా మొదలగు పుణ్యతీర్థములు, ప్రవాహములు బ్రాహ్మణుని కుడిచెవియందు సదావసించును. ఇది మనుసిద్ధాంతము.

41. క్షామకాలమున, వ్యాధిగ్రస్తుఁడైయుండు సమయమున తనతండ్రి దేశమున పురసంబంధమైన కలతగలిగిన నాత్మరక్షణము ముఖ్యయోచనయై యుండవలెను ఇట్టిసమయమున ధర్మానుష్ఠానము రెండవపక్షము.

42. సాధారణమైన లేక కఠినమైన విధముల వ్యాధివచ్చునప్పుడు తన దేహారోగ్యమును కాపాడుకొనవలెను.

43. కష్టమువచ్చినప్పుడు మర్యాద శుచికి సంబంధించిన ధర్మములను గమనించ నక్కరలేదు. మొదట కష్టములను నివారించుకొని వెనుక ధర్మముల నాచరించుము.

## 8-వ యధ్యాయము.

1. మెడచుట్టునుండు త్రాడురి వేసుకొనిగాని గూటమునకు కట్టిన సమయమున జచ్చిన యావుకు ప్రాయశ్చిత్తమేమి. అట్టి యావు యజమానుడు మనఃపూర్వకముగా జేయకున్నను నెట్లా పాపమును నివారణ చేసుకొనవలయును.

2. తన పాపమును వేదవేదాంగ ధర్మాధర్మ శాస్త్రపారగులైనట్టిన్ని తమ స్వకీయ ధర్మములయందు ధర్మనిరతులైనట్టి బ్రాహ్మణులకు తన పాపమును జెప్పుకొనవలెను.

3. ఆపావనుల సభయొకుట ప్రవేసించి నుడువవలసినరీతిని నేను జెప్పబోవుచున్నాను. అట్టివాని విషయమున ప్రాయశ్చిత్త స్వభావమును నిర్ధరించునది సభయే గాని వేరుకాదు.

4. తన పాపముయొక్క కారణమును పొరబాటుపడక తెలుసుకొన్న వెనుక వాడు సభసముఖమున హాజరగువరకు నేమిటిని దినకూడదు. అట్టిసందర్భమున భుజించుట పాపము. రెండంతలు హెచ్చుటకు కారణమగును. సభలేనిచోటు కూడ నట్లగును.

5. పాపహేతువులు సంధిగ్ధములుగానున్నను పాపముచేసిన లేక చేయని విషయమున నిశ్చితమైన యభిప్రాయమునకు వచ్చువరకు భోజనము చేయకూడదు. ఒక పాపమును చేసిన వెనుక దానిని దాచకూడదు. దాచిన క్షంతవ్యతను దగ్గించుటకు కారణమగును.

6–7. పాపముయొక్క యోగ్యత చులుకనైననుగాని భయంకరమైనదిగాని సజ్జనులసభలో దెలిపియొప్పుకొనవలెను. రోగమున బుద్ధిశాలురై నేర్పరులైన వైద్యుల వలె వానిని పాపమునుండి వారు నివారణజేయుదురు.

8. ఇట్లు పాపమునకు ప్రాయశ్చిత్తముజేసుకొని నిజముగా నిష్కపటులై పశ్చాత్తాపపూర్వకముగా వ్యసనపడువాడు పాపరహితుడగును.

9. ఇట్టి సందర్భమున క్షత్రియుడుగాని వైశ్యుడుగాని తన భటులతో కూడ స్నానముచేసి తడిసియై నీళ్లు కారుచున్నవస్త్రములతో కూడ నాపావనసభను మౌనముగా సమీపించవలెను.

10. ఆసభను ప్రవేసించి నోటితోనేమియు మాటాడక నా బ్రాహ్మణులకు సాష్టాంగముగా నమస్కారము జేయవలెను.

యందురు. ఇట్లనుట న్యాయమే. అయితే యిట్లువారలలో ననేకులు జ్ఞానిమాటలను నమ్ముటకు సందేహించుదురు. జ్ఞాని యీ విషయములను దెలిసియుమార్గమును ప్రదర్శింప నారంభించిన వారి యపనమ్మకములు లేటపడును. ఆ విషయము నిజమైన నందరికి తెలుపవచ్చునుకదా! మీరు చెప్పు పరలోకవిషయము నిజమైన మాకు కన్నులార ప్రదర్శింపజేయుడు యని ప్రశ్నజేతురు. తత్వములను వివాదమై సులభముగ సాధారణ జనులు గ్రహించునట్టిసంగతులని యనుకొనెదరు. ఆ విషయములు కొందరికి మాత్ర మట్లనుభవవేద్యమగునో, యెందుకు నితరులకట్లుకాదో యని జనులనేకవిధముల గని ప్రశ్న చేయుచు తొందరపెట్టుచు నెంతచెప్పినను గ్రహించుచు విశ్వాసములేక యుందురు. మరికొందరివిషయము లజ్జాగ్రతతో దమదగ్గిరకు రానివ్వక, యవి కు న్యాయముగ దోచలేదని చెప్పుచు వాటిసంబంధమునే నిరాకరింతురు. మన ఇంద్రియములకు నతీతమైన జననమరణముల విషయకమైన జ్ఞానమును మనము దెలుసు కొనజాలమని సమాధానపరచుకొనెదరు.

అయితే యట్టిప్రశ్నలకు జ్ఞానిభయపడడు. అతడు చెప్పు విషయములన్నిటిని ననుభవవేద్యముగా నుండువాడు గనుక యించుకయైన విసుకు నొందడు. కాశీపట్టణము జూచినవాడు వర్ణించుచుండ, నా పట్టణము జూడనివాడాక్షేపించిన, వాడు సరకు గొనడు. జూడనివానిని దాజెప్పినది వాడు ఒప్పుకొనునట్లు చేయుటకు ప్రయత్నము చేయుడు. గణితశాస్త్రమున గడతేరినవాడు, బాలురజ్ఞానవశమున నేదైననాక్షేపింప సరకుగొనకయుండును, అట్టి గణితశాస్త్రతత్వమును వారికి బోధచేయ దెలిసికొని నమ్మెదమనెదరు. అయితే జ్ఞానవిషయమున, జ్ఞానియగుటకు కొందరికి మాత్రము శక్తి గలదు, గనుక నీ యాక్షేపణము జక్కగా పరిశీలించినవారికి నేవిధమైన సందేహ ముండదు. తత్వమును అనుభవవేద్యము జేసుకొనువరకు సందేహించుచునేయుందురు. అట్టి అనుభవముగలిగినప్పుడు, తాము నూరకయుందురు. ఈ సంగతి సహజముగా నందరు నమ్మవచ్చును. నమ్మినను సరిగానడచుకొనరు. జ్ఞానియెక్కడ వెళ్లినను ఇట్టియపన నమ్మకములే లోకమున మెండుగనున్నట్లు కనుగొనును. ఇది కలికాలమహిమగాని వేరుకాదు. ప్రకృతకాలమున మనసుకు ఇంద్రియములకు గోచరమగు దానినే నమ్ముచు గోచరము కానిదంతయు లేనేలేదని పురస్కరించుబుద్ధిగలవారై యున్నాము. అట్టిశిక్ష యిప్పుడు మనకు సంప్రాప్తమైనది. ఈ లోకమునకు సంబంధించిన జ్ఞానము తప్ప వేరుజ్ఞానమును పరిశీలింపజాలమైతిమి. ఎక్కువశక్తికావలసియున్న వేరు లోకములయందు సాధించవలసియున్నది. ఇట్లు చెప్పుట ప్రకృతకాలమును దూషించుటకాదు. ఇది యొకమెట్టు. జ్ఞానసాధనకు అవశ్యకమైనదే. అయితే

ఈ లోకజ్ఞానమునకు చింతకట్టబడియుండుట అనేక కారణములనుబట్టి జీవుని మార్చి యున్నది. అహంకారమెక్కువై తత్త్వముదెలియనిష్టపడను. నాకునిప్పుడుండు శక్తివల్లనే నా యభిప్రాయములను సాకారముజేసుకొనెదను,' అనిచెప్పును. మనము మనఃపూర్వకముగా వృద్ధిజెందవలెనని కోరిన జ్ఞానసంపద వైఖరిని చవిజూతము, కాని సాధారణముగ లౌకికబుద్ధిచే దానిని తెలియజాలము. ఈ బోధజేయుటకై యిప్పుడు ఈ సమాజమేర్పడియున్నది.

## మా పురాణము.

18. తర్వాత యాగృహస్థుడు లోపలికవెళ్లి దానసంగుడు గనుక సంసార మును నిర్వహించు తన భార్యను జూచి, ఓ! ప్రియురాలా! నేడు యా బ్రాహ్మ ణుడు చాలాచిక్కులోనున్నాడు. ధనకావలెననుచున్నాడు నాకొక రూపాయ నివ్వమనసున్నది. నీవేమి చెప్పుదవని అహా! నీవెంత ధార్మికుడవు. రూపాయలు యోచనలేక సారవేయ నాకులు పంటివి గావు యని రూపాయధ్వనివినగానే రోషావేశముతో బగులజెప్పెను ప్రియురాలా! సరి. వాడునిరుపేద రూపాయ కంటె తక్కువ మనమివ్వరాదని వానికి చెప్పెను. లేదు అంత యివ్వనువల్లపడదు. యిదిగో రండణాలతునక యున్నది ఇష్టముండినగాని దానిని నీవివ్వవచ్చునని యామె చెప్పెను. ఆమగడు వేరుచేయుటకు శక్తిములేక నిర్బల సంసార ప్రియమునంగ దానసంగుడు గనుక తనభార్య దయచేసిన దానిని నేటి యీ బ్రాహ్మణునికి రెండణ నాడు రాగానిచ్చెను. ఇట్టియసంసారులు భార్యలమాటలువిని కాలము గడుపు నరాధములమాదిరి యనుకరించుచున్నారు. గృహస్థులుగానుండి యసంగు ప్రాపంచిక వ్యవహారముతో అపరిశుద్ధులు కాకుండ నుండవచ్చునని చెప్పువాతమున నిరాకరించుటకీయాచారము జెప్పబడెను.

19. ఇద్దరొకతోటకు వెళ్లిరి. వ్యవహారజ్ఞానముగల లౌకికుడు అచ్చటనుండి మామిడివృక్షములను లెక్కబెట్టి ప్రతి వృక్షమునుండి కాయలనెంచి యాతోట వెల యింతయుండవచ్చునని మతింపుజేసెను. రెండవవాడు తోటవానివద్దకువెళ్లి యతని స్నేహముజేసి యొక మామిడిచెట్టుక్రిందకువెళ్లి వాని యనుమతితో కొన్ని ఫలములను గొని తిననారంభించెను. ఈ యిద్దరిలో నెవరెక్కువ తెలివిగలవారు ఫలములను దిన యాకలితీరును వృథాగా చెట్లనెంచి లెఖ్ఖబెట్ట నేమిఫలము. ఎక్కువ బుద్ధిగలవాడు సృష్టియెట్లయినది యెందుకయినదని వ్యర్థముగా వాదులాడుచుండును గాని జ్ఞానముగలవాడు సృష్టికర్తనుగనుగొని పరమానందమును బొందుచున్నాడు.

'Registered No. M 716.'
SWAN SERIES No. 3

ఓం





# హంస

A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఒక యాంధ్ర బ్రహ్మజ్ఞాన మాసపత్రిక.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

వర్షము 1.] సెప్టంబరు 1908. [సంచిక 9.

## విషయసూచిక.



చెన్నపట్టణము :

వైజయంతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

హంసశాల మానేజరు గారికి వ్రాసుకొనవలయును.

సంవత్సరమునకు చందా 1 రూపాయ.

## హంసావళి.

1. షట్ప్రింశన్మంజరి :—శ్రీశంకరాచార్యులు రచించిన భజగోవింద శ్లోములనాంధ్రహూణ పద్యాత్మికముగా రచింపబడినది. ఆబాలవృద్ధులకు నానందకరమైనది. వెల 2 అణాలు మాత్రమే.

2. ఏకాదిరత్నావళి :—1 మొదలు 224 సంఖ్యవరకు గల విషయవిశేములింకు సంగ్రహింపబడినవి (అయనద్వయము, వాసనాత్రయము, సాధన చతుష్టయము, మొదలగు 1008 విషయములు) వెల 4 అణాలు మాత్రమే.

3. హంస :—ఇది మాస తెనుగు పత్రిక 1908 జనవరినుండి వెలువడుచున్న ఈ జన్మసార్థకము జేసుకొన గోరువారు దీనిని నిరాకరించ జాలరు. చందా సంవత్సరమునకు ఒక రూపాయియే.

హంసశాల,
80, అంగప్పనాయక్ వీధి,
జార్జిటవున్, మదరాస్.

ప. స. హనుమంతరావు,
కార్యదర్శి.

# THE THEOSOPHICAL SOCIETY.

# బ్రహ్మవిద్యా సమాజము.

ఈ సమాజమునకు జేరిన మధ్యజిల్లాలలోని సామాజికులందరనంతపురమున గడచిన నెల 22, 23-వ తేదీలయందు మహాసభచేరి క్లుప్తమైనరీతి కార్యనిర్వాహము జరిపిరి. ఆసభను క్రింద పద్యములతో ననంతపురముశాఖ సన్మానించెను.

సీ. ధర్మసంస్థాపన దయతోడగా చెడి యమ్మహాత్ములగొల్చు మహిమయిమ్ము,
పరమపావనరాలు బ్లావట్స్కితల్లియు కారణగురువౌచు గాచుగాత,
అతిధీరుడైనట్టి యాల్కాటుపాలు వైఖరిమాకొప్పు వమ్ముగాత,
వాగ్విలాసంబున వాణీస్వరూపమై తత్వంబువెదజల్లు తల్లియీవరు
సమసిపోవుచుండు శాస్త్రిపురాణంబు, గౌరవింపజేయ కారణంబులుదెల్ప
దేవుడిచ్చుగాత దీర్ఘాయురారోగ్య, సౌఖ్యతతని మాబిసాంటునకును.

ఓం

# హంస.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 1.] సెప్టంబరు 1908. [సంచిక 9.

## భయకోపములు.

కోపము, భయము ఈరెండును చెడుగుణములని అందరికి తెలిసినవిషయమే. అయినను ఈరెండుగుణములవలని చెడుగుణము ఇంతయని అనేకులకు తెలియదు. ఒక మనిషి కోపముకలిగినపుడుగాని భయము పొందినపుడుగాని ముఖమందు నికాసము తగ్గిపోవుటయేగాక చూడ సహించనంతటి వికారమేర్పడుట అందరు చూచుచున్నాము.

ఈకోపభయముల స్వభావమునుగూర్చి ఒక పశ్చిమదేశ శాస్త్రజ్ఞుడు, పరీక్షించి తత్త్వమును కనిపెట్టియున్నాడు.

కోపము పైకొనినపుడును, భయము పొందినపుడును, వెంటనే దేహమందలి రక్తము చెడుచున్నదనియు అట్టిరక్తము దేహమందంతటను వ్యాపించి ఆరోగ్యమునే చెఱచుననియు చెప్పుచున్నాడు.

జీవజంతువులలో త్రాచుపామునకు కోపము, భయము, అధికములని మనకందరికి అనుభవముచే తెలియును. ఒకొక్కసారి కోపము దాని పైకొనినపుడు కొంత రక్తము విషమయి ఆవిషము దవడయందుండు విషపుసంచియందు ప్రత్యేకముగా చేరిపోవునట. ఇదియొక సృష్టిచిత్రము.

మనుష్యునికి అట్టివిషపుసంచి దేహకోశములందు లేకుండుటచేసి కోపముతాకినపుడు చెడిపోయి విషమగురక్తభాగము రక్తనాళములలో ప్రవహించుటయు, అట్లుప్రవహించుటచే శుద్ధమగు రక్తప్రవాహమంతయు విషభూయిష్టమయి ఆరోగ్యము చెడుటయు సంభావ్యముగానే యున్నది. కనుకనే సుమతిశతకమందిట్లువ్రాసియున్నాడు.

## ౨ తలంపుయొక్క ప్రభావము.

క॥ తలనుండు విషముఫణికిని।
వెలయంగాఁ దోకనుండు వృశ్చికమునకున్।
తలతోఁకయనక యుండును।
ఖలునకు నిలువెల్ల విషముగదరా సుమతీ॥

భోజనమారగించునపుడు భయము కోపము వ్యసనము మనసునకు రానియ్యకూడదనియు, అట్లు రానిచ్చినయెడల తిను ఆహారమంతయు అట్టి తలంపులతో చేరుటచే విషమిశ్రితమగుననియు పరమగురువగు వశిష్ఠుడు రామునికి బోధించియున్నాడు. ఈకారణముచేతనే తల్లులు బిడ్డలకు చన్నిచ్చునపుడు శాంతహృదయులయి యుండవలెనని పెద్దలు చెప్పుదురు. భయకోపములకు పాల్పడుటచే సంభవించు అనర్థముల నిదానించి విమర్శించు అభ్యాసము మనకుండునేని జనవర్గమే బాగుపడుననుటకు సందేహముండదు.

శంకరం.

## తలంపుయొక్క ప్రభావము.

తలంపుయొక్క స్వభావమును ప్రభావమును సాధారణముగ నందరు గమనించకుండుట యెల్లరకు తెలియునుగదా? ప్రతియొకడు ఈవిషయమును తనంతకు దాను ఆలోచించనిమ్ము. ఎంతకొంచము దీనిని దాను గమనించునదిగనుగొనును.

సకలసృష్టిజాలమునకు తలంపే ఆధారము. దేవుడు తలచినందువల్ల సర్వము గలిగినదియని శృతులు ఘోషించుట విశదమేకదా. అదిఎందుకు? మనవిషయమునె చూచుకొనెదము. సర్వకార్యములకు తలంపేమూలము. తలంపులైనవెనుకనే సకల వ్యవహార ప్రయత్నములు కార్యములు జరుగుచున్నవి. తలంపులేక తృణమాత్రమైనను జరుగదు. తలంపువల్లనే సకలము జరుగుచున్నదనుట విపరీతముగాదు. దీనినిచక్కగా గ్రహించుడు.

మనమెట్లు తలంచిన నట్లగుదుమని లోకోక్తి, వేదోక్తి, శాస్త్రోక్తిగలవు. ఇది సత్యముగానే తోచుచున్నది. ఏలన, అనుదినము మనముతలచినరీతిగానే మననడత ఏర్పడుచున్నది. మనమాటలు కార్యములు దానిననుసరించి యుండును. కఠినమైన క్రూరమైన తలంపులుగలవాడు దయాపూర్ణమైన సత్కార్యములు చేయుట అసాధ్యముకదా? అట్లనే మంచితలంపులు గలవాడు క్రూరకార్యములుగాని మాటలనుగాని చూపుట దుస్తరమే.

మనతలంపులు మనమాటలయందు కార్యములయందు కనబడుటగాక తప్పక మననడకయందు, ప్రవర్తనయందు, ముఖవిలాస మందుకూడ వ్యక్తముగా నుండును. సాధారణముగా జనులు ఒకరొకరిని ఇష్టపడుట, క్రోధించుట వారివారితలంపులను సరించియేకదా చక్కగాయోచించుడు.

ప్రతిమనిషిచుట్టు వాడుతలంచుతలంపుల ననుసరించి వానిచుట్టు నొకప్రకాశ ముండును. దానిని సూక్ష్మదృష్టిగలవారు ఎరుగుదురు. తలంపులకు వివిధవర్ణములు ఏర్పడి యున్నవట. ఆప్రకాశమునుజూచిన నందలివర్ణమునుపట్టి తలంపులరీతిని గనుగొనుట సాధ్యముగానున్నదట. ఇది తెలిసినవారు చెప్పుదురు.

దీనిని సాధారణముగ మనము చూడకపోయినను ఒకమనిషి స్మరణవల్లగాని సాన్నిధ్యమువల్లగాని యేదోయొకభావముమాత్రము మనయందుగలుగుట యనుభవించు చున్నాముకదా! ఒకనినిజూచిన మనకునమ్మకముగలిగి భక్తిమర్యాదలనడుచుకొనెదము. మరియొకనిజూచిన నసహ్యపడుదుము. ఒకరికి మన మనోగతంబులు దెలిపి వానియభి ప్రాయంబులు దెలిపికొనెదము. మరియొకనిజూచిన వానితోమాట్లాడక మనరహస్య ములను దాచుకొనెదము. ఒకరితో రాత్రిపగలు చేరియుండుట సంతోషమనుకొనెదము, ఒకరువచ్చివెళ్లిన గమనించకుందుము. ఇదియంతయు దేనిప్రభావమోచూడు. తలంపుల ప్రపంచముతప్ప వేరేమైన గున్నదా యోచించుడుడు. అనుదినము ఒకవిధముగానే తలంచుచు, తలంపులట్లు ఘనీభవించును.

తలంపులు వస్తువులు, పదార్థములు. మాటలు, కార్యములకంటె బలవత్తర మైన పదార్థములు. మాటలకు కార్యములకు తలంపు కారణము

నీటిలో రాతిని వేసినట్లయిన అలలు గలుగునుగదా ఆఅలలు భావిగడ్డవరకు క్రమ ముగా ప్రసరించి భావిలోనుండు సకలపదార్థములను దాకునుగదా! అటులనే మాట లాడినట్లయిన వాయువునందు అలలుగలిగి ఆశబ్దము మనచెవినిదాక వినబడినట్లగును. అట్లు శబ్దమునడచుననుటకు ఒకచిన్నదృష్టాంతమును వినుము. కొంతదూరమున నొక చాకలవాడు బట్టలుదికిన నాశబ్దము వాడు బట్టను బండమీదవేసిన కొంతసేపటికి మనకు వినవచ్చును. బట్టను బండమీదవేసిన తత్క్షణం శబ్దముపుట్టినను మనము దూర ముండుటవల్ల శబ్దము కొంతసేపటికి వినవగును. దీనినిపరీక్షించి తెలుసుకొనుడు.

ఈరీతిగానే తలంపుమనస్సునపుట్టగానే చిదాకాశమున చలనముగలిగి దానికిదగిన వర్ణముగల రూపమేర్పడి దానియుద్దేశమునుసరించి కార్యకారియగును. ఈరూపముల

గుంపులేకర్మ యనిపించుకొనును. ఈకర్మల ప్రభావమందరికి అనుభవవేద్యమేకదా! గనుక తలంపే ముఖ్యము. సర్వ సుఖదుఃఖములకు ఆధారము. ఒకతలంపుదలచిన దానికార్యము జరుగక మానదు. మనము చెడ్డతలంపులు దలచిన నవి మనకును మనచుట్టునుండు వారికి చెడ్డదిగాక మానవు. మంచితలంచిన మంచియేయగును. మనము చెడ్డచేయుట తలంచిన ఆచెడ్డ మనను అంటియున్నదిగాని యితరులకు గలుగుట స్వల్పమే. దీనిని బాగుగ తెలియవలసినది. మనము మంచిగోరిన సర్వము మంచిదియైన చెడ్డయనునదియు చెడ్డతలంచుటకు కారణమైనదియు యుండదు. తలంపుయొక్క ప్రభావమును దెలిసిన, నొక చెడ్డ తలంపైనను మనము దలచుదమా! ఎన్నటికిని దలచము. తలంపే సర్వమునకు ఆధారము.

తలంపు అనగా మనోచలనము. మనోచలనము నిగ్రహించుటే యోగము. అనగా తలంపులను నిగ్రహించువాడు యోగి. ఒకవిధ అద్దమును సూర్యరశ్మికి బట్టుకొన్న దానిక్రింద సూర్యరశ్మి యొకటిగా చేరి యచ్చటనుంచిన దూదిగాని బట్టగాని కాలిపోనంత వేడిమిగలుగుట సాధారణముగదా! అట్లు యోగులమనస్సునుంచి వెడలినతలంపు తత్క్షణము ఫలకారిగానుండును. అట్టితలంపులే వరములు శాపములగును. అందుకే శుద్ధపురుషుల యాశీర్వాదమును పెద్దలందరు గోరుచుందురు. సాధారణ జనులమనస్సు యిట్టిశక్తిలేని సామాన్యమైన అద్దమగును.

తలంపుతప్ప లోకమున వేరుపదార్థము గనబడుటలేదు. తలంపులోనుండునది బైటసిద్ధమైనట్లు తోచును గాని తలంపులేని నిద్రసమయమున నేదియులేదు. సర్వమునకు మూలమైన తలంపులను జాగ్రతతో విమర్శించి సత్పదార్థమున నిలిపిన, పొందవలసిన వస్తువునుబొంది యఖండమైన యానందము సంప్రాప్తమగుట నిజము. ఈమార్గమున తప్ప యిహమందుగాని పరమందుగాని యేలాటిసుఖమబ్బుటలేదు. గనుకనే

'తలలుబోడులైన తలపులుబోడులా' అనియు

'తలపుచేతగల్గు దారకబ్రహ్మంబు
తలచిచూడ దానె తత్త్వమగును
తలపులోనె తలపు తానెతానెఱిగిన'

అనియు వేమన్న మాటిగా చెప్పియున్నాడు.

# రేపు మాపు.

ఎవరైన సత్కార్యమునకు ధీరత్వమునకు నెవరినైన పొగడినగాని యట్టివి యు ములు వినినగాని చూచినగాని మనముకూడ నట్టికార్యములను చేయవలెనని యనుకొనె దముకదా? మనముకూడ నొకనాడట్లు చేగలదమని యనుకొనుచుందుము. ఇట్లు మనోరథములందే యనేకులకాలము వ్యర్థమగుట యందరకు తెలియునుగదా!

ఒకడు 40 సంవత్సరములిట్లు మనోరథములందే కాలముగడపి వెనుక యముడు దన్నుగొని పోవరాగా 'అయ్యో, నేనుతలంచిన కార్యములొక్కటియైన చేయలేదు నాయాయువు యూరకగడచె, ఇక కొంతకాల మీలోకమున నుండనిచ్చిన, సత్కా ర్యములు చేసుకొనని' ప్రార్థించె, యముడట్లుగాకయనెను. అప్పుడుకూడ రేపు సత్కార్యమును చేసుకొనని దినదినము మనోరథములందే యూరక ప్రొద్దుబుచ్చి కాలము వ్యర్థముజేసి సంకటపడుచుండినను యముడు వానిని గొనిపోయెను. ఇట్లు నేకులు రేపు రేపని కాలముగడపుట యెంత వెఱ్ఱితనమో గనుగొనుడు.

ఇదిగాక కొందరు ఇతరులను బాగుపరచవలెననియు తమకు నెక్కువ ధన సంచయము అధికారమున్న గొప్పమేలుచేయ శక్తియుండునని యనుకొనుచుందురు. ఇది కేవలముతప్పు. ప్రతివాడు తనశక్తికొలది సత్కార్యములను చేయుటకు వీలుచేసు కొని సాధించవలయును. లోకమును సన్మార్గమున పెట్టుటకు దానుముందు యోగ్యత కలవాడై యుండవలయును. దీనికి దృష్టాంతము చూడుడు.

ఒకనాడొక తత్వవేత్త ఆతెన్సు అనుపట్టణమునకు నందలిజనులనుచూచి యచ్చటి వారికి దనకు తెలిసిన తత్వమును బోధచేయవచ్చెను. అప్పుడు యోగులందరతనిసన్మా నించి యతని సాంగత్యమునుగోరి యాబాలవృద్ధులతని ప్రేమించిరి. వారలలో నొక బాలుడు ధనికుని జూచినప్పుడు 'అయ్యో, వానివలె విశేషధనముండినను కీర్తివంతు డైనను ప్రపంచమును బాగుచేయుదునుకదా! ఈలోక కల్మషములను గడిగి సత్కా ర్యములు నెరవేరలుగును కదా' యని యనుకొనుచుండెను. అప్పుడు ఆతత్వవేత్త పిల్లవానిని పిలిచి 'నీవేల ఆడదానివలె ప్రలాపించుచున్నావు. జ్ఞానమందరికి సామాన్యమైనది. లోకమును బాగుపరచువాడు తానుముందు బాగుపడవలెను. లోక హితము జేయకోరువాడు తనకుసిద్ధమైన పరికరములతో పనిచేయుచుండిన విశేష

యోగ్యత క్రమముగా వచ్చుచుండును. ఈ గ్రామములో కొంత భాగమునందు సంపన్నుడై జీవించుటకు కీర్తిగాని ధనముగాని యవశ్యకము లేదు. నిన్ను నీవు దిద్దుకొన ప్రారంభించి నట్టయిన లోకమును దిద్ద ప్రారంభించిన వాడగుదువు. నీ శ్రమ వృథా యగుటలేదు' అని బోధించ నాబాలుడు తెలివిదెచ్చుకొని నడతను సవరించుకొనెను. తర్వాత అతని కీర్తి సంపద లోకమంతయు వ్యాపించెను. అతడే సాక్రిటీసు యను మహాతత్త్వవేత్త.

గనుక మంచికాలము, ధనము వచ్చువరకు సత్కార్యములు చేయుటకు స్తరమను భావము విడువుము. ఉండిన చోటనే కలిగిన స్థితిలోనే ప్రతివాడు తననడతను చక్కచేసుకొనుటకు ప్రారంభించవలయును. ప్రతిదినము సాయంత్రము పండుకొను వేళ పగలంతయు నొక సత్కార్యమైన చేసినానాయని యోచించుచుండ వలయును. కాల మేమరించి గడచిపోవును. చాలా జాగ్రత పడవలెను. ఆయువు కొంచమే గనుకనే

'కాలము వినకిక చాలా
కాలము గలదంచు నున్న కాలము నందె
కూలును తనుదా దెలియక
కూలెను తొలిబాముందు గొబ్బున వేమా'

అని వేమన్న హెచ్చరిక చెప్పుచున్నాడు.

---

## కలలు.

స్థూలప్రతిఫలము:—స్థూలశరీరవి యను చెప్పితిమికదా! ఇక ఆకాశపదార్థమున చేయబడిన శరీరవిషయమును విచారించుదము. ఇదియే రెండవశరీరమైన స్థూలప్రతిఫలము. స్థూలదేహమునుండు మెదడువల్ల మాత్రము మనకు జ్ఞానము గలుగుటలేదు. ఈ మెదడునకు సరియైన భాగము సూక్ష్మపదార్థముతో చేయబడి స్థూలప్రతిఫలమున సిద్ధమైయున్నది.

ఈస్థూలప్రతిఫలము ప్రాణమునకు స్థానమని పైననే చెప్పియున్నాము. సూర్యబింబమునుంచి జగదాధారమైన ప్రాణస్వరూపము సదా భూగోళమునకు మిక్కిలి తేజోవంతమైనను వర్ణహీనమైనరీతి వెలువడును. ఈ ప్రాణస్వరూపమును ప్రతివానియందుండు ప్లీహము (spleen) గ్రహించి దేహమున ప్రాణవాయువుగా జేసుకొనును. వెనుక ఆ ప్రాణము దేహమునందు నరములద్వారా గులాబివర్ణపు తేజోరూపమున సంచరించి ఆయురారోగ్యములు కల్పించును. వెనుక దేహమున నెక్కువైన ప్రాణము అన్నివైపుల

తేటనీలపువర్ణమున వెలువడును. ఈప్రాణముక్రమముగా మెదడునకు సంచరించినగాని భావములు కలుగవు. దీనినంతయు దివ్యదృష్టిగలవాడు కన్నులారచూచును.

రక్తసంచారము ననుసరించి దేహభావములు పైనచెప్పినరీతిమారునట్లు, ఈప్రాణ వాయువుయొక్క చలనము ననుసరించి స్థూలప్రతిఫలముయొక్క మెదడు మార్పులు బొందుచున్నది. ప్లీహమున సాధారణముగ నుండవలసిన ప్రాణమునకంటె తక్కువై ప్రాణసంచారవేగ మెక్కువైన నెక్కువకోపము గలవాడగును. అట్టివేళల కొందరు భూతములను ఆకారములను జూతురు. దేహము బలహీనముగ నుండును.

ఇట్లు రక్తసంచారము ప్రాణచలనము రెండును సమముగానుండిన, స్థూలశరీరము స్థూలప్రతిఫలము క్రమముగా చేరియుండి తద్వారాగలుగు జ్ఞానము సరిగానుండును. సాధారణముగ ఇట్లుండుటకష్టమే. నిద్రయందుండుట కంతరము.

కామశరీరము:—ఈశరీరము కామపదార్థములతో చేయబడినది. అనగా కోరికలతో చేయబడినది. దీనిపదార్థము స్థూలపదార్థము, ఆకాశ పదార్థములకంటె సూక్ష్మమైనది. మనమనసున ఏభావముకలిగినను స్థూలము స్థూలప్రతిఫలము వీటికంటె శీఘ్రముగ కామశరీరము మార్పుబొందును. ఇట్టిమార్పులు నిద్రయందుగూడ కలుగును. జాగ్రదవస్థయందు ఏభావమునైన బలవంతముగా నిగ్రహించియుండినను నిద్రావస్థ యందు అదితలచూపును. దీనివల్ల భావనలు కామశరీరమున నధికముగ మార్పులు కలుగచేయునని తెలియవలసినది.

## అవధూత యదుసంవాదము.

శ్లో॥ జ నేషుదహ్యమానేషు కామలోభదవాగ్నినా।
వతప్యసేగ్నినాముక్తో గంగాభస్థయివద్విపః ॥ ౨౯॥

కామలోభములని చెప్పబడు దావాగ్ని త్రిలోకములను దహించుచుండగా మీరుమాత్రము దానిలో జిక్కువడక శేషించి సంచరించుచుండుటను జూడ మహాదాశ్చర్యముగా నున్నయది. కార్చిచ్చు గంగయొక్క యిరుతీరముల దహించుచుండగా నొక ఏనుగు ఆనదిజలములో మునిగి విహరించుచు ఆయగ్నిజ్వాలను ధిక్కరించుచుండు దానివలె ద్వైతములను నిరాకరించి బ్రహ్మానందతీర్థములో మునిగి వర్తించుచున్నారు.

అప్రాప్తవస్తువును గోరుట కామము. అటులభించిన ప్రాప్యమును మఱియొకని

కిప్వక కౌపాడవలెనను యాసక్తి లోభము. ప్రాప్తీచ్ఛ యనునది వస్త్వాదులు సమ్ముఖ మైనపుడుగాని లేదా అనుభవజ్ఞ సజాతీయ వస్తుస్మరణవలనగాని సామాన్యముగా నుదయించును. లౌభ్యమో యిదివరలో సంపాదింపబడిన వస్తువులను గురించియు ముందు ప్రాప్తము గాదగు వానినిగూర్చియు మనసును దహింపుచుండును, గనుక కామమును సులభముగా గెల్వవచ్చును. లోభమునుజయించుట మహాదుష్కరము. అట్టిరెండు దుర్గుణములను లోబరచుకొని యున్నారు.

శ్లో॥ త్వంహినఃపృచ్ఛతాంబ్రహ్మ న్నాత్మన్యానందకారణం।
బ్రూహిస్పర్శవిహానస్య భవతః కేవలాత్మనః॥ ౭॥

మీరు బ్రహ్మవిదులు బ్రహ్మసదృశులు బ్రాహ్మణార్యులు మీరు నిజానందపూర్ణాను భవజ్ఞులుగనుక ఆయానందముయొక్క సాధనమిదియని యీయజ్ఞునికి నుపదేశించి కృపజేయవలయును. మీరు దేవసహితుల య్యును విదేహావర్తులై యున్నవారు. విషయ ములు మిమ్ముల బాధింపనశక్తములై యున్నయవి. ఈదశమీకు యేవిధముగా లభించెను. మఱియు రాజసన్మానమును గోరరు. ధనవంతుల నాశ్రయింపరు. దీనజనుల మన్నింపు దురు. నిజబోధచే మీ మనోరథమును పూర్ణము గావించుకొని కారుణ్యమే స్వరూపముగా గలిగియున్నవారు. ఇదిగాక మీరు అనాథ బంధువు. దీనదయాళువు. ఆత్మభావముతో భక్తవత్సలతను బొందినవారుగ నున్నారు. అని పలువిధముల స్తుతించి మహావినయముగా విజ్ఞాపనజేయుచు దనకెదురుగా నిలిచికొనియున్న యదు మహారాజును జూచి అవధూతులవారు ఉత్తరమిచ్చుచున్నారు.

అవధూత ఉవాచ.

శ్లో॥ సంతిమేగురవోరాజన్ బహవోబుద్ధ్యుపాశ్రితాః।
యతోబుద్ధిముపాదాయ ముక్తోటామిహతాన్ శృణు॥ ౮॥

ఓరాజా! ఆచార్యుని మూలకముగాదప్ప ఆత్మప్రాప్తి సిద్ధింపదు. నాయొక్క వివేకానుపూర్వకముగా ననేక యాచార్యులను వెదుకుకొంటిని. భూతములలో నేస్థానములందు సద్గుణములను గనుగొంటినో యాస్థాన గతస్థితులను జేగొని గురుబుద్ధిచే యంగీకరించి ధారణద్వారమున ధైర్యమునువహించి ముక్తుడనై స్వేచ్ఛగా ధరణి యందు సంచరించుచున్నాను. సద్బుద్ధిలేనియాతడు సంసారమున కత్యంతదాసుడై శేయింబగలు విరామములేక అనంత దుఃఖములచే బీడింపబడుచుండు. వైరాగ్యము గలిగి, నేనుజీవించు జీవనమెయ్యది యని విచారము జేయనిపురుషునకు గలలోనైన

ముక్తత్వముగలుగును. వైరాగ్యమువలన సద్బుద్ధి యుదయించిన సంసారనాశము మిగుల సులభముగనగును. ప్రత్యక్షముగా జూడబడు వస్తువుల వివేచనమే సంసారనాశమునకు మూలము. నేనుచెప్పను బూనుకొను గురువులందఱు భూతకోటి లక్షణములే. వానిని ఉపాయముతో పరిగ్రహించడమే వివేకముయొక్క లక్షణము. ఒకలక్షణమును దృష్టాంతముగా దీసికొనిచెప్పెదను వినుము. ఒక చేటనుజేబూని దంచిన ధాన్యము నందు కొంతపోసి చెరిగిన దానిమీదిబొట్టును యితరఅనావశ్య ద్రవ్యములును గ్రిందబడి ఉపయోగకరమైన మంచి ధాన్యపుగింజలు చేటలోనిలుచును. అటువలె వివేకవిచారము వలన త్యాజ్యమైనవానిని నిగ్రహించి స్వార్థములను పరిగ్రహింపవలయును. ఈరీతిగా విచారముపలిపిన కరగ్రస్తముకురంబుంబోలే దత్వము ప్రజ్వరిల్లును. పైజెప్పినరీతిగా వస్తువులందలి గుణములగ్రహించి వానిని గురువులుగా నేర్పరచుకొనవలయును. ఈప్రకారముగా జూచిన నీప్రపంచమంతయు సర్వము నుపదేశకర్తాధిపత్యము గలవిగా నున్నది. అదియే సృష్ట్యుద్దేశమని ధృఢముగా నెఱుగవలయు. సుగుణ స్వీకార రూపముగాగాని దుర్గుణ నిరాకరణ కారణముగాగాని యీభువిలో నెన్నిపదార్థములను గురువులుగా నేర్పఱచుకోవచ్చును. ఇట్టిసాధన మెవనికిగలదో వానికి పరమార్థతత్వము లభింపకపోదు. ఈవిధమున నాకు యిరువదినలుగురు గురువులేర్పడిరి.

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్య శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యుల వారిచే సూచింపబడిన దీనజనబంధువులను కారుణ్యసింధువులును సంసారనివారణ కర్తలును స్వయముగా సంసారసంద్రము నీదినవారును వసంతఋతువుబోలె స్వార్థోధర్మ మావంతయుయిన లేక లోకహితార్థము సంచరించువారును ఇతరుల శ్రమనుదీర్చుటయందాసక్తిని స్వభావసిద్ధముగాగల సత్పురుషులును బ్రహ్మానందరసానుభవభరిత వేదవాక్యముల నుడివినవారును కారుణ్యార్ద్ర దృష్టిగలవారును జనన మరణ క్లేశమునువారించి యభయము నిచ్చినవారును ఉపనిషదర్థ విచారపూర్వకముగా ఉత్కృష్ట జ్ఞానమునిచ్చువారును శృతివాక్యములందు మనసును నిలుపజేసి అజ్ఞానకల్పిత దేహరూపబంధమును విముక్తిగావించిన ధన్యులును అనాత్మబంధమును వివేకమువలన ద్రెంచి అవిద్యాకార్యమును జ్ఞానాగ్ని వలనగాల్చిన మహానుభావులనగువారు మహోత్కృష్టగురువులేసరి.

అయన నాగురువులెవరన :—

శ్లో॥ పృథ్వీవాయురాకాశ మాపోగ్నిశ్చంద్రమారవిః।
కపోతోజగరః సింధుః పతంగోమధుకృద్గజః॥ ౯॥
మధుహా హరిణో మీనః పింగళాకురరార్భకః।
కుమారీ శరకృత్సర్ప ఊర్ణనాభిః సుపేశకృత్॥ ౧౦॥
ఏతేమేగురవోరాజన్ చతుర్వింశతి రాశ్రితాః।
శిక్షావృత్తిభిరేతేషాం మన్వశిక్షమిహాత్మనః॥ ౧౧॥
యతోయదనుశిక్షామి యథావానాహుషాత్మజ।
తత్తథాపురుషవ్యాఘ్రనిబోధకథయామి తే॥ ౧౨॥

పృథ్వి, వాయువు, ఆకాశము, అగ్ని, జలము, చంద్రుడు, సూర్యుడు, కపోతము, అజగరము (కొండచిలువ), సముద్రము, పతంగము (మిడుత), మధుమక్షికము (తేనెటీగ), గజము, భృంగము (తుమ్మెద), హరిణము, చేప, పింగళయనువేశ్య, కురరము (హంస), బాలకుడు, కుమారి, శరకారుడు, సర్పము, సాలెపురుగు, కీటకము.

ఓనహుషపౌత్ర యదుమహారాజా యిరువదియయిదవవానిని కనుటకు యీయిరువదినాలుగు గురువుల నేర్పరుచుకొని గురుపాసించితిని. వానివలన శిక్షింపబడిన బుద్ధినిగలిగి దానితో నాయుక్తిని సమ్మేళనముజేసినందున మనసు సర్వవికల్పములను త్యజించి ఆత్మసిద్ధిని బొందినది.

వ. సు. ముదలియారు.

మాత్రము దెల్పితివి. ఉపసంహారవిధమును దెల్పు' మని ప్రార్థింప విశ్వామిత్రు డుపదే శించెను. అప్పు డామంత్రాధిష్ఠానదేవతలందరు వచ్చి 'రాముఁడా, ఇదిగో యున్నా ము, నీకేమి సేయవలయున'ని చెప్ప, రాముడు 'కార్యముగలుగ నేను దలచునప్పుడు వచ్చి నాకు సహాయము సేయు'డన వారంద 'రట్లుగాక' యని వెళ్లిరి. అంత నా ముగ్గురును ప్రయాణమై వెళ్లుచుండ, విశ్వామిత్రుడు రామలక్ష్మణులనుజూచి "ఈ యాశ్రమమున విష్ణువు బెక్కునూరుల యుగంబులు తపస్సు, యోగము, సిద్ధించుటకె వాసముజేసెను. ఇచ్చట నాతఁ డప్పుడు సిద్ధిబొందినాడు. కావున దీనిని సిద్ధాశ్రమమం దురు. ఇచ్చట విష్ణువు వామనావతారము నెత్తుటకుమునుపు వాసముచేయుచుండెను. ఆ యవతారమును బొందినపిమ్మటగూడ నిచ్చటనే యుండెను. ఇచ్చటి విష్ణువు తపంబు సేయుసమయమున ప్రహ్లాదుని మనుమడగు బలిచక్రవర్తి దేవతలనందరిని జయించి స్వర్గమును బాలించుచుండెను. అప్పుడు దేవతలందరు గుమిగూడి యగ్నిని ముందిడు కొని, బలిచక్రవర్తి యుత్తమమైన యాగము సేయుచున్నాడు. అది సమాప్తమగుట కు మునుపే మన కార్యమును సంపాదింపవలయును. ఈ యాగసమయమున నే యా చించునది యంతయు నిచ్చును. విష్ణుదేవుఁడా వామనుండవై యిప్పుడు మమ్ముల రక్షిం పుమా యని ప్రార్థింప, విష్ణువు భక్తపరాధీనుడు గనుక వామనుని రూపంబు నొంది బలిచక్రవర్తిని మూడడుగుల నేలను యాచించి గ్రహించి రెండడుగులకే ముల్లోకముల నాక్రమించి మూడవ యడుగుకు బలిచక్రవర్తిని బంధించి త్రైలోకాధిపత్యము మరల దేవేంద్రునకు నొసంగెను. అట్టి యాశ్రమంబిది. ఇందు నేను వసించుచున్నాను. నా యాగమును విఘ్నముజేయబూనిన రాక్షసులను జంపవలయును. ఈ యాశ్రమము నీదే. దీనిని బ్రవేశింపుమని విశ్వామిత్రుడు రామునకు జెప్పెను. అప్పుడు విశ్వా మిత్రుడు యాగదీక్షను వహించి యాగముజేయ నారంభించెను. అంత నారామలక్ష్మణు లాయాగము నైదురాత్రులుగాచి యాగపరాంతియందు మహాజాగ్రతతో గాచి యుండ, యాగసంపూర్ణసమయమున మారీచసుబాహు లాకాశమందుండి గ్రమ్మ నెత్తురు వెల్లువలుగా వర్షించసాగిరి. అప్పుడు రాముండు మానవాస్త్రంబును మారీచుని రొమ్మంటివేయ సముద్రతీరమునవ్వల నీటిలో నూరుయోజనంబుల దూరమున నతనిని బడద్రోసెను. ఇట్లు సకలరాక్షసుల జంపిన విశ్వామిత్రుండు యాగము సంపూర్తిజేసి రామా, నేను కృతార్థుడనైతిని. నీవు దండ్రి పనుపు గావించితివి. ఈ సిద్ధాశ్రమమును సార్థకంబుగావించితి'వని చెప్పెను. పిమ్మట నాయాశ్రమమునసున్న ఋషులు మిథిలాధ

పతియగు జనకమహారాజు యాగముచేయుచున్నాడు. మేమక్కడికి బోయెదము. “అచ్చటి యాగకాలమున సదస్సున దేవతలచే నివ్వబడిన శివునివిల్లును, రాముడా నీవు జూచెదవు. అక్కడ జనకపుత్రియైన సీతను జూచెదవు. అవింటినారి నారోపించుటకు దేవతలుగాని గంధర్వులుగాని, యసురులుగాని, రాక్షసులుగాని, శక్తులుగారు. మనుష్యులెట్లు శక్తులగుదు”రని ఋషులు రామునకు జెప్పిరి. అంత విశ్వామిత్రుండు రామలక్ష్మణ పురస్సరంబుగ మిథిలాపట్టణమునకు ప్రయాణమై వెళ్లుచు మార్గమున నొకప్రదేశమున దిగి హోమాదిక్రియలు నొనర్చి సుఖాసీనులైయున్న సమయమున “ఈదేశంబున కుశుండను బ్రహ్మపుత్రుడొకడుండెను. కుశాంబుడు, కుశనాభుడు, అమూర్తరజసుడు, వసువను నల్వురు కొడుకులు పుట్టిరి. అంత దండ్రి కొడుకులకు రాజ్యభారంబుగట్టెను. కుశనాభుండు ఘృతాచిని బెండ్లియాడి, కౌశాంబియను పట్టణమున సౌందర్యవతులగు నూర్గురు కుమార్తెలు కనెను. ఆ బిడ్డలు క్రమముగా బెరిగి వయోవంతులైరి. అప్పుడు వాయుదేవుండు వారిని కామించి ‘భార్యలుగా నుండుడు దీర్ఘాయువుగలుగు’నని జెప్పెను. ఆ కన్యలు దానిని బరిహసించి ‘వాయుదేవుడా, నిన్నును నీప్రభువైన యింద్రుని మీ యధికారస్థానములనుండి తొలగింపగలము. మా తపస్సు తఱుగునని యెంచి నిన్ను శపించక యూరకున్నాము. మమ్మునవమానింపకుము.

“పితాహిప్రభురస్మాకం పరమందైవతంహినః।
యస్యనోదాస్యతిపితా సనోభర్తాభవిష్యతి॥

మాకుప్రభువు దండ్రి, తండ్రియే పరమదైవము, మాతండ్రి మమ్ముల నెవ్వనికి నిచ్చునో వాడు మాకు పతిగాగలడని చెప్పిరి. అంత వాయువు కోపోద్దీపితుడై వారి సమస్తావయవములను బ్రవేసించి విఱువ వారు నేలంబడిరి. ఆ సమాచారము దండ్రివిని

“అలంకారోహినారీణాం క్షమాతు పురుషస్యవా।
దుష్కరంతచ్చయత్ క్షాంతం త్రిదశేషు విశేషతః॥
యాదృశీవక్షమాపుత్ర్యః సర్వాసామవిశేషితః।
క్షమాదానం క్షమాయజ్ఞః క్షమాసత్యం హిపుత్రికాః।
క్షమాయశః క్షమాధర్మః క్షమయావిష్ఠితంజగత్॥

ఓర్పు అనునది స్త్రీలకుగాని పురుషులకుగాని భూషణము. సాధారణముగా క్షమించుట కష్టము. రూపైశ్వర్యాదులుగల దేవతలపరాధము జేసినపుడు క్షమించుట చాలకష్టము. మీ నూర్వురికి నేకరీతిగా నోర్పుగలుగుట మరియు దుర్లభము. దానంబున యాగంబున, సత్యంబున, కీర్తివలన, ధర్మమున గలుగుఫలము, క్షమవల్లనౌను.

93. ఛిమ్మటిపురుగులు వెలుతురుజూచిన జీకటికి మరలిరాదు. చక్కెరగడ్డను జూచిన చీమ దానిలో జచ్చును గాని మరలరాదు. అట్లు నిజభక్తుఁడు తన యిష్టదైవమునకై తన ప్రాణమును సంతోషముతో ద్యజించును.

94. దైవభక్తుఁడెందుకు దైవమును మాతయని పిలుచును. ఏలనన, తల్లితో బిల్ల సెక్కువ స్వేచ్ఛగానుండును గనుక తల్లిని ఇతరులకంటె పిల్లలకు నెక్కువ ప్రేమకారిగా నుండును.

95. నారపాగదీయువానివలె భక్తుఁడు దేవుని స్తోత్రము జేయుటయందు మాత్రము సంతోషించడు. (నారపాగదీయువాడు 'పాగదీయుటయందు మాత్రము సంతోషించడు.)

96. భక్తునిశక్తియేది! వాఁడు దేవునిశిశువు గనుక ప్రలాపమే వానియధికశక్తి.

97. చకుముకిరాయి నీటిలో ననేకవర్షములున్నను తన యంతరాగ్నిని పోఁగొట్టుకొనదు. నీవిష్టపడునపుడు దానిని ఇనుముతో కొట్టిన ప్రకాశించెడి యగ్నికణము వెలువడును. అలాగు నిజభక్తుడు తన మతమునందు దృఢముగానుండును. తాను అనేక ప్రాపంచికమలినముల మధ్యనున్నను తన భక్తివిశ్వాసములను మానడు. దైవనామోచ్చారణమాత్రముననే మైమరచి పరవశముబొందును.

98. ఒకరాయి నీటిలో యనేకవర్షములున్నను నీళ్లు దానిని చొరవవు. అయితే బంకమన్ను నీళ్లుతగిలిన తత్క్షణమునందు మృదువగునట్లు భక్తులహృదయములు కష్టములువచ్చిన నిరాశజెందవు. దృఢభక్తలేనివాఁడల్పకారణమునకు తన మతమును చెదరించుకొనును.

99. బాలుల నిష్కాపట్యమెంత మనోహరమైనది! వాడు భాగ్యధనములకంటె నొక బొమ్మ నెక్కువగ భావించును. నిజభక్తుడట్టివాడు. ఇతరులెవరును దేవునికైమాత్రము ధన గౌరవములను నిరాకరించజాలరు.

100. దేవుడు చక్కెరకొండవంటివాడు. చిన్నచీమ చిన్న చక్కెర ఖండమును దీసుకొనిపోవును. గండుచీమ పెద్దఖండమును దీసికొనిపోవును. అయినను కొండ ముందువలె గొప్పదిగా నేయుండును. దేవుని భక్తులటువంటివారు. వారు దైవసంపత్తియణుమాత్రము బొందిన పరవశముజెందుదురు. సంపూర్ణదైవసంపత్తు నెవరు నిగ్రహింపజాలరు.

101. ఒకతార్కికుడు జ్ఞాతృజ్ఞానజ్ఞేయము లెట్టివని శ్రీరామకృష్ణుని యడుగ ఓప్రియుడా! ఈ తార్కికవాదసూక్ష్మములు నాకు దెలియవు. నాతల్లిని నేను యామె కొమారునిగామాత్రము నాకు దెలుసును.

102. హరినామోచ్చారణమాత్రముననే కేవల పరవశముచేత దేహము గగుర్పాటుచెంది ఆనందబాష్పములు కార్చునట్టి మనుజుడు తన శుభజన్మమును పొందినాడని తెలియవలయును.

103. తామరపాదము నెంతగోకిన నంతదురద హెచ్చగును. గీకిన నంత కెక్కువ సుఖముతోచును. అట్లు భక్తులు హరినామకీర్తనము సేయ బ్రారంభించిన విసుకులేక ఘంటలకొద్ది పాడుదురు.

104. సేద్యకాడై పుట్టినవాడు భూమిపండకున్నను మానడు. క్రొత్తగ సేద్యము బ్రారంభించిన వర్తకుడొక కరువుకే యధైర్యపడును. దేవునియందు దృఢమైన విశ్వాసముగలవాడు తన యావజ్జీవమున దేవుడు కనబడకున్న నధైర్యపడడు.

105. పరమానందముగ్రోలిన పరమభక్తుడు త్రాగుబోతువలెనుండును గనుక మర్యాదలంతగా గమనించడు.

106. తుంగ నిర్మలమైన గొప్పతటాకమున బెరుగదు. కాని నీళ్లునిలచిన మురిగిన గుంటలందు బెరుగునట్లు నిర్మలమై యుదారమై స్వప్రయోజన పరత్వములేని యాశ్రితులుగల జనసంఘములోన కలహములు బుట్టవు కాని స్వయంభరిత్వము, కపటము, స్వమతదురభిమానములుగలవారుండు సభలో కలహ మెక్కువగనుండును.

107. యోగులు సన్యాసులు సర్పములవంటివారు. సర్పము తనకుగా నొక రంధ్రముగావించుకొనుట లేదుగాని యెలుకలు త్రవ్విన రంధ్రమున వాసముజేయును. ఒకరంధ్రము వాసయోగ్యముకాకున్న మరియొక రంధ్రముజేరును. అట్లాగు యోగులు సన్యాసులు గృహమును గావించుకొనరు. ఇతరుల యిండ్లయందు వారికాలము గడపుదురు.

108. జ్ఞానియే జ్ఞానిని గనుగొనును. నూలవ్యాపారముజేయువాడే నూలనాణ్యము గనుగొనును.

109. తానొకడుగానున్న సమయమునకూడ దుర్మార్గము నవలంబించక చేయరానిపనులను జేయనివాడు నిజమైన దైవభక్తిపరుడు.

ఇట్లు సర్వదా ఒక వర్ణముగల పదార్థమును మరియొక వర్ణముగల పదార్థముద్వారా మనముజూచిన నుత్తకంటితోజూచినట్లుండక వేరువర్ణముగలదిగా గనపడును. పదార్థములను ఉత్తకంటితోజూచినను, జనులు వారివారికంటిశక్తిననుసరించి వివిధములుగ జూతురు. దీనిని సాధారణముగ జనులు దెలియరు. ఈప్రకారమె జ్ఞాత మనసుగుండా వెలుపలిప్రపంచమును జూచి తెలుసుకొనునపుడు రంగుగలపదార్థములద్వారా రంగుగల పదార్థములను కన్నుజూచినరీతియగును. ఎల్లకాలము ఎరుపు లేక నీలపురంగుగల అద్దములతోజూచువాడు బాహ్యపదార్థము లందవిగలిగించు వర్ణభేదములను దెలియనిరీతి, మనస్సు వికల్పభావములను గలిగించుటను జ్ఞాతదెలియదు.

ఈవ్యక్తమైన బాహ్యభావమునుపట్టియే మనస్సునకు 'మాయనుసృష్టించువాడ' ని పేరుగలిగినది. మనస్సుద్వారా బాహ్యపదార్థములయొక్క యాకారములు విరూపములు చేయబడి మనకగుపడుచున్నవి. ఆవిరూపమైనయాకారములు మనస్సు బాహ్యపదార్థములు చేరి కలిగినవి. మాయను సృష్టించువాడనుటవలన విశేషార్థముగూడగలదు. ఎట్లన మనకగుపడు విరూపమైన పదార్థరూపములుగూడ వాటియాకారరూపములు గాని వాటినిజస్వరూపములు గావు. మనకగుపడురూపములు పదార్థములనీడలనీడలే. వానినిజస్వభావమువల్ల గలుగుమాయనుమాత్రమిపుడు విచారించుదము.

కేవలవ్యవహారరూపమునందు ప్రపంచమును మనముగ్రహించినను మనప్రపంచ జ్ఞానము ఇప్పుడుండుటకంటె వేరువిధముగ నుండును. మనస్సుకల్పించు వికల్పములనుగూడ నెఱిగిన నింక చెప్పవలశినది యేమియుండును? ఇదియెంతమాత్రము అసాధ్యముకాదు. అయితే మనోనిగ్రహ మెక్కువ యభ్యాసము జేసినవారిచేత మాత్రమగును. ప్రజ్ఞను మనస్సునుండి విడదీసి మనోచలనము దడయనగును.

## సత్సంకల్పములు.

67. పైకి నెక్కుచుండ గోరికలు శుద్ధమై స్వార్థపరత్వము దక్కువగును.

68. క్రొత్తయగుచుండు ఫలాపేక్ష నొవుని గ్రొత్తకార్యములందు బ్రవర్తింపజేయును.

69. అట్లు క్రొత్తబంధములు సిద్ధమగుచుండును.

70. కోరిక యలసటను సోమరితనమును మాంద్యమును బోగొట్టి కార్యోద్యుక్తులుగావించి యనుభవముదెచ్చును.

71. ప్రకృతికి సాధారణమైన నియమముల యుద్దేశమును గొంతగ్రహించిన దన వృద్ధికిగాను దగుమైన ప్రయత్నము నభ్యాసిం సేయ యత్నించును.

72. వాడు దన నడతను విమర్శజేయుచు దానిని ఋజువైనమార్గము ననుసరించు నట్లుజేయును.

73. వాడు బుద్ధిపూర్వకముగ మనోగుణములను నీతిగుణములను దిద్దుకొనును.

74. వాడు దన యోగ్యతను హెచ్చుజేసుకొని లోపములను ఖులపరుచుకొనును.

75. వాడు గొరతలను దీర్చుకొని కొరతలను నివృత్తిజేసుకొనును.

76. అనుదినము వాడు దన మనోరథమును ధ్యానించును.

77. అనుదినము వాడు దన మనోరథము సమకూరునట్లు పాటుపడును.

78. దృఢమైన యాధారముమీద దాను గట్టడమును నిర్మించునట్లు తెలుసుకొనును.

79. శాశ్వతమైన ధర్మనియమములను రాతిమీద గట్టునట్లు తెలియును.

80. వాడు ధర్మనియమములకు మనివిజేసుకొనును.

81. వాడు ధర్మనియమములను శరణుజొచ్చును.

82. అట్టివానికి నపజయ మెన్నటికి లేదు.

83. ఇహపరలోకములందు వాని త్రోవ నడ్డగించు శక్తి యేదియులేదు.

84. వాడు శాశ్వతపదవికై సిద్ధముజేసుకొనునట్లు తెలియును.

85. ప్రవృత్తిమార్గనియమముల ననుసరించి దుష్టపదార్థములందు దమ నాశనమునకు హేతువైన బీజమంతర్గతమై యుండును.

86. మంచిపదార్థములందు నమృతత్వమునకు హేతువైన బీజముండును.

87. దుష్టపదార్థములన్నియు తామస స్వరూపములై లోకప్రవృత్తి నియమములకు విరుద్ధముగా బ్రవర్తించును.

88. గనుక యది యానియమమువల్ల శీఘ్రముగనైన నాలస్యముగనైన భిన్నము చేయబడును.

89. మంచిపదార్థములన్నియు లోకనియమముల ననుసరించియున్నవి.

90. అది ప్రవృత్తి ప్రవాహభాగముగనున్నది.

91. దీనివల్లనే మనిషికి ధైర్యముగలుగుటగాక యంత్యమున జయము నిశ్చయమనికూడ నేర్పడుచున్నది.

continued from page 100


సులభముగా బంధవిముక్తుడగును. సాంఖ్యయోగములు రెంటిని ప్రత్యేకములని చెప్పువారు బాలురుగాని విద్వాంసులుగారు. ఈ రెంటిలో నేదైన నొక్కటిగా నభ్యసించువాడు రెంటిఫలములను బొందును. సాంఖ్యులకు లభించిన పదము యోగులకు గూడ ప్రాప్తమగును. సాంఖ్యయోగముల నొక్కటిగా దెలియువాడే తెలిసినవాడు అయితే యోగములేని సన్న్యాసము లభించుట దుర్లభము. అర్జునా! యోగయుక్తుడైన జ్ఞాని త్వరగా బ్రహ్మము నొందును. యోగయుక్తుడైనవాడు, విశుద్ధాత్మగలవాడు, జితాత్ముడు, ఇంద్రియనిగ్రహముగలవాడు, సకలభూతములయందున్న యాత్మను తన యాత్మగా భావించువాడు, కర్మజేయుచున్నను కర్మచే బంధింపబడడు. తత్త్వజ్ఞుడైన యోగయుక్తుడు నేనేమిచేయనని తలచవలెను; చూచియు, వినియు, స్పృశించియు, ఆఘ్రాణించియు, భుజించియు, నడచియు, నిద్రించియు, ఊపిరివిడిచియు, మాటలాడియు, దానముచేసియు, ప్రతిగ్రహించియు, కన్నులను దెరచి మూసియు, ఇంద్రియవిషయములయందు నింద్రియములు మాత్రము చలించునని తలంచును. సకలకర్మలను బ్రహ్మార్పణము జేసి, సంగరహితుడై జేయువాడు తామరాకున నీళ్లంటనిరీతిని పాపముచే స్పృశింపబడడు. యోగులు సంగరహితులై చిత్తశుద్ధికొరకు శరీరముచేతను మనసుచేతను బుద్ధిచేతను, ఇంద్రియములచేతనుగూడ కర్మ జేయుదురు. యోగి కర్మఫలములనువిడిచి శాశ్వతశాంతినిబొందును. యోగికానివాడు కామప్రేరేపణచేత ఫలాసక్తుడై బద్ధుడగును. మనస్సుచేత సమస్తకర్మలను సన్న్యసించి నవద్వారములుగల దేహమను పట్టణమున కర్మజేయక, కర్మజేయించక పాలకుడు సుఖముగా నుండును. లోకేశ్వరుడు కర్తృత్వమును, కర్మలను, కర్మఫలసంయోగమును సృష్టించలేడు. అయినను స్వభావముగా ప్రసరించును. ఈశ్వరుడు దేని పుణ్యపాపములను గ్రహింపడు. జ్ఞానమజ్ఞానముచేత గప్పబడినది. దానిచేత ప్రాణులు మోహితులగుదురు. ఎవరియందజ్ఞానము, జ్ఞానముచేత నశింపబడునో వారియందు జ్ఞానము సూర్యునివలె పరమాత్మను వెల్లడిచేయును. బ్రహ్మమును చింతించుచు దానియందు మగ్నులై దానియందు స్థితులై, దానియందు కేవలపరాయణులై జ్ఞానముచేత పాపములు నశింపబడినవారు పునరావృత్తిరహితమైన పదవిని జేరుదురు. జ్ఞానులు విద్యావినయసంపన్నుడైన బ్రాహ్మణునియందును, గోవునందు, నేనుగయందును, కుక్కయందును, బాహ్యజాతివానియందుగూడ సమదృష్టి గలిగియుందురు. ఈలోకమునగూడ సమదృష్టిగలిగియుండు మనస్సుగలవారు సకలమును జయింతురు. బ్రహ్మము నిర్దోషమై సమమైనది గనుక వారు పరబ్రహ్మమున వసిం

చుండురు. స్థిరబుద్ధిగలిగి కలతజెందక బ్రహ్మవిదుడు, బ్రహ్మస్థితుడై, యిష్టమైనది లభింప సంతోషించడు. అనిష్టమైనది లభించ దుఃఖించడు. బాహ్యవిషయములయందు నాసక్తిలేక యాత్మయందు సుఖించువాడు బ్రహ్మమునందు యోగయుక్తుడై నాశరహితమైన సుఖమనుభవించును. విషయజన్యములైన సుఖములాద్యంతములుగలవి గనుక దుఃఖగర్భములు. అర్జునా! వానియందు పెద్దలు రమించరు. ఈదేహమును విడుచుటకుముందు, కామక్రోధములనుండి బుట్టిన యావేశమును నీలోకమున జయింప సమర్థుడగువాడు యోగి. వాడే సుధన్యుడు. సుఖియై, ఆత్మారాముడై, అంతఃప్రకాశుడైన యోగి బ్రహ్మస్వరూపియై బ్రహ్మనిర్వాణమును బొందును. ఋషులు పాపరహితులై, సంశయరహితులై, ఆత్మనిగ్రహముగలవారై సమస్తభూతహితరతులై బ్రహ్మనిర్వాణమును బొందుదురు. బ్రహ్మనిర్వాణము తమ్ముదాము దెలిసినవారికిని కామక్రోధములనువిడిచినవారికిని, నియమింపబడిన సంకల్పములుగల జ్ఞానులకును, ప్రకృతిని జయించిన సన్యాసులకును, సమీపమున సిద్ధమైయుండును. బాహ్యవిషయములను వెలుపలద్రోసి భ్రూమధ్యమందు దృష్టినిలిపి ముక్కున సంచరించు ప్రాణాపానములను సమముజేసి, యింద్రియ మనోబుద్ధులను నిగ్రహించి, కేవల మోక్షాపేక్షగలవాడై, ఇచ్ఛాభయక్రోధములను విడిచిన మహానుభావుడే నిజముగా ముక్తుడగును. యజ్ఞతపస్సులననుభవించువానిగను, సర్వభూతములకు నుపకారిగను, నన్నెఱిగినవాడు శాంతిని బొందును.

ఇట్లు దివ్యభగవద్గీతయం దు కర్మసన్యాసయోగమను నైదవయధ్యాయమునకు మంగళం.

## ఆరవ యధ్యాయము.

## ఆత్మసంయమయోగము.

### శ్రీకృష్ణునివాక్యము.

కర్మఫలాపేక్షలేక తన ధర్మమైన కర్మజేయువాడు సన్యాసి. వాడేయోగి. అగ్నిహోత్రాది క్రియలనులేనివాడుగాడు. సన్యాసమనుపించుకొను దానినే యోగమని దెలియుము. సంకల్పత్యాగములేనివాడెవడు యోగిగాడు. యోగముబొందగోరు జ్ఞానికి, గర్మ సాధనమనుపించుకొనును. యోగారూఢునకు సర్వకర్మనివృత్తియను

శమమే సాధనమందురు. ఇంద్రియవిషయములందు గర్మలందు నాసక్తుడుగాక యుండు నరుడు సమస్తసంకల్పముల ద్యజించిన యోగారూఢుండందురు. తన్ను దనచేతి నుద్ధరించుకొనవలెను. తన్నధోగతికి బొందించుకొనగూడదు. తనకుదానే బంధువు. తనకుదానే శత్రువు. తన్నుదాను జయించిన వానియందలి యాత్మకు నాత్మస్నేహితుడు. తన్ను జయిం వానికి నాత్మ శత్రువువలె శత్రుత్వమును జూపును. ఆత్మనిగ్రహముగలిగి యుపశాంతిని బొందినవాని పరమాత్మ, శీతోష్ణ సుఖదుఃఖ మానావమానములయందు సముడై యుండును. జ్ఞానవిజ్ఞానములచేత దృప్తి జెంది సుస్థిరుడై యింద్రియనిగ్రహము గలిగి మంటిపెల్లరాయి బంగారములయందు సమబుద్ధిగలిగిన యోగిని యోగారూఢుడందురు. సుహృదులందు, స్నేహితులెడ, శత్రువులెడ, నుదాశీనులెడ, బంధువులెడ, సత్పురుషులెడ, పాపాత్ములెడ సమబుద్ధిగలవాడు శ్రేష్ఠుడగును. ఒంటరిగా రహస్య ప్రదేశమునందు వసించి సంకల్పరహితుడై యాత్మనిగ్రహముగలిగి యాశలేక ప్రవృత్తి విముఖుడై యోగి సదాయోగమును దానభ్యసించవలెను. శుచియైన ప్రదేశమున, నెక్కువ యెత్తుగాలేక, తగ్గుగాక దర్భాసనముపైన కృష్ణాజినము, ఆపైన వస్త్రాసనము, గల స్థిరమైన యాసనమునగూర్చుని మనస్సు నేకాగ్రముజేసి, సంకల్పమును, ఇంద్రియవ్యాపారములను నిగ్రహించి, 'ఆసనమునందు స్థిరుడై ఆత్మశుద్ధికొరకు యోగమభ్యసించవలయును. శరీరమును శిరమును కంఠమును సమముగానిలిపి, చలించక స్థిరుడై నాసాగ్రమున దృష్టినిలిపి, దిక్కులుజూడక, ప్రశాంతాత్ముడై, భయరహితుడై, బ్రహ్మచారి వ్రతస్థితుడై, మనోనిగ్రహముగలిగి, నన్ను ధ్యానించుచు యోగయుక్తుడై నన్ను పొందగోరుచునుండవలయును. ఇట్లు సదాయాత్మయోగయుక్తుడైన యోగి మనోనిగ్రహముగలిగి నాయందుండు పరమానందభావమును, శాంతినిబొందును. అర్జునా! వెక్కుసముగ భుజించువానికిని, నేమియు దిననివానికిని, నధికముగ నిద్రించువానికిని, నెల్లప్పుడు జాగరూకతనుండువానికిని, యోగములభించదు. మితాహారవిహారముగలిగి, మితముగ గర్మజేయుచు, మితమైన నిద్రగను జాగరూకతగలవానికి యోగము సర్వదుఃఖాపహారియగును. సర్వకామ్య పదార్థములయందు నపేక్షరహితుడై, మనోనిగ్రహముగలిగి, పరమాత్మధ్యానముజేసినవాడు యోగియనబడును. మనోనిగ్రహముగలిగి యాత్మయోగము నభ్యసించు యోగికి గాలిలేనిచోటనుండు కదలని దీపము దృష్టాంతమగును. దేనియందు మనస్సు యోగానుష్టానమున నిగ్రహింపబడి యుపరతిజెందునో, తన్ను దానుజూచుచు, దనయందు దృప్తిజెందునో యింద్రియములకు గోచరములుగాక బుద్ధికి గ్రాహ్యమైన పరమానందమును గనునో 'దేనియందు

నిలిచి తత్త్వమునుండి చలించడో, ఏది లభించినదానికంటె గొప్ప లాభములేదని తలంచునో దేనియందు స్థిరుడై గొప్ప దుఃఖముచేత జలించడో దానిని యోగమని తెలియవలెను. ఇది సంయోగమునకు వియోగమయినది. ఈ యోగమును దృఢమైన నమ్మకముచేత నిరాశబొందక యభ్యసించవలయును. సంకల్పమువల్ల బుట్టిన కోరికలను నిశ్శేషముగా ద్యజించి యింద్రియసమూహములు నన్నివైపుల మనసుచేత నిగ్రహించి క్రమక్రమముగా దృఢమైన బుద్ధిచేత శాంతిని సాధించవలెను. ఆత్మయందు మనస్సు నిలిపి, యితరమును జింతించగూడదు. చంచలమై, యస్థిరమైన మనస్సు యెన్నిమారులు సంచరించిన నన్నిమారులు దానిని నియమించియాత్మవశ్యమునకు దేవలెను. శాంతిబొందిన మనస్సును, క్షీణించిన రజోగుణమును గలిగి పాపరహితుడై బ్రహ్మాత్మకమైన యోగి పరమానందము బొందును ఇట్లు సదా యాత్మయోగయుక్తుడగు యోగి బ్రహ్మస్పర్శచేత ననాయాసముగా నఖండానంద మనుభవించును. యోగయుక్తుడైన జీవుడు సకలభూతముల నాత్మను, ఆత్మయందు సకలభూతములను జూచును అంతట సమదృష్టిగలవాడగును. నన్నంతట కనుగొనువానిని నాయందు సర్వమును కనుగొనువానిని నేనెన్నటికి పట్టువిడువను. వాడెన్నటికి నాపట్టువిడువడు. అద్వైతుడై సర్వభూతములయందున్న నన్ను పూజించునో, యాయోగి యెట్లు వర్తించినను నాయందే వర్తించును. అర్జునా! ఆత్మసామ్యమువల్ల సుఖముగా, లేక, దుఃఖముగా నున్నను సర్వత్ర సమదృష్టిగలవాడు శ్రేష్ఠమైన యోగిగా దలచబడును.

## అర్జునునివాక్యము.

మధుసూదనా! నీవు జెప్పిన సమత్వముచేతనైన యీ యోగమునకు చంచలత్వముచే స్థిరమైన యాధారమును గానను. ఏలన, కృష్ణా! మనస్సు చంచలమైనది. క్షోభకారియైనది. నిగ్రహింప బలవత్తరమై కష్టముగానున్నది. వాయువువలె నిగ్రహింప దుర్లభమని నేను దలచుచున్నాను

## శ్రీకృష్ణులవాక్యము.

అర్జునా! నిస్సందేహముగా మనస్సు చంచలమైనది నిగ్రహింప నశక్యమైనది. అయితే సంతతాభ్యాసముచేతను, వైరాగ్యముచేత దానిని నిగ్రహింపవచ్చును. ఆత్మనిగ్రహములేనివానికి నీయోగము దుర్లభమని నా యభిప్రాయము. అయితే యాత్మనిగ్రహముగలవారికి దగినప్రయత్నముచేత సాధింపసాధ్యమగును.

11. వేదములు గాయత్రీ సంధ్యలను తెలియక అగ్నిహోత్రమున నాహుతి నివ్వక వ్యవసాయమున జీవించువారు నామమాత్రమున బ్రాహ్మణులగుదురు.

12. మంత్రములు, వ్రతములు లేక జీవనమునకై తమస్వధర్మములయందు వ్యాపారము జేయు బ్రాహ్మణులు వేలమందియుండు సభ యున్నను అది నిజమైనసభ యనిపించుకొనదు.

18. ధర్మశాస్త్రములయొక్క తత్వార్థమును సమన్వయించుకొను శక్తిలేక పాపకర్మవిషయమై యభిప్రాయములిచ్చు నక్షరజ్ఞానములేని మూఢబ్రాహ్మణులు పాపకర్మియొక్క పాపమును నూరుభాగములుగా జేయుటగాక తమజన్మములను కూడ నపవిత్రములుగా జేసుకొనెదరు.

14. ధర్మశాస్త్రజ్ఞానము లేక పాపకి ప్రాయశ్చిత్తకర్మను విధించుసభ పాపియొక్క పాపమును బొందును. ఆపాపి పాపవిముక్తుండగును.

16. వేదపారగులైన ముగ్గురుగాని నలుగురుగాని బ్రాహ్మణులైనను లోపమునకు ప్రాయశ్చిత్తమువిధించిన దానిని నిజమైన ప్రాయశ్చిత్తవిధిగా భావించవలెను. వేలమంది యితర మూఢ బ్రాహ్మణులు విధించునది ధర్మమైనదికాదు.

16. స్పష్టమైన న్యాయవిధుల ననుసరించి ధర్మశాస్త్రార్థములను విశదీకరించువారినిజూచి పాపము భయంపడుచున్నది.

17. ఎండ గాలి మూలకముగా శుద్ధిచేయంబడిన రాగిపాత్రలోని నీళ్లవలె పాపి సభయొక్క యాజ్ఞవల్ల పాపవిముక్తుండగును.

18. ఎండ గాలిచేత నెండింపంబడిన నీళ్లవలె పరిషత్తులయొక్క యాజ్ఞవల్ల పాపము నశించును. అది పాపినిగాని సభనుగాని యంటదు.

19. అగ్నిహోత్రక్రియలు సలుపకున్నను వేదవేదాంగవేత్తలైన ముగ్గురుగాని అయిదుగురుగాని బ్రాహ్మణులసంఘము పరిషత్ అనబడును.

20 ఆత్మజ్ఞానముగలిగి వేదయజ్ఞమును చేయుటయందును సంధ్యావదనాది క్రియలు జేయుటయందును ఆసక్తిగల నొక్కస్నాతక బ్రాహ్మణుడైనను తానొక్కడే పరిషత్ కావచ్చును.

21. పైచెప్పినరీతి అయిదుబ్రాహ్మణులు లేకున్న స్వధర్మ నిరతులైన బ్రాహ్మణులసంఘము పరిషత్ అని భావించవలయును.

22. వేలకొలది జనులుగలసభ నామమాత్రమున బ్రాహ్మణులుగానుండిన

పరిషత్ అను గౌరవముతో మర్యాదజేయగూడదు.

23. మ్రానితో చేయబడిన ఏనుగును, చర్మముతో చేయబడిన కృత్రిమజింకయు, వేదములు చదువని బ్రాహ్మణులు నామమాత్రమున నుండుపదార్థములు.

24. నీళ్లులేనిభావివలెను, విజనమైన గ్రామమువలెను, అగ్ని లేక హోమము చేసినట్టుగను మంత్రములేని బ్రాహ్మణుని జీవనము సార్థముకాదు.

25. నపుంసకునిచేత సంయోగమువలెను, బీటియందు వేసిన విత్తనమువలెను, మూఢునకిచ్చిన యయోగ్యమైన దానమువలెను ఋక్కులనుచదువని బ్రాహ్మణుని జీవనము నిరర్థము.

26. ఒకపరములో విగ్రహములు ప్రాయునపుడు వానియవయవములను క్రమముగా దిద్దురీతి బ్రాహ్మణునియొక్క బ్రహ్మవర్చస్సు క్రమముగా ధర్మక్రియలను జేయుటవల్ల నిదానముగా నేర్పడును.

27. నామమాత్రమునయుండు బ్రాహ్మణులు ప్రాయశ్చిత్త కర్మవిధులను నిర్ధారపరచిన నరకమును జేరుదురు.

28. వేదాధ్యయనము చేసి యనుదినము పంచయజ్ఞములనుగావించు బ్రాహ్మణులు త్రిలోకపాలకులు. పంచేంద్రియవిషయ భోగములయందు నాసక్తిగల పురుషులకు రక్షకులు.

29. యథావిధిగా పవిత్రపరచిన యగ్ని శ్మశానమునందు దహింపబడిన వారియొక్క పాపముల నపర్థములను నశింపజేయునట్లు జ్ఞానదీపముచేత వెలుగింపబడిన బ్రాహ్మణులు పాపములను హరించి దేవతలవగుదురు.

30. నీటియందు పడవేయవలసిన యపరిశుద్ధ వస్తువులవలె బ్రాహ్మణుల శుద్ధాత్మయను నీటియందు సకలపాపముల ధర్మములు అంతర్గతముగా జేయవలయును.

31. గాయత్రి మంత్రములేని బ్రాహ్మణుడు శూద్రునికంటె నికృష్టుడు. పరబ్రహ్మము నెరిగి గాయత్రి నుపాశించు బ్రాహ్మణులు గౌరవమునందు పవిత్రతయందు ప్రాముఖ్యులు.

32. దుష్టబ్రాహ్మణుని దేహ మింద్రియ నిగ్రహముగల శూద్రునికంటె నెక్కువ పూజనీయమ్యేము. ఒక చెడ్డయావును విడిచి ఒక సాధువైన గాడిదెను యెవరు పాలుపిండుదురు.

33. ధర్మశాస్త్ర రథముల నెక్కి విహరించుచు, వేదఖడ్గముల జేతబూని, బ్రాహ్మ

ణులు హాస్యముగాగూడ బలికినదంతయు కేవలధర్మమైనది.

34. గనుక చతుర్వేద వేదాంగపారగులై ధర్మశాస్త్రములనుజదివి సందియంబులులేని మనస్సుగలవాడు శ్రేష్ఠమైన పరిషత్తుఅగునని భావించవలెను అట్టివారు లేకుండిన, పదుగురు బ్రాహ్మణగృహస్థులు జేరినసభ మధ్యతరగతియైన పరిషత్తని భావించవలెను.

35. రాజునాజ్ఞగైకొనక ఒకప్రత్యేక విషయమున ప్రాయశ్చిత్తవిధి నిర్ణయించకూడదు అదిగాక రాజునాజ్ఞను మొదటగైకొనక విమోచనార్థప్రాయమును నుచ్చరించగూడదు.

36. బ్రాహ్మణులాజ్ఞను వ్యతిరిక్తముగా రాజుచేయ నుద్దేశించిన నాపాపము 100 అంతలై వానినంటియుండును.

37. దేవాలయముఖమున బ్రాహ్మణులు ప్రాయశ్చిత్తవిధిని నిర్ణయించవలెను. నారిమనస్సుననుండు నధర్మములను మొదట పరిశుద్ధిచేసుకొని గాయత్రీమంత్రోచ్చారణమైనవెనుక ప్రాయశ్చిత్తవిధిని నిర్ణయించవలెను.

38. ప్రాయశ్చిత్తతపము సలుపునపుడు ఆపాపి పూర్తతలను తలమీదవుండు వెంట్రుకలను గొరిగించుకొని ప్రతిదినము మూడుమారులు స్నానముచేసి ఆవులకొట్టమున రాత్రులనుగడపి పగలు ఆవులు పచ్చికమేయు స్థలములకు వానినంటవలెను.

39. అధికోష్ణశీతలమున లేక వానయందు లేక గొప్ప తుపాను వాయువుయందు పశువులు తమంతటతామె పోవునట్లువిడిచి తానుమాత్రము క్షేమకరమైన స్థానమును జూచుకొన కూడదు.

40. ఆవులు యితరులపొలములను ప్రవేశించినను లేక తనయింటియందు లేక యితరునియింటియందు వుండుధాన్యమును తినినను తమదూడలకు పాలిచ్చినను వాని విషయము నెవరికిచెప్పకూడదు.

41. ఆవులు తమదప్పిని యార్చుకొనిన వెనుక తానుద్రాగవలెను. ఆవులను సుఖమయిన యింటినిజేర్చిన వెనుక తానునిద్రించవలెను. బురదలో చిక్కుకొన్న ఆవులను విడిపించతనకట్టి యాపదలు సంభవించునట్టుండినను ప్రయత్నము చేయవలెను.

42. సత్కార్యములకై తనజీవనమును యజ్ఞముచేయు గోబ్రాహ్మణ రక్షకుడు గోహత్యనుగాని బ్రహ్మహత్యనుగాని చేసినపాపము నిశ్శేషముగా పోగొట్టుకొనును.

43. గోహత్యకు ప్రాయశ్చిత్తతపస్సు నొకప్రాజాపత్యమును విధించవలెను.

కృచ్ఛ్రప్రాజాపత్యములు నాల్గుభాగములుగా భాగించవలెను.

**44.** మొదటిదినము ఆపాపి యొకసారి భోజనముచేయవలెను. రెండవనాటి రాత్రి యొకభోజనముచేసి, మూడవదినమున భిక్షముచేత సంపాదించని యొకవస్తువును గొని తపస్సుయొక్క నాల్గవదినమున గాలితప్ప నితరమును గ్రహించకూడదు. యిదిపాద కృచ్ఛ్రప్రాజాపత్యమనబడును.

**45.** మొదటి రెండుదినములయందు ప్రతిదిన మొకసారి భోజనముచేసి రెండవ రెండుదినముల రాత్రియందు నొకసారి భోజనముచేసి మూడవ రెండుదినములయందు భిక్షముచేత సంపాదించని దానిని గొని తపస్సుయొక్క కడపటి రెండుదినములయందు గాలినిభుజించి యుండవలెను. యిది స్వపాదకృచ్ఛ్ర చాంద్రాయణ మనబడును.

**46.** మొదటి మూడుదినములు ప్రతిదినము నొకసారి భోజనమును రెండవ మూడుదినములయందు రాత్రుల నొకసారి భోజనమును మూడవ మూడుదినములయందు భిక్షముచేత లంభించని పదార్థముగొని తపస్సుయొక్క కడపటి నాల్గుదినములయందు వాయువు నాహారముగొని జీవించిన పాదకృచ్ఛ్ర చాంద్రాయణ మనబడును.

**47.** యిట్లు మొదటి నాల్గుదినములయందు నొకసారి భోజనముచేయుచు రెండవ నాల్గుదినములయందు రాత్రుల నొకసారి మాత్రము భోజనముచేయుచు మూడవ నాల్గుదినములయందు భిక్షముచేత లభించని పదార్థముదినుచు తపస్సుయొక్క కడపటి నాల్గుదినములయందు వాయువు నాహారముగాగొని జీవించిన కృచ్ఛ్రచాంద్రాయణ మనబడును.

**48—49.** యీతపస్సు ముగియగానే బ్రాహ్మణులను సంతర్పణచేయవలెను. తగినబహుమానము లివ్వవలెను. యీప్రాయశ్చిత్తకర్మచేయు సమయమున ద్విజులుకూడా పావనమంత్రోచ్చారణ చేయవలెను. యిట్లు బ్రాహ్మణుల సంతర్పణచేసిన గోహత్య చేసినవాడు పాపవిముక్తుడగును.

## తొమ్మిదవ అధ్యాయము.

**1.** ఆవుయొక్క సంరక్షణమునకు నవశ్యకముగా గట్టబడినప్పుడు నది చచ్చిన పాపము నమకూడదు. ఉద్దేశపూర్వకముగాగాని లేక నిరుద్దేశ్యముగాగాని గోహత్య చేసినట్లుగాదు.

**2.** ఒకబొట్టనవ్రేలి లావుగలిగి మూరెడు పొడవైనకొమ్మను పచ్చని యాకులకుచ్చుతో తుదయందుగల్గినదానిని దండముగా నుపయోగించవలెను.

సీ. పరమధార్మికులార పరతత్త్వవిదులార, నిజబోధనెఱిగెడి సుజనులార
ఘనులారమాయాంధ జనులం గరుణించి, మీ రెల్లప్రేమతో మేలు నెంచి
దూరదేశమున తోరంపుమైత్రితో, బహుగ్రామములనుంచి బయలుదేర
ప్రబలినపండుగై పరగుచున్నది నేడు, పరమసంతోషంబు ప్రాప్తమాయె
ధన్యతసమకూరె దైన్యంబుబాసెమా, హృదయకమలకాంతి హెచ్చెగాద
వందనంబుమీకు, వరుసగి కేలూత, తనివిదీర స్వాగతంబుమీకు.

సీ. మొదటివత్సరమున మొదలిడెగుత్తిలో, కడచె రెండవయేట కడపయందు
మూడవయేటిలో ముగిసె చిత్తూరిలో, నడచె నెల్లూరిలో నాల్గవసభ
యైదవయేటలో నాయెబళ్లారిలో, నాయెకర్నూలులో నారవసభ
చేరియున్నది నేడు చెలువుమీరెడుసభ, యియ్యేటనిచ్చట నింపుగాను
పూర్వసభలకంటె బొందికగాపుచు, కార్యనిర్వహణము గౌరవించి
లోకహితముకొరకు లోపములేకుండ, సార్థకంబుగాగ సలుపుగాక. 3.

వెనుక సుదర్శనం మొదలియారుగారు సభను స్వాగతముచేసి మిక్కిలి గణ్యమైనరీతి బ్రహ్మవిద్యాసమాజముయొక్క ముఖ్యోద్దేశమును దెలియపరచిరి. వారియుపన్యాసమును ప్రత్యేకముగా ముద్రింపించబడును. వలయువారలు ఈ పత్రిక కార్యదర్శిగారికి వ్రాసుకొనవచ్చును. దానివెల 6 పైసాలు మాత్రమే. ఇదిగాక చిత్తూరు నరసింహయ్యగారు సీతారామశాస్త్రిలవారు ఉపన్యసించిన విధమున జనులు చాలా ప్రశంసించిరి. సభకువచ్చినవారికి సన్మానముగుండ కొరతలేమియు లేక అనంతపురం శాఖనుచేరిన సామాజికులు శ్రద్ధతీసుకొనినట్లు వినుచున్నాము. ఇట్టిసభలు చేరుటవల్ల నాయాప్రదేశమునందు జనులు వాటియుద్దేశములను దురభిప్రాయములు లేక గమనించి సన్మార్గమున నడచుటకు యువ్యక్తులగుదురని అభిప్రాయముతో సభలు జరుపబడుచున్నవి. సర్వజనులకు శ్రేయస్సాధనమగుగాక.

## మా పురాణము.

20. ఒక బ్రాహ్మణుడొక తోటచేయుటకు బ్రారంభించి రాత్రిపగలు దానిని గాచుకొనుచుండెను. ఒకనాడొకయావు తోటలోనికిదూరి యాబ్రాహ్మణుడు చాలా మక్కువతోబెంచుచున్న యొక మామిడిమొలక యాకులు మేసెను. అయ్యావట్లుజేసెనని బ్రాహ్మణుడు దానిని గఱ్ఱతోగొట్టగా దేహమంతయు ఘాయమై యాదెబ్బలకు జచ్చిపోయెను. అంతలో నూరంతయు బ్రాహ్మణుడావును జంపెనని సమాచారము

పాతకముజేసెనని జనులువాదించుచుండ నేనావృత్రునిజంపలేదు. చంపినది నాచేయి. చేయికింద్రుఁడధిష్ఠానదేవత కావున నిష్ఫురునిజంపినది యింద్రుడుకాని నేనుకానని బోధించుకొను చెప్పెను,

స్వర్గమునమున్న యింద్రుఁడొంతయువిని యొకముసలిబ్రాహ్మణుని వేషము వేసుకొని తోటయజమానుని, యొద్దకువచ్చి 'అయ్యా, ఈతోట యెవరిది'యనియడిగెను.

బ్రాహ్మణుఁడు—నాది.

ఇంద్రుఁడు—ఈతోటరమణీయమైనది. నీకొకసమర్థుడైన తోటపనివాడున్నాడు. ఎందుకనగా నెంతశుభ్రము గాను చిత్రముగాను చెట్లనునాటిపెంచి యున్నాడు.

బ్రాహ్మణుడు—మంచిది, అయ్యా అదికూడనాపనియే. నేనెదురుగనుండి యీపనినంతయు జేయించినాను.

ఇంద్రుఁడు—అట్లనా! నీవుచాలా సమర్థుడవు? ఈదోవ నెవరు చేసిరి. యిదిచాలా యుక్తితో వేయబడినది.

బ్రాహ్మణుడు—ఇదియంతయు నా చేతనే జేయబడినది. అప్పుడింద్రుడు చేతులు జోడ్చి యిదియంతయు నీదిగానుండునప్పుడును ఈతోటలోనుండునంతటి కీర్తి నీదై యుండ నావృత్రునుజంపిన పాపముమాత్ర మింద్రునికిచ్చుట చాలావిచిత్రమైన ప్రజ్ఞకాదా యనెను.

**21.** కలకత్తాకు ననేక మార్గములున్నవి. ఒకడు తనగ్రామమువిడిచి ముఖ్యపట్టణమార్గముగా బ్రయాణమాయెను. వాడు దోవలో నొకనిని 'యేమార్గము శీఘ్రముగా గలకత్తాజేర్చున'ని యడిగెను. ఈమార్గమున బొమ్మని యొకడు చెప్పెను. కొంతదూర మరగినవెనుక నింకొకనినిజూచి యిదికలకత్తాను త్వరగా జేర్చునాయని వానినడుగ లేదులేదు నీవు వెనుకకుమరిగి నీయెడమచేయి మార్గమునబోవ శీఘ్రముగా కలకత్తాను జేరుదువనెను, అమనుజుడట్లజేసెను. క్రొత్తదోవయందు గొంతదూరమున బోవ నచ్చట మూడవవాడొక డచ్చటివేరుదోవ చూపెను. ఇట్లుప్రయాణీకుడు ప్రయాణమార్గమున దూరముబోవజాలక దోవలమార్పులవలన దినమంతయు గడచిపోయెను. కలకత్తానుజేర మగ్గుశించినందువల్ల మొదటివాడు చూపినమార్గము ననుసరించి యుండవలసియుండెను. అట్లు దేవునికనుగొన నిచ్ఛయించువాడొక సద్గురువునిసమ్మి నడువవలయును.

**22.** గాలిలోనుండు పక్షులన్నిటిలో గాకియొక్కటైన జ్ఞానముగలదియందురు. అదికూడనట్లనుకొనును. అదియేవలలోన దొరకదు, కొంచముపాయము సంభవించునట్లున్న నెగిరి తప్పించుకొనును. ఆహారమును చాలా చతురతతో దొంగలించును. అయినను దాని జ్ఞానమంతయును మురికిపదార్థముల సంగ్రహమునందు మాత్రము వినియోగి

'Registered No. M 716.'

SWAN SERIES No. 3

ఓం






A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఒక యాంధ్ర బ్రహ్మజ్ఞాన మాసపత్రిక.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 1.] అక్టోబరు 1908. [సంచిక 10.

## విషయసూచిక.



---

చెన్నపట్టణము:

వైజయంతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

---

హంసశాల మానేజరుగారికి వ్రాసుకొనవలయును.

సంవత్సరమునకు చందా 1 రూపాయ.

## హంసావళి.

1. షట్త్రింశన్మంజరి:—శ్రీశంకరాచార్యులు రచించిన భజగోవింద శ్లోకముల నాంధ్రభాషను పద్యాత్మికముగా రచింపబడినది. ఆబాలవృద్ధులకు నానందకరమైనది. వెల 2 అణాలు మాత్రమే.

2. ఏకాదిరత్నావళి:—1 మొదలు 2:4 సంఖ్యవరకు గల విషయవిశేషములిందు సంగ్రహింపబడినవి (అయనద్వయము, వాసనాత్రయము, సాధనచతుష్టయము, మొదలగు 1008 విషయములు) వెల 4 అణాలు మాత్రమే.

3. హంస:—ఇది మాస తెనుగు పత్రిక 1908 జనవరినుండి వెలువడుచున్నది. ఈ జన్మసార్థకము జేసుకొన గోరువారు దీనిని నిరాకరించ జాలరు. చందా సంవత్సరమునకు నొక రూపాయియే.

హంసశాల,
80, అంగప్పనాయక్ వీధి,
జార్జిటవున్, మదరాస్.

ప. స. హనుమంతరావు,
కార్యదర్శి.

# THE THEOSOPHICAL SOCIETY.

## బ్రహ్మవిద్యా సమాజము.

మనువు అవతరించినది మొదలు, అతనిశిష్యులనేకులు కొందరు ఆశియాఖండమునకును, కొందరు ఆఫగనిస్థానము పరిషియాకును, కొందరు పశ్చిమముగా అరేబియా శిరియా గ్రీసు, మధ్య యూరోపుదేశములకును వెళ్లి ధర్మప్రచారము నెఱపినందువలన, మహానాగరికతగల దేశస్థులు వారివారి చతురత చూపుచువచ్చినారు. ప్రతిదేశస్థులకు ఐకమత్యము పుట్టించునది సమానధర్మమే, మతమే. ధర్మమనగా రక్షించునది, జనుల నొకటిగా కూర్చునదియని మహాభారతమున చెప్పబడియున్నది. ఒక్కొక్క దేశమునకు కాలానుసార మొక్కొక్కగుణము దైవసంకల్పమువలన ప్రసరించుచున్నది. ఈజిప్టు దేశమున మతము, పరిషియా దేశమున శుచిత్వము, చాల్డియా దేశమున శాస్త్రము, గ్రీసు దేశమున సౌందర్యము, రోముదేశమున నియమము, మనహిందూదేశమున ధర్మము వెల్లడియైనవి. ఈగుణములను ఆయాదేశస్థులాయాకాలమున దైవస్వరూపముగా భావించి వాటినే విగ్రహరూపములుగా పూజించి దేవాలయములను కట్టుకొనుచుండిరి. ఆభావము క్రమముగా కాలానుసారము మాసిపోగా శ్రద్ధాభక్తులుకూడా తక్కువై శిథిలమునకు కారణమైనది. క్రీస్తువు అవతరించి నిరభిమానత్వము పరోపకారమే

ఓం



సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 1.] అక్టోబరు 1908. [సంచిక 10.

## మాంభక్త విజయము.

### ౧. బర్నార్డో.

'నేనెక్కడ లేను?'

'పిల్లవాడా! నన్నిట్లుమోసపుచ్చుట పనిలేదు. ఇచ్చటవచ్చి, నిజముచెప్పు. ఏమనుకొన్నావు. నీవెచ్చటనుంచి వస్తివి. నీస్నేహితులెవరు. నిన్నరాత్రి యెక్కడ పండుకొని యుంటివి?

ఇట్లు నేను ప్రశ్నలువేసి వానినుండి నిజముకనుగొన ప్రయత్నముచేసితిని గాని వాడుచెప్పునదియంతయు నిజముగానుండునని నమ్మలేదు. రెండు మూడు సంవత్సరములముందునుంచి, నాపనితీరగానే రాత్రిపూట కొందరిపిల్లవాండ్లను ఒక గాడీఖానాలో చదువుచెప్పుకొనుచుంటిని. ఆగాడీఖానాలో గాడిదెలను కట్టివేయుచుండిరి. ఇట్లు చదువుచెప్పుకొనుచుండగా నొకదినమున సాయంత్రము, ఆగదిలో నుండుచున్న పొయ్యిదగ్గిర నిలబడుచు, పేలికలతో ఒకపిల్లవాడు నిలబడి యుండెను. అందరుపిల్లలు వెళ్లిపోయినను వాడచ్చటనే నిలిచి బైటవెళ్ల నిష్టపడక యుండెను.

'ఇంటికి పోయ్యేదానికి ప్రొద్దయినది, గా' అంటిని, దానికిబదులు చెప్పలేదు.

'ఇంటికి తక్షణముపో! మీతల్లినిన్నెదురు చూచుచుండును' అని మరలయంటిని.

అప్పుడు బాలుడు 'అయ్యా, నన్నిక్కడనే యుండనిమ్మని' చిన్నగ చెప్పెను.

'ఎందుకు ఇక్కడనిలుచుట. దీపములుఆర్పి, బీగము వేయవలసియున్నది. నీ వెందుకు ఇక్కడ యుండెదననెదవు.'

'నేనేమి తొందరచేయుటలేదు, నన్నిక్కడ ఉండనిండి.'

'నేనిక్కడ నిన్నుండనివ్వను. ఎంతవరకు ఉంటావు. తక్షణము నీవింటికిపోవలెను. ఇతరబాలురు ఇండ్లకుపోయినది మీతల్లి తెలుసుకొని నీవింకనురాలేదని యోచనచేయుచుండును.'

'నాకుతల్లిలేదు.'

'తండ్రియో—ఎక్కడవున్నాడు.'

'నాకు తండ్రిలేదు.'

'ఇవి అంత పిచ్చిమాటలు. ఇట్టికథలు నాకు చెప్పవద్దు. తల్లితండ్రులు లేరంటావు. నీస్నేహితులెక్కడ. ఎక్కడనీవుండేది.'

'అయ్యా నాకుస్నేహితులు లేరు. నేనెక్కడలేను.'

ఇట్లుపిల్లవాడు చెప్పగానే నేనాశ్చర్యపడి, పిల్లవాడుచెప్పుదానిలో నిజముండవచ్చునని భావించి వానిని దగ్గరకుబిలిచి వాడుచాలా బలహీనముగా నుండినందున నావద్దకువచ్చువరకు కొంతసేపుపట్టెను. అప్పుడు వానినిచూచి 'వీడుచెప్పుఅబద్ధములకు తన్నవలసినవాడా లేక నేనిదివరకు నెన్నడుచూడని దయాపాత్రుడైన దిక్కులేనివాడా' యని యాలోచించుకొంటిని.

వాడువేసుకొన్నమురికిగుడ్డలను, లోతుగానున్నకన్నులను, ఎండినదేహమును చూచి, 'నీకెన్ని ఏండ్లు' అని అడిగితిని.

అయ్యా నాకు 10 ఏండ్లనెను. వాడువయోవంతుని ముఖమునే కలిగి యుండెను. అయితే దౌర్భాగ్యస్థితినుంచి 8, 9 ఏండ్లవయస్సుగలవాడుగా కనబడెను.

సశేషము.

## వరములు.

కోరినవరములన్నిటిని ఇచ్చుశక్తిగల సర్వేశ్వరుడు ప్రత్యక్షమై నీయెదుటనిల్చి 'నీవుకోరినవరములిచ్చెదను, అడుగుము' అని నిన్నడిగినపుడు నీవేమడుగుదువు?

అట్టిశక్తిగల సర్వేశ్వరుడెక్కడ! ప్రత్యక్షమగుట యెక్కడ! అడిగినవరములొసగుటయెక్కడ! అనిఅందువేమో, అట్లనుటతప్పు; నీకు వరములడుగుట తెలియదు, గనుక, అట్టిదేవుడు ప్రసన్నుడుకాడు.

మనయందఱనేకులు భార్యబిడ్డలతో చిన్నచిన్నసంసారములను కట్టుకొని నానాటి కొదవలసవరించుకొనుటయందును, కూడుగుడ్డలకై కల్పించుకొన్న చిన్నచిన్న జీవికల కర్తవ్యములను దినదినము నెరవేర్చుచున్నపుడు, పైవారిపోటులకు తప్పించుకొని కార్యము నిర్వహించుటయందును, దైవవశమున మనలో ననేకులు పరులు పెట్టుపోతులకు లోనయినపుడు, మనలను చేపట్టిన వారికింపుపుట్టించునట్లు నడవడులను దిద్దుకొనుటయందును, ఒకవేళ ఈశ్వరుడు మంచిపదవినొసగి మనము నెమ్మదిగానున్న కాలమున మైమఱచి ఆత్మాభిమానము పైకొన, దూషణభూషణలనే గొప్పగా గణించు వాడుక కలిగినప్పుడును, మనమనసు చిందరవందరలయి బ్రతుకుయొక్క గుఱిమఱచి సంకుచితమయి పోవును.

చిరకాలము గానిట్లుకృశించి, దీనమయిన మనసునకు, సర్వేశ్వరుడే, చేత స్వర్గమును పట్టుకొని 'యిచ్చెదకొమ్మని' ప్రత్యక్షమయ్యెపో! 'నాకుస్వర్గముతో పనిలేదు నారాజ్యము గెల్చినచాలునని కోరుదునేమో? స్వర్గమో, నరకమో, నాగుణబాధ తీరితే అదియే నాకు మోక్షమనిపించునేమో? నన్ను కడగండ్లపెట్టించి ఇంతటిబాధలకు పాలు పఱిచినట్టి నాప్రతివాది తెగిన నాకు పదివేలని వాదించునేమో? లేక నాసంకల్పములకు విరోధించి నన్ను భంగపెట్టినవారు చెడుదగులశపింపకోరుదునేమో' ఘనమయినకోరికలు కోరవలెనన్నను కోరిసాధించుట యటుండని. మనసునకు క్రమమయిన శిక్షకావలసి యున్నది. నానాటి చిన్న చిన్న సుఖదుఃఖములలో పరమార్థమును మఱచిచరించెదము. అట్టిపరమార్థమునకు, మనసున కొంచెముచోటిచ్చి దినకర్తవ్యములను నిర్వహించు జీవయాత్రయే యాత్ర.

రామకృష్ణులిద్దరు మధురానగరము ప్రవేశించునపుడు సుదాముడును మాలాకారుని ఇలుసొచ్చిరి. పేదుపేదలలో పేదవాడు. నిరుపేదను సుదాముడనుట సామాన్యలోకోక్తిగా! పరమార్థముయొక్కడనో యడవులలోనున్నదని తెలసుకొని, తనచుట్టు ప్రక్కలనుండు చిన్న కర్తవ్యములకొని వదలి తప్పించుకొని భ్రమించినవాడుకాడు. మనలో కూడుగుడ్డలను గడించుకొన కష్టపడు. ననేకులవలెనే, వాడొకడు, మనయందనేకులవలెనే, సంసారములలోని చిన్న చిన్న సుఖదుఃఖములకుచిక్కి మరిగినవాడే యిట్టి దరిద్రుడా మహనీయుల కేమిచ్చును? ఉన్నమున్నట్టు, వారిరువురు, తనపూరింటి కడపత్రొక్కి అనుగ్రహింపవచ్చిరి.

తనమనసున చిరకాలము పరమార్థవిచారమునకు, చోటిచ్చి మరువక బ్రతుకనే

శ్చినవాఁడగుటచే, తానుభక్తిపరవశుఁడై కనులనీరుగారఁ దనయొద్దనుండిన పూలహారములు రెంటిని వారిమెడలయందు వైచెను.

కం. వారనుమాలికు డిచ్చిన, భూరికుసుమదామములను భూషితులై నీ
కోరినవరమిచ్చెదమని, కారుణ్యము సేయనతఁడు గనియిట్లనియెన్.

ఇట్లు కోరిన వరమిచ్చెదమని, ఆ హరిస్వరూపులే యెదుటవచ్చి నిల్చినపుడు ఈ నిరుపేదయగు సుదాముఁడు ఏమయినను నడిగియుండవచ్చునుగదా! చావు ముసలితనము లేక యెల్లకాలము ఇహలోకభోగములే వేడివుండవచ్చును. సమస్తైశ్వర్యముల నిండిన సామ్రాజ్యమునే కోరియుండవచ్చును. ఇట్టివేవియుఁ గోరక,

కం. నీపాదకమల సేవయు, నీపాదార్చకులతోడి నెయ్యమునునితాం
తాపార భూతదయయును, తాపసమందార నాకు దయసేయఁగదే.

అనివేడెను. సమస్తైశ్వర్యములకంటెను, సర్వభోగములకంటెను, సామ్రాజ్యమునకంటెను, భూతదయే శ్రేష్ఠమయినదిగా వుండవలెను.

కాదేని అభక్తాగ్రేసరుఁడగు సుదాముడు అన్నిటిని వదలి అభూతదయయును వరముగా నడిగియుండునా?

గాయిత్రీజపములు, తీర్థయాత్రలు, వ్రతోపవాసములు, ఉద్యాపనలు, ఆహ్నికములు, మొదలగునవి భక్తివిశ్వాసములతోనే జరుపుచున్నారము.

ఇట్టినిత్యనైమిత్తిక కార్యముల నిర్వహించు సందడిలో నేనుదయాపరుఁడైయుండునట్లు వరమొసగుమని ఉపాసించు దైవమును వేడినవారెవ్వరు? అట్టివరములం వేడిపడయనివారెవ్వరు? ఇల్లవారిలేచినది మొదలు రాత్రిపరుండపోవువఱకు మనలో నొక్కొక్కరికిని దయచూపవలసిన అవకాశములు నిండియున్నవి. బిచ్చగాఁడు యింటిముందు నిల్చి బిచ్చము వేడినపుడును, ఋణస్థుడు నీయండజేరి వడ్డివాసి కొంతతగ్గించుమని బతిమాలినపుడును, గ్రామములలో కలహించి కొత్త కొత్తగా పైకొను మత్సరముల వేగముతో వ్యవహారములజరుపను పంటకాపు కోర్టులెక్క తలపెట్టినపుడును, మహామారి క్షామము మున్నగుబాధలు తటిస్థించినపుడును, ప్రజలగువారు చిన్నతపదవియందుండు ఉద్యోగస్థులమరుగుసొచ్చి వారి సుఖదుఃఖముల విన్నవించుకోవచ్చినపుడును, దీనుల బలవంతులచే జిక్కి తొందరపడినపుడును, ఒక దయగలతలంపు, దయగలపలుకు, దయగలపని, మంత్రౌషధమై యడ్డపడి, ఆర్తుల నుద్ధరించును. మనదయచే పరులు బాగుపడినపుడు, దానివలన మనకుకలుగు సంతోషమునకంటె అధికమయిన సంతోషములేదు.

ఇట్టిదయతో కలుగు సంతోషముచే శరీరమునకు ఆరోగ్యముపుట్టును. ఇట్టిసంతోషము ముసలితనమును రానివ్వక వెనుక కీడ్చును. ఇదియే తమతమ దుఃఖములను మరపజేసి దయగలవారికి దాముస్నచోటికే స్వర్గమును తెచ్చిపెట్టును ఇట్టి దయావరము నడిగినమాత్రమున ఇచ్చుటకు సర్వేశ్వరుడు సదా మనయొద్దనె కాచియున్నాడు. అట్టి దయావరముపొంది అనుష్ఠించుటకో అవకాశము వేలకొలదియున్నవి. మనము ఊర కున్నప్పుడంతయు మనసున ఈదయావరమునే వేడుచుందము. అభక్తాగ్రేసరుడగు సుదాముడు మనకు మేలుపంక్తియై తోడుపడుగాక.

శంకరం.

---

## దివ్యమార్గ దీపము.

ఈ నిబంధనలు సకలశిష్యుల ప్రయోజనమునకై వ్రాయబడినవి. మీరు వీటిని గమనించుడు.

కన్నులు చూడజాలుటకు ముందు కన్నీరిడజాలక యుండవలయును. చెవివిన జాలుటకు ముందు సులభముగ నొప్పిబొందు స్వభావమును పోగొట్టుకొని యుండవలయును. గురువులసముఖమున నోరు మాట్లాడజాలుటకుముందు నొప్పించు సామర్థ్యమును పోగొట్టుకొని యుండవలయును. గురువులయెదుట జీవుడు నిలువజాలుటకు ముందు తనపాదములు హృదయరక్తమున కడుగబడి యుండవలయును.

1. అధికారాశను చంపుము.

2. జీవితఆశను చంపుము.

3. సుఖాపేక్షను చంపుము.

4. అధికారమును కోరువారు పాటుపడునట్లు పాటుపడుము. జివనమపేక్షించు వారివలె జీవనము నాదరింపుము. సుఖమునకై జీవించువారివలె సుఖింపుము.

హృదయమునందు పాపహేతువును శోధించి నిర్మూలనము సేయుము. సంసార హృదయమందును భక్తిపరుడైన శిష్యుని హృదయమందును ఫలదాయకమై యది కాపురముండును. బలవంతులే దానిని చంపగలరు. బలహీనులది వృద్ధిపొంది, ఫలించి, నష్టమై పోవువరకు కాచవలయును. అది యనేకయుగములుగా వృద్ధిపొందుచు జీవించుచున్నట్టి మొలకగా నున్నది. అనేక జన్మములు గడచిన వెనుక యది పుష్పించుచు

న్నది. జ్ఞానమార్గ మనుసరించువారు హృదయమునుండి దీనిని త్రెంచి వేయవలయును. అప్పుడు హృదయమునుండి రక్తము స్రవించి శిష్యునియొక్క జీవనమంతయు సంపూర్ణముగా జీర్ణమైనట్లుతోచును. ఈపరీక్షను సహించవలయును. సత్పథమునకు నడపు భయంకరమైన నిచ్చెనయొక్క మొదటి మెట్టికదగ్గరనే యిట్టిపరీక్ష కలుగవచ్చును. లేక తుదమెట్టికవరకు కలుగక యుండవచ్చును. అయితే, ఓ శిష్యుడా! దీనిని ననుభవించి తీరవలశినదని జ్ఞాపకముననుంచుము. తన్నిమిత్తమై ధృఢమైన శక్తికలవాడవుకమ్ము. వర్తమానకాలమునగాని భవిష్యత్కాలమునగాని యుండకుము. శాశ్వతదృష్టియుంచుము. ఈరాక్షస నుర్భీజమచ్చట పుష్పించదు. అస్తిత్వమున గలిగిన యీమలినము శాశ్వతబ్రహ్మపద స్మరణ మాత్రమైన వాయువుచేత నదృశ్యమగుచున్నది.

5. భేదబుద్ధిని చంపుము.

6. విషయ స్మరణాపేక్షను చంపుము.

7. ప్రవృత్తిస్మరణ చంపుము.

8. వినను, ఉపాధిసహితమైనదేదియు, భేదజ్ఞానస్ఫురణ గలదేదియు. అనాదికానిదేదియు, నీకు సహాయము చేయజాలదు. గనుక నీవే కొక్కియైయుండుము. ఆత్మజ్ఞానశాస్త్రము నభ్యసించు మార్గమదియె. అనిచ్చెనయొక్క మొదటి మెట్టిక యదియె. స్వయంజ్ఞప్తి లేక ఆకాశమున తన పరిమళము ప్రసరింపనత్యాసక్తితో వికసించు పుష్పము వలె వృద్ధిపొందుము. ఇట్లు నీవు జీవుని శాశ్వతబ్రహ్మనిష్ఠను పొందించుటకు పాటుపడవలయును. అయితే నీశక్తి, సౌమ్యత, శాశ్వతపదవికై వినియోగపరచవలశిన గాని స్వప్రయోజనమునకు కూడదు. ఏలన, మొదటివిషయమున శుద్ధవిజృంభణమున నీవు వృద్ధిపొందెదవు. రెండవవిషయమున, స్వప్రయోజనమునకుగల యస్వాభావికమైన విషయముచేత నీవు కఠినుడగుచున్నావు.

9. నీలో నుండుదానినే కోరుము.

10. నీకావల నుండుదానినే కోరుము.

11. దుర్లభమైనదానినే కోరుము.

12. ఏలన, లోకజ్యోతినీయందున్నది—సత్పథమును వెలిగించజాలు. జ్యోతి యదియొక్కటియే. దీలోకనుగొనజాలవేని యితరత్ర దానికై వెదకుట నిరుపయోగము. నీవు దానిని పొందితివేని నీవులీనమగుదువుగాన నీకావలయున్నది. సదా దూరమగును గనుక దుర్లభమైయున్నది. నీవు జ్యోతినిపొందుదువుకాని శిఖసంటవు.

13. ఆసక్తితో బలముకోరుము.

14. శ్రద్ధగా శాంతిని కోరుము.

15. అన్నిటినిమించిన పదార్థసంగ్రహము కోరుము.

16. అయితే యీసంగ్రహము శుద్ధజీవునకుమాత్రము చేరినవిగాను, సమముగా సకలశుద్ధజీవులు పొందినవిగాను, అన్నియుగూర్చిన. బరిపూర్ణమైన వస్తువునకు సంబంధించిన సామగ్రిగా నుండవలయును. నీనిజస్వరూపమైన యీయఖండ చైతన్యమునకై ధనము సంగ్రహించుటకుగాను శుద్ధజీవునకు తగిన పదార్థసంగ్రహము గావించుము. ఏదియు విచ్ఛిన్నముచేయని పావనమైన శాంతినికోరుము. ఆశాంతివల్ల జీవుడు జనస్పర్శలేని సరోవరములో బెరుగు పావన కోమలపుష్పమువలె వృద్ధిపొందును. శిష్యుడు కోరుబలము మానవుల దృష్టియందు తాను కొంచమెనను గణ్యముకానివానిగా కనబడునట్లుచేయునదిగా నున్నది.

17. మార్గమును వెదకుము.

18. అంతర్ముఖుడై మార్గము వెదకుము.

19. స్థైర్యమైన బహిఃప్రజ్ఞతో మార్గము వెదకుము.

20. ఏయొకరీతిగా వెదకకుము. ప్రతిస్వభావమునకు వాంఛనీయమైనమార్గమొకటి యుండును. అయితే భక్తిచేతగాని, ధ్యానముచేతగాని, తీవ్రమైనసాధనవల్లగాని నిరభిమానమైన శ్రమముచేతగాని, శ్రద్ధతోగూడిన ప్రాపంచిక విషయవిచారముతోగాని యీమార్గము లభించదు. వీటిలో నొకటిచేత మాత్రము శిష్యుడు నొకమెట్టిక కంటె నెక్కువ నెక్కజాలడు. ఈనిచ్చిన నెక్కనన్ని మెట్టిక లావశ్యకములు. జనుల దుర్గుణముల నొక్కొకటిని జయింపనవి మెట్టికలగును. సుగుణములుకూడ యావశ్యకమైన మెట్టికలే. ఏవిధమున ననాదరించదగ్గవికావు. ఐనను వాటివల్ల నంతిట యనుకూలమై మున్నుసుఖావహమైయున్నను యపిమాత్రముండినను నిరుపయోగము. సన్మార్గమవలంబించ నిచ్ఛయించువాడు మానవుని ప్రకృతియంతయు వివేకముగా నుపయోగించవలయును. తనప్రత్యగాత్మస్వరూపమును దృఢముగా విచారించి, తనకుదీపించిన యాధ్యాత్మికబుద్ధితో తాను స్వప్రయోజనమునకై దుఃఖములో గలిగించుకొని క్రమముగా వృద్ధిపొంది, జ్ఞానియై, ప్రత్యగభిన్నపరమాత్మ స్వరూపమునుబొంద గావించుకొన్న పదార్థముగాని ప్రత్యగాత్మగాదని యొకమనిషి తెలిసినచో, తనకు కేవలము తానేమార్గము, తత్వము, జీవనము, గతి. దీనికై యీవిచిత్రసంశ్లిష్టమైన భిన్నజీవనమె కలిగినదని

తెలిసినంతటనె, నిజముగా వాడు సన్మార్గమవలంబించువాడగుచున్నాడు. నీగుహ్యమైన దివ్యహృదయాంతర కుహరమునమునిగి మార్గము వెదకుము. నీకాలపు జనసంఘమునకుజేరి, నీతోకూడకష్టపడు దివ్యఖండములయొక్క సౌందర్యమును, అగోచరమైన స్థితిని, ప్రత్యగాత్మస్వరూపమును వృద్ధినిదెలియ నింద్రియముల నుపయోగించుచు, సకలానుభవముల చేత పరిశీలించి మార్గమును వెదకుము. స్థితివిధులను ప్రకృతివిధులను విచారించి మార్గము వెదకుము. లోపల వెలుగు గూఢమైనజ్యోతికి భక్తిపూర్వకమైన వందనముగావించి మార్గము వెదకుము. అచంచలభక్తితో నీవు కనిపెట్టిపూజించిన, నాజ్యోతిప్రకాశ మెక్కువగును. అప్పుడు మార్గమున ప్రవేశము దొరికినదని నీకు తెలియ వచ్చును. మార్గాంతమున నాజ్యోతి యఖండమగును.

21. తుపాను యణగిన వెనుక గలుగు నిశ్శబ్దమునందు నాపుష్పము వికసించుట చూడుము. అంతవరకుకాదు. తుపాను యుండువరకు, యుద్ధముజరుగువరకు అదినిక్కి పెరిగి, కొమ్మలై యాకులై మొగ్గలగును. అహంభావము సంపూర్ణముగ మాసి జీర్ణమగు వరకును అనగా ఏదో యొక గొప్ప సాధనకుగాను అనుభవమునకుగాను తన్నుకల్పించిన దైవస్వరూపమున లీనమగునంతవరకు, మలినస్వభావమంతయు శుద్ధమై నిర్మలాంతఃకరణ మగువరకు పుష్పవికాసము స్ఫురింపదు. అప్పుడు గొప్పవానకొట్టిన వెనుక ఉష్ణదేశమున గలుగు మనోహరమైన శాంతస్థితి శాంతముసిద్ధమగును. అట్టిశాంతము కష్టపడిన జీవునికిగలుగును. అప్పుడు గాఢమౌనమున, మార్గము గలిగినదనుటకు యుక్తమైన రహస్యమైన యనుభవము సిద్ధమగును. ఏ పేరుతోనైన దానినిబిలువుము. అది మాటలాడ నెవరులేని ప్రదేశమునుండివచ్చు శబ్దము. రూపములేని ఆకారములేని దూతగానున్నది. పక్వమైనజీవునియొక్క వికాసమనికూడ అనవచ్చును. దానికే సామ్యము లేదు. అయితే అది సంసారమందుండినను అనుభవవేద్యము, తెలియదగినది, కోరదగినది, అశాంతి క్షణముగాని యనేకవేల వర్షములుగాని యుండవచ్చును. అయితే అదిఅంతము గలదియే. ఐనను దానిదార్ఢ్యము నీయందుండును. మాటిమాటికి ఇట్టియుద్ధముసలిపి గెలువవలెను. ప్రళయావస్థయుండునది కొంతకాలమే.

విద్యాలయమున వ్రాయబడిన నియమములలోనివి మొదటివి. అడిగినవారు పొందుదురు. చదువకోరువారు చదివెదరు. నేర్వగోరువారు నేర్చుకొనెదరు.

# ఆత్మబోధ.

## 5-వ పాఠము.

స్థూలశరీరము స్థూలప్రపంచము రెండును చేరి స్థూలశరీరముగా భావించుచున్నా మని పైనచెప్పియున్నాముకదా?

స్థూలము—స్థూలశరీరమును ఎట్లుశుద్ధిజేసి, క్రమమైనమార్గమున నెట్లుపెట్టుకొనవచ్చుననియు, మనసునకు లోబడి యదిజేయుకార్యములను, అటులనంతకు దాను జేయుకార్యములను మొదటవిచారించుదము. దేహమున రెండువిధములైన కార్యములు జరుగుచున్నవి. మొదటిది, శ్వాసనిశ్వాసములు, రక్తసంచారము, భోజనపదార్థజీర్ణము, జలమల విసర్జనములు మొదలుగునవి మనయిష్టమున్నను లేకున్నను జరుగును. ఈ కార్యము లొకవిధమైన నరముల సమూహముతో జరుగుచున్నవి. ఈకార్యములు స్వాభావికముగ జరుగుచున్నవి. అయినను ఈకార్యములను మనయిష్టానుసారము జరుగవలసినట్లు చేసుకొననగును. హఠయోగులు చేయుకార్యమిదియే. వారు ప్రాణాయామముచేత శ్వాసనిశ్వాసములు నిరోధించి, ఆయుర్వృద్ధిచేసెదరు. కాయశుద్ధిజేయుదురు. మనస్సు ప్రాణము ననుసరించి యుండును గనుక ప్రాణగతిని నిరోధించుటచేత మనసును నిరోధించినట్లగునని బలాత్కారమైన కఠినయోగమును వారుసాధింతురు. అయితే ఇట్టియోగసాధన కష్టతరము. అపాయకరము. రెండవది, మనసుకోరినట్లు నడచుకార్యములు—ఇవి బ్రహ్మాండము లేక వెన్నెముకకున్ను తలలోనుండు మెదడుకున్ను సంబంధముకలిగి దేహమంతయు వ్యాపించియుండు నరములచేత ఈకార్యములగును. ఈ మెదడునరములు రెండును క్రమమైన మార్గముననుండకున్న, వ్యవహారము లేదియు లోకమునజరుగుటకష్టము. సంకల్పము నరములకార్యముకాదు. సంకల్పము సూక్ష్మలోకమునకు చేరిన పదార్థము. ఏలన మూలికలతోనైనను, వ్యాధివల్లనైనను, లేక ఏదైన హానివల్లనైనను మెదడు చెడిన, సంకల్పము దానిగుండా పని చేయజాలదు. అప్పుడే పిచ్చివాడందురు. చెవిసమీపముననుండు మెదడుభాగమును నశింపజేయు నొకవిధజాడ్యముకలదు. అది మాటలయొక్క జ్ఞానమును నశింపజేయును. ఆజాడ్యముగలవానిని మాటాడించిన మాటాడడు. నీపేరేమన్న చెప్పజాలడు. అయితే వానిపేరును, మనముచెప్పినదానిని తన పేరనిమాత్రమన్వయించుకొని యౌనుకాదని తలయూచును.

మాటాడుశక్తియుండదుగాని తలంచుటకుమాత్రము శక్తియుండును. గనుక ప్రతిమనిషి యొక్క శక్తి స్థూలముయొక్క అంగదార్ఢ్యము ననుసరించియుండునని దీనివల్ల తెలియ వలశినది. గనుక దేహమును శుద్ధిజేయవలశిన కార్యమవశ్యకము. ఈనగరముల సమూహము చిన్నచిన్న గదులవలె పైకప్పులు గలిగిన పదార్థములతో జేయబడి యున్నవి. వాటిని సూక్ష్మదర్శినీలవల్ల జూడనగును. ఇవి అణువులతో జేయబడినవి. ఈయణువులే నానావిధములుగా నేర్పడి దేహములోని చర్మము, రక్తము, వాయువులు మొదలగు పదార్థములైనవి. ప్రతి అణువు ప్రత్యేకప్రాణమై యున్నది. ఇట్టి ప్రాణముల నేకలక్షలు చేరియే వివిధాంగములు గలదేహమైనది. ఈప్రాణములు క్షణక్షణములు మార్పునుబొందు చున్నవి. ఒక రక్తబిందువును దుర్భిణితో జూచినదానిలో కదలుచుండు ననేక ప్రాణులను జూచెదము. అనేకవిధవ్యాధులుగల రక్తములో వివిధములైన ప్రాణులను జూచెదము. ఈప్రాణుల ననుసరించియే ఆరోగ్యము వ్యాధులు కలుగుచున్నవి.

ఈ విషయములను సాధారణముగా జనులు తెలియరు. శుద్ధమై గౌరవమైన దేహము గలుగుటకు కావలశిన పదార్థములను ఏర్పరచి తనకు తమనోటికి రుచికరమై యిష్టమైన పదార్థములను సాధారణముగ భుజించుదురు. దేహమునవచ్చిపోవుచుండు అణువులను లక్ష్యముచేయరు. ఇట్లు అలక్ష్యముచేయునందువల్ల కల్లికట్టెలు తాటాకులు జంబు మొదలగువానిచేత కట్టినయింటివలె సాధారణముగా జనులదేహములు నివాసయోగ్యముకాని గృహములుగానుండును. గనుక దేహమును శుద్ధిజేయ ప్రయత్నించువాడు తనదేహములోనికి నంగీకరించు పదార్థశోధన మొదట ప్రారంభము చేయవలెను. అట్లు శోధనజేసిన పదార్థములను అంగీకరించి, ఏడుసంవత్సరములకుగాని యింకను త్వరగాగాని దేహములోని యున్నియణువులు క్రొత్తవై అపవిత్రమైన పదార్థములు దేహములోపలికి పోకుండునట్లగును. ఆ దేహముయొక్క తేజస్సుచేత సకలమాలిన్యము దూరమగును.

ఇట్లు దేహశుద్ధిని ప్రారంభించి, ఆత్మజ్ఞానమును పొందగోరువాడు బ్రహ్మవిద్య నాకెట్లు అనుభవవేద్యమగునని మొదట విచారించును. ఇహలోకమునకు సంబంధించక పరలోకవిషయవార్తలన్నియు గ్రహించుటకు మనుష్యుడు స్థూలదేహమును తనస్వాధీనమునకు దెచ్చుకొనవలశినది ముఖ్యము. తనకు ఆత్మజ్ఞానము అనుభవమగుటకు స్థూలదేహమను కారాగృహమున సకలమలినములతో గూడుకొనియుండువరకు అట్టిఅనుభవముకలుగదు. ఈజన్మమునందు కలిగిన కృషిగాక పూర్వజన్మములయందు సంపాదించిన

సుకృతవిశేషముకూడ నుండవలెను. దేహముశుద్ధిగా నుండకున్న ఆత్మజ్ఞానము పొందుటకు సాధ్యముండదు. దేహమునమాంద్యము, అలసట మొదలగునవి యెక్కువగనుండును. అట్టిదేహముద్వారా గలుగుజ్ఞానము భిన్నముగా నుండును. గనుక దేహమును శుద్ధిజేయవలసినది మొదటిపనిగా నున్నది. దానికి గావలసిన పదార్థసంగ్రహము, ఓషధ సేవ పథ్యక్రమము విచారించుదము.

---

## కలలు.

ఇట్లు పైనచెప్పిన మూడుశరీరములు జీవుడనుదినము క్షణక్షణమున వాడుకొను వాహనములుగ గ్రహించవలెను. జీవుడు పరమాత్మయగువాడు. వివిధ శరీరముల నుండి అనేకవిధ అనుభవములు గలిగి పరముగని పొందును. జీవుడు గొప్ప అగ్నిశిఖలోని మిణుగురుగా భావించ వలయును. తగినసాధనలవల్ల దానిని గొప్ప అగ్నిశిఖగా చేయవలసియున్నది. జీవుడు పరమాత్మయైన పరమాత్మపూర్ణజ్ఞానము గలవాడు గనుక జీవుడుకూడ పూర్ణజ్ఞానము గలవాడే వాడెట్టివృద్ధి పొందవలయును అని మీరడుగవచ్చును. అయితే జీవునికి జడత్వమును భిన్నభావము గలిగినదిగనుక ఆభావము వీడుట అవశ్యముకదా?

జీవుడు క్రమముగా వృద్ధిపొందును. ఒకనికి మరొకనికిగల తారతమ్యము దివ్యదృష్టిగలవాడు ప్రత్యక్షముగ జూచును. ఆ తారతమ్యములు కారణశరీరములను పట్టి నిర్ధారముజేయ సాధ్యమగునట. సాధారణమైన జనుల కారణశరీరము వర్ణహీనమైన పొరగా నుండునట.

ఆత్మజ్ఞానము కలిగినను లేక యెక్కువబుద్ధిగలిగి యున్నను ఆ కారణశరీరమున మార్పుగలుగునట. అప్పుడే అది తేజమునందు, వర్ణమునందు, పరిమితియందు, ఎక్కువ స్ఫురణగలిగి యుండునట. కారణశరీరమున చెడ్డగుణములు మాత్రము కనబడవట. చెడ్డగుణములు కామశరీరమునకు చేరినవి. అవి వేరు కప్పుగా నేర్పడి మంచిగుణములు కలుగుటకు ఆటంకములుగా నుండును. ఆత్మజ్ఞాని యగువాని కారణశరీరము మిక్కిలి రమ్యమైనదిగా నుండునట. మహాత్ముని కారణశరీరము దేదీప్యమానమైన తేజోరూపముగ నుండునట.

సాధారణముగ ఆత్మవిషయమందు జాగ్రతలేక లోకవ్యవహారములు జరుపుచుండు మనిషికి తనవాహనములగు పైశరీరములు స్వాధీనమున నుండవు. మనస్సు

గాని విషయములుగాని వాని స్వాధీనమున నుండవు వాడు ఎలాటి నిగ్రహమును చేయప్రయత్నించడు. వాని మలినగుణములు ప్రేరేపించునట్లు వాడు నడచుకొనుచుండును. జాగ్రత్సమయముననే యిట్లువాడు యీడ్వబడుచుండునప్పుడు, నిద్రసమయమున నాశరీరములు పోవునో చెప్పవలశినది యేమున్నది.

లోకమున మనకు గలుగు పదార్థజ్ఞానము పదార్థముల ఆకారజ్ఞానముగాని వాటి నిజస్వరూపజ్ఞానము కాదని 'సంకల్పశక్తి'యందు వ్రాయబడి యున్నదికదా? ఆజ్ఞానము మనసును పూర్వానుభవమును ననుసరించి యున్నది. ఎట్లన గ్రుడ్డివానికి ఏదో దైవానుకూలమువలన దృష్టివచ్చిన, వాడు పదార్థరూపజ్ఞానము మొదట కలిగి యుండనందున, నిప్పుడు పదార్థములను జూచిన వాటిని గుర్తించుటకు కొంత ప్రయాస పడును. పదార్థముల దూరమును శీఘ్రముగ గ్రహించజాలడు. అట్లనే పిల్లవారు కూడా ఏదైనవస్తువులను జూచిన నవియుండుదూరమును తెలియక పట్టుకొనబోదురు. అట్టిప్రయత్నములు విఫలమై యనుభవమువల్ల జ్ఞానముగలుగును. సాధారణముగా వయోవంతులుగూడ పదార్థములదూరమును ఆకారమును తప్పుగా గ్రహింతురు గనుక నిజజ్ఞానమునకు కేవల దృష్టియే ప్రాధాన్యము కాదు. జీవునియొక్క యోగ్యతయు గ్రహణశక్తియు ముఖ్యములు.

## నిద్రావస్థ.

కామశరీరము మనోబుద్ధులు ఆత్మయును స్థూలశరీరమునుండి వేరగుటవల్ల నిద్ర కలిగినట్లగును. అయితే యవి చాలాదూరము పోవుటలేదు. సమీపముననే ప్రసరించును. నిద్రాసమయమున ప్రజ్ఞయు నావాసములుండుటను విచారించుదము.

1. మెదడు:—మెదడునుండి ప్రజ్ఞవేరైనప్పుడు, మెదడు కేవల ప్రజ్ఞాహీనము కాదు. జీవునియొక్క ప్రజ్ఞయు, మెదడులోనుండు ననేకయణువుల ప్రజ్ఞయుగాక మెదడునకు తనకుస్వభావమైన ప్రజ్ఞయొకటి వేరుగానున్నదని యనేకశాస్త్రవిషయముల వల్ల తెలియవచ్చుచున్నది. దీనికి ఒక దృష్టాంతము చూడుడు. పండ్లునొప్పి గలవాని పంటిని వైద్యశాలయందు మైకమిచ్చి పీకునపుడు, వానికి దేహముమీది ప్రజ్ఞ సంపూర్ణముగ తప్పియున్నను, పంటిని వైద్యుడు పీకునప్పుడు దేహమున స్వభావముగా బాధనుసూచించు వ్యక్తముకాని శబ్దమొకటి పుట్టుటగాక చేతులుకూడ తమంతటదాము నోటితట్టు లేచిపడును. అయితే మనిషికి ప్రజ్ఞవచ్చిన వెనుక నీకేమైన బాధకలిగెనా యని యడుగ రవంత బాధకూడ కలుగలేదని చెప్పును. యిట్టి దృష్టాంతములనేకములు గలవు. దీనివల్ల దేహమునందు ప్రతిఅంగమునకు స్వాభావికమైన ప్రజ్ఞయొకటి యున్నదని భావము.

సశేషము.

అటు ప్రజ్ఞ మనసునుండి విడదీయబడినప్పుడు, బాహ్యప్రపంచమున నేదైన పదార్థస్ఫురణ దానికిగలుగ ద్రష్టయగు మనస్సుయొక్క చలనములచేత మిశ్రితము కానందున, ఆ పదార్థముయొక్క చలనములు గుణమునందును పరిమితియందును ఏకముగ నుండుటచేత, ఆ పదార్థమును బోలిన యాకారము ప్రజ్ఞయందు గలుగును. అట్లు కాకున్నను, ప్రజ్ఞయే దృశ్యమైన పదార్థములో చేరి దాని చలనములయొక్క యనుభవమును సాక్షాత్తుగా బొందును. ఈ రెండురీతులయందును అది రూపముయొక్క నిజజ్ఞానమును పొందును. వ్యక్తమైన దృశ్యప్రపంచమున రూపము వహించి గనబడుదానికి ఆధారమైన అవ్యక్తములోని సంకల్పమునుగూడ తెలియనగును. మనసు మొదలగు ఉపాధులు లేక కారణశరీరస్థితమైన ప్రజ్ఞమాత్రము అట్లు కనుగొన సామర్థ్యము గలదగును.

పదార్థములయొక్క నిజస్వరూపములు గాక వాటి భావముమాత్రము మనకు తెలియుచున్నను తప్పకుండ వ్యవహారమున మనముపయోగించిన నెక్కువ ప్రయోజనకారిగా నుండును. ఈ జ్ఞానము నమ్రతను, హెచ్చరికను, ప్రోత్సంగతులను పైన మహూహాలమును వృద్ధిజేయును. తాను తలచినదే సరియను స్వభావసిద్ధమైన మనోభావము తక్కువై ఇతరులను నిరాకరించుటకుమునుపు మనలను పరీక్షించుకొనెదము. ఈ క్రింది యుదాహరణవల్ల ఇది స్పష్టము కావచ్చును.

నాకంటె వేరుభావములుగల మరొకడు నన్ను సమీపించిన మే మొకరొకరిని సమ్మానించము. ఒకరొకరిని నిష్టపడము. వేరొకడు వీనిని బుద్ధిమంతుడని యెట్లనునో యని యాశ్చర్యపడును. కొంచము ఆత్మజ్ఞానము నాకున్న, నామీట్టునకు అట్టి యాశ్చర్యమును బొందను వాడు బుద్ధిహీనుడని తలచక వానియొక్క చలనములను గ్రహించుటయు నాయందు న్యూనతయేమి? మేమిద్దరము చలించుచున్నాము. వాని చలనము నేనుగ్రహించక పోవుటచేతగదా వానితలంపులను జవితమును తెలియజాలకున్నాను వాని మనోచలనమును నేను తెలియనేర్చువరకు వాని యోగ్యతనుగురించి నేనేల యభిప్రాయపడవలెను' అని యోచించుదును. ఇతరులను ఎక్కువగ మార్చ కష్టము. మనలను ఎక్కువగ మార్చుకొనుట సాధ్యము. గనుక మనగ్రహణశక్తిని వృద్ధిజేసుకొనవలెను. మనము వర్ణములు మిశ్రితమైన తెలుపురంగువలె కావలెను! తెలుపున నన్ని వర్ణములున్నవి. తెలుపు అన్ని వర్ణములకు త్తరమిచ్చును. వివిధ భావములు గలవారినిమనమామోదించురీతిని యనుసరించి ఎంతవరకు తెలుపువర్ణమునకు సరితూగుదుమో తెలియునగును.

## సత్సంకల్పములు.

92. ఒక జన్మముయొక్క సంకల్పములు మఱొకదానియొక్క సందర్భములుగా నేర్పడును.

93. ప్రబలమైన భావములు సహజమైన గుణములగును.

94. ప్రతిసుగుణము సన్మార్గమునకు సూచనయగును.

95. ప్రతిబాలునకు గలుగు సహజగుణములు నిస్సంశయముగ పూర్వజన్మ సంకట ఫలితములగును.

96. జన్మజన్మముల సిద్ధమైన యహంకారముల ననుసరించి నడత యేర్పడును.

97. ఇట్లు క్రమక్రమముగా మనిషియొక్క ప్రవృత్తిమార్గమేర్పడును.

98. లోకానుగ్రహనిమిత్తమై కలుగు దివ్యరాజస్వభావములు మిక్కిలి ధైర్యముతో బోరాడి సంపాదించిన యార్జనలగును.

99. సంకల్పనిర్ణయము, కార్యనిర్ణయము, ఇవియే మొదట ముముక్షువునకు గావలశిన సాధనసామగ్రి.

100. తానుచేయుదానివల్లనే సకలము జయించెదనని తెలియును.

101. జన్మజన్మమునకు దానుజేర్చిన నిధులు దనవెంట వచ్చుచుండునని వాడు దెలిసియున్నాడు.

102. తానొకశక్తిని సంపాదించిన నదియంతకంతకు వృద్ధియగునని వాడు దెలిసియున్నాడు.

103. జ్ఞానాధారపూర్వకమైన యిట్టిదృఢమైన సంకల్పముతో నడచుకొనును.

104. అతనిపనితో నాతురతయుండదు. అసహనముగూడ నుండదు.

105. తనపూర్వజన్మసంచితమైన ప్రారబ్ధమువల్ల లభించిన సామగ్రితో దృప్తిజెంది సంసారప్రయాణము నడిపించును.

106. సరియైనవాక్కు నిజముగా నుండవలెను కచ్చితముగాను నిస్సందిగ్ధమై నిజమై యుండవలెను.

107. ముముక్షువుకు నీయదార్థగుణమే దోవజూపుటగాక రక్షణగా గూడ నేర్పడును.

108. అసత్యమార్గమునుంచి తప్పించి యథార్థమార్గమును గుర్తించుటకు దగిన బుద్ధివిశాలత్వమును నదియిచ్చును.

జగత్తంతయు క్షమచేతనే యున్నది.” యని కుమార్తెల నూరడించెను. తరువాత నా కుశనాభుడు కాంపిల్యానగరమున సకలైశ్వర్యముచేత నొప్పి వానముజేయు బ్రహ్మదత్తునకు నా నూర్వురినిచ్చి పెండ్లిజేసె కుమార్తెల నత్తగారింటికిబంపి తనకు గొడుకు లేకుండుటంజేసి పుత్రకామేష్టియాగమును జేసెను. అప్పుడు కుశనాభునకు గాధియను పేరుగల కొడుకుపుట్టెను. ఆగాధికి నేను పుట్టితిని. నాతల్లియైన సత్యవతి శరీరంబుతో స్వర్గంబుజేరి పరమోత్కృష్టమైన హిమవత్పర్వతముజేరి కౌశికియను మహానదిగా బ్రవహించుచున్నది. గనుక నేనీప్రదేశమును యాశ్రమముగా గైకొని యిచ్చటనున్నానని వారికి విశ్వామిత్రుడు దనవృత్తాంతమును జెప్పుకొనెను.

ఇట్లు విశ్వామిత్రుడు రామలక్ష్మణులను వినోదగోష్ఠిచే నానందించుచు నారాత్రి నాశోణానదిగట్టున గడపి మరునాడు ప్రయాణమయి ఋషులతోగూడ నరణ్యంబులను దాటుచుబోయి గంగానది సమీపించిరి. అచ్చట స్నానాది నిత్యకృత్యములను దీర్చుకొని సుఖోపవిష్టులై విశ్రమించుసమయమున రాముడు గంగానగి యెట్లు ముల్లోకముల నాక్రమించి సముద్రునిఁబొందినదో చెప్పుమని విశ్వామిత్రుని యడుగ నీప్రకారంబు చెప్పందొడంగెను. హిమవంతుండను పర్వతరాజుగలడు. అతనికి మేరుపర్వతపుత్రియైన మనోరమయనునది భార్యయయ్యెను వారిరువురకు గంగా ఉమయను నిద్దరు కొమార్తెలు గలిగిరి. ఒకానొక సమయమున దేవతలు తమకార్యసిద్ధికై గంగనిమ్మని హిమవంతుని బ్రార్థింప నతడు గంగను దేవతలకిచ్చెను. అప్పుడుగంగ యాకాశగామిని యయ్యెను.

రెండవకూతురైన ఉమ తపస్సే ధనముగా నెంచి తపస్సుచేయు సమయమున నామెను హిమవంతుడు శివునికిచ్చెను. ఒకానొకప్పుడు శివుడు భార్యయైన పార్వతినిజూచి యాశగొని సంభోగముజేయ నారంభించ దివ్యసంవత్సరములు నూరుగడచినను కుమారుడు గలుగలేదు. అంత బ్రహ్మాదిదేవతలు “యీ పార్వతియందు బుట్టుభూతము నెవ్వడు సహింపగలడని” భయంబునొంది శివునియొద్దకు వెళ్లి, “నీతేజస్సునబుట్టిన పుత్రుని లోకంబులు ధరింపలేవు కావున యోగంబవలంబించి నీరేతస్సును నీదేహంబునంగె ధరింపుము విడువవలదు” అని ప్రార్థింప శివుడు దానికి నంగీకరించి “నేను శరీరమందె రేతస్సును ధరించెదను. పార్వతి తనశరీరమందె శోణితమును ధరింపగలదు. అయితె ఇప్పుడు స్థానమునుండి జారిన క్షోభమయిన నా రేతస్సు నెవ్వడు ధరింపనోపును.” అని శివుడు దేవతలనడుగ వారు భూమి ధరింపగలదని చెప్పిరి. అంత

దేవతలమాటవిని రేతస్సును భూమిమీదవిడువ నది భూమియంతయు వ్యాపింప దేవతలుభయపడి అగ్నిదేవునింజూచి నీవు వాయువునుగూడి యీ శివరేతస్సును ప్రవేశింపుమని ప్రార్థింప నగ్నిదేవుడట్లుచేయ శ్వేతపర్వతమాయెను. వెనుక నిప్పుతోను సూర్యునితోను సమానమయిన శ్రేష్ఠమయిన తెల్లుపవనమయినది. ఆవనమున కుమారస్వామిపుట్టెను. అతనికి కృత్తికలు పాలిచ్చిపెంచినందున నతనికి గార్తికేయుండని పేరుగలిగెను.

అప్పుడు పుత్రేచ్ఛచే జేయబడుచున్న సంభోగమునునిలిపిన దేవతలను మీకు స్వభార్యలయందు సంతానములేక పోవుగాక యనియు భూమిని నాకు గొడుకుగలుగుట కిచ్ఛగింపవైతివి గనుక నీవెప్పుడును గొడుకువలనంగలుగు సంతోషంబు నొందలేవనియు పార్వతి శపించెను.

తరువాత శివుడు తపంబుసేయసాగెను. అప్పుడు దేవతలును ఋషులును సేనాపతినిగోరి బ్రహ్మదేవునివద్దకు వెళ్లి ప్రార్థింప నతడు, “ పార్వతిమిమ్ము శపించినది గనుక మీభార్యలందు సంతానము కలిగింపలేరు. ఆకాశమునందు తిరుగు గంగానది యందగ్ని దేవుడు మీకుగావలశిన సేనాపతియగు కొడుకును బుట్టింపగలడని శెలవిచ్చెను. అంత నగ్నిహోత్రుడు దానుధరించియున్న శివుని రేతస్సును గంగయొక్క యంగీకరము నొంది, నామెయొక్క రూపమునుజూచి కామాతిశయంబుచే సర్వావయంబులవలనను రేతస్సును విడువ గంగాదేవి దానిని సహింపనోపక యగ్నిదేవుని బ్రార్థింప నగ్ని దేవుడు యీహిమవత్పర్వతపాద మందీగర్భముంచమని చెప్పెను. ఆమె ఎట్లు చేయ రేతస్సుభూమిమీద పడుటవలన బంగారము వెండియుబుట్టినవి. ఆ రేతస్సు కారమువలన రాగియు, నల్లని ఇనుమును బుట్టినవి. ఆ రేతస్సుమలము తగరముగాను, సీసముగాను అయినది. ఆ రేతస్సున నె పైనచెప్పిన ప్రకారము కుమారస్వామియు పుట్టెను.

ఆశిశువును కృత్తికలు పోషించిరి. దేవతలు అతనిని సేనాధిపతిగా నభిషేకించిరి.

పూర్వము ధర్మాత్ముడయి యయోధ్యకు రాజైయుండు సగరుండనురాజు సంతానములేనివాడై వగచుచుండెను. అతనికి కేశిని, సుమతియను నిద్దరుభార్యలుండిరి. భార్యలతోగూడి హిమవత్పర్వతముజేరి యందు బహుప్రస్రవణంబను ఒక పర్వతమందు దపంబుజేసెను. అప్పుడు భృగుమహాఋషి దయాపరుడై సంతానవరంబునివ్వగోరి యతనిభార్యల ఇష్టానుసారము కేశినికి వంశకరుండగు నొక్కపుత్రుని సుమతికి మహోత్సాహులయిన యరువదివేవురు గొడుకులగుదురు, గాక యని వరంబిచ్చెను.

Continued from page 212.

## అర్జునునివాక్యము.

కృష్ణా! నిగ్రహింపజాలక భక్తిమాత్రము గలిగి యోగమార్గమున చలించు మనస్సుగలవాడై యోగసిద్ధిని బొందజాలని వాని గతియేమియగును? కృష్ణా! ఉభయ భ్రష్టుడై, పరమాత్మానుసంధానమార్గమున మూఢుడై, యస్థిరుడై చెదరిన మేఘమువలె వాడు నశించునుకదా? కృష్ణా! ఈ నాసంశయమును నిశ్శేషముగా నశింప ననుగ్రహింపుమా? నీవుదప్ప యీసందేహమును నివారింప నెవరును సమర్థులుగారు.

## శ్రీకృష్ణులవాక్యము.

పార్థా! ఇహపరములయందుగూడ వానికి నాశములేదు. ధర్మముగా నడచువాడు, ప్రియుడా, యెన్నటికిని దుర్గతిజెందడు. యోగభ్రష్టుడు పుణ్యలోకములు జేరి యనేకవత్సరములందు వసించి సదాచారశీలురైన గృహమున బునర్జన్మమెత్తును. లేక విద్వాంసులైన యోగులవంశమున బుట్టును. అయితే యట్టిజన్మము బొందుట లోకమున నతిదుర్లభము. అచ్చట పూర్వజన్మవాసనలను మరలబొంది జ్ఞానసిద్ధినిమిత్తమై, అర్జునా! మరల ప్రయత్నముజేయును. పూర్వాభ్యాసముచేత నిరాటంకముగా యత్నము లేక వాడీడ్వబడును. యోగమును దెలియ నిశ్చయించిన మాత్రమున నభ్యాసియైన ముముక్షువుగూడ శబ్దబ్రహ్మము నతిక్రమించును. యోగి శ్రద్ధతో బ్రయత్నముజేయుచు పాపవిముక్తుడై యనేకజన్మసంస్కారమువలన పరిశుద్ధుడై సర్వోత్కృష్టమైన గతిని బొందును. తపస్వికంటె యోగిశ్రేష్ఠుడు. విద్వాంసులకంటెగూడ శ్రేష్ఠుడు. కర్మనిష్ఠులకంటె శ్రేష్ఠుడు, గనుక అర్జునా! నీవు యోగివిగమ్ము. సర్వయోగులలో బూర్ణవిశ్వాసముగలిగి యంతరాత్మను నాయందునిచి నన్నుభజించువాడు యోగశ్రేష్ఠుడని నాయభిప్రాయము.

ఇట్లు శ్రీభగద్గీతయందు ఆత్మసంయమయోగమునకు మంగళం.

## ఏడవయధ్యాయము-విజ్ఞానయోగము.

## శ్రీకృష్ణులవాక్యము.

పార్థా! నాయందు మనస్సునిలిపి నన్నాశ్రయించి యోగాభ్యాసముచేయు నన్నెట్లు నిస్సంశయముగా బూర్ణముగ దెలియుదువో దానిని వినుము. నీకై జ్ఞాన విజ్ఞానములను సవిస్తరముగా నేజెప్పెదను. దానిని దెలిసిన నింక తెలియదగినది

చేరేదియుండదు. వెయ్యిగురు మనుష్యులలో బహుళా యొకడు జ్ఞానసిద్ధికి యత్నము జేయును. యత్నముజేసిన సిద్ధులలో బహుళా యొకడు నన్ను యథార్థముగా తెలియును. భూమి, జలము, నిప్పు, వాయువు,ఆకాశము, మనస్సు, బుద్ధి, యహంకారము లను యెనిమిదియు నాప్రకృతిభేదములు. ఇవి నికృష్టమైనది. అర్జునా! జగదాధారమై జీవభూతమై నాశ్రేష్ఠమైన యితరస్వభావ మెరుంగుము. దీనిని సమస్త భూతములకు గర్భమని యెరుంగుము. నేను సమస్త జగత్తునకు నుత్పత్తిలయస్థానము. ధనంజయా! నాకంటె శ్రేష్ఠమైన నితరమేది యునులేదు. ఈ సర్వము దారమున ముత్యములవలె నాయందు గూర్చబడియున్నది. జలమునరసము, సూర్యచంద్రులయందు ప్రకాశము, వేదములప్రణవము, ఆకాశమున శబ్దము, పురుషుల పౌరుషము, నేనే. భూమియందు సుగంధము, అగ్నియందు తేజము నేనే. సమస్త భూతములయందు, తపస్వులయందు తపస్సు నేనే. పార్థా! సమస్తభూతములకు నన్నునాదిబీజముగా దెలియుము. బుద్ధిమంతులబుద్ధి, తేజోమయమైన పదార్థముల తేజము నేనే. అర్జునా! బలవంతుల యందలి కామరాగరహితమైన బలము నేనే. ప్రాణులయందు ధర్మమునకు విరుద్ధముగాని కామము నేనే. సత్వరజస్తమోగుణములు నావల్లనైనవని తెలియుము. వానియందు నేనులేను. అయితే నాయందవి వున్నవి. ఈ సమస్తజగత్తు ఏత్రిగుణాత్మక భావముల చేత మోహితమై వీనికి నతీతమై నాశరహితమైన నన్ను దెలియ జాలరు. త్రిగుణ మయమైన నాదివ్యమాయ దురవగాహము. నన్ను శరణుజొందువారే యీమాయ నతిక్రమింతురు. పాపులు, అవివేకులు, నీచులు, నామాయచేత జ్ఞానశూన్యులై అసురస్వభావము నాశ్రయించినవారై నాశరణుబొందరు. అర్జునా! నన్నుబూజించు ధర్మపరులు, దుఃఖితులు, ముముక్షువులు సకాములు, జ్ఞానులని నాల్గుతెరగులుగా నున్నారు. వీరిలో సదా యోగయుక్తుడై తదేకనిష్ఠుడైన జ్ఞాని శ్రేష్ఠుడు. జ్ఞానికి నేను మిక్కిలి ప్రియుడు, వాడు నాకుప్రియుడు. వీరందరు ఉదారులే. అయితే జ్ఞానిని నేనేయని తలచుచును. అతడాత్మయోగియై నన్నేపరమగతిగా నమ్మినవాడు. అనేక జన్మములు గడచినవెనుక నరుడు జ్ఞానియై నన్నుజేరును. సర్వము వాసుదేవస్వరూపమని జ్ఞానిచెప్పును, అట్టిమహాత్ముడు మిక్కిలి దుర్లభుడు కోరికలచేత విచ్ఛిన్నముచేయబడిన జ్ఞానముగలవారు వారి ప్రకృతిననుసరించి బాహ్యాచార నియమములను చేయుచు నితరదేవతలను సేవింతురు. ఏభక్తుడు యేయేరూపమున భక్తితో బూజించ యత్నించునో వానికి స్థిరమైనభక్తిని గలుగజేయుదును. అట్టిశ్రద్ధగలవాడై ఆయా

110. బంగాళీభాషలయందు ఊష్మములగు శ, ష, స, ల వలెనే యక్షరము లొకటొకటికి బోలియుండవు. వాటిని నోర్పుమని యర్థము. ఇట్లు బాల్యమునుండి విద్యప్రారంభముననుంచి యోర్పు సాధించవలెనని నేర్పబడుదుము. శాంత గుణము మిక్కిలి మనుష్యునికెక్కువగా నుత్తమమైనది.

111. చక్కెరలో నిసుకనుగలిపిన జీమ యిసుకను తిరస్కరించి చక్కెరను గ్రహించునట్లు కర్మనిష్టాపరులైన మనుజులు పాపమును విడనాడి పుణ్యమును గ్రహింతురు.

112. అక్కరకురాని పదార్థము నక్కరకువచ్చు పదార్థములనుండి వేరుజేయు నట్టిది చేటస్వభావము. సాధువుల గుణమిట్టిదే.

113. బ్రదికియుండినను చచ్చినవానిగా నుండుట యొకధర్మనిష్ఠాపరునిలక్షణము. అనగా శవమునందువలె వికారచేష్టలు కనబడకుండవలయును.

114. ఇహసాధనాపేక్షతో ననేకలౌకికులు ధర్మకార్యము లొనరింతురు. దురదృష్టవ్యసనదారిద్ర్యములు సమకూడ వాటిని గమనించరు. రాధాకృష్ణ, రాధాకృష్ణయని దినమంతయు దైవనామోచ్చారణచేయుచు మార్జాలగ్రహణమైన దైవ నామస్మరణమరిచి కౌ, కౌ, యని యరచు చిలుకలువంటివారు.

115. లోన విల్లుగల దూదిపరుపుమీదగూర్చున్ననణగి, లేవ పూర్వాకారమును బొందుభంగి లౌకికులు మతప్రసంగములు గురుబోధలు వినుచుండువరకు ధర్మనిష్ఠాపూర్ణులై యుందురు. దినచర్యలు జేయప్రారంభించిన తత్క్షణమున సకలగొప్పదివ్యాలోచనలను మరచి యథాప్రకార మపరిశుద్ధులై ప్రవర్తించుచుందురు.

116. ఇనుము కొలిమిలోనుండువరకు నెఱ్ఱగ కాలియుండును. బైటదీయనది నల్లనగును. అట్లు లౌకికులుగా గుడిలోన సాధుసంగతినున్నంతవరకు ధర్మలక్షణ సంపన్నుడుగా గనబడును. వారిసహవాసమునుండి వెడల ధర్మలక్షణ రహితుడగును.

117. నాకొడుకు పెరిగిపెద్దవాడైన వానికి బెండ్లిచేసి వానిమెడ సంసారము గట్టి నేనుసన్యసించి యోగియగుదుననియొకడుచెప్పెను. నీకెప్పుడును యోగియగుటకు నవకాశము దొరకదు. హరిగిరులమీద నాకుచాలాప్రేమగానున్నదీ. యనిచెప్పవు. వారు నిన్ను విడువజాలనని చెప్పెదవు. వెనుక హరికి కొడుకుగలుగనీ. పెండ్లిచేసి చూచెదను యని యనంతమైనకోరికల మునిగెదవని సాధువు వానికిబోధించెను.

118. చేపలుపట్టు వెదురుతెడక, వల, గండ్లగుండా నీటిబిందువులు తళతళలాడ, చిన్న చేపలు సంతోషముతో నెగిరి యాగండ్లలో జిక్కుకొని పట్టబడును. అట్లు మూఢులు అసత్యభ్రమలచేత మైమరచి ప్రాపంచిక వ్యవహారమునందు జిక్కెదరు. వలనుండి తప్పించుకొనుటకంటె వలలో జిక్కుట సులభమైనట్లు ప్రాపంచిక వ్యవహారమును అవలంబించిన వెనుక త్యజించుటకంటె మొదలవలంబించుట సుఖకరము.

119. జీవన్ముక్తుడై సంసారమునందు నిస్సంగుడై విహరించినవారిలో జనకరాజు సాదృశ్యమును పలుమారు జనులు వాడెదరు. యావచ్చరిత్రములో ఇదియొకటియే దృష్టాంతమగుపడుచున్నది. ఇతని విషయము సాదృశ్యముగా గ్రహించకూడదుగాని వినహాయింపుకొరకుగా భావింపవలశినది. ధనదారాదులను త్యజించినగాని యాత్మసిద్ధి పొందుట సాధ్యముకాదని సాధారణముగా గ్రహించవలయును. నీవొక జనకుడవునవని తలపకుము. అనేక యుగములు గడచినవిగాని మరియొక జనకుడు లోకమున బుట్టలేదు.

120. ఈలోకము నాటకరంగము వంటిది. అనేకు లనేక వేషములతో తమ తమపనులను నిర్వహించుచున్నారు. కొంతకాలమాడువరకు తమ ముసుకులనుదీయ నిష్టపడరు. వారు కొంతకాలమునాడిన వారే తమ ముసుకులను దీసివేయుదురు.

121. భక్తుల హృదయమెండిన యగ్గిపుల్లవంటిది. దైవనామోచ్చారణ ధ్వనిచేత యతనిహృదయమందలి భక్తియగ్ని ప్రజ్వలించుచున్నది. అత్యాస విషయాసక్తిలో నానిన లౌకికులమనసు తడిసిన యగ్గిపుల్లవంటిది గనుక దైవమహాత్మ్యమెన్నిసారులు బోధించినను భక్తిరసమించుకయైన వాసియందు గానరాదు.

122. ఒక లౌకికునికి జనకునివంటి బుద్ధియుండినను మహాయోగివలె ననేక కష్టములనోర్చినను సన్యాసివలె త్యాగముచేసినను నాడు అవన్నియు తనప్రతిష్ఠకును గౌరవమునకును ధనాశచేతను జేయునుగాని దేవునికొరకు జేయడు.

123. నీరు రాతిని చొరవనట్లు లౌకికుని హృదయమున మతనీతి యెంతమాత్రము దూరదు.

124. మంటిలోగొట్టిన మేకు సులభముగా లోపలదిగునట్లు రాతిలోకిదిగదు. అట్లు జ్ఞానులబోధ లౌకికునికి మనస్సును ప్రవేశించదు. భక్తిగలవాని మనస్సున నంటును.

3. యీవిధమైన కర్రతో తప్ప నితరమైనదానితో యావును కొట్టినవాడు గోహత్యకర్మకు విధించిన ప్రాయశ్చిత్తమును రెండంతలధికముగాజేసి పాపవిముక్తుడు కావలెను.

4. గోహత్యకర్మలు నాల్గు తెరగులుగా నున్నది. గోవును బంధమువల్ల జంపడము, ఉపవాసముపెట్టి చంపడము, మడకకుకట్టి చంపడము, ఊరక కొట్టిచంపడము, బంధించి యావునుజంపిన నొకపాద తపస్సుజేయవలయును. గూటమునకుకట్టిజంపిన నర్ధతపస్సు చేయవలెను.

5. మడకకుకట్టిజంపిన మూడుపాదములుతపస్సును, వూరకకొట్టిజంపిన పూర్ణ తపస్సును జేయవలయును.

6. పచ్చికగల ప్రదేశమునందు పశువులకొట్టమున నగరునగాని మైదానమున గాని సముద్రతటమునగాని నదీసమీపమునగాని యగర్తయందుగాని కొండగుహలో గాని బీటియందు బంధించిన సమయమున నొక యావు జచ్చినబంధమున జంపిన గోహత్యాపాపములభించును.

7. ఏవిధమైన కట్లుత్రాడుతో చర్మములతో గంటలు మొదలగువానితో కట్టినసమయమున నింటిలోగాని యడవియందుగాని బుద్ధిపూర్వకముగను లేకున్నను నుపవాసముంచ యావుజచ్చిన ఉపవాసముచేతనైన గోహత్య నేరమగును.

8-9. ఒక ఆవునుగాని ఎద్దునుగాని మడకకుకట్టినసమయమునగాని గొప్పబరువు వేసినకాలమునగాని గొప్పబరువు మోయజేసినప్పుడుగాని మూడు నాల్గు వరసల గట్టి నప్పుడు చచ్చిన మూడవవిధ హత్యయగును.

10. కర్రతో కొట్టబడిగాని విసరబడిగాని బుద్ధిపూర్వకముగాగానో లేక యో త్రాగి మైమరచిగాని కోపావేశముతో గాని పిచ్చిపట్టిన సమయమున రాయితో విసరబడిగాని జచ్చిన నాల్గవవిధ నేరమగును.

11-12. కొట్టబడినవెనుక నావు తనప్రజ్ఞదెచ్చుకొని లేచి అయిదు లేక ఏడు కవళములగడ్డినిదిన్న ప్రాయశ్చిత్తమవశ్యకములేదు. కట్టిన యావు గర్భమును విచ్చిత్తి జేసిన ప్రాయశ్చిత్తకర్మలో పాతికభాగము చేయవలయును. గర్భచిహ్నాలగుపడిన వెనుక గడుపులోనిపిండము గర్భస్రావమగునట్లుజేసిన నందులో సగముజేయవలయును. గర్భములోపల దూడయైనవెనుక గర్భస్రావము గలిగించిన నాప్రాయశ్చిత్త కర్మములో ముక్కాలుభాగము జేయవలయును.

14. తపస్సున పాతికభాగము జేయునప్పుడు తన దేహమునందు వెండ్రుకలను గొరిగించుకొనవలెను. అర్ధప్రాయశ్చిత్తము జేయునప్పుడు మీసము గొరిగించుకొనవలెను. ముక్కాలుభాగము జేయునప్పుడు తలమీదనుండు వెండ్రుకల కుచ్చుతప్ప తక్కిన వెండ్రుకలనన్నటిని గొరిగించుకొనవలెను. పూర్తిజేయునప్పుడు శిరము మొదలు పాదపర్యంతము గొరిగించుకొనవలెను.

15. పాతిక ప్రాయశ్చిత్తమున ధోవతుల జతను దానము చేయవలయును. అర్ధమున కంచుపాత్రను, ముప్పాతికయందు నొక యెద్దును పూర్ణమైన ప్రాయశ్చిత్తమునందు నెద్దులజతను దానమివ్వవలెను.

16. గర్భమున దూడకు నవయవములేర్పడుటకుముందు పిండము జీవముగల్గి యుండవచ్చును పూర్ణముగా శిద్ధమైన దూడను గర్భమున నున్నప్పుడు జంపిన గోహత్యకువిధించిన ప్రాయశ్చిత్తమును రెండంతలు జేయవలయును.

17. కట్టెతోగాని లేక రాతోగాని యావుయొక్క కొమ్ములను విరుగగొట్టిన ప్రాయశ్చిత్తకర్తమున పాతిక చేయవలయును, కొమ్ములను పూర్ణముగా నూడగొట్టనర్థము జేయవలయును.

18. ఆవుయొక్క తోకను బెణకించు కర్తకు పాదకృచ్ఛ్రవతము జేయుట ప్రాయశ్చిత్తము. దాని ఎముకలను ఒగలగొట్టిన ద్విపాదకృచ్ఛ్రవతమును దాని చెవులూడగొట్ట త్రిపాదకృచ్ఛ్రవతమును గోహత్యను జేసిన కృచ్ఛ్రవతము ప్రాయశ్చిత్తము.

19. దాని నడుము కొమ్ములుగాని దాని దేహమునందు నితర ఎముకలను విరగగొట్టిన యారు నెలలకు కూడా జీవించియుండి తర్వాత యావుజచ్చిననే ప్రాయశ్చిత్తకర్తజేయ బనిలేదు.

20. ఆవును కొట్టినవాడు గొట్టుటవల్ల గలిగిన గాయము పూర్తిగ మానువరకు దనజేతులతో నూనె యంటించవలెను. అది బలముదెచ్చుకొని దానికి నారోగ్యము కునురువరకు నతడు గడ్డి తినియుండవలెను

21. ఆసమయమున దానియుపయవములు సరిపడువరకు జాగ్రతగా జూచుకొనవలెను. వెనుక బ్రాహ్మణులకు నమస్కరించి యావువలె గడ్డితినడము మానుకొనవలెను.

22. అయితే దాని యవయములన్నియు సరిగాక, ఏదైన యంగము హీనమైన గోహత్యకు విధించిన ప్రాయశ్చిత్తమున నర్థము జేయవలయును.

23. ఇక కోపమువల్ల కఱ్ఱతో రాతితో గాని యాయుధముతో నావును జంపిన ప్రాయశ్చిత్తమును జెప్పెదను.

24. కఱ్ఱతునుకతో నావును జంపిన సంతపనవ్రతమును జేయవలెను. యటక కఱ్ఱతో దానిని బడవేసిన ప్రాజాపత్యవ్రతమును సల్పవలయును రాళ్లతో వేశిజంపిన తప్తకృచ్ఛ్రవ్రతమునుజేయవలెను.ఆయుధముతో జంపిన అతికృచ్ఛ్రవ్రతమునుజేయవలెను.

25. సంతపనమునకైను ప్రాజాపత్యమున మూడునను,తప్తకృచ్ఛ్రమున నెనిమిదియు, అతికృచ్ఛ్రమున పదుమూడునను, యావులు దానమివ్వవలెను.

26. ఇట్టి సందర్భమున ప్రాయశ్చిత్త తపస్సును జేయువాడు తాను జంపినదాని యొక్కలక్షణములే గల యొక యావునుగాని సమానమైన వెలగలదానినైననుదానము జేయవలెను. మనువుచేత విధించబడినది యిదియే.

27. వాతలువేయు నిమిత్తమై యావునుగాని యెద్దునుగాని బంధించుట పాపకృత్యము. అయితే యావులను, ఎద్దులను పాలుబిండడమునకుగాని, సాయంకాలమున దొడ్డిలోనికి దోలుటకుగాని, బండ్లనిడ్చుటకుగాని కట్టివేయుట పాపము గాదు.

28. వాతలువేయు సమయమున నెద్దుయొక్క చర్మమును గాల్చినందకుగాని విశేషమైన బరువువేసి యీడ్చునట్లు చేసినందుకుగాని, ముక్కుత్రాడు వేసినందకుగాని, దాటుట కశక్యమైన కొండలయందు నదులయందు నడిపించినందుకుగాని ప్రాయశ్చిత్తము జేసుకొనుట విధాయకము.

29. ప్రాయశ్చిత్తము చర్మమును గాల్చినందుకు పాతికభాగము విశేషమైన బరువువేసి యీడ్చునట్లు చేసినందుకు అర్థభాగము, ముక్కుత్రాడు వేసినందుకు ముప్పాతికభాగము. అయితే గోవునుగాని యెద్దునుగాని జంపినందుకు ప్రాయశ్చిత్తము పూర్తిగా జేయవలయును.

30. కట్టివేయబడిగాని, కట్టివేయబడకగాని యెద్దుచర్మమును గాల్చినందువల్ల మృతినొందినట్టయితే ప్రాయశ్చిత్తమునకు పాతికతపస్సును జేయవలయును. పారాశరులచేత విధించబడినదిదియే.

31. ఆవునుగాని యెద్దునుగాని నిర్బంధపెట్టుట, కట్టివేయుట, నాడములు వేయుట, అశక్యమైన బరువునీడ్చునట్లు చేయుట, కొట్టుట, అట్టిట్టు కదలుటకు వీలు

ముఖ్యమని బోధించియున్నాడు. ఇట్లు కాలానుసారము సత్యముయొక్క యొక
భావమును పెద్దలు కాలానుసారము వెల్లడిజేతురు. సత్యముయొక్క పూర్ణస్వరూపము
నందరుపెద్దలు తెలిసియుండినను ఆయాకాలపు జనులకు కావలశినంతమాత్రము వెల్లడి
చేతురు. ఈకాలమున లోకముననుండు మతములను పరీక్షించు బుద్ధికుశలత ననుసరించి
లోకానుగ్రహార్థమై కాచియుండు మహానుభావులు తత్వజ్ఞానమునకు సంబంధించిన
కొన్నివి యమున నిచ్చినతప్ప లోకముయుండకు జరుగదని భావించి ఈ బ్రహ్మవిద్యా
సమాజపు మూలముగా తత్వములను వెల్లడిచేయ నేర్పాటుచేసియున్నారు. దాని
యుద్దేశములను ఇదివరకే వ్రాసియున్నాము. అదికేవల ధర్మమార్గమునకు ప్రపంచపు
జనులను తీసుకొని రావలశినదని ఏర్పాటైనది. అట్లు విధిగా నేర్పడియున్నది.
కలియుగమున నున్నామని యనుకొనవలసినపనిలేదు. కృతయుగమునకు ముందున్నామని
నంతోషపడవలసినది. కృతయుగధర్మము రావలసియున్న మనమందరము అధర్మము
నిప్పటినుంచి యువలంబించ ప్రయత్నము చేయకున్న నట్టికృతయుగ మెట్లగును. అంతి
కాలము మనలను చక్కచేసుకొనవలెనాయని యడిగిన నింక యెక్కువకాలముకూడ
పట్టునేమోయని మనప్రకృతిస్థితినిబట్టి తోచుచున్నది. కావున మీరందరు ధర్మమార్గ
మునకు ప్రయాణముకావలెను. ఆలశ్యమునకు వీలులేదు లెండి.

## మహా పురాణము.

23. ఒకసమయమున దేవర్షి నారదుడు హంకరించి తనకంటె పెక్కువైన
భక్తుడులేడనుకొనెను. విష్ణువు దానినిగ్రహించి 'నారదా' అచోటికి వెళ్లుము నాగొప్ప
భక్తులలో నొక డక్కడయున్నాడు. అతనిపరిచయముజేసుకొమ్మనెను. నారదుడచ్చో
టికి వెళ్లి, యాభక్తుని నొకవ్యవసాయపరునిగా గనుగొనెను. అతడు తెల్లవారిలేవగానే
హరియని యొకసారిస్మరించి తనమడకను దీసి పొలమునకు వెళ్లును. రాత్రి పరుండు
సమయమున హరినామస్మరణయొకసారిజేయును. దీనినిజూచి నారదుడు 'వీడెట్టిదేవుని
భక్తుడు. వీడు యావత్కాలము లోకవ్యవహారమువంక కాలముగడుపును. భక్తునిలక్షణ
ములెవ్వియును కానరావని యాలోచించెను. నారదుడు విష్ణువునుజేరి తానుచూచినదం
తయు విన్నవించెను. అప్పుడు విష్ణువు, 'నారదా! ఈనూనెగిన్నెనుతీసుకొని, పట్టణము
జుట్టి తిరిగి నేలమీద నొకబొట్టుపడకుండ మరలిర'మ్మని యాజ్ఞాపించెను. నారదుడట్లు
చేసి రాగానే 'నారదా! నన్నెన్నిమారులు దోవలో స్మరించితి'వనెను ఒక్కసారికూడ
స్మరించలేను. నూనె కంఠమువరకు నిండియున్న నీగిన్నెను జాగ్రతతో కాపాడవలసి
నపు డెట్లు నిన్ను దలంతు'ననెను. అప్పుడు స్వామి 'ఈనూనెగిన్నె యొకటి చేతిలో

నుంచుకొని నన్ను పూర్ణముగా మరచిపోవవుగదా! చూడు అనేక సంసారతొందరలు గల వారీదరైతు నన్ను రెండుసారులు తలంచునుగదా' యనెను.

24. కొందఱు చేపలమ్ము స్త్రీలు దూరమునజరిగిన సంతనుండి మగల తమ గ్రామమునకు బోవుచు దోవమధ్యలో సాయంత్రమున వడగండ్లవానలో జిక్కుకొని సమీపమునన్న నొక పూలతోటవానియింటిలో నారాత్రి నిలువవలసివచ్చెను. వాని దయవల్ల నారాత్రి వారు సువాసనతో పరిమళించు పూలగంపలుంచియుండినగదిలో వారు పరుండియుండిరి. వారికి పుష్పవాసన సహించక రెప్పమూయుటకు సాధ్యములేకయున్న వారిలో నొకరు మన చేపగంపలను తలదగ్గిర నుంచుకొని మననిద్రను చెరుపు పుష్పవాసన తక్కువచేసుకొనెదమని చెప్పిరి. అప్పుడందఱట్లుచేసి గుఱ్ఱుకపెట్టనారంభించిరి. చెడ్డవాడుకల బలమిట్లుండునని తెలియవలయును.

25. ఒకడొక నదినిదాట నిశ్చయించెను. ఒక ఋషి యతనికినొక రక్షయిచ్చి 'ఇది నిన్ను నదినిదాటించు' ననెను. దానిని గైకొని యతడు నీటిమీద నడువ ప్రారంభించెను. నదిమధ్యమున నారక్షలో నేమున్నదని కనుంగొన కుతూహలముపుట్టి దానిని జూడ తెరచెను. దానియందు రామనామముగల చీటినిజూచెను. ఇదేనా రహస్యమని పరిహసించ నీటిలో నతడు రక్షాబలముతప్ప మునిగిపోయెను. ఆశ్చర్యములు విచిత్రములు గలిగించునది దైవనామమందలి విశ్వాసమే. భక్తియే ప్రాణము. సంశయమే మరణము.

26. ప్ర—నీభార్యతోకూడ సంసారమెందుకుజేయవు?

ఉత్తరం—దేవతల సేనానాయకుడైన కార్తికేయుడొకనాడొక పిల్లిని తన గోరుతో గీచెను. ఇంటికి వెళ్లగానే తనతల్లిచెంపమీద నొక గీతచిహ్నా యగుపడెను. 'నీచెంపమీద నావికారగీత యెట్లువచ్చెనని తల్లినియడిగెను. బిడ్డా! అది నీపనియే. నీ గోరుతోగీచినగుర్తేయని యుత్తరముజెప్పెను. అదియెట్లు నిన్నుగీరలేదేయని మరల ప్రశ్న జేయ నేడుప్రొద్దున పిల్లినిగీచినది మరచితివా యనెను. కార్తికేయుడు 'అవును పిల్లిని గీచితిని నీకెట్లు చెంపమీద చిహ్నమేర్పడె'నని తల్లిని మరలయడుగ నామె 'నేనుతప్ప ప్రపంచమున వేరేమియులేదు. సృష్టిజాలమంతయు నేనే. యెవరినిబాధపెట్టినను నన్ను బాధపెట్టినవాడవగుదువు' అని తెలవిచ్చెను. కార్తికేయుడాశ్చర్యపడి తాను పెండ్లిజేసుకొనుటలేదని ప్రతిజ్ఞజేసెను. ఏలన ఎవరిని పెండ్లిజేసుకోవలెను? ప్రతిస్త్రీయు నతనికి దల్లిగానుండెను. నేను కార్తికేయునివంటివాడను. ప్రతితన్విని తల్లిగా భావించెదను.

'Registered No. M 716.'

SWAN SERIES No. 3.

ఓం








A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఒక యాంధ్ర బ్రహ్మజ్ఞాన మాసపత్రిక.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 1.] నవంబరు 1908. [సంచిక 11.

విషయసూచిక.

పుట.



చెన్నపట్టణము:

వైజయంతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

హంసశాల మానేజరుగారికి వ్రాసుకొనవలయును.

సంవత్సరమునకు చందా 1 రూపాయ.

## హంసావళి.

1. షట్త్రింశన్మంజరి:—శ్రీశంకరాచార్యులు రచించిన భజగోవింద శ్లోకముల నాంధ్రభాషాణ పద్యాత్మకముగా రచింపబడినది. ఆబాలవృద్ధులకు నానందకరమైనది. వెల 2 అణాలు మాత్రమే.

2. ఏకాదిరత్నావళి:—1 మొదలు 224 సంఖ్యవరకు గల విషయవిశేషములింగు సంగ్రహింపబడినవి (అయనద్వయము, వాసనాత్రయము, సాధన చతుష్టయము, మొదలగు 1008 విషయములు) వెల 4 అణాలు మాత్రమే.

3. హంస:—ఇది మాస తెనుగు పత్రిక 1908 జనవరినుండి వెలువడుచున్నది. ఈ జన్మసార్థకము జేసుకొన గోరువారు దీనిని నిరాకరించ జాలరు. చందా సంవత్సరమునకు నొక రూపాయియే.

హంసశాల,
80, అంగప్పనాయక్ వీధి,
జార్జిటవున్, మదరాస్.

వ. స. హనుమంతరావు,
కార్యదర్శి.

# THE THEOSOPHICAL SOCIETY.

## బ్రహ్మవిద్యా సమాజము.

ఈసభకు చేరినవారు చెన్నపట్టణమున ఈ డిశంబరు నెల 26 మొదలు 30 తారీఖు వరకు అడయారను ప్రదేశమున మహాసభ జేరుచున్నారు. ఆకాలమున ఎడ్గరను నా మెయు, అనిబిసాంటాంబయు ఉపన్యాసములిచ్చుచున్నారు. ఇట్టి సభలు చేరుటవల్ల ఎక్కువ ప్రయోజనకారిగానుండును. సామాజికులందరికిని వందనమిడి యిట్లు ఆలోచించవలయునని పలుమారు ప్రార్థించుచున్నాము.

అహా! నే నెన్నొవసారి యీ మహామండలమునకు వచ్చితిని. నాయందు ముందుండిన గుణములెవ్వి? ఇప్పుడెట్లు అవి మారినవి. మంచిగుణమేదైన మనస్సునదూరి

ఓం

# హంస.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 1.] నవంబరు 1908. [సంచిక 11.

## దయచేసి దీనిని చూడుడు.

ఆర్యులారా! నన్ను ఈసంవత్సరము పోషించినందుకు చాలా వందనము లిడుచున్నాను. జనవరి మొదలు నాకు రెండవసంవత్సరము పుట్టుచున్నది. జనవరి నెలనుండి నన్ను పోషించువారు చందా 1 రూపాయి కట్టవలశి యుంటున్నది. గనుక నన్ను పోషింప నిష్టపడనివారలు డిశంబరు 10-వ తారీఖులోగా కార్యదర్శికి దయచేసి తెలుపవలశినది. లేకున్న నేను జనవరి నెలయందు వి. పి. ద్వారాగా వచ్చినప్పుడు నన్ను తిరస్కరించిన నాకులు 0-1-3 అపరాధము విధించినట్లగును. దానివల్ల యిదివరకే చాలా కృశించియున్నాను. చందా మొత్తము మనియార్డరుద్వారాగా డిశంబరు నెలలోగా పంపిన చాలా కృతజ్ఞుడుగా నుందునని విన్నవించుకొనుచున్నాను.

అనంతపురమునందు జరిగిన బ్రహ్మవిద్యా సమాజమునకు చేరిన మధ్యజిల్లాలలోని సామాజికుల సభయందు యింగ్లీషులో చదవబడిన స్వాగతప్రసంగమును తెనుగున భాషాంతరీకరణము గావించి తెనుగు జనులకు అందరి యభిప్రాయంబు తెలిపిన యుపయుక్తముగ నుండునని కొందరు కోరినందున నది ప్రచురింపబడినది.

## స్వాగతప్రసంగము.

అగ్రసనాధిపతీ! సహోదరులారా!

అనంతపురముయొక్క బ్రహ్మవిద్యాసమాజముపరముగా, మహదైశ్వర్యకీర్తి యుక్తమై పూర్వము మిక్కిలి నుతికెక్కియుండిన విజయనగర సంస్థానమునకు చేరిన హాండీ వంశముయొక్క యీపురాతన పీఠస్థానమునకు మిమ్ములను సాదరపూర్వకముగా సన్మానించుచున్నాను. ఈ చరిత్ర ప్రసిద్ధమగు అనంతసాగరములో గూడు ఈ యేడవ మధ్యజిల్లాల బ్రహ్మజ్ఞాన సభకు, మన మందరము, నిజమైన భూతదయ పశ్చాత్తాపమను బంగారు తీగెవల్ల చేగకట్టబడినవారమై, సదా పచ్చగా నుండి, సర్వవ్యాపకమై నిత్యమై యుండు బ్రహ్మవిద్య యను వృక్షముక్రింద కూర్చొని, ప్రపంచ వ్యవహార కష్టనిష్ఠురములను కొంతసేపైన మరచి, దేవధర్మము, ఆత్మధర్మము, సాంఘిక ధర్మములను మన పావనధర్మత్రయమును బాగుగా నెట్లు నెరవేర్చవలయునో యా విధులను గుఱించి యాలోచనలు జరుపుటకు మీకు స్వాగతమిచ్చుచున్నాను. సహోదరులారా! సర్వతోముఖమయిన సహోదరభావము పేర మీకందరికిని స్వాగతము చేసి, స్నేహభావమున కేలూతనిచ్చుచున్నాను. మహామండలివనుకరించు నీసభయందు శ్రద్ధయు పూనికయు గలిగి ప్రవర్తించి, ఈసభ రానురాను బలవంతమై, మత, ఆత్మ, నీతి, సాంఘిక, సంబంధమైన వృద్ధిని ఈ దేశములో తనచేతనైనంత గావించుటకు, మీరందరు సుహృదయులై కరుణవహించి సహాయభూతులుగానుందురని మిమ్ములను వినయపూర్వకముగాను, మనఃపూర్తిగాను, వేడెదను. ప్రపంచముననుండు సర్వసృష్టిగతిని, నియామకము చేయు అయగోచరమైన దైవహస్తము మమ్ములను చేపట్టి ముందునడపి ఈసభ శ్రేయోభివృద్ధిగా జరుగుగాక.

2. ఈసభయొక్క వృత్తాంత మించుక వివరించెద. లోకప్రసిద్ధమైన నది మూలమువలె, ఈసభయొక్క పుట్టుక మిగులచిన్నదియై, ఆడంబరములేనిది యై యున్నది. ఈ చెన్నపురిరాజధానియందు ఇట్టి సాంఘికసభలలో నిది మొదటిది. దీనిని ప్రచురింపజేసినకీర్తి ఒకవిధముగా అనంతపురమునకగునని చెప్పవచ్చును. 1908-వ సంవత్సరమున, ఈ జిల్లాలోని కొందఱు సామాజికులు సమీప జిల్లాలలో నక్కడక్కడనుండు బ్రహ్మవిద్యాసభయొక్క సామాజికుల యొండొరుల సౌహార్దము నెక్కువ జేయుటకును, సాంఘికవృద్ధి చేయుటకును, ఆత్మజ్ఞానౌన్నత్యము గలిగించుట

కును, లోకహితకార్యాలోచనము చేయుటకును, ఆయాగ్రామములనుండు ఈసమాజ
మునకు చేరిన వారందరు మహాసభగా గూడుట బాగుగనుండుననియు, ఇదిగాక చెన్న
పట్టణమున ఈ సమాజమునుండు అడయారను ప్రదేశమున ఒకసంవత్సరమునను, పుణ్య
క్షేత్రమగు కాశియందు ఒకసంవత్సరమునను ఈ బ్రహ్మవిద్యాసమాజముయొక్క
సాంవత్సరికసభ మార్చి మార్చి జరుగుచుండుటచేత, అడయారులో సభలేనిసంవత్సర
మున ఈ ప్రకారముగాగూడి బ్రహ్మవిద్యను ప్రచురము చేయుటకును, పైయుద్దేశములు
నెరవేర్చుటకును, సామాజికులు చేరుట మిగుల యావశ్యకమనికూడ యెంచిరి. కావున,
మొదటిసభ 1903-వ సంవత్సరపు జనవరినెలలో, గుత్తిలోజరుపబడి, పిమ్మట ఆయా
పట్టణములవారిదయవల్లను, మనఃపూర్వకమైన స్వాగతమువల్లను, కడప, చిత్తూరు
నెల్లూరు, బళ్లారి, కర్నూలు, ఈ పట్టణములందు జరుపబడినది. అదృష్టవశమున ఈ
ఏడవసభ, అనంతపురములో తటస్థించినది. ఏడవసంఖ్యను గురించిసాధారణ జనులేమి
చెప్పుకొన్నను బ్రహ్మజ్ఞానమున నీసంఖ్య మిగుల పవిత్రమైనది గనుక అదృష్టవశమున
అని నేనుచెప్పవలసియున్నది. మీకుదెలిసినరీతి, మానవజన్మమందు ఈ సంఖ్యముఖ్య
మైన కాలము. శాస్త్రవిదుడు శరీరము ఏడుసంవత్సరముల కొకతూరి మారునని చెప్పు
చున్నాడు. అదినిజమైన, ఈ పట్టణములో, ఈ ఏడవసభజరిగిన పిమ్మట ఆరోగ్యమైన
మార్పుపొంది మిగుల బలమైన వృద్ధిపొందునని నేను కోరుచున్నాను.

3. ఈ కాలమందు అంతవిశేషముగాచెప్పబడి, అంతవిశేషముగా వ్రాయ
బడుచున్న, బ్రహ్మవిద్య ఎట్టిది? అదికూడయొకమతమైన, నామతము సదాచారమతమని
యు, నీమతము భిన్నమతమనియు, వదరుచు ఒకరితోనొకరు కలహించుచు రక్తమిళిత
మైన జగడముచేయుచునుండు అనేకమతములు ఈ ప్రపంచమున సర్వదేశములందు
నెగడుచుండ ఈ మతమెందుకు? అట్లువిచారించువానికి, ఈ బ్రహ్మవిద్యమతము గాదని
చెప్పవలసియున్నది. దానినికూడ మతమనవలసివచ్చిన, దానిని సర్వమతసారమన
వచ్చును. అది మతముల మూలసిద్ధాంతములను కనుగొనుటకు ప్రయత్నించుచు పరస్పర
మతద్వేషములనుపోగొట్టి 'సత్యాన్నాస్తిపరోధర్మః' అనగా సత్యముకంటె వేరు
ధర్మములేదనే ఈ సమాజముయొక్క ప్రతిజ్ఞకనుగుణ్యముగా, హితమైనసంబంధమును,
సోదరభావమును కలుగజేయ యత్నించుచున్నది. మతమునుగురించి యొకమాటచెప్ప
నిండు. మతము జీవజగత్తువలె అనాదియైనది. మానవునివిద్య నాగరికతల ననుస
రించియు, మనోబుద్ధిగుణముల ననుసరించియు, వానివాని మతము భేదించును. నీలమే

ఘములను, నక్షత్రయుక్తమైనయాకాశమునుచూచి, వాటినే దేవుడనుకొను అడవిమనిషి మతము మొదలుకొని, దేవుడు అవాఙ్మానస గోచరుడనిచెప్పు తత్త్వవేత్తయైన స్పెన్సర్ మతమువరకు, మతావలంబుల కోరికలు నమకూర్చు ఏకాభిప్రాయప్రధానమైన అనేక మతములు గలవు. ఆళ్వారులు పాడినరీతి,

అవరవర్ తమతమఅఱివఱివగైవగై
అవరవరిఱైయవ రెనవడియడైవర్గళ్ ।
అవరవరిఱైయవర్ కుఱైవిలరిఱైయవర్
అవరవర్ విధివళిఅడైయనిన్ఱనరే.

“ప్రతిమనిషి తన మనోగ్రహణశక్తి ననుసరించి దేవునిని కొలుచుచున్నాడు. ఒకని దేవుడు మరియొకని దేవునికంటె ఏలాగునను తక్కువకాదు. ఆచార్యులు విధించిన అనేకరీతుల, ఒకేదేవుడే సర్వాంతర్యామియై యున్నాడు.”

ఇటులుండ కలతయేమునకు? పగయేమునకు? అల్పబుద్ధిగల మరభిమానమెందుకు? మతములమూలాధారమైన సిద్ధాంతములను తెలిసికొనక, తన మతపులాచార వ్రతములను, చిహ్నలను, సాంకేతికములను, అధికముగాపాటించి తన మతగ్రంథమే దైవప్రసాదమనియు, యితర మతగ్రంథములన్నియు అసత్యమనియు, కృత్రిమమనియు, కార్యసాధనమునే కార్యఫలమని భ్రాంతిపొంది కేవల ముఖ్యముగా పాటింపరాని పుట్టుక, కులము, తెగ, ఆచారవ్యవహారములు, భోజనపానములు, స్నానవస్త్రధారణములు మొదలగు వీటినే పెద్దగాతలచి, విఱ్ఱవీగుటవల్లనే.

ఇట్లయిన నిజమైన మతమేమి? నాద్వాదశనామములు మాత్రమే నిజమైన మతముకాదు. నాసోదరుని పవిత్రవిభూతియే నిజమైన మతముకాదు. నా ఇంకొక సోదరుని అంగారము, సుందరముద్రలుమాత్రమే నిజమైన మతముకాదు. నాయింకొక స్నేహితుని వట్టిముఖము మాత్రమే, అది యెంతపరిశుభ్రమని అతడు అనుకొనినను, నిజమైనమతముకాదు. యింకొక స్నేహితునియొక్క గోపీచందనము మాత్రమే నిజమైన మతముకాదు.

శిఖావిహీనమైనతలయు జటధారితలయు త్రిదండకమండలములు కౌపీనకృష్ణాజినములు మాత్రమే నిజమైన మతముకాదు. శ్రీవఏకాదశీప్రముఖవ్రతసాధనయు వాటిపైచూపుమాత్రమే మతముకాదు. త్రికాలస్నానము, అయిదునమాజులు కందమూలఫలాహారము, సహస్రార్చనాభిషేకములు, మాత్రమే నిజమైనమతముకాదు.

ఊర్ధ్వ, అధోలోకములు, కోశములు, నాడులు, జ్ఞానవిజ్ఞానములయొక్క సమ్యగ్విచారము, ఆసనప్రాణాయామ అభ్యాసము, లంబికా యోగసాధనయు యితరయోగసాము మాత్రమే నిజమైనమతముకాను.

ఊన్వాడ ఉణ్ణామయిర్కావలిట్టుడశీర్ పెరియాయేపులనైంగు నొందు।
తాంవాడ వాడతవం శెయ్యవేండా తమదావిమయోరులగాళిగిర్పేర్.
కాయోడు నీడు కనియుండు వీసుకడుంకానుఘర్న్దు నెడుంకాల మైంగు।
తీయోడునిన్లుతవం శెయ్యవేండా తిరుమార్భనైచింనైయిల్ వైత్తుమణ బీర్.

"ఒకడుదైవలోకము పొందను శరీరమును శోషింపజేసి, ప్రాణధారణమునకు మాత్రము దేహమును పోషించుము, పంచేంద్రియములను నొప్పించు, కృశింపజేయు క్రూర తపస్సును చేయపనిలేదు. దేవునిని తలంచి, ధ్యానించుటకై, అడవియందు కందమూలములు తిని, లేక, వీచు గాలిని భక్షించిగాని, పంచాగ్నిమధ్యమున నిలచి తపంబుజేయ పనిలేదు."

ఏయొక మతముయొక్క ప్రధానమైన ధర్మములు ప్రపంచములోని యితర గొప్ప మతములధర్మములతో నేకీభవించునో అదియే నిజమైన మతము. ఈధర్మములు రష్యాదేశమున జీవించియుండు ఆ మహర్షి టాల్‌స్టాయి చెప్పినప్రకారము మిగుల సరళమై, సులభముగ తెలియదగినవై, కొద్దిగానున్నవి. అవియేవన:— సర్వాధార భూతుడగు ఒకదేవుడున్నాడు. మానవునియందు ఈదైవాంశకణమున్నది. దానిని మానవుడు తనజీవనధర్మములవలన తగ్గించవచ్చును లేక హెచ్చించవచ్చును. దీనిని వృద్ధిచేయుటకు అరిషడ్వర్గములను అణచి ప్రేమను వృద్ధిచేయవలయును. దీనిని పొందుటకు ఇతరులు తనవిషయమున నెట్లు నడచుకొనవలయునని తానుకోరునో అటులనే ఆ యితరుల విషయములో తానునడచుకొనవలెననునది ముఖ్యసాధనముగా నున్నది. సర్వమతసమ్మతమూలాధార ధర్మములను కనిపెట్టి ప్రపంచములోని భిన్నాభిన్నములయిన మతముల నైక్యముచేయుటయు, విరోధమును బడద్రోసి, సహోదరభావము సమకూర్చుట, మనస్తాపములు మాన్పి ఒకరికొకరి సహాయధర్మము గూర్చుట, అన్నిటిలోని నీతి, సత్యము, పవిత్రత, మనోహరము, శ్రేయస్సు, సమకూర్చుటయే దానియొక్క వివిధమతసమన్వయ విచారవుద్దేశము. ఆ బ్రహ్మజ్ఞానముయొక్క సరళమైనను ఘనమైన ధర్మములను గ్రహించి, అనుదినము వాటిననుసరించి, ప్రవర్తించుటకు యత్నించుదము. ఎందుకన తెలివినడతకే నడతలేని తెలివి తెలివికాదు. బ్రహ్మజ్ఞానసభకు జేరిన

ప్రతియొక్కఁడు ఎచ్చట నుండినను ఎట్టి జీవనము చేయుచుండినను, ఐకమత్యము, శాంతము, సహోదరభావములను శంఖములను బూరించుఁగాత.

ఈ కాలమున కొందరు చదువరులు బ్రహ్మజ్ఞానము వేదాంతమును బోధించుచున్నదనియు, వేదాంతము కర్మశూన్యము బోధించుచున్నదనియు, గాన, బ్రహ్మజ్ఞానము సహా కర్మశూన్యము బోధించుచున్నదని విపరీతవాదము చేయుదురు. అది ఆతురమైన అభిప్రాయమనియు దయలేని దూషణయని నేను తలచుచున్నాను. వేదాంతము కర్మశూన్యమును బోధించుటలేదు. దానికి మాఱుగా, అది హెచ్చైన కర్మానుష్ఠానమును బోధించుచున్నది. కర్మసాధనలో, నిత్యశాంతిని బోధించుచున్నది. దుర్బలమైన సిద్ధాంతమును అది బోధించుటలేదు. ఎంతగొప్పదైనను అసాధ్యమైనగతిని అది చూపుటలేదు. 'నీవు బలహీనుఁడు, పాపరూపమున బుట్టినాఁడవు, ఇది గాని అది గాని చేయుటకు శక్తిలేని దౌర్భాగ్య ప్రాణి' యని యది చెప్పుటలేదు. దాని మహావాక్యము, తత్త్వమసి, అది నీవు. నీవు దైవాంశము, మండుచున్న అగ్నినుంచి ఎగురు అదే స్వభావముకల అగ్నికణము వలెను న్నావు. నీవు స్వభావముగ నిర్మలుఁడవు, సంపూర్ణుఁడవు, బలవంతుఁడవు, కర్మచేత నిన్ను నీవు ఉద్ధరించుకొనవచ్చును, లేక, నశింపజేసుకొననగు' నని చెప్పుచున్నది. మనయందు మనకు నమ్మకముండవలెనని అది బోధించుచున్నది. చేతులు ముడుచుకొని కూర్చుని యుండి పిమ్మట నా తలవ్రాతయని మొఱపెట్టఁగూడదని బోధించును. కర్మను, నిరభిమానికర్మను చేయవలెననియు, నేను నీవను భేదములను కల్పించక, భిన్నమయిన నేనను భావము అభిన్నమయిన అఖండస్వరూప భావన కావలెననియు బోధించుచున్నది. ఇట్లు స్వానుభవమువల్ల తెలుసుకొనిన మనుజునకు లోకసుఖము తనసుఖముగాను, ఇతరుల బాధలు తన బాధలుగా నుండును గాన హెచ్చైన కర్మానుష్ఠానమును వాఁడు సాధించక పోఁడు. వారి సౌఖ్యమునకై, వారి యుద్ధారమునకై వారి హీనస్థితి వృద్ధికై, వాఁడు సదా కర్మను ఫలాపేక్ష లేక చేయుచు తనకు కీడు చేసిన వారికి కూడ వారి పాపపరిహారమునకై 'అయ్యో! వీరలు తెలియక చేసినారని' దేవుని మన్నన యడుగు ఏసుక్రీస్తు మహానుభావుని వలె, కావలసి యున్న లోకహితమునకై సంతోషముతోను అపారదయారసముతోను తన ప్రాణమునైన నిచ్చుటకు సిద్ధముగా నుండును. కర్మరాహిత్యము, మోక్షకారియని మన పవిత్రమత గ్రంథములు బోధించుటలేదు. మోక్షసిద్ధికై కర్మబాహ్యులుగా నుండవలెనని మన ఋషులు బోధించియుండలేదు. కర్మరాహిత్యము నిత్యసుఖానుభవమునకు అవశ్యకమని దేవతలాజ్ఞాపించియుండలేదు. అద్వైతగురువు అయిదు వేల సంవత్సరముల క్రింద నెక్కడ ఏమి బోధించిరి.

ఆమహాకురుక్షేత్రయుద్ధరంగమందు చేరియుండిన ప్రతివాదును సాధారణముకాని ఒకరి నొకరు చంపునంత తీవ్రకర్మానుష్ఠానపరులైయున్న యాకాలమున, అద్వైతగురువు తన శిష్యునికి వేదాంతము బోధించుటకు తగినసమయమనితలచెను. అప్పుడుఆత్మానాత్మనుగురించిన ప్రతిప్రసంగపువివరను, యోగస్వరూపమును దానిసాధననుగురించిన ప్రతివాదము యొక్క అంత్యమునను, పురుషప్రకృతిస్వరూప తార్కికమార్గనిర్ణయాంతమునను 'యుద్ధమునకులెమ్ము' అనునదియే భగవద్గీతయొక్క ముఖ్యపల్లవిగానున్నది. అర్జునునికి ధైర్యమిచ్చి కర్మానుష్ఠానపరునిగా చేసి యుద్ధమాడునటుల చేయుటయే గీతయొక్క ముఖ్యోద్దేశము.

కర్మరాహిత్యముకంటె కర్మానుష్ఠానము శ్రేష్ఠమనియు, గొంతెమ్మకోరికలకంటె పనిచేయుట మేలనియును, ఫలాపేక్షలేని కర్మానుష్ఠానము మోక్షమునకు సరియైనమార్గమన్నియు, అందు బోధింపబడుచున్నది. అదిఅట్టిది, కావున, పూజాగృహమున పారాయణమునకు మాత్ర మేర్పడిన గ్రంథము గాక, విశాలమైన ప్రపంచమున నిత్యధర్మాచరణకు నేర్పడిన గ్రంథమని భావించవలసినది. వేదాంతబోధనలు తత్త్వమసియను మహావాక్య తత్త్వాను భవమునకై ఒకడు అరణ్యమునకు బోవపనిలేదు. ఎముకలు విరుగగొట్ట పనిలేదు. కండలు పురిత్రిప్పపనిలేదు. జీవచ్ఛవంబగునట్లు ఉపవాసముండనక్కరలేదు. ఏలన, "ఓశిష్యా చీకటియడవిలో జనసంగములేక కూర్చునియుండుట, ఆకు అలములు తిని జీవించుట, హిమత్పర్వతమునుండి వచ్చు మంచుతో దప్పిఆర్చుకొనుచుండుట, మోక్షమునకు మార్గమనినమ్మకుము.

"ఎముకలు విరగగొట్టుకొనుట, మాంసపు కండలను చీల్చుట ఇవినిన్ను ఆత్మను కూర్చునని యెంచకుము. నీస్థూలశరీరవ్యాపారములు జయించిన, జనులకు ఇతరప్రాణులకు చేయుతగిన ధర్మములు చేయుబడినట్టు తలచకుము. మహాత్ముడగుటకు సర్వప్రాణులను ప్రేమించుట వదలవలయునని నీకెవరైన చెప్పిన వారలసత్యమాడుదురని చెప్పుము

"మోక్షసిద్ధికై నీతల్లిని ద్వేషించుమనియు, కొమారుని అనాదరణచేయుమనియు, తండ్రినితండ్రికాదనుమనియు, జీవజంతువులందు దయారహితుడవు కమ్మని చెప్పిన యెడల, వారిపలుకసత్యమని వారికి చెప్పుము. "పాపము కర్మవల్ల కలుగుననియు, పరమసుఖము కేవల కర్మసన్యాసమువల్ల కలుగుననియు, నీకుబోధించినయెడల తప్పని చెప్పుము."

అని గురువు బోధించుచున్నాడు.

‘ ఇంటిలోను, గ్రామములోను, కార్యస్థానమునను, సంతలోను, జనసంఘము లోకూడ శిష్యుడైనవాడు సరియైనధర్మమును చేయుచుండును. అజన్మమేజన్మము.’ కావున బ్రహ్మజ్ఞానముగాని వేదాంతముగాని కర్మరాహిత్యమును బోధించుటలేదు. దాని నీతి ఏదన, కర్మలేకున్న సద్గతిలేదనుటయే.

సహోదరులార, ఇంకొకమాటచెప్పి ముగించెదను. అనేకమున ఏకమే ప్రపంచ ధర్మమగును. మనమందరు మానవులమే. అయినను మనలో నొకరకొకరికి భేదము న్నది. మనవర్ణములువేరు. మనప్రకృతులువేరు. మనబుద్ధులువేరు. అయితే జగత్తులో మనమందర మొకటే. మనమందరు నెలకొనియుండు పరవస్తువులో మన మొకటిగా నున్నాము. కావునఅతనిని చేరుటకు మనమవలంబించు మార్గములు, ఆత్మజ్ఞానానుభవము చేసుకొనురీతులు, ఆమూలకారణమునందైక్యము పొందుటకు చేయుసాధనములు వేరువేరుగా నుండును. తనస్వభావమునను సరించి ఒకడొకమార్గమున పోవును. ఇంకొకడు ఇంకొకమార్గమున పోవును. అన్నిదోవలు రోముపట్టణమును చేర్చునట్లు, అందరొకగతినే పొందుటకు ముందుపడుచున్నారు. రాజయోగము కర్మయోగము జ్ఞానయోగము భక్తి యోగము అని సాధారణముగా మోక్షమునకు నాలుగు మార్గములు చెప్పబడియున్నవి. ఒకటొకటిని సంగ్రహముగా నిరూపించుదము.

రాజయోగము:—ఆత్మతత్వ విచారయోగమన వచ్చును. ఇందులో ఏకాగ్రతవల్లను మనోచంచలమును అణచుటవల్లను ఐక్యము పొందబడును.

చంచలంహిమనఃకృష్ణ ప్రమాథి బలవద్దృఢం।
తస్యాహంనిగ్రహంమన్యే వాయోరివసుదుష్కరం॥

ఓమధుసూదనా, మీరుసుఖావహమని వచించిన ఈయోగమునకు, కలతవలన, నిలుకడయైన యాధారము నాకు గనుపించలేదు. ఎందుకన మనసు నిజముగ చంచలస్వభావము కలది. ప్రమాదహేతువై బలవత్తరమై దృఢముగా నున్నది. గాలివలె అణచుటకు దుస్తరమయినది?

అని అర్జునుడు శ్రీకృష్ణునికి వేసిన ప్రశ్న మీకందరికి జ్ఞాపక ముండవచ్చును. అందుకు ప్రత్యుత్తరముగా శ్రీకృష్ణులు “అభ్యాసేనతుకౌంతేయ వైరాగ్యేనతు గృహ్యతే” నిస్సందేహముగా మనస్సు నణచుటకష్టము. అయితే దానిని నిరంతరాభ్యాసమువల్లను వైరాగ్యమువల్లను సాధింపవచ్చునని సెలవిచ్చియున్నారు. ఇదియే రాజయోగ ముఖ్యతాత్పర్యము.

కర్మయోగము సకలవ్యవహారము చేయుమానవులకు తగును. అతడు లోకకార్యములు జరిపి, ప్రాణులకు కొంతమేలు చేసి, తద్వారా పరమాత్మను పొందుట కర్హుడగును. ప్రతియొక డేదోయొకపనిని చేయుచునే యున్నాడు. ఫలాపేక్షలేని నిరభిమానమైనకర్మయే కర్మ. ఇదియే కర్మయోగము బోధించురహస్యము.

జ్ఞానయోగమును. నది దృశ్యప్రపంచమున క్రమించి, దానికి మూలాధారమైన గోప్యవస్తువును శోధించ యత్నించు తత్వజ్ఞానియొక్క మార్గమనవచ్చును అతనికి జీవాత్మయే పరమాత్మ. అతనికి ఆత్మ ఇచ్చట అచ్చట, ఎచ్చటనుండు సర్వవ్యాపి. అతనికి ఆత్మలేని చోటుగాని పదార్థముగాని ఏదియు లేదు. వేరంతయు మాయ. అవిద్య అజ్ఞానము.

కడపటిదియయ్యును కనిష్ఠముగానిది భక్తియోగము. అది సర్వభూతహితము, సర్వప్రాణి ప్రేమయోగమనవచ్చును. అతని దేవుడు దృష్టికిగోచరుడు, స్పర్శదగ్గిన పాత్రుడు, వాడతనిని తెలిసికొనుచున్నాడు, వినుచున్నాడు, ప్రేమించుచున్నాడు, అనుభవించుచున్నాడు సుందరమును గంభీరము సువిశేషమున ప్రేమించుచు, చూచుటకును మనోహరమై భక్తిరసమును పుట్టించు సకలరూపములలోను విగ్రహములలోను దేవుని పూజించుచున్నాడు. 'నన్నుప్రేమించువాడు, నాకుక్కను ప్రేమించునను' సామెతె ననుసరించి, ఈశ్వరుని సృష్టియందుండు అధమమైన ప్రాణులను గూడ ప్రేమించును.

ఈ భక్తిమార్గ మితరమార్గములకంటె సులభసాధ్యమయినదియు, హెచ్చువశ్యకారిణియునగును. ప్రేమఅన్నికష్టములను నివారించును. అన్నిభేదములను సమకూర్చును. మత, కులభేదములను గోడలనుపడగొట్టును. మనమందరము ఈభక్తిని పొందుటకు, మనదినచర్యయందు ఈభక్తిని వృద్ధిచేయుటకు, ప్రయత్నించుదము—తియ్యనిపండ్ల నంతయు మనరామునికని దాచిపెట్టిన బోయ శబరిభక్తిగాని దేవునిదీపనైవేద్యములకై ముగ్గిన అగ్గువనెయ్యి కొనెడు హీనమనిషిభక్తికాదు. దప్పిగొనిన చండాలునికిని అతనికుక్కలకును తనకమండలములోని నీటినిసంతోషముతో పోసిన రంగదేవునిభక్తిగాని బీదకుబిచ్చమిచ్చుటలోకూడ భేదమునెంచునరుని భక్తికాదు. దేవాలయద్వారమును కూడ చండాలునికి తెరచివిడిచిన రామానుజునిభక్తికాని తమమతమునకు కులమునకు సంబంధించని విద్యార్థులను తమపాఠశాలలో ప్రవేశించకుండా తలుపులు మూసి

గడిచేయువారి భక్తికాదు. దేవాలయ గోపుర శిఖరమెక్కి "వినెడు వారందరు విని కడతేరుడీ" యని నారాయణమంత్రమును వెల్లడి చేసిన ఉడయవరు భక్తికాని ఇంతయంతయని హద్దులు పెట్టు మనిషి భక్తికాదు.

"నేను ప్రతివారితో చేరి వారేరూపమున దేవుని పూజించిన యారూపమున నేనును పూజించుచున్నాను. నేను మహమ్మదీయుల మజీదుకు పోయెదను. నేను క్రీస్తు దేవాలయమునకు వెళ్లి శిలువ ముందు మోకాళ్లపైబడి మ్రొక్కుదును. బౌద్ధుల దేవాలయమునకు వెళ్లి యచ్చట నేను బుద్ధుని సేవించి, యతని ధర్మము గైకొనెదను. ప్రతిమానవుని హృదయకమలమున ప్రకాశించు ఆ పరంజ్యోతిని చూచుటకు ప్రయత్నించు హిందువులతో చేరి అరణ్యమున తపస్సుచేయుదును" అని చెప్పు వివేకానందుని భక్తికాని, శివాలయమున అడుగిడ్డి పెట్టనను శ్రీవైష్ణవభక్తిగాదు. స్వార్థుని చూచిన స్నానముచేయు మధ్వునిభక్తికాదు. తల్లిదండ్రులు లేని 60,000 బీద బిడ్డలను, అనాథరక్షకునివలె, రక్షించి, విద్యగరపి, జీవనోపాయము కలిగించిన బర్నార్డో భక్తి. సాధువుల సంతర్పణకై గుణవతియైన తన భార్యనమ్మ తమకువ వుంచెనని చెప్పు కబీరుభక్తి.

"దైవమా, నాకూతురైన మనస్సును నీవెట్లు మోహింపజేసినావు? భూమిని తాకి, ఇదే వామనుని రాజ్యమనును. ఆకాశమునుచూచి, విష్ణువు వసించు వైకుంఠ మిదిగోయని చూపును. కంకణహస్తములు మోడ్చి, సముద్రమునుజూచి అతడు శయనించు స్థలమిదిగోయని చూపును. భాస్వరమైన సూర్యునిజూపి, శ్రీధరమూర్తి యిదియే యనును. ప్రజ్వలించుచున్న యగ్నిని కౌగలించి, అచ్యుతుడితడే యని చెప్పును. మందమారుతమును హృదయమున జేర్చి నా గోవిందుడితడేయని యరచును. పూర్ణచంద్రబింబమునుచూపి, యితడే నాసుందరమూర్తియనును. పొడుగుగానుండు పర్వతమునుజూచి, నాదేవుడా రమ్మని పిలుచును. మంచివానపడుచుండుటజూచి, నారాయణుడువచ్చినాడని నాట్యముచేయును. లేతదూడల మెడచుట్టు చేతులనువేసి, గోవిందుడు కాచిన దూడలివియనును. పసిపాముల వెంటనంటి, అతడుశయనించు పాన్పుఇదియే యని యరచును. తలమీద కుంభములతో నాడువారినిజూచి, గోవిందుడని వారివెంట నడుగును. మనోహరమైన వేణునాదమువినిన, మాయావియైన కృష్ణునితలంచి మూర్ఛిల్లును. గొల్లలుకొనిపోవు వెన్నచూచి వాడు చవిచూచినవెన్న యిదియేయనును. గొప్పధనవంతులైన రాజులనుచూచి, దేవునినే జూచెనని చెప్పును. ద్వాదశనామములు

మొదలగు వర్ణచిహ్నాలు దేహమున జక్కగదిద్దిన వారిని జూడ దేవదాసులని వారి నాశ్రయించును. విగ్రహములున్న ప్రదేశములన్నియు నీలవర్ణుని దేవాలయములనుచు ఇట్టి ప్రేమతో మనోవిభ్వాలము కలదియై, సకలజగత్తు కృష్ణుని సృష్టియని యానందించును.

మణ్ణైయిరున్దుతుழாవివామనన్ మణ్ణిరు వెన్నుం।
విణ్ణైత్తొళుదవన్ మేవువైకున్ద మెన్ఱుకైకాట్టుం।
పెయ్ వళైక్కైగళైకూప్పిపిరాన్ కిడక్కుంకడలెన్నుం।
శెయ్యదోర్ నాయిట్రికాట్టి శ్రీధరన్ మూర్తియీదెన్నుం।
అరియుం శెందీయైతழுవి అచ్యుతన్ ఎన్నుం మెయ్ వేవాళ్।
ఎఱియుంతణ్ కాట్రైత్తழுవి ఎన్నుడై గోవిందనెన్నుం।
ఒన్ఱియతింగళైకాట్టి ఒళిమణవణ్ణనేయెన్నుం।
నిన్ఱకున్ఱత్తినై నోక్కి నెడుమాలేవా వెన్ఱుకూవుం।
నన్ఱుపెయ్యుమழை కాణిల్ నారణన్ వందానెన్ఱాలుం।
కోమళవాన్ కన్ఱైప్పుల్గి గోవిందన్ మేయిత్తన వెన్నుం।
పోమిళనాగత్తిన్ పిన్ పోయ్ అవన్ కిడక్కై యీదెన్నుం।
కూత్తర్ కుడమెడుత్తు ఆడిల్ గోవిందనామెనవోడుం।
వాయిత్తకుழలోశైకేట్కిల్ మాయవనెన్ఱుమైకూక్కుం।
ఆయిచ్చియ్ వెణ్ణైగళ్ కాణిలవనుండవెణ్ణైయీదెన్నుం।
నేయుశైవ్వోయిడ కాణిల్ నెడుమాలడియా రెన్ఱవోడుం।
తిరువుడైమన్నరై కాణిల్ తిరుమాలైకండేనేయెన్నుం।
కరువుడై తేవిల్ ఘళ్ యెల్లాంకడల్వణ్ణన్ కోవిలేయెన్నుం।
ఏఱియపిత్తినోడెల్లా వులగుంకణ్ణన్ పడప్పెన్నుం॥

అనిపాడిన నమ్మాళ్వారుభక్తి. భక్తియే స్వర్గమునకు రాజమార్గము. భక్తియే దైవజ్ఞానమను బీగమునకు, బంగారుచెవి. భక్తియే దేవుని గర్భగుడి ద్వారమును తెరచు మంత్రము. భక్తియే యిమురగబోసిన అమృత సంజీవి. భక్తియే సకలమానవరోగములకు శ్రేష్ఠమైన ఔషధము, భక్తియేభవసాగరమును దాటుటకు నమ్మకమైన తెప్ప.

భక్తియే జననమరణరోగమునకు గొప్పవిరుగడ. భక్తియే దేవుని పాదకమలములు చేర్చు బలమైనమిాట.

కావున మనమందరము వారివారి మార్గానుసారము క్రీస్తువుగు స్వర్గములోవుండే తండ్రిని, యూదుజుహోవాను, మహమ్మదీయుడు అల్లాను, పార్శీఅహర్మజీగును, హిందువు త్రిమూర్తిని, వేదాంతి ఏకమేవాద్వితీయంబ్రహ్మను, తత్వజ్ఞాని అతీతాతీతమును, లంగోటి బైరాగి తన సచ్చిదానందమును, బ్రంహవిద్యయను అశ్వద్ధవృక్షము క్రింద కలిసి, జగత్సహోదరత్వము అను పట్టుదారముతో కట్టబడినవారమై దేవునిని భక్తిభిక్షమునకుగాను కేవల మనఃపూర్వకముగా తదేకనిష్ఠతో ప్రార్థించుదము.

---

## వేదసమ్మతమైన వివాహాకులపద్ధతులు.

ఈ విషయములో మైసూరు మహారాజుగారి పుస్తకభాండారమున కొలువుండు (బి. ఏ.) మహదేవశాస్త్రులుగారు రెండుచిన్నిపుస్తకములు ప్రకటించినారు.

వేదప్రమాణముల ననుసరించి అందరు మొదట బ్రాహ్మణకులమునకు చేరినవారనియు, తర్వాత లోకోపకారమునకై వారువారు చేయుచుండు పనులనుబట్టి చతుర్వర్ణములేర్పడినను భేదములులేక సహపజ్క్తిభోజనము మొదలైన కార్యములు అందరుకలసి మెలసి జరుపుచుండిరనియు, వారి వారి యోగ్యతానుసారము వారి వారి వర్ణము మారుచుండెననియు, ప్రకృతకాలముననుండు వైషమ్యములు ఆచారభేదములు వేదసమ్మతముకాదనియు, ధర్మానర్థములను నిర్ణయించుస్మృతులు ఆయాకాలము ననుసరించి మారుచువచ్చుచున్నవనియు, వాటినే సర్వకాలములందు ప్రమాణములుగ నెంచకూడదనియు, స్త్రీలు శూద్రులు వేదబాహ్యులుకారనియు, స్త్రీలు సంసారమందు ముఖ్యధర్మములు నేర్చవలశినవారు గనుక వారుకూడ కేవలవిద్యావంతులుగా నుండవలశినట్టున్నదనియు, అందుకై, వివాహమున నుపయోగింపబడు మంత్రములనుంచియే స్త్రీలకు యుక్తవయస్సు వచ్చినవెనుక వివాహముచేయదగినదనియు సప్రామాణికముగ నిర్ధరించి ఇంగ్లీషుభాషయందు రచించియున్నారు. ఇట్టి అభిప్రాయములను పట్టిపుస్తకములందు వ్రాయుట ఉపన్యసించుటయేకాక సాధ్యమైనంతవరకు ఆచరణకుతెచ్చుటకు ప్రయత్నములు మఠాధిపతులతో తర్కించి వారి అనుమతినిపొంగి, చేసిన ఎక్కువప్రయోజనకారిగానుండునని నమ్మినాము. ఈ విషయములను దేశభాషలయందు ప్రచురించిన ఎక్కువప్రయోజనకారిగా నుండుననికూడ శాస్త్రిలవారికి సూచించుచున్నాము.

అట్లనె వారిరువురు పుత్రులను బడసిరి. కేశినికుమారుడగు నసమంజుడు పాపాచారము గలవాడై సజ్జనులను బాధించుచుండినందున, సగరు డతనినిపట్టణముననుండి వెడల గొట్టెను. కొంతకాలము గడచిన వెనుక సగరుడు యాగము చేయ నిశ్చయించి యశ్వమును లోకమున నంపుచు తగిన సైన్యమును దాని వెంట నసమంజుని కుమారుడయిన యంశుమంతుని సేనాధిపతిగా నియమించి యంపెను. ముఖ్యయాగము చేయుకాలమందు, యాగీయాశ్వమును రాక్షసదేహముదాల్చి ఇంద్రుడపహరించెను. అప్పుడు ఋత్విజులందరు గుఱ్ఱము నపహరించినవాని జంపి మరల దానిని దీసుకొనిరమ్ము లేకున్న యాగమున గలిగిన యాతప్పువలన మనకు కీడుగల్గునని చెప్ప సగరుడు నలువేవురు కొడుకులనుజూచి యశ్వమును దీసికొని పొమ్మని పంప వారు నేలత్రవ్వుచు అష్టదిగ్గజంబులనుం జూచుచు నమస్కరించుచు భూమిని పెల్లగించుచువెళ్ల నీశాన దిశయందు కపిలరూపము వహించియున్న విష్ణుదేవుని సమీపంబున దిరుగుచున్న తమ గుఱ్ఱంబునుజూచి సంతోషించి కపిలునిపైకి, నాయుధములతో పరుగెత్తిపోయిరి. అంత కపిలుడు కోపంబునొంది యందరిని బూడిద రాసులుగా జేసెను. భద్రకాలము వరకు దనపుత్రులు రాకయుండుటజూచి, సగరమహాచక్రవర్తి దనమనముడయిన యంశుమంతుని గుఱ్ఱమును వెదకి తెమ్మని పంప నతడు దనతండ్రులు పోయిన మార్గమనుసరించి వెళ్లి దిగ్గజంబుల జూచి మాతండ్రులు లెచ్చట యున్నారు, గుఱ్ఱపుదొంగ ఎవడని యడుగ వారి యాశీర్వాదంబువలన తనతండ్రులు భస్మీకృతులయిన ప్రదేశంబుచేరి యచ్చటనున్న శవాకారంబులనుజూచి దుఃఖంబునొంది యచ్చటనె దన గుఱ్ఱంబును జూచెను. అంత దనతండ్రులకు దర్పణము సేయగోరి జలమునకై యెంత వెదకినను నొక్కకొలనయిన గానక తనతండ్రులకు మేనమామయైన గరుత్మంతుని నచ్చటజూచి, యతనినుంచికపిలునిచేత దనతండ్రులు భస్మీకృతులయిన రీతి గనుగొని,

"చండాలాదుదకాచ్చర్పాద్వైద్యుతాద్బ్రాహ్మణాదపి।
దంష్ట్రిభ్యశ్చ పశుభ్యశ్చ మరణం పాపకర్మణాం।
వుదకంపిండదానంచ ఏతేభ్యోయద్విధీయతే।
నోపతిష్టతితత్సర్వ మంతరిక్ష్యేవినశ్యతి॥"

అనగా పాపిష్టులకు చండాలుడు, జలము, సర్పము, మెఱపు, బ్రాహ్మణుడు, కోరలు గల్గిన క్రూరమృగంబులు, పశువులు, వీటిచేత మరణము గలిగిన వారికి జల

తర్పణముగాని పిండప్రదానముగాని సేసిన, నవి వారిని జేరక యంతరిక్షమందె నసించును. గనుక, నీతండ్రులకు లౌకిక జలతర్పణంబు సేయవలదు. గంగానదియందు జలతర్పణము నీవుతప్పక చేయవలయును. లోకపావనంబగు గంగానది బూడిదె రాసులయిన నీతండ్రులను దడుపునేని వారు స్వర్గలోకము నొందుదురు. నీవు మహాభాగ్యశాలివి. గుఱ్ఱమును గైకొని నీతాతయొద్దకువెళ్లి యాగమును పూర్తిజేయించుమని గరుక్మంతుడు సెప్ప నంశుమంతుడు సగరునకు నశ్వంబునిచ్చి యాగంబును బూర్తిచేయించెను.

వెనుక సగరుండు గంగానదిని దెచ్చి తనకొడుకులను స్వర్గస్థుల జేయుటకు నెంతయాలోచించినను నుపాయంబుగానక, ముప్పదివేలేండ్లు రాజ్యంబుసేసి, దేవలోకంబు నొందెను.

పిమ్మట నంశుమంతుడు కొంతకాలంబు రాజ్యంబు సేసి, దిలీపుడను తన కుమారునకు రాజ్యంబుకట్టి తపస్సే ధనముగా నెంచి గంగానదిని తెచ్చి తండ్రులను స్వర్గస్థులుగా జేయుటకు సంకల్పించి ముప్పదిరెండు వేలేండ్లు తపంబుజేసి స్వర్గము నొందెను. పిమ్మట దిలీపుడును దన తాతలకు జలతర్పణం బెట్లుసేసి తరింపజేయుదును. గంగానదిని దెచ్చుటెట్లుయని యాలోచించుచు ననేక యాగములుజేసి దేవతల నారాధించి యా యుపాయంబు దెలియకయే రోగముచే మరణము నొందెను.

వెనుక ఇతనికుమారుడయిన భగీరథుడు సంతానములేనివాడై రాజ్యభారము మంత్రులయందుంచి, గోకర్ణక్షేత్రముజేరి పెక్కువేలేండ్లు తపస్సుజేయ బ్రహ్మదేవుండు ప్రత్యక్షమయి ఇతని యభీష్టంబు సిద్ధమగుగాక, నీకు సంతానంబు గలుగుగాక యని యాశీర్వదించి, గంగను ధరించుటకై శివుని ప్రార్థింపుమని చెప్పి గంగనుజూచి, భగీరథుడు కోరినచొప్పున నతనివెంటను బొమ్మని వచించి బ్రహ్మదేవు డంతర్ధానమాయెను.

తర్వాత భగీరథుండు భూమియందు బొటునవ్రేలున న్నిలిచి యొక సంవత్సరము శివునిగూర్చి తపంబుజేయ, శివుడు ప్రత్యక్షమై భగీరథుని ప్రార్థన నంగీకరించి గంగానది శివుని శిరస్సుమీదబడెను. అప్పుడు గంగాదేవి యాశివుని ప్రవాహంబున దీసికొని పాతాళంబు జొచ్చెదనని గర్వించ శివుడు గోపించి జటామండలమునుండి బయలు వెడలనివ్వకపోయెను.

125. బంకమంటిలో ముద్రవేసిన స్పష్టముగా గనబడునట్లు రాతిమీదవేసిన గనబడనట్లు జ్ఞానము భక్తునిమనస్సు నంటునుగాని లౌకికునిమనస్సు నంటదు.

126. కేవలలౌకికుడు తానుకీర్తనలను సద్విచారమును వేదపారాయణమును మొదలగు సద్విషయములను విన నిచ్ఛయించకుండుటగాక యితరులనుకూడ విననివ్వకుండును. భక్తులను సత్సంగములను దూషించుచు దైవస్తోత్రములను పరిహసించును.

127. మొసలికి దట్టమై పొలుసుగల చర్మముగలిగియున్నది. ఏయాయుధములు దానిని ఖండించజాలవు. అట్లు లౌకికునకెంత జ్ఞానముపదేశించిన నది నతనినియంటదు.

128. ఒకవంతెనలో నొకతట్టుప్రవేశించిననీరు మరియొకతట్టుగుండా ప్రవహించురీతి ధర్మవిషయము లౌకికుడొక చెవిని విని మరియొక చెవిని విడుచును.

129. పావురమునోట ధాన్యముండునట్లు లౌకికుని మాటాడించినమాత్రముననే యతనిమనసు ప్రాపంచిక విషయములతో నిండియున్నదని తెలియవచ్చును.

130. నిప్పుక్రింద నుండువరకు పాలుడికిపొంగును. నిప్పులేనట్టయిన పాలు పొంగవు. అట్లు ప్రారంభకుడు తానభ్యాసము జేయువరకు చాలా యాసక్తితో నుప్పొంగుచుండును. అభ్యాసముదప్పిన నుల్లాసము సమసిపోవును.

131. రాజదర్శన మపేక్షించువాడు సింహాసనమును గాచియుండునట్టిన్ని ద్వారమునుగాచియుండు జనులదయను ముందుసంపాదించవలయునట్లు దైవసాన్నిధ్యమును గోరువాడ నేకవిధ తపస్సులనుజేసి యనేక జ్ఞానులగొలిచి సాధుసంగము జేయవలెను.

132. నీభక్తియు, యభిప్రాయములను నీలోన నుంచుకొనియుండుము. వానిని వెల్లడిజేయకుము. అట్లుచేసిన నష్టపడుదువు.

133. మూడువిధముల బొమ్మలున్నవి. అవి యుప్పుతోను, బట్టలతోను, రాతితోనుచేయబడినవి. వాటి నీటముంచిన, మొదటిది రూపముచెడి కరగిపోవును. రెండవది రూపముజెడక నీటినిబీల్చును. మూడవది యేమార్పునుబొందదు. మొదటిబొమ్మ యాత్మైక్యమునుబొందు ముక్తపురుషుని ననుకరించుచున్నది. రెండవది ఆత్మజ్ఞానము పరమానందమును బొందిన పరమభక్తునిబోలినది. మూడవది జ్ఞానకలమును గ్రహించని లౌకికుని దెలుపుచున్నది.

134. ఒక వలలో జిక్కుకొన్న చేపలలో కొన్ని వలనుండి వెలుపలరాను పెనుగులాడును. కొన్ని పెనుగలాడవు. కొన్ని వలచించుకొని తప్పించుకొనును. అట్లు

మనుజులలో, బద్ధులు, ముముక్షువులు, ముక్తులని మూడు తెరగులున్నారు.

135. ఒకచేటపంచిన లేక విసరిన ధాన్యములోని దళమైనధాన్యము నుండి పొడియైనధాన్యమును వేరుచేయునట్లు దుర్మార్గుడు పాపవిషయములనే గ్రహించి పుణ్యమును విడనాడును.

136. డేగయాకాశమార్గమున విహరించుచున్నను దానిదృష్టి చచ్చినపశువుల గుంతలట్టు మురిగినశవములకై యధోభాగమున బ్రసరించును. అట్లు శాస్త్రవేత్తలు దైవస్వరూపమును గురించి యెక్కువగా తెలిసినట్లుమాట్లాడినను వారిమనసు సదా ద్రవ్యము, మర్యాద, గౌరవము, అధికారము మొదలగు వ్యర్థబహుమానములనే విద్యాఫలముగా గోరుచుండును.

137. బరద్వాజమహారాజసభలోని విద్వాంసులకు శివుడెక్కువా విష్ణువెక్కువాయనువివాదముగలిగెను. కొందరు శివుడెక్కువయని కొందరు విష్ణువెక్కువయనిరి. ఈకలహమెక్కువకాగా, నొక తెలివిగల పండితుడు రాజా నేనుశివునిగానివిష్ణువునుగాని జూడలేదు. ఎవరెక్కువయని యెట్లుచెప్పగలననెను. అప్పుడు సభలోనెవరు వారిని జూడనందున కలహమణిగెను. ఒక దేవుని మరియొక దేవునితో సరిపోల్చకూడదు. దైవ సాక్షాత్కారమునుబొందిన దేవతలందరు బ్రహ్మముయొక్క నానారూపములని తెలియనవును.

138. ఏనుగకు నెలుపలికోరలును, లోపలిపండ్లని రెండువరుసలు పండ్లున్నవి అట్లు శ్రీకృష్ణునివంటి యవతారపురుషులు లోకమున సాధారణజనులవలె నడుచుచున్నను కర్మాతీతమైన పదవియందు వారిహృదయము నెలకొనియుండును.

139. ఔషధములను భంగి మొదలగు మత్తుపదార్థముల నుపయోగించు సాధువులు నిజభక్తులుగారు. వారిసహవాసములను మానుము.

140. నీవు మనఃపూర్వకముగా జ్ఞానమును సంపాదించి కడతేరవలెనని కోరితేని దేవుడు నీవద్దకుదగిన సద్గురువును బంపుటసిద్ధము. కావలశినది శ్రద్ధతప్ప వేరులేదు.

141. ఇతర దేశమునకు వెళ్లు దారి తెలసిన నొకనినను సరించి ప్రయాణము జేయవలయునుగాని యనేకుల ననుసరించ కలతకుగారణమగునట్లు దైవమునుబొంద నిచ్ఛయించువాడు జ్ఞానసిద్ధుడైన యొకసద్గురువు బోధను భక్తితో గ్రహించి నడువవలయును.

142. దేవుని నెవరుమనఃపూర్వకముగా కేవలశ్రద్ధతో శరణుబొందెదరో వారికి గురువవశ్యకము లేదు. అయితే యటువంటివారరుదు గనుక గురువుండితీరవలెను.

Continued from page 234



దేవతల వాడు బూజించ నిచ్ఛయించును. ఆదేవతగుండా నావల్లయివ్వబడిన వాని యభీష్టములను బొందును. ఆఫలము నిజముగా నంతముకలది అది యల్పబుద్ధిగలవారికి జేరినది. యేదేవతలనుబూజించిన నాదేవతలనుబొందుదురు. నాభక్తులు నన్ను బొందుదురు. అవ్యక్తమైన నన్ను బుద్ధిహీనులు నాశరహితమై సర్వోత్కృష్టమైన పరాప్రకృతిని తెలియక నన్ను వ్యక్తునిగా భావించుదురు. యోగమాయచేత కప్పబడిన నన్నెవరు తెలియజాలరు. ఈ మూఢలోకము జన్మనాశరహితమైన నన్ను తెలియదు. అర్జునా! గతించినట్టి, నిప్పుడున్నట్టి, ముందుకలుగునట్టి ప్రాణులను నేనెరుగుదును. అయితే నన్నెవరెరుంగరు. ఇచ్ఛాద్వేషములవల్ల పుట్టినద్వంద్వముల మోహముచేత, నర్జునా! సకలప్రాణులు లోకమున మోహితులై యుందురు. అయితే పాపనాశముజేసుకొనిన ధర్మపరులు ద్వంద్వమోహవిముక్తులై దృఢవ్రతులై నన్ను బూజించుదురు. నన్నాశ్రయించి జననమరణవిమోచనకై యత్నించువారు బ్రహ్మమును సంపూర్ణమైన యాత్మజ్ఞానమును సకలకర్మలను దెలిసినవారగుదురు. భూతములను దేవతలను, యజ్ఞములను గురించిన జ్ఞానమును నన్నుగా దెలియువారు మనస్సమాధానయుక్తులై యంత్యకాలమున నన్ను దెలియుదురు.

విజ్ఞానయోగము సమాప్తము.

## యెనిమిదవ యధ్యాయము - అక్షరపరబ్రహ్మయోగము.

### అర్జునునివాక్యము.

ఆపరబ్రహ్మమెద్ది! అధ్యాత్మమననేమి? కర్మమెద్ది? పురుషోత్తమా! అధిభూతమని యేది చెప్పబడును. అధిదైవమని యేది చెప్పబడును. మధుసూదనా! ఈశరీరమున అధియజ్ఞున్నెద్ది. నిశ్చలచిత్తముగలవారిచేత నవసానకాలమున నెట్లు దెలియబడుదవు?

### శ్రీకృష్ణులవాక్యము.

నాశరహితమై యుత్కృష్టమైనది పరబ్రహ్మము. దాని నైజస్వభావముఅధ్యాత్మము. ప్రాణులకు నుత్పత్తికారణమగు బహిప్రచారమే కర్మయనబడును. నానాశకరమైన స్వభావము అధిభూతమనబడును. జీవదాయకమైనశక్తి అధిదైవమనబడును. అర్జునా! నేను శరీరమున నంతర్యామినై యుండుట అధియజ్ఞమనబడును. అవసానకాలమున నన్ను ధ్యానించుచు దేహమువదలివెళ్లి యతడు నన్ను బొందుచున్నాడు. ఇందుకు

సందేహములేదు. అంత్యకాలమున నెవరిని స్మరించుచు దేహమును విడచినవాడు వారి స్వభావము ననుసరించి వారిస్వరూపము బొందును. గనుక సర్వకాలములయందును నన్నేచింతించుచు యుద్ధముచేయుము. నాయందు నీమనోబుద్ధులనునిలిపితివేని నిస్సందేహముగా నన్ను జేరుదువు. అర్జునా! సంతతాభ్యాసముచేత యోగయుక్తుడై యితర చింతలులేని మనస్సుతో సదా ధ్యానించువాడు ఉత్కృష్టమైన దివ్యమైన పరమాత్మను జేరును. పురాణపురుషుని సర్వజ్ఞుని, సర్వశిక్షకుని, అణువుకంటె సూక్ష్మరూపిని సర్వాధారమును, అచింత్యమైన దివ్యరూపముగలవానిని, అంధకారాతీతమైన సూర్యునివంటి తేజోరూపము గలవానిని, నవసానకాలమున నచంచలమనస్సుతో, స్థిరమైనభక్తితో, భ్రూమధ్యమున యోగశక్తిచేత ప్రాణవాయువులను నిలిపినవాడు పరమోత్కృష్టమైన యీదివ్యపురుషుని జేరును. వేదవిదులు దేనిని నక్షరమని చెప్పుదురో, దేనిని జితేంద్రియులై నిష్కాములైనవారు జేరుదురో, దేనినిగోరి బ్రహ్మచర్యవ్రతము సలుపుదురో, అట్టిపదమును నీకుసంగ్రహముగా జెప్పెదను. సర్వేంద్రియద్వారములనుమూసి, హృదయమున మనస్సును బంధించి, ప్రాణమును సహస్రారమునజేర్చి, యోగముచే నేకాగ్రచిత్తుడై, పరబ్రహ్మవాచకమైన ఓంకారమును నుచ్చరించుచు, నన్నుచింతించుచు, దేహమునువిడుచుచు వెళ్లువాడు పరమోత్కృష్టమైన పదమును జేరును. అర్జునా! ఎల్లప్పుడు నితరచింతలులేక నన్ను సంతతము ధ్యానించు నిరంతరధ్యానపరుడైన యోగికి నేను సులభుడను. ఈమహాత్ములు నన్నుబొంది శాశ్వతముగాని దుఃఖాకరమైన పునర్జన్మ మెత్తరు. వారు పరమగతిని బొందుదురు. అర్జునా! బ్రహ్మలోకము మొదలైన సర్వలోకములును జనించి లయించుచుండును. అయితే నన్నుబొందినవాడు పునర్జన్మమును బొందడు. సహస్రమహాయుగకాలనిర్ణయమైన బ్రహ్మయొక్కపగటినిరాత్రిని దెలియు జనులు రాత్రిపగళ్లను దెలిసినవారగుదురు. అవ్యక్తమునుంచి పగటిప్రారంభమున సర్వము వ్యక్తమై ప్రవహించును. రాత్రి ప్రారంభమున అవ్యక్తమనిచెప్పబడు నీతత్వమునందే, సర్వము లయించును. ఈభూతముల సమూహము పలుమారు బుట్టుచు రాత్ర్యాగమమున లయించుచుండును. అర్జునా! దైవాజ్ఞవల్ల పగటిప్రారంభమున మరల వ్యక్తమగును. గనుక యీయవ్యక్తస్వరూపముకంటే శ్రేష్ఠమైన మరొక యవ్యక్తము సర్వభూతములు నశించినను నాశరహితమైనది యొకటి యున్నది. ఆయవ్యక్త మక్షరమని చెప్పబడును. దానినే పరమగతియందురు. దానిని బొందిన మరలరారు. అదేనాపరమపదము. అర్జునా! సమస్తభూతములకు స్థానమై ఈసమస్తమును

వ్యాపించియుండు పరమపురుషుని నతనియందు నితరాసక్తిలేని నిశ్చలభక్తిచేతనే బొంద వచ్చును. యోగులేసమయమున దేహమువిడచి మరలరారో, యే సమయమునవిడచి మరలవచ్చెదరో యట్టిసమయమును పార్థా! నీకుదెలిపెదను. అగ్ని, జ్యోతి, అహస్సు, శుక్లపక్షము, ఉత్తరాయనము యీసమయమున దేహమువిడచి నజ్ఞానులు లేక బ్రహ్మ విదులు బ్రహ్మమును జేరుదురు. ధూమము, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము యీ సమయమున జచ్చినయోగి చంద్రజ్యోతినిబొంది జన్మమెత్తును. శుక్లకృష్ణములు లోక మునకు శాశ్వతమైన మార్గములుగా నేర్పడినవి. మరల రానివాడొకటివెంటనరుగును. మరలువాడు మరొకటి వెంటనరుగును. ఈ మార్గములనుదెలిసి యోగిమోసబోడు. గనుక సర్వకాలములయందును, నర్జునా! యోగయుక్తుడవుగమ్ము. యోగి దీనినిదెలిసి పుణ్యకార్య ములయొక్కయు వేదములయందు జెప్పబడిన క్రతువులకు సంబంధించినట్టియు, తప స్సునకు దానమునకు విధింపబడిన ఫలములను లక్ష్యపెట్టక యీ పరమాత్మప్రాప్తమైన పురాతన స్థానమును జేరును.

అక్షరపరబ్రహ్మయోగము సమాప్తము.

## తొమ్మిదవ యధ్యాయము - రాజవిద్యా రాజగుహ్యయోగము.

### శ్రీకృష్ణుల వాక్యము.

అనూయలేని నీకు అనుభవముతోగూడిన జ్ఞానమయమైన ఈపరమ రహస్యము నీకు జెప్పెదను. దానిని దెలిసిన అశుభమునుంచి విముక్తుడగుదువు. ఇది రాజవిద్య. పరమరహస్యమయినది. శ్రేష్ఠమై పవిత్రమైనది. ప్రత్యక్షానుభవమైనది. ధర్మయుత మైనది. ఆచరించుటకు మిక్కిలి సులభమైనది. నాశరహితమైనది. అర్జునా! యిట్టి ధర్మమును నమ్మనిపురుషులు నన్నుబొందక మృత్యువుతోగూడిన సంసార పరంపరకు లోబడుదురు. ఈసమస్తజగత్తు నాయవ్యక్త స్వరూపముచే వ్యాపింపబడియున్నది. అన్నిభూతములు నాయందున్నవి. వానియందు నేనులేను. మరియు భూతములు నా యందులేవు. సకలభూతములకు సాధారమైనవానికి జీవభూతమైన యాత్మయయ్యును వానియందులేను. ఇట్టినాదివ్య యోగైశ్వర్యము కనుగొనుము. అంతట సంచరించు మహావాయువు ఆకాశముననున్నట్లు నాయందు సకలప్రాణులట్లు నెలకొనియున్నవని తెలియుము. అర్జునా! సమస్తభూతములు ప్రళయకాలమున నాప్రకృతియందు లీన

మగును. సృష్టిప్రారంభమున మరల నేను వానిని బహిర్గతము జేయుచున్నాను. నాస్వకీయ మైన ప్రకృతిని నవలంబించి, అప్రకృతి స్వభావమువల్ల స్వతంత్రములేని ఈప్రాణి సమూహమును మరలమరల బుట్టించుచున్నాను. ధనంజయా! ఉదాసీనుని కర్తల నభిమానములేని నాకు నీకర్మలు బంధకములుగావు. నన్ను సాక్షిభూతముగా జేసుకొని ప్రకృతి చరాచరములను సృజించును. ఇందుచేత ప్రపంచము జరుగుచున్నది. నిష్ప్రయోజనమైన యాశలను, కర్మలను, జ్ఞానమును గలవారై బుద్ధిలేక, మోసమైన హింసించునట్టి రాక్షసస్వభావయుక్తులైన మూఢులు నాపరమోత్కృష్టమైన ప్రకృతిని దెలియలేక భూతమహేశ్వరుడైన నన్ను మానుషదేహముధరించిన కారణముచేత అలక్ష్యముచేయుదురు. మహాత్ములన్నో పార్థా! నాదైవీప్రకృతిని నాశ్రయించి భూతములకు నాదిరహితమైన యాధారముగా నన్నుదెలిసి, చలించనిమనస్సుతో నన్ను బూజించుదురు. శ్రద్ధావంతులై, దృఢవ్రతులై, నన్ను సదా కీర్తించుచు నాకునమస్కరించుచు భక్తితో సదాయోగయుక్తులై నన్ను ధ్యానించుదురు. కొందరు జ్ఞానయజ్ఞముచేత యజ్ఞముచేయుచు నన్నొకనిగాను, సర్వాంతర్యామియైన వివిధరూపుడుగాను, బూజింతురు. నేను క్రతువు, నేనుయజ్ఞము, నేనుపైతృకబలి, నేనుఓషధి, నేనుమంత్రము, నేను ఆజ్యము, నేను అగ్నిహోత్రము, హోమమునేనే, ఈజగత్తునకు నేనుతండ్రి, తల్లి, రక్షకుడు, తాత, దెలియదగిన కారణవస్తువు, ఓంకారము, ఋగ్యజుస్సామవేదములు, గతి, భర్త, ప్రభువు, సాక్షి, నివాసము, శరణు, సుహృదుడు, ఉత్పత్తిస్థితిలయస్థానము, నిక్షేపము, అవ్యయమైన బీజము. అర్జునా! నేనుష్ణమిచ్చెదను. నేను వానను నిలుపుదును. కురియుచేయుదును. అమృతత్వము, మృత్యువు, సదసత్తులు నేనే. వేదత్రయవేత్తలు సోమపానముజేయువారు పాపవిముక్తులై యజ్ఞములచేత నన్ను బూజించి, స్వర్గమార్గమునకై నన్ను ప్రార్థించెదరు. వారు సురేంద్రలోకమునుజేరి, స్వర్గమున దేవతాభోగము లనుభవించెదరు వారు విశాలమైన స్వర్గలోకానుభవమైన వెనుక, వారిపుణ్యము క్షీణించి, మర్త్యలోకమును మరల జేరుదురు. వేదత్రయముల యందు విధించబడిన సత్కర్మలననుసరించి కామ్యములనుగోరి జననమరణరూపమైన సంసారమును బొందుదురు. ఇతరాపేక్ష లేక నన్నొక్కనిభజించిన నాసదాయోగయుక్తులకు పూర్ణమైన యభయమిచ్చుచున్నాను. భక్తియుక్తులైన నితరదేవతాశ్రితులు గూడా పూర్వవిధులకు వ్యతిరిక్తముగానుండినను, కౌంతేయా! నన్నే పూజించుచున్నారు. నేను సర్వయజ్ఞముల ఫలానుభవముకొనువాడను. ప్రభువును. ఐతేనాతత్త్వమును

యిన ఆయాప్రదేశముల యజమానునివల్ల హత్యకొఱకు ప్రాయశ్చిత్తతపస్సు నాచరించుట విధాయకము.

42. గోవు రాత్రివేళల దొడ్డిలోకట్టబడియున్నపుడు పులిచేతగాని, పాముచేతగాని, అగ్నిచేతగాని, పిడుగుపాటుచేతగాని చంపబడిన, దానిసొంతగాడు ప్రాయశ్చిత్తతపస్సు నాచరించుట విధాయకము.

43. గ్రామమును ముట్టడించు శత్రువులు చేయు యల్లకల్లోలములో తగిలిన బాణముచేతగాని, నగరకూలిబడుటవల్లగాని, అతివృష్టిచేతగాని గోవుచనిపోయిన, ప్రాయశ్చిత్తకర్మ నాచరించబనిలేదు.

44. యుద్ధమందుగాని, అడవియంటుకొనుటచేతగాని, గొప్పమంటలచేతగాని, ఒకగ్రామను పాడైపోవునపుడుగాని గోవుకుసంభవించిన మరణవిషయములో ప్రాయశ్చిత్తకర్మ నాచరించబనిలేగ.

45. గోవునకు బంధించబడి వైద్యపు యమునవో, శస్త్రవైద్యవిషయమునవో, కష్టప్రసవకాలమునందు దూడను వెలిదీయుసమయమునవో సంభవించిన మరణవిషయముగా ప్రాయశ్చిత్తకర్మ నాచరించబనిలేదు.

46. రోగముచేతపీడింపబడిన యితర యావులమందలో కట్టివేయుటచేతగాని, మూఢుడైన గోవైద్యునిచేత చికిత్స చేయబడుటచేతగాని సంభవించినట్టి గోమరణమునకు ప్రాయశ్చిత్తకర్మ యావశ్యకము.

47. గోవును హత్యచేయునప్పుడుగాని, గోవుకు స్వాభావికముగాని మరణము సంభవించునప్పుడుగాని చూచుచు, దానినితప్పించుటకు నేఁటిప్రయత్నమును జేయనట్టిజనులు గోహత్యనిందచే మోసబడిన విషయములో, వాస్తవముగా హత్యనొనరించినవాడు గనపడనట్లయితే, రాజుయొక్క యుద్యోగస్థులు వారితో వేర్వేరుగా ప్రమాణములు చేయించి ఇతరజనుల సాక్ష్యసహాయముచేతను వాస్తవమైన నేరస్థునికనిపెట్టుట న్యాయము.

49. కొందరు జనులాకస్మికముగా గోవునుజంపిన విషయములో ప్రతివాడు గోహత్యనరకము బాపుకొనుటకు విధించబడిన యాచరణలో పాలుకభాగపుతపస్సు విధాయకము.

50. గోవు చిక్కిపోయివుండెనో లేక జాడ్యముచేత పీడింపబడుచుండెనో కనుగొనుటకు చంపబడిన గోవుయొక్కరక్తమును చక్కగా పరిశీలించవలయును. ఏల

ననగా దానిమరణకాలపు దేహస్థితినిబట్టి తపస్సుయొక్కరీతి భేదించును. కాబట్టియే పరిశీలన జాగరూకతతో జేయవలయును.

51. ఎట్టిసందర్భమునగాని గోహత్యనరకమునకు ప్రాయశ్చిత్తముగా సకల శాస్త్రిజ్ఞుడైనటువంటి మనువుచాంద్రాయనము నాచరించవలయునని విధించియున్నారు.

52. ఎవడైతే ఈవిషయములో ప్రాయశ్చిత్తతపస్సు నాచరించుచు దీక్ష పెంచ నుద్యమించునో వాడు యాదీక్షనిమిత్తము తాను జేయుతపస్సును తానొసంగుపరితోషికమును రెట్టించవలయును.

53. రాజుగాని, యువరాజుగాని, వ్యుత్పన్నుడైన బ్రాహ్మణుడుగాని క్షౌరము జేయించుకొనకయే ప్రాయశ్చిత్తతపస్సు నాచరించవచ్చును.

54. ఎవడైతే తపస్సుజేయునప్పుడు పారితోషికమును రెట్టించియివ్వక దీక్ష బెంచునో వాడు పాపవిముక్తుడుకానేరడు. అట్టితపస్సు నాచరించుటకు నెవ్వడైతే యుపదేసించునో వానికి నరకప్రాప్తియగును.

55. నరుడెట్టిపాపమును జేసిన నది వాని వెంట్రుకలకంటుకొని యుండును. కాబట్టి వాడు వెంట్రుకలకొనలను రెండువ్రేళ్లంత కత్రించవలయును.

56. స్త్రీలకుక్షౌరము, ప్రత్యేకభోజనము, ప్రత్యేకశయ్య నిషేధము కాబట్టి యీచట్టమునకు కన్యకలును ఇల్లాండ్రును కట్టుబడియుండవలయును.

57. స్త్రీ తపస్సుచేయునపుడు రాత్రిని పచ్చికబయళ్లలో గడపకూడదు. పగటివేళల ఆవులమంద వెంబడైన పోగూడదు. ముఖ్యముగా వనములలోగా నదీసంగములలోగాని యుండరాదు.

58. ఓవ్యాసా! స్త్రీలు తపస్సునాచరించునపుడు కృష్ణాంజనములను ధరించుట నిషిద్ధము. వారు దినమునకు మూడుమార్లు స్నానమాచరించి దేవతల నారాధింపుచు తపస్సుజేయవలయును.

59. స్త్రీ తనచెలికత్తెలతో విహరించుచు కృచ్ఛచాంద్రాయణము మొదలగు వ్రతములన్నిటిని సల్పవలయును. పరిశుద్ధమైన దేహమును యాత్మయునుగలిగి విధించిన నియమముల ననుసరించి యింటియందే మెలగవలయును.

60. ఎవడైతే గోహత్యజేసి యీజన్మములో తనపాపమును దాచుకొనుట కత్నించునో మరణాంతరము వాడు కాలసూత్రనరకవేదన బాలౌను.

61. అట్టి నరకవిముక్తుడైనపిమ్మట నపుంసకుడుగానో కుష్ఠురోగిగానో లేక ముందేడుజన్మములలో దరిద్రుడుగా జన్మించును.

62. కాబట్టి ప్రతివాడు దానుజేసినపాపముల నొప్పుకొని వాటికనుగుణ్యమైన కర్మలనాచరించవలయును. ఎట్టివాడైనను బిడ్డయందేగాని, స్త్రీయందేగాని, వృద్ధునిపైగాని అత్యాగ్రహమును జూపరాదు.

## పదియవ యధ్యాయము.

1. నాల్గువర్ణములవారు తమ పాపములను బాపుకొనుటకు నాచరించవలసిన ప్రాయశ్చిత్తతపస్సులను గురించి వ్రాసియున్నాను. ఏపురుషుడుగాని నిషేధింపబడిన స్త్రీని గ్రహించిన చాంద్రాయన తపస్సునాచరించవలయును.

2. చాంద్రాయనము నాచరించువిధము:—ఏనెలలో తపస్సునాచరించుచున్నానో యానెల కృష్ణపక్షములో దినక్రమేణ యొక కబళము యాహారము తగ్గించుచు యమావాస్యనాడు భోజనము లేకుండవలయును. అదేలాగున శుక్లపక్షములో క్రమముగా దినమునకొక కబళము నెక్కించుచూ రావలయును.

3. తపస్సునాచరించువాడు భుజించవలసిన కబళము కోడిగ్రుడంత యుండవలయును. అటులుండకపోయిన యది ధర్మశాస్త్రములకు విరుద్ధ మగుటంబట్టి యావ్రతము తపస్వియొక్క పాపముంబాపజాలదు.

4. తపస్సు ముగియగ బ్రాహ్మణులకు సంతిర్పణజేసి ధోవతులజోళ్లను గోవులను దానమియ్యవలయును.

5. చండాలుని సమీపమునకుగాని శ్వపక స్త్రీసమీపమునకుగాని యొక బ్రాహ్మణుడు పోయినయెడల బ్రాహ్మణులయొక్క యనుజ్ఞనుబొంది మూడురాత్రు లుపవాసముండవలయును.

6. అతడు సిగతోగూడపూర్తిగ తలక్షౌరముజేయించుకొని మూడుప్రాజాపత్య తపస్సుల నాచరించవలయును. తర్వాత బ్రహ్మకుర్చము (పున్నమనా డుపవాసము సలిపి మరునాడరుణోదయమున పంచగవ్యము బుచ్చుకోవలసినటువంటి తపస్సు) నాచరించి బ్రాహ్మణులను దృప్తిజెందించవలయును.

7. ప్రతిదినము గాయత్రిమంత్రముబఠించి బ్రాహ్మణునికి యొకగోవును యెద్దును దానమియ్యవలయును. అందుచేత నతని పాపము నిస్సందేహముగా నశించును.

8. క్షత్రియుడైనా వైశ్యుడైనా యొక చండాలుని సమీపమునకుగాని, యొక స్వపక స్త్రీసమీపమునకుగాని పోయినట్టయితే రెండు ప్రాజాపత్యతపస్సులనాచరించి బ్రాహ్మణునికి యొక గోవును ఒకయెద్దును దానమివ్వవలయును.

9. శూద్రుడు చండాలుని సమీపమునకైనా స్వపక స్త్రీ సమీపమునకైనా పోయిన యొకప్రజాపత్య తపస్సు నాచరించి బ్రాహ్మణునికి యొకగోవును యొక యెద్దును దానమివ్వవలయును.

10, 11. అజ్ఞానముచేత యొక పురుషుడు పినతల్లినిగాని, సహోదరినిగాని, పుత్రిక నుగాని గ్రహించినట్టయితే మూడుకృచ్ఛ్రవ్రతములను ఒక చంద్రాయణతపస్సును నాచ రించవలసినది. అటుపిమ్మట తనజననేంద్రియములను కోసివేయవలయును. తెలిసి తెలిసి యే తనతల్లిసహోదరిని గ్రహించినట్టయితే యనేకగ్నుల నాచరించవలసినది.

12. పరాశరులచేత విధించబడిన ప్రకారము, ఎవడైతే దనతల్లి సహోదరిని నజ్ఞానముచేత గ్రహించునో వాడు చాంద్రాయణతపస్సుల నాచరించి బ్రాహ్మణులకు పదిగోవులను పదియెద్దులను దానమిచ్చిన పరిశుద్ధుడగును.

13, 14. తనమారుతల్లినైనను, తల్లియొక్క స్నేహితురాలినైనను, సహోద రుని కూతురినైనను, గురుభార్యనైనను, కోడలినైనను, వదినైనను, మేనత్తనైనను, సజాతీయమైన బంధువునియొక్క కూతురినైనను గ్రహించినట్టయితే మూడుప్రజాపత్య తపస్సులనాచరించి బ్రాహ్మణులకు రెండుయావులను దానమివ్వ పాపపరిహారమగును.

15. ఒక యాడుజంతువునైనను, వేశ్యనైనను, ఎనుమునైనను, యాడుయొంటె నైనను, యాడుకోతినైనను, యాడుగాడిదనైనను, యాడుపందినైనను పురుషుడు గ్రహించినట్టయితే ప్రజాపత్యతపస్సు నాచరించవలయును.

16. విషయసుఖాశక్తుడై యొకగోవును గ్రహించినట్టయితే పురుషుడు త్రిరాత్ర వ్రతమునాచరించి బ్రాహ్మణునికి యొకగోవును దానమొసంగిన పవిత్రుడగును. ఎవడొక యాడగాడిదనైనను, యాడుయొంటెనైనను, యెనుమునైనను గ్రహించినట్టయితే ఒక రాత్రింబవలుపవాసముసలిపి పవిత్రుడుగావచ్చును.

17. ఒక యుద్ధము సంభవించినప్పుడుగాని, జనకల్లోలమైనప్పుడుగాని, ఉప ద్రవము సంభవించినప్పుడుగాని, అంటుజాడ్యము ప్రబలమైనప్పుడుగాని పురుషుడు తనభార్యనెడ తెగకుండా కాచియుండవలయును.

నదా ? నేను మంచిగుణమనునది నేను మాత్రము మంచియనుచున్నానా లేకయితరుల అభిప్రాయమునకూడ అది మంచియగుచున్నదా ? అట్లుకాకున్న నేను మంచియనుకొనినదానివల్ల నేమిప్రయోజనమగును. నేనుండు యింటిలోని నా బంధువులకు కొడుకులకు భార్యకు నా చుట్టుముట్టు నివసించు మిత్రులకు జనులకు ఏలాటి ప్రయోజనము చేయను ప్రయత్నించితిని ? నా వ్యవహారమందు నాపనులకు సంబంధించిన వారికెట్టి సుఖస్థితి కలిగించినాను ? వారికెట్టి భాధలనుపెట్టి ఏకారణమునవైన వారిసొత్తుల నపహరించి భేదముగలిగించినాను ! అదిసరియేనా ? సర్వప్రాణులు నాలోనుండు చైతన్యము నేపొంది యుండుటవల్ల వారెట్లువేరగుదురు ? వారు నేను ఒకటైనవారిసొత్తు అపహరించినందున నేనెట్లు లాభము పొందినట్లగును. వారికి దుఃఖము కలిగించినందున నాకును దుఃఖము స్వాభావికముగ రావలెనుగదా ? ఈ సభయొక్క ముఖ్యోద్దేశము లెవ్వి ? వాటిలో నెంతవరకు నేను తెలియ పాటుపడుచున్నాను ? ప్రకృతకాలమున నుండు రీడింగురూము, మొదలగు యితర సొసయిటీలలో వలె ఈ మహాపవిత్రమైన సభలోకూడ ఏదో యొక వినోదార్థమై చేరినానా ? అట్టివినోదము ఈసభ చేరని దానివల్ల కలుగదా ? అట్టి తుచ్ఛాభిప్రాయము చేత నీ మహాసభలో చేరి లోకమున నా దుర్గుణములు ప్రసరించి, ఈసభ యిట్టిదియేనా యని జనులకు అభిప్రాయములు గలిగించుట ఎంత గొప్పపాతకమౌనో ? ఇకనైన తెలివితో నడతను దిద్దుకొనెదను ? ఇట్టి బూటాటక వేషమువల్ల సాధువులగుట ఎట్లు ? మనస్సున సరియని తోచిన అట్లు నడచి తీరవలెను. లేకున్న ఈ సభనువిడిచి దానికి దుర్నామము రాకుండ చేసెదను.

అనేకవిధముల మంచిస్థితులనుండు నూర్లకొద్ది అధికారులు ఈ సభపుట్టిన 30 సంవత్సరముల నుండి ఏదైన గొప్ప కార్యము చేయవలెనని తలచిన లోకమున ఎట్టిప్రయోజనము చేయజాలకుందురు ? వారికెందుకు దేవుడట్టి సంకల్పము పుట్టింపలేదో తెలియజాలదు? ఎన్నివిధములనో ధనవ్రయము చేతురు. ఈ సభలో జేరినవారందరు తాముతాము యోగ్యతకలిగినంతమట్టుకు చేయు దానములను ఏదో యొకటి రెండు కార్యములందుపయోగించ సంకల్పించిన, అనేక బాలురను సన్మార్గమున నడిపి సన్మార్గము బోధించుటకు సాధనములుగా జేసికొనుటకు ఒక విద్యాలయమును గాని వేరే ఏర్పాటులు గాని చేసిన, లోకము బ్రహ్మవిద్యాభివృద్ధి గలుగుటకు ఎక్కువ అనుకూలముండును గదా. ఇదిగాకున్న వేరే విశమైన లోకోపకారమును అందరుకలసి చేయుటకు ఎందుకు ప్రయత్నము చేయకూడదో మనము విచారించుదము. విచారించిన, అసహనమో,

## హంసావళి.

1. షట్త్రింశన్మంజరి:— శ్రీశంకరాచార్యులు రచించిన భజగోవింద శ్లోకముల నాంధ్రభాషాణ పద్యాత్మకముగా రచింపబడినది. ఆబాలవృద్ధులకు నానందకరమైనది. వెల 2 అణాలు మాత్రమే.

2. ఏకాదిరత్నావళి:— 1 మొదలు 224 సంఖ్యవరకు గల విషయవిశేషములిందు సంగ్రహింపబడినవి (అయనద్వయము, వాసనాత్రయము, సాధన చతుష్టయము, మొదలగు 1008 విషయములు) వెల 4 అణాలు మాత్రమే.

3. హంస:— ఇది మాస తెనుగు పత్రిక 1908 జనవరినుండి వెలువడుచున్నది. ఈ జన్మసార్థకము జేసుకొన గోరువారు దీనిని నిరాకరించ జాలరు. చందా సంవత్సరమునకు నొక రూపాయియే.

4. ముకుందమాలా స్తోత్రము:— ఇది విష్ణుస్తోత్రము. పారాయణమునకు అనుకూలమైనది. సంస్కృతశ్లోకము దానికి సరియైన తెనుగుపద్యము చేర్చి ముద్రింపబడుచున్నది. వెల 1 అణా.

---

## హంసపత్రికావళి.

1. Transactions of the Seventh Annual Federation of the Central Districts of the T. S. Branches. Price 1 anna.

2. స్వాగతప్రసంగము:— 1908 సం॥ ఆగష్టు 22, 23 తారీఖులందు అనంతపురమున జరిగిన మధ్యజిల్లాలలోని బ్రహ్మవిద్యాసమాజమునకు చేరిన సభికుల మహాసభకుఇచ్చిన ఉపన్యాసము. వెల 3 పైసాలు.

## ఇతర తెనుగు పుస్తకములు.

1. సంచితప్రారబ్ధ ఆగామికర్తలు— ప్రాణులు ప్రతిక్షణముచేయు కర్తయొక్క గతిఫలము వివరముగా దెల్పబడియున్నది. జన్మసాఫల్యమునకు ఈజ్ఞానమత్యావశ్యకము. వెల 3 అణాలు.

ఓం

# హంస.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 1.] డిశంబరు 1908. [సంచిక 12.

దయచేసి దీనిని చూడుడు.

కార్యదర్శి విలాసము:—డిశంబరు 10-వ తారీఖు మొదలు జనవరి 15-వ తారీఖువరకు: ఎ. స. హనుమంతరావు, అనంతపురం.

ఈసంచికతో ఒక సంవత్సరము కడచుచున్నది. వచ్చుసంవత్సరమునకు దయచేసి 1 రూ. మణియార్డరుచేసిన జనవరి మొదలు సంచికలు వచ్చును. అట్లు పంపనియెడల, జనవరిసంచిక వి. పి. మూలకముగ పంపబడును. తమకిష్టములేనియెడల, దయచేసి డిశంబరు 20-వ తారీఖులోగా మాకుసంగతి తెలుపవేడుచున్నాము. మరల వేడుచున్నాము.

## స్వవిచారము.

మా ఆదాయవ్యయములు జనవరిసంచికలో కనుపరచెదము. ఆ వివరములవల్ల ఏ అభిప్రాయముతో ఈ పత్రిక తెనుగులోకమున ప్రసరించినదో దానిని మీరు తెలుసుకొనెదరు. జరిగినసంవత్సరమున ప్రచురింపబడిన విషయమునకు సూచికయొకటి యిందులో చేర్చియున్నాము. ఈ కాలమున వార్తాపత్రికలు మెండుగుటబట్టియు, సామాన్యజనసముదాయమున విద్యాభివృద్ధి లేనందునను, ఇంగ్లీషుభాష సభ్యసించినవారు దేశీయభాషల పత్రికలనుగౌరవింపకుండుటవల్లను, దేశభాషాపత్రికలు మిక్కిలి కృశించుటకు కారణములు గలిగినవి. అయితే ఇతరవిషయముల నెట్ల

నాదరించినను, ప్రతిమనిషి తనను నిరాకరించడు. కావున ఈపత్రిక ఆత్మ విషయమైనను బోధించయత్నించుచు, తనఅభివృద్ధినే పాటింపుచు, తన అభివృద్ధి యితరుల అభివృద్ధియు ఒక్కటేయనియు, అందరు వెదకుచుండు సుఖమెట్లులభించునను ఈవిషయములనుగురించి చెప్పుచున్నది. గనుకను, కొంచమైనను బరువుగా తోచకూడదని, అచ్చువేయించి రవానాచేయుటకు తగినంతమాత్రము చందానిర్ణయించి యుండుటచేత ఈ పత్రికను యితర పత్రికలకంటె ఎక్కువగా ఆదరించినట్లు మాకుతోచుచున్నది. ఇట్టి ఆదరణ ప్రతి పౌరుగింటికిని వ్యాపించినయెడల ఈ పత్రికోద్దేశములు ఎక్కువగా సాఫల్యమగునని కోరుచున్నాము. ఇప్పుడుండు చందాదారుల నందరిని మాచేతిని విడువనట్లు ప్రార్థించుటకాక తమస్నేహితులలోను వూరివారిలోను, బంధువులలోను చందాదారులుగాచేసి ఈ పత్రికను పోషించిన కామధేనువువలె ఇష్టార్థములను సమకూర్చును గనుక అందరటు చేయుటకు సాష్టాంగవందన మాచరించి వేడుచున్నాము.

ఈ పత్రికయందు లోకవార్తలు, చేతిపనివిషయకమైన వార్తలు వేయవలెనని కొందరి అభిప్రాయము. అట్లు చేయుటకు ఏమిఆక్షేపణ యుండదు. అయితే అట్టివిషయమును సమకూర్చువారు కలుగనందున ఆకొరతతీర్చుటకో వీలులేదు. ఎవరైన మహానుభావులు సహాయముజేసిన అట్టివిషయమును ప్రచురించుటకు తగినయత్నము చేయబడును. అదియునుగాక బ్రహ్మవిచారపఠమును చందాదారులకు ఉచితముగా పంపెదమని వ్రాసియుంటిమి. ఆపఠము సిద్ధము కాలేదు. కాగానే పంపుచున్నామని విన్నవించుకొనుచున్నాము. అదియునుగాక మానవశరీర ప్రభావపఠమొకటికూడ సిద్ధమగుచు నున్నది. త్వరలోనే వెలువడుసంగతి తెలుపుకొనుచున్నాము.

## 4. బర్నార్డో.

అంతనా బాలుని చక్కగా విచారించి వానిసమాచారమంతయు తెలుసుకొని నిజముగానుండునని భావించి,

'అయితే, నీవుచెప్పునదంతయు నిజమేనా' అని ఖండితముగా అడిగిన

'అంతానిజమే నేనునీకబద్ధముచెప్పను' అనెను

'రాత్రియెక్కడ పండుకొని యుంటివి'?

'సంతజరుగుస్థలములో వరిగడ్డిబండ్లలో పడియుంటివి.'

'ఎట్లు కూబడికి వచ్చితివి'?

'నాకు తెలిసిన పిల్లవానినొకని చూచితిని. వాడు కూబడిలో వెచ్చగ నుండు ననియు రాత్రియంతయు అక్కడ వుండవచ్చుననియు చెప్పెను.'

'రాత్రియంతయు నిప్పును పెట్టియుండుట లేదే!'

'పర్వాలేదు. నన్నిక్కడ నుండనిచ్చినచాలును. దయచేసి నిలుపండి' అని బాలుడు చెప్పుకొనగానే, వానిచరిత్రయంతయు నామనసుననాటి పశ్చాత్తాప భరితుడనైతిని. సాక్షాత్పరదైవమే వీనిని నావద్దకు పంపియుండవచ్చునని తలచితిని. ఆహా ఇట్టి మహారాజధానియైన లండన్ పట్టణమందుకూడా, ఈపిల్లవాడు చెప్పుప్రకారము నేక దిక్కులేని బిడ్డలు కూటికి బట్టకు లేకయుందురా యనుయోచన నా మనస్సున తట్టి, బైబిల్ అంతగా నేర్పునట్టియు, యింతవిశేష వీదిబడులుండు చోట నిట్లుండదను కొంటిని.

తర్వాత అట్టిదిక్కులేని బిడ్డలను ఆబాలుడు నాకుచూపెదనని యొప్పుకొనెను. అప్పుడు నేను వానికి భోజనము పెట్టించిన కేవలానందభరితుడై ఎక్కువగతిని అమితమైన ఆనందమును పొందెను.

అర్ధరాత్రికాగానే ఆపిల్లవానిని వెంటపిలుచుకొని దిక్కులేనిబిడ్డలను వెదక వెళ్లితిని. ఇంగ్లాండుదేశమున బిక్షగాండ్లులేరు. ఎవరైన సోమరితనమున భిక్షమెత్తిజీవించ యత్నించిన వారిని తక్షణము బీదయిల్లుఅనునది యొకటియేర్పాటుచేసి దానియందు వారిని పనిచేయించి కూలియిచ్చువాడుకకద్దు గనుక బీదవారు దాచుకొనియుందురు.

గనుక నే రాత్రివేళ వెదుకుటకు నేను వెళ్లితిని. అనేకవీథులు సందులలోవెళ్లి అనేక అంగళ్లుదాటి సందడిలేని యొకయింటిలో దేహముమీద బట్టలులేక కొందరు దేహములను ముడుచుకొని కొందరు చాచి వివిధాకారముల నేలమీదపడియుండిన 11 బాలురను చూచి ఆశ్చర్యపడితిని. ఆసమయమున చంద్రుడాకాశమున నిర్మలముగా ప్రకాశించు చుండెను. అప్పుడు లోకమున నుండు జన్మదుఃఖములను చక్కగా నాకు తెలుప దేవుడు తెరతీసినాడో యనునట్లుండెను. ఆదుఃఖములు చూచి నాయెదగుండెలు కొట్టుకొనెను. ఆనిశీదసమయమున, పట్టణమున సందడియణగిన నిశ్శబ్ద సమయమున, నేలమీదపడి యుండు బాలురను చూచి, అయ్యో నేనెట్లు వీరినుద్ధరించెద, నా కెట్టి సామర్థ్యతిలేదు, ఎట్టి సహాయమిచ్చుటకు నాకుదైవము తోడ్పడును, దైవమా! నేనే దరిద్రుడనై యుండ వీరినెట్లు పోషించుదును. నాకు మొదట దైవవశాత్తుగ దొరికిన వానినిమాత్ర మెట్లనైన పోషించుదును. వీరినందరినిలేపి వారిఘోషలువినిన నెట్లుండునో అనుకొనుచు దైవమాయనుచు అగానివిడిచి బైటవెళ్లి యిల్లుచేరితిని.

అనాథులై, బట్టలులేక, అన్నములేక కృశించిన పదునెకండు పిల్లవాండ్లను చూచి, పశ్చాత్తాప పరితుప్తుడనై, అట్టి పిల్లవాండ్లనేకులున్నారని ఆబాలుడు చూపుచున్నాడని చెప్పినను వారినికూడ చూడజాలనంత వ్యసనముతో వారినందరిని పోషించుటకు, దైవమా, శక్తిలేదే, అయినను నాచేతదొరకిన యీపసిబాలునైనను పోషించుదునని నిర్ధారము చేసుకొని యీయర్ధరాత్రి కాలమున నిల్లుచేరితిని.

## ఆత్మబోధ.

### 6-వ పాఠము.

దేహము సరియైన మార్గమున నడచుటకు కేవల కష్టతరమైన ఔషధసేవయు పథ్యక్రమమేగాదు లేదు. సాధారణముగా ఈదేశమున వారివారి గుణకర్మల అంతస్థుల ననుసరించి ఏర్పడిన బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రులు యితర కులస్థులు వాడుకొనుచుండు ఆహారములలో బ్రాహ్మణులుపయోగించు ఆహారమే యుపయోగించుకొన తగినది. దానియందు జీవహింసయు మత్తుగల పదార్థములు చేరియుండలేదు. బ్రాహ్మణులుపయోగించు పదార్థములలోకూడా సాత్త్విక, రాజస, తామసములను మూడు విధములున్నవి. భగవద్గీతయందు,

ఆయుస్సత్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః।
రస్యాః స్నిగ్ధాః స్థిరాహృద్యా ఆహారాస్సాత్త్విక ప్రియాః॥
కట్వామ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్ష విదాహినః।
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకా మయప్రదాః॥
యాతయామంగతరసం పూతిపర్యుషితంచయత్ ।
ఉచ్ఛిష్టమపిచామేధ్యం భోజనం తామసప్రియం॥

అని ఆహారము భేదములు చెప్పబడియున్నది. ఇందులో సాత్వికులు కోరే ఆహారము జ్ఞానసిద్ధికై యుపయోగించుకొనవలశినది యనియు తక్కిన ఆహారములను నిరాకరించ వలశినది అవశ్యకము. ఇదిగాక పరాన్నంపరద్రవ్యము చేత గలిగిన పదార్థము మన దేహమునజేరిన, అవి మనవికావు గనుక మనకువిరోధము కలుగునే గాని దానివల్ల సుఖముకలుగ నేరదు. న్యాయమార్గమున నడువ మనకుప్రాప్తమగు ద్రవ్యముచేత సాత్వికాహారముచేత పోషింపవలయును ఇదియే దేహమునకు శుద్ధసాత్విక ఆహార మగును.

అశుద్ధమైనట్టియు మలినమైనట్టి పదార్థములను విడువవలయును. మద్యమాంసములు మొదలగు పదార్థములు వాటిదుర్గంధముల ద్వారా అనేక అక్షేపణకరములైన కామలోకప్రాణుల కాకరమగుటగాక, వాటినిగ్రహించిన దేహములనుకూడ అసహ్యమైన ప్రాణులు చేరుటకు సాధనభూతములుగ జేయును. అట్టి దుర్వ్యాదుకలు ప్రబలముగా చేసినవారు చచ్చిన తరువాత, స్థూలశరీరముపోగా, త్రాగి తృప్తిపడుచుకొనను సాధనములేనందువల్ల కోరికమాత్రము ప్రబలముగా నుండుటవల్ల, కల్లు సారాయి మొదలగు మత్తుపదార్థములమ్ము స్థలములందుండి, సారాయిత్రాగువారి దేహములను సొచ్చి, తమఆశతృప్తి పరచుకొనును. త్రాగుబోతులశ్వాసనిశ్వాసములుకూడాఅనేక చెడ్డప్రాణుల కాకరమై యుండును. ఈ మత్తుపదార్థములలో వ్యాపారము చేయువారి దేహములెంత కఠినముగాను దళముగానుండునో మీరే ఎరుగుదురు. ఇట్లనే అనేక ప్రాణుల మాంసముకూడా అనేక చెడ్డగుణముల కాకరమైనది. ఇట్టి చెడ్డగుణముల కాకరమైన దేహములు సాత్వికగుణములెట్లు కలిగి తద్వారా ముముక్షువునకు జ్ఞాన సాధనములగును.

ఇట్టి పదార్థముల స్పర్శయే కూడదు. ఇట్టి పదార్థములుపయోగించు వారి స్పర్శయే కూడదు. అందుకేకదా, మనదేశమున, యిప్పటికి దక్షిణదేశమున మెండుగ, బ్రా

హ్మణ అగ్రహారములవద్ద శూద్రసంపర్కము లేకుండునట్లు ఏర్పాటుచేసి యున్నారు. మడుగు మైల యను భేదములు వచ్చినవి. వీటియొక్క అంతరార్థమును గ్రహించవలయునే కాని వాటిని విపరీతములుగ నెంచకూడదు. జ్ఞానాపేక్షగలవారు సాత్త్వికాహారమునే గ్రహించిన సాధనభూతమగును. లేకున్న, దేహము మనము కోరినట్లు విధేయతగా నుండక జ్ఞానసాధనము కానేరదు. మనము తిను ఆహారములు మన కోరికలను అనుసరించి యున్నది కాని దేహము కావలెననునవి కావు. గనుక మనము జ్ఞానమును సంపాదించవలె ననియు తత్సాధనభూతమగు దేహమును సిద్ధముచేసుకొనుట యితర యేకార్యములకంటె ముఖ్యమైనదని మనకు తోచినయెడల, మనోదార్ఢ్యము చేసుకొని సాత్త్వికాహారమును భుజించిన మనదేహము సత్వదార్ఢ్య సంఘటితమైనది గనుక జ్ఞానసాధనమగును. జ్ఞానసిద్ధినిరూపణయందు దీనివిషయము వ్రాసియే యున్నాము ఇట్టిదేహమున కొకవేళ దుర్వాసన సహవాస మించుక కలిగిన అదోవనుబోక దానిని నిరాకరింప సామర్థ్యముగలది యగును. ఈవిషయమున మనము హెచ్చరికగలిగి వర్తించుటకాక బాలురకు ముఖ్యముగ నిట్టివాడుక లభ్యసింప జేయవలయును. మన మభ్యసించిన కాని బాలురభ్యశించరు. గనుక మనమనుష్ఠించకున్న బాలురను చెడుపువారమగుదుము. మన మనుష్ఠించిన బాలురను చక్కపరిచిన వారగుదుము. ముందు కలుగుబోవు వారందరు పవిత్రులగుదురు. గనుక మొదటి ప్రయత్నము మనయందు కలుగవలెను. మనము చెడినఅందరికి చెడిపిన వారగుదుము. గనుక ఇప్పుడైన హెచ్చరిక దెచ్చుకొని జాగ్రతపడుడు. పేలవమైన మాటలవల్ల నేమిప్రయోజనము. కార్యోద్యుక్తులుకాండి.

## దానధర్మములు.

దానధర్మము ఈదేశమున ఇతరదేశములకంటె మెండుగ నున్నదని తోచెడి. దానము త్రివిధమని శ్రీభగవద్గీతయందు చెప్పబడియున్నది. ఎట్లన,

దాతవ్య మితియద్దానం దీయతే నుపకారిణే।
దేశేకాలేచ పాత్రేచతద్దానం సాత్త్వికం స్మృతం॥
యత్తుప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వాపునః।
దీయతేచ పరిక్లిష్టంతద్రాజసముదాహృతం॥

అదేశే కాలేయద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే।
అసత్కృత మవజ్ఞాతం తత్తామసముదా హృతం॥

కేవల ఈశ్వరార్పణముగ, ఉపకారము కోరక, దీనత్వమున నుండిన ప్రాణులయందు తనవలెవారని భావించి యిచ్చినదానము సాత్వికమనియు అనగా శ్రేష్ఠమైనది యగును. అది సుఖదుఃఖములకు బంధముగా గాక జ్ఞానసాధన మగును. ప్రత్యుపకారము గోరి దానమిచ్చిన రాజసమగును. భయమునను నయమునకో యిచ్చినది తామసమగును. ఈ విధములలో మొదటిది శ్రేయస్సు గోరువారనుష్ఠించవలయును. రెండవది వ్యాపార మై యున్నది. మూడవది మనయిష్టములేక పోవునది గనుక దానివల్ల ప్రయోజన మెట్లగును.

అదియును గాక అనేక దేవాలయములు, ఛత్రములు, తోటలు, భావులు అన్నదాన ఛత్రములు అనేక విధములుగా మనదేశమున దానరూపములుగా ఏర్పడి యున్నవి. ఇవిఅన్నియు దేశమునకు ఉపయోగకరములే. అయితే అన్న ఛత్రములు దిక్కులేని బాలురపోషణకును, వారి అభివృద్ధికిని, అంగహీనులకును ఎక్కువగా ఉప యోగించి యాత్రలకుపోవు ధృడాంగులకు తక్కువచేసిన నెట్టి ప్రయోజనమగునో మీరే యోచించుడు.

అదిగాక అమెరికాలోని అండ్రుకార్నిజియను కోటీశ్వరుడు 85 లక్షలు పౌనులు 1400 పుస్తక భాండారములకు, 15 లక్షలపౌనులు 51 శాస్త్రపాఠశాలలకు, 20 లక్షలు శాలలకును, 80 లక్షల పౌనులు పింఛినీదారుల ఫండుకు, 10 లక్షలు అన్నదానమునకును, 30 లక్షలు స్కాటిషుశాస్త్ర విద్యానిధులకును, 3 లక్షలు దేవ స్థానములకును, 4 లక్షలు చిత్రశాలలకును యిట్లు 300 లక్షలు దానముచేసియున్నాడట. ఈ రూపమైనదానములు మనముచేయుటకు యత్నించ వలయును. మనదేవాలయముల యందును, మఠములందును, యితర అనేక దుర్మార్గములకు దుర్నడతలకు దేవుని పేరు చెప్పి వ్రయముచేయు ద్రవ్యమును ఈరూపముల వ్రయముచేసిన దైవస్వరూపమగు జనసముదాయ మెట్లు తృప్తిచెంది చేసినవానికి అనంత ఆనందదాయకమగునని చెప్ప వలశిన దున్నదా? ఇదివరకే రాజులనేకులు లక్షాంతరములు ఖర్చుచేసికట్టిన గుడులనే కములు శిథిలమగుచుండ స్వాభిమానముతో 'నాగుడి, నాగుడి,' యని గుడులుకట్ట డమే తనకు మోక్షదాయకమైన ధర్మమనియు తనచుట్టుపక్కల తిననుబువ్వయు కట్టను బట్టయులేకుండ నారాయణ స్వరూపములైన యనేకజీవులు కష్టపడుచునుండ, వారా

యణవిగ్రహమునకు నవీన, నవీన నాగాభరణములు, వజ్రకిరీటములు, నవరత్నమాలలు, తాపాబాణయుక్తమైన ఉత్సవములు చేయ దైవప్రీతి, ముక్తిసాధనయగునని తలచు తప్పుఅభిప్రాయములను దొలగద్రోసి, పైనచెప్పిన మహానుభావునివలె వానివానిశక్త్యైను సారము జీవహితమునకు చేయు ధర్మమేధర్మము, ఇదే అదీనదయాళునికిప్రీతి, ఇదే ముక్తిదాయకము అవి నిజభక్తిభూతదయయుక్త ధర్మము మనము చేయబూనువరకు మనదేశము మేలుకు రాదు రాదు.

## దుఃఖము.

లోకమున గలుగు దుఃఖము పాపమువల్ల గలిగినదని ప్రతీతిగలదు. ఈదుఃఖము దుర్మార్గమున బోవుటవల్లను అవివేకతవల్లను; అజ్ఞానమువల్లను కలిగినది కదా!

మనదేహమునకు నారోగ్యమైన పదార్థములను భుజించిన, అనారోగ్యమువల్ల గలుగు దుఃఖము నివారణయగును. సత్యమై ధర్మమైన మార్గమున నడచి, పరులసొత్తు నించుకయైన పొందనిష్టపడక, వారివారి సొత్తు వారి కప్పగించి బ్రతికిన, దారిద్ర్య దోషము బాయును. స్వాభిమానములేక, దైవసేవయే ప్రాధాన్యమని తెలిసి, దైవసేవ యే లోకసేవయని తెలిసి, 'జాతస్యమరణంధ్రువం' అను నియమమును గ్రహించి, చచ్చిన వారికై వగవక, అట్లువగచుట వ్యర్థమనియు పాపకరమనియు, అట్లు ఏడ్చుటమనకే యనియు చచ్చినవారికొరకు కాదనియు తెలిసి వర్తించిన లోకములోని మరియొక గొప్పదుఃఖకారణము నివర్తించునుకదా! బుద్ధిపూర్వకముగా గలుగు నీదుఃఖములు నివారించుకొన్న లోకములో మిగులు దుఃఖము హటాత్తుగా సంభవించునది యొకటియే కదా! ఎట్లన పిడుగుగాని భూకంపముగాని కలిగి బాధగలుగుట. ఇవికూడ కొందరు తాముచేసుకొన్న కర్మఫలమే యందురు. కొందరు నిర్హేతుకమందురు. కర్మఫలము లేక ఒకతృణమైన లభింపదు. ప్రాప్తించదు.

లోకమున కలుగుదుఃఖము ధర్మమార్గ మనుసరించి తప్పినడచుటవల్ల మానవులకు కలుగును. దుఃఖమనునది ఈ సంగతిని తెలుపుటకై ఏర్పడిన దివ్యనియమము. దీనివల్లనే మానవులు ధర్మమార్గమునకు దిరిగి పొందవలశిన గతిపొందుదురు. అయితే యిప్పుడు మానవుడు తెలియవలశిన విషయమేమన ముందు సంచికలో వ్రాసిన మేరకు తలంపులను సరించి మానవుని సుఖదుఃఖములు ఏర్పడుచున్నవి గనుక వానికి గలుగు సుఖదుఃఖ ములు లాభాలాభములు జయాజయములు వాడు చేసుకొనును. ఇతరులవల్ల కాదు గనుక ప్రతిమనిషి తనకు ఎల్లసుఖము కలుగకోరిన తగినప్రయత్నము చేయవలయును. గనుకనే శ్రీకృష్ణభగవానులు,

> ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్ ।
> ఆత్మైవ హ్యాత్మనో బన్ధురాత్మై వరిపురాత్మనః ॥

అనగా తనకుతానే బంధువు, తానేశత్రువు, తన్నుతానే ఉద్ధరించుకొనవల యునని చెప్పియున్నారు. కావున హెచ్చరిక యిచ్చుచున్నాము.

# గుచ్ఛము 1.

## విషయసూచిక.

తరువాత గంగానదిని గానక భగీరథుండు మరల నచ్చటతపంబుసేసి శివుని సంతోషింపజేయ శివుండు బిందుసరస్సను బ్రంహానిర్మితంబైన నొకసరస్సునందు గంగను విడిచెను. ఆ గంగనువిడువగానె నదిఏడుప్రవాహములై హ్లాదిని, పావని, నళినియను నీ మూడుశాఖలు తూర్పుదిక్కునకు ప్రవహించినవి. సుచక్షువు, సీత, సింధువను నీ మూడుశాఖలు పశ్చిమదిక్కున ప్రవహించినవి: ఏడవది భగీరథుడు వెంబడించుచుండ దోవలో జహ్నుమహాముని యాగము జేయుచుండ నతని యాగశాలనంతయు నీళ్లతోముంచెను. అంతనాయన కోపించియా గంగానది జలంబంతెయు ద్రావెను. అంతట దేవతలు, గంధర్వులు, ఋషులునూ, జహ్నుమునిని బూజించి గంగానదిని నతనికి కుమార్తెగా నియమించిరి కావున జాహ్నవియని గంగకు పేరుగలిగినది.

వెనుక గంగానది భగీరథుని వెంబడించుచు పాతాళామునకువెళ్లి, యాబూడిదె రాశిని నీళ్లతోముంచెను. అంతనా సగరపుత్రులు నిష్పాపులై స్వర్గము నొందిరి.

ఇట్లు గంగ స్వర్గ, మర్త్య, పాతాళలోకముల యందు ప్రవహించినది గావున త్రిపథగామిని యని చెప్పబడును.

ఇట్లు విశ్వామిత్రుడు చెప్పిన గంగావృత్తాంతమును, విని రామలక్ష్మణులు సంతోషించుచు, నా రాత్రిగడపి మరునాడు గంగానదినిదాటి యచ్చట గనుబడుచున్న విశాలనగర వృత్తాంతంబు జెప్పుమని రాముడు విశ్వామిత్రు ప్రార్థింప నతడు చెప్పసాగెను

పూర్వము కృతయుగమున దితి కొడుకులుగొప్ప బలముమాత్రము గలిగి యుండిరి. అదితి కొడుకులు పరాక్రమము గలిగి ధర్మాచరణముగూడ సేయువారుగ నుండిరి. వీరందరికి తామేమిజేసిన జావు, ముసలితనము, రోగము లేక యుండునని యాలోచనకల్గి పాలసముద్రమును జిల్కి యమృతము నొందెదమని బుద్ధికల్గి వాసుకిని త్రాడుగా నేర్పరుచుకొని మంధరపర్వతమును గవ్వమును జేసికొని జిలికిరి.

అంత వేయిసంవత్సరములు జిలుకగా వాసుకితలలు విషంబుగ్రక్కుచు మందర పర్వతపురాళ్లను దంతములచే గొరికినవి. అంతట మహావిషంబుపుట్టి యది ప్రపంచంబంతియుదహించినది. అంతట దేవతలందరుగూడిరి. విష్ణువు శివునిజూచి నీవు దేవతలకందరికిని మొదటివాడవు కావున సముద్రమథనమున మొదటబుట్టినది నీభాగము నీవు దీనిని నగ్రపూజగనెంచి విషంబుగ్రహింపుడు అనిచెప్పెను. శివుడు విషంబునుద్రావి స్వస్థానంబు జేరెను. దేవాసురులు పాలసముద్రము జిలుకసాగిరి. అప్పుడు మందర పర్వతమునునిగి పాతాళలోకము జేరెను. అప్పుడు దేవాసురులందరు విష్ణుదేవుని

ప్రార్థింప నతడు కూర్మావతారంబు వహించి మందరపర్వతమును వీపుపైనుంచుకొని సముద్రమునందు శయనించెను. తరువాత మంధరపర్వతశిఖరమును పట్టుకొని విష్ణువుని దేవాసురులును పాలసముద్రము జిలికిరి. వేయిసంవత్సరములైన వెనుక దండకమండులువులతో ధన్వంతరిపుట్టిన వెనుక రసమొకటి పుట్టెను. ఆరసమునుండి ౬౦ కోట్లస్త్రీలు పుట్టిరి. గనుక వీరప్సరసలనబడిరి. యీయప్సరసలను దేవదానవులు బెండ్లాడక్పోరి. గనుక వారు వేశ్యలని చెప్పబడిరి. వారిలలో వరుణుని కొమార్తెయగు వారుణియనునది తన్ను పెండ్లాడువారిని వెదకుచు బయలువెడలినది. రాక్షసులు దానిని గ్రహింపక్పోరి. దేవతలు గ్రహించిరి గనుక దైత్యులు అసురులైరి. దేవతులు సురులైరి.

తరువాత వుచ్చైశ్రవమను నశ్వశ్రేష్ఠంబును కౌస్తుభంబను మణిశ్రేష్ఠంబును అమృతంబును బుట్టినవి. అంత నా యమృతమునకై దేవాసురులు పోరాడి యనేకులు చచ్చిరి. అంత విష్ణువు మోహజనకంబగు మోహినిరూపంబు మాయచేగైకొని యమృతమును నపహరించెను. ఇంద్రుండు దైత్యులనుజంపి రాజ్యంబు నమృతంబును పొంది లోకంబులను పాలించెను.

అంతట దితి దనకొడుకులందరు జావగ దుఃఖించి తనపతియైన కాశ్యపుని చూచి ఇంద్రునింజంపెడు కుమారుని నాకనుగ్రహింప వలయునని ప్రార్థింప వేయి సంవత్సరములు తపస్సుచేసిన నట్లగునని కాశ్యపుడు వరంబిచ్చెను. దితి భయంకరంబగు తపంబుసేయ ప్రారంభించ నింద్రుడు సేవజేయ నారంభించెను. దితికి గావలసిన సమిధలు, ఫలములు, కందమూలములు, వుదకమును అగ్ని మొదలగు పదార్థములను దెచ్చి ఇచ్చుచుండెను. అట్లు తపస్సుచేయుచు పదేండ్లు కొరతపడియుండగానే దేవేంద్రునిజూచి ఇంకపదిసంవత్సరములకు నీతమ్ముని జూడగలవు. వాడునిన్ను జంపవచ్చిన నేను సమాధానపరచెదను. నీవు నితనిగూడి ముల్లోకముల జయింపగలవనెను. తరువాత దితి పగలు రెండుజాములప్పుడు పాన్పునందు దలత్రట్టుగా బాదములుంచికొని నిద్రించినది. అప్పుడు ఇంద్రుండు దితియోనిక ప్రవేశించి గర్భమునందున్న శిశువును ఏడుఖండములుగా ఖండించెను. అప్పుడాశిశువు ఏడ్వ దితిమేలుకొని చంపగూడదని యాజ్ఞాపింప నింద్రుండు గర్భమునుండి వెడలివచ్చి తల్లీ! నీవపరిశుద్ధురాలవై నిద్రించి యీ కార్యమునకు నాకుఅవకాశంబిచ్చితివి. నేను చేసినదానిని క్షమింపవలయునని దితిని ప్రార్థింప, నామె నీతప్పితమేమియు లేదు, యీ ఏడుతునకలు లోకంబున సప్తమరుత్తులగు గాకయని యనుగ్రహించుమని దేవేంద్రుని ప్రార్థించెను.

142. గురువొక్కడుగా నుండవలెను గాని యుపగురువు లెందరైన నుండవచ్చును. ఎవనివద్ద నేదైన నేర్చుకొన్న నతని నుపగురువందురు. గొప్పయవధూతకు 24 ఉపగురువు లుండిరు.

143. తనగురువుతప్పు శిష్యు డెన్నరాదు. గురువుచెప్పినదంతయు నత్యంతశ్రద్ధతోవిని నడుచుకొనవలయును. నా గురువు కల్లంగడి జొచ్చినను నిత్యానందుడని బంగాళ చాటువాక్య మొకటి యున్నది.

144. గురువు మధ్యవర్తి. నరుని దేవుని జేర్చును.

145. ముత్యములను గ్రహించి చిప్పను పారవేయుము. సద్గురువునుగ్రహించిన తారకమంత్రము గ్రహించి యతని లోపాలోపములను నిరాకరించుము.

146. నీగురువు నెవరైన నిందించిన చెవినిబెట్టకుము. వానిసముఖమున నుండకుము.

147. చంద్రుడు ప్రతిబాలుని మామయగునట్లు దేవుడు మానవుని తండ్రియగును.

148. గురువుయొక్క యనంతశక్తియందు దృఢమైన భక్తిగల యొకశిష్యుడు గురునామస్మరణ జేయుచు నీటిమీదనడచి నదినిదాటెను. గురువు దానిని జూచి ఆహా! నా నామస్మరణయందుకూడ నింత మహాత్మ్యమున్నదా? గనుక నే నెంతగొప్పవాడను బలవంతుడననుకొనెను. రెండవనాడు గురువు నేను నేననుకొని యానదిలో దిగి నీటిలోకి జారి మునిగిపోయెను. భక్తివిచిత్రములను గలుగజేయును. అహంకారము మృత్యువు దెచ్చును.

149. గురువులు నూర్లకొద్ది యుందురు. గాని సచ్ఛిష్యులుండుట యరుదు.

150. సరిగమపదనిసయని నోట సులభముగా ననవచ్చును గాని వాద్యముమీద నవిపలికించ నంతసులభముగాదు. అట్లు ధర్మము జెప్పవచ్చును గాని యాచరించుట దుస్తరము.

151. జనులందరు ధర్మమును మూటలకొద్ది మాటలాడుదురు కాని యొక రేణువంతయుకూడ నాచరించరు. జ్ఞానిదానోట జెప్పక జేయునదియంతయు ధర్మముగానే యుండును.

152. నీవితరులు జేయ నిచ్ఛయించుదానిని నీవే చేయుము.

153. దేవునిజూడ నిచ్ఛయించిన నిశ్చయముగా ముమ్మారుగా దేవునిజూతురని చెప్పుచున్నాను.

154. తామరరేకులు కాలవశమున గ్రిందపడునుగాని యవి మచ్చలను విడుచును. అట్లు జ్ఞానియైన యహంకారమూడునుగాని స్మృతిమాత్రముగా నిలచియుండును. అది పాపమునకు ప్రకాశించదు.

155. మనుజునియందు రెండుజీవులున్నవి. ఒకటి సిద్ధమైనది, మఱొకటియసిద్ధమైనది. సిద్ధమైనజీవుడు ఏదియునాదికాదు. నేనుచూచినది, వినునది, స్పృశించునది, ఈ దేహముకూడ నాదికాదు దైవభక్తుడు శాశ్వతుడుయని చెప్పును. అసిద్ధజీవుడు ఇది నాయిల్లు, నాగది, నాబిడ్డ, నాభార్య, నాదేహమనుకొనును.

156. ఉల్లిపాయిరసము నుంచినపాత్రె నెంతకడిగినను దానివాసనపోనట్లు అహంకారమట్టి పట్టుగలది. అదిమనను పూర్ణముగా విడుచుట లేదు.

157. టెంకాయచెట్టులోని యాకులు పడిపోవును గాని బోదెమీద మచ్చ విడుచును, ఈ దేహముండువరకు మానవుడెంత జ్ఞానియైనను నహంకారచిహ్నముండి తీరును. అయితే యిట్టియహంకారస్ఫూర్తి మరలలోకమున బంధము గలుగజేయదు. పునర్జన్మమునకు గారణముకాదు.

158. లోకమునంతటికి సూర్యుడుష్ణము ప్రకాశము నిచ్చునుగాని మేఘములు వాటిని మరుగుజేయ నేమిచేయసాధ్యము. అట్లు అహంకారముండువరకు హృదయమున దేవుడు సాక్షాత్కరించడు.

159. అహంకారము చెత్త లేకబూడిదకుప్పవంటిది. దానిమీదనీళ్లుపడిన నిమిరిపోవును. అట్లు అహంకారమున్నంతవరకు దైవకీర్తనలు ధ్యానము వృధాయగును.

160. మూడువిధములు ప్రేమయున్నది. స్వార్థమనియు పరస్పరమనియు స్వార్థముకానిదనియు స్వార్థమైన ప్రేమయధమమైనది. అదితనవారిసుఖదుఃఖము లెంచక తనసుఖమునుమాత్రము జూచుకొనును. పరస్పరప్రేమయందు తనవారిసుఖము జూచుచున్నదిగాక తనసుఖముకూడా జూచుకొనును. మూడవవిధము ప్రేమ యొక్కువైనది. తనవారిసుఖముమీదమాత్రము దృష్టియుంచును.

161. బృందావనములోని గోపికలు శ్రీకృష్ణుని జగన్నాథునిగాగాక గోపినాథునిగా నెంచినట్లు నిజభక్తుడు దేవుని దనసమీపప్రేమబంధువువలె భావించును.

162. ఈ జన్మములో నేనుసిద్ధిపొంది తీరవలెను, లేదా, 3 దినములలో దేవుని జూడవలెను లేదాయొకసారి నామస్మరణముజేసి దేవునినిరప్పింతునని యంతవిశేషభక్తితో గొలిచిన దేవుడు శీఘ్రముగ బ్రత్యక్షమగును.

## మనశ్శరీరము - మనస్సు.

ప్రజ్ఞకు సాధనమైన మనస్సుయొక్క జ్ఞాతభావమెట్టి స్వభావముకలదియో, ఎట్టిపదార్థసంకలితమో, పూర్వజన్మములందెట్లు దానిని సిద్ధపరచుకొన్నామో, ఈ జన్మమునసెట్లు దానిని మార్చవచ్చునో యీవిషయములు విచారించుదము.

మనస్సు చైతన్యస్వరూపము. మనస్సు మనోలోకపదార్థమున కలిగిన ఆత్మయొక్కజ్ఞాతభావ ప్రతిఫలము.

ఉపాధివిశిష్టమైన సమయమున, మనఃకార్యముల ననుసరించియు మనోలోకమున వర్తించుప్రజ్ఞను అనుసరించియు, ఆత్మ రెండువైఖరులు చూపుచున్నది. ఈ వైఖరులు ఆయాకార్యముల ననుసరించి చేరినపదార్థసమ్మేళనమువలన కలిగిన వగును. దీనిస్వభావమును పట్టియు, ఈపదార్థమును మనోపదార్థమనియు, సంకల్పపదార్థమనియు పేరిడినాము. ఈ పదార్థమొంకలోకమగును. ఇదిస్థూలలోకమున కామలోకమున అంతర్యామియైవ్యాపించి స్థూలపదార్థము లేడువిధములుండురీతి, ఏడువిధములుగా నున్నది. ఆత్మయొక్క జ్ఞాతృభావము నుంచి కలిగినచలనములు ఈ పదార్థమున ఎక్కువగ మార్పులు కలుగచేయును. ఈ భావమేదానికి నిర్ణయమైన స్వరూపమునకు కారణమగును.

మనస్సుయొక్క మొదటి యుపాధి కారణ శరీరమనబడును. ఇది మనోలోకము యొక్క ఐదవ ఆరవభాగముల పదార్థముచేత నయినది. ఆపదార్థము స్థూలపదార్థ భాగములైన ఆకాశపదార్థములవలె సూక్ష్మముగా నుండును. ఇప్పటికాలపు మానవకోటియందు అనేకుల కారణశరీరములు కొంచముకూడ పక్వమై యుండలేదు. బాహ్యప్రపంచ వ్యాపారమెక్కువగ నుండుటచేత, మనస్సంకల్పములు కారణశరీరమున మార్పులు కలుగజేయవు. గనుక కారణశరీరములు పక్వమై యుండవు. గనుక ప్రకృతవిచారమున ఈ విషయమును సంక్షేపించుచున్నాము. కారణశరీరము కేవలనిర్గుణ సంకల్పవిచారమునకు సాధనభూతము. మనస్సుయొక్క రెండవయుపాధి మనశ్శరీరమనబడును. స్థూలప్రపంచమునగట్టి, ద్రవ, వాయు, ఆకాశపదార్థములకు సరియైన మనోలోకమున మొదటి నాల్గువిధముల పదార్థములచేత నీశరీరము చేయబడినది. దీనిని స్థూలమనశ్శరీరమన వచ్చును. మనశ్శరీరములు ముఖ్యముగా ఏడురీతులుగా నున్నవి. అవి వివిధపక్వముల ననుసరించి యుండును. అవి ఒకనియమము ననుసరించియే

యున్నవి. ఈనియమమును తెలుసుకొని ప్రవర్తించుటయే నిర్ణయబుద్ధితో మనస్స్వభావమును వృద్ధిచేయుట యగును. గనుక నే ఈ విచారమత్యుత్తమ మగును.

## సత్సంకల్పములు.

109. ఈ యథార్థమును రక్షయుండుటవల్ల నన్నిభ్రమలు భ్రాంతులు వదలును.

110. నడవడికయందు నిజముగా నడచుకొనుట తప్ప, జ్ఞానముగలుగుట యనునది వేరు లేనే లేదు.

111. మనోబుద్ధులు రెండునునిజము ననుసరించిన, జ్ఞానముగలుగుట యనునది వేరు లేనే లేదు.

112. మనస్సాక్షి నిజమునే యనుసరించినడచిన జ్ఞానముగలుగుట యనునది వేరు లేనే లేదు.

113. అప్పుడు మొట్టమొదటవాక్కు సత్యమై వెనుక తిన్ననగును.

114. వాక్కెంతయదార్థమైనదో యంతతిన్నగా నుండుట యావశ్యకము. ఏలన, సమస్తపదార్థములయొక్క యంతరమున నిజము, దయ, నెలకొనియున్నవి.

115. సత్యము, తిన్నదనము, మనముసాధారణముగ ననుకొనునట్లు, వ్యతిరేక పదార్థములు గావు.

116. వాక్కు, సరసతతోను దయతోను మిళితమైన, దాని సత్యము నించుకయైన బోగొట్టుకొనదు.

117. గనుక 'సత్యమై తిన్ననైనవాక్కు, సత్యమై తిన్ననై సరసమై యుండవలెను.

118. ఇదియే వాఙ్నియమము.

119. ఇదియే ప్రతి ముముక్షువు సలుపు వాక్కుయొక్క సత్యమైన తపస్సు యజ్ఞము.

120. సర్వమునకు నాత్మనిగ్రహమే కీలకము.

121. ఏదైనసొక నియమముగలిగి జీవనము నడుపుము.

122. నీజీవనము నడుపుటకు గొన్ని నిబంధనలను నీవే పెట్టుకొనుము.

123. ఒకసారి నిబంధనల నేర్పరచుకొనిన, వాటిని మార్చుటకుముందు వాటి నెంతయాలోచనతో నేర్పరచితివో యంతయాలోచన జేయుము.

వారెరుంగరు. గనుక వారధోలోకము జేరుదురు. దేవతలను భజించినవారు దేవతలను జేరుదురు. పితృవులను బూజించువారు పితృవులను జేరుదురు. భూతములను బూజించువారు భూతములను బొందుదురు. నన్ను బూజించువారు నన్నే జేరుదురు. నాకొరకు పత్రము, పుష్పము, ఫలము, జలమునైన సమర్పించిన దానిని భక్తిపూర్వకముగా సమర్పింపబడినందువల్ల ముముక్షువునుండి నేనంగీకరించెదను. నీవుదేనిని జేసినను, నీవు దేనిని దినినను, నీవుదేనిని హోమముజేసినను, నీవేదానము జేసినను, నీవేతపస్సు జేసినను, కౌంతేయా! నీవు దానిని నాకర్పించుము. ఇట్లు శుభాశుభ ఫలములనిచ్చు కర్మబంధ ఫలములనుండి నీవు విముక్తుడగుదువు. సన్యాసయోగ యుక్తుడవై నీవు ముక్తుడవై నన్ను జేరుదువు. నేను సర్వభూతములకు సముడు. నాకుప్రియమైనది ద్వేష్యమైనది యేదియునులేదు. నన్ను భక్తిపూర్వకముగా భజించువారు నాయందున్నవారు. వారియందు నేనుందును. కేవలదురాచారుడితరులను బూజించక నన్నే బూజించినవాడు సద్వ్రతమునుజేయ నిశ్చయించినవాడు గనుక వానినిగూడ ధర్మపరునిగా నెంచవలయును. అతిత్వరలో నతడు ధర్మాత్ముడై పరమశాంతిని బొందును. కౌంతేయా! నాభక్తుడెప్పటికి నాశము జెందడని ధృఢముగా దెలియుము. నన్నాశ్రయించినవారు, పార్థా! నికృష్టజన్మములు గలవారయ్యును, స్త్రీలయ్యును, వైశ్యులయ్యును, శూద్రులుగూడనైనను, నారుత్కృష్టగతిని జేరుదురు. గనుక పవిత్రులైన బ్రాహ్మణులు భక్తులైన రాజఋషుల విషయమున నెంతచెప్పవలెనో తెలియుము. అనిత్యమై, సుఖరహితమైన యీ లోకమును బొందిన నీవు నన్ను భజించుము. నాయందు నీ మనసును నిలుపుము. నాభక్తుడవుగమ్ము. నాకొరకుయజ్ఞము జేయుము. నాకు నమస్కరించుము. ఇట్లు యోగయుక్తుడవై నన్నే పరమగతిగా నెంచి నన్నే బొందగలవు.

రాజవిద్యా రాజగుహ్యయోగము సమాప్తము.

---

## పదియవ యధ్యాయము - విభూతియోగము.

### శ్రీకృష్ణుల వాక్యము.

అర్జునా! నీ క్షేమము పేక్షించి ప్రియుడైన నీకొరకు జెప్పబోవు నా యుత్తమ వచనములను మరల వినుము. సురగణములుగాని మహర్షులుగాని నాయుత్పత్తి నెరుంగరు. సకలదేవతలకును మహర్షులకును నుత్పత్తికారణము నేనే. నన్ను జన్మరహితునిగా, నవాదిగా, లోకనియామకునిగా నెరింగినవాడు మర్త్యులయందు

మోహితుడుగాక సర్వపాపవిముక్తుడగును. బుద్ధి, జ్ఞానము, మోహరాహిత్యము, క్షమ, సత్యము, దమశ్శమములు, సుఖదుఃఖములు, ఉత్పత్తినాశనములు, భయాభయములు, సమత్వము, సంతుష్టి, తపస్సు దానము, యశస్సు, అపయశస్సు, ఇవి ప్రాణులకు నావల్లగలుగు వివిధగుణములు. సప్తమహర్షులు, సనక చతుష్టయంబు చతుర్దశ మనువులుంగూడ నాయొక్క సంకల్పంబుచే బుట్టిరి. వారివలన నీప్రజలు గలిగిరి. ఈ నావిభూతియోగతత్వము దెలియువాడచంచల యోగసిద్ధిని బొందును. ఇదినిస్సందియంబు. సర్వోత్పత్తికి గారణము నేను. నావల్లనన్నియు గలుగును. ఇట్లు దెలిసి పండితులు నన్ను తదేకనిష్ఠతో భూజించుచుందురు. నాయందు చిత్తమునిచ్చి, నాయందు వారి ప్రాణమప్పగించి, పరస్పరము బోధజేసుకొని నన్నుగురించి సదాసంభాషించుచు వారు సంతుష్టులై యానందమగ్నులై యుందురు. సదాయోగయుక్తులై ప్రీతిపూర్వకముగా భజించువీరలకు జ్ఞానయోగమిచ్చెదను. దానివల్ల వారు నన్ను బొందుదురు. వారియందు నాకుగల కేవలదయాపరత్వమున వారి యాత్మయందుండు నజ్ఞాన జన్యమైన చీకటిని జ్ఞానదీపప్రకాశముచేత నశింపజేయుదును.

## అర్జునుని వాక్యము.

నీవు పరబ్రహ్మము, పరంధాముడవు, పరమపవిత్రుడవు, శాశ్వతుడవు, దివ్యపురుషుడవు, ఆదిదేవుడవు, అజుడవు, ప్రభువు ఇట్లు సకలఋషులు నిన్నువక్కాణింతురు. దివ్యఋషియైన నారదుడుగూడ ఇట్లనును. అసితుడు, దేవలుడు, వ్యాసుడుగూడ నిట్లనిరి. ఇప్పుడు నీవును దానిని నాకు జెప్పుచున్నావు. నీవు నాకుపదేశించిన దీని నంతయు, కేశవా! సత్యమని నమ్ముచున్నాను. భగవంతుడా! నీవ్యక్తిని దేవదానవులు గూడ దెలియజాలరు. పురుషోత్తమా! భూతభావనా! భూతేశా! దేవదేవా! జగత్పతే! నీవల్లనే నిన్ను యథార్థముగా దెలిసికొనెదవు. ఈ లోకములవ్యాపించి మహత్వముచేత నీవుందువో యట్టినీస్వకీయమైన దివ్యమాహాత్మ్యములను నిశ్శేషముగ నాకు దెలియ ననుగ్రహించుము. యోగీశ్వరా! సదా ధ్యానముచేత నిన్నెట్లు కనుగొనెదను. భగవంతుడా! ఏభావముచే నిన్ను నేను ధ్యానించవలయును. జనార్దనా! నీ యోగమును, విభూతిని గురించి, సవిస్తరముగా మరల నాకు సెలవిమ్ము. నీ యమృతవాక్యము లెంతవినినను నాకుదృప్తిలేదు.

ఓ కురుశ్రేష్ఠుడా! నీకుశ్రేయస్సగునట్లు. నాదివ్యమాహాత్మ్యమున ముఖ్యమైన యంశములను మాత్రము నీకుజెప్పెదను. నాయొక్క విస్తరమునకు నంతమ్ములేదు.

గుడాకేశా! సమస్తప్రాణుల హృదయమునందుండు నాత్మనేనే. సకలప్రాణుల యుత్పత్తి స్థితి నాశనములు నేనే. ఆదిత్యులలో విష్ణువు నేను. జ్యోతిస్స్వరూపములలో ప్రకాశమైన సూర్యుడు నేను. వాయువులలో మరీచి నేను. నక్షత్రములలో చంద్రుడు నేను. వేదములలో సామవేదము నేను. దేవతలలో దేవేంద్రుడు నేను. యింద్రియములలో మనస్సు నేను. ప్రాణులలో బుద్ధి నేను. రుద్రులలో శంకరుడు నేను. యక్షరాక్షసులలో కుబేరుడు నేను. వసువులలో అగ్నిహోత్రుడు నేను. ఉన్నతపర్వతములలో మేరువు నేను. పార్థా! పురోహితులలో ముఖ్యుడైనబృహస్పతి నేను. సేనానాయకులలో కుమారస్వామి నేను. తటాకములలో సముద్రము నేను. మహర్షులలో భృగువు, వాచకములలో నేకాక్షరము నేను. యజ్ఞములలో జపయజ్ఞము నేనే. స్థావరములలో హిమాచలము నేను. సర్వవృక్షములలో, నశ్వత్థము, దేవఋషులలో నారదుడు, గంధర్వులలో చిత్రరథుడు, సిద్ధులలో కపిలమునియు, అశ్వములలో అమృతముతోబుట్టిన ఉచ్చైశ్శ్రవము నేనని దెలియుము. గజేంద్రములలో నైరావతము, మనుష్యులలో రాజు, ఆయుధములలో వజ్రాయుధము, గోవులలో కామధేనువు నేను. పుట్టించువారలలో కందర్పుడను నేను. సర్పములలో వాసుకి నేను. నాగములలో అనంతుడను నేను. జలవాసులలో వరుణుడు నేను. పితృవులలో ఆర్యముడు నేను. దండించువారిలో యముడు నేను. దైత్యులలో ప్రహ్లాదుడు నేను. లెక్కపెట్టువారిలో కాలము నేను. మృగములలో సింహము నేను. పక్షులలో గరుత్మంతుడు నేను. పరిశుద్ధవస్తువులలో వాయువు నేను. ధనుర్ధరులలో శ్రీరాముడు నేను. మత్స్యములలో మకరము నేను నదులలో గంగ నేను. సృష్టికి నుత్పత్తి, స్థితి, లయములు నేను. అర్జునా! విద్యలలో అధ్యాత్మవిద్య నేను. తార్కికునియొక్క తర్కము నేను. అక్షరములలో అకారము నేను. సమాసములలో ద్వంద్వము నేను అక్షయమైన కాలము నేను విరాట్స్వరూపమగు బ్రహ్మము నేను. సర్వమును హరించుమృత్యువు నేను. రాబోవువస్తువులకు నుత్పత్తి నేను. స్త్రీలయందు, కీర్తిశ్రీ, వాక్కు, స్మృతీ, ధృతి, బుద్ధి, క్షమ, నేనే. సామములలో బృహత్సామము నేనే, ఛందస్సులలో గాయత్రి నేను. మాసములలో మార్గశీర్షము నేను. ఋతువులలో వసంతము నేను. వంచకములలో జూదము నేను. తేజోవంతులయందు తేజము నేను. జయము నేను. వ్యవసాయము నేను. సత్యవంతులలో సత్యము నేను. యాదవులలో వాసుదేవుడు నేను. పాండవులలో ధనుంజయుడు మునులలో వ్యాసుడు నేను. కవులలో ఉశనుడు నేను. దండించువారలలో దండము నేను. జయముగోరువార

ళలలో జయోపాయము నేను. గోప్యమైనవస్తువులలో మౌనము నేను. జ్ఞానులలో జ్ఞానము నేను. సమస్తభూతములకు బీజమగునదంతయు నేను. అర్జునా! నేనులేని చరాచరమేదియులేదు. నాదివ్యమాహాత్మ్యములకు నంతములేదు. అర్జునా! ఇప్పుడుచెప్పబడినది నాయనంతమైన మాహాత్మ్యమును సూచింపుచున్నది. ఏది ఐశ్వర్యయుక్తమై సుందరమై సత్యమై పూజితమైయుండు దానినంతయును, నా తేజముయొక్క యంశమువల్ల సంభవమైనదిగా దెలియుము. ఈ వివరముల జ్ఞానముచేత నీకు నేమిప్రయోజనము. అర్జునా! నాయొక్కయంశముచేత నీసమస్తసృష్టిని వ్యాపించియున్నాను.

విభూతియోగము సమాప్తము.

Continued in page 19. see January issue of 1909

18. ఒక స్త్రీ చండాలునితో వ్యభిచరించినట్టయితే పది బ్రాహ్మణులముందు తనతప్పితము సెప్పుకొనవలయును.

19. ఆ పెబురద చేతను ఆవు పేడకలక చేతను నిండియున్న టువంటియొక నూతిలో తనగడ్డమువరకు మునిగి దానిలో వేలాడి యాహారమును భుజింపకయే యొకరాత్రియంతయు నిలుచుండవలయును. అట్లు చేయుటచేత యామె శుచిత్వమును బొందును.

20. పిమ్మట నూతిలోనుండి లేవనెత్తబడి, తనతల నున్నగా క్షౌరము జేయించుకొని యవధాన్యమును భుజించవలయును. అటుపిమ్మట మూడురాత్రు లుపవాసము సలిపి తనతపస్సుయొక్క కడపటిరాత్రిని నీటిలో గడుపవలయును.

21. అటుపిమ్మట శంఖపుష్పి యాకులు పూలు వేర్లయొక్క కషాయమును దానిలోకూడ పంచగవ్యము బంగారును గడిగిన నీళ్లను యామెను త్రాగుటకు నివ్వవలయును.

22. బహిష్ఠరాలగుటవరకు యొంటిపూట భోజనము జేయుచు యాతపస్సయంత్యమగుదాక తన పెనిమిటి యింటిబైట నుండవలయును.

23. తపస్సు ముగిసిన బ్రాహ్మణులకు సంతర్పణజేసి వారికి రెండు గోదానముల నియ్యవలయును. అటు చేయుటచేత యామె శుచియగును. ఇదియే పరాశరులవారు విధజించి యుండినది.

24. అవియయములో నాల్గువర్ణముల స్త్రీలును కృచ్ఛచాంద్రాయన తపస్సు నాచరించ వలయును. భూదేవివలె స్త్రీభ్రష్ట కాజాలదు.

25. ఒక స్త్రీ పురుషునిచేత చెఱపెట్టబడి బలత్కారముగా చెరుపబడినట్టయితే, అబలమైనందువల్లనో, తనప్రాణముపోవునను భయముచేతనో, చెడవలసినట్టయితే సంతపన తపస్సు నాచరించి శుచిత్వమును బొందవలయును. పరాశరులు విధించి యుండునది యిదియే.

26. ఒక స్త్రీ పరపురుషునిచేత నొకసారి చెడుపబడియుండి, అట్టియన్యాయపు మార్గమునందిచ్ఛ గలిగి మగలినట్టయితే యొక్క ప్రాజాపత్య తపస్సు నాచరించి తనపాపముం బాపుకొనవలయును. అట్లుచేయుటచేత యామె బహిష్ఠురాలైనపిదప శుచియగును.

27-28. ఎవనిభార్యయయినా మద్యపానము జేసినట్టయితే వానియొక్క శరీరములో అర్థము నశించినది యగును. ఈవిధముగా యెవనియొక్క యర్థాంగి నశించి

పోవునో వానికి మోక్షము గలుగ నేరదు. వాడు మనస్సులో గాయత్రీమంత్రమును బఠించి యొకకృచ్ఛ్ర సంతపన తపస్సు నాచరించవలయును.

౨౯. కృచ్ఛ్రసంతపన తపస్సనగా పంచగవ్యమును దర్భోదకమును ద్రాగిన పిదప యొకనాడు రాత్రి యుపవాసము సలుపుట.

౩౦. ఒక స్త్రీ తన పెనిమిటిచేత వెడలగొట్టబడినపుడుగాని. అయన దూరదేశమునకు బోయివుండునపుడుగాని, లేక అయన మరణాంతరమందుగాని గర్భముధరించినట్టియితే యామెను పరలోకమున కనర్హురాలును పాపాత్మురాలౌటంబట్టి వేరుదేశమునకు బహిష్కరించ వలయును.

౩౧. ఒక బ్రాహ్మణ స్త్రీ పరపురుషుని వెంబడి పారిపోయినట్టయితే క్షీణ స్త్రీ యనబడును. ఆమెయెప్పటికిని తనకులములోనికి జేర్చుకొనబడ జాలదు.

౩౨. ఒక స్త్రీ కామాతురముచేత తన స్నేహితులను, బంధువులను, పెనిమిటిని, పుత్రులను విడిచి పారిపోయినట్టయితే ఇహపరలోకములయందును దౌర్భాగ్యురాలు.

౩౩. ఏ స్త్రీగాని ఇట్లు పారిపోయివుండి పదిదినములవరకు యింటికి మరలి రాకపోతే ప్రాయశ్చిత్తములేదు. పారిపోయిన పదియవదినము పిదప యామె భ్రష్టురాలైనదని యెంచుకొనతగ్గది.

౩౪. ఏ స్త్రీగాని పదిదినము లింటగనపడక పోయినట్టయితే ప్రాయశ్చిత్తము లేదు. కాబట్టి యెట్టిసందర్భమునకాని తనపోషకులకు దెలియపరచకయే స్త్రీ యింటి నుండి బయటవెడలగాదు. అట్లు జేయుటచేత యామె భ్రష్టు అయినదని యెన్నబడును.

౩౫. అట్టి స్త్రీయొక్క పెనిమిటి యామెను జేర్చుకొన్నట్టయితే కృచ్ఛ్రచాంద్రాయణము నాచరించవలయును. ఆమెబంధువులు దానిలో నర్ధము నాచరించవలయును. ఇతురు లెవరైన యామెపంక్తిలో భుజించినట్టయితేగాని, నీరుద్రాగినట్టయితే రాత్రింబవ లుపవాసము సలిపి పరిశుద్ధులు గావలయును.

౩౬. ఒక బ్రాహ్మణ స్త్రీ తనంతట తానె యే పరపురుషుని సహాయములేకయే యిల్లువెడలి నూద్రురు మగవారితో సహవాసముజేసినట్టయితే యామెయొక్క స్నేహితులు బంధుగులు సంబంధమును వదలుకొనవలయును.

౩౭. అట్టి స్త్రీ యే యింటిలోనికి ప్రవేశించునో యా యింటికిన శౌచము. అదె యుండనియిల్లే యామెపుట్టినిల్లుగా యేర్పరచ వలసినది.

38. అట్టి యపవిత్రపురాశ చేత వాశౌచముగలిగిన యింటికిఁ పంచగవ్యముబూసి పవిత్రము జేయవలయును. మంటిపాత్రలన్నిటిని పార వేయవలయును. అందులో యుంచియున్న గుడ్డలు కట్టెసామానులను మామూలు యాచారముతో శుద్ధి జేయ వలయును.

39. అట్టి యింటియం దుంచబడిన రాగిపాత్రలను పంచగవ్యముచేత కడిగి శుద్ధి జేయవలయును. కంచుపాత్రలను పదివిధములయిన బూడిదతో తోమి శుద్ధిపరచ వలయును.

40. బ్రాహ్మణుడు తనగృహములో అట్లుచెడిన స్త్రీ చేరినట్టయితే యాసంగతి బ్రాహ్మణులకు తెలియపఱచుకొని వారువిధించునటువంటి ప్రాయశ్చిత్తకర్మనాచరించి వారికి రెండుగోదానములనొసంగి యొక్క ప్రాజాపత్య తపస్సు నాచరించ వల యును.

41. బ్రాహ్మణుడు దప్ప యితర యేజాతివాడైనను యట్టి స్త్రీ తనయిల్లు జేరి నట్టయితే తనయింటిని పంచగవ్యముతో శుద్ధిజేసి ఒకరాత్రింబవలుపవాసము చేయ వలయును తరువాత తనపుత్రులు సేవకులపంక్తిలో బ్రాహ్మణులకు దివ్యమైన భోజనము సేయించ వలయును.

42. వాయువాకాశములును, అగ్నియును, ఇతరపాత్రలతోను యజ్ఞసామగ్రు లతోను గూడియున్న చమసయును, కుశగడ్డియు (దర్భ) భూసంబంధమైన జలమును మైలకానేరవు.

43. ఉపవాసముల చేతను, వ్రతముల చేతను, ప్రక్షాళనము చేతను, అర్చనల చేతను, జపముల చేతను, హోమముల చేతను బ్రాహ్మణులెల్లప్పటికిని పవిత్రులౌదురు.

## ౧౧-డో యధ్యాయము.

1. చండాలునిచేత ఎద్దుమాంసమునైన, నన్నమునైన దినియుండినగాని, ఇట్టిది యనుటువంటి యంగవిశిష్టమైన మైలపదార్థమును గైకొనియుండినగాని బ్రాహ్మణుడు చాంద్రాయణతపస్సు నాచరించి తనపాపము బాపుకొనవలయును.

2. ఈ సందర్భములో క్షత్రియుడుగాని వైశ్యుడుగాని అర్ధచాంద్రాయణము నాచరించవలయును. శూద్రుడన్ననో యొక ప్రాజాపత్యము నాచరించి పరిశుద్ధత్వమును బొందవలయును.

3. అట్టి సందర్భమున శూద్రుడు పంచగవ్యమును, బ్రాహ్మణుడు బ్రహ్మకూర్చమును దీసుకొనవలయును. బ్రాహ్మణుడొక గోవును, క్షత్రియుడు రెంటిని, వైశ్యుడు మూటిని, శూద్రుడు నాలుగు గోవులను దానమివ్వవలయును.

4-5. బ్రాహ్మణుడు అజ్ఞానమువల్లగాని తొందరపాటిల్లినపుడుగాని శూద్రుని చేతనైన, పురుడు మైలగిలవాని చేతనైన, సందిగ్ధమైన జాతిగలవాని చేతనైన యన్నముగాని, భోజ్యమునకు నిషిద్ధమైన యన్నముగాని, ఎంగిలియన్నముగాని భుజించియుండి, తెలిసినపిదప ప్రాయశ్చిత్తమునకై యొకకృచ్ఛ్రవ్రతము నాచరించి బ్రహ్మకూర్చమును ద్రాగవలయును.

6. పాముగాని, ముంగిసగాని, పిల్లిగాని, తిని యుండిన యన్నము దర్భోదకముతో గలుగలిపి ప్రోక్షించినయెడల యాయన్నము మరలపరిశుద్ధమగును. ఇందువకేలాటి సందేహములేదు.

7. శూద్రుడేవి యదుపగాని నిషేధించిన యన్నమును భుజించి యుండినట్లయితే పంచగవ్యమును ద్రాగుటచేత పరిశుద్ధుడుగావచ్చును. అట్టిసందర్భముననె క్షత్రియుడుగాని వైశ్యుడుగాని ప్రాజాపత్యతపస్సు నాచరించుటచేత పరిశుద్ధులగుదురు.

8. బ్రాహ్మణ భోజనకాలమందు పంక్తిలోనుండి యొకబ్రాహ్మణుడు లేచినట్లయితే, ఇతరబ్రాహ్మణులు తమయాకులలో మిగిలియుండిన యన్నమును భుజించరాదు.

9. అట్లుమిగిలియుండిన యన్నమును. యత్యాశచేతగాని, యజ్ఞానముచేతగాని, బ్రాహ్మణుడుభుజించిన తనపాపమును నొకకృచ్ఛ్రసంతాపనతపస్సు నాచరించి తొలగించకొనవలయును.

10. బ్రాహ్మడు అజ్ఞానముచేత వెల్లిపాయనుగాని, గుర్జుపండునుగాని, దుంపనుగాని, ఉల్లిగడ్డనుగాని తినిన, సమ్మతించక ఒంటెపాలునుగాని, గొర్రెపాలునుగాని, చెట్టుపాలునుగాని తినియుండిన మూడుగాత్రు లుపవాసముసలిపి పంచగవ్యమును బుచ్చుకొని శుచిత్వమును బొందవలయును.

11. బ్రాహ్మణుడజ్ఞానముచేత కప్పనుగాని చిట్టెలుకనుతినిన, నావిషయము దనకుదెలిసినపిదప ఒకరాత్రింబవలుపవాసముసలిపి యవధాన్యము భుజించుచు శుచిత్వమును బొందవలయును.

12. బ్రాహ్మణులు, పరిశుద్ధమైన దేహమునుగలిగి మతాచారకర్మములలోమునిగిన క్షత్రియుల గృహములందును వైశ్యులగృహములందును. దేవతలప్రీతికై హోమ

2. బ్రహ్మవిద్య—హిందూమతసారసంగ్రహము. వెల 2 అణాలు.

ఈవిషయమై అనేక పూర్వగ్రంథములున్నను, ఈకాలపు సంశయబుద్ధులకు తగినవికావు. ఇప్పటికాలమునకు తగినట్లుగా వ్రాయబడు పుస్తకములలోనివి మొదట చెన్నదగినది. సప్రామాణ్యముగ జన్మసాఫల్యరీతిని మతసారమును సూచింపబడి యున్నది. ఈ సభయొక్క పుస్తకములను చదువుటవల్ల సాధారణముగా ఈకాలమున విపరీతముగతోచు మనపూర్వపద్ధతుల నిజమైన అర్థములు స్ఫురించుటగాక నిజమైన జ్ఞానసాధనయందు ప్రవర్తించువారగుదురు. ద్రవ్యాపేక్షతో నీపుస్తకములు పత్రికలు వ్రాయబడుటలేదనియు, వీటినికొని చదువుటవల్ల కాసంతయు నష్టముకాబోదనియు, మహత్తరమైన జ్ఞానలాభముకలిగినదని ఏనోయొకకాలమున అనుభవమునకువచ్చుట నమ్మకమని, ఈసందర్భములను మనముపోగొట్టుకొనకూడదని.

బిగ్గరగఅరచి చెప్పుచున్నాము. ప్రార్థించుచున్నాము.

బెదరించుచున్నాము. సత్యము. సత్యము.

వినువారు వినండి. చదువువారు చదవండి.

హంసశాల,
80, అంగప్పనాయక్ వీధి,
జార్జిటవున్, మదరాస్.

పె. స. హనుమంతరావు,
కార్యదర్శి.

# THE THEOSOPHICAL SOCIETY.

## బ్రహ్మవిద్యా సమాజము.

కడచినసంచికలలో ఈ సమాజముయొక్క ముఖ్యోద్దేశములను సంగ్రహముగా సూచించితిని. ఈ సమాజము లోకములోని వైషమ్యములను భేదములను నిర్మూలకము చేసి సర్వసమభావము కలుగునట్లుచేసి సర్వవిధమతములవారు సహోదరభావమున అన్యోన్యముగ మెలగునట్లుచేయుటకై యున్నది. దాని యుద్దేశములను ఏమహాను భావులు చక్కగాగ్రహించి మతవైషమ్యములుమాని దుర్బుద్ధులువీడి ఈ శ్యఅనూయత

ద్రోసి ఒకరొకరు చేయు యుద్ధములందు ఏకీభావముగలిగి ప్రవర్తించిన ఇహలోకమే స్వర్గలోకమగుటకు ఆటంకమేమి యుండును ?

ఈ సమాజములోను అనేక కొరతలున్నవనియుకూడ మేము చెప్పియున్నాము. దీనిలో చేరువారు సరియైనవారు అవునా కాదాయని ప్రథమవిమర్శలేదు గనుక బాహ్య ప్రపంచమునగలుగు విపరీతములన్నియు ఈ సభలో చేరినవారియందు కూడా మెండుగ నున్నవి.

ఈ సభలోపనిచేయను ఉద్యుక్తులైనవారు తాముద్దేశించినపనిని ఏదీకనిష్ఠతో దేశమంతట చేయుటలేదు. ఆపనికి తగుమైనవారిని తయారుచేయుటలేదు. ఈ కొరతలన్నియు క్రమముగాతీరునని మాయభిప్రాయము. అటులులేకున్న ఈ సభ అంత ప్రయోజనకారిగా నుండజాలదు. ఈ కొరతలబట్టియే ఈ సభయీదేశమున స్థాపితమై 30ఏండ్లయినను, జనసామాన్యాభిప్రాయమున ప్రశంసకురాకయున్నది. ఈఅపవాదము తొలగించవలెనని యిదివరలో చేరినవారందరు శ్రద్ధతోను ఓపికతోను సన్మార్గమున నడచి బోధించినగాని వేరువిధమున తొలగదు. ఎంతచదివినను బుద్ధికుశలత ఎక్కువ కావచ్చునుగాని దానిని తెలిసి హృదయపరిపక్వమునకు తెచ్చుట ఈ కాలమున దుర్లభముగా నున్నది. ఎట్లుకడతేరుదుమోయని ప్రతిమనుష్యుడు నిరాశపొందవలసిన కాలమువచ్చినది. ఈతిబాధలు, నవనాగరికతలు, దుర్భిక్షములు, మతభేదములు కులాచారసహస్రములు, అజ్ఞానజన్యభ్రాంతులు అన్నియుకలసి మనిషిని విహ్వలతపొందింపుచున్నట్లున్నవి. ఈశ్వరుడే మరల యవతరించి చక్కపెట్టినగాని గడచుట దుర్లభమనితోచు.

ఈ సభ అన్నిమతములకు సమ్మతియు వారి వారి మతములను అనుష్ఠింపచేయుననియు చెప్పుదురు. అయితే ఈ సమాజమున నింగరుచేరియుండినను హిందూమత కర్మలను శ్రద్ధగా నాచరించుట మేముచూడము. నిత్యనైమిత్తిక కర్మలనుతప్పక యాచరింప చేయునదిగానము. ఇంకను యిట్టికర్మలయందాసక్తి కలిగించినట్టుకానము. ఇట్టి ఆసక్తిపుట్టించి పూర్వవర్ణాశ్రమ పద్ధతులను మరలకల్పించి వారు వారు సత్కర్మనిరతులై ప్రవర్తించిన అప్పటికే ఈ సభయొక్క ముఖ్యోద్దేశములు సఫలమైనట్టు తలచుచున్నాము. అట్లుకానంతవరకు ఈ సభ ఇతర లౌకిక సభలకంటె ఎక్కువ గణ్యతకు వచ్చుటదుర్లభమని మా యభిప్రాయముగను. గనుక ఆగడికి త్వరగా ఈ సభలో చేరినవారందరువచ్చుటకు మూలాధారమైన మహానుభావుల సంకల్పము త్వరగా తోడ్పడుగాక యని యనుదినము క్షణక్షణము దృఢముగా ప్రార్థించుదము.

ఓం

# హంస.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 2.] { కీలకసంవత్సర మాఘమాసము 5009, జనవరి 1909. } [సంచిక ౧.

నా ఆదాయ వ్రయములను తెలిపెదనని గడచిన సంచికలో విన్నవించిన మేరకు వివరించుచున్నాను.

| ఆదాయం. | | రూ. | అ. | పై. | వ్రయం. | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|---|---|
| చందాలు | . | 641 | 0 | 0 | ముద్రించుటకు | ... | 393 | 5 | 0 |
| పోస్టుఖర్చులు | .. | 27 | 3 | 0 | వార్తాపత్రికలు | ... | 30 | 3 | 0 |
| ఇతరపుస్తకములు | . | 7 | 4 | 0 | పుస్తకములు | . | 16 | 14 | 0 |
| ఇతరము | ... | 8 | 7 | 0 | పోస్టు | ... | 153 | 5 | 3 |
| సంచికారము | ... | 30 | 0 | 0 | కాకితములవగైరా | ... | 15 | 6 | 6 |
| | | | | | కార్యనిర్వాహకులు | . | 5 | 0 | 0 |
| | | 713 | 14 | 0 | సిబ్బంది | ... | 142 | 13 | 0 |
| నష్టము | ... | 43 | 0 | 0 | | | | | |
| | | 756 | 14 | 3 | | | 756 | 14 | 9 |

దీనివల్ల రూ. 43-0-0 ఖర్చులకు తక్కువపడినదిగా తెలియుచున్నదిగదా. కావున మీరందరు నా యుద్యమము సరియైనది పోషణీయమైనదని తలచిన నన్ను మీ గారుగింటికిని స్నేహితులకును వ్యాపించునట్లు ప్రయత్నముచేసిన చాలాకృతజ్ఞుడుగా నుందును. ప్రతియింటియందు నన్నుంచుకొని పోషించుటకై 1 రూపాయే చందాగా నేర్పాటుచేసి యున్నాను. స్త్రీలకు బాలురకు తెనుగుభాషతెలిసిన సర్వులకు జీవనో

పాయమునకు మోక్షోపాయమునకు సహకారిగా నుండునని ఖండితముగా తెలియవలెను. నన్ను విశేషముగా పోషించిన వాపొట్ట ఎక్కువగా ఉబ్బి సమస్తసమాచారములతో నందరిని వృద్ధికి తెచ్చుచున్నాను.

## సభలనేకములు

### కావలశినది - ఒకడే.

జీవనము కష్టమైనది. సద్గతిజీవనమ్ము దుర్లభమైనది. చదివిన ఒక గుమాస్తాగానో లేక యొకవకీలుగానో పోవలశియున్నది. అందరామార్గమున పోవుచున్నారు. పూర్వపు వర్ణాశ్రమ సంప్రదాయము ఈకాలమున పొందుపరచుటకు వీలులేనందున వేరు వేరు మార్గములను వెదకుకొనుటకు సమయమువచ్చినది. సకలజగత్తు దైవసృష్టియేకదా? దానిలోని వ్యాపారములన్నియు దైవలీలయేకదా? ఈభావమున తనయొక్క స్వరూపజ్ఞానము తెలిసి, ఒకడు లోకమున తనజీవనమును ఏదోయొక మార్గమున నడుపుటకు ఏలాటి ఆక్షేపణ ఎందుకు ఉండును? చక్కగాయోచింపుడు. దానికై గదా మనదేశమున నిప్పుడు జనులనేక సంఘములుగాజేరి అనేకపనులను నిర్వహించ ఏర్పాటు చేయుటకు ప్రయత్నించుచున్నారు. ఆ సంఘములలోకొన్ని గడచిన డిశంబరునెలలో మదరాసులో జరిగినది. ఒకటిజనసంఘమును వృద్ధిచేయుటకును, ఒకటి చేతిపనులను అనేకవస్తువులను సిద్ధముజేయ నాలోచించుటకును, ఒకటి మనదేశమువారికి మన దయాళువైన మహామహారాజా ఎడ్వర్డుచక్రవర్తిగారు మనయందు దయతలచి మనకు ఎక్కువ స్వాతంత్ర్యమును అధికారములను ఇతరవిధ దేశవృద్ధిని చేయుటకై ఆలోచించుటకును, దైవవిచారణకొకటియు, స్త్రీలసభయొకటియు అన్నిటికి ఆధారభూతమైన బ్రహ్మవిద్యాసమాజ సభకూడా అద్భుతముగ జరిగినవి. ఆసభలయందనేకులు మనదేశములోనిదైన్య, గాంభీర్యాది సద్గుణములుగల విద్వాంసులందరు చేరియున్నారు. ఈసభలవల్ల క్రమక్రమముగా దేశమున విశేషవృద్ధి ప్రబలమగుచునే యున్నది. ఆయాసభలలో చేరినవారందరు ఎక్కువగ పాటుపడవలశియున్నదని కోరుచున్నాము. ప్రతిమనిషి తనశక్తికొలది పాటుపడుచుండిన ఎక్కువప్రయోజనము కనబడును. ఇట్లు జనులు పాటుపడకుండుటవల్లనే అనేకులు లోకమున నెట్లుజీవించవలశినది తెలియక ప్రొద్దుపుచ్చుచున్నారు. కొందరు పుణ్యకార్యముల ప్రవేశించి

విఫలమనోరథులై నిరాశజెంది యున్నారు. మరికొందరు తమజీవనమును సార్థకముగా నడుపుకొనుటకు కోరియుండినను స్నేహితులుగాని పోషకులుగాని మూలధనముగాని లేక కార్యమునకు బూనుకొనుచున్నారు. అయితే పాటుపడు ప్రతిమనిషియు తన అన్నమును సంపాదించుకొనుననియు ఇంతయంతయనక వృద్ధిపొందవచ్చునన్నియు ఎంతపడరాని కష్టములను పడుచున్నను వృద్ధికిరావలెనని కోరిక యొకటియుండిన చాలుననియు కేవలదరిద్రవంశమున తూగినబిడ్డలే లోకములను పాలించినమహానుభావులైరని అనేకుల చరిత్రలవల్ల స్పష్టమగుచున్నది. ఎన్నిఅటంకములు వచ్చినను చలించని మనస్సుతో ఒకమనిషి కార్యమునుచేసిన గెలుచుననియు శ్రద్ధతోను పూనికతోను చేయవలెననియు జయాపజయములు సాధనభూతములనియు, ఏ కార్యమునైనను మంచిదృఢమైనమనస్సుతో చేసిన నది జయప్రదమగునని తెలియవచ్చుచున్నది. అనేకసభలు జరిగినను శ్రద్ధతోపనికిబూనువారలు వేలలో నొకడుకూడా యుండడు గనుకనే ఈదేశమననే పనులుశ్రద్ధతోను పూనికతోను జరుగుటలేదు. దేశమంతట నవనాగరికఘోష జరుగుచున్నను, ఒకపట్టణము గ్రామమునందైన, ఒక చదువుశాలగాని, ఆటశాలగాని, పనిశాలగాని ఏదైనఏర్పాటు జనులు చేసియున్నారో మీరేయోచించుడు.

ఇంటియొక్క సౌష్టవము గోడలుగా ఏర్పడిన యిటికననుసరించియుండునట్టు దేశము ప్రతిమనిషియోగ్యత ననుసరించియుండును, గనుక యిప్పుడు.

కావలశినది— ఒక గొప్పగుంపులో తనస్వగౌరవమును నిలుపుకొనువాడు, తనమనస్సునకు తోచినట్టు నడచుధైర్యశాలి, ప్రపంచమంతయు 'కాదనినను ఔనని చెప్పటకు భయపడనివాడు;

కావలశినది— ఒక గొప్పకార్యమును పూనియున్నను, తనయావనదశయందు ఒకసుగుణమునైన మఱవక, సంకోచింపచేయక, దాచనుయత్నించిక నడచువాడు, ఇతరశక్తులను అణచునట్టుగా ఒకశక్తినిమాత్ర మెక్కువగ సాధించనివాడు;

కావలశినది— కేవల జీవనమునకై పాటుపడుట నికృష్టమనితలచుచు గొప్ప కార్యములందు దృష్టియుంచువాడు,

కావలశినది —సముడై, శాంతుడై, తనలోటియుపయోగము తనశక్తిపనికి రాకుండునట్లు చేయులోపములు లేనివాడు, ఏవిధమైనపిరికితనము లేనివాడు;

కావలశినది— ఒక విషయముమాత్రమే గ్రహించక అన్నివిషయములు తెలి

సినవాడు, వస్తుస్వరూపములను అసంపూర్తిగ విచారించక మిక్కిలి విశాలబుద్ధిగలవాడు, చదివినజ్ఞానముతో వ్యవహారజ్ఞానము కలిపినడచుకొనువాడు, డాంభికము ప్రయోజనములేదనియు నిజమేశ్రేష్ఠమైనదనియు, తినమంచిపేరే అమూల్యధనమని తెలియుచువాడు.

కావలశినది— కాషాయసన్యాసివలె కాక, అచంచలమైనబుద్ధితో విషయముల నణచినవాడు, సకలసౌందర్యములను చూచి ఆనందించువాడు, సకలనీచమును ద్వేషించువాడు, తనవలెనితరులను మర్యాద చేయువాడు.

కావలశినది— అన్నివిధముల విద్యనేర్చినవాడు, ఎక్కువ చురుకుతనముగల నరములుగలవాడు, వ్యవసాయముచేయబడి తీవ్రమై విశాలమై, ఉదారమై, దీర్ఘమై అధికచౌరవశక్తిగల మెదడుగలవాడు, లాఘవముగల చేతులుగలవాడు, హెచ్చరికగలిగినూక్ష్మదృష్టిగల కన్నులుగలవాడు, మృదువై, విశాలమై, గంభీరమై, సత్యమైన హృదయముగలవాడు.

ఇట్టివాడు కావలెనని భూదేవత కాచికాచియున్నదట. అనేకకోట్లమనుష్యులుండినను ఇట్టివారు కలుగుట దుర్లభమట. ఇట్టివారితోడ నెద్దియసాధ్యమగు. మన పూర్వికు లిట్టివారుకాబోలు. ఇట్టిగుణములు సంపాదించవలశినది మన మొదటిపని. సకలైశ్వర్యములు తమంతటతాము వెనుక సిద్ధమగును.

## శాకభక్షణము—మాంసభక్షణము.

> ‘దయయు సత్యంబు దాదలపడేని
> కలుగనేటికి దల్లుల కడుపుచేటు.’—భాగవతము.

కూరలు, ధాన్యము, పాలు, జొన్న మొదలైన పదార్థములు తినుట మంచియా లేక మాంసభక్షణము మంచిదా? ఈవిషయము ప్రాధాన్యమైనది గనుక కొంచము విచారించుచున్నాము. దీనిని మతము ననుసరించియు, శాస్త్రము ననుసరించియు, విచారించుదము.

లోకమున మతములలో హిందూమతము, మహమ్మదీయమతము, క్రీస్తుమతము ఈమూడే ప్రధానమైనవి.

హిందూమతమునకు వేదములు ప్రమాణము.

'మాంసభక్షణము, సురాపానము, జూదము, వ్యభిచారము మానవునియొక్క మనస్సామర్థ్యములను పూర్ణముగ నాశనముచేసి నిర్మూలముచేయును. (6- 7- 70- 1) అని అథర్వవేదమునను

'నీవు గుఱ్ఱమును చంపకూడదు. XIII. (42)

'నీవు ఆవును చంపకూడదు' (43)

'నీవు మేకనుగాని గొఱ్ఱెనుగాని చంపగూడదు' (44)

'ద్విపాదములను చంపకూడదు' (47)

'జింకను రక్షింపుమా' (48)

'పాలిచ్చునట్టి యితరవిధముల యుపయోగకరమైన పశువులను నీవు చంపకూడదు' (49)

ఇట్లు యజుర్వేదమున జంతుహింస చేయకూడదని ప్రమాణములున్నవి.

మహానుభావుడైన సీకులగురువైన నానక్ కూడా 'రంజికొదర్శన్' అనుగ్రంథమున బట్టలు ఇసుకవల్లను మంటివల్లను మలినమగురీతి మానవుని మనస్సు మాంసభక్షణమువల్ల మలినమగునని చెప్పియున్నాడు.

మహమ్మదీయుల కొరాన్ మొదలగు సద్గ్రంథములందుకూడ జంతుహింసయనుచితమని యనేకప్రమాణములు గలవు. అందులో కొన్నిటి నిందు వ్రాసెదము.

'మీయజ్ఞములలోని మాంసమునుగాని పశువులరక్తముగాని దేవుడొల్లడు. మీ పవిత్రతనే కోరును.' 'మీకడుపులను జంతువుల గోరీలగా జేయకుము' అని అలీ అనువాడు చెప్పియున్నాడు. (ఇజారిహేన్).

అబ్దుల్లామసూద్ అను మహాభవుడు '40 ఆవులను చంపినవాడు ఖూనీచేసినవాడౌను. తనప్రీత్యైకై యేజంతువునైన చంపినవాడు కాబా అనగా దేవుని నివాసమును నాశనము చేసినవాడగును అని తెలవిచ్చియున్నాడు.

ఇట్లనే క్రీస్తుమత పుస్తకములందుకూడ (Romans XIV) 15 'ఏసుక్రీస్తువు ఎవనికైచచ్చెనో వానిని నీభోజనమునకై చంపకుము.'

'17. స్వర్గప్రాప్తికై మాంసభక్షణము పానము కావలశినవి కావు, అయితే శాంతి, సంతోషము, శమము ఈమూడే అవశ్యకములు.

'20. మాంసమునకై దైవసృష్టిని చెరపకుము.

'21. మాంసభక్షణగాని సురాపానముగాని లేక నీసహచరులైన యితర ప్రాణిని నొప్పించినను బలహీనముగా జేసినను లేక తగ్గినను నీకు శ్రేయస్సాధన మెన్నటికి కాదు.' (Mat. VI. 9. 11.) దేవుడా, దినము నాకు రొట్టెనివ్వుమా. (Sthuke XVI. 15.) దేవునివద్ద రొట్టెతినువాడు భాగ్యశాలి.' అని అనేక ప్రమాణములు గలవు.

ఈ ప్రమాణమువల్ల మాంసభక్షణము నింద్యమని విశదమే.

ఇక శాస్త్రప్రమాణములను విచారించుదము.

మాంసమును తినుజంతువులు తమఆహారమును రాత్రిపూట సంపాదించుకొనును. గనుక రాత్రులయందు వాటికి దృష్టికలదు. మనిషి రాత్రిపూట నిద్రించవలసినట్లు ఏర్పడియుండుటచేత వాడు మాంసము తినవలసినదానిగా ఏర్పడినట్టులేదు. మాంసమును భక్షించుజంతువులు బాగానమల్చుటలేదు. మనిషి శాకములు తినుజంతువులవలె బాగాచమల్చును. మాంసభక్షకులు ఆహారమును నములుటలేదు. శాకభక్షకులవలె మనిషి తన ఆహారమును బాగానములును. మనిషి ధారాళముగా శాకభక్షకులవలెనుబోలి నీటినిత్రాగును. మాంసభక్షకులు నాలుకతో చప్పరించును. శాకములుతిను జంతువులవలె మనిషియొక్కయు నోటిలో మాంసభక్షకులకంటె యెక్కువగా ద్రవముండును.

అనేకశాస్త్రజ్ఞులు మనుష్యునియొక్క దేహమును శోధించి శాకధాన్య భక్షణమునకు యోగ్యమైనదిగా నిర్ణించియున్నారు. మనిషిదేహము గొప్పకోతులదేహమును పోలియుండును. కోతులు కాయలు పండ్లు ధాన్యమును తినును. వాటికి మాంసము తిన నేర్పించిన వాటిదేహము దళమై అనారోగ్యకారిగా నుండును.

2. మాంసములో దేహమునకు పుష్టినిచ్చు చక్కెర మొదలగు పదార్థములు లేవు. శాకభక్షములలో లేని పదార్థములుకూడ మాంసములో లేవు. ధాన్యములలోను బేడలలోను కాయలు పండ్లలోను అన్నిదేశములకు అన్నిస్థితులవారికి తగునైన ఆహారము సిద్ధముగానున్నది. కూరగాయలను, మాంసమును శోధించిచూచిన ఒకటేవిధముగా నుండునట్లు లీబిగ్ అను శాస్త్రజ్ఞుడు నిర్ణయించియున్నాడు.

3. ఎంతిజాగ్రత తీసుకొన్నను, పశువులమాంసము శుద్ధిగానుండుటలేదు. ప్రతి నిమిషము శ్వాసనిశ్వాసములు, చెరుపులు, మానవులు, దేహమున జరుగుచుండుటవలన మాంసఖండలలోను రక్తమార్గములలోను అశుద్ధమైన పదార్థములుసిద్ధమై మాంసముకూడ అశుద్ధముగనుండును. అదిగాక కటికఅంగడికిగాను ఏర్పడియున్న పశువులు

సాధారణముగా వ్యాధిగ్రస్తముగా నుండును. అట్టి వ్యాధిగలజంతువుల మాంసము తినిన, ఏదువిధములైన పశువులరోగములు మనిషికికూడవచ్చునని శాస్త్రజ్ఞులు చెప్పు చున్నారు. అదిగాక త్రాగుబోతులకు మాంసభక్షణమువల్ల త్రాగుబోతుతనము విశేష మగుచున్నదనియు, శాకభక్షణమువల్ల అది తక్కువగుచున్నదనియు ఘనమైనవైద్యులు సెలవిచ్చియున్నారు. శాకభక్షణమువలన విషయవైరాగ్య మెక్కువగ గలిగి సత్వ గుణము హెచ్చి శాంతస్థైర్యాది సద్గుణములకు అనుకూలముగ నుండును. స్థూలదేహ ములు పరిశుద్ధమగుటవలన, మనోబుద్ధుల వ్యాపారముకూడ నిర్మలముగా ప్రసరించును. మరియు మాంసమందు ముక్కాలుభాగము నీళ్లుకలిసియుండును. గోధుమలు మొదలగు ధాన్యములందు ఎనిమిదింట నొకభాగముమాత్రము నీళ్లుండును. గనుక ధాన్యము కంటె మూడు నాలుగుపాళ్లు వెలఅధికముగా నుండును. ఇట్టి సుబారావెలగల పదార్థ మును ప్రయోజనము లేకున్నను, ఈ నవనాగరిక జనులు ఏల ఉపయోగింతురో తెలి యదు. ఫోర్బ్స్ అను శాస్త్రజ్ఞుడు మాంసముతిను ఇంగ్లీషువారికంటె గంజిత్రాగు స్కాచ్ వారును, వుర్లగడ్డ రొట్టెను ఐరిషువారు, తూనికలోను పొడువులోను బల ములోను అధికులని చూపించియున్నాడు. లాంబుఅనెడు శాస్త్రజ్ఞుడుకూడ జనులలోని భేదము ఆహారభేదమువల్ల కలిగినదని చెప్పియున్నాడు. లోకమున నెగడిన మహానుభా వులలో అనేకులు శాకభక్షకులు కానేయున్నారు. వారెవరన: కపిలుడు, కాణా దుడు, గౌతముడు, పతంజలి, వ్యాసుడుపాణిని, గ్రీసుదేశములోని పైతాగరస్, ప్లేటో సెనికా, ప్లుటార్క్, ఇటలిదేశములోని జూలియన్, గసండి, ఇంగ్లాండుదేశములోని న్యూటన్, మిల్టన్, తామ్సన్, ఫ్రాంసుదేశములోని, రుస్సో, వాల్టేర్, జర్మనీయదేశములోని, స్కోపన్‌హేర్, మనదేశములోనుండు, దయానందుడు, గురు దత్తుగోకేల్, పరంజిపి వీండ్లందరు శాకభక్షకులే. మనరామలక్ష్మణులు, భీష్మకృష్ణులు కూడ శాకభక్షణమువల్ల కలిగిన బలవంతులేకదా? శాకభక్షకులు దీర్ఘాయురారోగ్య ముల సంపాదించి జీవించుచుండ జీవహత్యచేసి తమకడుపులను నింపుకొనుట చాలా విచిత్రముగా నున్నది. ఇదిగాక అనేక విద్వాంసులు, వైద్యులు, తత్వవేత్తలు మాంస భక్షణము కేవలనింద్యమని చెప్పియున్నారు. అదియుగాక తమక్షణికతృప్తికై తమ వలె ప్రాణముతో సంచరించు ప్రాణులను హింసించుటవల్ల నెట్టిశ్రేయస్సు, ఆనం దము, తృప్తికలుగుచున్నదో నిదానించి చూడకుండెడు మనిషి పశువా మనిషియా మీరే యోచింపతగినవిషయముగా నున్నది. ఈ జీవహింసమానిన జంతువులవల్ల ఎన్ని

విధ ప్రయోజనములను మనము పొందవచ్చునో నిలిచియోచించుము. ఈ మహాఘోర మైన కార్యములు నివర్తించిన కాని జనులు పశువులౌదురేగాని దేవతలెన్నటికిగారు. ఆదేశమెన్నటికి ముందుకురాదు రాదు. గుణములు కార్యములు సరియైన బ్రాహ్మణత్వ మెంచుకు. బ్రహ్మత్వమే సిద్ధమగునుకదా! కావున సద్గుణసంపన్నులుకాండి! వృథా మాటలేల.

## మాభక్తవిజయము.

### ౧. ఔజనయదాసు.

కృష్ణాజిల్లాలో గూడూరుఅను పల్లెయందు ఒక మర్యాదస్థులగు కుటుంబమున ఔజనయదాసను మహానుభావుడు 1882-వ సంవత్సరమున పుట్టెను. అతడు, తొమ్మిది సంవత్సరములవయస్సున, తనసహోదరితోకూడ పుల్లేరుఅనునదికి వెళ్లి, ఆమెనదిలో స్నానముచేయుచుండ, నతడు నీటిలోకిరాళ్లువేయుచు నానందించుచుండెను. అప్పు డతడు, ఆనదియొక్క అవతలిగడ్డన, ఒకదివ్యమైన జ్యోతివెలిగినది కనుగొనెను. వెంటనేఆజ్యోతియదృశ్యమై కొంతసేపటికి, ఆసప్తఋషులదర్శన మతనికికలి గెను. అప్పుడు మరలఆజ్యోతిదృశ్యముకాగా, ఋషులు ఇదియె పరమాత్మఇదియె అంతర్జ్యోతియని నుడివినట్లు అతడువినెను. ఋషులనుజ్యోతిని అతడుధ్యానించుచుండ, కొంతసేపటికి ఋషుల్నుజ్యోతి అదృశ్యములాయెను. తర్వాత అతడు రెండుఘంటలకు సమాధినుంచి బహిర్ముఖుడై సంపూర్తిగా మారినవాడాయెను. అప్పటినుంచి, లౌకిక వాసనలయందు కోరికలేక, పుణ్యశ్రవణములందాసక్తిగలవాడై ఇతరులనుకూడ బోధించుచుండెను. అతడుతర్వాత ఏకాంతవాసియగుటకు ప్రయత్నించుచుండ, నతని తలిదండ్రులతనినినూరడించి తనజోలికిరాకుండునట్లు చేసుకొని, వారి యిష్టప్రకారము వారియింటిలోనే యున్నవాడు. దేవుడొకడున్నాడనియు, అతడు సర్వాంతర్యామి, సర్వజ్ఞుడు, సర్వశక్తిగలవాడు, దేవునికి మానవకోటియంతయు భేదములులేక సమాన మనియు, పశుయజ్ఞములు అవశ్యములేదనియు, శ్రద్ధాభక్తిసమన్వితభజనవల్లనే ముక్తినిసంపాదింపవచ్చునని అతని బోధయొక్క సారాంశము. అతనికిలోకులకు మేలుచేయవలెనని ఉద్దేశముకలదు. అతనిప్రఖ్యాతివ్యాపించ ప్రారంభించినది. అతని

మాహాత్మ్యము బయటకూడ కొంతకనుపడుచున్నది. అతడనేకరోగములను వాసిచేయుచున్నాడు. అనేకబ్రహ్మపిశాచము లతనిచూచినవెంటనే పారిపోవుచున్నవి. ఇట్టివాడైనను కేవలనమ్రుడై కావలసినవారికి సహాయపరుడుగా నున్నాడు. వారమునకొకతూరి సాధారణముగా మంగళవారమునాడు భజనయు, ప్రజ్వలించు అగ్నియందు కాల్పబడక నాట్యముకూడాచేయునట. ప్రకృతకాలమునందు ప్రత్యక్షవాదులట్టి మహానుభావుల దర్శనముచేసుకొనిన లోకము బాగుపడునని తలచుచున్నాము. ఇట్టిపురుషులేక దాపూర్వజ్ఞానమార్గమును వెలిగించుదీపములనదగు. వీరిసుజన్మము లోకపావనము సలుపుగాక.

## ప్రకృతిసౌందర్యములు.

చిత్రంవట తరోర్మూలే వృద్ధశ్శిష్యాగురుర్యువా
గురోస్తు మౌనం వ్యాఖ్యానంశిష్యాస్తు చ్ఛిన్నసంశయాః.

శ్రీమహాలక్ష్మి తన పెనిమిటియగు విష్ణుమూర్తియందు మిక్కిలి యనుకూలమున వర్తించును. స్వామిదాక్షిణ్యమునకు ననుమతించి సవతియగు భూదేవినిఁ బ్రియంబున నలంకరించును. ఆ శృంగారములనుప్పొంగి రంగనాథుఁడందందు దృష్టినిలిపి చూచుచుండును. చూచుచు నిలిచియుండును. దీనిని విస్తరించి కొన్నిమాటలు చెప్పెదను.

గొప్పవనములందు స్నానమాడినను, పెద్దచెఱువులచెంత విహరించినను, జల్లనినీడ తోఁటలలో నివసించినను, సముద్రమును వేడుకగాఁ జూడఁబోయినను మనస్సునకు నానందమును నాహ్లాదమును గలుగుచున్నది. ఇవియే ప్రకృతిసౌందర్యములు. ఇవియే మంగళదేవతభూదేవి యంగముల సింగారించు నగలు. ఈ ప్రకృతిసౌందర్యముల వలన గలుగు నానందము నిపుడు ప్రసంగించెదను.

షడ్విద్యలకు నుద్దేశము దుఃఖనివారణము, దుఃఖమును బోఁగొట్టుటయును, సౌఖ్యాన్వేషణమును, సంతోషమును వెదకుటయును. ఈ సౌఖ్యము సాధారణముగ లోకమున నపేక్షించు సౌఖ్యముమాత్రము కాదు. ఇహసౌఖ్యము త్వరలోనశించును. పరసౌఖ్యము, చిరసౌఖ్యము, శాశ్వతసౌఖ్యము, మోక్షసౌఖ్యము, దాని నేల వెదకవలయును. దానివలన మనకు నేమిలాభము.

హంసఃపద్మవనం సమిచ్ఛతియథా నీలాంబుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చంద్రం చకోరస్తథా

చేతోవాంఛతి మామకం పశుపతే చిన్మార్గమృగ్యం విభో
గౌరీనాథ భవత్పదాబ్జయుగళిం కైవల్య సౌఖ్యప్రదమ్.

మ. కలహంసంబు పరోజపీవనము కోకంబంబు జాతాప్తు శ్యా
మలజీమూతము చాతకంబు శశిబింబంబుగా జకోరంబు రం
జిలనిచ్చల్ దమిఁ గోరునెట్టులటులం జిన్మార్గమృగ్యంబు భ
ర్గలసత్పాదముఁ గోరుఁజిత్తము సదాకైవల్య సౌఖ్యాప్తికై.

లాభము నుద్దేశించి హంస తామరతూఁడులను జాతకము వాననీటిని, కోకము సూర్యునిఁ, చకోరము చంద్రుని నపేక్షించునట్లు నేనును మోక్షసౌఖ్యము నపేక్షించుచున్నాను. లాభము నుద్దేశించి ప్రియమును, ప్రియమునుద్దేశించి యానందమును గలుగును. ఈశ్వరునికి సచ్చిదానందములు మూఁడుగుణములు. ఆ మూఁడును జీవునికి లక్షణములు లక్ష్యములును నగును. కావున నానందము గలుగుటకు ప్రియమును ప్రియముగలుగుటకు లాభమును గారణములు. ప్రకృతిసౌందర్యములను జూచునప్పుడు లాభమును ప్రియమును నానందమును గలుగుచున్నది.

జీవునికి జవశక్తి మహాప్రియము. దానివలన, దానిలాభమున నానందమును పొందును. దాని నష్టమున దుఃఖించును. ఒక నిదర్శనము చూపెదను. పైరును జూడుఁడు. కాలువలోని జవశక్తి నీటిరూపముగాఁ బైరునుజేరినపుడు మొలకలు తుఱంగలించుచున్నవి. మడుల నీళ్లను జవశక్తిని వడియఁగట్టి సూర్యునియెండను నెండఁ బెట్టిన మొలకలు ఖేదపడి వలవల లాడుచుండును. మనుష్యునికిని జవశక్తి యెంత హెచ్చుచుండునో యంతసంతోషము, నెంతఁ దగ్గుచుండునో యంత వ్యసనమును గలుగును. ప్రకృతినుండి జవశక్తి సంపాదించి మనము సౌఖ్యపడుదుము. తనజీవశక్తిని మనకునిచ్చి ప్రకృతి పేదపడును. దానగుణ ద్రవ్యనష్టము వచ్చినను సత్పురుషుఁడు సంతోషించునట్లు, ప్రకృతియను శక్తియునియు, శ్రీయనియు, మాయయనియుఁ బేర్కొనఁబడు భాగ్యలక్ష్మి జవశక్తిని నెల్లప్పుడు దానముఁజేయుచు శాశ్వతసత్రయాగము సలుపుచున్నది. ఇట్లు మాయాదేవి దానముచేయు జవశక్తివలన నన్నమయ ప్రాణమయ మనోమయ, విజ్ఞానమయానందమయ కోశములకు లాభముగలిగి యవియయినను వృద్ధినగుచుండును. కొన్నియెడల నవిద్య యగుమాయయే విద్యాదానమున్ను జేయును.

దీనికిఁ గొన్ని నిదర్శనములను జూపుచున్నాను.

కన్నులెత్తి యున్నతపర్వతములఁ జూడుఁడు. వానిమీఁద మనోగమనము చేయుదము. వేడుకగాఁబోయి చూచి మఱలవత్తుమురండు. అచటనుండి దిన్నెలవలె నుండు సమభూములఁ జూచితిరా. ఆ సమభూములనుండి పుట్టి కంటికిఁ గనబడక ప్రవహించుకొండ వాగులును గళగళమని పాడుపాటలవినుఁడు. ఆ యేఱుల తేమచే మొలకెత్తి పెద్దలై పెఱిగి యొకటితో నొకటి పెనఁగి మృదువులగు తలిరులతో నలరు తీఁగెలఁ జూడుఁడు. అవి యాతీఁగలు వాగులనీరుద్రాగి మని నెనరుంచి ప్రత్యుపకారముఁ జేయుచున్నవి. ఖరకరుఁడగు సూర్యుఁడు తనకరములగు నెండచేత వాగులను దాఁకవచ్చిన రాకుమని యడ్డగించి తమయాకులను బాఁకులతో నఱకుచున్నవి. ఆలతలు పండించు పండ్లను దిని శుకపికశారికాది విహంగములీతీవల యీవియింత యొప్పునేయని కూయుచున్నవి. ఈవల్లరులింతటి దానపరులేయని కొనియాడుచున్నవి. వీని నన్నిటిఁ బర్వతములఁ జూచినప్పుడెవ్వరి మనస్సులు గఱుగవు. ఎవ్వరి డెందములానందకందళితములు గాక యుండును.

ఇంతేగాదు. బుద్ధినిఁ బ్రవేశింపఁజేసి పర్వతములు మనకుఁ బెట్టు పర్వములఁ జర్వణము చేయుఁడు. కడుపునిండుగఁ గ్రోలుఁడు. మనస్సునిండఁగ నారగింపుఁడు. మనరోగములఁ దొలఁగింప, మనవ్యాధులఁ జికిత్సచేయుటకు మందులనిచ్చును. ఆరోగ్యమార్జింప నువకమండలమునకుఁ గుత్తాలమునకుఁ దెంగాణికిఁబోయి యామలలందు నుందుము. ఆకాశమునఁ దిరుగులాడు గాడుపును గొండలడ్డగించి దానిలోని సారాంశముల (Nitrogen) గ్రహించి గంధరూపమున మంటిలో దాఁచిపెట్టును. అమన్నుమాఁగి యెరువగును. ఆయెరువును బయిరులకుఁబంపఁ గొండలు వర్షముఁగురిపించును. అది యెట్లనిన, సముద్రములోని యావిరిని దోఁచుకొని మేఘములాకాశమునఁ బరిగెత్తు దుష్టసంహారుఁడు పర్వతరాజు వానిని నడ్డగించి దొంగసొత్తును నీటినిఁ గ్రక్కఁ జేయును. మేఘములవాంతియే వాన. వాననీళ్లతోఁ గొండలలోని యెరువుమన్ను వండుగాఁగలిసి నదీమార్గముల నేలకువచ్చి మళ్లకు నెరువగును. ఆయెరువున్ను జీర్ణముచేసికొని పైరులు పెఱుగును. లోకులకును బంటలు పండును.

ఇట్లు కొంచకొంచము మన్ను కఱఁగి నేలఁగలయుచుండఁగాఁ దనస్థూలశరీరము తగ్గును. వాయువులను మేఘములను నడ్డగించుచుఁ దనస్థూలశరీరమునకుఁ బ్రయాసముఁ గలిగించికొనును. అయినను బ్రజలసౌఖ్యము నిమిత్త మిట్లుచేయుచున్నాఁడు. గిరిరాజునకు మమకారమును దనమేలేచూడవలయునను కామమనస్సునులేదు. శిబియనుచక్రవర్తి

తనదేహమాంసమును డేఁగకిచ్చినట్లు శైలపతియుఁ దనయున్నతను స్థూలశరీరమును బసువుగా నాహుతియిచ్చి యెల్లకాలమును యజ్ఞమునకు దీక్షవహించి పరమేష్ఠి సృష్టికిఁ దోడగుచున్నాఁడు. ప్రజాపతి ప్రజలకు మేలుచేయుచున్నాడు.

ఇఁక నదీదేవతను ధ్యానింపనగు. ఆపావనాంగన మంగళాకారమును శృంగారగుణాలంకారములను బ్రసంగింప నాకుఁ దరముకాదు. నాచెప్పునది యుపమానములుగా నుండినను నిజమేయగును గావున శ్రద్ధతో వినవలయును.

కన్నతల్లి పిల్లను దలఁచినంతటనే తనచనుఁగవ చేఁపి పాలు లోపలనిలువక యూటి కాఱిచేరి పాలుక్రైవడి సకలలోకజనయిత్రి ధరిత్రివాత్సల్యమునఁ బ్రజల యోగక్షేమము లరయ నపేక్షించినపుడు తన స్తనంబులఁబోని పర్వతంబులనుండి యుబ్బి, యూరి కణకణములుగా వెలువడి యూటలై, బుగ్గలై, సత్వసారమునగు నీరములు వెల్లువలుగా నేఱుల వెంబడి పాఱి, లోకములకుఁ దియ్యనిజీవితములను మనువృత్తులను జేయును. ఉపమానమును మాఱ్చిచెప్పెదను. నదిని స్త్రీరూపముఁగా వర్ణించెదను.

చంటిపాప చందమునఁ గొండలదు సెలయేళ్లు మొట్టమొదట నొకచోట బైటఁబడుచు నొకచోటఁ జాటున దాఁగుచుఁ దన్నువెదకవచ్చినవారితో దాఁగిలిమూఁతలాడుచుండును. పదంపడి సోదరులను సజాతీయలను జేరి సాహసములకు సమకట్టి పర్వతవనవిహారముల సల్పును. ఆతటినీబాల బాలికాకేళీలోలయై మంజులమంజీరనాదవినోదయో యనఁగఁ దడఁబడి, నుమికి, సందులనెమకి, దూఱి, పాఱి, త్రోవలనడ్డగించి, తోఁటలముద్దులాడి, పెఱిగి మురిపము మాపును. అనుంగుంగన్నియ కన్నవారివిడిచి, కైఁగొన్నవానికడకుఁ బోవునపుడు పెక్కుమక్కువ వస్తువులఁ గంతగాఁ గొనివచ్చుమచ్చిక ముచ్చటించుచు నదీవధూటి గిరిదగులనుండు వండయును సారవస్తువులం దెచ్చును. ఆపెండ్లికూఁతురి గుణములెట్టివి. కనుఁగొనఁదగు. తనప్రవేశించిన ప్రదేశములలో నిండుగ నేలలు పండవలయునను నాదరమున నడవులలో నోములునోచి వరప్రసాదములఁ దెచ్చును. నదీమాతృకలగు పొలములకు క్షీరములవంబోలు నీరముల భాగించిపెట్టును. అట్లు పంచిపెట్టి పెంచిన పయిరులు కొనసాఁగ జనులకు సాఁగుఁబడియగును. సుశీలయగు నాబాలనమ్రతగలది. వినయముగానుండు నది. దానిపేరే నిమ్నగ. తటినీలలితాంగి నదియెను మేదినిని మించదు. దానికి నణఁగియే ప్రవర్తించును. బ్రవహించును. ఆకన్యకదర్శనము శుభశకునము. ప్రాతఃకాలమునఁ దనుమ్రొక్కి యెదురు వెంగముగాఁగ్రుంకు వారికి బహిరంతశ్శుద్ధులు చేయును.

శ్రీరస్తు.

# ముకుందమాలాస్తోత్రము.

## పీఠిక.

సంస్కృతమున స్తోత్రగ్రంథములు మెండుగానుండియు వానియందనేకములు తెనిఁగింపఁబడక యున్నవి. ఇట్లు గావింపకుండుటకుఁ గారణముల నరయఁదగును.

స్తవ్యకావ్యములకుఁ బొసఁగియుండు పదగుంఫనమును, నర్థగౌరవమును, నర్థశబ్దాలంకారమండిత వాక్యగమకమును సంస్కృతమునఁ గుదురునట్లు పెఱనుడువుల నిముడవు. వెండియు మంత్రశక్తికోవిదులును, యోగులును నగు మహనీయులు తా మొనఁగూర్చు భగవన్నామసంకీర్తనములందు స్వరాక్షరవిన్యాస క్రమములలో మహామహిమలఁ బొందుపఱచి యుందురు. వేఱుపలుకులకవియలవిపడవు. మఱియును గొలదికాలము క్రిందటివఱకు సంస్కృతభాషాజ్ఞానమొకించుకేనియు నెల్లవిద్యార్థులకును బ్రాప్తమయి యుండినకతన సులభపదకలితములును, శ్రావ్యశబ్దాలంకార లలితములును నగుస్తుతిపాఠములంతట నాదరణీయములగు చుండెను. ఈ మూఁడుకారణములఁబట్టి వానిఁ దెనిఁగింపకుండిరని తోఁచెడి.

ఇప్పుడు సంస్కృతజ్ఞానము తగ్గుచున్నది. అర్థమెఱుఁగక శ్లోకముల నుచ్చరించిన నేమిఫలమని సంశయమును నెల్లయెడలఁ బరగుచున్నది. అట్లుకాన నేను గొన్నిటిఁ దెనిఁగించఁబూనితిని. తెనిఁగించి యర్థముఁ దెలిపిన మాతృకగ్రంథమును జదివి గీతము చేయ సమకట్టిఁ గుతూహలము పొడముననియు, దాన నామహిమలలవడు ననియు నా యభిప్రాయము.

ఈ ముకుందమాలా స్తోత్రమందును, పైనసూచించినట్లు, శ్రుతిస్మృతి పురాణముల నుండు నంశములు మెండుగా నున్నవి. వానిని దెనుఁగున వ్రాయుట యుక్తముఁగాదు సాధ్యముఁగాదు. కావున మూలశ్లోకములందలి పదములనే నాశక్తికొలది తెలుఁగు పద్యములఁ బ్రయోగించితిని.

అల్పజ్ఞుండను, గొండికవాఁడను. నేను వ్రాసినపద్యములందుఁ దప్పులు తామర తంపరయట్లు పెనఁగియుండును. లోకులకు నుపయుక్తముగ రచియించితినని పండితులు నన్ను మన్నించి తప్పులుదిద్ది యీపొత్తమును సార్థకముగా వింతురుగాక యని వినయమున వేఁడెదను.

తంజావూరు,
4-11-1908.

విండ్లచెరువు-గోపాలయ్య.

శ్రీరామజయం.

# ముకుందమాలాస్తోత్రము.

శ్లో. ఘుష్యతే యస్యనగరే రంగయాత్రా దినేదినే
తమహం శిరసావందే రాజానం కులశేఖరమ్.

కం. శ్రీరంగ యాత్రఘోషల, నారతమును వీటజెలఁగ నగరేలను నే
భూరమణుఁడు కులశేఖరుఁ, డారాజన్యునిఁ దలంతు హర్యంశభవున్.

శ్లో. శ్రీవల్లభేతి వరదేతి దయాపరేతి భక్తప్రియేతి భవలుంఠన కోవిదేతి
నాథేతి నాగశయనేతి జగన్నివాసే త్యాలాపనం ప్రతిపదం కురుమే ముకుంద.

సీ. శ్రీరమామనోహరా హరీ దయాపరా త్త సం
సారహరవిశారదుండ స్వామి నాగశయన శ్రీ
వారిజాక్ష భక్తవత్స వరద భువనవాస యం
చే రహిన్ ముకుంద పిలువ నిమ్ము ప్రతి పదమ్మునన్. 1

శ్లో. జయతుజయతు దేవో దేవకీనందనోయం
జయతుజయతు కృష్ణో వృష్ణివంశప్రదీపః
జయతుజయతు మేఘశ్యామలః కోమలాంగో
జయతుజయతు పృధ్వీభారనాశో ముకుందః.

మా. జయజయ యదువంశాబ్జా యశోదాతనూజా
జయజయ పరమేశా శౌరి భూభారనాశా
జయజయ గుణధామా శ్యామలాంగ రామా
జయజయ యరవిందాక్షా మురారీ ముకుందా. 2

శ్లో॥ ముకుందమూర్ధ్నా ప్రణిపత్యయాచే భవంతమేకాంత మియంతమర్థం
అవిస్మృతి స్త్వచ్చరణారవిందే భవేభవే మేస్తు భవత్ప్రసాదాత్.

సీ॥ భూతలమును నెమ్మిగమ్ము పొందఁ మ్రొక్కి యోజగ
జ్జ్యోతి నిన్ను నేకతమున నొక్క వరము వేఁడెదన్

పరబ్రహ్మణేనమః

# సాధనచతుష్టయసంపత్తి.



## ఎట్లుజ్ఞానికావచ్చును?

## కర్మయోగము-చిత్తశుద్ధి.

ప్రపంచసృష్టియు నాసృష్టిక్రమమును ప్రకృతిసంబంధమగు సమస్తము నెట్లు కలిగినదియు రెండుసంవత్సరములకుమున్ను నేనుపన్యసించితిఁగదా. మనుష్యదేహాంతర్గతమగు జీవుని వికాసమందుటయు నాత్మయొక్కొక్కకోశముతోడ బ్రపంచానుభవముఁబొంది దేహములఁగ్రమంబుగ లోఁబఱచికొనుచు తనజన్మస్థానమగు బ్రహ్మములో నైక్యభావంబుఁబొంద మార్గమెల్లప్పుడు వెదకుచుండుటయు వక్కాణించితి.

అయినను, లోకమున మనుజులు జీవనంబునకై పాటుపడుచు నస్థిరమగు లోకవ్యాపారములయందు మునిఁగి యున్నవారు. పరమేశ్వరుని మాటిమాటికి మఱచిపోవుచున్నారు. పలుదెఱఁగులగు నిహలోకవృత్తులంగఁ దమకర్మచే నవశులై ప్రవేశించుచున్నవారు. ఇట్టివారికి నురవగాహమగు నిట్టివి యములవలన ఫలమేమి? ఇట్టియుపదేశము నరులనెట్లు సత్ప్రవర్తనమునకుఁదెచ్చు? ఈ యుపదేశ మెట్టినడతచే నరునకు స్వానుభవమునకువచ్చు? కుటుంబభారమును స్వదేశరక్షాభారమును ప్రపంచ వ్యవహారము లనేకములును తన్నుచుట్టుకొని యున్న మనుజుఁడు బ్రహ్మముఁజేరఁ బ్రయత్నించుచు బ్రహ్మమును జేర్చుమార్గమునఁ గొంతవట్టు నడవ నేవిధముగ సాధ్యమగునో దాని సూచించెద. మీలోనొక్కొక్కఁడు నీజన్మమునందె తానిప్పుడు చెందియుండు పదవి నుండి తానుపొందవలసిన స్థానమును దానిఁజేర్చుమార్గ మిదియనియు మీకుఁదెలియునట్లు నిరూపించెద. ఆమార్గమన్ననో యిచ్చట నీజన్మమునందె కుటుంబభరములోనగు లోకవ్యవహారప్రవృత్తియందు ప్రారంభించి మనస్సునకందరానిచోటఁ జేరుచున్నది. అది పునరావృత్తిరహితమై శాశ్వతమగు స్వస్థానమునకు మనుజుని తుదకుఁ గొని పోవును. ఇది సుమాయీ యుపన్యాసముల నుద్దేశ్యము. దీని నేసుమ్ము మిమ్ముగమనింప వేడెద. ఈ యంశము చక్కఁగా తెలియుటకొఱకు ప్రపంచప్రవృద్ధిమార్గమును దాని

ప్రయోజనమును గొంతవిచారింతము. అట్టివిచారము బహుస్వల్పమైనను సమస్తప్రపంచ ప్రవృత్తిమార్గమును బోధించుటవలన మనమునడచుమార్గమున నొక్కొక్క యడుగునకును బ్రయోజనము మనమెఱుఁగఁగలము. ఒక్కపదార్థమే బహుపదార్థములయ్యెనని స్పష్టమగుచున్నది. ఆదియందు దంధకారమధ్యమున ననేకములయ్యెదనను నాదంబు పుట్టె. ఆబహుత్వంబే బ్రహ్మాండమును నందలి సమస్తజీవకోటులును సృష్టియగుట సుమ్ము. అద్వితీయుంబగు నీశ్వరునియిచ్ఛయే సృష్టికిగారణము. ఆయిచ్ఛయే బ్రహ్మాండమునకెల్ల బీజమనఁదగు. ఇట్టి బ్రహ్మాండారంభమును నాదియందలి యేకత్వమువలన బహుత్వముకలుగుటయు మనమెఱిగినప్పుడు వ్యక్తప్రపంచమునన్నియు సంపూర్ణము కాదనియు నేకారణమున ప్రపంచముద్భవిల్లెనో దానిచేనిది బ్రహ్మమునకంటె కొఱతపడినదనియు దాననే యిది యసంపూర్ణమనియు మనకు స్పష్టమగును. వేర్వేరగుజీవపదార్థము లనేకములుండుటకు కారణము మనకిప్పుడు తెలియుచున్నదిగదా. ఇట్టి యనేకత్వమే వ్యక్తప్రపంచ సంపూర్ణతసుమ్ము. ఒకటికంటె నధికమగునేని సూర్యునివలె నాయొకపదార్థమే సమస్తమునఁ దనకిరణములఁ బ్రసరింపఁజేయు ననంతములగు భిన్నపదార్థము లుండవలయుఁగదా. ఈ కిరణసముదయంబుననే ప్రపంచవికాస పరిపూర్ణత వర్తించు. ప్రపంచమందలి పదార్థములు పలుదెఱంగుల లెక్కకుమిక్కుటంబులుగ విచిత్రంబులుగఁ బరిణమింపఁ బరిణమింప నీప్రపంచము తనయుత్పత్తిస్థానమగు నీశ్వరుని గొంతఁగొంతఁ దోఁపింపఁజాలు.

జీవవికాసమునకు బ్రథమప్రయత్న మనేక భిన్నపదార్థకల్పనము. ఈ పదార్థములకెల్ల వ్యావహారికమునమాత్రమే భిన్నత్వముగాని పారమార్థికమున వీని యంతరాత్మయొక్కటియే. ఈ యభిప్రాయ మెఱిఁగినపుడు భిన్నపదార్థకల్పనంబునఁ బరమాత్మయుపాధియందు ప్రతిఫలించి జీవుఁడనఁ గొంత వ్యక్తమగునని మనమెఱుఁగుదుము. మఱియు నీప్రపంచసృష్టి యిట్టిఫలముఁ గోరియనియు నీ జీవకోటులు వికాసమందుట యిట్టిదానికనియు సమష్టిప్రపంచప్రవృత్తికి నిట్టిభిన్నత్వము ముఖ్యసాధన మగుటకుఁ గారణమిదియనియు స్పష్టమగుచున్నది. భిన్నజీవకోటులుగల ఈ వ్యక్తప్రపంచమందెల్ల నిపుడాత్మవికాసంబె మెల్లమెల్లనఁ జరుగుచున్నది. దీననిఁకరానున్న ప్రపంచమున నీశ్వరుఁడును దేవతలును మనువులును నట్టిప్రపంచమును సృష్టింపఁ బాలింప నడప శాసింపనేకులు మహాత్ములును గల్గుదురు. ఇట్టిదిసుమా బ్రహ్మాండములకు పరస్పరసంబంధము. మన్వంతరములకును బరస్పరసంబంధ మిట్టిదియే.

అతడు ఆలాగున నేయనుగ్రహించెను. తరువాత తల్లియు కొడుకును కృతార్థులయి స్వర్గమునకు బోయిరి. అనశల్లవనమే, ఇది ఇప్పుడు దీనిని విశాలాపురియందురు.

ఇట్లు విశ్వామిత్రుడు వినోదగోష్ఠిచే నా రాత్రి అక్కడ గడిపి, మరునాడు ఋషులతోగూడ మిథిలాపురినిగూర్చి పయనమాయెను. మిథిలాపట్టణము సమీపించి యచ్చటనున్న వన ప్రదేశంబు ఎవనిదిగానుండెనని విశ్వామిత్రుని రాముడడిగెను. ఇది పూర్వము గౌతమాశ్రమము. గౌతముడు పెక్కుసంవత్సరములు తపముసేసెను. ఒకవేళ గౌతముడింటలేకుండుటనెరింగి గౌతముని వేషంబుధరించి ఇంద్రుండు గౌతముని భార్యయైన యహల్యతోక్రీడించి బైపర్ణశాలనుంచి వెలువడుసమయమున గౌతముడు గనుగొని, నీవు జేయరానిపనిచేసితివి గనుక నీవృషణములు నిసిపడు గాకయని ఇంద్రునిశపించెను. వెనుక నహల్యజూచి నీవీయాశ్రమంబున బెక్కువేలేండ్లు వాయుభక్షణము సేయుచు నాహారంబువిడిచి తపంబుగావించుచు భస్మంబునందు పరుండి ప్రాణులకు గానుపింపనిదానవై యుండగలవు. ఎప్పుడు రాముడీ యాశ్రమంబునకు వచ్చునో యప్పుడు నీవు పరిశుద్ధురాలవయ్యెదవు. నీ రూపంబప్పుడుదాల్పగలవు అని శపించెను. తరువాత నా యాశ్రమంబువిడిచి హిమవత్పర్వతంబుజేరి తపంబుజేయుచుండెను. అంతట ఇంద్రుండు దనకు గలిగినయవమానంబును దేవతలతోజెప్పకొని నాకువృషణంబులు గలిగింపవలయునని ప్రార్థింప దేవతలందరునుగూడి పితృదేవతలయొద్దకువెళ్లి మీకుయాగమందు భాగార్థముగా గల్పకంబగు మేషముయొక్క వృషణముల నింద్రునకు కిచ్చివేయుమని ప్రార్థింప వారట్లుచేసిరి. అదిమొదలు పితృదేవతలు వృషణములులేని మేకలను హావిర్భాగములుగా భుజించెదరు.

ఈ యాశ్రమమునకువెళ్లి యహల్యకుశాపవిముక్తి జేయుము. అని విశ్వామిత్రుడు రామునకుజెప్ప రాముడహల్యయుండు ప్రదేశమునకువెళ్ల శాపమునుండివిముక్తియై రామునిసత్కరించి తన నిజస్వరూపమును బొందెను. అంతట గౌతముడు రామాగమనమువిని యచ్చటికివచ్చి యహల్యనుగూడి సుఖమై తపంబుజేయుచుండెను. తరువాత రామలక్ష్మణులు విశ్వామిత్రునిగూడి మిథిలానగరమునకు ప్రయాణము సాగించిరి.

వారు మిథిలాపట్టణము చేరగానె జనకమహారాజు వారిని దర్శించి సత్కారంబుసలుప విశ్వామిత్రుడు జనకునిప్రశ్నమీద రామలక్ష్మణుల వృత్తాంతంబంతయు అతనికి దెలిప యహల్యశాపవిమోచనకూడ ప్రస్తాపముచేయ నా సభయందుండిన గౌతమునికుమారుడైన శతానందుండు దానిని విని సంతోషించి రామలక్ష్మణులకు

విశ్వామిత్రుని సంసర్గభాగ్యంబు గొనియాడుచు పూర్వవృత్తాంతంబు నిట్లనివారికి విన్న వించెను. విశ్వామిత్రుడు పూర్వము ఒక మహారాజుగా నుండెను. ఒకనాడతడు సపరివారముతోగూడ వసిష్ఠుని యాశ్రమమునకువెళ్లి యతని బలాత్కారమున నాతిథ్యంబుగ్గైకొని యా యాశ్రమముననున్న కామధేనువు వసిష్ఠుని ఇచ్చానుసారము కావలసిన పదార్థములను సృష్టిచేయ విశ్వామిత్రుడు తృప్తిజెంది యా కామధేనువును దనకిమ్మని వసిష్ఠుని బ్రార్థించి యతడెన్నివేల గుఱ్ఱంబులు ఏనుగులు యెంతధనమిచ్చిన దాని నిచ్చుటకు నియ్యకొనమింజూచి కోసావేశపరవశుడై రాజులకుదగిన పదార్థము నీ యొద్దనుండుటెట్లని బలాత్కారముగ కామధేనువును బట్టుకొని వెళ్లుమని భటులకు నాజ్ఞాపింప నాభటులు దానిని బట్టుకొనిరి. అప్పుడు కామధేనువు వారిబంధమునుండి వదలించుకొని వసిష్ఠునిజేరి వన్నిట్లుపరులకు నొప్పగింప నీకు నేనేమి ద్రోహము చేసితి నని యడిగెను. అప్పుడుజరిగిన సమాచారంబుచెప్ప నదిదెలిసికొని వసిష్ఠుని యాజ్ఞానుసారమున, ననేక వేల సైన్యమును సృష్టిచేసి విశ్వామిత్రుని యోడించ నతడు

> నపదం క్షత్రియః శ్వాహు బ్రాహ్మణో బలవత్తరః
>
> బ్రంహ్మణబ్రహ్మబలం దివ్యం క్షత్రాత్తు బలవత్తరం.

అనగా క్షత్రియుని బలమల్పబలము బ్రాహ్మణుడు మిగుల బలవంతుడు. బ్రాహ్మణుని బలము క్షత్రియుని బలముకన్న శ్రేష్ఠంబు. బలిష్ఠంబని పెద్దలుచెప్పుదురు. గనుక వసిష్ఠునితో బోరాడజాలుచేసి ఈశ్వరునిగూర్చి తపంబుజేయ నారంభించెను. కొంతకాలమునకు నీశ్వరుడు ప్రత్యక్షమయిన విశ్వామిత్రుడుధనుర్వేదము నాకుదయచేయుమనియు, దేవదానవ మహాఋషిగంధర్వయక్ష, కిన్నర, రక్షస్సులయందే యే యస్త్రములు గలవో యన్నిటినినాయందు ప్రకాశించుగాక యనువరంబుబొంది మరల వసిష్ఠుని యొద్దకువచ్చి పోరాడ ప్రారంభించెను. అప్పుడు వసిష్ఠుడు దనబ్రహ్మదండముతో విశ్వామిత్రుని యస్త్రంబులన్నియు నిర్వీర్యముగా నొనర్ప విశ్వామిత్రుడుఖిన్నుడై, "ధిగ్బలంక్షత్రియబలం బ్రంహ్మ తేజోబలం బలం ఏకేనబ్రహ్మదండేన సర్వాస్త్రాణి హతానిమే" అనిచెప్పి బ్రాహ్మణ్యాతారకమైన తపమెద్దియో దానిని జేయ భార్యతో గూడ శరవతీనదీతీర మాశ్రమించి కఠినంబైన తపస్సునకారంభించెను. పిమ్మట విశ్వామిత్రునకు హవిష్యందుడు, మధుష్యందుడు, దృఢనేత్రుడు, మహారథుడను నలుగురు కుమారులుజనించిరి.

Continued from page 284. of 1908



## పదునొకొండవ యధ్యాయము.

## విశ్వరూపసందర్శన యోగము.

### అర్జునుని వాక్యము.

అధ్యాత్మమను పేరుగల యీ పరమరహస్యము నన్ననుగ్రహించిచెప్పితివి. దీనివల్ల నా మోహామువిడిచినది. కృష్ణా! భూతములయొక్క యుత్పత్తినాశములను నీయవ్యయమైన మాహాత్మ్యముగూడా నీవల్ల సవిస్తరముగా నాచేవినబడినది. పరమేశ్వరా! పురుషోత్తమా! నిన్ను నీవు తెలియజేసినవిధముననే, నీయుత్కృష్టమైన స్వరూపమును జూచుటకు గోరెదను. దానిని నేను జూడగలనని నీవుదలచితివేని, మహాప్రభో! యోగీశ్వరా! నీయవ్యయామైన స్వరూపమును నాకుప్రదర్శింపుము.

### శ్రీకృష్ణుల వాక్యము.

పార్థా! నూరువిధములై, వేలవిధములైన నానావర్ణాకృతులుగల నాదివ్యస్వరూపమును జూడుమా! ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినులను, మరుత్తులను గూడా యిదివరకుజూడని నానా యాశ్చర్యములను, భారతా! చూడుము. గుడాకేశా! ఇక్కడ నేడు నాదేహమున, నేకమైనిలుచున్న సకలచరాచర ప్రపంచమును, నీవుచూడగోరు నితరమును జూడుము. ఐతే ఈ నీకన్నులచేత నన్ను నీవు చూడనశక్తుడవు. దివ్యదృష్టి నీకిచ్చెదను. నా సర్వోత్కృష్టమైన యోగశక్తిని జూడుము.

### సంజయుని వాక్యము.

ధృతరాష్ట్రా! ఇట్లుపలికి మహాయోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు తనసర్వోత్కృష్టమైన స్వరూపమును నర్జునునకు జూపెను. అనేకముఖనేత్రములతో అనేకాద్భుత దర్శనములతో, అనేకదివ్యాభరణములతో, అనేకదివ్యాయుధములతో, దివ్యమాల్యాంబరములను ధరించి, దివ్యగంధానులేపనంబు గావించుకొని సర్వాశ్చర్యమై, యనంతమై, విశ్వతోముఖుడైన దేవుని నర్జునుడు జూచెను. సహస్రసూర్యప్రకాశ మేకకాలమున నాకసమున వెలుగ, నా మహాత్మునిదివ్యతేజము నదిబోలవచ్చును. అచ్చట బహుప్రకారములుగా విభజించబడియుండు సమస్తప్రపంచము దేవదేవుని శరీరమున నేకమైయుండునది అర్జునుడుజూచెను. అప్పుడర్జునుడు విస్మయావిష్టుడై పులకాంకితుడై, శ్రీకృష్ణునకు శిరసానమస్కరించి, చేతులుజోడ్చి, యిట్లుపలికెను.

## అర్జునుని వాక్యము.

దేవా! నీ దేహమున సమస్తదేవతలను, సమస్తభూత విశేషసంఘములను, కమలాసనాసీనుడైన బ్రహ్మను, సకలఋషులను, దేవతాసర్పములను జూచుచున్నాను. అనేకముఖములతో నేత్రములతో, బాహువులతో, ఉదరములతో, పరిమితిలేని యాకారముగలిగి, నిన్నెటను జూచుచున్నాను. విశ్వేశ్వరా! విశ్వరూపా! నీ యాదిమధ్యాంతములను నాకుగనబడలేదు. సూర్యాగ్నులవలె ప్రజ్వలించుచు, దేదీప్యమానమై, అపరిమితమై కిరీటములను గదాచక్రములనుధరించి యన్నిదిక్కుల దుస్సహామైన నీ తేజోమయమైన దివ్యస్వరూపమును జూచుచున్నాను. నీ వక్షరుడవు. జ్ఞాతవ్యమైన యుత్కృష్టుడవు. నీవు విశ్వమునకు నుత్కృష్టమైన నిధానము, నీ వవ్యయుడవు. శాశ్వతధర్మగోప్తుడవు, పురాణపురుషుడవని నేను తెలిసియుంటిని. ఆదిమధ్యాంతరహితుడవు, అనంతవీర్యుడవు, అనంతబాహుడవు, సూర్యచంద్రులను నేత్రములుగా గలవాడవు. ప్రజ్వలించు యజ్ఞాగ్నినేముఖముగా గలవాడవు. దాని తేజస్సు లోకములను దపింపజేయును. నీ యొకనిచేతనే భూమ్యాకాశములు అంతరాళము వ్యాపింప బడినది. మహాత్మా! నీ యద్భుతవ్యక్తి స్వరూపమునుజూచి త్రిలోకములు వ్యధపడుచున్నవి. నీయందు దేవసంఘములు శరణుజొచ్చుచున్నవి. కొందరు భయమంది అంజలిబద్ధులై నిన్నుగూర్చి స్వస్తిజెప్పి, మహర్షులు, సిద్ధులు, నిన్ననేకవిధములుగ స్తోత్రముజేయుదురు. రుద్రులు, వసువులు, సాధ్యులు, ఆదిత్యులు, విశ్వులు, అశ్వినులు, మరుత్తులు, పితృదేవతలు, గంధర్వ, యక్ష, సుర, సిద్ధసమూహములాశ్చర్యపరులై నిన్నుజూచుచున్నారు. అనేకముఖములు, నేత్రములుగలిగి, మహాబాహువులై, బహుబాహూరుపాదములను, బహూదరములను, బహుభయంకరములైన కోరలుగల నీ మహదాకారమును జూచి లోకములును నేనును భయపడుచున్నాము. దీప్తమై యనేకవర్ణములై తెరువబడిననోళ్లుగలిగి ప్రకాశించు విశాలనేత్రములుగలిగి నీవు ఆకాశమును స్పృశించుచున్నావు. కృష్ణా! నిన్నుజూచి నా యంతరాత్మవణకుచున్నది. ధృతియు, శాంతియు, వీడినవి. నీ తెరువబడిన నోరులయందుండు భయంకరములైన కోరలనుజూడ, కాలప్రళయాగ్ని సమానములైయున్నవి. నాకుదిక్కులు దెలియకున్నది. అభయములేకున్నది. జగన్నివాసా! దేవేశా! దయచేసి ప్రసన్నుడవుకమ్ము. ధృతరాష్ట్రపుత్రులు, భూపాలకరాజసమూహములు, భీష్మద్రోణులు, సూతపుత్రుడైన కర్ణుడు మన సేనలనుండు సకలయోధముఖ్యులు, భయంకర

ముళ్లై కోరలుగలిగి చూడభయము పాదించు నీ తెరువబడిన నోరులలోనికి రభసముగా దూరుచున్నారు. కొందరు నీ పండ్లమధ్యనుండు సందులలో జిక్కి వారితలలు చూర్ణమై పొడియగుచున్నవి. నదీప్రవాహములు తమజలములను సముద్రుని నొడిలోకిపడుచు రభసముగా దూరుభంగి నీ ప్రజ్వలించు నోరులలోనికి, ఈ వీరులు, లోకపాలకులు, నాతురముతో తమనుపడవైచుకొనుచున్నారు. మండుదీపమున నధికవేగముతో దలక్రిందుగా మిడతలుదూరి నశించునట్లు, వీరందరు నీ నోరులయందు నధికవేగముతో ప్రవేశించి నశించుచున్నారు. అగ్నిప్రక్కల సమస్తమునుమ్రింగుచు జ్వలించు నాలుకలతో సమస్తమునుమ్రింగుచు ప్రాణులను నాకుచున్నావు. నీ తేజము సమస్తజగత్తు నిండినది. కృష్ణా! నీప్రజ్వలించు భయంకరమైన తేజము, విశ్వమును, తపింపజేయుచున్నది. భయంకరస్వరూపియైన నీవెవరు? తెలియజేయుము. నీకు నమస్కారము. దేవవరా! దయచేసి ప్రసన్నుడవుకమ్ము. నీయాంతర్యము తెలియగోరుదును. నీప్రవృత్తిని తెలియజాలను.

## శ్రీకృష్ణులవాక్యము.

నేను లోకమున నెల్ల నశింపజేయుచు నిప్పుడు ఈభూలోకముననుండు మానవకోటిని సంహరింపవ్యక్తస్వరూపుడైన కాలపురుషుడు యుద్ధముజేయ నుద్యక్తులయిన యీవీరులలో నెవరును మరణము దప్పించుకొనలేరు. నీవొకడవే శేషించుదువు, గనుక లెమ్ము. నీవుకీర్తిని సంపాదించి, శత్రువులను జయించి, సమృద్ధరాజ్యమనుభవింపుము. వారదివరకె నాచేత సంహరింపబడినారు. సవ్యసాచి! నీవు కారణమాత్రుడుగా నుండుము. ద్రోణుడు, భీష్ముడు, కర్ణుడు, జయద్రథుడు, ఇచ్చటనుండు నింకా నితరవీరులు నాచేసంహరింపబడినారు. గనుక, వ్యథపడక యుద్ధముజేయుము. రణమున శత్రువుల జయించుదువు.

## సంజయునివాక్యము.

కేశవుని మాటలువిని అర్జునుడు కేల్మోగిచి, వణకుచు, నమస్కారము జేయుచు భయముచేత, గద్గదస్వరముతో నిట్లుపలికెను.

## అర్జునునివాక్యము.

హృషీకేశా! నిన్ను సమస్తలోకములు కీర్తనజేసి న్యాయముగా సంతోషించుచున్నవి. నీయందధికయనురాగము గలిగియున్నవి. రాక్షసులు భయపడి దిక్కులకు బారుచురు. సిద్ధగణములు నమస్కరించుచున్నారు. ఓమహాత్మా! వారితరవిధముగా

నెట్లు చేయుదురు. నీవాదికారణము. బ్రహ్మకంటె నెక్కువ యధికుడవు. అనంతుడవు, దేవేశుడవు. జగన్నివాసుడవు. అక్షరుడవు. సదసత్తువు. ఉత్కృష్టమైనతత్వస్వరూపుడవు ఆదిదేవుడవు. పురాణపురుషుడవు. సమస్తవిశ్వమునకు పరమనిధానమైనవాడవు. జ్ఞాత, జ్ఞేయస్వరూపుడవు. పరమధాముడవు. విశాలమైన నీరూపమునందు యీవిశ్వమంతయు వ్యాపించియున్నది. నీవు వాయువు, వరుణుడు, యముడు, అగ్ని, చంద్రుడు, తండ్రి, తాత, నీకు వేలకొలది నమస్కారములు. నీకు నమస్కారము, మరలమరల నమస్కారము. కృష్ణా! నీకుముందు నమస్కారము జేయుదును. వెనుకనమస్కారము జేయుదును. సమస్తప్రక్కల నమస్కారము జేయుదును. సర్వస్వరూపుడా! పరిమితిలేని పరాక్రమముతో నీవు సర్వమును ధరించియున్నావు. గనుక, నీవే సర్వస్వరూపుడవు. నిన్ను స్నేహితునిగా మాత్రము భావించి, తేలికగా కృష్ణా! యాదవా! మిత్రుడా! యనిపిలిచి, నీమహిమను దెలియక యజాగ్రతతో ప్రేమవల్ల పరిహసించుచు, నీకుమర్యాద చేసి, విహార, శయ్యాసన భోజనాదులయందును, స్నేహితులసముఖమునను ఏకాంతమునను, పాపరహితుడా! అప్రమేయుడా! నేను చేసిన యపరాధములను క్షమించుమా! లోకములకు, సమస్తచరాచరములకు దండ్రివి. గురువుకంటె నెక్కువ పూజార్హుడవు. నీకు సమానుడు లేడు. నిన్నెవరుమించుదురు. సర్వలోకములందు నీశక్తి అప్రతిహతమైనది. గనుక నీకు నేను సాష్టాంగముగా నమస్కరించెదను. నీవు ప్రసన్నుడవగుటకు బూజించెదను. నన్ననుగ్రహింపుమా? దండ్రి కొడుకుతో, మిత్రుడు సహచరునితో, ప్రియుడు ప్రియమైనదానితో నుండురీతి నీవునాతో సహింపుము. యితరులెవరు ముందుజూడనిదానిని నేనుజూచితిని. ఆనందభరితుడైతిని. ఐనను నామనస్సు భీతిచే వ్యాకులమైయున్నది. నీపూర్వరూపమును దేవేశా! నేనుజూడ అనుగ్రహించుము. ముందువలె, నీచేత చక్రము, గద, బూని కిరీటినైన నిన్నుజూడగోరి యున్నాను. సహస్రబాహో విశ్వమూర్తీ! చతుర్భుజములు గల నీయాకారమును మరల ధరింపుమా.

## శ్రీకృష్ణుల వాక్యము.

అర్జునా! ఆత్మయోగమువల్ల ప్రదర్శింపబడిన యీవిశ్వరూపమును నాయనుగ్రహామువల్ల జూచితివి. తేజోమయమై విశ్వవ్యాపియై, అనంతమై, యాదియైనదీనిని నీవు తప్ప నింకెవరెప్పుడెరుంగరు. యజ్ఞములు, వేదాధ్యయనము, దానము, క్రియలు, ఉగ్రతపస్సు, దీర్ఘవిచారము వీనివల్ల నీరూపదర్శనము నరునకు సాధ్యముకాదు.

# అపరవిద్య.

దైవసృష్టియందు అగ్నికథకొంచము విచారింతము. మొదటఅగ్ని మెరుపులలో నుండి అకస్మాత్తుగా ఎక్కడనో చెట్లనుకాల్చిన, దాని లోని అగ్నిని జనులు భద్రపరచి కాపాడుచువచ్చిరని తెలియవచ్చుచున్నది. ఒకయూరినుండి మరియొకయూరికి ప్రయాణమై పోవునప్పుడుకూడ ఆ అగ్నిని తీసుకొని పోవుచుండిరట. ఇట్లు కొంత కాలముజరిగిన వెనుక ఒకొకవూరిలో ఒక్కొకచోట అగ్నిచల్లారకుండ విశేషముగా ఉంచి కావలశినవారు తీసుకొనిపోయి వాడుకొనుచుండిరట. తర్వాత ప్రతియింటి యందును దానిని కేవలపావనముగా కాపాడుచుండిరి. తర్వాత అగ్ని ఆవశ్యకము ఎక్కువై దానిని కలిగించ ఉపాయములు జనులు వెదకసాగిరి. రెండుచెకముకిరాళ్లు కొట్టడమువల్లను, రాతిని ఉక్కుతో రాచడమువల్లను, రెండుమ్రాని తునకలను రాచడమువల్లను అగ్నిని కలుగచేయ తెలుసుకొనిరి. 14-వ శతాబ్దమున, నాగరికతకలవారు చెకముకిరాయిని, ఉక్కును, గంధకము అంటించిన పుల్లలను పెట్టెలలో పెట్టుకొని అగ్నిని సిద్ధము చేసుకొనుచుండిరి. చెకిముకిరాతిని ఉక్కుతో కొట్టడమువల్ల కలిగిన మిణుగురుతో దూదినో లేక బట్టనో వెలిగించి గంధకపుపుల్లను వెలిగించుకొనుచుండిరి. 17-వ శతాబ్దమున ఫాస్ఫరస్ అను పదార్థమును కనిపెట్టగానే, రెండు నల్లనికాకితములమధ్య దానిని ఉంచిరుద్దను ప్రారంభముచేయ దానివల్ల అగ్నికలిగి దానితో గంధకపు పుల్లలను వెలిగించి ఉపయోగించుకొనుచుండిరి. ఫాస్ఫరసును ఒక సీసాలో వుంచి దానిని కాగిన యినపకడ్డితో కలియపెట్టి సీసామూతమూసి అగ్నికావలశినప్పుడు గంధకపుపుల్లను సీసాలోఅద్ది అగ్నిని కొన్నాళ్లుతీసుకొనుచుండిరి. 1805-వ సంవత్సరమున, ఫ్రాన్సుదేశమున చాన్సెల్ అనువాడు మొదట అగ్గిపుల్లను చేయు విధమును కనిపెట్టెను. 1812-వ సంవత్సరమున జెర్మనిదేశమున దానిని మరియొకవిధముగా చేసిరి. మొదట గంధకము, పెట్లుప్పు, చక్కెర ఈ మూటిని ఉడికించి కట్టెపుల్లలకొనలను ఆపాకములో అద్దిరి. ఆ పుల్లలు మండుటకు గంధకరసాయనములో అద్దుచుండిరి. ఈ పద్ధతి చాలాప్రియముగా నుండుటవల్లను, ఈ వస్తువులను వెంటతీసుకొని పోవుటకష్టముగా నుండినందున జనులంతగా వాడుచుండలేదు. వ్యాపించలేదు.

అగ్గిపుల్ల.

దీనినుంచి యిప్పుడు వాడుకలో నుండు అగ్గిపుల్లలను 1832 సంవత్సరమున ఇంగ్లాండు దేశమున వరహాము అనువాడును జెర్మనీదేశమున కిమ్మిటర్ అనువాడును ఈ అగ్గిపుల్లలు చేయుటకని పెట్టిరి. హంగేరియవారు ఐరోనిలో అనువాడును, ఫ్రెంచివారు సౌరియా యనువాడు దీనిని కనిపెట్టినట్లు వాడుదురు. ఈ అగ్గిపుల్లవల్ల లోకమునకు ఎంతమేలు గలిగినదో మీరే యోచించుడు. ఫాస్ఫరస్సు అనువస్తువున పనిచేయు నప్పుడు జనులకు దవడపండ్లలో ఒకవిధమైన జాడ్యము కలుగుచుండెనట. వేరువిధమైన ఫాస్ఫరస్ కని పెట్టడమువల్ల ఆ వ్యాధిరాకుండ పనిచేయ అనుకూలమైనది. ఈ అగ్గిపుల్లలు యిప్పుడు 4 విధములుగా నున్నవి. 1 మనము సాధారణముగ గట్టిప్రదేశములందు గీయు కడ్డి పుల్లలు లూసిఫర్ 2. వెసూవియను, చుట్టలుత్రాగువారు గాలిలో అంటించుకొనునవి, 3. వెస్టాస్ కర్రపుల్లకు బదులుగా మైనపువత్తిపుల్ల, 4. సేఫ్టీ ఒకవిధమైన ప్రదేశమున రాచిననే వెలుగునది. వీటిపైకి మరిదేనిమీదను రాచుకొనుటవలన వెలుగను గనుక అపాయకరము. 4-వది అపాయములేనిది. ఈ అగ్గిపుల్లలు సీమనుండి వచ్చుచున్నవి. సంవత్సరమునకు అనేక కోట్లధనము మనము ఖర్చు చేయుచున్నాము. ఇప్పుడు ఈ అగ్గిపుల్ల మనదేశములోకూడ చేయుచున్నారు. దీనిని జాగ్రతగా గమనించవలెను.

దేవుడు చెట్లనుసృష్టించి, వాని మొదళ్లకు వానతగులకుండునట్లు, రెమ్మలను ఆకులను అడ్డముపెట్టియుండగా వ్యవసాయము చేయునప్పుడు,

పండ్లచెట్లకు నీళ్లుకట్టుట. మనము వాటిచుట్టు నీళ్లుపెట్టుటతప్పు. అట్లు చేయుట వల్లనే చెట్టుకు రోగము తగిలి చెడిపోవును. చెట్లకునీళ్లు పోసినయెడల, ఆ నీళ్లు వేళ్లకుండా చెట్లకుఎక్కును. అట్లుగాక నీళ్లు లేతవేళ్లకొనల గుండా ఎక్కబడిన నీళ్లద్వారా చెట్లు మొదళ్లకు శక్తి వృద్ధిచేయును. యీసంగతి తెలిసినట్లయిన, చెట్లుమొదళ్లవద్ద నీళ్లుపెట్టడము ఎంతతప్పో మీకే తెలియును. అట్లు నీళ్లుపెట్టుట అనావశ్యకమే కాక, ముఖ్యమైన వేళను కుళ్లునట్లు చేయును. ఇట్లు చేయుటవల్ల చెట్లుపసుపువర్ణము కరిగి, వ్యాధిపొంది ఎండిపోవును. గనుక నీళ్లుఎరువు, చెట్లమొదళ్లవద్ద పెట్టక, లేతవేళ్లుండు చోట కొమ్మలక్రింద పెట్టవలయును దీనికై చెట్లమొదళ్లవద్ద, ఒకటేసారిగాక, క్రమక్రమముగ మంటినిఎత్తుగ వేయుచు, దూరముగా కొమ్మలక్రిందనే చెట్లుచుట్టు పాగతీసి నీళ్లుపెట్టుచుండవలయును. నీళ్లుపెట్టిన వెనుక, పాదులుకొంచము ఎండినప్పుడు, పాదిలోనిమంటిని పారతో చిరిగి వేసినట్లయిన లోపలతేమ శీఘ్రముగా ఇమిరిపోదు.

'Registered No. M 716.'
SWAN SERIES No. 3.

ఓం





**A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.**

ఒక యాంధ్ర బ్రహ్మజ్ఞాన మాసపత్రిక.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 2.] { కీలకసంవత్సర మాఘమాసము 5009, ఫిబ్రవరి 1909. } [సంచిక ౨.

విషయసూచిక.



చెన్నపట్టణము:
వైజయంతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

మానేజరు, హంసశాల, 30, అంగప్పనాయక్ వీధి, జార్జిటవున్,
మదరాసు. అని వ్రాయవలెను.

సంవత్సరమునకు చందా 1 రూపాయి.

## ప్రకటనలకు ద్రవ్యనిర్ణయములు.

| | | పూర్తి పేజి. | అర్ధపేజి. | ¼ పేజి. |
|---|---|---|---|---|
| సంవత్సరమునకు | ... రూ. | 40 | 30 | 20 |
| 6 నెలలకు | ... ,, | 24 | 18 | 12 |
| 3 నెలలకు | ... ,, | 18 | 9 | 6 |
| నెలకు ... | ... ,, | 5 | 4 | 3 |

---

## హంసావళి.

1. షట్త్రింశన్మంజరి:—శ్రీశంకరాచార్యులు రచించిన భజగోవింద శ్లోకముల నాంధ్రభాషాణ పద్యాత్మకముగా రచింపబడినది. ఆబాలవృద్ధులకు నానందకరమైనది. వెల 2 అణాలు మాత్రమే.

2. ఏకాదిరత్నావళి:—1 మొదలు 224 సంఖ్యవరకు గల విషయవిశేషములింకు సంగ్రహింపబడినవి (అయనద్వయము, వాసనాత్రయము, సాధన చతుష్టయము, మొదలగు 1008 విషయములు) వెల 4 అణాలు మాత్రమే.

3. హంస:—ఇది మాస తెనుగు పత్రిక 1908 జనవరినుండి వెలువడుచున్నది. ఈ జన్మసార్థకము జేసుకొన గోరువారు దీనిని నిరాకరించ జాలరు. చందా సంవత్సరమునకు నొక రూపాయియే.

4. ముకుందమాలా స్తోత్రము:—ఇది విష్ణుస్తోత్రము. పారాయణమునకు అనుకూలమైనది. సంస్కృతశ్లోకము దానికి సరియైన తెనుగుపద్యము చేర్చి ముద్రింపబడుచున్నది. వెల 1 అణా.

---

## హంసపత్రికావళి.

1. Transactions of the Seventh Annual Federation of the Central Districts of the T. S. Branches. Price 1 anna.

2. స్వాగతప్రసంగము:—1908 సంll అగష్టు 22, 23 తారీఖులందు అనంతపురీమున జరిగిన మధ్యజిల్లాలలోని బ్రహ్మవిద్యాసమాజములకు చేరిన సభికుల మహాసభకుఇచ్చిన ఉపన్యాసము. వెల 3 పైసాలు.

ఓం



సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 2.] { కీలకసంవత్సర మాఘమాసము 5009, ఫిబ్రవరి 1909. } [సంచిక ౨.

## మనిషి స్వతంత్రుడా పరతంత్రుడా?

నిత్యకృత్యములందు మునిగియుండు సోదరులారా! నావంక ఒకక్షణము మనస్సును త్రిప్పుడీ! నాతోడ కొంతసేపు ఈ కొండమీదనుండు శుద్ధవాయువును కొంత పీల్చి విశ్రమించుడీ! లోకము నెట్లు దృష్టినిడి చూడుడు! ఎక్కడచూచినను, హెచ్చు తక్కువలు, వివిధసంకటసంతోషములు, లాభాలాభములు, లోకదృష్టికి న్యాయముగా నుండువారికి కష్టములు, దుష్టులకు సుఖములు కలుగుచుండుట సాధారణముగ మనము చూచెదము కదా! ఈ విషయము నాలోచించి, సర్వము ఆకస్మికముగా జరుగుచున్నట్లు సాధారణముగా తోచుచున్నదే గాని దీనికి ఆధారభూతమైన యొక నియమము ననుసరించినదని తటాలున తోచుటలేదు. ప్రతి ప్రాణిస్థితిగతులు మూడువిషయముల ననుసరించి యున్నవని చెప్పవచ్చును. మొదటిది జన్మమెత్తినప్పుడు వెంట తెచ్చుకొన్న నడత, రెండవది అవకాశములు లేక అనుకూలములు. మూడవది సందర్భములు.

ప్రతిప్రాణి పుట్టుకతోనే కొన్నిగుణములు వెంట తెచ్చుకొని యుండును. వాటి ననుసరించియు వాటినివృద్ధిచేయుటవల్లనో లేక కృశింపజేయుటవల్లనో వేరువేరు ఫలములుపొందును. అనగా సంగీతమునందు రుచిగలవాడు ఇతరవిషయములందు కడతేర ప్రయత్నించజాలడు. లెఖలు వానికి కొబట్టవు. వ్యవసాయపరుడు అధ్యయనమును రుచించడు. ఎట్టిగుణము లంకురించియుండునో వాటి ననుసరించి కార్యాసక్తుడగును. ఇట్లు నడతయొకటియుండిన, అవకాశము లుండవలయును. సంగీతము నేర్చుకొన నిచ్ఛ

యించువాడు అవిద్యాపరిచయములేని యొకపల్లెటూరిలో పుట్ట వాని అభిలాష ఎట్లు తీరును? నేలలు బాగా దున్ని పెట్టి మంచిపైరు ఈసంవత్సరము వచ్చునని యోచన చేయుచుండ, వానబిందువానేల పైన పడకున్న పైరు ఎట్లగు? గనుక కావలసిన పరికరమున్నను, అవకాశములు గలుగుట ముఖ్యము. అదిగాక సందర్భములుకూడ ముఖ్యము. సందర్భము అనగా మనచుట్టు నుండునట్టియు మనకార్యముల నిర్ధారపరచు స్థితిగతులు అనగా ఒకడు బీదవానియింటియందు ఒకపల్లెటూరిలో పుట్టుట. ఒకడు గొప్ప అధికారి సోదరుఁడగుట. ఒకడు కోమటియింట ద్రవ్యాధికారియగుట. ఇట్టి జన్మస్థితి ననుసరించికూడ జీవనముండును. ఇట్లు ప్రతిప్రాణిజీవనము మూడువిధముల కారణముల ననుసరించి యుండునని మీరు చెప్పవచ్చును. అయితే ఇట్టివాదమువల్ల మనము తృప్తి చెందుదుమా? ఈ విచిత్రభేధములెందుకు గలిగినవి యనుసందియంబు మాటికి మాటికి పొడముచునే యున్నది. ఇట్టి సందియంబులను నివారించుకొన ధీరులు ప్రతిక్షణము ప్రయత్నించి తెలుసుకొని సన్మార్గమున వర్తించుచునే యున్నారు. దైవనియమములను తెలిసి వాటిననుసరించి నడచుటవల్ల ఏలాటిదుఃఖమునకు ఆస్పదములేదని పెద్దలు కనిపెట్టి యున్నారు. దైవనియమముయొక్క విధముగానే సర్వకాలములందుసర్వావస్థలందు ప్రకాశించుచున్నయది. ఈ నిర్ధారమై అచంచలమైన దైవనియమమును తెలియుటవల్లనే పెద్దలు దాని నాశ్రయించి నిరతిశయానందమును పొందియున్నారు. ఆ దైవనియమ జ్ఞానములేనందువల్లగదా ప్రాణులకు అనేకవిధదుఃఖజాలములు సంప్రాప్తమై యున్నవి. సుఖము గోరువారందరు ఆదైవనియమమును తెలుసుకొని వర్తించిన సుఖపడుదురు. ఇట్టి దైవ నియమమును కొంచముకొంచము తెలియుటవల్లనే కదా ఈ కాలమున అద్భుతమగు తంతిసమాచారము, పొగబండి, పొగయోడ మొదలగు యంత్రములు మనిషిచేత కనిపెట్టబడినవి.

ఈ ప్రకారముగానే దైవనియమమును పూర్ణముగ విచారించిన మహానుభావులు మనిషితనస్థితికి యజమానుడే కాని బానిసకాదు. మనిషియొక్కస్థితి తనవల్లనే నిర్ధారపరచబడుచున్నది. కాని ఇతరులవల్ల తృణమాత్రమైనను గాదని తెలిపియున్నారు.

ఈ విషయమును కొంతవిచారింతము. మనిషియొక్క జీవనమును పరికించిచూడ, మొదటిది సంకల్పముగా ఏర్పడుచున్నది. సంకల్పమువల్లనే సకలసృష్టియైనదని శ్రుతులు ఘోషించుచున్నవి కదా? ఎట్లుతలచిన నట్లగుదువని ఛాందోగ్యోపనిషత్తు తెలుపుచున్నది. దీనికి నిదర్శనముచూతము. పరీక్షార్థము నీకు చాలా కోపమున్నదనుకొందము.

దానికి వ్యతిరిక్తమైన శాంతమునుగురించి ప్రతిదినము కొన్నిక్షణములైనను చింతించుచున్న నీ కోపగుణ మెక్కడకపోవునో నీవే యాశ్చర్యపడుదువు. ఇట్లనే సకల సుగుణములు బుద్ధిపూర్వకముగ వ్యవసాయము చేయనగును. ఈ సంగతినివిన్న హాస్యాస్పదముగ మీకు మొదట తోచవచ్చును. అయితే ఇది అనుభవవేద్యము. ఇది సత్యముకావో అవునో యనుసంగతి మీరుకూడ సాధనచేసిన తెలుసును. ఏవిషయమునైన ప్రయత్నపూర్వకమైన స్వానుభవమువల్ల తెలియవలెనేకాని ఒకరి అనుభవము మరియొకరికి చెప్పినమాత్రమున గోచరముకాదు. అట్లు సాధనచేయక తెలుసుకొనక అసత్యమని నుడువ యత్నించిన నదియెట్టిఫలకారియో మీకే తెలియును.

ఇట్లు ప్రతిమనిషి తానుచింతించు విషయముల ననుసరించి వానియొక్క జన్మావస్థ స్థితిగతులు ఏర్పడుచుండును. ప్రతిమనిషి యనిపించుకొను సంకల్పించు చైతన్యము శాశ్వతమైనది. అది ఒకదేహమునుండి మరియొక దేహమును అది సంకల్పించురీతి కల్పించుకొని సకలసుఖములను అనుభవించుచుండును. అది దైవాంశమే గనుక సుఖస్వరూపముగలది గనుక సుఖమునే వెదకుచుండును అయితే ఎట్టిసుఖము శాశ్వతమైనదో దానిని తెలియక తుచ్ఛసుఖమును కోరుచుండుటచేత అదిలభించి నశించిపోవుచుండును. అదిగాక తనకు సుఖముగాతోచుదానిని అన్వయించుటచేత అదినిజమైన సుఖము కానందువల్ల దుఃఖసంప్రాప్తియై దానివల్ల ఆమార్గమున పోకుండ వేరుమార్గముగా సుఖము వెదకును.

ఇట్లు ప్రతిమనిషియొక్క సంకల్పములే కర్మయనిపించుకొనును. కర్మ మనోవాక్కాయములని మూడు విధములు. మనస్సుదే ముఖ్యము. వాక్కాయములు ముఖ్యముగా మనస్సు ననుసరించియే యుండును. ఈకర్మ మనిషి ప్రతిక్షణము చేయుచుండును. ఇట్లు అనేకజన్మములందు చేయుకర్మ గొప్పరాసిగా యుండును. దానినంతయు ఒకజన్మమున అనుభవించుటకు అవకాశముపుండదు. ఒకజన్మమున అనుభవించునంత మూటకట్టుకొనియుండుకర్మప్రారబ్ధమనిపించుకొనును. జన్మించిన వెనుక చేయుచుండునది ఆగామి, అనగా ముందు అనుభవింప బోవునది యగును. వెనుక నిలిచియుండురాశి సంచితమగును. ఆగామికర్మ సంచితమునకు చేరుచుండును. ఇట్లు జన్మపరంపరలను సుఖదుఃఖములను ప్రతిమనిషి తానె సిద్ధముచేసుకొనుచున్నాడని తెలియవలశినది. ఏదోయొక్క యితర కారణవల్ల తనకు స్థితికలుగుచున్నదని అభిప్రాయపడుట తప్పు. తాను చేసుకొన్నదే తనకు సిద్ధమై లభించును. గనుక ప్రతిమనిషి బాగుపడవలెనని

కోరికయున్న తన మనోసంకల్పములను అనుక్షణము పరీక్షించుకొని సత్సంకల్పములను వృద్ధిచేయవలెను. మన కర్తరాశినే అదృష్టమని యనుకొనుచుందుము. అదృష్టమన కనబడనిది యనియర్థము కాని వేరు కాదు. గనుక అందరు సత్సంకల్పయుక్తులు కావలయును.

---

## మాభక్తవిజయము.

### 4. 60 వేల అనాధులను రక్షించిన బర్నార్డో.

ఇట్లు బర్నార్డో తనతొల్లిటి అనుభవమును వర్ణించి యున్నాడు. లండన్ మహాపట్టణములో కూడ ఇట్టి దిక్కులేని అన్నము బట్టయుకూడ కానని, బాలుర వృద్ధులున్నారని చాలాచింతించి, వారినందరిని పోషించ తనకుశక్తిని దైవమివ్వలేదే యని ప్రలాపించుచు, ఏమిగతియైనను కాని తనకుదొరికిన అనాధబాలుని మాత్రము రక్షింపసమకట్టి, ఒక గృహమును బాడుగకుమాట్లాడి ఆగృహమును తనప్రయత్నములో చేరిన వారితోకూడా తానునుశుద్ధిచేసి సున్నముపూసి అనాధులను పోషించ ప్రారంభించెను. ఇట్లు పోషించుటకు ప్రారంభము చేయగానే కాలక్రమేణ జనులసహాయము కలుగుచు దైవమే ఆప్రయత్నమును బలపరచుచువచ్చెను. నేటికి 60 వేల మందికి పైగా పోషింపబడియున్నారని తెలియవచ్చుచున్నది. అచ్చట చంటిపాపలు మొదలుకొని పోషింపబడుచు వచ్చినారట. ఆడవారిని మగవారిని ఊరక పోషించుటకాక వారివారి జీవనమునకు మనోగతికి తగినసాధనములు అనగా మతము కమ్మరపని, కుట్టుపని, వడ్లపని, చాకలపని మొదలగువివిధములైన విద్యలను గఱపుచున్నారట. ఇది ఎట్టి సత్కార్యమో, ఎట్టి మోక్షదాయకమో మీరేయోచించుడు.

ఈబాలురను పోషించు సమయమున ధనములేక యొక్కొకతఱి బర్నార్డో ఆలోచనచేయు సమయమున, అనాధరక్షుడైన ఈశ్వరుడు పలుమారు నేనులద్వారా సహాయము చేసియున్నాడట! సత్కార్యములకు దైవము తోడ్పడకున్న సృష్టిక్రమమెట్లుజరుగు?

ఇట్లు బర్నార్డో అనువాడు ఇంతగొప్పకార్య మెట్లుసాధించెనో యనుసంగతి మనము విచారించవలసిన కార్యమైయున్నది. ఇట్టిగొప్ప కార్యము చేయుటకు హెచ్చుగ ధనముండవలెను. జనసహాయ ముండవలెను. గొప్పపదవి యందుండవలయునను

కొనుట స్వాభావికమేగదా! అయితే బర్నార్డో అనువాడు ధనవంతుడుకాడు. గొప్పఅధికారికాగు. జనసహాయము కలిగియుండినవాడు కాడు.

ఈశ్వరప్రేరణవల్ల ఆ అనాథబాలుడొకడు అతని ఎదుట ప్రత్యక్షమయ్యెనో యనునట్లు, ఆబాలుడు తనచరిత్రమున కతనికి చెప్పగానే కేవల దయాపశ్చాత్తాప పూర్వకమైన మనస్సుగలవాడై, అనాథులను రక్షించవలెనను ఒకగొప్ప సంకల్పము చేసినవాడై ఆకార్యమంకు సాహసించి పూనినవాడయ్యెను కాని బాహ్యోపకరణము లతనికి ఎవ్వి యుండలేదు. గనుక సంకల్పప్రభావమింకు చూడుడు. అతడు లోకోప కారమునకు పూనగానె, ఈశ్వరసంకల్పమతని సంకల్పముతో నేకీభవించి, అనేకులత నికి సహాయముచేయ ప్రారంభించిరి 60 వేల మందిని పోషించిన శ్రమయెంతయో వ్రయమెంతయో లోకుల సహాయమెంతయో మీరేయోచించుడు. స్వార్థపరత్వదోష మించుకలేకున్న లోకమున నెట్టి గొప్పకార్యములైనను సాగుటకు స్తరము కాను గనుక దృఢసంకల్పము, సాహసము, పరోపకారము ఏగొప్పకార్యమునకు ముఖ్యమైన సాధన ములుగా దెలియవలయు.

---

## ప్రకృతిసౌందర్యములు.



వ్యాధిగ్రస్తులను జల్లుగ స్నానమాడించి వారి రోగములను మాన్పును. కొన్నినదులలో స్నానమాడిన రోగములు తొలంగును. గంగానది వాంతిభేదికి దివ్యౌషధము. ఇట్లు సరిత్సుదతి లోకులకు జీవనాధారమయి, రోగములను గుదిర్చి, దేహములను గడిగి, శుద్ధాకారులంజేసి, శౌచముగట్టనిచ్చి, యాత్మశుద్ధియు నొనరించి యెల్లరకు నెన్నగ నెన్నులమిన్నయై వఱలును. ఈ శుభాంగికి మనోహారగుణహారమున నాయకమణి దానము. దీని మహాభాగ్యము త్యాగము. ఇది పుడమిపై బడతుల కెల్లరకు నుదా హరణముగ గనుగొనదగు.

ఈగుణవంతురాలు వాహినీకాంత మేదినీకాంత వదినెయై తనకుదోడురా నొయ్యారమున వరుసబారావారుని జేరును. వినయప్రీతావినమితవరాంగియై సాగర సంగమమునకుం బోవుచున్నది.

సముద్రుని వరునిగ వరించెనుగదా? అతడు శ్రీమంతుడే, గుణవంతుడే, విద్యావంతుడే యనియరయందగు.

అంభోనిధి గంభీరగుణనిధి. త్యాగశీలుఁడు. చెల్లెలగు భూదేవికిఁ జేలమిచ్చెను, వేళయయ్యెను. ఆశ్రితుల కిన్నియన్నియనరాని రత్నములను, బగడములను, ముత్తెములను గంపలకొలఁదిలిచ్చెను. శ్రీమన్నారాయణమూర్తికిఁ జల్లని సెజ్జఁగూర్చెను. తనకరముల వింజామరముల వీచెను. శ్రీదేవికిఁదండ్రి. శివునకుఁ గండాలంకారముగఁ నీలమణిని బిక్షమిచ్చెను. అర్ధాంగియగు గౌరియాఁదలనిందుకల నలంకరించెను. లోకపితామహుఁడగు బ్రహ్మకుఁ బుట్టినప్పుడ యుపచారములుజేసెను. దేవతలకు నమృతదానముఁజేసెను. రాక్షసులకు నభయదానమిచ్చి వారినిదాఁచిపెట్టియుండెను. వేదములకు భాండాగారమయ్యెను. నవరత్నముల యుత్పత్తిస్థానమయ్యెను. అగస్త్యునకుఁ పానమయ్యెను. మేఘములకు దాహముఁ దీర్చెను. మేఘశ్యాముఁడగు రామునకు సేతువుమోఁతమోసెను. జనులకు నారోగ్యకరమగు (ozone) ఓజోను గాలినిచ్చెను. ఇంతయేలఁ జెప్పవలయును. ఈ మహాంబుధివితరణ వివరించనలవికాదు. అది యవాఙ్మానసగోచరము. వెండియు నితఁడువిద్యానిపుణుఁడు. వేదార్ణవుఁడు. ఉపనిషద్వ్యాఖ్యాత. తన్నుఁజూడవచ్చిన వారికెల్లరకు నిచ్చలు విద్యల దిద్దుచుండును. శిష్యులయధికారమును విచారింపఁడు. "పశ్యన్నపిచన పశ్యతిమూఢః" అనునట్లు కొంచియు మూఢుఁడుగాఁడు. అధికారము లేనివాఁడు వినుచుండియు వినలేఁడు. చూచుచుండియుఁ జూడలేఁడు. ఆర్యజనసమ్మతమగు వీనిమతమును వివరించెదను. కడలేని కడలుల రాకపోకలచేత గతాగతాకారమగు సంసారమును సూచించును. ఘోషించుచు నాత్మవిద్య నధ్యయనముఁజేయును. అదియెట్లనిన అలలు వచ్చుచుఁబోవుచుఁ జెత్తలను నుఱుగులను దడియంచునఁజేర్చి పోగుచేయును. చెత్తలనుండియుఁ జెత్తలఁ జుట్టుకొనియు నుఱువులు ప్రోగగును. క్రమ్మఱఁ జెత్తలఁగలఁచి కృశింపఁజేయును. నుఱువుల విఱిచి నశింపఁజేయును. చెలియలిగట్టు నతిక్రమించవు. తడియంచును మించవు. అట్టి కడలులంబడిన యతఁడు వానిందాఁటి చెత్తలునుఱువులుండు తడియంచుఁగడచి గట్టుఁజేరినయెడల నలలకుఁ లోబడఁడు. స్వాతంత్ర్యమునఁ జరించును.

దీనియర్థము సంసారపరమున వివరించెదను. తరగలఁబడినవాఁడు జీవాత్మ, కెరడుల రాకపోకలు, పోటువాటులు, జననమరణములు. చెత్తలు పాపము నపకీర్తి. నుఱువులు పుణ్యముఁ గీర్తి. అవియుండు తడియంచు కారణశరీరము. గట్టుమహాక్లోశము. జీవాత్మ సంసారభ్రమణమున, జననమరణములఁ గర్మములఁ జేయుచు వాని ఫలముల ననుభవించుచునుండును. ప్రవృత్తిమార్గమున నుండువాఁడు తొలుతఁ బాపము

లంజేసి వానిఫలములఁ గారణశరీరమున గడనఁజేసి, దుఃఖముల ననుభవించి, యా యనుభవజ్ఞానమునఁ బుణ్యకర్మములఁ దొడరును. పాపములవలనఁ బుణ్యములు గలుగును. చెత్తలనుండి నుఱుగులు పొడమును. ఇట్లు పుణ్యకర్మములను బాపకర్మములను జేయుచుఁ, గీర్తియు నపకీర్తియు నార్జించి, స్వర్గమున నరకమున ననుభవించి యవినశించుడు మఱలపొడమి మడియుచుండును. ఆ యనుభవమున జ్ఞానమువచ్చును. మిన్నక యలలలోఁ బూనికలేక యుండిన మునుఁగుచుఁ దేలుచు నుండునుగాని గట్టుఁ జేర నేరడను తెలివివచ్చి, లేచి, నిలిచి, యెక్కిపోవఁ బ్రయత్నించును. అట్లు గడఁగినచో గట్టున నుండు మహాత్ములు కృపాయత్తచిత్తములఁ గేలూతలిచ్చి గట్టునకుఁ దెత్తురు. ఇట్లు స్వప్రయత్నమును, మహాత్ముల సహాయమును దోడుగాఁగ భూలోకము భువర్లోకము స్వర్గలోకమును గడచి, స్థూలసూక్ష్మ కారణశరీరములను విడిచి మహర్లోకమున జీవాత్మ స్వశరీరముతో జననమరణమునకు లోఁబడక యాత్మానందమున సంతసించు చుండును. అట్టియెడ మఱియొక జీవాత్మతరంగములఁబడి గట్టుఁగానక తత్తలించుచుండ వానిఁజూచి మెత్తనిచిత్తమునఁ గనికరము చిగుర్పొత్త వాని నుద్ధరింప నలలలో నుకశేళి దిగును. భూలోకమున నవతరించును. జననమరణములకుం బాల్పడును. అట్టి దయాసముద్రులు మహాత్ములు.

ఈప్రకారము వారిధియాత్మవిద్యను నధ్యయనము చేయుచున్నది. చేరువారికి నేర్పుచున్నది. ఈమున్నీరును మన్నించి నమస్కరించి మనము తెఱలుదము. గంగా సాగరసంగమ వివాహమహోత్సవముల సంతసించుచు నెలదోఁట యాటలకుంబోదము. నందనారామ రామణీయకమునఁజూచి రాఁబోదము.

నందనవనములందును నడవులందును మనస్సున కానందము గలుగుచున్నది. కాననమానినియు జ్ఞానముబోధించును. జీవశక్తినిచ్చును.

వంటకట్టెలకునై యడవులకు గొడ్డలిఁగొని గొఱవఁడొకఁడు పోయిన వనలక్ష్మి వానినిఁజూచి తన్ను నఱుకవచ్చెనని వాని పైఁగినియదు. వానినిదూఱదు. వానినివిడిచి దూరముగాఁబోదు. క్షమావతియై వనసతి చక్కని గేస్తురాలిఁబోలి వానికి నతిథిపూజలఁ జేయును. నీడలందుఁ గూర్చుండఁబెట్టును. చల్లనియూరు వీవనలవీచి వాని నేదఁదీర్చును. బడలికఁ బాపును. పూచినపూవులఁ బూజించును. ఓగిరంబుచేయుమని మాఁగినపండ్లు మెండుగానిచ్చును. కమ్మని తేనియలఁ ద్రాగనిడును. మెలకువమై మేలిసేవలసలిపి సన్నటిలుగున స్వాగతంబడిగి యతిథికోరికలు నెఱవేర నెండుకట్టియలనిచ్చిపుచ్చును. ఇట్లు

నందనవన సుందరిచేయు సేవలఁ జేకొని యరయని కొలువను సెలుకఁగలవాఁడగు. బోధిద్రుమమునీడఁ బ్రాపించినబుద్ధుని చందమునను, వటతరుమూలమునందు గురుశిష్యుల విధమునను సంచిత్ఫలముల జ్ఞానప్రసూనముల సంపాదింపును.

చిత్రంవటతరోర్మూలే వృద్ధాశ్శిష్యాగురుర్యువా
గురోస్తుమౌనంవ్యాఖ్యానం శిష్యాస్తుచ్ఛిన్నసంశయాః.

కం. అదిగో వటతరువదిగువఁ, జదివిరిమునుసల్లు గొమరుసన్నిధిఁ బల్కం
డెది మౌనవ్రతుఁడు గురువు, కొదలెల్లనుఁదునిఁగె శిష్యకోటికినహహా.

మఱియు దరుమూలనివాసమున నొకవిశేషముగలదు. ప్రకృతిశాస్త్రవేత్తలు (scientists) చెట్లకు వేఁడిమి సాగుంగొలమునకుఁ దటువాతి నౌన్నత్యమున నుండు ననియు దానివలనఁ జెట్లసమీపమున నివసించుమనుష్యులకు శేయుంబగలులందు శీతోష్ణములు దాదాఁపుగా నన్యోన్యసమములై యుండుననియు స్థాపించియున్నారు. ఈ కారణ మొకటయగు నెుకో మనమును లుగ్రాటవుల నాశ్రమముల నియమించికొనిరి. అడయారునఁ గాఁపురముఁజేరక మున్నుఁగొన్నాళ్లు H. P. B. మైలాపురముననుండెను. ఆపూజ్యురాలు తనగృహారామమంల బండిగురిగింజచెట్టుక్రింద సంధ్యలందుఁ బ్రాణాయామమున నుండెననియు వినుచున్నాము.

ఇంతేకాదు. కొననకొంత మనమూపిరినివిడుచు మలినవాయువును (carbolic acid gas) తనయందు లయింపఁజేసికొని మనకారోగ్యకరమయిన విమలవాయువు (oxygen) నిచ్చును. అన్నియౌషధములును నోషధులనఁబడు వనవర్గములఁజేయఁబడును. ఇట్లు కొననపల్లవోష్ఠి మనకెల్లవిధముల మేలు చేయును.

మనకేకాదు. పశువులకు నుపకారియగును. సాధుజంతువుల దుర్జనులకుఁజిక్కనీయక శరణమిచ్చును. క్రూరజంతువుల కునికిపట్టయి జనపదంబులను వానినుండి కాపాడును.

ఇట్లు ప్రకృతిసౌందర్యముల సందర్శనమున నానందము గలుగుట యది యజ్ఞదీక్షవహించి తన్నరయవచ్చినవారికిఁ బ్రియముగలిగించు జీవశక్తిని నిచ్చుటయును, సద్భావముల వారి సత్కరించుటయును గారణములు దాన నొక్కయెడ స్థూలశరీరమునకు బలమును, నొకయెడ హృదయమునకుఁ బ్రియమును, వేఱొకయెడ బుద్ధికిజ్ఞానమునుఁ, గొండొకయెడ నాత్మానందమును బొందుపడుచుండును.

లక్ష్మీదేవి యీవడువునఁ దనసౌభాగ్యములచే భూదేవి నలంకరించుచుండు కోటులందు విష్ణుమూర్తి సమ్మోదమున వర్తించుచుండును. దేవాలయము లేర్పడియుండును. భరతవర్షమున (India) నెల్లగుళ్లను బ్రకృతిసౌందర్యముల నుప్పారు రమణీయరంగములందున్నవి. గావున తీర్థయాత్రలవలన దేవాలయదర్శనమునఁ గలుగుఫలములును వసుంధరీసుందరాంగములఁ జూడవచ్చు నానందమును గలుగును. వీనిదర్శనముల పురుషప్రకృతి చైతన్య దర్శనఫలములు గలుగును.

'ఈగిరిసరిత్సముద్ర వనములఁగలభూదేవిని వర్ణించెదఁ, సావధానముగ వినుఁడు. ఇఁకఁ జెప్పునది చులకనగాని విషయము. చెవియొగ్గి చక్కఁగా వినవలయును.

విష్ణుమూర్తి భార్యలలో భూమి చిన్నదని సుప్రసిద్ధము. చిన్నభార్యలందు లోకులకుఁ బ్రియమెక్కుడగునట్లు శ్రీనివాసునికిని క్షమానితంబినియందుఁ బ్రియము మిక్కుటము. దీనిని వివరించి చెప్పవలయును.

ప్రారంభమున దేవతలకుభార్యలున్నారనిన వారు శక్తిమంతులని గ్రహింపనగును. సామాన్యజనులవలె మోహావేశమునఁ గన్నులుగానక మన్నుమిన్ను నెఱుఁగక వేలుపులుఁ దిరుగువారు గారు. గావున వారియెడ భార్యస్థానమున నొకశక్తి నారోపింపఁదగును. శక్తిఁగలవారని తెలియనగు. మన్మథునికిగురువగు శ్రీకృష్ణమూర్తియెట్లు పదియారువేవురుభార్యలకు వశంవదుఁడై కామావేశమునకులోఁబడి యుండును. అట్లు కాదు, సర్వలోకేశ్వరుఁడైన భగవంతుఁడు సర్వశక్తిమంతుఁడని యెఱుంగుటొప్పు.'

క్షమాసతికిని రమాసతికిని ననుగాగి మెక్కువని నుడివిరి. ఏశక్తిని గడిందిగా విష్ణువునుగ్రహించును, నవలంబించును, జేకొనును, నేశక్తిసర్వప్రియమగ్గలమై నెగ్గుచుండు నాక్షమాశక్తినరయ విష్ణుపదమునకును క్ష్మాపదమునకును నర్థముల వివరింపవలయును.

విష్ణువనుపదమునకు సర్వవ్యాపియని యర్థము. శంకరాచార్యులవారు "త్వయి మయి చాన్యత్రైకోవిష్ణుః" అని పాడియున్నారు.

"నెలకొనె నాయెడనీయెడ విష్ణువె"

వాసనాద్వాసుదేవస్య వాసితంతే జగత్త్రయం
సర్వభూతనివాసోసి వాసుదేవ నమోస్తుతే.

అనియుఁ బ్రమాణము. "వాసుదేవా! నీచేతనే ముల్లోకములును వసింపఁబడినవి సర్వభూతములందును వసించియున్నావు" అనియర్థము. మఱియు భాగతమున శాంతిపర్వమున భీష్ములు తనమనుమండ్రకు సకలవిద్యలనేర్పుచు సృష్టివిషయమిట్లు చెప్పిరి.

బ్రహ్మోవైసమహాతేజాః యఏతేపంచధాతవః
శైలాస్తస్యాస్థిసంజ్ఞాస్తు మేదోమాంసంచ మేదినీ
సముద్రాస్తస్యరుధిరం ఆకాశముదరంతథా
పవనశ్చైవనిశ్వాసః తేజోగ్నిర్నిమ్నగాస్సిరాః
అగ్నీషోమాతుచంద్రార్కౌ నయనేతస్యవిశ్రుతే
నభశ్చోర్ధ్వంశిరస్తస్య క్షితిఃపాదౌ భుజాదిశః
దుర్విజ్ఞేయోహ్యచింత్యాత్మా సిద్ధైరపి నసంశయః

మహాతేజస్వియగు నాబ్రహ్మమే యీపంచధాతువులు. వానియెమ్ముకలు పర్వతములు (న భూమిలోనిరాళ్లును). వానిక్రొవ్వును మాంసమును భూమి. వానినెత్తురు సముద్రము. ఉదరమాకాశము. ఊపిరి గాలి. నరములు నదులు. కన్నులు సూర్యచంద్రులు. శిరస్సు నభస్సు. కాళ్లు నేల. భుజములు దిశలు. వీడు సిద్ధులకును తెలియరానివాఁడు. నచింత్యాత్ముఁడును. ఇది తత్త్వము అనియర్థము.

బ్రహ్మము సోమయాజులలో మేటి. వాని గావించినయజ్ఞముఁ బురుషసూక్తమునఁ దెలుపఁబడియున్నది. తనశరీరమును విభజనము చేసి లోకసృష్టిఁగావించెను. తన యొడలు విశసనముగా నాహుతియిచ్చిబ్రహ్మాండము సృజించెను. శరీరమువికారమయ్యెననియు, యాగాగ్నిని దగ్ధమయ్యెననియు బ్రహ్మ దూషింపఁడు. అతఁడు శాంతానందుఁడు. లోకములకు దేహమునిచ్చి యర్పించి మహానందమును బొందినవాఁడు.

ఈ వివరించిన తెఱఁగున నవయవములుగలిగి నంతటనిండియుండు సర్వవ్యాపికి విష్ణువునకు భూమికాళ్లు (క్షితిఃపాదౌ) దేహమునకుఁ గాళ్లకుఁ గ్రిందిభాగములేనట్లు విష్ణువునకు నీశ్వరునకు నవతరించుటకు భూమికిఁగ్రింది లోకములేదు. (Lowest field of manifestation) కావుననే భూమి చిన్నభార్య యయ్యెను. మయాశక్తిరూపములగు పంచభూతములలో పృథ్వి కడపటిది. లోకులకు సులభముగాఁ దెలిసికొనఁదగినది. మనస్థూలశరీరమును బంచేంద్రియ గోచరములగు విషయములును బృథ్వీతత్త్వము. భూతత్త్వము. ఇదియే విష్ణుమూర్తికిఁ బ్రియమైనక్షేత్రము.

ఈక్షమా క్షేత్రము విష్ణువునకు నొకభార్యగావున నొకశక్తియని నిర్ధారణచేయ నగును. అదియే శక్తి. ఎట్లుప్రియము అనియడుగుదురు కాఁబోలు.

శ్రీశంకరాచార్యులవారు భజగోవిందంకీర్తనలుగా నిట్లు పాడియున్నారు.

"త్వయిమయిచాన్యత్రైకోవిష్ణుః వ్యర్థంకుప్యసిసర్వసహిష్ణుః
భవసమచిత్తః సర్వత్రత్వం వాంఛస్యచిరాద్యదివిష్ణుత్వం"

"నెలకొనె నాయెడనీయెడ విష్ణువె యలుగకుమేయెడ నగుమసహిష్ణువె
సరిసమదృష్టిని సర్వముచూడుము త్వరపడివిష్ణుపదంబును గూడుము"

అనఁగా సర్వసహిష్ణువుగానుండి సమచిత్తతతోనుండిన విష్ణుపదమువచ్చునని. సర్వసహిష్ణువగుటయే విష్ణువునకు మహాశక్తి. ఆశక్తియే క్షమ, ఓర్పు, సైరణ, తితీక్షఅనఁబడునది. ఈశక్తియేవిష్ణుమూర్తి. సర్వవ్యాపియగుటకుఁ గారణము. ఇదియే జగద్రక్షకునకు మిక్కిలి ప్రియము. చిన్నభార్య క్షితి, క్షమ, భూమి.

భూక్షేత్రమున నీగుణమున్నది. దానిపేరే క్షమ. ఎవ్వరెవ్వరెన్ని యనాచారముల జేసినను నెన్నిపాపముల పాలయినను నెన్నివ్యసనములఁ జిక్కినను, వారినెల్లఁ గరుణించి సైరించుచున్నది. ధరిత్రి యోర్పుమై సకలకల్మషుల ధరించుచున్నది. మఱి సుజనుల వేఱు నుడువవలయునే. బ్రదికియున్నంతవఱకు నెల్లరకు నన్నవస్త్రముల నిచ్చి కాపాడును. చచ్చినను వారిని విడనాడదు. తనలో నలయింపఁజేసికొనును.

క్షమావిషయమై పరమశాంతమూర్తియు నజాతశత్రుండునగు ధర్మజుండు తన ధర్మపత్నికి నుపదేశముఁజేయుచుఁ గశ్యపునివాక్యముల నిట్లనియె.

"అత్రాప్యుదాహరంతీమాః గాథాఃనిత్యంక్షమావతాం
గీతాః క్షమావతాంకృష్ణే కాశ్యపేనమహాత్మనా
క్షమాధర్మఃక్షమాయజ్ఞః క్షమావేదాఃక్షమాశ్రుతం
యఏతదేవంజానాతి ససర్వంక్షంతుమర్హతి
క్షమాబ్రహ్మ క్షమాసత్యం క్షమాభూతంచ భావిచ
క్షమాతపః క్షమాశౌచం క్షమయేదం ధృతంజగత్
అతియజ్ఞవిదాఁల్లోకాఁ క్షమిణంప్రాప్నువంతిచ
అతిబ్రహ్మవిదాఁల్లోకాఁ అతిచాపితపస్వినాం
అన్యేవైయజుషాంలోకాఁ కర్మిణామపరేతథా
క్షమావతాంబ్రహ్మలోకే లోకాఃపరమపూజితాః
క్షమాతేజస్వినాంతేజః క్షమాబ్రహ్మతపస్వినాం
క్షమాసత్యంసత్యవతాం క్షమాయజ్ఞఃక్షమాశమః"

యాజ్ఞసేనీ! కృష్ణా! యీవిషయమున మహాత్ముఁడును సైరణగలవాఁడునగు కశ్యపుఁడు క్షమావంతులఁ బ్రశంసించుచుఁ బాడిన గీతములవినుము. ఓర్పు ధర్మము. ఓర్పు యజ్ఞము. ఓర్పు వేదములు. ఓర్పు వినఁదగినది. ఇట్లెఱిఁగినవాఁడన్నిటిని సహించ వలయును. సైరణ బ్రహ్మము. సైరణ సత్యము. సైరణ పుట్టినది. సైరణ పుట్టఁబోవునది. క్షమయే తపస్సు. క్షమయే శౌచము నైర్మల్యము. ఈ జగమునునికికి నాధారము క్షమ. సోమయాజులును, తాపసులును, కర్మనిష్ఠులును బొందునూర్ధ్వలోకముల కున్నతస్థానము క్షమగలవారు నొందుదురు. తపోధనులకుఁ దపస్సు సైరణ. సత్యవంతులకు సత్యము సైరణ. సైరణయే యజ్ఞము. సైరణయే యింద్రియ నిగ్రహము.

దీనిలో గొన్నియంశములమాత్రము విశదముగాఁ జెప్పెదను. "క్షమాబ్రహ్మ క్షమాసూతంచచావిచ" "క్షమయేదంధృతంజగత్" ప్రవృత్తిమార్గమున జనులునడచుచు నానాఁటికి నిజస్మరణమును నాత్మజ్ఞానమును లేక యీశ్వరునినుండి తొలఁగిపోదురు. వారలెక్కకు మిక్కిలి తప్పులఁజేయుదురు. క్షమచేతన బ్రహ్మము వారిని నిలిపియున్నాఁడు. కాదేని యొకనిమిషములో నశింపఁజేయును. ఆబ్రహ్మమునెఱపు నగణితక్షమ చేతనే ప్రవృత్తిమార్గమున వెలువడిన సృష్టియును, భవిష్యత్కాలమున రాఁబోవు సృష్టియు నిలచును. "క్షమా తేజస్వినాం తేజః" మహాతేజస్సుఁగలవారికి నితరులతప్పుల నోర్చుటయే బలము. తేజస్సు. తపోనిష్ఠులు కోపించిన వారితపస్సు నష్టమగును. గనుక "క్షమాబ్రహ్మతపస్వినాం" విషయములందు నింద్రియములు నిలువక, వానికిఁజిక్కక, వానియందలి యాశ్రగ్రమ్మునపుడోర్పుతో నిజమార్గమున నిలిచియుండుట యోగమునకు నవశ్యమగు శమయనుగుణము "క్షమాశమక్షమాసత్యం క్షమాసత్యంసత్యవతాం" ఓర్పేసత్యము. "యథార్థము సత్యవంతులకు ముఖ్యమయినగుణము." సత్యం అనఁగా సతేహితం ఉండుటకు ననుకూలమగునది. నిలకడఁగా నిలుచుటకు నోర్పునకుమించిన యుపాయములేదు. మంచిమార్గమును లేదు.

"సత్యాన్నాస్తిపరోధర్మః" సత్యమును గడమధర్మములేదని యుదహరించు బ్రహ్మజ్ఞాన సమాజములో (Theosophical Society) సత్యమునకు నాధారమును నుపాయమును మార్గమునునైన క్షమను ముఖ్యముగాఁ బాటింపవలయును. అవశ్యమవలంబింప వలయును.

Theosophists "extend tolerance to all even to the intolerant, not as a privilege they bestow but as a duty they perform and they seek to remove ignorance and not to Punish it."

గనుక బ్రహ్మజిజ్ఞాసులందఱియందు నైరణ నెఱపుదురు. వారికదిధర్మముగావున క్షమలేనివారినిఁగూడ క్షమింతురు. అట్టివారు క్షమకు నర్హులా కారా యని విచారింపరు. ఓర్పే వారికి ధర్మము. మూఢులను దండింపరు గాని వారియజ్ఞానములను దొలఁగింపఁ గడఁగుదురు.

ఆర్యులారా! సోదరులారా! చక్కగా వినుఁడు. శ్రద్ధగా నాచరింపుఁడు. మీరీ సభలోను మఱియెందును గోపముమాని, యభిమానమునువిడిచి వైరమును నిర్మూలముఁ జేసి యోర్పును బూనుఁడు. శ్రీ శంకరాచార్యుల వారలజ్ఞానమను నవిద్య యనాది యనియు ననిర్వచనీయమనియు నెప్పుకొన్నియున్నవారు. అట్టిగట్టిసంకెలులలోఁ బడియుండు పేద సోదరులఁజూచి కరుణించి వారిచీఁకటులఁబాపి, వారిదుఃఖముల గ్రహించి వారినిఁజేకొనుఁడు. ఓర్పుతో వారితప్పులక్షమింపుఁడు. వారినినవ్వకుఁడు. వారిపైఁ గోపముజేయకుఁడు. వారిని క్షమతో ననుగ్రహింపుఁడు. "వ్యర్థంకుప్యసి సర్వసహిష్ణుఃభవ" అన్నిటినిసహింపుఁడు. క్షమయనభ్యసింపుఁడు. క్షమనుబాయకుఁడు. ఇదియే యీ సభకు నాధారము. ఇదియె లోకమునకుఁ బ్రపంచమునకు నాధారము.

క్షమయె నామధేయముగాఁగలభూదేవి విష్ణుమూర్తికిఁ బ్రియక్షేత్రమయ్యెను. ఆకతన మిక్కిలి పూజ్యురాలు. ఆపూతచారిత్ర, క్షమాగాత్రి, ధాత్రియెల్లచోటుల నుండ నెల్లచోటులమనకు గోచరమగుచుండ మనకేల నెల్లచోటులఁ బ్రియమును నానందమునురాక యొక్కొక్కచో మాత్రమానందము గలుగుచున్నది. ఏలా కోరమణీయ శైలసరిత్సముద్రనందన వనసందర్శనములవలననే ముదమావహిల్లుచుండునని యోచింపనగును. దానికి మనయధికారయోగ్యతయె కారణము. అంతట నానందించుచు. సంతట సమరసభావము నెఱపుచు నుండఁదగిన యోగ్యతను సంపాదించిన నంతట నంతసింపుదుము.

"యోగరతోవా భోగరతోవా సంగరతోవా సంగవిహీనః
యస్యబ్రహ్మణి రమతేచిత్తం నందతినందతి నందత్యేవ—భజగోవిందం"

"కావుతయోగియుఁ గావుతభోగియుఁ
గావుతసంగియుఁ గాతవిసంగియు
నెదబ్రహ్మము నలయించినఁ బొందుఁ
ముదముఁ ముదముఁ ముదమేయొందుఁ"

అట్టి యోగ్యత సంపాదించుటకు సమచిత్తత మార్గము. సమచిత్తతకు జ్ఞానము మార్గము. ఆక్రమము వివరించెదను.

Ancient wisdom says " Unimagined beauties, exquisite sounds delicate subtleties, touch the walls of your prison house and pass on unheeded. Not yet is developed the perfect body that shall think to every pulse in nature as the Æolian harp to the sephen.

ఊహింప నలవి కాని సౌందర్యములును, నుత్కృష్టస్వరములును, లలితములగు సూక్ష్మపదార్థములును, మనలను సోఁకి మనయెఱుక లేకయె పోవుచున్నవి. మాయాశృంఖలములకు లోఁబడి వానినిఁ జూడఁజాలము. అనుభవింపఁజాలము. అన్నిటియందు సమరసభావము నెఱపఁగల నిర్దోషశరీర మిప్పటికిఁ బరిణమింపలేదు. అట్లది పరిణమించె నేని నారదుని వేయితంతువుల వీణయగు మహతివలె సర్వస్వరముల సౌమ్యతతో గ్రహించి పాడును. ఎల్లయెడలను సంతోషించును.

ఈ సమరసభావమునకు, సమచిత్తతకు, సౌమ్యభావమునకుఁ గారణము మూలము, దాతయు జ్ఞానము. జ్ఞానము హెచ్చిన సౌమ్యత హెచ్చును. దీనిని గణితశాస్త్రిముచే నుదహరించెదను. సాధారణమైన లెక్కలు మాత్రమె యెఱిఁగి నతఁడు చౌకపుఁ బ్రక్కకును మూలలదూరమునకును సమరసభావ మెఱుఁగఁడు. ఒకదానితో మఱియొక దానినిఁ గొలువఁజాలఁడు. క్షేత్రగణితము జదివినదానినిఁ జెప్పఁజాలి సమరసభావ మెఱుఁగును. ఇట్లు చక్రమునఁజుట్టు కొలతకును నడ్డకొలతకును సమమానములేదను వాఁడు క్షేత్రగణితముంజదివిన నున్నదనును. వీనికిబీజగణితమునను సమమానములేదు. కోణగణితములలోమాత్రము గొన్నిటికి సమమానములు గనఁబడుచుండును. ఇట్లు పెక్కుశాస్త్రములను బెక్కనుభవములను జ్ఞానమువచ్చిన సమరసభావము వచ్చును. సర్వజ్ఞుఁడగు నీశ్వరునకు సర్వసమత్వము గలదు. సర్వవ్యాపియు సర్వజ్ఞుఁడు నగువిష్ణువె సర్వసహిష్ణువు. ఆసర్వజ్ఞుఁడె భూక్షేత్రమున నెల్లయెట్ల నానందించును. కావున నెల్ల చోట్ల నానందించు పొంటె నెల్లజ్ఞానమును నార్జింపవలయును. దాన సర్వసహిష్ణువై, సర్వవ్యాపియై, సదానందుఁడై వెలుఁగును.

ఇంతటిజ్ఞాన మెట్లు సేకూఱునని భయపడకుఁడు.

ధీయంత్రేణ వచోఘటేనకవితా కుల్యోపకుల్యాక్రమైః
ఆనీతైశ్చ సదాశివస్య చరితాంభోరాశి దివ్యామృతైః

హృత్కేదారయుతాశ్చ భక్తికలమాస్సాఫల్య మాతన్వతే
దుర్భిక్షాంమమ సేవకస్యభగవన్ విశ్వేశభీతిఃకుతః.

ఉ. బాసలబానబుద్ధియను బండికిఁగూరిచి కావ్యకుల్యలం
జేసిమహేశు సచ్చరితసింధువు స్వామృతముం గడించినన్
భాసిలిభక్తిసస్యములు పండునుహృద్భువి సత్ఫలంబులం
గాసిలనేలఁగాఁపునకు క్షామభయంబున విశ్వనాయకా.

ఆవిశ్వేశ్వరుఁడు సదాశివుఁడు మనకుజ్ఞానమిచ్చి తనలోనైక్యముఁ జేసికొనఁగల వాఁడు. భయపడవలదు. బుద్ధియనుయంత్రమున స్వరపాత్రమునఁ గావ్యములను కాలువల వెంబడి జ్ఞానము సంపాదింపుఁడు. జన్మసాఫల్య ఫలములను జేర్చుకొనుఁడు. అట్లు సంపాదించి యెల్లచోట్ల భక్తిని సమరసభావమును నెఱపుఁడు. అప్పుడెల్లచోట్ల నానందింతురు. ఎల్లచోట్ల వి[illegible]వులు వారిభార్యలగు స్త్రీలను, నీశ్వరుని శక్తినిఁ, బురుషునిఁ బ్రకృతినిఁ జూతురు. ఆదృష్టియే విశ్వరూపదర్శనము. దానిచేఁబరమానందమగు. ఆనందతాండవమాడు నీశ్వరునిఁబోలుదురు. ఈశ్వరుఁడు, శక్తియుఁదక్క మఱియే దియుఁదోఁచదు. అధ్యాత్మరామాయణమున నారదుఁడాడు వాక్యముల వినుఁడు:—

లోకేస్త్రీవాచకంయద్యత్ తత్సర్వంజానకీశుభా
పున్నామవాచకంయద్యత్ తత్సర్వంత్వంహిరాఘవ
తస్మాన్ లోకత్రయేదేవ యువాభ్యాంనాస్తికించన.

లోకములం దేదేది స్త్రీవాచకమగునో యదియది మంగళదేవతయగుజానకి. ఏదేది పురుషవాచకమగునో యవియన్నియు రాఘవా నీవే. కావున లోకత్రయమునందు మీ యిద్దరుతప్పఁ దక్కొదియులేదు. ఇదియే నారదుఁడు. మహతియందు నెల్లప్పుడు పాడుచుండు సనాతనసౌమ్యస్వరము.

అంతశ్శక్తి నీశ్వరునందును, బ్రకృతి పురుషునందును మగ్నమగు. ఆపురుషునిక్రతువే సృష్టి. మనకానందమిచ్చుప్రకృతి. ఎట్టకేలకిట్టి యానందమునకుఁ బురుషునియజ్ఞమే కారణము. దానితప్ప లోకమున నేదియులేదు.

ఇదివఱకును క్షమనునభ్యసింపుఁడని నుడివితిని. దానికిప్పుడెడమిచ్చెదను. అవకాశముగలిగినది. నేను జెప్పినదానిలో ననేకములు దోషములును లోపములును నుండును. వానిని క్షమించి నన్నుఁ గరుణింతురు గాక.

ఎల్లచోట్ల నిండియుండు జగదీశ్వరునిధ్యానముచేసి నేను విరమించుచున్నాను. కూర్చుండుచున్నాను.

నాన్యం భజామి నశ్రుణోమి నచింతయామి
నాన్యం స్మరామి ననమామి నచాశ్రయామి
భక్త్యా త్వదీయ చరణాంబుజ మాదరేణ
హేశ్రీనివాస పురుషోత్తమ దేహిదాస్యమ్.
నిన్నెడఁబాసి నేనితరునింగొలువం జెవిఁబెట్టనాశ్రయిం
పన్నెసల్పధ్యానమున సంస్మృతిల్పను శ్రీనివాసుఁడా
వేన్నెఁడ నేనునీఘనమ వేగమనాదటనిర్ణయింపు నీ
క్రొన్ననకాలులంగు నెలకొన్ననపర్యలఁ బూరుషోత్తమా.

V GOPALAYYA.

## సాధనచతుష్టయసంపత్తి.

## ఎట్లుజ్ఞానికావచ్చును?

ఒక్క ప్రపంచమందలి పరిపక్వజీవులెల్ల మఱియొక ప్రపంచమునకు బీజములు సుమ్ము. ఇట్టి యనేకత్వమునందె యేకత్వము సాధింపఁబడి యదిభవిష్యద్బ్రహ్మాండ సృష్టికి మూలమగుచున్నది. అదియె దానినడప బాలింపఁ జాలినశక్తియగు. ఇట్టగు నేని జీవవికాసమునకింతకష్టపడ నేల? దానికై చేయఁ బ్రయత్నములయందిట్టు తడబడు నట్టుఁ గన్పట్టనేల? మనుజులు పాపమునబోయిగాని పుణ్యముఁ జొఱకుండుటయేల? వారు తమ్ము నీచమునకుఁ దెచ్చుపాపము వెంబడినె పరువెత్తుచు సద్గతినిచ్చు బుణ్యమా చరింపరదియేల? మానవకోటికి బాల్యదశయందు ధర్మాధర్మముల నుపదేశింప నవతరించిన మనువులకు నీశ్వరాజ్ఞానువర్తులగు దేవతలకు నీశ్వరునకును బ్రపంచప్రవృత్తియందిట్లు తడబాట్లులేకుండ నడప సాధ్యములేకపోయెనే? వారింతమలకలుగల మట్టుద్రోవన గాక చక్కనిమార్గమున లోకమునుగొంపోవఁజాలరే?

సృష్టిప్రయోజన మెఱిఁగినచో జీవవికాసమింత దుర్ఘటమగుటకుఁ గారణము దెలియు. సత్వగుణపరిపూర్ణతగల జీవకోటులనె సృజించియున్న బాగుగనుండు నేమో

నంతసులభమగు స్థితి యెట్టిదియగునో యోచింపుఁడు. అప్పుడు మనుజుఁడు బలవంత
మగువిధికిఁ లోఁబడి తప్పించుకొనఁజాలక యవశతతోఁ ద్రిమ్మఱుమ యంత్రముంబోలి
యుండవలయు గదా. ధాతువర్గ మిట్టివిధికిలోనైయున్నది. అణువులు పరస్పరమిట్టి
బలవత్తరమగువిధిచే నాకర్షింపఁ బడుచున్నవి. అయినను సృష్టిజాలంబునఁ గ్రమక్ర
మంబుగఁ గొంతకొంతగ స్వాతంత్ర్యమగపడుచు మనుష్యునియందు స్వేచ్ఛాశక్తి వెలి
వడుచున్నది. ఇదియే మనుజునియం దీశ్వరాంశము వ్యక్తమగుట సుమ్ము. చూపిన
త్రోవనె కన్నులుమూసుకొని నడచుయంత్రములను గల్పించుటకాదు సుమా. సృష్టికి
ప్రయోజనము. అనుభవజ్ఞానముచేఁ బుణ్యమాచరించుచు దుఃఖబీజము నిస్సారము నగు
పాపమునఁ బోఁగ జ్ఞానమున గుణములఁ బరిపూర్ణతఁ జెందిన యీశ్వరువంతవారుగ
కల్గుటయె సృష్టికిఁ బ్రయోజనము.

అట్లగుటవలన నిప్పుడు లోకపాలురగు మహాత్ములయందువలె నిఁక రానున్న
ప్రపంచమున నొకతెరువుననే చనువారిచే నైక్యభావంబుఁ గాంచనగు. వారనుభవము
వలనను జ్ఞానమువలనను మఱల నేకత్వమందినవారుగ నుందురు. సమష్టిజ్ఞానమువలన
నొక్కత్రోవన వర్తించువారగుదురు. ధర్మంబె సుఖదమను నెఱుకచే దానితో
నొక్కరూపయి నడతురు. అట్టి యేకత్వంబుఁగనుట బలాత్కారంబుచేఁ గాక నిండు
తెలివిచే నగు. జ్ఞానమున బలముననఁ గోరికల నైక్యభావంబుగని దేవత్వమంది ధర్మ
స్వరూపులగు మహాత్ములచే ధర్మమీబ్రహ్మాండమందువలె నాబ్రహ్మాండమున నెఱుకతో
నడపఁబడు. తమతమత్రోవల నేచను ననేకు లన్నింటనిండిన దానితో గలిసి పరమ
ధర్మంబును దాము నొక్కటై యిట్టిపదవిఁ జేరుటకు మేలుఁగీడునుఁ గెలుపునోటమియు
నెఱుకపరుచుఁ దెరువుతప్ప వేఱొండుత్రోవలేదు. ఇవ్విధంబున మనుజులు దేవత్వం
బుఁగాంచి తమయనుభవజ్ఞానముచే మనోవృత్తులన్నింట నొక్కతీరుననే నడతురు.
మనుష్యుల కాచార్యులుగ నవతరించిన దివ్యపురుషు లిట్టి యుత్తమపదవి సాధింప య
త్నించి దానికనువగునట్టుల ననేకమనుష్యజాతులఁ బ్రవృద్ధిచేసిరి. వీర్యవంతు లగు
నార్యులను మున్ను నెగడిన చతుర్థశాఖవారి యౌన్నత్యమెన్నఁబూనిన పెద్దయుం
బొద్దు సెల్లుఁగాన దానిఁగొంతమట్టు సూచించెద. పూర్వమున మిక్కుటంబుగఁ
బెంపందిన మనుష్యశాఖ యొక్కటి యుండె. ఆదిమహాపురుషుల పాలనచేఁ గొంత
కాల మభివృద్ధిఁ జెందె. అంతట వారు ప్రత్యక్షముగ పాలించుట మానుకొనిరి.
క్రొట్టుటడుగు వెట్టుబిడ్డ తన చేయూఁతదప్పిన నెట్టునడచునో చూతమని తల్లి చేయి

వదలుమాడ్కి రాజన్యులు శిశుప్రాయులగు నాజనులు చక్కగనడచెదరో తడబడియె దరో చూతమని మఱుగుపడిరి. అంత వారు తడఁబడి తప్పనడచిరి. వారిదృఢరాజ్య సంపద వర్ణాశ్రమాచారపద్ధతి నడివోని తెలివిచేఁ బెంపువడసినదయ్యు వారు గామోప హతులై స్వార్థపరులగుటంజేసి తుత్తుమురయ్యె. ఇది యిట్టులగుడు మఱలఁ బ్రయత్నింపవలసె. అంత నార్యశాఖప్రవృద్ధిఁ జెందఁ దానికింబోలె దీనికిని దివ్యపురుషు లాచార్యులుగఁ బరిపాలకులుగనైరి. మనువు వర్ణాశ్రమ ధర్మంబులు లోనగు ధర్మముల నుపదేశించె. అధిక నాగరికదశకుఁదెచ్చె. నీతిశాస్త్రంబులఁ గఱపె. మహర్షులిట్టి మనువుతోఁగలసి ధర్మంబుఁ జెల్లించుచు జనులు విమార్గమునఁ బోకుండదిద్దిరి. ఇవ్విధంబున మరల మానవులకుఁ దామిట్టివారు గావలయునని నిరూపింపఁబడియె. నిస్సహాయులై నడవ నాత్మశక్తి వీరికిఁ జాలునే చూతమని మరల నాచార్యులంత హితులైరి. అంత నీప్రయత్నంబును విశేషఫలకారి కదయ్యె. మఱియు దీనిప్రాభవము మొదల నమానుషంబయ్యు నడ్డుపాటులుంగని నరులకామంబువలన నానాటఁ గ్రిందుపడఁ జొచ్చె. హిందూదేశము పూర్వకాలమున సంపూర్ణ రాజనీతితోడను వెలుఁగొనల్పఁ జాలిన నాగరికతతో వెలసె. అంత హితోపదేశమొనర్చు మహాత్ములు కనుమఱుగగుడు నరులు దమంతన నడవఁబ్రయత్నించి తప్పుతోవలఁద్రొక్కి నీదేశము వేనవేల సంవత్సరములుగ హీనదశఁ జెందినది. మహాత్ముల మనోభీష్ట మెట్టులీప్రయత్నములు రెండింటియందును నెఱవేఱదయ్యెనో చూడుఁడు. మఱియు నార్యులకు ప్రథమమున నుపదేశింపఁబడిన దివ్యధర్మముల నేలంగలిపి మనుజుల దుర్ణయంబె లోకమంతట నిపుడు బలిసియుండుట యుఁ గనుఁగొనుఁడు. ఆనాఁడు బ్రాహ్మణుఁ డెట్టివాఁడుగ నుండెనో కనుడు. అతఁడు జీవన్ముక్తదశ జెందినవాఁడు. భూలోకసంపదలంగోరఁడు. భోగములొల్లఁడు. ఇంతయేల. ధనంబును ప్రభుత్వమును మఱియు నిహలోకసుఖంబు లెట్టివైనను వానికి రుచింపవు. వాఁడు బ్రాహ్మణుఁడు పేదయయ్యు జ్ఞానసంపదచే నొప్పె. నేడు బ్రాహ్మణుఁడను పేరఁబరగువాఁడు తఱుచుగ గలవాఁడై తెలివిలేని వాఁడై యున్నాఁడు. వర్ణముంగుఁ బూర్వపునీతి సెడుట గన్పట్టుచున్నది. తక్కిన వర్ణములనీతియు నింతయే సుమ్ము. నరులకిపుడు వెగటగు నాగమ్యస్థానంబుఁ దమంతన యనుభవజ్ఞానంబుచే నరులుగోరునటుల మహాత్ములేమి యొనర్చిరి. మానవుల కొది యుండె నిరూపితంబయ్యు వారికష్టస్వభావంబునం జేసి సిద్ధింపని యఖండపదవిఁ బాలిపులగు వీరినిఁజేర్ప నాచార్యు లెట్టులఁ బ్రయత్నించిరో చూతము.

అరటిపండ్లు కాయలు సంవత్సరము పొడువున దొరుకును. దానికి ఋతువు లేదు. డక్కాలో పండ్లు 5 అంగుళములు పొడవుండును, మదగాస్కరులో ముంజేయియంత పొడువును, ఫిలిప్పైన్ కొండలలో ఒకపండు మనిషి మోయునంత యుండును. గొప్పపండ్లన్నియు ఊరలగడ్డలవలె వుడికించవలసి యుండును. ఈ మదరాసు రాజధానిలో 17,000 ఏకరాలు అరటితోటలున్నవి. అరటి పండును శోధించగా

అరటిచెట్టు.

| | | | |
|---|---|---|---|
| నీళ్లు | 16 పాళ్లు | చక్కెర | 2 పాళ్లు |
| గంజి | $67\frac{1}{2}$ ,, | నూనె | $4\frac{1}{2}$ ,, |
| బంక | $4\frac{1}{2}$ ,, | దాతువు | $4\frac{1}{2}$ ,, |
| నార | $4\frac{3}{4}$ ,, | బూడిదె | $4\frac{1}{2}$ ,, |

ఒక్క చెట్టున 160 తులములనార తీయవచ్చును. ఒకఏకరాకు 600 పౌనుల నార తీయవచ్చును. తమలపాకు తీగె ఆమొదలగువాటికి అరటిచెట్టు అపుగావుండును. అరటిస్తంభము పైభాగమందు మసిచేయుటకు ఉపయోగమైన రసమొకటి యుండును. నారకాకితములు కిత్తానారగుడ్డ చేయుటతగును. చీనావారు నేతమొలకలను కాకితములకై ఉపయోగించుదురు.

మనస్త్రీలు సీతవలె భక్తియు, ద్రౌపదివలె గాంభీర్యమును, సావిత్రివలె పాతివ్రత్యమును మైత్రేయివలె జ్ఞానమును, డార్లింగ్ వలెసాహసమును, రాజపుత్రస్త్రీలవలె ధైర్యమును, ఫ్లారెన్సుపక్షి వలె దానమును, స్వర్ణమయివలె ఔదార్యమును పొంది యుండవలసినది. కాలానుసారము స్త్రీలు విద్యచెప్పవలసినది. మన అన్యభాషనేర్చినను మనదేశమునందెక్కువ ఆసక్తి యుండునట్లు నేర్పవలసినది. విద్యావంతురాలైన ప్రయోజనము లేదు. విద్య మనస్సునంటి హృదయములో ప్రవేశించి చదివినది కార్యరూపముగా చేయుటకు నేర్పవలసినది. ఇంటికార్యములు స్త్రీనిర్వహించ వలసియున్నది గనుక స్త్రీస్వతంత్రించి పనులు జరుపుటగాక మగని ఆజ్ఞకులోబడికూడ యుండవలయును. ఏలక, తగ్గిన, పాలించడమనునదులో శక్తి యొకటియున్నది. దీనివల్ల ఇంటియందు శాంతి సంతోషము సిద్ధమైయుండును. దేశాభిమానము, ఆదరణ స్త్రీమనసున నిండియుండవలసినది. స్త్రీకి యివి మనసున లేకున్న ఒకనికి భోజనము పెట్టుటకూడ

స్త్రీ యుండవలసినరీతి.

యెంతకష్టమో మనకు అనుభవమువల్లనే తెలియును కదా ? ఇతరదేశముల సాంప్రదాయములు ఇంటిలోకి రాకుండ స్త్రీని కాపాడవలయును. పిల్లలకు స్వదేశాభిమానము కలుగునట్లు మనదేశమున కలిగిన వస్తువులనే వుపయోగింపవలయును. ఇట్లు స్త్రీప్రతి యింటియందు చేసిన మనదేశము వృద్ధిరాకపోదు. వేరుమార్గము లేదు లేదు.

చపాతి.

దక్షిణ అమెరికా దేశమున చపాతిని పరిక్షించగా చపాతిని ముండ్లుతీసివేసి ఇతర గడ్డివలెనే పశువులకు ఆహారముగా ఉపయోగించుటకు తగునని నిర్ధారపరచియున్నారు. మధ్యఅమెరికాలో దానిని తవుడు, పత్తిగింజలతో చేర్చి పశువులకు ఉపయోగించుచున్నారు. కాలిఫోర్నియాలో చపాతిలో ఇంకొక చెట్టును చేర్చి పెంచుటవల్ల ముండ్లులేని చపాతియొకటి కలుగుచున్నదనియు అది పశువులకు ఆహారయోగ్యముగ నుండుననియు తెలియవచ్చుచున్నది. దీనిని ఎక్కువగా పరిశీలించుచున్నారు. దీనివిషయము ముందు తెలియబోవును.

నూనెయంత్రము.

అనేక విధములైన నూనెవిత్తునుండి నూనె తీయుటకును గానుగపిండి చేయుటకు బొంబాయియందు ఒకగొప్ప నూనెయంత్రము స్థాపింపబడియున్నది. ప్రకృతము పత్తివిత్తులలో పనిచేయుటకు ప్రారంభము చేయడమగును.

పేనాలు.

కాశీపట్టణమున లక్ష్మీకుండ 16 సంఖ్యగల యింటియందు పేనాశాల ఒకటి నిర్మింపబడి అందుచేయు స్టైలోపేనాలు, మసిగలపేనాలు విదేశమునుండివచ్చువాటికంటె శ్రేష్టమైనవిగానున్నవి. స్టైలోపేనా 1-8-0 రూపాయలును, మసిపేనా రూ. 2-4-0 కు అమ్మబడుచున్నవి. ఈసామానులు కావలశినవారు ఉపయోగింపవచ్చును.

సాధారణముగ జనులు పండ్లుశుద్ధిచేయనందువల్ల పండ్లను శీఘ్రముగ పోగొట్టుకొందురు. ఇతర కారణమువల్ల అంతగా పండ్లుపడిపోవవని ఒక పంటిశాస్త్రివేత్త చెప్పుచున్నాడు. పండ్లు శుభ్రముగా వుండవలెనని కోరిన నాటిని భోజనముచేసిన వెనుకను నిద్రపోవుటకు ముందును శుద్ధిచేయవలశినది.

continued from page 22



### శ్రీకృష్ణులవాక్యము.

కురుశ్రేష్ఠుడా! నీ వొకడవె చూచితివి. నాఘోరరూపమును చూచినందువల్ల వ్యథపడకుము. భయపడకుము. కలతనొందకుము. నిర్భీతుడవుకమ్ము, సంతుష్టమనస్కుడవుకమ్ము. నాసహజరూపము మరలచూడుము.

### సంజయుని వాక్యము.

వాసుదేవుడిట్లర్జునునిజూచి పలికి తన సహజస్వరూపమునుజూపి భయపడిన యర్జునుని నూరడించెను.

### అర్జునుని వాక్యము.

జనార్దనా! సౌమ్యమైన నీమానుషరూపమును మరలజూచి ఇప్పుడు సమాధానమునుబొంది మరల సహజస్వభావమును పొందియున్నాను.

### శ్రీకృష్ణుల వాక్యము.

నీవుచూచిన ఈ నారూపము జూచుట కతికష్టమైనది. ఈరూపము జూచుటకు దేవతలు సదా యపేక్షించుచున్నారు. నీవు నన్నుజూచినట్లు వేదములవల్ల, తపస్సువల్ల, దానమువల్ల, యజ్ఞమువల్లగాని జూడ సాధ్యముగాను. ఐతే, అర్జునా! నాయందవిచ్ఛిన్నమైన భక్తిచేతమాత్రమే నన్ను గ్రహించవచ్చును. తెలియవచ్చును. నాతత్వమును జూడవచ్చును. పొందవచ్చును. నాకొరకు కర్మచేయువాడు, నన్నే యుత్కృష్టగతియని నమ్ము నాభక్తుడు, సంగవర్జితుడై సర్వభూతములయందు వైరములేక, అర్జునా! నన్నుబొందును.

విశ్వరూపసందర్శనయోగము పదునొకొండవ యధ్యాయము సమాప్తము.

## పదిరెండవ యధ్యాయము - భక్తియోగము.

### అర్జునునివాక్యము.

సదాయోగయుక్తులై నిన్ను బూజించు భక్తులలో అక్షరమై యవ్యక్తమైన స్వరూపమును బూజించువారలలో నెవరు శ్రేష్ఠమైన యోగవిదులు.

### శ్రీకృష్ణులవాక్యము.

నాయందు మనసునిలిపి నన్నుసదాయోగయుక్తులై బూజించి పరమశ్రద్ధతో గూడుకొని యుండువారు యోగశ్రేష్ఠులని నాయభిప్రాయము. అక్షరమై, యనిర్దే

శ్యమై, యవ్యక్తమై, సర్వవ్యాపియై, యచింత్యమై, కూటస్థమై, అచలమై, ధృవమైన పరమతత్వమును యింద్రియములను నిగ్రహించి స్వాధీనపరచుకొనుచు సర్వత్రసమబుద్ధి గలిగి, సర్వభూతహితరతులై ధ్యానించువారుగూడ నన్ను బొందుదురు. అవ్యక్తాసక్త చిత్తులకై నధికతరమైన కష్టముగలుగును. అవ్యక్తమార్గము దేహధారులకు సాధించుట గష్టము. నా యందాసక్తిగలిగి సర్వకర్మలను నాకర్పణజేసి అనన్యయోగముతో నన్ను ధ్యానించిపూజించు వారిని యధార్థముగా వారు నాయందు మనస్సునునిల్పిన వారు గనుక నేను శీఘ్రముగా జననమరణసంసార సాగరమునుండి నుద్ధరింతును. నాయందు నీమనస్సునుంచుము. నాలోన నీబుద్ధిప్రవేశపెట్టుము. వెనుక నిస్సందేహముగా నీవు నాయందు నివశించుదువు. నాయందు నీమనసునుస్థిరముగా నిలుపుటకు నశక్తుడవైతి వేని యభ్యాసయోగము చేత, అర్జునా! నన్ను బొందప్రయత్నింపుము. సంతతాభ్యాసమును జేయవైతివేని, నాశుశ్రూషయందు మనస్సునుంచుము, నాకొరకు కర్మజేసిన నీవుసిద్ధి బొందుదువు. దీనిని గూడజేయ నీకు సామర్థ్యములేకున్న నాత్మనిగ్రహముగలిగి కర్మఫలాపేక్షవిడచి నన్ను జేరుము. సంతతాభ్యాసముకంటె జ్ఞానముశ్రేష్ఠము. జ్ఞానముకంటె ధ్యానముశ్రేష్ఠము. ధ్యానముకంటె కర్మఫలత్యాగము శ్రేష్ఠము. త్యాగమువల్ల శాంతికలుగును. ఏప్రాణియందు ద్వేషములేక మిత్రుడై, దయాపరుడై, యహంకార మమకారములులేక, సుఖదుఃఖములయందు సముడై, యోర్పుగలవాడై, నిత్యసంతోషియై, యోగియై, యాత్మనిగ్రహముగలవాడై, దృఢనిశ్చయుడై నాకు మనోబుద్ధులర్పించిన నాభక్తుడే నాకుప్రియుడు. ఎవనివల్ల లోకమునకు భయములేక, ఎవడు లోకమునకు భయపడక, హర్షామర్ష భయములును వ్యాకులతయు లేనివాడు నాకు ప్రియుడు. దేనియందపేక్షలేక పవిత్రుడై, దక్షుడై, విషయరహితుడై, నిర్భయుడై, కర్మాద్యంతము సన్యసించిన నాభక్తుడు నాకుప్రియుడు. సంతోషించక, ద్వేషించక, వ్యసనపడక, కోరక, సుఖాసుఖములను త్యజించి భక్తిపరుడైనవాడు నాకుప్రియుడు. శత్రుమిత్రులందు మానావమానములందు శీతోష్ణములందు సుఖదుఃఖములందు సమానుడై, సంగరహితుడై, నిందాస్తుతులందు సమానుడై, మౌనియై ప్రాప్తించినదానితో సంతుష్టుడై, నివాసరహితుడై, నిశ్చయబుద్ధిగలవాడై, భక్తిపూర్ణుడై మనుజుడు నాకు ప్రియుడు. ఇచ్చట విస్తరించినధర్మ్యామృతమును భక్తితో నాశ్రయించి నన్నే పరమగతిగా నమ్మియుండువారు నాకు పరమప్రియులు.

భక్తియోగము సమాప్తము.

బూత నళినపాదయుగళమున నవిస్మృతిఁ గనుం
గాత డెందమెల్ల పుట్టుకలను ముకుంద నీకృపన్. 3

శ్లో. నాహం వందే తవ చరణయో ర్ద్వంద్వమద్వంద్వహేతోః
కుంభీపాకం గురుమపి హరే నారకం నాపనేతుం
రమ్యారామామృదుతనులతా నందనే నాపిరంతుం
భావే భావే హృదయభవనే భావయేయం భవంతమ్.

శా. మీఱంగోరను ద్వంద్వభావములఁ గుంభీపాకఘోరార్తి పో
బాఱంగోర సురాటవిన్ మృదులశోభాగ్యాంగనా సంగతిన్
జాఱంగోర ముకుంద నీపదసరోజాతంబులన్ మ్రొక్కుటన్
వేఱొండేనియు నేఁగ కెప్డు నినుఁ జిద్వృత్తిన్ గనన్ గోరెదన్. 4

శ్లో. నాస్థా ధర్మే న వసునిచయే నైవ కామోపభోగే
యద్యద్భవ్యం భవతు భగవన్ పూర్వకర్మానురూపం
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేపి
త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలా భక్తిరస్తు.

ఉ. ధర్మమునందుఁ గామమున ద్రవ్యచయంబునఁ బూన్కి గాదు నా
కర్మము పూర్వజన్మతఁ గారణభూతము తానఁ జేరు నా
కర్మిలి నాదరింపు మొకప్రార్థన మెల్ల భవంబులన్ భవ
న్నిర్మలపాద పద్మగత నిశ్చలభక్తి ముకుంద యీఁగదే. 5

శ్లో. దివి వా భువి వా మమాస్తు వాసో, నరకే వా నరకాంతక ప్రకామం
అవధీరితశారదారవిందౌ, చరణౌ తే మరణేపి చింతయామి.

కం. దివి భువి నరకమునం దే, నివసించిన నేని యుసురు నిలువఁగఁ గృష్ణా
యవధీరితశరదరవిం, దవిలాసపదస్మరణము తనరు ముకుందా. 6

శ్లో. కృష్ణ త్వదీయపదపంకజ పంజరాంత, మద్యైవ మే విశతు మానసరాజహంసః
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః, కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే.

కం. నేఁడే యడుగుందమ్ముల, గూఁడుదున నెదరాచయంచఁ గూర్పుము చావున్
మూఁడిన స్మృతియేది పలుకుఁ, బోఁడిమి కఫవాతపిత్తములఁ జెడఁగృష్ణా. 7

శ్లో. చింతయామి హరి మేవ సంతతం, మందమందహసితాననాంబుజం
నందగోపతనయం పరాత్పరం, నారదాదిముని బృందవందితమ్.

Registered No. M 716.
SWAN SERIES No. 3.

ఓం



# హంస.

A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఒక యాంధ్ర బ్రహ్మజ్ఞాన మాసపత్రిక.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 2.] { సౌమ్యసంవత్సర చైత్రమాసము 5010, మార్చి 1909. } [సంచిక 3.

విషయసూచిక.



చెన్నపట్టణము:

వైజయంతీ ముద్రాక్షాలయందు ముద్రింపబడినది.

మానేజరు, హంసశాల, 30, అంగప్పనాయక్ వీధి, జార్జిటవున్ మదరాసు. అని వ్రాయవలెను.

సంవత్సరమునకు చందా 1 రూపాయ.

## ప్రకటనలకు ద్రవ్యనిర్ణయములు.

| | | పూర్తిపేజి. | అర్ధపేజి. | ¼ పేజి. |
|---|---|---|---|---|
| సంవత్సరమునకు | ... రూ॥. | 40 | 30 | 20 |
| 6 నెలలకు | ... ,, | 24 | 18 | 12 |
| 3 నెలలకు | ... ,, | 18 | 9 | 6 |
| నెలకు ... | ... ,, | 5 | 4 | 3 |

---

## హంసావళి.

1. షట్త్రింశన్మంజరి:—శ్రీశంకరాచార్యులు రచించిన భజగోవింద శ్లోకముల నాంధ్రభాషాణ పద్యాత్మికముగా రచింపబడినది. ఆబాలవృద్ధులకు నానందకరమైనది. వెల 2 అణాలు మాత్రమే.

2. ఏకాదిరత్నావళి:—1 మొదలు 224 సంఖ్యవరకు గల విషయవిశేషములింగు సంగ్రహింపబడినవి (అయనద్వయము, వాసనాత్రయము, సాధన చతుష్టయము, మొదలగు 1008 విషయములు) వెల 4 అణాలు మాత్రమే.

3. హంస:—ఇది మాస తెనుగు పత్రిక 1908 జనవరినుండి వెలువడుచున్నది. ఈ జన్మసార్థకము జేసుకొన గోరువారు దీనిని నిరాకరించ జాలరు. చందా సంవత్సరమునకు నొక రూప్యాయియే.

4. ముకుందమాలా స్తోత్రము:—ఇది విష్ణుస్తోత్రము. పారాయణమునకు అనుకూలమైనది. సంస్కృతశ్లోకము దానికి సరియైన తెనుగుపద్యము చేర్చి ముద్రింపబడుచున్నది. వెల 1 అణా.

---

## హంసపత్రికావళి.

1. Transactions of the Seventh Annual Federation of the Central Districts of the T. S. Branches. Price 1 anna.

2. స్వాగతప్రసంగము:—1908 సం॥ అగష్టు 22, 23 తారీఖులందు అనంతపురమున జరిగిన మధ్యజిల్లాలలోని బ్రహ్మవిద్యాసమాజమునకు చేరిన సభికుల సహాసభకుఇచ్చిన ఉపన్యాసము. వెల 3 పైసాలు.

ముందు పోక పెద్దలని లోకము పొగడువారి మార్గమనుసరించి ఇహలోకమునకును పరలోకమునకును సాధన భూతమైన మార్గమును పండ్లుకరచుకొనియైనను సాధించవల యును ప్రతివాడును ఈలోకమున అవతరించినందుకు తనకును లోకమునకును సంబంధ మును విచారించి మొదట తనకును, వెనుక తనకుటుంబ మిత్రాదులకును తన పురజను లకు, తన దేశజనులకు, లోకమునకు సుఖావహమైన నడతను తన శక్తికొలది సాధించ వలెను. ఇట్టి సాధనమార్గమందు యుగాదిపండుగలు, పుట్టిన దినములు, మనలను పరీ క్షించుకొన తగిన కాలసోపానములుగ ఎంచవలెను. ఎంచి విచారించుకొనవలెను. దైవనియమపు మెట్లు ఎక్కుచున్నామో దిగుచున్నామో హెచ్చరికతో విచారించు కొనవలయును. ఇదే జీవనోద్దేశము దేవుని పరీక్షయందు నీవెన్ని రూపాయలు పైసాలు తెచ్చినావని యడుగుటలేదు. జీవశక్తియే సకలప్రపంచ వ్యవహారసారముగా లెక్క పెట్టబడును. వేరుకొలతతో నీపుణ్యమును దేవుడు కొలుచుటలేదు. రాబోవు సంవత్సరమున శ్రేయోభివృద్ధిగ నడచుకొనెదని నిశ్చయించుమా? ఒక సంస్కృత కవివర్యుడిట్లు వర్ణించియున్నాడు.

దృశ్యంతే భువిభూరినింబ తరవః కుత్రాపి తేచందనాః
పాషాణైః పరిపూరితా వసుమతీ వజ్రోమణిర్దుర్లభః
శ్రూయంతే కరటారవాశ్చ సతతం చైత్రే కుహూకూజితం
తన్మన్యే ఖలసంకులం జగది దంద్విత్రాః క్షితౌసజ్జనాః.
గర్వం నోద్వహతేన విందతిపరాన్నో భాషతేనిష్ఠురం
ప్రోక్తం కేన్మచిదప్రియంచ సహతే క్రోధంచనాలంబతే
శ్రుత్వాకావ్యమలక్షణం పరకృతం సంతిష్ఠతేమూకర
ద్దోషాంశ్ఛాదయతే స్వయంనకురుతే హ్యేతత్సతాంలక్షణం.

అనగా, అనేక వేపమానులను చూచెదముకాని గంధపుమానులరుదు. భూమి యందు రాళ్లసంఖ్యాకములుగాని వెలగల మణులరుదు. కాకులంతట కూయుట విన వచ్చును కాని కోకిలకూత అరుదు. లోకమున దుర్మార్గులు మెండు. సన్మార్గు లిద్దరో ముగ్గురో!! సాత్వికులు గర్వమువహించరు, ఇతరులను దూషించరు, పరుషవాక్య ములు పలుకరు. ఒకరి కఠినమాటలనోర్తురు కోపమున కెడమివ్వరు. ఇతరుల అధ ర్మకార్యములనుచూచి, తప్పిదక మూగివారలవలెనుందురు తాము అధర్మమునకు లొంగరు.

# రథోత్సవములు.

ప్రతిదేవాలయమునందును సంవత్సరమునకొకతూరి కల్యాణోత్సవము చేయుదురు. అనంతరము స్వామికి రథోత్సవము గావించి రథస్థులైయున్న స్వామిని సేవించి భక్తజనులానందించెదరు. "రథస్థం కేశవందృష్ట్వా పునర్జన్మం నవిద్యతే" యనుశ్లోకమును స్మరించుచు రథముపై వేంచేసియున్న స్వామిని దర్శించిన తమకు తిరిగి జన్మమెత్తుట లేదని యానందించెదరు. కొయ్యరథము పంచలోహపు విగ్రహములు వీటిని దర్శించిన మాత్రమున జన్మమెట్లు లేకపోవును? ఎట్లు తరించగలరు? అని పలుమారు అన్య మతస్థులడుగుటయు హిందువులు చాలమంది అట్టి ప్రశ్నలకు సదుత్తరము లివ్వకపోవుటయు తటస్థించును. గాన రథోత్సవమున నేమోదాని ప్రయోజన మేమో తెలుసుకొనుట యావశ్యకమైయున్నది. కల్యాణోత్సవమును గురించి వ్రాయబడిన పత్రికయందు పరాపరా ప్రకృతులయొక్కయు పరమాత్మయొక్కయు కూడికచే దృశ్యాదృశ్యములగు సమస్త ప్రపంచములు సృష్టించబడినట్లు వ్రాయబడినదిగదా! దృశ్యాదృశ్యములగు సమస్త ప్రపంచములును పరమాత్మచే నిండియున్నవని సర్వశాస్త్రములును బోధించుచున్నవి ఈవిషయము యీదిగువ వ్రాయబడిన వాటివల్ల తేటబడుచున్నది.

భగవద్గీత ౯-వ అధ్యాయము ౪-వ శ్లోకము:

మయాతతమిదంసర్వం। జగదవ్యక్తమూర్తినా।
మత్థానిసర్వభూతాని। నచాహంతేష్వవస్థితః॥

డిటో ౧౫-వ అధ్యాయం ౧౭వ శ్లోకము.

ఉత్తమః పురుషస్త్వన్యః। పరమాత్మేత్యుదాహృతః।
యోలోకత్రయమావిశ్య। బిభర్త్యవ్యయ ఈశ్వరః॥

డిటో ౭-వ అధ్యాయము ౭వ శ్లోకము.

మత్తః పరతరం నాన్యత్కించిదస్తిధనంజయ।
మయిసర్వమిదం ప్రోతంసూత్రే మణిగణాయివ.

మముగ పరిశుద్ధిచేసి భక్తిజ్ఞానవైరాగ్యములను కలుగజేయును. మరియునావిగ్రహములను చక్కగనలంకరించుటచే చంచలముగనున్న మనసు ఆకర్షించబడి కొంతకాలమా విగ్రహమందు భగవద్బుద్ధిగలిగి నిలుకడగా నుండుటకుత్సహించును. గానసర్వవ్యాపియైయున్న యాత్మసాక్షాత్కారములకు మంత్రపూర్వకముగ ప్రతిష్ఠింపబడియున్న విగ్రహారాధన గొప్ప సాధనమైయున్నది. గనుక కల్యాణోత్సవముల యొక్కయు రథోత్సవములయొక్కయు యంతరార్థమెరిగి వాటినిసాధించుటకు లోకములో ప్రత్యక్షముగ జరుపబడు నుత్సవములను సాధనలుగా గైకొని సకలజనులు ముక్తులగుదురుగాక.

ఓంశాంతిః శాంతిః శాంతిః.

## 2 రూపాయలకొకబడి.



విద్యాభివృద్ధి లేనందున జనసముదాయమున జ్ఞానము తక్కువగానున్నదని యందరకు తెలిసిన విషయమే. అందరు దీనిని విచారించుచునేయున్నారు. ఐనను గ్రామములలో మూఢరైతులు విద్యనొల్లరు పాఠశాలలు పెట్టినను వృద్ధికిరావు. అందులో దుడ్డడిగిన ఆవంక తిరిగిచూడరు. జనులకు విద్యనేర్పి తీరవలశినదనువారు నెలకు 2 రూపాయలంపిన ఒకగ్రామమున నుండు చదువరిని ఏర్పాటుచేసి ధర్మార్థముగ ఒక క్లుప్తకాలమున రెండు ఘంటలకాలము వ్యవసాయపు పనుల బిడ్డలు పనియందుండని సమయమున ఆయాగ్రామాను కూలముగా లెక్కలు చదువు వ్రాతదేశభాషయందు చెప్పించ ఏర్పాటుచేయడ మగునని పెనుగొండ బ్రహ్మజ్ఞాన సమాజపువారు తలంచియున్నారు. జనుల జ్ఞానమునుగోరు ధర్మాత్ములొక్కరొక్కరు ఒక్కొక గ్రామమున పాఠశాలలను ఉద్ధరించ దేశమునకు జ్ఞానౌన్నత్యము తజ్జనిత సుఖానురాగము ఎందుకు కలుగక పోదో చూతము. దయచేసి ఒక్కరొక్కరు ఒక పాఠశాలకు సహాయము చేయవలశినదని సవినయముగ కోరడమైనది.

ఇట్టి సహాయముచేయగోరువారు వీరికి వ్రాయవలశినది.

హట్టి శంకరరావు బి. ఏ.,

వకీలు, పెనుకొండ, అనంతపురంజిల్లా.

## ఒక సంస్కృత పాఠశాల.

పెనుగొండలో ఒక సంస్కృతపాఠశాలను బ్రహ్మవిద్యా సమాజమువారు ఏర్పాటు చేసియున్నారు. దానికి ఈపత్రికనుండి కొంతసహాయము చేయబడునట్లుగా ఏర్పాటుచేయబడినది. ఈపత్రికనుంచి ఇట్టి అనేక ధర్మకార్యములు చేయవలెనని యత్నించుచున్నారుగాన సకలజనులు ఈపత్రికను ఎక్కువగా చందాదారులను చేర్చి వృద్ధి చేయవలశినదని పలుమారు ప్రార్థించుచున్నాను. బ్రహ్మవిద్యా సమాజమున చేరిన సామాజికులను ముఖ్యముగా ప్రార్థించుచున్నాను. సకలజ్ఞాన సంపన్నులను దేశాభిమానులను మఱి విశేషముగా బతిమాలు కొనుచున్నాను.

ఈపాఠశాలయందు ప్రకృతము బ్రాహ్మణులను శుద్ధిపరచుటకు సంధ్యావందనము, దేవతార్చనమంత్రములు, రుద్రము, నమకము, చమకము మొదలుగునవి ఉచితముగ చెప్పబడును. వేదాధ్యయనముకూడ కావలశినవారు ఉచితముగ నేర్చుకొనవచ్చును. విద్యార్థులు తమభోజనమునకు ఏర్పాటు తామే చేసుకొనవలయును. ఈకార్యము సమకూరుటకు పాఠశాలాధ్యాపకులైన వేదమూర్తులగు చన్నావధానుల వారిని ప్రార్థించుచున్నాము.

## తప్పొప్పులు.

43-వ పేజిలో 18-వ పఙ్క్తియందు

'ఫ్లారెన్సుపక్షికి'కి బదులుగా 'ఫ్లారెన్సు నైటింగేల్ అనునామె' అని చదువుకొనవలెను.

## సాధనచతుష్టయసంపత్తి.

## ఎట్లుజ్ఞానికావచ్చును?

అనేకయుగంబులకైన నదిసిద్ధించుగా యని కర్మయోగముపదేశించిరి. లోక వ్యవహారమగ్నుల కుచితంబగు యోగమిదియొసుమ్ము. ఈప్రవృత్తులవలని యనుభవజ్ఞాన

మునసే మోక్షమార్గమున నడవ మొదలిడఁదగు. దానసెగదా కర్మయోగంబు శిక్షార్థమై విధింపఁబడినది. కర్మయోగశబ్దార్థంబు విచారింపుఁడు. ఐక్యభావంబే ఫలంబుగాఁ గర్మమొనరించుట యనియర్థము. అస్థిరంబగు కర్మసముదయంబున సేగదా మానవులొక్కొక్కరికి భేదబుద్ధి గలుగుచున్నది. ఇట్లుండ సైద్ధాన భేదంబు గలిగె నదియె ఐక్యభావంబు నిచ్చుననుట యసంగతము. అయిన మహాత్ముల ప్రజ్ఞ దీని సమర్థింపఁజాలినదయ్యె.

నరుఁడు ప్రకృతిజములగు త్రిగుణములకగపడి పలుఁదెఱంగులఁ బరువెత్తుచున్నవాఁడు దేహిగుణబద్ధుఁడు. గుణంబులు సంచలించుచున్నవి. అవియే స్థూలప్రపంచంబును దోపింపఁజేయుచున్నవి. ఇట్లుండ నరుఁడు వీనికెల్లఁ దాఁగర్త యనుకొనుచున్నాఁడు. గుణములు చలింపఁ దాఁజలించు నని తలంచు. వానివలనగలిగెడు ఫలంబులెల్లఁ దనచేసైనవిగా భావించును. గుణంబులఁజెంది స్వార్థాత్ముడై నరుఁడు భ్రాంతితోఁ దన్నుఁ దామఱచి యున్నాఁడు. వి యతరంగముల నిటునటు నూఁగుచున్నవాఁడు. దానంజేసి గుణచలనముతక్క వేఱొండు గనఁజాలఁడు. ఇట్టివానికి గొప్పయోగములు తగవుగదా. ఈభ్రాంతి గొంతయైన వదలినగాక మోక్షమార్గమున సుగమస్థలంబుల నడవ నేరఁడు. కాన మనుజుఁడు మొదట గుణస్వభావంబుల నెఱిఁగి ప్రాకృతప్రపంచవృత్తులఁ దగులువడక నుండవలయు. కర్మయోగశాస్త్రముఁ గురుక్షేత్రమున శ్రీకృష్ణభగవానుఁడర్జునునకుపదేశించి లోకమున దానినుద్ధరించిరి. అర్జునుఁడు క్షత్రియుఁడు, శూరుఁడు లోకవ్యవహారములందెల్లఁ బ్రవర్తించుభూపాలకుఁడు. యుద్ధమాడ నున్నవాఁడు. అట్టివానికీయోగముపదేశింపఁబడె. లోకవ్యవహార మగ్నులగువారు గుణంబులఁ గ్రమంబుగ దాఁటి బ్రహ్మముతో నైక్యభావంబుఁ గనుట కిదియే సనాతనహితోపదేశంబు.

గుణవృత్తుల గురించి నియమమునకుఁ దెచ్చుటయె కర్మయోగమునకు మొదలిడుట సుమ్ము, గుణంబులు సత్వమని. రజస్సని, తమస్సనియు ముత్తెఱంగులు ఈత్రిగుణంబుల వలననె సమస్తమును గల్పింపఁబడి పలుదెఱంగులఁ గలయికఁగాంచు, ఒక్కొటి చలించు మఱియొక్కొటి వైవిధంబుల ద్రిప్పు ఇవి సమత్వంబుఁగాంచవలయు. వీనిలోఁ గొనవలయు, శరీరమున కొడయఁడగుజీవుఁడు సమస్తప్రాభవమునంది దానుగుణంబులకు భిన్నుండని యెఱుంగవలయు, ఇదియె కర్తవ్యంబు, గుణంబుల ప్రయోజనమెఱిగి వాని వృత్తుల నిరోధించి నడవవలయు. గుణంబులనీక్షణంబ దాట నలవికాగు. తమోగుణంబు

నకుఁ బ్రయోజనమెద్ది? తమోగుణంబు మాంద్యమనియు ప్రమాదమనియుఁ బరగు. జీవ వికాసంబున కిదియెట్టి సహకారియగు? జీవుఁడు సంసారంబునుండి విడుమడఁగాంచ నీగుణం బెవ్విధంబుగఁ దోడ్పడు. కర్మయోగంబున నీతమోగుణంబునకు మెల్ల మెల్లన నెదురునడచి దానిఁ గెలువవలయు. దానంజేసి దేహేంద్రియంబులు స్వవశంబులై మనంబు స్థిరత్వంబుఁగను. దేహబలం బపేక్షించువారికి ముసలంబెట్టుల నట్టులీగుణంబు కర్మయోగి కొనవు. వ్యాయామంబున బలంబు వృద్ధిఁజెందు. బరువు లెత్తుటవలననే గదా దేహమునకు దృఢశక్తి యలవడు. భారమంత ముఖ్యముకాదు. దాని యుప యోగమున శక్తిగల్గుబలంబుఁ గోరువాఁడు ముసలాద్యాయుధంబులఁ గొని దిన దినంబును సాము చేయవలయుఁగదా. అట్టులనే తమోగుణంబును జీవవికాసంబునకు సాధనంబు. వాఁడు దానిం గెలువవలయు. దానంజేసి స్థైర్యమందు తమోగుణ వికారంబులగు మాంద్యమును, ప్రమాదమును జయింప యత్నించుచో చిత్తదార్ఢ్యమబ్బు.

వీని గెలువ నేగదా యాస్తిక మతంబుల నిత్యనైమిత్తికకర్మంబుల విధించిరి. నరుని ప్రాకృత స్వభావంబువలని మాంద్యమును సోమరితనమును మీఱ నేర్పలవఱచుట యుఁ గర్మముల ప్రయోజనములలోనిది. కర్మాచరణమునకుఁ గాలనియమము విధించిరి. తత్కాలమున నరుఁడు జాగరూకుఁడైయున్నను లేకున్నను సోమరితనంబున మునిఁగి యున్నను గర్మముల నడపవలయు. దానంజేసి తమోగుణ సంజనితంబులగు మాంద్యము నుదాసీనత్వము మూఢత్వము లోనగువాని జయింప నేర్పుగల్గు. బుద్ధిచే ప్రదర్శితంబగు తెరువునఁ దమోగుణంబును ద్రిప్పనగు. రజోగుణంబు నిట్టిదియే. ఈగుణంబిపుడు లోకమున నెగడినది, అన్నింట నిది వెలివడుచున్నది. అశాశ్వతమగు నిహలోక ఫలములఁ వెంబడిన నరులీగుణంబు తఱుమ పఱుమఱు పరువెత్తుచున్నవారు. దానని రజోగుణం బాత్మప్రకాశమునకు మఱుగు గాకుండ దానిఁ గ్రమక్రమముగ మగిడ్చి శిక్షింప నెట్టులగునో యది మీకుఁదెలిపెద. రజోగుణవృత్తులఁ గర్మయోగంబున నియతపథంబుల నడపవలయు. వానినిపుడు విమర్శించెద. భోగకాంక్షమాని స్వధర్మ మను బుద్ధితోఁ గర్మ మాచరించుటయే కర్మయోగ పరమోద్దేశ్యము. నరుఁడింద్రియ సుఖంబులఁగోరి కర్మల నడుపు. ఎద్దియో యొక్క దాని నభిలషించి వాఁడు కర్మలఁ జేయుచున్నాఁడు. ఫలాపేక్షతోఁ గర్మ మాచరించు. తృష్ణాహతుఁడై కర్మములఁ జొచ్చు. భోగైశ్వర్యము లనుభవింప ధనంబుఁగోరి మనుజుఁడు కర్మలాచరించు.

అహంకార ప్రేరితుండగుచు వాఁడు పాటుపడు. ఈరాజసవృత్తులన్నియు నింద్రియ సుఖంబులదెస నడుచుచున్నవి. ఈమనోవృత్తులెల్ల నాత్మసముద్ధరణంబున కొదవు నటుల దీని మరల్చి శిక్షింపవలయునేని స్వార్థపరాయణత్వంబు మాని ధర్మాచరణ బుద్ధి యంకురింపవలయు. కర్మాచరణంబు విధియగుటంజేసి వాఁడుగర్మలాచరింప వలయు; కుటుంబభారవహనంబు వానికిఁ గర్తవ్యంబు గాన వాఁడు దాని వహింప వలయు. శ్రీకృష్ణభగవానులవలె మనుజుఁడును గర్మల నడపవలయు. (గీతా. 3 అ. 22 23 24 శ్లో)

సశే. ము.

## పురాణసారము రామాయణము.



అప్పుడు బ్రహ్మదేవుడు అతనికి ప్రత్యక్షమై నీవు గొప్పరాజ ఋషివైతివియని చెప్పి అంతర్ధానమాయను. యంత విశ్వామిత్రుడు కుపితుడై ఇంకను రాజఋషియను చున్నారు గాని బ్రహ్మఋషి యనలేదని యసంతుష్టుడయి ఎక్కువగా దపంబు నాచరించ నుద్యుక్తుడయ్యెను.

ఆసమయమున నిక్ష్వాకు వంశవర్ధనుడగు త్రిశంకువను రాజొకడుండెను. అతడు శరీరముతోకూడ స్వర్గమునకు బోవుటకై యోగ్యమయిన యాగము సలుప వలయునని సంకల్పించి వసిష్ఠు నొద్దకువెళ్లి పృచ్ఛజేయ నట్టి యాగము జేయదనక శక్యమని విని పిమ్మట వసిష్ఠమహాముని (100 నూర్గురు). కుమారులను సమీపించి వారిని బ్రార్థింప త్రిలోకములయందు యాగములయందు సమర్థుడయిన వసిష్ఠుడు సాధ్యము కాదనిచెప్పిన పని నెవ్వరుచేయ నోపుదురు నీప్రయత్న విముఖుడవు కమ్మనివారుచెప్ప కుపితుడై వేరు ఋత్విజాని సంపాదించెదననియు రాజువెళ్ల నాకు మారులు గురుధిక్కారమునకై చండాలు డగుదువు గాకయని శపించిరి. పిమ్మట తెల్లవారగనే త్రిశంకుడు చండాల దేహము నొందిన నతని కులజనులును మంత్రులును త్యజించి గుంపుగూడి పరుగెత్తిరి. అంత నారాజు మహాఖిన్నుడై వసిష్ఠవిరోధి యైన విశ్వామిత్రునిగూర్చి వెడలెను. విశ్వామిత్రునిగని వసిష్ఠుని యొద్దదనకు గలిగిన

పరాభవంబు విన్నవించి తాను నూరుయాగములు జేసినను, ఫలంబేమియు కానరాలే దనియు తాను బొందెతో స్వర్గము జేరవలయుననియు.

దైవమేవ పరమన్యే పౌరుషంతు నివర్థకం।
దైవేనాక్రమ్యతే సర్వం దైవంహిపరమాగతిః॥

అనగా ప్రారబ్ధమగు నదృష్టమే యధికంబని తలంతు పురుషకారంబు నకు ప్రయోజనంబులేక, ఆ యదృష్టంబంతయు రూపమాపి తానేస్థిరంబుగా నిలుచు గావున నదియే పరమగతియనియు నీవుతప్ప వేరే రక్షకుడు లేదనియు శరణుజొచ్చెను.

విశ్వామిత్రుడు దయాపరుడై గురుశాపంబుననం గల్గిన చండాల రూపంబుతో గూడ స్వశరీరుండవై స్వర్గంబు నొందెదవని త్రిశంకు నూరడించి తనకుమారులును యాగసామగ్రిని సముగూర్చుటకై నియమించి శిష్యులనందరిని మునులను ఋషులను యాగమునకు గొనితెమ్మని బంపెను. ఆశిష్యులందరిని పిలిచి మరలివచ్చి యందరు వచ్చియున్నారు వసిష్ఠుని కుమారులుమాత్రము రాలేదు. "యాగము జేయించువాడు క్షత్రియుడు చేయువాడు చండాలుడు దేవతలెట్లు హవిస్సునంగీకరింతురు ఋషులు గాని, ఋత్విజులుగాని హోమశేషము నెట్లు భుజింతురు అట్టిహోమశేషము భుజించి బ్రాహ్మణు లెట్లు స్వర్గంబొందగిలరు." అని వసిష్ఠుని కుమారులు చెప్పినట్లు విశ్వామిత్రునికి జెప్పిరి. అంతనతడు కోపావేశ పరవశుడై వారును తపోబలంబున భస్మీభూతు లగుదురుగాక పిమ్మట నేడు నూర్లు జన్మములవరకు పీనుగ మాంసంబునుదినుచుందురు గాక. హీనజాతియందు బుట్టి కుక్కమాంసము నే దినుచు నిర్దయులై వికృతాచారాకారంబులను గల్గి యీలోకంబుల జనింతురుగాక యనిశపింప వసిష్ఠ పుత్రులందరును మడిసిరి. అంత నతడు త్రిశంకుతో యాగంబుజేయించి హవిర్భాగముల నిచ్చుటకై దేవతలనెంత పిలచినను రాకైరి. అంతి కోపంబునొంది త్రిశంకువును జూచి స్వశరీరంబుతో స్వర్గంబు నొందుమని యాశీర్వదించ నతడు స్వర్గము జేరెను. అప్పు డింద్రుడు నీవు స్వర్గంబునందుండ దగవు గురుశాపంబున గొట్టువడితివి. తలక్రిందుగా నేలను బడుమని యాజ్ఞాపింప త్రిశంకువు నేలను బడుచుండెను. అప్పుడు విశ్వామిత్రు డతనిజూచి నిలు నిలుమనిజెప్ప నంతరిక్షమున నతడు నిలచెను. అచ్చటి సప్తఋషులును, నక్షత్రములును సృజించెను. పిమ్మట దేవతలను సృజింప యత్నించ ఋషులును, దేవతలును భయపడి విశ్వామిత్రునిగూర్చి "త్రిశంకువు గురుశాపంబున గొట్టు వడిన

వాడు కావున స్వర్గంబు నొంద దగడనుట సత్యము" అని చెప్ప నతడు "నాప్రతిజ్ఞా
భంగము నే నొల్లను గనుక నేనిప్పుడు సృజించిన నక్షత్రములీ లోకములుండు
దనుక స్థిరంబులై యుండుగాక" యని దేవతలతో చెప్పవారట్లు గాక యనిరి. నక్ష
త్రముల నడుమ దలక్రిందుగా త్రిశంకువు దేవతా సమానుడై యుండుగాక యని ఒప్పు
కొని వెళ్లిరి.

అంత విశ్వామిత్రుడు దక్షిణపు దిక్కున తపస్సుచేయుచుండ నిట్లు విఘ్నము
సంభవించెనని యోచించి పశ్చిమదిక్కున నుండు బుష్కర తీర్థంబుల దపంబు
గావింతునని అక్కడికి వెళ్లి దపంబు సేయ నారంభించెను. ఆ కాలమున నయోధ్యకు
రాజైన యంబరీషుడను వాడు యాగంబునకుపక్రమింప నా పశువు నింద్రుండపహ
రించెను. అప్పుడు పురోహితుండు యాగపశువును పురికిగొని తెచ్చుట యుక్త
మము, లేకున్న మనుష్య పశువునైనను యాగప్రారంభమునకు మును పె తేవలయునని
రాజునకు జెప్పనతడు వేన వేలుగా గోవులను గొని యనేక దేశంబులను సంచరించెను.
యాగపశువు దొరకలేదు. మనుష్యపశువుగూడ నరుదైయ్యె నని చింతించుచు
బృహత్తుంగంబను పర్వతంబున కేగి భార్యాపుత్ర సమేతంబుగానున్న బుత్సిక
మహాబుషినిజూచి, ఆనూరు వేల యావులను బుచ్చుకొని యొక కొడుకును విక్ర
యింతువేని నేను కృతార్థుండ నగుదనని చెప్ప

ప్రాయేణ వానరశ్రేష్ఠ జ్యేష్ఠాః పితృషువల్లభాః।
మాతౄణాంతుక నీయాంసస్తస్మాద్రక్షేక నీయసం॥

తండ్రులకు పెద్దకుమారుడును తల్లులకు గడపటి కుమారుడును ప్రియులుగదా యని
యాదంపతులు చెప్ప నడిమికుమారుడైన శునశ్శేఫుండనువాడు దానే యంబరీషుని
జూచి నాకెవ్వరును దిక్కులేరు నన్ను గొనిపొమ్మని చెప్పనంబరీషుడు లక్షగోవు
లొసంగి శునశ్శేఫునిం బుచ్చుకొని వెళ్లుచు దారియందు పుష్కరక్షేత్రంబున నొక్క
నాడు విశ్రమించు సమయమున నంబరీషుండు నిద్రబోవుచుండ శునశ్శేఫుండు విశ్వా
మిత్రుని సమీపించి తన సమాచారమును జెప్పుకొని ప్రాణంబు గాపాడుమని
ప్రార్థించ దనకుమారులను బిలిచి యాసమాచారమును జెప్పి నీయంబరీషుని యాగ
మునకు బశువై యగ్నికిం దృప్తిజేసి యంబరీషుని యాగమును బూర్తిజేసి దేవతల
దృప్తిపొందించి పితృవాక్యము పరిపాలన చేసినవారు గమ్మని చెప్ప నాపుత్రులు దండ్రి
మాట నధిక్కరించిరి. అంత విశ్వామిత్రుడు కోపంబు నొంది వసిష్ఠుని కుమారుల

రీతిముషికులై కుక్కమాంసము దినుచు 1000 సంవత్సరములు భూమియందు వసింప గలరని కుమారుల శపియించి శునస్సేఫునిఁ బిలిచి మంత్రిత విభూతిరక్ష జేసి "నీవు యూపస్థంభమున గట్టబడినప్పుడు రెండు మంత్రంబులను జపించిన దీర్ఘాయుస్సు బొందెదవని చెప్పి మంత్రంబుల నుపదేసించి బంపెను. అంత నంబరీషుని యాగంబు దేవేంద్రునియనుగ్రహంబున శునస్సేఫుడు దీర్ఘాయువయ్యెను సఫలంబుగూడ నాయ్యెను.

పిమ్మట విశ్వామిత్రుడా పుష్కరక్షేత్రంబున వేయి వత్సరంబులదపంబు గాపింప బ్రహ్మదేవుడు ప్రత్యక్షమైన తపస్సుచే ఋషివైతివి యనిచెప్పి అంతర్ధాన మాయెను. పిమ్మట కొంత కాలమునకు నా పుష్కర క్షేత్రమున మేనక యనెడు యప్సరస పానంబుజేయుచుండ గని మోహించి యామెతో విహరించుచు 10 సంవత్సరములు గడపెను.

వెనుక విశ్వామిత్రుడు దన యజ్ఞానమునకు బశ్చాత్తాపము నొంది తిన్నని మాటలతో మేనకను దప్పించుకొని యుత్తరదిక్కునకువెళ్లి హిమవత్పర్వతంబున ఘోరతపంబు జేయుచుండ బ్రహ్మదేవుండు మహాఋషివైతివి. అయితే జితేంద్రియుండవు కావని చెప్పి యంతర్ధానమాయెను జితేంద్రియుడగుటకు మరల తపంబునకు పూనుకొనెను.

అప్పుడు దేవతలందరు భయపడి విఘ్నంబు సేయ రంభను బంప విశ్వామిత్రుండు మేల్కొని ఇంద్రుండు తనతపంబు విఘ్నంబు సేయ నిట్లు దానిని బంపినాడని తెలుసుకొని 10000 వేలేండ్లు శిలారూపంబున నుండుమని రంభను శపించెను. ఆకోపంబు వలన కొంచము తపస్సు తరిగెను. దానికి ఖిన్నుడై నేనిక కోపంబు నొందుట లేదని బ్రాహ్మణత్వంబు కలుగుట వరకు తూర్పుదిక్కునకు వెళ్లి నిట్టూర్పు విడువక, భుజింపక తపంబు గావించెను. అట్లు 1000 సంవత్సరములు దపంబు ముగియగనే యన్నము దినుటకు ప్రయత్నించు సమయమున నింద్రుండు బ్రాహ్మణుని వేషము ధరించి యన్నంబు బెట్టుమని యాచించ దనకుసిద్ధమయిన యన్నమునంతియును నతడు భుజించ నేమియు బలుకక యూరకుండెను. తరువాత కొంతకాలంబు దపంబు సేయుచుండ నతని సిరస్సున పొగలేచి లోకంబులను బాధపెట్ట బ్రహ్మదేవు డతనికి బ్రత్యక్షమై నీవు బ్రహ్మఋషివైతివి. బ్రాహ్మణత్వము నొందితివియని జెప్ప విశ్వామిత్రుడు బ్రహ్మదేవునకు, దేవతలకు నమస్కరించి మీరుచెప్పినట్లు వసిష్ఠుడు గూడ నన్ను బ్రాహ్మణుడ నవలయునని వరంబడుగ అచ్చట నున్న వసిష్ఠుడుగూడ

నట్లేగాక యని చెప్ప విశ్వామిత్రుడు సంతసించెను. అప్పుడు విశ్వామిత్రుడు వసిష్ఠుని బూజించి సత్కరించెను. ఇట్టి తపోధనుడైన విశ్వామిత్రుని యనుగ్రహంబు నీకు గలిగినది గనుక రాముడ నీవు ధన్యుడవని జనకుని పురోహితుడగు శతానందుడు చెప్పి యూరకుండెను.

పిమ్మట జనక మహారాజు వారిని సత్కరించి తన ఇంటనున్న శివుని ధనుస్సును రామలక్ష్మణులకుజూపి తనకు భూమిని శోధింపుచుండ నాగేటివలన బుట్టిన సీతయను కుమార్తెను నావిల్లును వంచిన వరునకు సీతనిచ్చి పెండ్లిచేసెదనని శపథము జేసి యున్నాను. ఇదివరకనేక రాజులు ప్రయత్నించి విఫలులైరి. అనేక రాజులు కోపము బూని నాపట్టణముపై ముట్టడించి యుద్ధమునకు బూనుకొని యుండిరి. నేను తపోబలంబున చతురంగ బలమును సంపాదించి వానిని, నివారించుచున్నాను. రాముండీ ధనువును నెక్కుపెట్టునేని సీతనిచ్చి పెండ్లిచేసెదనని జెప్పరాముండా ధనువు నవలాఘవముతో నెక్కుపెట్టి విరచివేసెను. అప్పుడు జనకుడు సంతుష్టుడై వివాహముహూర్తము నిశ్చయించి దశరథుని బిలుపించి రామునకు సీతను, లక్ష్మణునకు నూర్మిళను, భరత, శత్రుఘ్నులకు, దనతమ్ముడైన కుశధ్వజుని కూతురులగు మాండవిని, శ్రుతకీర్తినిచ్చి పెండ్లిజేసెను.

తరువాత విశ్వామిత్రుడు తపోవనంబునకు వెళ్లిపోయెను. భరత శత్రుఘ్నులు మేనమామ యగు యుధాజిత్తు వెంట వెళ్లిరి. దశరథుడు రామలక్ష్మణులతో గూడ నయోధ్యకు మరలివచ్చుచుండ మార్గమున బూర్వము క్షత్రియ వంశమును రూపుమాపి పరశురాముడు ప్రత్యక్షమై తనవద్దనున్న విష్ణువింటిని నెక్కుపెట్టుమనియు, తనతో మల్ల యుద్ధముజేయుమనియు రామునితో జెప్ప నతండట్లగు గాక యనియు యీధనుస్సుచేత నీవు పుణ్యమును సంపాదించిన లోకములను దెగనరుకుదునా లేక నీపాదగతిని మడయ జేతునా నీవు బ్రాహ్మణుండవు గనుక నిన్ను సంహరింపనని పరశురాముని రాముడడుగని నే నిచ్చటనుండజాలను మహేంద్రపర్వతమునకు బోవలయును గనుక నాపాదగతిని యనుగ్రహించి నేను దపముజేత సంపాదించిన లోకములను హరింపుమని జెప్ప రాముండు పరశురాముని తేజస్సునంతయు నపహరించి ఆవింటిచే నతడు సంపాదించిన లోకములను గొట్టివేసెను. అంత పరశురాముడు మహేంద్ర పర్వతమునకు బోయెను రాముండా విష్ణుధనుస్సును వరుణునిచేతికిచ్చెను. తరువాత దశరథుడు భయమువీడి యయోధ్యా పట్టణముజేరి రాజ్యము సేయుచుండెను.

29. "అత్యాశ దుఃఖహేతువు, సంతుష్టి సుఖసాధనము." ఒక మంగలవాడొక దయ్యముండు చెట్టుక్రింద బోవుచుండ ఏడుకూజలనిండ బంగారము నంగీకరించెదవా యని శబ్దము వినవచ్చెను. వాడు చుట్టు తిరిగి జూచెనుగాని యొకనిని గాన డయ్యెను. అగుప్తమైన ధ్వని మరల వినవచ్చెను. గొప్పధన ప్రాప్తిని విన్నమాత్రమున వాని కామము హెచ్చి 'దయాళువైన దేవుడు నావంటి బీదమంగలవానిమీదకూడ దయ దలచి నప్పు డంతయుదారముగా నిచ్చిన ధనమును నే నంగీకరించుటకు జెప్పవలశిన దేమి యున్నది' యని వాడు చెప్పెను. 'ఇంటికిపో! అక్కడికి కూజాలను దీసుకొని పోయి పెట్టియున్నాను' అని మరలవినబడెను. ఆమంగలవాడు కేవల యాతురతతో నింటికివెళ్లి నక్కడ కూజాలను జూచి అత్యోల్లాసమును బొందెను. వాని నొకటి వెంట నొకటిని శోధించి యొకటితప్పయన్నియు నిండియుండ జూచెను. అర్ధము నిండియుండు కూజాను నిండించవలెనను తలంపు వాని మనసున బుట్టెను గనుక తన వద్దనుండిన బంగారమును వెండిని అమ్మివచ్చిన నాణ్యములను నాకూజాలో వైచెను. కూజాయప్పటికిని నిండలేదు. తాను తన సంసారమును యుపవాసములు జేయుచు కేవల నికృష్టమైన యాహారమును భుజించుచు మిగిలిన పైకమునుగూడ బెట్టుచు కూజాలో వైచుచుండ నదియెప్పటివలె నిండకపోయెను. అప్పుడు వాడు, రాజు తనకు నిచ్చుజీతము తన సంసారమును గడుపజాలదని హెచ్చుజేయ వలెనని రాజును బ్రార్థించెను. రాజు వానిమీద దయగలిగియుండెను గనుక వాని ప్రార్థన నంగీకరించెను. అప్పటి నుండివాడు తనజీతమును పైగా సంపాదించు ధనమును మిగిలించి కూజాలో వేయసాగెను. అయితే కూజానిండనేలేదు. వెనుక భిక్షుకుడై యెప్పటివలె దీనత్వమున దుఃఖితుడుగా నుండెను. ఒకనాడు వాడు దీనుడుగా నుండునదిజూచి 'ఓరీ నీవిప్పుడు సంపాదించు జీతమున సగము జీతమున్నప్పుడు చాల సుఖముగను తృప్తిగను, దేహారోగ్యముతోను సుఖవిలాసముతోను నుంటివి. జీతము రెండంత లెక్కువ కాగానీసుఖము వివర్ణమై నీవు దీనుడవుగాను దుఃఖితుడవుగా నున్నావు. కారణ మేమి ఏడుకూజాలనేమైన నంగీకరించితివా యని రాజడిగెను. ఈనిజమైన పెట్టు కాశ్చర్యపడి చేతులు ముడిచి రాజున కాసంగతి యెవరు చెప్పిరి యని రాజునడిగెను. యక్షుని ధనమెవ్వరైన గ్రహింప నీస్థితికి వచ్చుట నిశ్చయము. నీలక్షణమున నే నిది కనుగొంటిని. ఆధనమును తక్షణము పారివేయుము దానిలో నొక కాసైనను శెలవు జేయజాలవు. అదికూడ బెట్టుటకేకాని వ్యయముచేయుటకు బనికిరాదు అని రాజు

జెప్పెను అప్పుడు మంగలవాడు తెలివిదెచ్చుకొని దయ్యముండు వృక్షము వద్దకువెళ్లి 'యక్షా నీధనము నీవుదీసికొమ్ము' అని చెప్పి యిల్లుజేర నాయేడుకూజాలు నదృశ్య మాయెను తర్వాత మంగలవాడు సుఖముగా బ్రతుకసాగెను.

మాయను దెలిసిన, నది యదృశ్యమగును. ఒక శిష్యుని గ్రామమున నొక పురోహితుడు ప్రయాణమాయెను. వానివెంట సేవకుడుండలేదు. దారిలో నొకపాత చెప్పులు కుట్టువానినిజూచి 'యోరీ నీవు నాశేవకునిగా నుండెదవా నీకు బాగా తిండి పెట్టి పరామరిక చేతును' నావెంట రమ్మనెను. అయ్యా నేను బాహ్యజాతి వాడను నీసేవకునిగ నెట్లుందును అని నాడనెను దానిని గమనించబనిలేదు నీవే జాతివాడైనది ఎవరికి తెలుప బనిలేదు ఎవరితోను నీవు మాట్లాడి బరిచయము చేసికొనవద్దు అని పురోహితుడు జెప్పెను. వాడు కొలువున కొప్పుకొనెను. ఒకనాడు సంధ్యాకాల మున తన యజమానుడ తనశిష్యునింట ధ్యానము జేయుచుండ మరియొక బ్రాహ్మణుడు వచ్చి యోరీ లోపలనుండు నాపాదరక్షలను దీసికొని రమ్మనెను. ఆశేవకుడు తన యజమానుని యాజ్ఞప్రకారము బదులు జెప్పకనుండెను. ఆబ్రాహ్మణుడు రెండవతూరి యాజ్ఞాపించినను వాడూరకుండెను. ఆబ్రాహ్మణుడెన్నిమారులు సెప్పిన నాశేవకు డూరకుండెను తుదకు నాగ్రహము దెచ్చుకొని ఓరీ నామాటవినవా నీవేజాతివాడవు మాలవాడవుగావా అని యడిగెను వాడా మాటలు వినగానె భయముచే వణకుచు యోస్వామి నన్ను కనుగొనిరి నేను జిక్కితిని యింకనిక్కడ నుండజాల పరుగత్తెద అని కొలుకు బుద్ధిజెప్పెను.

ఒకస్థలమున నొక పాముండెను. ఆదోవ నొకడైన నడువ ధైర్యములేక యుండెను. ఆదోవనడచిన నాపాము కరచి చంపును. ఇట్లుండ నొకనాడొక మహాత్ముడాదోవను బోవ వానిని కరచుటకు నాపాము వానివెంట నంటెను. పాము తనిని సమీపింప దాని రౌద్రమంతయు యుడిగి, యాయోగియొక్క మార్ధవముచేత నోడిపోయెను. అప్పుడు, స్నేహితుడా, నన్ను కరవనుద్దేశించితివాయని ఋషిదాని నడిగెను. పాము సిగ్గుపడి మారు జెప్పలేక. అప్పుడు స్నేహితుడా వినుము నీయిక మీద నెవరిని హింసించకుమని దానితో నతడు జెప్పెను. పాము నమస్కరించి కానియని తలయూచెను. ఆమహాత్ముడు తన దోవబట్టుకొని వెళ్లిపోయెను. ఆపాము తన తొఱ్ఱలోనికి వెళ్లి అప్పటినుండి శుద్ధ స్వభావముగలదియై యహింసా పరత్వ మున గాలము గడపుచుండెను; కొన్నాళ్లలోపలనే పామునకు విషము చచ్చినది

171. ఇదియంతయు నేనె, ఇదంతయు నీవే, నీవుస్వామి నేను బంటు యను వాక్యముల నేర్పైన ననుభవవేద్యమైన నామనుజుడు సిద్ధుడౌను.

172. దేవుని గనుగొనన తను, మన, ధనములను త్యాగము జేయవలయును.

173. దైవత్వము గనుబడ మానుషత్వము బాపవలెను. దైవసాక్షాత్కార మగుటకు ముందు దైవత్వముకూడ చావవలెను. దైవత్వము కొల్పబడిన స్మశానములో దైవసాక్షాత్కారము నటనము సేయును.

174. ఎవరెక్కువగా గోరుదురో ఏకాగ్ర చిత్తమును గలిగియుందురో వారతి శీఘ్రముగా దేవుని గనుగొందురు.

175. సమాదియనునది నీటినుండి బైట కొంతకాలము దీసినచేప మరల నీటి యందుంచిన ననుభవించు సుఖమువంటిది.

176. సముద్రమున గుట్టలు, కొండలు, పల్లములు, కొండసందు లనేకము లున్నవి కాని పైనుండి జూచువారికి గాన రానట్లు సమాధి యందున్న సచ్చిదానంద మున దేలాడు సమయమున కించిజ్జత్వ మణగియుండును.

177. ఒక కుండలోనీళ్లు నించి వెలుపల పెట్టిన కొన్నాళ్లకు నీళ్లంతయు పోయి కుండ యుత్తదగును. నీళ్లలోనె పెట్టిన నట్లనె నీళ్లునిండుగా నుండును. భక్తివిషయ మటువంటిదే. హృదయము నొకప్పుడు భక్తితోనించి వెనుక దేవునిని మరచి వ్యవహారములు జేయుచున్న కొంతకాలమునకు పరీక్షించుకొనిన, తన హృదయమున నుండిన భక్తిలేశమైన కానరాకుండపోయి యుండును. అట్లుకాక నీహృదయమును సదాభక్తి యందు మునుంగజేసిన భక్తిరస పూర్ణుడౌదవు,

178. బాహ్యస్మృతిలేక మనసు నిలుపధ్యానికి సిద్ధిగలిగినదని జెప్పవచ్చును.

179. నీటిలో నొక పాత్రను బెట్టిన లోపల వెలుపలను నీళ్లునిండియుండును అట్లు పరమాత్మస్వరూపమున నుంచిన జీవుడు సర్వవ్యాప్తిగల పరమాత్మను వెలుపల లోపల గనుగొనుచున్నాడు.

180. పరమాత్ముని యనుగ్రహము గలుగ, తప్పులను తానుదెలిసికొనును. దీనిని తెలిసి నీవు వాదించకూడదు

181. గదిలో నెంతకాలముగ జీకటి యుండి యున్నను దీపముదెచ్చిన తక్షణ మది గనబడక పోవునట్లనేక జన్మసంస్కార సంచితము ఈశ్వరానుగ్రహ మాత్రమున నిశ్శేషముగా నశించును.

182. మలయ మారుతము వీవ కొండయందు వృక్షములు గంధపుమానులగును, అదిలేనియెడ ముందువలె నుండును. అట్లు ఈశ్వరానుగ్రహము గలుగ భక్తివిశ్వాస బీజములు గల మనుజులు తక్షణము మహాత్ములై జ్ఞానులగుదురు. తుచ్ఛపు లౌకికులు ప్రయోజనమును బొందరు.

183. పుట్టుచుండెడి సూర్యుని రాకను దెల్పు ప్రభవలె నీశ్వరానుగ్రహము కలుగటకుముందు స్వార్థపరత్వ రాహిత్యము, పవిత్రత, శుద్ధత్వము, ధార్మికము మొదలగు సుగుణములు కలుగును.

184. ఈన బంటు నింటికి బోవుటకు ముందు రాజుతనకు నతడు సరియైన మర్యాద చేయు స్థితిలో నుంచుటకు తన యుగ్రాణమునుంచి కావలసిన యాసన యాభరణములను బంపురీతి, దేవుని దర్శనమగుటకు ముందు భక్తుని హృదయమందు భక్తి, విశ్వాసము, మర్యాద, గౌరవము మొదలగు సద్గుణములను బుట్టించును.

185. ఒక చేనిలోనుండు గుంటలోని నీళ్లు నితరులుపయోగించ కున్నను ఎండి పోవునట్లు దైవానుగ్రహమున నే యొక పాపి దేవుని శరణుజొచ్చిన పావను డగును.

186. ఒక పోలీసువాడు తన లాంతరు ప్రకాశ మెవరితట్టు త్రిప్ప వారిని జూడగలడు గాని యితరులు వానిని లాంతరును వానితట్టు త్రిప్పుకొనువరకు జూడ జాలరు. అట్లు దేవుడందరిని జూచుచున్నను యతని యనుగ్రహము కలిగి ప్రత్యక్ష మగుటవరకు నెవ రతనిని జూడఁజాలరు.

187. అనేక యెముకవరుసలుగల చేపలున్నవి. కొన్నిటికి ఒక వరుస యున్నది. అయితే భక్షించు వాడన్ని యెముకలను శుద్ధిజేసి చేపలను భక్షించు భంగి కొందరకన్న కొందరెక్కువ పాపములు గలవారుగానున్నను దైవానుగ్రహ మంతటిని శుద్ధిఁజేయుచున్నది.

188. నీచుట్టు దైవానుగ్రహమున పవనము రాత్రింబవలు వీచుచునున్నది. సంసార సముద్రమును శీఘ్రముగా దాటుటకు నిచ్ఛయించిన, నీపడవయొక్క చాప లెత్తి గట్టుము. వాయువు వీచునప్పుడు విసనకఱ్ఱలనావశ్యకములు దైవానుగ్రహము గలుగ తపస్సులు స్తోత్రములు నానాప్రార్థనలవశ్యకములు.

189. అనేక మతములు మతభేదములున్నను ప్రతియొకడు తన మతాచార పద్ధతులనే పూజలను శ్రద్ధతో జేయవలెను. దేవుని గనుగొనుటకు శ్రద్ధయే కారణము.

పండ్లను అడ్డముగా తోమకూడదు. నిడివిగానె శుభ్రము జేయవలశినది.

**పంటి శుద్ధి.** పైపండ్లను పైచిగుళ్లనుంచి క్రిందికిని క్రింది పండ్లను క్రింది చిగుళ్లనుంచి పైకిని శుభ్రము జేయవలశినది క్రమము. ఇదిగాక పండ్లు లోపలిభాగమును మిక్కిలి శుభ్రము చేయవలశినది. దానినే సాధారణముగా మనము గమనించము. పంటిశుద్ధికి మేడి పూడలైనను దానివలె మెత్తగా నుండు పదార్థముతో శుద్ధిజేయవలయును. ఇట్టి శ్రద్ధపుచ్చుకొనకుండిన పండ్లు గట్టిగా నుండవనుట జెప్పవలశినద లేదు.

**టెంకాయ చెట్టు.** మడగాస్కరులోని వ్యవసాయపు అధికారి టెంకాయి మొలకలెట్లు బాగా వృద్ధిజేయవచ్చునని శోధించి, టెంకాయలను అడ్డముగా పూడ్చినను లేక టెంకాయ క్రిందిభాగము నేల తట్టుచేసి దానిని ఒరగించి పూడ్చిన, మొలకలు బాగా లేచునని కనిపెట్టియున్నాడు. టెంకాయలను నిట్టనిలువగాను లేక తలక్రిందులుగాను పూడ్చిన బాగా మొలుచుట లేదనియుకూడ కనిపెట్టియున్నాడు. దీనిని నందరు పరీక్షించి అవలంబించవచ్చును.

**పంచముడు.** పంచమజాతి నీచముగా జూడడము సహోదర భావమునకు విరుద్ధమే. అయితే వారి గుణములను ఆచారములను పట్టి వారిని బాహ్యులుగా పూర్వికులు నేసి యుండవచ్చును. నవ నాగరికతను బట్టి వారు వృద్ధికి వచ్చిన వారిని సంఘములు మర్యాద జేయుటకు వీలుండకపోను గనుకనే కదా ఇప్పుడు తిరువాన్కూరు మహారాజుగారు మాల మాదిగలుకూడ వాండ్ల కొదవలను జెప్పుకొనను రాజసభకు వారిలో బెద్దవానిని సభికునిగా బంపవచ్చునని యేర్పాటుజేసి యున్నారు. ఒక కలెక్టరుకూడ ఒకమాలవానికి తన కచ్చేరిలో గుమాస్తాపని యిచ్చెనట.

**వివాహములు.** నీధనము వ్రయము కావలశిన ఒక బిడ్డ పుట్టినచాలును. ‹ నేనొక పేద బ్రాహ్మణుడు. బడిపెట్టుకొనియున్నాను. నాకు 4 గురు ఆడబిడ్డలు గలరు. పెద్దదానికి 18 వత్సరములు. పెండ్లికాలేదు. మంచి వరునిసంపాదించవలెనని 4 ఏండ్లుగా ప్రయత్నించినను కుదరకయున్నది. వరునితట్టువారు, ఎక్కువ వరదక్షిణ

అడుగుచున్నారు. నాజీవితకాలమంతయు కడుపుకాలు కట్టి మిగిలించినను వారడుగు ద్రవ్యము నావద్ద నుండబోదు. ఎట్లు చేతును. 'శ్రీహరి' యంచు ఉత్తరదేశముల వార్తాపత్రికకు వ్రాసియున్నాడు. ఆహా! దేశములో ఇదియొక వ్యాపారమైనదికదా? దేశమునుద్ధారము జేయువారు అనగా మంగల, కమ్మరి, కుమ్మర, వడ్ల, నేసే వాండ్లను ఉద్ధరించే దేశాభిమానులు తమ్మును తమదగ్గిరవారిని ఉద్ధరించుకొనుట దుర్లభముగా వున్నది. ఇట్టి అవివేకపు వార్తలు మనదేశమున కూడ మెండుగనున్నది. దీనిని గమనించిన ప్రతికుటుంబ మెంతబాగు పడును. దేశాభిమానులులైన బాలురు వారి తలిదండ్రులు చక్కగా ఆలోచించవలయును.

**చక్కెర.**

1. చక్కెర తినుటవల్ల వాతము నొప్పి, అతిమూత్రజాడ్యము కలుగునని కొందరు చెప్పెదరు. అట్టి అభిప్రాయము చాలా తప్పు. చక్కెరను తినుటవల్ల ఏహానియు కలుగదు. అతి మూత్ర జాడ్యము గలవారుకూడ చక్కెర తినుటవల్ల ఏహానిని పొందరు. చెరుకులనుండి చేయు చక్కెరయే చాలా శ్రేష్ఠమైనది. దానిలో 100-కి 18 వంతున చక్కెరయుండును. ఇతర చక్కెరయందు 100-కి 11 వంతున చక్కెర యుండును. చెరుకు తోటలలోనుండు పనివారును ధారాళముగా తీపు పదార్థములను తిను బాలురును మిక్కిలి ఆరోగ్యముగానుండుట మనము చూచుచున్నాము. తీపు పదార్థములందు బాలురకు చాలా యిష్టమువుండుట కేవల స్వాభావికముగదా? దానిలో కొంచమైన దోషముండిన, దానినట్టు స్వాభావికముగ కోరుదురా? అదిగాక అది సాత్విక ఆహారములలో జేరినది. గనుక అన్నివిధముల శ్రేష్ఠమై యోగ్యమైనది.

**అవిసి చెట్టు.**

అవిసిచెట్టులో పురుగు రంధ్రముజేసిన, ఆతూటునుగీరి యందులోని పురుగును తీసివేసినట్టయిన, ఆచెట్టు మరల చిగిరించి వృద్ధియగును.

**వేరుశనిగె.**

వేరుశనిగలు గొప్పధనమును ప్రతి సంవత్సరము సమకూర్చునని తలచుట తప్పు. ప్రతి సంవత్సరము ఒకటే పైరును వేశిన, క్రమక్రమముగా భూమిచెడి పంట తగ్గిపోతూవచ్చును. గనుక భూమిలో పంటలు మార్చి మార్చి పెట్టుచుండవలయును. వేరుశనిగ 6 నెలల పైరు, ఈపైరును జూలై నెలలో సాగుచేసిన డిశంబరు నెలవరకు ఫలమునకు రాదు. అంతలో ముంగారి వానలురాకున్న ఎండిపోవుట సిద్ధము.

## పదమూడవయధ్యాయము. క్షేత్ర, క్షేత్రజ్ఞ విభాగయోగము.

### అర్జునుని వాక్యము.

ప్రకృతి, పురుషుడు, క్షేత్రము, క్షేత్రజ్ఞుడు, జ్ఞానము, జ్ఞేయము వీనిని కేశవా! తెలియగోరెదను.

### శ్రీకృష్ణుల వాక్యము.

అర్జునా! యీదేహము క్షేత్రమనబడును. దీనిని దెలియువాడు క్షేత్రజ్ఞుడని తత్వవిదులు చెప్పుదురు. అర్జునా! సర్వక్షేత్రములనుండు జీవులు నేనే యని తెలియుము. దేహముయొక్కయు ఆత్మయొక్కయు జ్ఞానమే జ్ఞానమని నాయభిప్రాయము. ఆ క్షేత్రమెద్ది, దానిదెట్టిస్వభావము, ఎట్టువికారము లొందును. యెట్లుత్పత్తి యైనది. క్షేత్రజ్ఞుని స్వరూపమేది. వానిప్రభావమెట్టిదో దానినిప్పుడు సంగ్రహముగా నావల్ల వినుము. ఋషులనేకవిధములుగ వివిధములైన వేదములందు నిర్ణయించిన బ్రహ్మసూత్ర పదములందు, గానముజేసియున్నారు. పంచమహాభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము, దశేంద్రియములు, మనస్సు, ఇంద్రియవిషయములు, ఇచ్ఛాద్వేషములు, సుఖదుఃఖములు, జీవులకు సుఖదుఃఖోపభోగములకు ఆధారమైన పంచభూత సంయోగము, ఇవన్నియు సంగ్రహముగా క్షేత్రము దానివికారములగును. తన్నుదాను పొగడుకొనకుండుట, తానుతన ధర్మములను ప్రకాశము జేసికొనకుండుట, అహింస, క్షమ, ఋజుస్వభావము, గురుసేవ, బాహ్యాభ్యంతరశుద్ధి, స్థైర్యము, ఆత్మనిగ్రహము, యింద్రియ విషయములందు వైరాగ్యము, అహంకారము లేకుండుట, జన్మ మృత్యు జరా వ్యాధులనుండు దుఃఖదోషములను దెలియుట, సంగరహితత్వము, దారాపుత్ర గృహాదులందు రక్తిలేకుండుట, ఇష్టానిష్టప్రాప్తియందు సమచిత్తత్వము గలిగియుండుటయు, ఇతరవిషయములు లేక నాయందు యోగముచేత నచంచలభక్తి గలిగియుండుటయు, విజనస్థలవాసి యగుటయు, జనసమావాసమున ననురాగము లేకయుండుటయు, ఆత్మజ్ఞానమున ఎడతెగనినిష్ఠ గలిగియుండుటయు, తత్వజ్ఞానచింతన ఇదంతయు జ్ఞానమని చెప్పబడియున్నది. దీనికివ్యతిరిక్తమైనది అజ్ఞానము. జ్ఞేయమేదో దానిని జెప్పుచున్నాను. దానిని దెలిసిన జరామరణాదులు లేని యాత్మస్వరూపమును బొందును. అది అనాది. నన్నేముఖ్యముగా గలది. అదిపెరుగుటగలది. అది సదసత్తని చెప్పబడదు. ఆ ఆత్మస్వరూపము విశ్వమంతటను జేతులు, కాళ్లు, నేత్రములు, శిరములు, ముఖములు గలిగి

యున్నది. సర్వమును వినును, సర్వమునువ్యాపించి లోకమునందున్నది. ఇంద్రియములు లేకనే యింద్రియవృత్తులచేత ప్రకాశించుచున్నది. సమస్తమును ధరించియు సంగ రహితమైనది. గుణములను భవించుచు నిర్గుణమైనది. సర్వభూతములలోపల, వెలుపల, చరమై, అచరమై, సూక్ష్మత్వముచేత, దెలియ గూడనిదై, దూరముగాను, సమీపముగా నున్నది. అపరిచ్ఛిన్నమైనను, భూతములయందు, పరిచ్ఛిన్నమైనదానివలె నున్నది. సర్వ భూతములను ధరించునదిగాదానిని దెలియవలయును. అదిలయముజేశి మరలబుట్టించును. అది జ్యోతిస్వరూపములకు జ్యోతియైనది. అంధకారాతీతమైనది. జ్ఞానమని తెలియ వలెను. జ్ఞానగమ్యము, సర్వహృదయములందున్నది. ఇట్లు క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయము, సంగ్రహముగా జెప్పబడినది. ఇట్లు దెలియునాభక్తుడు నాభావముబొందుటకు తగును. ప్రకృతిపురుషులిరువురనాదులని తెలియుము. వికారములు, గుణములు ప్రకృతి జన్యములని తెలియుము. ప్రకృతి కార్యకారణ కర్తృత్వమునకు కారణమని జెప్ప బడును. పురుషుడు సుఖదుఃఖానుభవములకు కారణుడందురు. పురుషుడు ప్రకృతి యందుండి ప్రకృతి జన్యములైన గుణములను ననుభవించును. గుణముల యందాసక్తి పుణ్య పుణ్యయోనులయందు జన్మములకు కారణమగును. ఉపద్రష్టయై, ఆమోదించువాడై, అనుభవించువాడై, పరమేశ్వరుడై పరమాత్మయై, పరమపురుషు డీదేహముననున్నాడు ఇట్లు పురుషప్రకృతులను, వానిగుణములతో తెలియువాడెట్లు వర్తించినను పునర్జన్మము నొందడు. కొందరు ధ్యానమున, దమయందు మనస్సుచేత పరమాత్మను జూతురు. కొందరు సాంఖ్యయోగముచేత, గొందరు కర్మయోగముచేత జూతురు. మరికొందరు, దీనినెరుంగక యితరులవల్ల దీనిని విని యుపాసింతురు. వీరుగూడ దాము వినినదాని ననుసరించుచు మృత్యువును దాటుదురు. అర్జునా! చరాచరమందు బుట్టు ప్రతి ప్రాణియు క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగమువల్ల గలిగినదని తెలియుము. సర్వభూతముల యందు సముడై, నశించు రూపముల శాశ్వతుడై, పరమేశ్వరు డున్నాడని తెలియు వాడు తెలిసినవాడు. పరమేశ్వరుడంతట నొక్కటిగా సమముగానున్నాడని తెలిసి తనలోనున్న పరమాత్మను దుఃఖపెట్టక పరమగతిని బొందును. సకల కర్మలను ప్రకృతి జేయునని దెలిసి యాత్మకర్మ జేయనివాడని దెలియువాడు తెలసినవాడు. భూతముల పృథక్ భావము నొక్క యాత్మయందే గలిగి దానినుంచి వ్యాంపిచినదని తెలిసి కొనువాడు పరబ్రహ్మస్వరూపుడగును. పరమాత్మ యనాదియై, గుణరహితుడై నాశ రహితుడౌట వలనదేహాంతర్గతుడైనను, అర్జునా! కర్మజేయడు, లిప్తుడుగాడు.

శ్లో. భవజలధిమగాధం దుస్తరం నిస్తరేయం
కథమహమితిచేతో మా స్మగాః కాతరత్వం
సరసిజదృశి దేవే తావకీభక్తిరేకా
నరకభిదినిషణ్ణా తారయిష్యత్యవశ్యమ్.

ఉ. పాడమిమడియుకడలి దాఁటి పోవ దుస్తరంబునన్
గడిఁదిగోఁతటంచు రిత్తకలవరపడఁ బోకుమా
యెడఁద తమ్మికంటివేల్పునెడ నరకవిరోధిపై
నిడినభక్తి నిన్నవశ్య మెమ్మెయిఁ దరిఁజేర్చెడున్. 13

శ్లో. తృష్ణాతోయె మదనపవనోద్ధూతమోహోర్మిమాలే
దారావర్తే తనయసహజగ్రాహసంఘాకులేచ
సంసారాఖ్యే మహతిజలధౌ మజ్జతాంనస్త్రిధామన్
పాధాంభోజే వరద భవతో భక్తినావంప్రయచ్ఛ.

శా. దారలుసుళ్లు బిడ్డలునుదమ్ములుఁగ్రమ్ము మొసళ్లు మారుఁడే
మారుతమై మరుల్గడలుమంచును గోర్కెలునీరు లిట్టిసం
సారమహాబ్ధి ముగ్గెద నొసంగుము నాకుఁద్రివిక్రమా భవ
చ్చారుతరారవింద పద సంగత నిశ్చలభక్తినావనున్. 14

శ్లో. మాద్రాక్షంక్షీణపుణ్యాన్ క్షణమపిభవతో భక్తిహీనాన్ పదాబ్జే
మాశ్రౌషం శ్రావ్యబద్ధం తవచరిత మపాస్యాన్య దాఖ్యానజాతం
మాస్మార్షం మాధవత్వా మపిభువనపతే చేతసాపహ్నువానాన్
మాభూవం త్వత్సపర్యావ్యతికరరహితో జన్మజన్మాంతరేపి.

చ. కనుగనక్షణంబు నరుకల్మషులన్ గురుభక్తిహీనులన్
వినను వినన్ భవచ్చరిత వెల్తిగ నేకథ శ్రావ్యమయ్యునన్
మననముఁ జేయఁజేయ మది మాధవ నిన్నునుదూఱువారలన్
జననము మాయమాయ నిను శ్రద్ధ భజింపక లోకనాయకా. 15

శ్లో. జిహ్వాకీర్తయ కేశవం మురరిపుం చేతోభజ శ్రీధరం
పాణిద్వంద్వసమర్చ యాచ్యుతకథా శ్శ్రోత్రద్వయ త్వంశృణు
కృష్ణం లోకయలోచనద్వయహరే ర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం
జిఘ్రఘ్రాణ ముకుంద పాదతులసీం మూర్ధన్న మాధోక్షజమ్

'Registered No. M 716.'

SWAN SERIES No. 3

ఓం






# హంస

**A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.**

ఒక యాంధ్ర బ్రహ్మజ్ఞాన మాసపత్రిక.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 2.] { సౌమ్యసంవత్సర వైశాఖ, జ్యేష్ఠమాసం 5010, ఏప్రెల్, మే 1909. } [సంచిక ౪, ౫.

## విషయసూచిక.



చెన్నపట్టణము:

వైజయంతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

మానేజరు, హంసశాల, 30, అంగప్పనాయక్ వీధి, జార్జిటవున్

మదరాసు. అని వ్రాయవలెను.

సంవత్సరమునకు చందా 1 రూపాయి.

# కొన్ని మార్పులు

చదువరులారా!

మా కార్యస్థానమునకు కొన్ని మార్పులు గలిగినందువల్ల గడచిన మాసపు సంచిక ముద్రించుటకు వీలులేకపోయినది. ఏప్రెల్, మే మాసముల సంచికలు ఏకసంచికగా ప్రచురించియున్నాము. మే నెల 16వ తారీఖు మొదలు జూలై నెల 16వ తారీఖు వరకు మా కార్యస్థానము చెన్నపురినుండి క్రింద పేర్కొనియున్న గ్రామమునకు మార్చబడియున్నది. ఇట్టిమార్పులు సంభవించినందున జూన్ జూలై నెలల సంచికలుసహా ఏకసంచికగా ప్రచురింపవలసి యుండును. ఇందుకు మమ్ములను దయచేసి మన్నింతురని ప్రార్థించుచున్నాము.

గతసంచికలేవైనను అందనియెడల తప్పక కార్యస్థానమునకు దెలుపగోరుచున్నాము. పైకనిన ప్రకారము ఈమధ్య కార్యస్థానమునకు వ్రాయగోరువారు ఈ క్రింది విలాసమునకు వ్రాయవలెనని వేడుచున్నాము.

ఇట్లు,

హంస.

విలాసము:—

పి. స. హనుమంతరావు,

హంసశాల, యాడికి, అనంతపురం జిల్లా.

(Yadiki, Anantapur District).

## ఒక వరము.

సీ. పుడమిలో నితరులు పడుసంకటము దీర్చి బాగుగాఁ జూచెడి భాగ్యమొసఁగు
జనులదుఃఖములెల్ల తనదుఃఖములుగాఁగ భావించియుండెడి భాగ్యమొసఁగు
తల్లిదండ్రులు లేని తనయవర్గము నెల్లఁ బలుప్రీతిఁ బెంచెడి భాగ్యమొసఁగు
నాథులు లేనియా నారీమణులకును బ్రాపు[illegible]డిచెడి భాగ్యమొసఁగు

గీ. దిక్కుదరిలేక మ్రగ్గుచునుండు దీనతతిని
గాచి సంస్కారములఁ జేయు కరుణ నొసఁగు
నిరతఁ బోయెడు వారిని యను[illegible],
వెలయఁ బోషించు దయనిమ్ము వేదవేద్య.

## మనభాగ్యము.

దయాసముద్రులైన మహాఋషుల సంతాపమును చూడుమా! మనము పూర్వ ధర్మములను బొత్తుగాదొలఁగద్రోసి, పరధర్మములనుష్ఠించుచు, పరమతాచారములను శ్రేష్ఠమైనవని గ్రహించువేళ, ఈబ్రహ్మవిద్యాసమాజమను దివ్యజ్యోతియొక్క శక్తిని మనకంటికి నెదురుగ నునిచి, అజ్ఞానమను చీకటియందు మెలంగుచు పేడుప్పలను ముత్యపురాసులుగాను, మొద్దుమోటులను మనుష్యులుగాను, త్రాడునే పాముగాను భ్రమపడుచుండువేళ హెచ్చరికనిచ్చిన సంతాపవైఖరిని చూడుమా? దీనిని నిలిచి యోచించుమా.

ఈకాలమున హూణవిద్య నభ్యసించుచు, మనవిద్యలను మఱచుచు, మనవిద్యల గౌరవమును సౌష్ఠవమును పాటింపక పెరవారల విపరీతాచారములనుమాత్ర మవలంబించ, మనసనాతనధర్మమును మరచిపోవుచు, మరచిపోవుటయేకాక మన మతాచారములను విమర్శించ జ్ఞానములేక, వాటినిదూషించుచు, పూర్వనియమములు, అగ్నిహోత్రము, యజ్ఞాదిక్రతువులు, జపతపోనుష్ఠానములు సమగ్రముగ శిథిలమగుటకు కాలము వచ్చినదాని కెంతయు విచారపరులై యుండవలసివచ్చినది. అయినను మనకించుకయైన, అధైర్యము పనిలేదు. ఏలన అదృశ్యులగు మనఋషులు మనయందు దయ దలచి హూణులద్వారాగానే ఈసమాజమును స్థాపనచేసియున్నారు. అట్లుచేసి

885 సంవత్సరము లైనవి. దీనిస్థాపనవల్లనే, ఇప్పుడుపురాణవిద్యచదివినను విద్యార్థులు మనమతమునం దెక్కువ గౌరవమును పెట్ట నవకాశము గలిగినది. కాలానుసారముగ వచ్చిన మతదురభిమానములు తగ్గుచువచ్చినవి. మనపూర్వ పద్ధతులను విచారించి వాటి నిజార్థములను తెలియుటకు నవకాశము కలిగినది. వేదబాహ్యులని చెప్పబడి కేవలనిర్హేతుకముగ అజ్ఞానముచే తృణీకరంచబడియుండు శూద్రులకుగూడ తత్వజ్ఞాన మించుక సూచింపబడినది. ఇవియే యీసమాజముయొక్క ముఖ్యప్రయోజనములు. వీటి పైకి కడపటిదియే శ్రేష్ఠమైన ప్రయోజనము. దీనివల్లనే యిప్పుడు మనభాగ్యమేర్ప డుటకు కారణము గలిగినది. అది ఎట్లనో చూతము.

'చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః'

అను భగవానుల వాక్యానుసారము గుణకర్మలననుసరించి నాలుగు వర్ణములుగా జనులు విభాగింపబడినారు. అందులో శూద్రులు, వైశ్యులు చేయవలసినకర్మలు, ధర్మములు వారిప్పటికి చేయుచున్నారుగదా? క్షత్రియులు లేనే లేకపోయిరి. కొందరున్నారన్న వారితో మనకేమి ప్రకృతము పనిలేదు. బ్రాహ్మణులు తమ కర్మలు, ధర్మములు చేయుచున్నారా! యను మిగిలిన ప్రశ్నయొకటివేశిన, వారు వారిజీవత్కాలము, వారిపితృపితామహుల కాలమునందైన నట్టి ధర్మకర్మములను జరిపెనాయని వేయింటికి కొకబ్రాహ్మణుడైన నిప్పుడు చెప్పసాహసించునో యనుసందేహము పొడమచున్నది.

ఎన్నివిధముల లాలోచించినను అగ్రవర్ణస్థుడైన బ్రాహ్మణుడు తన ధర్మమును పాటింపకుండుటవల్లగదా వర్ణసంకరములు, దుర్భిక్షములు, దుర్వ్యాధులు, అనావృష్టి మొదలగు విపరీతములన్నియు లోకమున నెలకొనుటకు కారణమైనది. బ్రాహ్మణుడు, వైశ్యుని శూద్రుని కర్మధర్మములను చేయుచుండగ, బ్రాహ్మణధర్మము పాలించు వారెవరో యోచించుడి! బ్రాహ్మణుడు నాకంటె నెక్కువయగును శూద్రునకు జవాబు చెప్పుట కేమియున్నది? బ్రాహ్మణకర్మధర్మములు లేకున్న బ్రాహ్మణుడెట్లగును? అందరు బ్రాహ్మణులనుకొన్న నితరులెట్లుగ్రహింతురో మీరేయోచించుడు? అదిగాక యీకాలమందు లౌకికులు వైదికులను భేదమొకటి బ్రాహ్మణులందు కల్పించుకొని వైషమ్యము హెచ్చించుకొని లౌకికుడు అనేకకారణములచేత వైదికులను లక్ష్యపెట్టకుండుటవల్లను వైదికుడు పోషణలేకుండుటవల్లను బ్రాహ్మణులు ధర్మమార్గమున అదృశ్యులై పోవుచున్నవారు. బ్రాహ్మణధర్మములను పరిపాలించు ధీరుడుకదా యిప్పుడు కావలెను

నది. శూద్రులనిందను కదా మనము పోగొట్టుకొనవలశినది. ‘నిందంతి తవ సామర్థ్యం తతోదుఃఖతరన్నుకిం’ అన్నట్టు బ్రాహ్మణుడను పేరు గలవారందరు ఈ అపఖ్యాతిని పోగొట్టుకొనుటకంటె మహాభాగ్యము వేరున్నదా యోచించుడు. ఇట్టి సమయము మనకు ఈ బ్రహ్మవిద్యాసమాజము కలిగించినదిగదా? మనభాగ్యమెట్టిదో యోచించుడు.

బ్రాహ్మణత్వమును మొదటినుండియు ఈకాలమున సాధించవలశియున్నది. దేశకాలాను గుణముగా విధులను తప్పక దేహకష్టమునకోర్చి ప్రతిజీవుడు ప్రయత్నించకున్న బొందిలోనుండి యూపిరివిడువ ప్రయోజనమేమి? బ్రాహ్మణుని కలిమికంటె వేరు భాగ్యము లోకమునగలదా? వశిష్ఠ విశ్వామిత్రచరిత్రలను, ద్రౌపదినిందును, అనేక భక్తులచరిత్రములను వినియుండవచ్చును. చదువుకొనవచ్చును. ఋష్యశృంగుని రాజ్యమునకు పిలుచుకొనిరాగా అనావృష్టిదోషము పోలేదా? అవన్నియు మిథ్యలు కావు.

దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతం
తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణోమమ దేవతా.

అన్నట్టు బ్రాహ్మణుడే తన్మాత్రుడే? ఇంద్రాదిదేవతలతోను, శివునికైలాసములోను, విష్ణువుయొక్క వైకుంఠములోను, బ్రహ్మయొక్క సత్యలోకములోను, యమలోకమునను స్వతంత్రముగా తపస్సంపన్నులైన బ్రాహ్మణులు సంచరించి లోకానుగ్రహార్థము తమ యిష్టానుపూర్తిని పొందుచుండిరని మనమనదినము మన పూర్వికుల చరిత్రలందు వినుచుండలేదా? మనము మహాఋషుల వంశమువారని ప్రవర చెప్పుకొనుటలేదా? మీసమాజధర్మమేల మరచియున్నారు. ఓ బ్రాహ్మణులారా! లెండు. ఆపూటకాపూటకు భత్యము సంపాదించుకొనుటయందు సర్వకాలము కడపుట మీ పనికాదు? అది కాకిగువ్వపని. మీబ్రహ్మత్వమును చూపుట ముఖ్యము. లెండి! మీ అజ్ఞాననిద్రచాలించుడీ! వేరువిధమైన రక్షణలోకమునకు లేనేలేదు. ప్రకృతిమానవులకు బ్రహ్మజ్ఞానమే సన్మార్గమునుజూపు దీపస్తంభము.

# ఏకాదశీవ్రతము.

మనపూర్వులు మనలకు పలుమారు జ్ఞానబోధచేసి ప్రాపంచిక వ్యాపారములలో నే మునిగి విషయానుభవములయందే ప్రమత్తులము గాకుండ జేసి యుద్ధరించు తలంపుతో వ్రతములను, పండుగలను, నేర్పఱచి యాయావ్రతములయందు పండుగలందు నాయా దినముల చేయవలసిన కర్మలయందు పారమార్థికమగు జ్ఞానబోధలను సూచించి యుండిరి. పూర్వకాలమున పండితులుగ నుండిన మనవారనేకులు వాటియంతరార్థమును గ్రహించి పామరులకు నట్టియంతరార్థముల సమయోచితముగ బోధించి పనిచేయు చుండెడివారు. రానురాను చైతన్యమువలెనే బైటకు కనపడక మరుగుగనుండు అంతరార్థముల మఱచి, పైకగపడు రూపములవలెనుండు నాచారముల మాత్రమాచరించి పూజించుచున్నారు. ఇట్లేర్పరచిన వ్రతములలో నేకాదశీ వ్రతము చేరియున్నది. ఏకాదశీ వ్రతమననేమి? ఏకాదశమన పదునొకండు. ప్రతిపక్షారంభము మొదలు పదినొకటవ రోజునచేయు వ్రతము గాన నేకాదశీవ్రతము పదునొకండవదినమున చేయు వ్రతమని బాహ్యార్థము నిచ్చుచున్నది. లోతుగ నాలోచించి చూడ దీని రహస్యార్థము వేఱుగనున్నట్లు తోచుచున్నది. ఏకాదశమన పదునొకండుగదా! వాక్పాణిపాదపాయూపస్థలనెడి కర్మేంద్రియంబు లయిదును త్వక్చక్షుః, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణేంద్రియములను జ్ఞానేంద్రియంబు లయిదును నీరెండువిధముల నింద్రియముల కధిపతియగు నంతరింద్రియంబగు మనస్సును చేరి మనలో పదునొకండింద్రియములు గలవు. మనసు జ్ఞానేంద్రియములచే ప్రపంచ విషయములను గ్రహించి సదరు విషయానుభవములకు కర్మేంద్రియంబులచే సదా పనిచేయించును. ఇందువలననే యింద్రియంబులు భటులనియు మనసు రాజనియు చెప్పబడుచున్నది.

శ్రీభగవద్గీత 3-వ అధ్యాయము ౪౨-వ శ్లోకములో "ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్య పరంమనః॥" యని చెప్పబడు చొప్పున మనస్సు యింద్రియముల కన్న నుత్కృష్టముగ నున్నది. మనస్సంయోగమున మనో ప్రేరేపణ లేనిచో నింద్రియములు పనిచేయజాలవు. మనస్సు యింద్రియములతోకూడి విషయానుభవముల నిమిత్తము స్వప్రయోజనమగు ప్రాపంచిక వ్యాపారములలో పనిచేయుటే ప్రవృత్తి

మార్గము. ఈప్రవృత్తి మార్గానుసారులే విషయానుభవముల నిమిత్తము తిరిగి తిరిగి జన్మము లెత్తుట తటస్థించును. మనస్సు ఇంద్రియములతో చేరి స్వప్రయోజనమగు విషయానుభవములను గూర్చి ప్రయత్నించక ఆత్మమార్గమున చరిగి "సర్వభూతస్థ మాత్మానం సర్వభూతానిచాత్మని యీక్షతేయోగ యుక్తాత్మా। సర్వత్రసమదర్శనః" అనియు "లభన్తేబ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః। ఛిన్నద్వైధాయతాత్మానః సర్వభూతహితేరతాః"

యనియు శ్రీభగవద్గీతచే నుపదేశింపబడు చెప్పిన సర్వభూతములకు హితమును కోరి సర్వేంద్రియములచే కర్మమూలముగా సమస్తభూతములందు నిండియున్న పరమాత్మ నారాధించుటయే నివృత్తిమార్గ మనబడును. ఇట్టి నివృత్తిమార్గావలంబకులు స్వప్రయోజన కరములగు కామ్యకర్మల నాచరింపరు. గాన కర్మబద్ధులుగాక జనన మరణ ప్రవాహముల దాటుదురు. మనస్సునందు ఇట్టి యద్భుతశక్తిగలదు. గనుకనే,

"మనయేవ మనుష్యాణాం, కారణంబంధమోక్షయోః" అనెడు అమృతబిందూపనిషద్వాక్యమయి యున్నది. కాన మనపూర్వు లేర్పరచిన ఏకాదశీవ్రతమన యంతరింద్రియ మనబడు మనసుతో చేరిన పదునొకం డింద్రియంబులతో సంబంధించిన వ్రతముగా తోచుచున్నది. ఈవ్రతము ఉపవాస వ్రతమనియుగూడ చెప్పబడుచున్నది. ఇందువలన నాదినమున వ్రతమాచరించువారు నిరాహారులై యుండు నియమ మేర్పడియున్నది. ఉపవాసమనగా:-ఉప=సమీపమందు, వాస=నివసించుట అని అర్థము.

ఇంద్రియములను అవి అలవడియున్న ప్రాపంచిక సంబంధమగు స్వప్రయోజనముల యొక్క యనుభవమందు పరుపిడనివ్వక యుంకట్టుటే ఉపవాసమయి యున్నది. కాని ప్రస్తుతకాలమున మనము జరిగించురీతిని మామూలుగ భుజించు అన్నము మాత్రము మాని ఫలహారములు పూర్తిగజేసి మామూలు వలెనే స్వప్రయోజన ప్రవర్తకులుగా ఏకాదశి దినమునకూడా సంచరించుటగా తోచదు. మరియు నాదినమున భగవత్కాలక్షేపముచే కాలము గడుపవలెనని నియమమైయున్నది. పైవిధమున నరికట్టిన యింద్రియములను పైచెప్పిన చొప్పున సమస్తభూతములకు హితమునుకోరి చేయుకర్మలయందే ప్రవర్తింపచేయుట భగవత్కాలక్షేపమయి యున్నది. ఇట్లు చేయుటకు తరుచుగ ప్రయత్నించుటయే ప్రతియేకాదశికి యీవ్రతము చేయునర్థమని సూచించుచున్నది

మనపూర్వు లేర్పరచిన కర్మలయొక్కయు వ్రతములయొక్కయు నుద్దేశ్యముల నంతరార్థముల తెలుసుకొని యవలంబించక పైరూపములమాత్ర మవలంబించిన ప్రయోజనముండదు.

శ్లో॥ "కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసాస్మరన్। ఇంద్రియార్థాన్విమూఢాత్మా। మిథ్యాచారస్సఉచ్యతే" అనగా నెవడు కర్మేంద్రియములచేత పని చేయక మనస్సుచేమాత్రం విషయముల నెప్పుడు తలంచుచుండునో అట్టివాడు కర్మభ్రష్టుడు, కపటాచారుడు అనియు "యస్త్వింద్రియాణి మనసానియమ్యారభతేऽర్జున। కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే" అనగా జ్ఞానేంద్రియములను వాటి యిచ్చవచ్చిన రీతిని స్వప్రయోజనకరమగు విషయములందు సంచరింపనీక మనస్సుచే నణచి కర్మేంద్రియములచే ఫలాపేక్ష రహితముగా పనిచేయువాడు శ్రేష్ఠుడనిన్ని,

"యజ్ఞార్థాత్కర్మణోన్యత్రలోకోయం కర్మబంధనః। తదర్థంకర్మకౌంతేయ ముక్తసంగస్సమాచర" అనగా భగవద్విషయములగు కార్యములకన్న యితరకామ్య కర్మములయందు ప్రవర్తించువారు కర్మబద్ధులై జన్మలెత్తవలసి వచ్చుననియు ఫలాపేక్ష లేక భగవద్విషయములగు కర్మలను చేసినవారిని యట్టి కర్మలు బంధించవనియు భగవద్వాక్యములయి యున్నవి. ఫలాపేక్షలేక సర్వభూతములకు హితముచేయు నుద్దేశ్యముతో చేయుకర్మలన్నియు భగవద్విషయకర్మలే. భగవంతుడు విశ్వరూపుడై యున్నాడుగదా! గాన ఏకాదశీవ్రతమన పదునొకండింద్రియములను స్వప్రయోజనకరములగు ప్రాపంచిక విషయముల సంచరింపనీక సమస్తభూతముల హితము కొరకు నుపయోగించుటగ తెలియుచున్నది. మరియు ఆసాఢ శు ౧౧ శయనేకాదశి యనియు, భాద్రపద శు ౧౧ పరివర్తనైకాదశియనియు, కార్తిక శు ౧౧ ఉద్థాన యేకాదశి యనియు పుష్య శు ౧౧ పరమపద యేకాదశి లేక వైకుంఠ యేకాదశి యనియు పిలువబడుచున్నవి. ఈనాలుగు యేకాదసుల నామములచే మనపూర్వులు ప్రపంచ సృష్టిస్థితిలయములను జీవులముక్తిస్థితిని బోధించినట్లు స్పష్టమగుచున్నది. మొదట బరమపద యేకాదశినిగూర్చి విచారింతము. యీదివసము పరమ పవిత్ర మయిన దినమనియెంచి పుణ్యనదులలో అవిలేనిచో తటాకాదులలో స్నానముచేసి దేవళములకేగి స్వామిని సేవించి అదివరకు మామూలుగ స్వామివేంచేయు ద్వారము వెంటగా ఉత్తరద్వారము వెంబడి స్వామిని బయలుకు తీతురు. ఆద్వారము వెంబడి స్వామితోకూడ వచ్చినయెడల వైకుంఠపదవి కలుగునని నమ్మి జనులు ఆద్వారమున

స్వామి వెంబడి వత్తురు. అదివరకు ధనుర్మాసమున స్త్రీలు తమగృహముల ముంగిల చిత్ర విచిత్రములుగ ద్వారములతో నమర్చు ముగ్గులద్వారములును ఆరోజుతో వైకుంఠముయొక్క ద్వారములు మూయబడినవని మూసివేతురు. ఆదినమున దేవతాబృందములతో స్వామివైకుంఠమున కేగినట్లు చెప్పెదరు. వీట్లయర్థమేమి? ఇది జీవుల ముక్తావస్థను యీశ్వరసృష్టియొక్క ప్రళయావస్థను బోధించుచున్నవి. దేశకాల పరిచ్ఛిన్నము లేక నిర్వికల్పమై నిరంజనమై నిష్కళంకమై నిరామయమై నిర్గుణమైన పరబ్రహ్మవస్తువనుండి సగుణుడగు నీశ్వరుడవతరించి మాయతోకూడి సమస్త సృష్టిచేయుచున్నాడని శాస్త్రములు చెప్పుచున్నవి. పరబ్రహ్మవస్తువు కేవలజ్ఞానస్వరూపమయి యంతటనిండి యుండునది గనుకను జ్ఞానము స్వచ్ఛమై నిర్మలముగునది గనుకను దానిని పాలసముద్రము లేక క్షీరాబ్ధియను పేరుచే సూచించుచున్నారు. మరియు నావస్తువునే యింద్రియములచే నిదివరకు నెవరివలనను తెలిసికొన బడనిది యికను తెలుసుకొన వీలులేనిది యగుటచే దానినే "శూన్య మనియు" కూడ బిలుచుచున్నారు. మనము తెలుసుకొనఁగినవి సగుణమగు నీశ్వరతత్వము మాత్రమైయున్నది. ఈపరబ్రహ్మముయొక్క స్థితిని యీశ్వరుడగు శ్రీకృష్ణభగవానులు "నతద్భాసయతే సూర్యో నశశాంకోన పావకః । యద్గత్వానివర్తంతే తద్ధామ" పరమంమమ అనగా పరబ్రహ్మయందు సూర్యుడు చంద్రుడు అగ్ని మొదలగునవి ప్రకాశించలేదనిన్ని ఆపరబ్రహ్మను పొందినవారికి పునరావృత్తి లేదనిన్ని అట్టి పరబ్రహ్మమే తనవునికిపట్టు అనిన్ని భగవద్గీతలోని శ్లోకముచే వివరించినారు. అనగా సూర్యచంద్రాదులు ఆపరబ్రహ్మతేజస్సుచే ప్రకాశింప చేయబడుచున్నారు గాని స్వాతంత్రశక్తిలేదనియు సగుణుడగు నీశ్వరుడు పరబ్రహ్మకంటె భిన్నుడుకాడనియు యీశ్వరు నారాధించువారు యీశ్వరుని స్థానము పరబ్రహ్మమే గనుకను యీశ్వరుడు పరబ్రహ్మమున కంటె భిన్నుడు కాడు గనుకను పరబ్రహ్మమునే పొందుదురని తాత్పర్యము. ఇట్టి నిర్గుణమగు పరబ్రహ్మమునుండి సగుణుడగు నీశ్వరుడుద్భవిల్లి సృష్టి మొదలగు జగద్వ్యాపారము నారంభించి కొంతకాలము జరుపును యీజగద్వ్యాపార కాలమాయనకు జాగ్రదవస్థవంటిదని గాని ప్రవృత్తిధర్మము వంటిదని గాని చెప్పవచ్చును. కాని మనుజులవలె నిట్టి ప్రకృతి ధర్మమాయనను కర్మబద్ధుని చేయునదికాదు. ఆయనకు యీధర్మము లీలవంటిది అయియున్నది. యిట్టి వ్యాపార కాలమున ననేకజీవులు జన్మపరంపరలచే పొందినజ్ఞానముచే నీశ్వరు నారాధించి యాయనను పొందుదురు. కొంతకాలమునకు నీశ్వరుడు జగద్వ్యాపా

రము చాలించును. యిదే ఆయనకు సుషుప్త్యవస్థవంటిదనిగాని నివృత్తి ధర్మము వంటిదని గాని చెప్పవచ్చును. యీశ్వరుడు జగద్వ్యాపారము చాలించినతోడనే ముక్తులగు జీవులతో తన నిజస్థానమైన పరబ్రహ్మమందు సగుణమను భేదములేక ఐక్యమొందును. ఇట్లు సృష్టిచాలించి ముక్తజీవులతో సృష్టియందు తనకు సహాయభూతులుగానుండు దేవతలతో పరబ్రహ్మమునందు యీశ్వరు డైక్యమొందిన కాలమే పరమపద యేకాదశియని సూచింపబడుచున్నది. పరమపదమనిన పరబ్రహ్మమునకే యర్థము. జగద్వ్యాపారకాలమున యీశ్వరశక్తులు బహిర్గతమయి సృష్ట్యాది జగద్వ్యాపారమందు ప్రవర్తింపక వెనుకకు మరలినతోడనే జగల్లయ మగును. మామూలుగా సృష్ట్యాది వ్యాపారములయందు ప్రవర్తించుచున్న యీశ్వరశక్తి మరలించి వెనుక కనగా తనతట్టుకు లాగుటనే దేవళములతో మామూలుగ బయలు వెడలుచున్న మార్గమును వదలి ముక్కోటి యేకాదశి రోజున వుత్తరద్వారమున స్వామి బయలు వెడలుట.

ఉత్తరద్వారమున మనబ్రహ్మరంధ్రమునకు పోలిక అయి యున్నది. ముక్తజీవులు నిర్యాణకాలమున తమప్రాణములను మామూలుగ సంచరించుచున్న నవద్వారములని చెప్పబడు మనదేహమందున్న తొమ్మిది రంధ్రములలో కొన్నిటి వెంట పోనీయక బ్రహ్మరంధ్రము వెంట పోనిత్తురు. గాన యీశ్వరునివలెనే వుత్తరద్వారమనెడు బ్రహ్మరంధ్రమున బయలు వెడల గలిగిన జీవులీశ్వరునితోకూడి పరబ్రహ్మను పొందుదురను అంతరార్థమును ఉత్తర ద్వారమున స్వామితో దేవళమునుండి బయలు వెడలిన ముక్తియని మనవారు చేయుపని సూచించుచున్నది. ఈశ్వరుడు జగద్వ్యాపారమును వహించినది లగాయతు తద్వ్యాపారమును ముగించు లోపల ముక్త్యవస్థను పొందజాలని జీవులు తిరిగి యీశ్వరుడు జగద్వ్యాపార మారంభించు వరకు మూలప్రకృతిలో లీనమై వేచియుండి తిరిగి జన్మము లెత్తవలెనను యర్థమే స్త్రీలు సంక్రాంతియందు పెట్టుచున్న ముగ్గులలో వైకుంఠద్వారములని తెరచియుంచిన వాకిళ్ళను ముక్కోటి యేకాదశి వెళ్ళినతోడనే మూసివేయుట.

ఇట్లు ముక్తులుకానివారు తిరిగి తిరిగి కలుగు సృష్టులలో జన్మ మెత్తవలయునన్న యర్థమునే శ్రీకృష్ణభగవానులు భగవద్గీత ౮-వ అధ్యాయము ౧౭, ౧౮, ౧౯ శ్లోకములచే స్పష్టముగ బోధించియున్నారు. ఇట్టి జగద్వ్యాపారమును చాలించి

యున్న స్థితిని శ్రీభాగవతమునందు బమ్మెర పోతరాజు మహాకవి గజేంద్రమోక్షములో యిట్లుదహరించినాడు.

"లోకంబులులోకేశులు । లోకస్థులు తెగినతుదినలోకంబగుపెం । జీకటి కవ్వల నెవ్వండే। కాకృతి వెలుగొందు నతని నేసేవింతున్" ఇచ్చట పెంజీకటియన తెలియ వీలులేని మూలప్రకృతి. యీశ్వరుడు సృష్టిని విరమించి యీస్థితిలో నుండుటయే శయనైకాదశి యనెడు ఆసాఢశుద్ధ యేకాదశిచే సూచింపబడుచున్నది. శయనము అనగా పరుండుట లేక నిద్రించుట యిదియే క్షీరాబ్ధి శయనత్వము. ఇట్లు శయనించిన కొంతకాలమునకు ముక్తావస్థ జెందని జీవుల పరిపక్వ దశాగల మూలమున సృష్టి తిరిగీ ప్రారంభము కావలయునన్న సంకల్ప ముద్భవమవును. యీసంకల్పకాలము యీశ్వరునకు స్వప్నావస్థయని చెప్పనగును. ఇట్టి సంకల్ప ముద్భవమగుటయే పరివర్తన యేకాదశి యనెడు భాద్రపదశుద్ధ యేకాదశిచే సూచింపబడుచున్నది. పరివర్తనమన నిద్రించుచున్న వాడు పొర్లుట, సృష్టిచేయు సంకల్పము కలిగిన వెంటనే సగుణబ్రహ్మము మామూలువలెనే కలిగి మాయతోకూడి సృష్టినిచేయును. యీస్థితిని ఉద్ధానయేకాదశి యనియెడు కార్తీక శుద్ధయేకాదశిచే సూచించబడుచున్నది. ఉద్ధానమనగా లేచుట లేక మేలుకొనుట. యీచేయు చిత్రవిచిత్రమగు సృష్టినే క్షీరాబ్ధిద్వాదశియగు ఉద్ధానద్వాదశియనెడు కార్తీకశుద్ధద్వాదశిరోజున తులసివద్ద మన స్త్రీలు ముగ్గులు దీపారాధనలతో చేయు నలంకారములు సూచించుచున్నవి. ఈశ్వరుడు క్షీరాబ్ధినుండి నిద్రలేచి తనకు ప్రీతికరమగు బృందయనెడు నొక స్త్రీకి సాంకేతకముగ నుండు తులసివద్దకు నాదినమున వచ్చునని మనవారందురు. బృంద లేక తులసి ప్రకృతిని సూచించున్నది.

ఈశ్వరుడు పురుషుడుగాన యీశ్వరుడు బృందతో గలియుట యన పురుష ప్రకృతుల సంయోగము. ప్రకృతియే నీశ్వరునికి ప్రియమగు బృందయనెడు స్త్రీ. అట్టి తులసివద్ద నాదినము చేయబడు నలంకారములే పురుష ప్రకృతుల సంయోగ మగుతోడనే గలుగు చిత్ర విచిత్రమగు సృష్టిగాన సకల జనులును తాముచేయు వ్రతాగులలోని యిట్టి యంతరార్థముల గ్రహించి యాచరించెదరుగాత.

ఓంతత్సత్.

# దే వా ల య ము లు .

దేవాలయములనగా దేవుడు నివసించు స్థలములని యర్థము. నిజముగ నాలోచించిన యెడల దృశ్యాదృశ్యములగు భూలోక, భువర్లోక, స్వర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకములనెడు లోకములన్నియు కలసిన బ్రహ్మాండమంతయు దేవుని యాలయమనియే చెప్పవచ్చును. "హరిమయము విశ్వమంతయు, హరి విశ్వమయుండు సంశయము పనిలేదా, హరిమయముగాని ద్రవ్యము, పరమాణువు లేదు వంశపావనవింటే" అనియును; "ఇందుగల డందులేడను, సందేహము వలదు చక్రిసర్వోపగతుం, డెందెందు వెదకిచూచిన, నందందేగలడు విష్ణుదాన వాగ్రణివింటే" యనియును శ్రీమద్భాగవతమునందలి పరమభక్తాగ్రగణ్యుడగు ప్రహ్లాదుని వచనముల వలన భగవంతుడు సర్వవ్యాపియని స్పష్టపడుచున్నది. ఇంతియుకాక ప్రహ్లాదచరిత్ర వలన, ఆసద్భక్తుడు భగవంతుడు సర్వవ్యాపియన్న సత్యమును స్తంభమునందు భగవంతుడు నృసింహ రూపమున నవతరించునట్లు చేయుటచే స్థిరపరచెను.

మరియు భగవద్గీత ౧౩-వ అధ్యాయమున ౧౪-వ శ్లోకము, "సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖం । సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్యతిష్ఠతి".

౧౬ శ్లోకము. బహిరంతశ్చ భూతానామచరం చరమేవచ । సూక్ష్మత్వాత్తద విజ్ఞేయం దూరస్థంచాంతికేచతత్ ॥

౭-వ అధ్యాయం ౭-వ శ్లోకం మత్తః పరతరం నాన్యత్కించిదస్తిధనంజయ। మయిసర్వమిదంప్రోతం సూత్రేమణిగణాయివ.

మొదలగు భగవద్వాక్యముల వల్లను, శ్రుతిస్మృతి పురాణేతిహాసముల వల్లను, భగవంతుడు సర్వ వ్యాపియై యున్నాడన్న సంగతి స్పష్టముగా తెలియుచున్నది. భగవంతుడు విశ్వరూపుడనియు విశ్వాయతనుడనియు చెప్పబడుచున్నాడు.

భగవంతుడు సర్వచరాచర ప్రపంచమంతయు వ్యాపించియున్నప్పుడు, మనుష్యాది సర్వభూతములయందు నున్నాడని, వేరుగ చెప్ప నక్కరలేదు. "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి । భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా । సర్వభూతస్థమాత్మానం సర్వభూతానిచాత్మని । ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్రసమదర్శనః" విద్యావినయ సంపన్నే బ్రాహ్మణేగవి హస్తిని । శుని

చైవ ష్వపాకేచ పండితాస్సమదర్శినః॥ అనెడు అనేకములగు భగద్గీత మొదలగు ననేక గ్రంథములలోని భగవద్వాక్యములే యిందుకు ప్రమాణములు. గాన సమష్టిని సర్వబ్రహ్మాండమున్ను వ్యష్టిని ప్రతియండాండ పిండాండములున్ను భగవదాలయములు గానే యున్నవి. "దేహోదేవాలయః ప్రోక్తో జీవభూతిస్సనాతనః" యనువాక్యము యీయర్థమునే బోధించుచున్నది. బ్రహ్మాండముయొక్కయు పిండాండముయొక్కయు కట్టుబాట్లు విషయమగు దైవనిబంధన యొక్కటిగానే యున్నది. అందువలననే తన్ను తాను తెలుసుకొనిన జగమంతయు తెలియునన్న లోకసామెత అనగా పిండాండము యొక్క వివరమును తెలిసికొనిన వానికి, బ్రహ్మాండముయొక్క వివరము తెలియబడును. బ్రహ్మాండమునందు భూలోక, భువర్లోక, స్వర్లోక, మహాలోక, జనలోక, తపోలోక, సత్యలోకము అని యేడు లోకములున్నవని పయిన వ్రాయబడెను గదా ఆయేడు లోకములున్ను వరుసగా పృథ్వీతత్వ, అపస్తత్వ, అగ్నితత్వ, వాయుతత్వ, ఆకాశతత్వ, అనుపాదికతత్వ ఆదితత్వము నేడులనె యేడుతత్వములలో నొక్కొక్క తత్వసంబంధమైన పదార్థముచే నొక్కొక లోకము సృజింపబడియున్నది. ఈయేడు లోకములు సర్వవ్యాపియగు పరమాత్మకు యేడు కోశములని గాని యేడు ఆవరణములని గాని చెప్పవచ్చును.

ఈయేడు కోశములు లేక లోకములు వరుసగా పరమాత్మనుంచి యొకదాని కంటె మరియొకటి దూరముగనున్నది. అనగా ఆదితత్వ సంబంధమగు సత్యలోకము పరమాత్మకు ప్రథమావరణముగను, అనుపాదక తత్వసంబంధమగు తపోలోకము ద్వితీయావరణముగను, ఆకాశతత్వ సంబంధమగు జనలోకము తృతీయావరణముగను, ఇట్లు యేడులోకములు యేడు ఆవరణములుగా భావింపవచ్చును. యింక ప్రతిలోకమున్ను పరమాత్మనుంచి చూచిన, వకదానికంటె నొకటి దట్టమగుచు స్థూలమగుచు క్రమముగా పరమాత్మయొక్క ప్రభతగ్గుచు తుదకు పృథ్వీతత్వ సంబంధమగు భూలోకము అన్నిటికంటె నతిస్థూలమై దట్టమై, ప్రకాశము బహు తగ్గియున్నది. ఇట్లు క్రమముగా భూమినుంచి చూచిన నొక దానికంటె నొకలోకము సూక్ష్మమై ప్రకాశవంతమై తుదకు ఆదితత్వ సంబంధమగు సత్యలోకము సేవ్యంబై ప్రకాశమానంబై బహుసూక్ష్మమై యుండును. లేదా పరమాత్మ జ్యోతిస్స్వరూపమనియు ఏడు కోశములున్ను ఒక దానికంటె నొకటి దట్టముగను మాంద్యముగను ఉండు అద్దములుగను భావించిన పరమాత్మయొక్క ప్రకాశము క్రమముగా భూలోకమందు తగ్గియుండుటకు

కారణము తెలియును. ఇందుచేతనే క్రిందినుండి చూచిన ఒక్కొక లోకములోనున్న జీవులకన్న అంతకంటె సూక్ష్మమగు లోకములో నుండుజీవులు పరమాత్మ నిజస్థితికి దగ్గరగానుండుటచేతను తత్ప్రకాశమును విశేషముగా నందుచున్నందునను యెక్కువ జ్ఞానవంతులుగను యెక్కువ శక్తివంతులుగను ఉందురు.

పరమాత్మయొక్క నిజస్వరూపమును తెలియవలెనన్న ఆయనకు గల యీసప్తావరణములగు సప్తలోకములను దాటి గ్రహించవలయును. లేకున్న గ్రహించజాలడు. ఈసప్తలోకములనే మనపెద్దలు "వైశ్వానరాండ" "హిరణ్మయాండ" "హిరణ్యగర్భాండ" ములనియేడు మూడు ఉపాధులుగా విభజించి బోధించిరి.

ఈకట్టుబాట్ల ననుసరించి పిండాండమును యేర్పడియున్నది. ప్రతి మనుజునకును యేడు లోకముల ననుసరించి ఆయేడు లోకములు ఏయే దాపస్థముల చేత చేయబడినవో ఆయాపదార్థములతోనే చేయబడి ఆలోకముల కుపయోగపడులాగున యేడు కోశములు యేర్పడియున్నవి. యీయేడుకోశములు "అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ, అహంకారమయ, మహత్తత్వమయ కోశములని యేడు. యిందు మొదటి యైదు మాత్రమే మనలో వాడుకలోనున్నవి. తక్కిన రెండును వాడుకలో లేని కారణము మరియొక సమయమున వెలువడును. మొదటి యైదులో అన్నమయకోశము తక్క తక్కిన నాలుగుకూడా మనలో నామమాత్రముగ నుండుటయేగాని స్థూలశరీరమును విడచి స్వతంత్రించి, యేలోకమునకు సంబంధించిన కోశముతో ఆలోకములో ప్రవర్తించి ఆలోకవిషయములు గ్రహించు సామర్థ్యము జీవునికి కలుగ గల స్థితిలో లేవు.

మనకుగల సప్తకోశములు చక్కగా నభివృద్ధియై ఆయాలోకములలో స్వేచ్ఛగా ప్రవర్తించుచు యతిక్రమించగల స్థితిలోనికి వచ్చిననే మనము ఆత్మయొక్క నిజరూపమును గ్రహించగలము గాని లేనియెడల గ్రహించజాలము. ఈకోశములన్నిటికిని యభివృద్ధిచేయుటకే యోగాభ్యాసాదులన్నియు యేర్పడినవి.

పయిన చెప్పబడిన సప్తలోకములలోను క్రమముగ పరమాత్మయొక్క ప్రకాశము స్థూలమునకు దిగిన కొలదిని తగ్గునని చెప్పియుంటిమిగదా అట్లనే మనలోను ఆత్మయొక్క ప్రకాశము ఒక కోశములో నున్నదానికంటె మరియొక కోశమున తక్కువయయి తుదకు స్థూలశరీరమున బొత్తిగా తగ్గియున్నది. అట్లనే అన్నమయ కోశములో నున్న ఆత్మ ప్రకాశముకన్న ప్రాణమయ కోశములోనున్న ఆత్మప్రకాశ

యెక్కువగా నుండును. అట్లనే క్రమముగా తుదకు మహాత్తత్త్వమయ కోశమందలి యాత్మప్రకాశ మమితమైయుండును. ఈప్రకాశము ననుసరించియే తెలివియుండును. అనగా స్థూలకోశములోనుండు తెలివి కన్న సూక్ష్మమగు కోశములలోనుండు తెలివి యెక్కువగా నుండును. బ్రహ్మాండాంతర్గతమగు సప్తలోకములు "వైశ్వానరాండ" హిరణ్మయాండ, హిరణ్యగర్భాండము" లని మూడు ఉపాధులుగా విభజించిన రీతిని మనలోనుండు యేడుకోశములను "స్థూల, సూక్ష్మ, కారణ" శరీరములని మూడు ఉపాధులుగ విభజించిరి.

సర్వవ్యాపకుడైన పరమాత్మను విశ్వరూపునిగా ధ్యానించవలెనన్న యీపయిన వ్రాయబడిన సూక్ష్మ విషయములనన్నిటిని గ్రహించవలయును. వీటిని ప్రకృతి బద్ధులమై యాసుర సంపదచే మునిగి తేలుచున్న మనబోటి పామరజనులు గ్రహించలేమన్న సంగతి, యనుభవ సిద్ధమే. "నీలోనే యాత్మవున్నాడు నీకంటె భిన్నముగ వేరొక చోట నున్నాడనుట వెర్రితనము గాన" "సోహంభావేన పూజయేత్" అను న్యాయముచొప్పున నిన్ను నీవే పూజించుకొనవలయును. అనిన మనవంటి పామర జనులు హాస్యాస్పదముగా నెంతురు. ఇట్టి పామరజనులకు ప్రపంచములో నేదో యొక స్థలమందు భగవంతుడున్నాడనియును అచ్చట ఆయనను పూజించినయెడల తరింతురనిగాని లేదా కోరిన కోరికలందుకురని గాని తెలిపినయెడల కోరికలు నెరవేరునని తలపుననో కష్టములు నివారణ యవుననియో పాపము లెడబాపుననియో జనులచ్చటి కేగి యక్కడ యీశ్వరుడు కలడను నమ్మికతో భక్తిచేసి యారాధింతురు. ఈసంగతి మనపూర్వులు కనిపెట్టి యర్చావతారముల నేర్పరిచి, దేవాలయములు కట్టించి యందు తాము తపస్సుచేసి యాతపశ్శక్తిని యచ్చట ధారపోసి యందు భగవద్విగ్రహముల ప్రతిష్టించి భగవంతుని పూజాస్థలములుగ నేర్పరచిరి.

ఇటుల నిర్మించబడిన దేవాలయములు పయిన వ్రాయబడిన బ్రహ్మాండపిండాండములయందు గలకోశవివరణ సంబంధమగు యీశ్వరకట్టుబాట్ల ననుసరించియే మన పూర్వులు కట్టించిరి.

బ్రహ్మాండ పిండాండములనుండెడు సప్తకోశములను సూచించుటకు శ్రీరంగాది దేవాలయములయందు సప్తప్రాకారముల నేర్పరచిరి.

యితర దేవాలయములయందు సప్తకోశముల విభాగమగు ఉపాధిత్రయమును సూచించులాగున "ముఖమంటప, అంతరాళిక, గర్భాలయము" లనెడి భాగ

ముల నేర్పరచినారు. ఈగర్భాలయమందు యీశ్వర విగ్రహమును ప్రతిష్ఠించియున్నారు. ఇందువలన యుపాధి విలక్షణుడైన ఈశ్వరుని స్వరూపము తెలియవలయునన్న దేవాలయమున మూడు గడపలను దాటినగాని స్వామినిచూడలేనట్లే శరీరత్రయమును దాటినగాని తెలియ లేరన్న సత్యము స్ఫుటపడుచున్నది. యీ సంగతే యీ దిగువ వ్రాసిన టేబిలును బట్టి తెలిసికొనగును.

| | | బ్రహ్మాండము. | | పిండాండము. | | దేవాలయము. | |
|---|---|---|---|---|---|---|---|
| | | ౧ ఓం పరమాత్మ. | | ఓం ఆత్మ. | | ౧ ఓం ఈశ్వర. విగ్రహం. | |
| కారణబ్రహ్మాండము | కారణోపాధి | ౨ ఆదితత్వ సంబంధమగు సత్యలోకము<br>3 అనుపాదికతత్వసంబధమగు తపోలోకము.<br>౪ ఆకాశతత్వ సంబంధం మగు జనోలోకము. | కారణోపాధి | ౨ అదితత్వ సంబంధమగు మహత్తత్వకోశము.<br>3 అనుపాదకతత్వ సంబంధమగు అహంకారమయకోశము.<br>౪ ఆకాశతత్వ సంబంధమగు ఆనందమయకోశము. | ౨<br>3<br>౪ | గర్భాలయము | కారణోపాధి |
| సూక్ష్మబ్రహ్మాండము | సూక్ష్మోపాధి | ౫ వాయుతత్వ సంబధం మగు మహాలోకము.<br>౬ అగ్నితత్వసంబంధమగు స్వర్లోకము.<br>౭ అపస్తత్వ సంబంధమగు భువర్లోకము. | సూక్ష్మోపాధి | ౫ వాయుతత్వ సంబంధమగు విజ్ఞానమయకోశము.<br>౬ అగ్నితత్వ సంబంధమగు మనోమయకోశము.<br>౭ అపస్తత్వ సంబంధ, మగు ప్రాణమయకోశము. | ౫<br>౬<br>౭ | అంతరాళము | సూక్ష్మోపాధి |
| స్థూలబ్రహ్మాండము | స్థూలోపాధి | ౮ పృధ్వీతత్వ సంబంధ మగు భూలోకము. | స్థూలోపాధి | ౮ పృధీతత్వ సంబంధమగు అన్నమయకోశము | ౮ | ముఖమంటపము | స్థూలోపాధి |

ఇందు పయిన వ్రాయబడిన ౨, 3, ౪, ౫, ౬, ౭, ౮ సంఖ్యలు గల తత్వములు కోశములు ఉపాధులు క్రమముగా నొకదానికంటె నొకటి స్థూలముగ నున్నవి యని గ్రహించవలయును.

దేవాలయముల యొక్క యుద్దేశ్యములను వాటి యంతరార్థములను పయిన చెప్పబడినరీతిని గ్రహించి దేవునియందు భక్తిగలిగి జనులందరు ధన్యులగుదురుగాక.

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః.

# కల్యాణోత్సవము.

దివ్యదేశములనబడు మహాక్షేత్రములలో పూర్వకాలమున ఋష్యాదులచే ప్రతిష్ఠించబడిన పెక్కు దేవాలయములు గలవు. అట్లనే యిటీవల భక్తులచే ప్రతిష్ఠింపబడిన దేవాలయములును అనేక గ్రామములయందు గలవు. ఇందు శైవ దేవాలయములును, వైష్ణవదేవాలయములును గలవు. ఈదేవాలయములయందు సాధారణముగా, ఈశ్వరుని దెలుపు, పురుష విగ్రహములున్నూ ఆయనశక్తిని తెలుపు స్త్రీవిగ్రహములున్నూ వుండును. అట్టి దేవాలయముల గల స్త్రీపురుష వుత్సవ విగ్రహములకు ప్రతిసంవత్సరమును కల్యాణోత్సవమను పేర వివాహము గావించి యానందించుచుందురు. గాని దీనియంతరార్థము నెరిగినవారు బహుస్వల్పముగ నున్నారు. యిందువలన అన్యమతస్థులు అన్యదేశీయులు మలనుజూచి రాళ్ళతోను లోహములతోను చేయబడిన విగ్రహములు దేవుడెట్లాయెను? అవిదేవుడైన యెడల అవి యేలమాట్లాడవు? దేవునికిని మనలనువలెనే భార్యయు సంతానమును ఉండునా? అట్లయినను, మనుష్యునికి వలెగాక దేవుని కిద్దరు భార్యలున్నట్లుగా కొన్ని స్థలములలో విగ్రహములుంచుచున్నారే? అని యివ్విధమున ప్రశ్నించి యాక్షేపించుచున్నారు. ఇట్టి యాక్షేపణలకు సహేతుక సదుత్తరములు తోచక పోవుటచే కొందరికి విగ్రహారాధనయందలి భక్తి చెదరుటకును తటస్థించును. గాని ఆయావిగ్రహముల యొక్క అర్థమును వాటి ప్రయోజనమును అవి బోధించు పరమ రహస్యములును మనము గ్రహింతుమేని ఈ ఆక్షేపణల కంతగా భయపడ నవసరములేదు.

ప్రపంచోత్పత్తికి ఈశ్వరుడును ఈశ్వర సంబంధమైన అసురీ ప్రకృతి దైవీ ప్రకృతి యనెడు రెండు శక్తులును కారణమైయున్నవి. ఆశక్తులయొక్కయు ఈశ్వరునియొక్కయు కూడికచే సృష్టి యావత్తును జరగుచున్నది. ఈవిషయమును శ్రీకృష్ణులు అర్జునునకు యిట్లు బోధించుచున్నారు.

"శ్లో. భూమిరాపోనలోవాయుః, ఖంమనోబుద్ధి రేవచ, । అహంకార ఇతీయంమే భిన్నా ప్రకృతిరష్టధా॥ అపరేయ మితస్త్వన్యాం ప్రకృతింవిద్ధి మేపరాం। జీవభూతాం మహాబాహోయయేదం ధార్యతేజగత్॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ। అహంకృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా॥ మత్తః పరతరం నాన్యత్కించిద స్తిధనంజయ । మయి సర్వమిదం ప్రోతం సూత్రేమణిగణాయివ॥ భగవద్గీత ౭ అధ్యాయము ౪, ౫, ౬, ౭ శ్లోకములు. అనగా:—

భూమి, ఉదకము, అగ్ని, వాయువు, ఆకాశము, మనసు, బుద్ధి, అహంకారము, అను ఎనిమిది అంతర్భాగములు గల నీచమైన జడ ప్రకృతి యనెడు శక్తి యొకటియును దీనికంటె భిన్నమైనట్టియు మిక్కిలి యుత్కృష్టమైనదియును, ఈప్రపంచమును ధరించు నదియును, జీవస్వరూపమున నుండునదియును, అగుమరియొక శక్తియును, యీ రెండు శక్తుల సహాయముచే ఈశ్వరుడు సమస్త ప్రపంచములను సృష్టించి రక్షించి లయించుచున్నాడనియును, భగవంతునికన్న యితర మేదియు లేదనియున్ను, దారమందు కూర్చబడిన మణులవలె సర్వప్రపంచములకున్ను ఈశ్వరుడాధారుడై యున్నాడనియును బోధించియున్నారు.

ఈ అర్థమునే భగవద్గీత ౧౫ అధ్యాయము ౧౬, ౧౭, శ్లోకములలో తెలుపబడియున్నది. "ద్వావిమౌ, పురుషౌలోకే, క్షరశ్చాక్షర ఏవచ। క్షరస్సర్వాణి భూతాని కూటస్థోక్షర ఉచ్యతే॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః। యోలోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥ అనగా లోకమునందు నశించు పురుషు డొకడు, నశించని పురుషు డొకడును కలరనియును బ్రహ్మాది దేహములు మొదలుగా గల సమస్తయ చేతనములును నశించు పురుష సంబంధమైనవనియు, జీవుడను భగవన్మాయశక్తి నశించని పురుషుడనియు యీ యిద్దరు పురుషుల కన్న పరమాత్మ శ్రేష్ఠుడైన యుత్తమ పురుషుడనియు ఆయన లోకత్రయమును నిండియుండి, రక్షించుచున్నాడనియు యర్థము. మరియు భగవద్గీత ౧౪-వ అధ్యాయము ౩, ౪, శ్లోకములలో:—

"మమయోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహం। సంభవస్సర్వభూతానాం। తతోభవతిభారత॥ సర్వయోనిషుకౌంతేయ, మూర్తయః సంభవంతియాః। తాసాంబ్రహ్మ మహద్యోనిరహంబీజప్రదః పితా॥ అనగా సమస్తదేశకాలములయందును వ్యాపించి సమస్తమును ధరించునదియగు మాయ సర్వమునకును

గర్భస్థానముగా నున్నదనియు, ఆమాయయందు జగదుత్పత్తికి కారణమగు బీజమును ఈశ్వరుడుంచుచున్నాడనియును అందువలన బ్రహ్మ మొదలగు సమస్త ప్రాణుల యొక్క యుత్పత్తి కలుగుచున్నదనియు, సమస్త జాతులయందును కలుగు దేహములకు మూలప్రకృతి కారణము అనగా తల్లియనియు, ఈశ్వరుడు బీజదాత అనగా తండ్రి యనియు, యర్థము.

సృష్టి పురుష ప్రకృతులచే జరుగుచున్నదనే సంగతిని శ్రీమహాదేవుడు శ్రీపార్వత్యమ్మ వారికి బోధించినట్లు అధ్యాత్మ రామాయణమందలి యీక్రింది శ్లోకముల వల్ల కనబడుచుచున్నది. శ్లో. రామః పరాత్మా ప్రకృతేరనాది । రానంద ఏకః పురుషోత్తమోహి స్వమాయ యాకృత్స్న మిదంవిసృష్ట్వానభోవదంత ర్బహిరాస్థితోజః । సర్వాంతరస్థోపినిగూఢ ఆత్మా । స్వమాయ యాసృష్టిమిదం విచష్టే॥ ఈప్రకృతి ద్వయమునే ఆంగ్లేయ భాషలో మేటర్ అండు యినర్జి అందురు. (Matter and Energy).

ఇందువలననే జగదుత్పత్తి కారణమగు పైనుదహరింపబడిన పురుష ప్రకృతులలో, పురుషుని జగత్పితయనియు, ప్రకృతిని జగన్మాతయనియు, వ్యవహరింతురు. ఈపురుష ప్రకృతుల సమ్మేళనముచే, స్థూల సూక్ష్మలోకములన్నియు నేర్పడి రూప నామముల నొందియున్నవి. ఈపురుష ప్రకృతులు, సమ్మేళనము లేక విడిపోయినచో, యావత్తు లోకములు లయము నొంది రూపనామములు నశించును.

దేవాలయములలో జరుపబడు కళ్యాణోత్సవములు పైనుదహరింపబడిన పరాపరా ప్రకృతుల(దైవి, అసురీ) యొక్కయు, పరమాత్మయొక్కయు జగదుత్పత్తికి హేతువగు కూడికను సూచించుచున్నది. రూపనామములుగల ప్రపంచములో పుట్టి పెరిగి రూపనామముగల వస్తువులనే యెల్లపుడును, మనసున నిలిపి పనిచేయుచున్న జనులు రూపనామములులేని స్థితిలో యాశక్తులను పరమాత్మను మనసున నిలుకడచేసి యారాధించుట బహుకష్ట సాధ్యము గనుక శక్తిద్వయమును, రూపనామములు గల రెండు స్త్రీ విగ్రహములుగాను పరమాత్మను పురుష విగ్రహముగను నేర్పరచి యా విగ్రహములయందు భగవద్బుద్ధిచేసి మనసును నిలిపి జగత్కారణమగు పైనుదహరింపబడిన శక్తులయొక్కయు ఆత్మయొక్కయు కూడికను సూచించు కళ్యాణోత్సవమును జరిపి జనులానందించుచుందురు పైనుదహరింపబడినశక్తులు పరమాత్మ నాధారపరచకొని యున్నందునను పరమాత్మను వినాగా స్వాతంత్ర్యశక్తి లేనివగుటచేతను వాటి

స్త్రీ విగ్రహములుగాను వాటి కాధారభూతుడైయున్న పరమాత్మను పురుష విగ్రహముగను ఏర్పరచిరి. ఈశ్వర శక్తిని సూచించు శ్రీసీత అమ్మవారు పరమాత్మ సన్నిధాన ప్రకర్షణ చేతగాక తనకు వేరు స్వాతంత్ర్య శక్తిలేదని శ్రీ ఆంజనేయుల వారికి బోధించినట్లు అధ్యాత్మ రామాయణ మంది ట్లుదహరించబడినది. "మాంవిద్ధి మూల ప్రకృతిం సర్గస్థిత్యంతకారిణీ । తస్య సన్నిధి మాత్రేణ సృజామీద మతంద్రితా.

ఈ అర్థము నే శ్రీకృష్ణులు గీత ౯-వ అధ్యాయమందు ౧౦ శ్లోకములో బోధించి యున్నారు. ఈశక్తులు విష్ణ్వాలయములయందు భూదేవి శ్రీదేవి యను నామాదుల చేతను శివాలయములందు గంగాభవాని, యమనామముల చేతను పిలువబడుచున్నది. పండిత పామరులందరిని తరింపచేయు తలంపుతో మానపూర్వులిట్టి యంతరార్థముగల సత్కార్మల నేర్పరచిరి. ఇట్టి యంతరార్థముగల కళ్యాణోత్సవమును జరిపి ప్రజలేల యానందించ వలయునని కొందరడుగ వచ్చును? అనాదులుగనున్న కోటానకోట్లు జీవరాసులు ప్రళయావస్థలో అనగా సృష్టిలేని కాలమందు తమకర్మ వాసనలతో ప్రకృతి యనెడు యవిద్యయందు మునిగి యుందురు. అట్టి జీవులను కృతార్థులనుజేసి, ముక్తులనుజేసి యనుభవైక వేద్యమగు శాశ్వతానందము నొసగవలయునని పరమాత్మ తలచి తన యందులీనమైయున్న పయిన చెప్పబడిన శక్తులచే సృష్టి నారంభించి బహు విధలోకముల సృజించును. ఆలోకమందు జీవులు తమ కర్మవాసనలతో జనన మొంది, కాలక్రమమున అవిద్యను దాటి జ్ఞానముచే ఆత్మ సాక్షాత్కార మొంది ముక్తులయ్యెదరు. పరమదయాళుడైన పరమాత్మ యిట్టి మహోపకార మొనరించ దలచి తన మాయాశక్తులతో గూడి సృష్టిని చేయుచున్నాడు. గనుక యిట్టి మహోపకారము ననుభవించు జీవులమైన మనము మనకృతజ్ఞతను భక్తిని గనపరచుచు మన మేలుకొరకై యీశ్వరుడు చేయుపనులను తరుచు దలచుకొనుచు యానంద మొందుట మనకు విధియై యున్నది. ఇట్లు చేయుటవలన జీవులకు జన్మసాఫల్యత త్వరలో కలుగుటకు కారణమవును. ఈ క[illegible]ణోత్సవములు ప్రతి సంవత్సరమును జరుపుట వలన సృష్టి ప్రళయములు రాత్రింబగళ్లవలెనే స్వాభావికములనియును తెంపులేక జరుగు చుండుననియును, గ్రహించతగియున్నది.

లోకాస్సమస్తాస్సుఖి నోభవంతు.

# సాధనచతుష్టయసంపత్తి.

## ఎట్లుజ్ఞానికావచ్చును?

ఈశ్వరేచ్ఛానుసారి యగుటమాని యహంకారపూరితుఁడై యేర్పడినజీవుని సంతసంబునకై కర్మలాచరింపక సర్వాంతర్యామియగు పరమేశు నాజ్ఞానువర్తియై కర్మల నడపవలయు. కర్మఫలవ్యాప్తి, యుత్తరోత్తరాభివృద్ధిఁగన నిది సిద్ధించు. ఇంద్రియకార్యలోలత మాని ధర్మాచరణబుద్ధి నొందవలయును. నిత్యనైమిత్తిక కర్మముల పరమోద్దేశ్యంబును ఫలంబును నరులగ్రమంబుగ బ్రహ్మాపనప్రవర్తకులుగఁ జేయుటయేసుమా. ఒక్కొక్కకర్మయు నరుని నామార్గమునకుఁ ద్రిప్పు. మనుజుఁడు తొలుతొల్త రేపుమాపునఁ గొంతకాలంబు ధ్యానపరుఁడగుచు తుదకు యావజ్జీవము నిరంతర ధ్యానపరుఁడగు. సృష్టికి తపంబు మూలంబు. తపంబునఁగాదే ప్రపంచ ముద్భవిల్లె. నరున కిట్టిదివ్యతపోమహిమ కర్మాచరణమునను విడుమరగాంచు దపంబునను గదా గలుగు. నియతధ్యానము నిరంతరతపంబునకు మార్గము. ప్రతిదినంబుఁ గొంత కాలము ధ్యానపరుఁడగుటంజేసి తుదకు యావజ్జీవము ధ్యానపరుఁడగు. యోగి యిప్పుడప్పుడను నియమములేక తుదకు సార్వకాలంబును ధ్యాననిష్ఠుఁడగు. మనోదేహంబు లైహికవిషయ తత్పరతనున్న నట్టివాఁడు సర్వేశ్వరచరణకమలసాన్నిధ్య మేమఱఁడు. ఇతరకర్మలునింతయే. మనుజుఁడు విధిభావముతోఁ దొలుతఁ గర్మమాచరించు. ఇదియె ప్రపంచఋణముఁ దీర్చుట. ఇదియె సమస్తభూతములకును వానివలనఁ దాఁజెందువాని నిచ్చుట. పిమ్మట యజ్ఞము ఋణముఁ దీర్చుట యనుబుద్ధి మాని తనసర్వస్వమును సంతోషపూర్వకముగ నిచ్చుటయగు. ఋణముఁదీర్చుట న్యూనయజ్ఞము. సర్వపరిత్యాగము సంపూర్ణయజ్ఞము. నరుడుఁ ఋ[illegible]వనతోఁ గొంతనిచ్చుటమాని తన సమస్తశక్తులను సర్వశక్తియు ధారవోయవలయు. ఇట్టిస్థితియే యోగపరిపూర్తి. అప్పుడుగదా వాఁడు కర్మయోగాచరణ ఫలమందు. ఇట్టిస్థితిఁగాంచఁ బంచమహాయజ్ఞంబులు ప్రథమప్రయత్నములుగ నగు వీని పేరులైనను మీకందఱకుఁ దెలిసియున్నదిగదా. ఈయజ్ఞము లెద్దానికై విధింపఁబడినవో యోచింపుఁడు, వీనియందొక్కొక్కటియు ఋణవిముక్తికగు. మఱియుఁ బృథగ్వ్యక్తియగునరుఁడు సమస్తప్రపంచమ

నకుఁ జెల్లించవలసిన ఋణముల బోధించు మనము వానిలో నొక్కొక్కదానిని
గొంతకొంతగ నైన క్షణమాత్రము విమర్శింపఁబూనినచో నొక్కొక్కటియు ఋణము
దీర్చుట యని స్పష్టముగఁ దెలియు. మొదట దేవయజ్ఞము. దీని నేల విధించిరి?
దేహధారియగుటం జేసి నరుఁడు భూదేవికిని నాభూమివలన నన్నిపంటలును మను
ష్యాన్నమును నుద్భవిల్లునట్లుఁ గావించు ప్రాకృతశక్తుల నడపు దేవతలకును దా
ఋణమును దీర్పవలయునని నరునకుఁ గలుపనేగదా దేవయజ్ఞము విధింపఁబడినది.
మనుజుఁడు శరీరపోషణకై యాహారంబులఁ గొనుఁగాన స్థూలప్రపంచశక్తులఁ ప్పది
లోకపాలురగు దేవతలు గారణంబుగఁ నాఁ జెందిన యీఋణము దీర్ప మఱల నియ్య
వలయుఁగదా. దానం జేసి హవిస్సు నగ్నియందు వ్రేల్వుమనిరి. అదియేలన నగ్ని
యమరులముఖమనిరి. జను లీవాక్యమును బలుమాఱు లుచ్చరింతురు గాని దీనియర్థ
మెఱుఁగఁ బ్రయత్నింపరు. మఱియు దేవముఖ యన నగ్నిదేవు నామోచ్చారణమాత్రము
తోనఁ దృప్తిఁ జెందుచున్నారు గాని బ్రహ్మాండమున నాదేవునధికార మెయ్యది యని
యోచింపరు. దానిగూఢార్థ మిది సుమ్ము. ప్రపంచమునం దెల్లయెడలను సోపాన
క్రమంబుగ నీశ్వరాజ్ఞను నడపు దేవయోనిజు లనేకులు గలరు. వీరిలోఁ గొందఱు తెలివి
గలవారు. కొందఱు తెలివిలేనివారు. ఈదేవగణంబులలో నొక్కొక్కగణంబున
కధిపతియగు నధిదేవత యొక్కఁడు గలఁడు. కావున పృథివ్యప్తేజోవాయురాకాశంబుల
నొక్కొక్కటికి నధిప యగు.

దేవతకులో నైన యసంఖ్యయము లగు దేవయోనిసంభవులున్నారు. వీరు ప్రపంచ
మందు ప్రాకృతశక్తుల పృథగ్వ్యాపారంబుల భిన్నభిన్నముగ నడుపుదురు. వర్షమును
భూమికిను త్పాదనశక్తియు పలుఁదెఱఁగులగు సారశక్తియు వీరివలనఁ జెల్లుచున్నది.
ఈమొదటియజ్ఞ మీదేవగణంబులకు నగ్నిముఖంబుగ నాహార మొసంగుటసుమ్ము. అగ్ని
తనయందు వ్రేల్పఁబడిన స్థూలద్రవపదార్థముల విభజించి రూపుమాపి ధూమముగ
నొనర్చి పరమసూక్ష్మపదార్థములుగఁ జేసి పదంపడి లోకపాలురగు దేవతలయాజ్ఞను
నడుపు నీభూతగణంబుల కాహారంబగు నటుల వాని నాకాశపరమాణువులుగ
మార్చును. దానం జేసి యగ్నికి దేవముఖుఁడను నామధేయంబు చెల్లె. నరుఁ డిట్టివిధం
బునఁ దా ఋణవిముక్తిఁ గాంచు. దీనికి ప్రత్యుపకృతిగ స్థూలప్రపంచంబున వానలు
కురియు. పృథ్వి ఫలించు. నరున కన్నమబ్బు.

శ్లో. దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః.

దేవతలయజించినచో దేవతలు మిమ్ము పోషింతురను కృష్ణభగవానుల యుప దేశవాక్యమునకు నదియె యర్థము. నరుఁడైహికంబగు నీపరస్పరభావనను గదా మొదట నభ్యసింప వలయు. నరుఁడు దీనిని మతోపదేశమని మొదల నభ్యసించె. పదంపడి రహస్యార్థ మెఱుఁగక బాహ్యము నె సూచుచు దీని విశ్వసించుట తామసశ్రద్ధయనఁ బొచ్చె. అటుపిమ్మట ప్రాకృతశాస్త్రము మొదట నిరీశ్వరత్వము బోధించినది యయ్యె. దీర్ఘావలోడనంబున నాత్మలోకంబుల యునికి నొప్పుకొనుడు రహస్యార్థజ్ఞానంబు నరున కలవడిన దయ్యె. మనుజుఁడు తాఁ జేయు కర్మలవలన ప్రాకృతశక్తుల శాసించి నడపఁ గలఁడని మహర్షు లధ్యాత్మ విద్యను బోధించఁ దాని నిపుడు శాస్త్రములు శాస్త్రపరిభాషతో వక్కాణించుచున్నవి. ఇవ్విధంబుగఁ బ్రవృద్ధి గనుజ్ఞానము పురాణసిద్ధాంతముల సమర్థించుచున్నది.

మఱియు యోగికి యోగదృష్టిచేఁ గన్పట్టుదానిని బుద్ధికి గోచరంబగునటుల సమర్థించుచున్నది.

రెండవది పితృయజ్ఞము. ఇది లోకమున మున్నుచన్నవారికిఁ దాఁ దీర్పవలసిన ఋణము నెఱుంగుట. ఇది తన ఇప్పటిజన్మమునకు మున్ను లోకమునభివృద్ధికై పాటు పడిన వారిఋణముం దీర్చుట. మఱియు నిది ప్రపంచమును గొంత చక్కదిద్ది మన మిపు డుందిన వాస్తిరికై చరించిన వారిదేస భక్తియుఁ గృతజ్ఞతయు బోధించు. తమజీవిత కాలమంతు లోకహితార్థమై బహుప్రయత్నములు చేసి వానిఫలమును మనకిచ్చి చనిన మనపూర్వులకుఁ గృతజ్ఞతారూపకంబగు ఋణముందీర్చుట సుమ్ము. మనము వారి ప్రయత్నంబులఫలములను పొందుచున్నారము, గాన వారికి కృతజ్ఞతారూపకం బగు ఋణంబుఁదీర్పవలయును గదా. దానంజేసి మన మున్నుచన్నవారికి కృతజ్ఞతం దెల్పునప్పు దీర్చుటకుఁ గా నీనిత్యయజ్ఞమును విధించిరి.

మూడవది ఋషియజ్ఞము. జ్ఞానముకొఱకు పఠించుటయె మూడవయజ్ఞము. మనుజుఁడు తనకంటె జ్ఞానమునఁ దక్కువయగు వారికి సహకారియై యట్టివారిని సత్పథంబునకుఁ ద్రిప్పునంతకుఁ జాలుటకై మతగ్రంథములఁ జదువవలయు. మఱియుఁ దనయాత్మవికాసమునకు వలయు జ్ఞానము తనయందభివృద్ధి గనుటకును పఠించవలయు.

నాల్గవది మనుష్యయజ్ఞము. మానవకోటికెల్లఁ దీర్ప వలసిన ఋణము నొకా నొకని కిచ్చుట. లోకంబున మనుజులందఱును సోదరులకుంబోలె సర్వవిధముల

సాహాయ్యంబును హితకార్యములను జేయవలయు. దీని నాచరించుటగ నెక్కనికి నన్నమిడుటయే మనుష్యయజ్ఞము.

మనుష్యయజ్ఞమన నెవిధిని విధ్యుక్తముగ నాచరించుటసుమ్ము. ఆకలిగొన్నవారి కన్నము పెట్టునపుడును దిక్కుమాలిన వారి నాదరించు నపుడును నీయీవికి పాత్రుడగు వాడొక్కడైనను నీమనోభావంబుచే లోకమునంతయు నాదరించు నట్టులగు. ఇలుసొచ్చినవాని కాతిథ్యమిచ్చి నపుడు లోకముల కెల్ల నిచ్చినవాడ వగుదువు. ఒకరునికి బ్రాపును బ్రోపు నొసంగినచో లోకముల కెల్ల నొసంగి నట్టగు. పంచ యజ్ఞములలోఁ గడపటియజ్ఞమగు భూతయజ్ఞము నిట్టిదియె. నరునికి జంతువుల నాదరించుటయు వానిఁ బోషించుటయు శిక్షించుటయు లోనగునవి కర్తవ్యంబులని ఇది బోధించు. జంతువులదెస మనుజునకుం గర్తవ్యంబులగువాని నెల్ల నిపుడు వక్కాణింప నలవిగాదు. ప్రవృత్తిమార్గమునఁ దనపైఁ బుండఁ జనుదెంచుజంతువులకు నరుఁడు శిక్షకుఁడను నియంతయు సహకారియుఁ గావలయునని భూతయజ్ఞ మొత్తిచెప్పుచున్నది. జంతువులయెడక్రౌర్యము చూపి నపుడెల్ల మనము వాని యందంతర్యామియగు నీశ్వరుని కగ్గౌనరించినవారమగుదుము. మఱియు నవి యీశ్వరునికి ప్రాకృతదేహంబులు గదా. నరుఁడు జంతువులయందలి వాస్తవ్య మెఱుగవలయు ననియు శ్రీకృష్ణమూర్తివాని యందు మిగులప్రచ్ఛన్నుఁడైనను వానియందుఁ గలఁడని నరుండు తెలుసుకొనవలయు ననియు నీభూతయజ్ఞమును విదించిరి. ఈయజ్ఞము వానియందలియీశ్వరునకు గాని స్థూలదేహములకు గాదు సుమా. ఈయజ్ఞ మాచరింప దయయు, కరుణయు నక్రూరతయు తోడుగ జంతువులసన్మార్గమునకుఁద్రిప్ప వానికిఁ బ్రవృత్తిమార్గమున సహాయకారి యగుటకంటె మిగిలినత్రోవ యొక్కటిలేదు. క్రూరత్వముచే జంతువికాసమును నిరోధించుటకాదు. అయిన లోకమందంతటఁ గ్రూరత్వంబె నిపుడు కననయ్యె.

## మాపురాణము.



81. ఇతరుల కష్టాయకరముగా దనకొని దానినందరు తొందరజేయనారంభించిరి. కొందరు రాళ్లతోగొట్టిరి. కొందరు దయలేక దానితోకబట్టి యీడ్చిరి. ఇట్లు దానికష్టము లనంతములాయెను. అదృష్టవశమున నా ఋషి మరల నా మార్గముగావచ్చి యాపాముయొక్క గాయమైన శరీరస్థితినిజూచి చాలావిచారముతో దాని కష్టదశకు కారణమడిగను. అప్పుడు అయ్యా మీరుచెప్పిన మేరకు నేనెవరిని

హింసించకుండుటచేత నాకిట్టి యవస్థసమకూరినది. అయితే చాలాదయావిహీనులుగా నున్నారు. అని పాము చెప్పెను. స్నేహితుడా! ఎవరిని కరవవద్దని చెప్పితినిగాని యితరులను భయపడించవద్దని చెప్పితినా! నీ వెవరిని కరవకూడదుకాని బుసకొట్టుచు నందరిని దూరముగ నుంచవలయునని యాఋషి దానికి బదులుచెప్పెను. అట్లనే లోకమున నుండునప్పుడు, నీకందఱు మర్యాదగజేయునట్టు జేసికొనుము. ఎవరికిని కీడు జేయకుము గాని నీవు నొకరితో హింసబొందకుము.

**32.** ఒక పండితుడగు బ్రాహ్మణుడొక బుద్ధిశాలియైన రాజునొద్దకువెళ్లి 'రాజా నాకు పురాణముల వేదముల గొప్పతరచయము గలదు. నీకు నేను భాగవతమును జెప్పదలచుకొన్నా' డనెను. బుద్ధిశాలియైనరాజు భాగవతమును దెలసినవాడు రాజాసభలో గౌరవమును ధనమును సంపాదించుటకంటె తనుతాను తెలిసికొనుటకు ప్రయత్నము జేయునని తెలిసియుండెను. గనుక ఓబ్రాహ్మణుడా నీవు భాగవతము నింక చక్కగా నేరువలేదని తోచుచున్నది. నిన్ను నేను గురువుగా నంగీకరించ నొప్పుకొనెదనుగాని మొదట నీవు మరలవెళ్లి భాగవతమును జక్కగా జదివిరమ్మని రాజుచెప్పెను. ఇన్నాళ్లనేక మాఱ్లువల్లెజేయుచున్న 'భాగవతమును నేను బాగా నెరుగ' నని చెప్పు రాజెంతపిచ్చివాడు' యనుకొని బ్రాహ్మణుడుంతదారినిబట్టుకొని వెళ్లిపోయెను. అయినను మరల భాగవతము నొకసారి జాగ్రతగా జదివి రాజెదుటకు వచ్చెను. ఆరాజతనికి పూర్వము చెప్పినరీతిగానె చెప్పియుంపెను. బ్రాహ్మణుడు చాలా విసికగొని రాజుయొక్క నడతకేమో యర్థమున్నదని యూహించెను. ఇంటికివెళ్లి తనగదిలో నేకాంతముగా గూర్చొని యీపుస్తకము నెక్కువగమనముతో జదువ నారంభించెను. క్రమక్రమముగా నంతరార్థములు మనసునకుస్ఫురింపసాగెను. భాగ్యము, గౌరవము, రాజులు సభలుధనము, కీర్తియను బుద్బుదముల నాశించు దంభాహంకారములు మేఘచ్చాదనములేనియతని ప్రజ్ఞయెదుట నదృశ్యమాయెను. ఆదినమునుండి దేవునిని బూజసేయుచుపరిపూర్ణత్వమునొ బొందపాటు పడుచుండెను. కొన్నివత్సరములవెనుక రాజు బ్రాహ్మణుని దలచుకొని యతడేమి చేయుచున్నాడని కనుగొనవతనియింటికివెళ్లెను. బ్రాహ్మణునిజూచి దివ్యతేజస్సుతో దయారసముతో ప్రకాశించుచున్నను సాష్టాంగ ప్రణామమాచరించి 'అయ్యా భాగవతసారము నిప్పుడు గ్రహించనట్లు నాకగుపడుచున్నది. ఇప్పుడు మీరు నన్ను శిష్యునిగా జేసికొనదయచేసిన మీశిష్యుడగుటకు నేనుసిద్ధముగా నున్నాను' అని రాజు విన్నవించెను.

33. ఒక మేకపిల్ల యాషాఢమాసమున దన తల్లివద్దనుండుచు, రాసలీలపండుగ సమయమున మెండుగ వికసించు రాసపుష్పముల పండుగ జేయుచున్నానని యనుకొన్నానని దల్లితో జెప్పెను. సరే బిడ్డా నీవుతలచునట్లింత సులభమైన పనికాదు. రాసపుష్పములనానందింప ననేకగండములు కడవవలసియున్నది. రాబోవు భాద్రపద యాశ్వయుజమాసములు శుభసూచకములైనవికావు. ఏవరైన నిన్ను దుర్గాదేవికి బలియిచ్చెదరు. అదితప్పిన కాళిపూజసమయమున ప్రాణమురక్షించుకొనవలయును. ఆగడవు కూడగడచిన జగద్ధాత్రిపూజవచ్చును. ఆసమయమున మనజాతిలో మిగిలిన మగజంతువులన్నిటిని యాహుతి యిచ్చెదరు. ఈగండములన్నియు దైవవశమున గడచిన మార్గశిరమాసమున రాసపుష్పముల నానందించెదవు. అనితల్లి పిల్లకు జెప్పినట్లు మనబాల్యమున మనసునతగులు కోరికలనన్నిటిని యంగీకరించ కూడదు. ఏలన నొకజీవితకాలమున ననేక గండములు గడపవలసియుండును.

34. కొత్తగాబుట్టినమూడ మనోహరముగా చురుకుగా నుల్లాసముగానుండును. దినమంతయు సంతోషముతో నెగురులాడుచు పాలుత్రాగను మాత్రము దల్లివద్ద జేరును. దాని మెడచుట్టు పగ్గమువేసి గూటమునకు గట్టివేయ చెల్లాటముమాని దీనస్వభావము గలిగి కృశింపనారంభించును. లోకవ్యవహారము నదిగనంతవరకు బాలుడుల్లాసములోనుండును. పెండ్లిజేసుకొని సంసారభారముమీద బడగానే పూర్వముండిన యుల్లాసములేక ముఖముమీద మడతలుపడి బుగ్గలవిలాసముతగ్గి దీనునివలె గనుబడును. యావజ్జీవము పిల్లవానివలె నుండు జన్మముసార్థకమైనది. అది ప్రాతఃకాలపవనాంకురములవలె స్వేచ్ఛమై వికసించిన పుష్పమువలెనలగక మంచుబిందువలె స్వచ్ఛమైనదిగానుండును.

35. ఒకడు భావిత్రవ్వప్రారంభించి యిరువదిమట్లులుత్రవ్వినను యూటగానక యాప్రదేశమును విడచి మరియొకప్రదేశమున త్రవ్వనారంభించెను. అక్కడ మునుగుకంటె నెక్కువలోతుగా త్రవ్వినను నీళ్లుకనబడకపోయెను. మరియొకచోట త్రవ్వనారంభించి మునుపటికంటె లోతుగాత్రవ్విన నక్కడకూడ నీళ్లగుపడలేదు. తర్వాతచాలా విసుకుకొని ప్రయత్నమును మానుకొనెను. అంతయుచేర వాడు సుమారు 100 మట్లులులోతు త్రవ్వియుండవచ్చును. చోటుమార్చక మొదలుత్రవ్విన ప్రదేశమున దీనిలోనర్థ ప్రయాస మక్కడపడియుండిన నీళ్లుగానక యుండియుండడు. గనుక స్థలములుమార్చుచు నమ్మకములేనివాని గతియిట్లుండును. మనకోరిక లీడేర

వలెనని కోరినసందియంబులు మాని విశ్వాసపాత్రమైనదాని నొక్కటినే నమ్మియుండ వలెను.

86. ఒకడు గ్రామమునకు సమీపముననున్న యడవినుండి ప్రతిదినము దెచ్చిన కట్టెలమోపు నమ్మవచ్చిన మితద్రవ్యముచేత కష్టమైన జీవనమునడుపుకొనుచుండెను. ఆయడవిని బోవుచున్న యొకసన్యాసి వాడుకట్టెలను గొట్టుచుండజూచి యడవి లోపలికిబోవ వానికి మేలగుననిచెప్పెను. వాడతని యాజ్ఞానుసారముగా నడవిలో కొంతదూరము వెళ్లగా నొక గంధపుమానునుజూచి సంతోషముతో దానినిగొట్టి గంధపుచెక్కలను గ్రామములో నమ్మ నెక్కువపైకము దెచ్చుకొనెను. ఆసన్యాసి యడవిలోనికి తన్ను వెళ్లుమనిచెప్పెను. గాని గంధపుమాను దొరకునని ఎందుకుచెప్ప లేదని యోచనజేసి రెండవనాడడివిలో నెక్కువదూరముపోగా నొకరాగి గనినిగని తానుమోయునంత రాగిలోహమును గ్రామములో నమ్మి యెక్కువధనము సంపాదించెను. మరునాడు రాగిగని దాటివెళ్ల వెండిగనికని తానుమోయునంత వెండినియమ్మి సుఖముగా బ్రతుకుచుండెను. అట్లనే దినదినమున కెక్కువదూరము పోవుచు సువర్ణ వజ్రములగనులు జూచుచు మిక్కిలి ధనవంతుడాయెను. నిజతత్వము నపేక్షించువారి గతియాలాగే. కొన్ని యసాధారణమైన శక్తులుకలుగగానే వాటితోదృప్తిజెందక సాధించిన నతడు శాశ్వతబ్రహ్మపదవి తుదకుబొందును.

87. మన నాటక ప్రదర్శనములందు, కృష్ణునిచరిత్రను మొదలు కృష్ణా రా రా యనిపాడుచు భేరిమృదంగవాద్యధ్వనులతో ప్రారంభించెదరు, అయితే కృష్ణవేషమును ధరించినవాడా వాద్యధ్వనులను లక్ష్యపెట్టక నెమ్మదిగా సరసములాడుచు తెరలోనుండును. ఆధ్వనులు నిలువగానే నారదుడు నాటకరంగము బ్రవేశించి భక్తిపూర్వకమైన గానముతో దయార్ద్రహృదయముతో రమ్మని కృష్ణునిబిలువ, నుదాసీనభావమునువిడిచి నాటకరంగమును బ్రవేశించును. భక్తిలేనియుత్తనోటి స్తోత్రములు జేయునంతవఱకు దైవానుగ్రహముకలుగదు, దేవుడు ప్రత్యక్షమైన భక్తునిహృదయము కరగి బిగ్గరస్తోత్రములను మానుకొనును. కేవల భక్తిశ్రద్ధలునిండిన హృదయముతో దేవునినిదలచిన ప్రత్యక్షముకాను జాగుసేయడు.

88. నిన్ను నీవు తెలిసికొంటివేని, ఆనాత్మస్వరూపమును సకలజగన్నియామకుని స్వరూపమునుదెలసెదవు. అహంకారమెద్ది? నాహస్తమా, పాదమా, చర్మమా మాంసమా, యేమికా? ఇట్లుదీర్ఘవిచారణజేసిన నేనుయనుపించుపదార్థము లేనట్లు కనుగొందువు. ఉల్లిగడ్డయొక్క పొట్టువొలుచునట్లు జీవుని విచారింప నేననుటకుసరియైనపదార్థము కానవచ్చుటలేదు. అట్టివిచారఫలము దైవస్వరూపముగా నేర్పడుచున్నది. అహంకారమణగిన దైవత్వము వెల్లడియగును.

190. శ్రద్ధగలవాడు సర్వముగలవాడు. అదిలేనివానికి నేదియులేదు.

191. కేవలనిష్ఠమాత్రమున ఇండియాదేశమున వ్యాధినివారణ జేయువారు. 'నాలోవ్యాధిలేదు. నాలోవ్యాధి లేనేలేదని చెప్పుమని వ్యాధిగ్రస్థుల నాజ్ఞాపించుచున్నారు. వారు దానిని జెప్పగానే, మానసికముగా లేదని చెప్పుటవల్లనే వారి వ్యాధి నివారణయగును గనుక నీవు నీతిమంతుడవు సాత్వికుడవు గాదని తలచుచుండిన కొంతకాలమున కట్లైయగుదువు. అద్భుతశక్తి కలవాడవని నీవుతెలిసి నమ్మిన నాశక్తి నీకు సిద్ధమైయుండును.

192. శ్రీరామచంద్రుడు సముద్రముదాటి లంకజేర వంతెన గట్టుకొనవలసెను అయితే హనుమంతుడు రాములయందలి భక్తిదృఢముతో నొకగంతుతో సముద్రమును దాటెను. యజమానునికంటె బంటు భక్తివశమున నెక్కువ కార్యముజేసెను.

193. ప్రశ్న—నేను నాకూడు సంపాదించుకొని కాలముగడుపవలసియుండ భక్తి నెట్లుసలుపుగను?

ఉత్తరం—నీవెవరికిగాను పనిచేయుదువో నతడు నీకోరతలు దీర్చును. ఇక్కడికి బంపుటకుముందు నీజీవనమునకు దేవుడు తగినయేర్పాటు ముందే చేసియున్నాడు.

194. ప్రశ్న—నేనెప్పుడు ముక్తుడగుదును?

ఉత్తరం—అహంకారముడిగి, యభిమానము దైవమునందు లీనమైన ముక్తుడగుదువు.

295. గాలిలోవిడుచు యనేకగాలిపటములలో నొకటి రెండుమాత్రము దారముతెగి స్వేచ్ఛగా బోవును. అట్లు నూరుసాధకులలో నొకరిద్దరుమాత్రము సంసారబంధమునుండి ముక్తులగుదురు.

196. పాదగస పాత్రములోనుంచిన నీసముంసుకరగిపోవునట్లు బ్రహ్మ సముద్రమునంగుపడిన జీవుడు తనప్రత్యక్షస్వరూపముసు బోగొట్టుకొనును.

197. ప్రశ్న—ఇప్పటి మతబోధరీతినిగురించి మీయభిప్రాయమేమి?

ఉత్తరం—ఒకనికిచాలినంత యన్నముండ నూరుగురిని భోజనమునకు బిలిచినట్లున్నది.

198. ఇతరులను బోధజేయుటకు బదులుగా నంతకాలము దేవునిధ్యానము సలుప, చాలినంతబోధగానుండును. తానుముక్తుడగుటకు ప్రయత్నముజేయువాడే నిజబోధకుడు. నూర్లకొలదిజనము నలుదిక్కులనుండి ముక్తునియొద్దకువచ్చి బోధగైకొందురు పుష్పము వికసించిన నన్నివైపులనుండి పిలుపులేక నే తుమ్మెదలుజేరును.

199. ఓబోధకుడా నీకు నధికారచిహ్నగలవి. ఒకదీనుడైన మనుజుడు రాజు యొక్క చిహ్నమును దేహమున ధరించినమాత్రమున నందరతనికి భయముతో మర్యాదతో విధేయులై నడచుటవల్ల కలహములను నోదార్పుసామర్థ్యమును బొందియుండు భంగి మొదలు నీవు దైవశాసనము ప్రేరేపణను గలిగియుండినగాని నీవు యాజీవము కూయునదంతయును వ్యర్థమైపోవును.

200. ఆత్మజ్ఞానముగలవాడే నిజమైన మనుజుడు.

201. బద్ధుడైనజీవుడు మనిషి—ముక్తుడైన, శివుడగును.

202. భారముండుతట్టు త్రాసు క్రిందికివాలును. తేలికగనుండిన పైకిపోవును. అట్లు లోకవ్యవహార మెక్కువగ నుండువాడు లోకముతట్టు తిరుగును. తక్కువగ నుండువాడు దేవునితట్టు దృష్టిద్రిప్పును.

203. సకల మానవులయందు దేవుడున్నాడుగాని యందరు దేవునియందు లేరు. అందుకే సంకటమునకు కారణమైనది.

204. మానవు లిరు తెరగులున్నారు. గురువు నొక శిష్యునకు "నేను నీకుజెప్పినదంతయు చాలా యమూల్యము పరమరహస్యముగా నుంచుకొనుమని చెప్పెను. శిష్యుడాలాగు నడుచుకొనెను. ఆగురువు మరియొకశిష్యునికి నట్లనేబోధింప నతడు దాని యమూల్యమైన ముఖ్యతనుగ్రహించి స్వప్రయోజనమునకుమాత్ర ముంచుకొన నిచ్చలేక యొకయున్నత ప్రదేశముననిలచి లోకమునందంతట వెల్లడిజేసెను. అవతార పురుషులు రెండవ తరగతివారు. సిద్ధులు మొదటి తరగతివారు.

205. ఎవరు కేవలయుపవాసముండుట లేదు. కొందరు ఉదయము 9 ఘంటలకును, కొందరు మధ్యాహ్నమునను, కొందరు పరాహ్ణమునను, కొందరు సాయంకాలమునను తిండిదిందురు. అట్లనే యేదోయొక కాలమున, ఈజన్మమునవో లేక వేరుజన్మములందునవో, సర్వులు దేవునిని బొందుదురు.

206, కాయిపండి తనంతకుదానే క్రిందబడును. అప్పుడుతియ్యగా నుండును. అయితే కసుగాయనుగోసి మాగవేసిన నంతమాధుర్యమివ్వక ముడుతలుపడును. ఒకడు సిద్ధిబొందిన కులాచారధర్మములు తమంతట తాము వీడును అయితే యంతఔన్నత్య దశనుపొందకయున్న నతడు కులాచారధర్మముల ననుష్టించితీరవలెను.

207. తుపాను కొట్టుసమయమున అశ్వర్థచెట్టయినది ముష్టిచెట్టయినది చెప్పుటకు సాధ్యముండ దట్లఖండజ్ఞానస్ఫూర్తి గలిగినప్పుడు కులభేదములు కానరావు.

208. ఒకగాయము పూర్ణముగా మానిన దానిపక్కు తనంతట యూడిపోవును. ముందుగా నాపక్కునుబీకిన గాయమునుండి రక్తముకారునట్లు జ్ఞానసిద్ధియైన కులభేదములంవీడునుగాని మూఢులట్టి భేదములను నుల్లంఘించుట తప్పు.

209. ప్ర—యజ్ఞోపలీతము ధరించుట న్యాయమా?

ఉ—ఆత్మజ్ఞానముకలిగిన, సకలబంధములు తమంతటయూడిపోవును. అప్పుడు బ్రాహ్మణుడు, శూద్రుడు, ఎక్కువకులమునాడు హీనజాతివాడు అని భేధములుండవు. కుల చిహ్నమైన యజ్ఞోపలీతముకూడ నప్పుడుపోవును. భేదజ్ఞానముండువరకు యొకవును జుడు బలాత్కారముగా నట్టిభేధమును దానిచిహ్నమును ద్రోయకూడదు.

210. గౌరవస్థుల కుటుంబములనున్న పతివ్రతాస్త్రీలనుజూడ దైవము పతివ్రతాస్వరూపమున నచ్చటయున్నదను కొంగును. పట్టణవీధులయందు బహిరంగస్థలముల లజ్జారహితులై విషయాసక్తిచిహ్నములను జూపుచు విహరించుస్త్రీలనుజూడ వేరువిధముగా నిట్లు దైవము ప్రకాశించుచున్న దనుకొందును.

211. వాయువుయొక్క ప్రకాశము నేకస్థలములన నేకవిధములుగా వీలిగించును. ఆప్రకాశముయొక్క ప్రాణము, అనగా వాయువు నొక్కస్థలమునుండి వచ్చును. అట్లు వివిధదేశకాలముల గనుబడు మహాత్ములు సర్వాంతర్యామియైన పరమాత్మస్వరూపమునుండి యవిచ్ఛిన్నముగా బారుచున్న జ్ఞానమును ప్రకాశముజేయు దీపస్తంభములవంటివారు పరమాత్ముని యాజ్ఞననుసరించి మిద్దెమీదబడిన వర్షధారలం పులి, యావు, ఎద్దుముఖములపోలికనుండు గొట్టములద్వారా వెలువడుభంగి సర్వేశ్వరునిచేత నిత్యదివ్యసత్యవాక్యము లనేకసాధువుల ముఖాంతరమున లోకమునకు నివ్వబడును.

212. అన్నినక్క లొక్కవిధముగా గూయును. జ్ఞానుల బోధయంతయు నొక్కవిధముగానే యుండును.

213. ఈలోకమున సుఖమునిచ్చు పదార్థములన్నియు దైవస్వరూపమును గలిగియున్నది. ఆరెంటికి భేధము బెల్లపుసాగుకును శుభ్రమయిన ఖండచక్కెరకునున్న భేదమువలె నుండును.

214. ఇతరుల పనులయందు మునిగియుండువాడు తనస్వంత యంతర్బాహ్య కార్యముల నించుకయైన గమనించడం.

215. మనస్సు దుర్మార్గముల బ్రవర్తింప, నొకబ్రాహ్మణుడు చండాలుని యింటియందు వసించునట్లును, గొప్పవాడు నీచుల సహవాసముజేసినట్లగును.

216. ఒకడొక వకీలునుజూడ స్వాభావికముగా వ్యాజ్యములను వ్యాజ్యకారణములను యోచించును. అట్లనే భక్తునిజూడ, మనుజుడు దేవునిని, ముందురాబోవు గతిని, జింతించును.

217. ప్ర—ఎందుకొక మహాత్ముని నతని బంధువులు గౌరవించరు?
ఉ—గారడివాని బంధువులతని క్రియలనుజూడ నతనిచుట్టుజేరక, యితరులునిలిచి నోరుతెరచిచూచునట్లు.

218. ప్రదీపస్తంభముక్రింద, దీపముచుట్టునుండు వస్తువులను ప్రకాశింపజేసినను నీడయుండును. అట్లు మహాత్ముని కేవలసమీపమున నున్నవాడతనిని గ్రహించజాలడు. దూరమున వసించుజనులతనిజ్ఞానము నద్భుతశక్తి నిగ్రహించుదురు.

219. వేగముగా బ్రవహించు ప్రవాహము నీరుసుడియందు గిరగిరతిరుగు సుడిని తప్పించుకొనినవెనుక నేరుగా పారునట్లు భక్తులమనసు లొకకాలమున నిరాశతోను వ్యసనముతోను నమ్మికలేమిచేతను సుడిబడినను అట్టి యవస్థక్షణికమే. చాలాకాలముండదు.

220. ఫలములుగల వృక్షము బరువుతో వంగును. నిపుణునడొటకు గోరిన అణగి నమ్రతనుజూపును.

221. త్రాస్సు తక్కెడబరువైన క్రిందికిబోవును. తేలికయైనది పైకిబోవును. అట్లు యోగ్యతసామర్థ్యతగల పురుషుడు నమ్రుడైయుండును. అవివేకి డంభముగా గర్వించియుండును.

222. సాధువులకోపము నీటిమీదరాచిన గీతవంటిది. చాలాకాలముండదు.

223. ఒక తెల్లబట్టకు గొంచము మసితగిలినను వికారముగా నుండును. అట్లు సాధువుకొంచము తప్పుజేసినను గొప్పగాకానవచ్చును.

224. ఎక్కడప్రకాశించినను సూర్యరస్మియొక్కటే. నీళ్లు, అద్దము, మెఱుగు పెట్టిన పాత్రములు మొదలగు ప్రకాశమైన పదార్థములు సూర్యరశ్మిని ప్రతిఫలించగలవు. దైవప్రకాశమట్టిదే. అందరి హృదయముల నది సమముగా ప్రకాశించును. అయితే శుద్ధసాత్వికసంభవులగు వాధువుల హృదయముల ప్రతిఫలించగలవు.

రైతుచెడిపోవును గనుక దక్షిణఆర్కాటు జిల్లాయందువలె ధాన్యపుపైరు వేరుశనిగెలుకలిపి పైరుచేయుట యుక్తమము. ధాన్యములలో 3 నెలలలోగా పైరగు సజ్జయేమంచిది. ఇతరధాన్యపు పైరునకు వెనుక సాగుచేయు వేరుశనిగకంటె సజ్జను వెనుకచేయు వేరుశనగ బాగుగ ఫలించునని అనుభవమువల్ల తెలియవచ్చుచున్నది. మొదట సజ్జపైరుపెట్టి, అదిమొలవగానే, వేరుశనిగ విత్తనములు సజ్జకుమధ్య కుంట కఱ్ఱతోపొడిచి విత్తనమునాటి పాఱతో నోరుమూస్తురు. ఈలాగుచేయుటచేత సజ్జ పైరునకు రెండవత్రవ్వకము వేసినట్లు అగుటవలన మంచిఫలమునిచ్చును. సెప్టంబరు అక్టోబరులో సజ్జకోతపడుతూనే సజ్జమొక్కలను తీసివేయుదురు. తర్వాత వేరుశనిగ కూడ చక్కగాఫలించును. ఇట్లుమిశ్రిత పైరుపెట్టడమువల్ల రైతును అన్నివిధముల లాభకరముగానుండును.

సాధారణముగవేయు కుప్పలకుబదులుగా ఎరువును గోతులలో వేయవలెను.

**ఎరువు.**

ఇందులో పశువులచెత్తయేకాక పొయ్యిలోకి పనికివచ్చు కర్రలుగాక, చేనిలోనుండే యావత్తుచెత్తనున్న, ఇండ్లలోని పెంట పూడ్చినచెత్తను ఆకులు మొదలయిన వాటినన్నిటిని చేర్చవచ్చును. మంచిఎరువయ్యే పొలములోతీసిన కలుపుమొక్కలను, ఇండ్లకువేసిన పాతచెత్తను, వరిపొల్లును, పొగాకు, మిరప, వంగ, నువ్వు మొదలయిన వాటికంపలను వృధాగాపాడుచేయక ఎరువుగాజేయవలెను. వీటినన్నిటిని గోతులో వేసినయడల మంచి ఎరువగును. పెంటగోతులోని చెత్తఆరిపోకుండా తేమగానుండే టట్లు శ్రద్ధపుచ్చుకొని చూచుచుండవలెను. చాలా అరిపోయినయడల చెత్తకుళ్లిబాగా ఎరువుకానేరదు. కాబట్టి అప్పుడప్పుడు తేమగా పెట్టినుండవలయును. అప్పు డప్పుడు పెంట గోతులలో పలచగా మన్నుకూడ వేయుచుండిన, ఎరువుబాగాబిగిసి తేమగానుండును. ఇట్టి ఎరువును పచ్చిఆకులు మొదలగు పైరులతో కలిపివేసినయడల భూమికి మంచిసత్తువనిచ్చును.

ఈఎరువుగాక, భూమిసత్తువచేయు పచ్చిఆకు విత్తనములు సంపాదించవచ్చును.

యంపలి—బంజరునేలలలోగాని మిట్టనేలలలోగాని విశేషము యంపలిచెట్లుం డును. వాటికాయపండగానె విత్తనములు చిట్లును చెట్లడుగు పూడ్చుటచే యంపలి విత్తనము జమచేయవచ్చును.

తగరసు:—వీటికాయలు పండగానే, జమచేర్చికొట్టి గింజలు చేర్చనగును.

నీలిజనుము:—ఇవికూడా ఎరువుగానగును ఈవిత్తనములు వెలకుదొరకును.

ఈవిత్తనములను మళ్లలో పెరిగినతోడనే వాటినిచక్కగా ఆభూమిలోనే దున్నివేసిన మంచిఎరువగును.

**మోటార్ బండి.**

సాధారణమైన రోడ్లమీద కంబీలులేకనేపోవు పొగబండి. ఇదివేలకొలది రూపాయలకు కొనవచ్చును. 1 ఘంటకు 50, 60 మైళ్లు కూడా పోవును. ఇది యింగ్లాండుదేశములో కనిపెట్ట బడినది. ఇప్పుడు మనదేశమున బంగాళీరాష్ట్రమున జెస్సూరునందుకూడా తయారైనది, ఇట్టి అద్భుతయంత్రములు మనవారు నేర్చునది చాలా ప్రశంసనీయము.

**పూలు.**

పూలనుచెడకుండా నానాటికి ఉంచుకొనను అనేకులు, ముఖ్యముగా స్త్రీలు ఇష్టపడుట సహజమేకదా? అందుకై పూలను గాలికి పెట్టుదురు. అట్లుచేయుటవల్ల పూలలోని ద్రవము ఇమిరి కమిలిపోవును. నల్లనౌను. గాలి ఆడనివ్వక ఒక పెద్దచెంబులోనో తపెలేలోనో వేసి బోర్లించిన పూలు రెండుమూడు దినములు చెడక యుండును లేక ఒకడబ్బియందైనా నుంచవచ్చును.

**తేలుమందు.**

ఒకచిటికెడు పటికపుపొడిలో చన్నీళ్లువేసి, తేలుగాని యితర పురుగులుగాని కుట్టినచోట పూసిచల్లగాలివీచినట్లయిన స్వల్పకాలము లోనే బాధ నివారణయగును. దీనిని ఉపయోగించి గుణమును గ్రహించుడు.

**శ్వాసకోశవృద్ధి.**

క్షణక్షణము ఊపిరితిత్తులవలె ప్రాణులదేహములందు శ్వాసనిశ్వాసములు మనము గమనించకనే జరుగుచున్నవి. సర్వదేహబలమునకు, సర్వయోగసిద్ధికి ఆకార్యమే మూలము. మనము ప్రయత్నముతో శ్వాసముల నెంతశ్రద్ధతో, సద్గురువుముఖము గని మార్గము తెలిసి, నిగ్రహించిన నంతఫలదాయకముగ నుండును. శ్వాసనిశ్వాసములను మందముగా విడుచుటవల్ల శ్వాసకోశము బలిష్ఠమై, ఎదవిశాలమై, అద్భుతమైన గరడీలు, సాములు చేయుటకు దేహము సాధనమగుటకాక మోక్షసామ్రాజ్యముకూడ లభించును.

## శ్రీకృష్ణులవాక్యము.

సూక్ష్మమగుటవలన సర్వవ్యాపియైన యాకాశమెట్లంటదో దేహములో సర్వత్ర వ్యాపించిన పరమాత్మ యట్లసంగుండై యుండును. ఒక సూర్యునిచే లోకము ప్రకాశమాన మగునట్లు, అర్జునా! క్షేత్రమును, క్షేత్రజ్ఞుడు ప్రకాశింపజేయును. ఈ క్షేత్ర, క్షేత్రజ్ఞ, విభాగమును, భూతముల ప్రకృతి నివృత్త్యుపాయమును జ్ఞానదృష్టిచేత దెలియువారు పరమపదమును జేరుదురు.

*ఇట్లు శ్రీదివ్య భగవద్గీతయందు క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమను పదమూడవ యధ్యాయము సమాప్తము. శ్రీకృష్ణార్పణం.*

---

## పదినాల్గవ యధ్యాయము - గుణత్రయ విభాగయోగము.

## శ్రీకృష్ణులవాక్యము.

వెనుక చెప్పిన జ్ఞానముకంటె, పరమోత్కృష్ట జ్ఞానమును నేను మరల చెప్పెదను. దానిని దెలిసి, సకలమును లుత్తమసిద్ధిని బొందిరి. ఈజ్ఞానమును బొంది నాస్వకీయమైన భావమును బొందినవారు, సృష్టికాలమునగూడ జన్మము నొందరు. ప్రళయకాలమున దుఃఖము నొందరు. మహద్బ్రహ్మము నాయోని, దానియందు నేను బీజముంచుదును. దానినుండి, అర్జునా! సకల భూతము లుత్పత్తియగును. మర్త్యలోకయోనులయందు బుట్టినను, మహత్తే మాతృస్థానము. అర్జునా! నేను బీజప్రదమైనతండ్రి. సత్వము, రజస్సు, తమమని ప్రకృతివల్ల మూడు గుణములు గలిగినవి. ఇవి యవ్యయమైన దేహవాసులను దేహమున బద్ధలను జేయును. వీనియందు సత్వము నిర్మలమై, ప్రకాశమై, ఆరోగ్యదాయకమై యుండుటచేత, అర్జునా! సుఖమునకును జ్ఞానమునకును బద్ధునిగా జేయును. రజోగుణము రాగాత్మకమైన సంగమును, విషయస్పృహయు, పుత్రమిత్రాదిసంగమును కలిగించునని తెలియుము అర్జునా! అది దేహిని గర్మాసక్తితో బద్ధుని జేయును. తమోగుణము అజ్ఞాన జన్యముగాను దేహులను మోహింప హేతువనియు తెలియుము. అది అజాగ్రతతోను, నిద్రతోను, ఆలస్యముతోను, అర్జునా! దేహిని బద్ధునిగా జేయును. అర్జునా! సత్వము సుఖమున రజస్సుకర్మలందు బ్రవర్తింపజేయును. తమోగుణము జ్ఞానమును మరుగుజేసి ప్రమాదములయందు బ్రవర్తింపజేయును. అర్జునా! ఒకవేళ రజస్తమోగుణములను దిరస్కరించి సత్వగుణము ప్రబలమగును. ఒకవేళ సత్వతమో గుణములను దిరస్కరించి రజోగుణము ప్రబలమగును. మరొక

వేళ సత్వ రజోగుణములను తిరస్కరించి తమోగుణము ప్రబలమగును. దేహము యొక్క సర్వ ద్వారములందును జ్ఞానప్రకాశ ప్రవాహము గలిగినప్పుడు సత్వగుణము ప్రబలినదని తెలియును. లోభము, ప్రవృత్తి, ఆరంభము, కర్మాచరణము, అచంచలము, కామము, ఇవి రజోగుణాధిక్యమువల్ల, అర్జునా! కలుగుచుండును. అప్రకాశము, జబ్బుతనము, ప్రమాదము, మోహము, ఇవి అర్జునా! తమోగుణాధిక్యమువల్ల కలుగును. మరణము సంభవించు నప్పుడు సత్వగుణము ప్రబలమైన, నిర్మలమైన యుత్తమ జ్ఞానుల లోకమును బొందును రజోగుణము ప్రబలమైన సమయమున మరణము సంభవించె నేని కర్మా సక్తులలో బుట్టును. తమోగుణమున చచ్చె నేని మూఢుల యోనులందు జన్మించును. సుకృతమునకు ఫలము సాత్వికము, నిర్మలత్వము. రజోగుణ కర్మకుఫలము దుఃఖము, తమోగుణమునకు ఫలమజ్ఞానము. సాత్వికమువల్ల జ్ఞానముదయించును, రజస్సువల్ల లోభము బుట్టును. తమమువల్ల ప్రమాదము, మోహమజ్ఞానములు బుట్టును. సాత్వికులు ఊర్ధ్వలోకములు బొందుదురు. రాజసులు మధ్యలోకమున నుందురు. తామసులు నికృష్టవృత్తిని బొంది యధోలోకములను జేరుదురు. గుణములకంటె వేరుకర్త లేదని గ్రహించి, గుణములకంటె శ్రేష్ఠమైన తత్వమును దెలసిన ద్రష్ట నాస్వరూపమును బొందును. సర్వ దేహోత్పత్తికి గారణములైన యాత్రిగుణములను దాటిన దేహి జన్మమృత్యు జరాదుఃఖములచేత విముక్తుడై, మోక్షామృతము గ్రోలును.

## అర్జునుని వాక్యము.

త్రిగుణాతీతుడైన వాని చిన్నా లెవ్వి? కృష్ణా! ఎట్టి యాచారము గలవాడగును? త్రిగుణాతీతు డెట్లగును?

అర్జునా! త్రిగుణాతీతుడు ప్రవృత్తియందు ప్రకాశమును ప్రవృత్తియును మోహమును ద్వేషింపడు. నివృత్తియందు అవిలేకున్న వానిని గోరడు. ఉదాసీనుడై గుణములచేత జలింపబడడు. గుణములు వర్తించునని చెప్పుచు అచలుడై వేరుగా నుండును. సుఖదుఃఖములందు సమానుడై, స్వాశ్రయుడై మృత్తికయు పాషాణమును, బంగారమును సమముగా జూచును. ప్రియాప్రియములందు సమదృష్టి గలిగి ధీరుడై యుండును. నిందాస్తుతులయందు సముడై యుండును. మానావమానములయందు సముడు. శత్రు మిత్రులయందు సముడు. సకలోద్యోగ పరిత్యాగియగును.

శ్లో. బద్ధేనాంజలినా నతేనశిరసా గాత్రైస్సరోమోద్గమైః
కంఠేన స్వరగద్గదేననయనే నోద్గీర్ణబాంష్పాంబునా
నిత్యం త్వచ్చరణారవిందయుగళధ్యానామృతాస్వాదినా
మస్మాకం సరసీరుహాక్ష సతతం సంపద్యతాం జీవితమ్.

ఉ. అంజలిచిన్నిపూవుఁ బ్రణతాననముఀ మెయిరోమహర్షముఀ
గంజలముబ్బుపాటు స్వరగద్గదముం జెలువారనిన్నుఁ గొ
ల్వం జరణారవిందయుగళ స్మరణామృత నిత్యభోక్తకై
కంజదళాయతాక్ష మనఁ గల్గుత మెప్పుడు మాకుమాధవా. 20

శ్లో. హేగోపాలక హేకృపాజలనిధే హేసింధుకన్యాపతే
హేకంసాంతక హేగజేంద్రకరుణా పారీణ హేమాధవా
హేరామానుజ హేజగత్త్రయగురో హేపుండరీకాక్షమాం
హేగోపీజననాథ పాలయ పరం జానామి నత్వాం వినా.

మ. ఒరెగోపాలక యోకృపాజలనిధీ యోసింధుకన్యాపతీ
యొరెకంసాంతక యోగజేంద్రవరదా యోకృష్ణ యోమాధవా
యొరెరామానుజ యోజగత్త్రయగురూ యోపుండరీకాక్ష న
న్నొరెగోపీజననాథ గావుర త్వదన్యుఀ నేనెఱుంగఀ శ్రీవరా. 21

శ్లో. భక్తాపాయభుజంగగారుడమణి స్త్రైలోక్యరక్షామణిః
గోపీలోచనచాతకాంబుదమణి స్సౌందర్యముద్రామణిః
యః కాంతామణి రుక్మిణీఘనకుచద్వంద్వైక భూషామణిః
శ్రేయో దేవశిఖామణి ర్దిశతునో గోపాలచూడామణిః.

మ. తతభక్తార్తి భుజంగగారుడమణీ త్రైలోక్యరక్షామణీ
శతగోపీక్షణచాతకాంబుదమణీ సౌందర్యముద్రామణీ
శ్రితకాంతామణి రుక్మిణీ స్ఫురదుస్సీమామణీ కామునీఁ
గుతశ్రీదేవశిఖామణీ శుభమునీ గోపాలచూడామణీ. 22

శ్లో. శత్రుచ్ఛేదైకమంత్రం సకలముపనిషద్వాక్యసంపూజ్యమంత్రం
సంసారోత్తారమంత్రం సముపచితతమస్సంఘనిర్యాణమంత్రం
సర్వైశ్వర్యైకమంత్రం వ్యసనభుజగసందష్టసంత్రాణమంత్రం
జిహ్వే శ్రీకృష్ణమంత్రం జపజప సతతం జన్మసాఫల్యమంత్రమ్.

చ. కలుము లొసర్చుమంత్రము వగందెగువారలఁ దేర్చుమంత్రము
జ్ఞాల నెఱిఁగించుమంత్రముఁ బ్రసూతిమహాబ్ధిఁ దరించుమంత్ర మా
త్మలపగఁగూల్చుమంత్రముఁ దతశ్రుతివాక్కులు గొల్చుమంత్రమున్
బెలుచనఁ గృష్ణమంత్రము జపింపుము సంభవసారమంత్రమున్. **23**

శ్లో. వ్యామోహప్రశమౌషధం మునిమనోవృత్తి ప్రవృత్త్యౌషధం
దైత్యేంద్రార్తికరౌషధం త్రిజగతాం సంజీవనైకౌషధం
భక్తాత్యంతహితౌషధం భవభయప్రధ్వంసనైకౌషధం
శ్రేయఃప్రాప్తికరౌషధంపిబమన శ్శ్రీకృష్ణదివ్యౌషధమ్.

చ. వలపులమాన్చుమందు మునివాంఛితవృత్తులనున్చుమందు దై
త్యులఁబొలిపుచ్చుమందు జగదుత్కరజీవన మిచ్చుమందు భ
క్తులకెదఁగూర్చుమందు భవదుఃఖభయంబులఁ దీర్చుమందు మం
గళములమర్చుమందుఁ దిను కమ్మని కృష్ణునిమందు డెందమా. **24**

శ్లో. ఆమ్నాయాభ్యసనా న్యరణ్యరుదితం వేదవ్రతాన్యన్వహం
మేదశ్ఛేదఫలాని పూర్తవిధయ స్సర్వేహుతం భస్మని
తీర్థానా మవగాహనానిచ గజస్నానం వినా యత్పద
ద్వంద్వాంభోరుహసంస్మృతిర్విజయతే దేవస్సనారాయణః.

ఉ. నెమ్మన మేమహాత్ముపద నీరజముల్ గనదేని వేదపా
ఠమ్ములరణ్యఘోషలుఁ దటాకము బూడిదహోమహాను నే
మమ్ములనోము దేహపటిమన్ గొనునో కరియాటలౌను పు
ణ్యమ్మగు తీర్థమాడుటలు నాపురుషోత్తముకై జయా జయా. **25**

శ్లో. శ్రీమన్నామప్రోచ్య నారాయణాఖ్యం
కేనాప్రాప్తం వాంఛితం పాపి నోపి
వానః పూర్వం వాక్ప్రవృత్తానతస్మిన్
తేన ప్రాప్తం గర్భవాసాది దుఃఖం.

ఉ. కాయిహమందు బాపి యెవఁడేని పఠించిన శ్రీమదాది నా
రాయణ నామమంత్రమది ప్రార్థితభాగ్యము లీకపోవ ద
య్యేయటులేనుఁ బూర్వజననోత్కరమందు జపింపలేమిచే
నీయెడ గర్భవాస ముఖమీయెడ లెల్లను నేనుఁ బొందెదన్. **26**

శ్లో. మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే
మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ
త్వద్భృత్యభృత్యపరిచారకభృత్యభృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ.

ఉ. నిత్యము ప్రార్థనీయ మెది నీయెడ దానిననుగ్రహింపుమా
సత్యము నాదుజన్మఫలసారమదే మధుకైటభారి నీ
భృత్యుని భృత్యుభృత్యునకు భృత్యుని భృత్యుని భృత్యు భృత్యుఁగా
దైత్య విదారణా మదినిఁ దప్పక కైకొను లోకనాయకా. 27

శ్లో. నాథేనః పురుషోత్తమే త్రిజగతామేకాధిపే చేతసా
సేవ్యే స్వస్యపదస్యదాతరిసురే నారాయణే తిష్ఠతి
యంకించిత్పురుషాధమం కతిపయగ్రామేశమల్పార్థదం
సేవాయైమృగయామహే వరమహో మూఢావరాహోవయమ్.

చ. నరహరి నాథునిం ద్రిభువనప్రభువుం బురుషోత్తముం మదిన్
స్మరణముఁ జేయ నాత్మపదసంపదనిచ్చు ముకుందుఁ బాసి త
క్కొరు నరుఁ గొన్ని యూళ్లయొడయుం బురుషాధము క్షుద్రదాతఁ జా
కిరిఁ గొలువన్ వరింతుము నికృష్టవరాహులమో కటాకటా. 28

శ్లో. మదనపరిహారస్థితిం మదీయే, మనసి ముకుంద పదారవిందధామ్ని
హరనయనకృశానునా కృశోసి, స్మరసిన చక్రపరాక్రమం మురారేః.

కం. మదనా నామది వరుని
పదారవిందముల యునికి పట్టగు దానిం
బొదవకు మానుము త్రిణయన
విదారిత! మురారి చక్రవిక్రమ మెఱుకే. 29

శ్లో. తత్త్వంబ్రువాణాని పరం పరస్తాత్, మధుక్షరంతీవ సతాం ఫలాని
ప్రావర్తయ ప్రాంజలి రస్మి జిహ్వే, నామాని నారాయణ గోచరాణి.

కం. రసనము నారాయణనా
మసమితి వల్లింపుమెయి నమస్కృతి యిదే నీ
కొసఁగునది సత్ఫల మది మధు
రసమమును దత్త్వమును బరాత్పరమునగున్. 30

శ్లో. ఇదం శరీరం పరిణామ పేశలం, పతత్యవశ్యం శ్లథసంధిజర్ఝరం
కిమౌషధైః క్లిశ్యసి మూఢ దుర్మతే, నిరామయం కృష్ణరసాయనం పిబ.

కం. కీలెడలి మేను తప్పక
కూలును సులభముగ మాఱు గోలా కుమతీ
యేలర మందులఁ గుందెదు
గ్రోలుం హరి రసాయనమును రోగ నిరోధిక. 31

శ్లో. దారావారాకరవరసుతా తే తనూజో విరించః
స్తోతా వేద స్తవసురగణో భృత్యవర్గః ప్రసాదః
ముక్తి ర్మాయాజగదవికలం తావకీదేవకీ తే
మాతామిత్రం బలరిపుసుత స్త్వయ్యతోన్యన్న జానే.

కం. పాలసముద్రపు బాలయె గాదిలిభార్య విరించి యె బాలుఁడు వే
దాళియె నిన్గొని యాడును దేవకి యంబిక నెచ్చెలియర్జునుఁడే
లీల త్రిలోకవిలీనము వేల్పులె లెంకలు మోక్షము లేవరముల్
పాలికి నీయవె శౌరిగనుంగొనఁ జాలసమగ్రపుర క్తికనన్. 32

శ్లో. కృష్ణోరక్షతు నోజగత్త్రయగురుః కృష్ణంనమస్యామ్యహం
కృష్ణే నామరశత్రవో వినిహతాః కృష్ణాయతుభ్యం నమః
కృష్ణాదేవ సముద్ధితం జగదిదం కృష్ణస్య దాసోస్మ్యహం
కృష్ణేతిష్ఠతి సర్వమేతదఖిలం హేకృష్ణ రక్షస్వ మాం.

ఉ. కృష్ణుఁడు మాకు రక్షకుఁడు కృష్ణుని మ్రొక్కెద నేను రాక్షసుల్
కృష్ణునిచే మృతింగనిరి కృష్ణునికై కయి మోడ్పు లోకముల్
కృష్ణునినుండి పుట్టినవి కృష్ణుని దాసుఁడ నేను సర్వముం
గృష్ణునియంద నిల్చు మముఁ గృష్ణ త్రిలోకగురూ భరింపుమా. 33

శ్లో. తత్త్వం ప్రసీదభగవన్ కురుమయ్యనాథే
విష్ణో కృపాం పరమకారుణికః కిలత్వమ్
సంసారసాగరనిమగ్న మనంతదీన
ముద్ధర్తు మర్హసి హరే పురుషోత్తమోసి.

చం. వరద యనాథనాథ భగవంత యనంత ముకుంద విష్ణు శ్రీ
హరి పరమానుకంపహృదయా పురుషోత్తమ యంచునిన్నె పి

ల్తురుగద నీకొలుట్టి బిరుగల్గద దీనుని నన్ను జన్మ సా
గగ పతితున్ బ్రసన్నకృపఁ గావఁదగుఁ దగు లేవనెత్తఁగన్. 34

శ్లో. నమామి నారాయణ పాదపంకజం, కరోమి నారాయణపూజనంసదా
వదామి నారాయణనామ నిర్మలం, స్మరామి నారాయణతత్త్వ మవ్యయం.

తే. తెలతు నారాయణుని పాద నళినములను
గొలుతు నారాయణునిఁబూజ సలుపుచెపుడుఁ
బలుకు దమలనారాయణ భవ్యకీర్తిఁ
దలఁతుఁ నారాయణావ్యయ తత్త్వమహిమ. 35

శ్లో. శ్రీనాథ నారాయణ వాసుదేవ, శ్రీకృష్ణ భక్తప్రియ చక్రపాణే
శ్రీపద్మనాభాచ్యుత కైటభారే, శ్రీరామ పద్మాక్షహరే మురారే.

తే. శ్రీసతీశ నారాయణ వాసుదేవ
శౌరి కృష్ణ భక్తప్రియ చక్రపాణి
కమల నాభ యచ్యుత మధు కైటభారి
రామ పుండరీకాక్ష హరీ మురారి. 36

శ్లో. అనంత వైకుంఠ ముకుంద కృష్ణ, గోవింద దామోదర మాధవేతి
వక్తుం సమర్థోపి నవక్తి కశ్చి, దహోజనానాం వ్యసనాభిముఖ్యం.

తే. ఇందిరేశ వైకుంఠ ముకుంద కృష్ణ
యోయనంత గోవింద దామోదర యని
పనవ సామర్థ్యముండియుఁ బనవఁ డొకఁడుఁ
దేని వ్యసనాభి ముఖతను మానఁ డహహ. 37

శ్లో. ధ్యాయంతియే విష్ణు మనంత మవ్యయం, హృత్పద్మమధ్యే సతతం వ్యవస్థితమ్
సమాహితానాం సతతాభయప్రదం, తేయాంతి సిద్ధిం పరమాంచ వైష్ణవీమ్.

త. అవిరళాభయదానపాణి ననంతు నవ్యయు విష్ణుఁ గే
శవు స్సమాహితచిత్తవృత్తిఁ బ్రసన్న హృత్కమలంబునన్
దవిలి ధ్యానసమాధిలో సతతంబు నిల్పిన సిద్ధవై
ష్ణవమునుం బరమంబునున్ నరు శాశ్వతంబుగఁ బొందెదున్ 38

శ్లో. క్షీరసాగరతరంగశీకరా, సారతారకిత చారుమూర్తయే
భోగిభోగశయనీయశాయినే, మాధవాయ మధువిద్విషే నమః.

'Registered No. M 716.'
SWAN SERIES No. 3.

ఓం





# హంస

A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఒక యాంధ్ర బ్రహ్మజ్ఞాన మాసపత్రిక.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 2.] సౌమ్యసంవత్సర జేష్టం, ఆషాడం, 5010, జూన్, జూలై 1909. [సంచిక ౬, ౭.

విషయసూచిక.



---

చెన్నపట్టణము:
వైజయంతీ ముద్రాశాలయందు ముద్రింపబడినది.

మానేజరు, హంసవిలాస్, 296 లింగిశెట్టి వీధి, జార్జిటవున్
మదరాసు. అని వ్రాయవలెను.

సంవత్సరమునకు చందా 1 రూపాయ.

ఓం



# హంస.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 2.] సౌమ్యసంవత్సర జ్యేష్ఠం, ఆషాఢం, 5010, జూన్, జూలై 1909. [సంచిక ౬, ౭.

## ఒక ప్రశ్న.

ఒక ఉద్యానవనమున నొక మామిడిచెట్టుమీద నొక చిలుక కాపురముండెను. దైవవశాత్తుగ నాచెట్టు ఎండిపోయెను. ఐనను చిలుక తనయాశ్రయము విడువక నే యుండెను. ఒకనాడు ఇంద్రుడు విహరించుచు ఇట్టియెండిన చెట్టుమీద నెందు కున్నావు. అనేక ఫలభరిత వృక్షములుండ నిట్లేలయున్నావని యడుగ తాను చాలా కాలము ఆచెట్టుయొక్క ఫలములను తిని దానినీడన కాలముగడిపినాననియు, ఎండిపోయిన కాలమున దాని ఆశ్రయము విడుచుట కృతజ్ఞత యవునా యని బదులు చెప్పెను. ఆచిలుకయొక్క కృతజ్ఞతకు మెచ్చుకొని, నీవు కోరినవరమడుగుమని ఇంద్రుడు అనుగ్రహించెను. చదువరులారా! మీరే ఆచిలుకయైన, ఏమివరమడుగుదురో, దయచేసి నాకు తెలుపుడు.

హంస.

---

## నీతి సంగ్రహము.

1. పరమాత్మ ప్రతిప్రాణిహృదయమున నెలకొని యున్నది. (భగవద్గీత. XVIII. 61.)

2. ఓమానవుడా! నీ వొకడవే యున్నావనుకొని, నీయిష్టానుసారముగ వర్తించుచున్నావు. నీహృదయమునందు సనాతనమైన ఆత్మను కనజాలక యున్నావు.

నీవు చేయుదానినంతయు అదిగాచుచు, గుర్తించుచున్నయది. ఈ ఆత్మతనకు తానే సాక్షి, ఆశ్రయము. ఆత్మ మనిషియొక్క శాశ్వతమైన శ్రేష్ఠమైనసాక్షి దానికి ఆగ్రహము కలుగజేయకుము. (మహాభారతము I, 3015. మను. VIII. 85.)

3. కర్మ మనోవాక్కాయములని మూడు విధములు. ఎట్టికర్మయైనను దాని మంచిచెడ్డల ననుసరించి చెడ్డమంచి ఫలములనిచ్చును. ఈకర్మలననుసరించియే అనేక విధములగు జన్మములుకలుగును. ప్రతియొకడు తనకర్మఫలము ననుసరించియే సుఖదుఃఖములను బొందునుగాని వేరుకారణము లేదు. ప్రతివాడు తననడత ఫలమునే అనుభవించును. (మను. XII. 3. మహాభారతం. VI. 30. విష్ణుపురాణం. I. 1-18.)

4. గనుక కర్మభంగమువల్ల జీవులకుగలుగు దుఃఖములను ధర్మాచరణవల్లగలుగు శాశ్వతానందమును చక్కగా విచారించి, పుణ్యపాపానుసారముగ జీవులకు గలుగు జన్మపరంపరలను దీర్ఘాలోచనలోకిదెచ్చి, సదాధర్మాసక్తుడవు కమ్ము. మనోవాక్కాయములను త్రికరణశుద్ధుడవు కమ్ము. (మను. VI. 64. XII. 23. XI. 232.)

5. నిన్ను నీవు ఉద్ధరించుకొన ప్రయత్నించవలయు. నీకు నీవేమిత్రుడు. నీకు నీవేశత్రువు. (భ. గీ. VI .4.)

6 బంధనమునకు, మోక్షమునకు మనసే కారణము. ఇంద్రియవిషయముల సంగమే బంధకారణము. ఇంద్రియ విషయత్యాగమే మోక్షసాధనము. వివేకము గలవాడు ఇంద్రియ విషయములనుంచి మనసునుత్రిప్పి, పరబ్రహ్మయందు నిలిపిన మోక్షానందమును కనును. (విష్ణుపురాణము, VI. VII. 22-30.)

7. మనలోకజన్మమెత్తు సమయమున ఇప్పటి తండ్రిగాని, తల్లిగాని, భార్యగాని, కుమారుడుగాని, భంధువుగాని వెంటరారు. జీవుని వెంబడించునది వానికర్మఫలమొక్కటియే. గనుక మంచిసహవాసమును సంపాదించుటకై, ఎడతెగక సత్కార్యములనుచేయుచు పుణ్యరాశిని క్షణక్షణము వృద్ధిచేయుము. పుణ్యము వెంటనుండ, సహింపగూడని దుఃఖమును సులభముగా దాటవచ్చును. (మను. IV. 239 241.)

8. 1. తృప్తి. 2. పరహింసమానుట. ఉపకారము చేయుట. అపకారమునకు ఉపకారముచేయుట. 3. విషయభోగనిరసనము. 4. అధర్మసంపాదన. దొంగతనము మానుట. 5. పరిశుద్ధత, పాతివ్రత్యము, పరిశుభ్రత, 6. రాగద్వేషాదినిరసన. 7. జ్ఞానసాధన. 8. విజ్ఞానసాధన. 9. సత్యము. ఋజుత్వము, విశ్వాసము, సద్గుణ ధరికము. (మను. VI. 2.)

9. దురాశ, సోమరితనము, ధనాశ, పరదూషణ, వంచన, నాస్తికత్వము, విధ్యుక్తకర్మలనుమానుట, దయసంపాదించ యత్నించుట, కర్తవ్యముల నుపేక్షించుట పునర్జన్మమును నమ్మకుండుట, శ్రుతులనుపేక్షించుట, దైవదూషణ, ఈర్ష్య, అసూయ, దంభము, కోపము, క్రోధము. ఇవి అన్నియు దుర్గుణములు. (మను. XII. 33. IV. 163.)

10. సత్కార్యములందు సాహసముచేయుము. రాగద్వేషాదులను జయించుము. సత్పాత్రదానము విధ్యుక్తముగాజేయుము. నిదానమైన నడతజూపుము. కష్టముల నోర్పుతో సహించుము. దుస్సాంగత్యము మానుము. ఏప్రాణికి హింసచేయకుము. దీనివల్ల నీకు సద్గతికలుగును. (మను. IV. 246.)

11. సత్పురుషుల మార్గముననడవుము. నీపెద్దలు నడచినమార్గమున నడవుము బాలునినుంచి మృదువైనమాటలను, శత్రువునుంచి దీర్ఘాలోచనగల నడతను, మలిన పదార్థమునుంచి బంగారును ఇట్లు అన్నిటియందుగల మంచినిమాత్రము గ్రహించి నడచుకొనుము. (మను. II. 239. IV. 178.)

12. పరసౌఖ్యదాయకమైన దైవభక్తిని వృద్ధిచేయ ప్రయత్నించుమా. (విష్ణు· పురాణం I, XI. 23.)

13. ధర్మాచరణవల్ల దరిద్రము సంప్రాప్తమై దుఃఖము కలిగినను అధర్మముతట్టు మనసు త్రిప్పకుము. (విష్ణుపురాణం IV. 171.)

14. దుష్కార్యము చేయునప్పుడంతయును 'ఇకమీద నిట్టిది మరల చేయనని' చెప్పుటచాలదు. దుష్కార్యముల నెన్నటికి చేయకుండుటయే సరియైన పరితాపము. ఇదియే పాపపరిహారమునకు హేతువు. (మను. XI. 230.)

15. సత్యమే పలుకుము. సత్యమే జయించును. అసత్య మెన్నటికి జయించదు. మనోవాక్కాయ కర్మలొక్కటిగ నుండుటయే సత్యమనబడును. ఈ సత్యముకంటె శ్రేష్ఠమైన మతముగాని నీతిగాని లేదు. అసత్యముకంటె ఘోరమైనపాపము లేదు. కావున సదా మానవులందరు సత్యమునే ఎల్లకాల మాశ్రయించుదురు గాక. సత్యమే గొప్ప భక్తిని చూపుచున్నది. సర్వకార్యముల ఫలము సత్యము నాశ్రయించి యేయున్నది. సత్యముకంటె శ్రేష్ఠమైనది ఏదియులేదు. లేదు. (తైత్తిరీయం I, II. ముండక. I, శాండిల్యం I, మహానిర్వాణం IV. 70-73.)

16. న్యాయమును పరిపాలించుము. న్యాయమును చెరచిన, అది మనలను చెరచును; పాలించిన, అది పాలించును. గనుక న్యాయలోప మెన్నటికి గాగూడదు. న్యాయమును తలక్రిందుగాజేసిన నది సర్వమును తలక్రిందుగా జేయును, హెచ్చరిక. (మను. VIII. 15.)

17. ఒకరికి హింసజేయకుము. అహింస యనగా ఎవనికిగాని ఏకాలమునను మనోవాక్కాయ కర్మలలో దేనిచేతనైనను ఏవిధమైనబాధను కలుగజేయకుండుటయే. అహింసాచరణవల్ల దయ, దానము, భక్తి, పూజనము నాల్గుధర్మములువృద్ధి యగుటకు కారణము గలుగును. అహింసయే మనశ్శ్రేష్ఠమైన బలము. ముఖ్యమైన ఆపద్బాంధువు. సుఖమునకు సత్యవ్రతమునకు సకల సద్గుణములకు నిధి. (మహా భారతం. II. 6. 57. 13.)

18. సత్పురుషుల బలము దయయే. (విష్ణు. II. 21.) సత్కారము చేయకుండినను, అవమానము చేయకుము. శాపములకు వరములను బదులివ్వుము. (మను VI. 47.)

తనకొమ్మలను నరుకవచ్చిన గొడ్డలిమీద సువాసననెఱపు గంధపుమ్రానువలె, తనకెంత అపకారము కలుగుచుండినను సత్పురుషుడు సర్వదా సర్వులకు మేలుచేయవలెనని యోచించుచుండును గాని కీడు నించుకయైన తలచడు (హితోపదేశం.)

19. కృతజ్ఞుడవుకమ్ము. చంపువారికిని, దొంగలకును, త్రాగుబోతులకు, ఇతర పాపులకు ఋషులు ప్రాయశ్చిత్తము విధించియున్నారు కాని కృతఘ్నుని పాపమునకు ప్రాయశ్చిత్తమే లేదు. (కిష్కింధ 43. [2].)

20. హితంబుచేయుట ఉపేక్ష చేయకుము. 'వీడు మనకుటుంబమునకు చేరినవాడా' యని అల్పబుద్ధులు అడుగుదురు, జనులందరొక కుటుంబమునకు చేరినవారని మహాత్ములు తెలియుదురు. ఎవరికి నేలాటిహింస మనఃపూర్వకముగ జేయక అందరి హితమును గోరువాడు శాశ్వతసుఖమును బొందును. (తైత్తిరీయం XI. మను. V. 46.)

21. దానమనగా న్యాయముగా సంపాదించిన ధనము, ధాన్యము మొదలగు పదార్థములను మంచిమనస్సుతో అక్కరగలవారికి ఇవ్వడము. దిక్కులేని సన్యాసులకు నీశక్తికొలది దానముచేయుము. నిన్ను నమ్ముకొనియుండువారికి ప్రతికూలములేక సాధ్యమైనంత ఇతరప్రాణులకు దానము చేయుము. (శాండిల్య. 3 మను. IV. 32.)

22. స్వయంభరితుడుగా నుండకుము. కుక్షింభరిత్వమునకు చాలా విచారపరు డవు గాకుము. ఏలన సృష్టించిన దైవము జీవనోపాయము సిద్ధము చేసియుండును. ప్రాణిపుట్టుచునే తల్లిచంటియందు పాలుస్రవించ ప్రారంభించును. పరుల మేలుకొరకు గాను ధీరులు తమధనమును ప్రాణమును ఇత్తురు. ధనము, ప్రాణములు శాశ్వతము కావు గనుక వాటిని సత్కార్యములకు వినియోగించ వెనుకదీయరు. మనశ్శాశ్వతప్రాయమైన దేహమునకు ధర్మమునకు చాలా భేదమున్నదని తెలియుము. దేహము ఒకక్షణమున నశించును. ధర్మమాకల్పాంతము నిలుచును. (మను. VII. 46.)

23. ఇతరుల సొత్తులను అపేక్షించకుము. కొంగతనము విడుచుట అనగా ఇతరులసొత్తునుపొంద నపేక్షనుకూడ ప్రకరణశుద్ధిగా మానుట. (ఈశ. 6. శాండిల్యం. I.)

24. నీకార్యమువల్ల కలుగు గౌరవముకంటె వేరుగౌరవ మపేక్షించకుము. నీ పాలుకువచ్చు గౌరవముతో తృప్తిపడుము. (విష్ణు. I. XI. 22-29.)

25. తృప్తికలిగియుండుము. ఏమిసంభవించినను నిరంకుశమైన సంతుష్టతయే తృప్తి. జ్వలించుఅగ్నియందు అజ్యముపోసిన ప్రజ్వలించునేగాని చల్లారనట్టు విషయ భోగముచే ఆశ ఎన్నటికిని తీరదు. (మను. II. 9. 10.)

26. స్థైర్యమునభ్యసించుము. స్థైర్యమనగా ధనమును, బంధువులను పోగొట్టు కొనినను సంపాదించినను సర్వకాలములయందు మనశ్శాంతికలిగి యుండుట, దుఃఖ మున ఖిన్నతయు సుఖమున సంతోషమును నీమనసును పొందనీయకుము. వ్యాకులత, భయము, క్రోధము పొందకుము. నీధర్మనడతను నమ్మియుండుము. (శాండిల I. భ. గీ. 56.)

27. ఇంద్రియవిషయ భోగాశక్తివల్ల నేదైన పాపముకలుగుచుండుట సిద్ధము. గనుక దానిని ప్రయత్నముతో అణచవలయును. తర్వాత శాశ్వతసుఖము కలుగును. (మను II. 93.) కోపము బుద్ధిహీనులతాపము. బుద్ధిమంతులకు తగదు. విష్ణు. II. 18.

28. వివేకముతో చేసిన కార్యములన్నియు సఫలములగును. (విష్ణు I, XIII. 78.)

29. మృదువుగాను, మనోహరముగాను ఎప్పటికిని మాటలాడుము. తగని వివాదములను, కలహములను చేయకుము. వృథాలాపముల ప్రొద్దుపుచ్చకుము. (మను. IV. 139.)

30. తన్ను తాను చూచుకొనురీతి తాను ఇతరులను చూడవలెను. నీకు నీప్రాణము వలెనె అందరికి వారిప్రాణములు తీయగనుండునని తెలిసి వారినడతను నీనడతను పరిశోధించుకొని శ్రేష్ఠమైనదానిని చేయవలయును. అట్లు పరిచూచుటవల్ల సుఖదుఃఖములు కలుగజేయుటయందు తప్పులు జరుగవు.

31. మాంసమద్యాదులు మానుము. పద్మాసనములందు ఆహారనిద్రలయందు మితముగానుండుము. దీనివల్ల దుఃఖనివారణయగును. (భ. గీ. VI. 17.)

32. జూదమును వినోదార్థమైనను బుద్ధిమంతులు మానవలయును. (మను. IX. 227.)

33. తల్లికి మ్రొక్కుము. తండ్రికి మ్రొక్కుము. గురువునకు మ్రొక్కుము. పెద్దలకు మ్రొక్కుము.

34. నీసేవకులను, కురూపులను, విద్యావిహీనులను, వయోవృద్ధులను, సౌందర్యముగాని ధనముగాని లేనివారి హీనజాతివారిని, తృణీకరించకుము. (మను. IV. 14.)

35. సింహమువలె ధైర్యముగలవాడైనను పరిశ్రమములేకున్న భాగ్యవంతుడు కానేరడు. గనుక యుక్తధర్మములను చేయవలయును. కర్మచేయకుండుటకంటె కర్మచేయుటమేలు. కర్మలేక దేహయాత్రజరుగదు. ఫలాపేక్షలేని కర్మగా యుండవలయు. (భ. గీ. III. 8.)

36 శుద్ధవస్తువులలో ధనముసంపాదించుట యందలిశుద్ధత ముఖ్యమైనదని యందురు. గనుక ధనముసంపాదించు సాధనముమిక్కిలి శుద్ధిగానుండ వలయును. అనేకవిధ దుఃఖనివారణకై అనేకజనులు కాచియుండు అధికారులు దీనినెక్కువగ గమనించవలయు. ఈవిషయమున దుర్మార్గులను రాజువారిసొత్తును తీసికొని రాజ్యమునుండి తొలగద్రోసి శుద్ధిని కాపాడవలయును. (మను. VII. 124.)

37. సర్వముదేవుని యందున్నవనియు, దేవుడన్నిటియందున్నాడనియు తెలిసినవాడు ఏపాపమునుచేయ సమర్థుడు కాకయుండును. (ఈశ. 6.)

ధర్మమేజయము.

## మహాభక్తాగ్రేసర విజయము.

### 4. బ్లావట్స్కీ.

గతించినవారినిమిత్తమై, వారికి సద్గతి కలుగుటకును, చేయువారికి శ్రేయోభివృద్ధియగుటకును, సత్క్రియలను చేయుట మనలో వాడుకలున్నవి. ఆయాచారము ననుసరించి మన పెద్దలకు, ఆచార్యులకు అప్పుడప్పుడు క్రియలను సలుపుచునే యున్నాము. ఆరీతిననుసరించియే, మనదేశమునకును లోకమంతటికినిగూడ శిథిలమైపోవుచుండు ఆత్మజ్ఞానపథమును మరల వెల్లడిచేయుటకు ఆధారభూతురాలైన బ్లావట్స్కీయను నామెను మనముకృతజ్ఞతతో నేడుతలపకున్న గొప్పపాతకమును చేసిన వారగుదుము ఏలన కాలానుసారము దైవాజ్ఞననుసరించి లోకమున ధర్మముక్షీణించ, దానిని నుద్ధరించ ననేకమహానుభావులు కలుగవలసిన నియమప్రకారమే ఈకాలముననుండు ప్రత్యక్షవాదముల నణచి జనులకు నమ్మకము గౌరవము పుట్టునట్లుగా జేసి లోకము యుక్తానుసారముగ జరుగునటుల జనులను ధర్మమార్గమవలంబింప జేయనవతరించిన మహానుభావురాలు ఈమె. ముందుకలిగిన శ్రీశంకరాచార్యులవారు, శ్రీమధ్వాచార్యులవారు, శ్రీరామానుజాచార్యులవారు ఇంకననేకభక్తులు ఈదేశముననుండిన మన హిందూమతసంస్కారము గావించిరి. లోకములోని సకలమతముల సామరస్యమును బోధపరచి, సకలమతము లొక్కటియనియు, ఒండొరులు పోరాడి దేవునికై రక్తముస్రవింపజేయ నక్కరలేదనియు, నానువారు తమతమ మతానుసారము వృద్ధికి రావలెననియు సర్వసమ్మతముగా బోధించిన ధీరురాలు ఈమె.

ఈ మతసారముయొక్క బోధవల్ల లోకములోని నానాదేశములలోని నానావిధజనులు ఎట్లు అన్యోన్యహితమును గోరుచు మెలగుటకు కారణమైనదో మేరేచూచుచున్నారు. ఇట్టిమనోభావమునకు కారణభూతురాలుగా ఏర్పడిన ఈమెకు మనమెట్టి మర్యాదజేసిన యుక్తగానుండునో మాకుదెలియరాకున్నది. ప్రకృతము మనమామెను, ఆమెకృత్యమును భక్తితో స్మరించి, ఆమెచేసిన బోధనిం మిక గ్రహించినమేని ఆమెతృప్తిచెందుననియు ఆమెను సత్కరించినట్టగునని తలంచి, నేడిక్కడ మనమిప్పుడు చేరియున్నాము.

ఆమెచరిత మించుక వివరించెద. రష్యాదేశమున 1881-వ సంవత్సరమున మారికాయుపాధిప్రబలమై అనేకజనులను గొనిపోవుచుండ హాన్సుకుటుంబమునకూడ అనేకులు మరణమొంది దుఃఖఘోషజరుగుచుండ, హెలీనా ఫడఫ్ అనునామె చిన్నవయస్సునందె గర్భవతియై జూలై 30-వ తారీఖున నొక బలహీనమైన శిశువును కనెను. ఆశిశువెక్కడ ప్రాణము విడుచునోయని తత్తరపాటునొంది చావకమునుపే జాతకర్మముగించవలెనని పురోహితులను, బంధువులను, ఇష్టులను పిలుపించి పెద్దపిన్నలందరు గ్రీకుఆచారము ననుసరించి ప్రతిచేతిలోను హారతులిడుకొని జాతకర్మచేయు సమయమున నొకచిన్నబిడ్డ నిద్రమైకముతో నేలపఒరగ దానిచేతిలోని ఆరతియొక్క దీపశిఖ పురోహితుని వుడుపు అంటుకొని పురోహితుని దేహము చెడకాల్చెను. ఇట్టి ఉగ్రమైన సంభవముతో నీమెయొక్క జీవనము ప్రారంభమైనది. ఆమెయొక్క జననకాలగ్రహస్థితి ఏలాటిగ్రహబాధలుకలుగుటకు అవకాశమివ్వలేదు. బాల్యముననే తన్ను పెంచుదాసులనుండి తనశక్తులనుగ్రహించి తనయిష్టానుసారము వారుజరుగకున్న ఆపత్తులను దెత్తునని వారినిభయపరచుచుండెను. పుట్టినదిమొదలు ఆమెదివ్యదృష్టి కలిగియుండెను. ఘంటలకొలది భూతములతోను, జలదేవతలతోను, సిద్ధసాధ్యులని మనమనుకొను భూతములతోను ఆటలాడుచు సంతోషబడుచు తనపరిచారకులను భయపరచుచుండెను.

పడుచుతనముననే, చాలాగయ్యాళియై బహుమూర్ఖురాలై బహుకోపముకలిగి భూతపిశాచముల కొకరమై యున్నట్టు తెలియవచ్చుచున్నది. సూక్ష్మలోకజ్ఞానము సులభముగా కలుగుటకు సాధనభూతమైనశక్తిని, అజ్ఞానమును సంపాదించదృఢమైన పట్టుదలను ఆమెకలిగియుండెను. పుట్టినప్పుడు ఆమెదేహముచాలా బలహీనముగా నుండినను వయస్సురాగా రాగా వజ్రమయమై నట్టయినది. అట్టిదేహము సుమారు లోకమున 200 సంవత్సరములుగా లేనట్టు తెలియవచ్చుచున్నది. అందుకైగాదె ఇట్టి మహాకార్యమునకు నీమెనుఆదయోగసముగ్రులైన మహాత్ములు ఏర్పరచి తీసుకొన్నారు. సాధుకాని కొసాక్కు గుఱ్ఱములనుకూడ మగవానివలె సాహసముతో జంకక సవారి చేయుచుండెనట.

ఎవరో ఒకగనికురాలు "ఈముసలివాడుకూడ నీమెను పెండ్లియాడడని హాస్యముచేసినందుకై కోపముతో నామె ముసలివానినే పదియేడవయేట పెండ్లిచేసుకొనెనట. ఆమెయొక్క మనోగతి యెటువంటిదో మీరేయూహించుడు. మూడునెలల

తర్వాత ఓడనెక్కి కాన్స్టాంటినోపల్ పట్టణముచేరి అచ్చటతనకు పరిచయముగల యొకస్త్రీనిగని, ఆమెతోకూడ ఈజిప్టుదేశమునకువెళ్లి అక్కడ ఒక వృద్ధకాప్టునద్ద మంత్రవిద్య కొంతనేర్చెను. ఇట్లుదేశములు కొంతకాలముచుట్టి లండన్ పట్టణమున తనతండ్రివద్ద కొంతకాలము వాసముచేయుచుండెను. ఒకనాడు రాజవీధియందు పోవు చుండకొందరు హిందూరాజ బిడ్డలతోకూడ ఒక ఆజానుభాహువై, గంభీరుడైనవాడో కడు పోవుచుండుటచూచి తానుసూక్ష్మదృష్టియందు పలుమారుచూచుచున్న వాడితడే యనిగ్రహించి, తటాలున నాతనిని దగ్గరించి మాట్లాడించప్రయత్నము చేసెను. అప్పుడతడు తనదగ్గరకు రాకూడదని సైగచేయగా మంత్రపూరితమైనదానివల ఆమె కదల జాలక నిలబడెను. అతడు ముందువెళ్లి పోయెను.

తనకుసంభవించిన అసాధారణమైన ఈ యనుభవమును గురించి ఏకాంతముగా విచారింపగోరి హైడ్ పార్కు అనుతోటలో మరునాడు ఆలోచించుచు తలయెత్తి చూడ, ముందుదినముచూచిన యాతడేతనవద్దకు వచ్చినట్లు కనుగొనెను. తానుఒక గొప్పకార్యార్థమై లండన్ పట్టణమునకు కొందరు రాజులతో వచ్చియున్నాడనియు, తాను చేయదలంచుకొన్న కార్యనిర్వహణమునకై నేరుగా నామెతో మాట్లాడవలసి వచ్చినాననియు తెలిపి బ్రహ్మవిద్యాసమాజమెట్లు స్థాపింపబడవలశినది దానికి ఆమె కర్తగా వుండవలశినది తనకోరికయనియు దానికిరాబోవు కష్టసంకటములనుకొంత వివరించి ఆకార్యసాధనమునకై మూడు సంవత్సరములు టిబెట్ దేశమున నామె యుండవలశినదనియు అతడు ఆమెకు దెలిపెను.

అతనికార్యనిర్వహణమునకై యొప్పుకొని, తండ్రిఅనుమతినిపొంది, ప్రయాణమైవెళ్లి కొంతకాలము టిబెట్ దేశమున గడపి అంతే 17 సంవత్సరములు దేశాటనముచేసి అకస్మాత్తుగా 1858 సంవత్సరమున రష్యాదేశమున స్కాఫ్ అనుపట్టణమున జరుగుచుండిన పెండ్లిపందలియందు కనబడెను. అదిమొదలు 5 సంవత్సరములు తన కుటుంబములోనేయుండి, ఒకగొప్పవ్యాధిసంభవించి, అది నివారణకాగానే, అదివరకు తనకు స్వాతంత్ర్యము లేక జరుగుచుండు మహాత్మ్యములు అప్పుడు స్వాధీనమునకు వచ్చినవి. తర్వాత మరల టిబెట్టుదేశమునకువెళ్లి విద్యనుపూర్తి చేసుకొనెను. తర్వాత 1872 సంవత్సరమున తనదేశమునకు మరలివచ్చి, తనగురు ఆజ్ఞానుసారము ఆల్కాటును పరిచేయము చేసుకొనెను. అమెరికాదేశమునకువెళ్లి, అచ్చట భూతచేష్టలు జరుగు చుండిన ఎడ్డి ఇంటివద్ద వారిద్దరికి పరిచయము ప్రారంభమై గుడకు అనేకవిధముల

గౌరవముపొంది మహాఖ్యాతివహించి గొప్ప వకీలుగాయుండి సౌఖ్యపడుచుండిన ఆల్కాటు తనగొప్పలౌకిక అధికారమును త్యజించి, లోకమున జ్ఞానదీపము వెలిగింపనీ బ్రహ్మవిద్యాసమాజ మేర్పరుచుటకు సమకట్టెను. అలాగుననే 1875-వ సంవత్సరమున అమెరికాలో ఈసభ స్థాపింపబడి, 1879-వ సంవత్సరమున మనహిందూ దేశమున స్థాపింపబడినది. వారిద్దరు కలసి కొన్నిసంవత్సరములు పాటుపడ, ఆత్మజ్ఞానమునకు జన్మభూమియైన మనదేశమున దాని నైజస్వభావమునకు గుర్తెరిగిన వారము గనుక కాలము గడువగడువ విశేషముగా వ్యాపించుచున్నయది.

ఇట్టి మహానుభావుల నేకులు లోకమున జ్ఞానమును వ్యాపింపజేయ ప్రయత్నించిన లోకులు దానిని గ్రహించజాలక అట్టివారిని హింసించుటయో, నరుకుటయో, లేక ప్రాణముకూడతీయుటయో సహజమైయున్నట్లు అనేక దేశ చరిత్రలవల్ల మనకు తెలియ వచ్చుచున్నది గదా!

ఈమెవిషయమందు కూడా అనేకులు కృత్రిమవేషధారి యనియు, కొందరు బ్రహ్మజ్ఞాన సంపన్నురాలయ్యెను,విద్యావిహీనురాలనియు, కొందరు ఋషియనియు, కొందరు వెర్రిదనియు, కొందరు జగళగంటిగయ్యాళియనియు, కొందరు గొప్పమహాత్మురాలనికూడా వివిధములుగా వాదుకొనుచున్నారు. ఆమెను ఈబ్రహ్మవిద్యాసమాజమునకు మూలముగా ఏర్పరచిన మహానుభావులు మాత్రము తమలోనొకదని యెరిగియున్నారు. అట్లు మనమందరముకూడా ఆమెను తెలియవలెనని మిమ్ములనందరిని నిపుడు నేను ప్రార్థించుట విశేషమును ప్రమాదమును కాదు. ఆమెయొక్క నడతను కార్యములను ఆమె వ్రాసినఅమూల్యమైన పుస్తకములను తడవి చదివిచూచినను ఆమెమూలముగ నెట్టి జ్ఞానము లోకమునకువచ్చినదో తెలిసిన ప్రతివాడును ఆశ్చర్య పడకయుండజాలడు. తెలియనివారు హాస్యముజేసిన వారి అజ్ఞానము నిబిడమగునే గాని తెలిసిచేసిన గణ్యతకెక్కును. ఈ బ్రహ్మవిద్యాసమాజముయొక్క ప్రకాశమిప్పుడుగానరాదు. దీనివల్ల గదా మనమిప్పుడు మనమతమువంక ముఖముద్రిప్పి దాని గౌరవమును చూచుచున్నాము. దీనివల్లగదా మనము మనబిడ్డలు అన్యమతములకు విముఖులైయున్నాము. దీనివల్లగదా క్రిస్తుమిషనరీల వలలోకి చిక్కక స్వేచ్ఛగా విహరించుచున్నాము. దీనివల్ల గదా సమసిపోవుచుండు దేవభాషయైన సంస్కృత విద్యనునేర్వ మనమందఱమిపుడు ఉద్యుక్తులగుచున్నాము. దీనివల్లగదా మనము మనపూర్వసదాచారవృత్తిని ఎటులనైన మరల సంపాదించవలెనని ప్రయత్నపడు

చున్నాము. ఆకురాలుకాలములోని చెట్లరెమ్మలరీతిచూడ భయంకరమైన బ్రాహ్మణుల స్థితి ఈ బ్రహ్మవిద్యాసమాజమను వసంతఋతువు వచ్చిగదా చక్కపడుటకు యత్నములు చేయబడుచున్నవి. ఈసమాజమున చేరినవారందరినడత చక్కగ లేదను అపవాదమొకటి యున్నది.

ఇదియెంత శోచనీయమైనదో మీరే యోచించుడు. సమాజమున చేరినమాత్రమున సమాజములో బోధించు గుణములన్నియు ఒక అంగివలె వచ్చి వాని నైజగుణముల నెన్నటికైన మార్చునా? సమాజములో చేరిన వారు సత్ప్రవర్తనకు పూనుకొన్నాడని మాత్రము మనము సంతోషింపవలసినదే కాని అశ్వత్థప్రదక్షిణము చేయ కోరిన మాత్రమున గర్భవతియగుటయు, విత్తినతక్షణమున ఫలించుటయెట్లసంగతమో అట్లు దుష్ప్రవర్తనపూర్ణముగా వదలుననుకొనుట యసంగతముగదా! గనుక విచారపరులు ఇట్టి దురభిప్రాయముల చేత ఈసమాజమునకు విముఖులు కాకూడదని మా ప్రార్థన.

ఈసమాజముయొక్క ముఖ్యోద్దేశములను, దానిలోని ముఖ్యులు ప్రచురించు పుస్తకములను విశేషముగా తెలిసిన మనమందరమెంతో బాగుపడుదుమని దైవసంకల్పముచే కలిగిన ఈ సమాజమునిందుకయైన అశ్రద్ధచేయక పరామరిక జేసిన ముందు రావలసిన వృద్ధిలో మీకుకూడ పాలువచ్చునని ఖండితముగ తెలియవలసినది. ఈవృద్ధి యనునది సర్వజీవులకు రానుసిద్ధముయ్యే యున్నది. నేడు లేకున్న రేపుకలుగుట సిద్ధము. అయితే బాగుసేయక విచారించి ధర్మమార్గమున నడచిన దుఃఖానుభవము లేకనే ఆవృద్ధి ప్రాప్తమగును. గనుక ఈమార్గమున కొంత కొంత పరిశ్రమను చేయుటకు మిమ్ములను ప్రార్థించుచున్నాను.

దీనికి సాధన భూతమైన మీ మనస్సు మీయందున్నది గాని నాయందు లేదు. మనస్సెట్లు సంకల్పించునో దానికార్యమైన సకలవ్యవహారములు సిద్ధము ప్రతివాడును విత్తురీతి ఫలమనుభవించుట సహజముకదా? విత్తులవు సంకల్పములను ప్రతిక్షణము శుద్ధిచేయుచుండిన మహానుభావునికి ఎద్ది దుర్లభము, దుఃఖకరమైనదెట్లు సంభవించు గనుక మనమందరము మనమనోభావమును దిద్దుకొన్న సుఖపడుదుము.

ఉద్ధరేదాత్మనాత్మానం ఆత్మానమవసాదయేత్।
ఆత్మైవహ్యాత్మనోబంధు రాత్మైవరిపురాత్మనః॥

అని భగవానులు శెలవిచ్చినట్లు ప్రతివాడు తన్నుతాను ఉద్ధరించుకొనవలయును. తనకుతానే బంధువు. తనకు తానే శత్రువు. మరియొకడు మనలనుద్ధరించజాలడు.

గనుక ప్రపంవాడునుబుబుషులు, ఆచార్యులు మొదలగు మహానుభావులు కేవల అనుభవ పూర్వకముగ నిచ్చినజ్ఞానబోధన జాగ్రతతో, విసుగులేక ఏమరుపాటుపడక, తెలియక మాపించక క్షణక్షణము సన్మార్గప్రవర్తనయందు పాటుపడవలయునని మిమ్ములనుగూర్చి పలుమారు ప్రార్థించుచున్నాను.

## సాధనచతుష్టయసంపత్తి.

### ఎట్లుజ్ఞానికావచ్చును?

నరునకధ్యాత్మరహస్యముల బాహ్యకర్మలచే నిట్టుబోధించిరి. ఇట్టి తెలివియే గదా మనుజుని యావజ్జీవమును సమస్తకృత్యములకు నిదానంబు గావలయు. పంచ మహాయజ్ఞముల నాచరించిన వెనుక నరుఁడు పలుదెఱఁగుల పరోపకార మొనరింప నిత్యకృత్యములగు నైహికవ్యాపారములఁ జొరవలయు. దినారంభమున పంచయజ్ఞ ముల నాచరించి పావనత్వము వడసి వాఁడు లౌకికవ్యవహారములఁ జొచ్చు. పంచ యజ్ఞములందు శ్రద్ధ నానాటక్షీణింప దానితోడన లోకధర్మమును మపేక్షయు వృద్ధిఁ జెందె. ఈయజ్ఞములు నరునకు సార్వకాలమును ముఖ్యము లనుట కాదు. ఇట్టికర్మ లతోఁ బనిలేని స్థితియు నరుఁడొకప్పుడు గాంచు. అయినను నరుడు సర్వకాలమందును సర్వావస్థలందును పరహితమాచరించు నప్పుడుగదా ఇట్టిస్థితి వానికిఁగలుగును. అట్టి స్థితి సాధించువఱకు జీవనికాసార్థమై విధివిహితముగ ధర్మమాచరించుట యావశ్య కము. హిందూదేశస్థులక్కటా వీనినిపుడు దిగవిడిచినారు. వీరెల్లఁగర్మాతీతస్థితిగాం చిరె? ఐహికకర్మాచరణమువలన సంతతధర్మబోధతో నక్కఱలేని యంత పావనత్వ మును, నాత్మజ్ఞానమును, ఔన్నత్యమును జెందినవారె? లేదుసుమా, వారు నిరీశ్వరవాదు లై ప్రమాదమున మునింగి యున్నారు, మనువు నిరూపించిన ధర్మమునకు మిగుల దవ్వయి నారు. వారు దేవతల యజింప నొల్లరు. మనుజులదెస ధర్మమాచరింపరు. ఇఁక నరునకు లోకమున నిత్యమును గర్తవ్యంబగుదాని విచారింతము. ఎట్లైనను, నరుఁడొక కుటుంబమున గదా జన్మించు, ఇది వానికుటుంబధర్మమును నిర్ణయించు వాఁడొక జాతియందు గదా పుట్టును. ఇది వానిజాతిధర్మమును దెలుపు వాఁడొక దేశ మున గదా జన్మించు. ఇది వానిదేశధర్మమును నిర్ధారణచేయు ఒక్కొక్కనికిని వాని

జన్మస్థానము వానిధర్మమునకు మేరఁగల్పించు. మనుజుఁడు గర్మప్రేరితుఁడై తనప్రవృద్ధి
కనువగుచోట జన్మించు. కాన యొక్కొక్కఁడును స్వధర్మమాచరింపవలయు ననిరి.
ఉత్తమంబగు పరధర్మమాచరింపఁ బూనుటకంటె నీచమగు స్వధర్మమాచరించుటయే
మేలు. ఏధర్మము నీకు సహజమగునో యదియే నీ వభ్యసింప వలసినధర్మము. అదియ
నీ కుత్తమమగు ధర్మము. ఫలాపేక్షమాని స్వధర్మము నాచరింపుము. నీజన్మము దాన
సఫలమగును. దాన యోగమాచరింప దొరకొనుటయు లభించు. మొదట ఫల
కాంక్షతోఁ గర్మమాచరింతురు. నరుఁడు కర్మఫల మనుభవింపఁగోరి మొదట
గర్మమాచరించు గదా స్వర్గలోకసుఖంబులఁ బడయఁ గర్మమాచరింపుఁడని మొదట
విధించిరి. ఇదియే నరునకు ప్రథమ శిక్ష. కర్మలకెల్ల ఫలంబుల నిరూపించి
ముగ్ధమానవునిఁ గర్మమాచరింపఁజేసిరి. కర్మచే స్వర్గసుఖంబులఁ జెందవలయునని
చూపిరి. మతంబుబోధించు గర్మలచక్కఁగనాచరించుటచే స్వర్గసుఖములు వాని
చేతిలోని వగునని నుడివిరి. బాలునకు పారితోషికమిచ్చి పాఠమునువల్లింపఁజేయు
నటుల నరున కివ్విధమున ధర్మాచరణబుద్ధిఁ గలుగఁజేసిరి. కర్మముభయలోక ఫలంబు
లకు గాక యోగమున కుపకరింపవలయునేని విధియనుబుద్ధితోఁ గర్మమాచరింప
వలయు. నాల్గువర్ణములలో నొక్కొక్క వర్ణమునకును గర్తవ్య మెద్దియో
యోచింపుఁడు. జీవవికాసమును నడుపఁజాలిన యాచార్యులు పారంపర్యముగఁ గలు
గుటకై బ్రాహ్మణుఁ డధ్యాపకుఁడు గావలయు. వాఁడు జ్ఞానమును విక్రయింపరాదు.
లోకప్రాభవ మభిలషించి పరులకు విద్యనేర్పుటతగదు. స్వప్రయోజనార్థమై పరుల
కుపదేశింపరాదు. స్వధర్మముల నాచరింపఁగోరి పరులకు విద్యచెప్పవలయు. మఱియు
నితరులకొఱకై తానువిద్యావంతుఁడు గావలయు. ధర్మసాంకర్యములేని దేశముల
జ్ఞానముపదేశించి సన్మార్గమునకు నరుల మరల్పఁజాలిన యాచార్యులెల్లప్పుడు నుందురు.
వారు స్వార్థపరాయణులుగాక హితముఁ దెల్పుదురు. అట్టివారు తమకని యొద్దియుఁ
గోరరు. పరుల హితంబుకొఱకే సమస్తముఁ గూర్తురు. ఇవ్విధంబున స్వధర్మమాచ
రింతురు. దానఁ ముక్తియు లభించుఁ జీవునికి సంసారబంధమెడలు.

దేశమును సమస్తధర్మములను పరిపాలించు రాజసగుణులగు క్షత్రియుల ధర్మ
మెద్దియగు. క్షత్రియుఁడు ప్రజలపాలింపవలయు. ఏల? ప్రాభవముచేఁ దానింద్రియ
సుఖంబు లందకొదుసుమా, బలవంతులవలన దుర్బలులకు నేపీడయుఁ గలుగకుండఁ
నదలరక్షించుము లోకవ్యవహారముల సర్వసమంబుగ న్యాయంబునిలుపుచే లో.

మేలుట ధర్మము. ఈలోకమున జనులు ధనమార్జింప నెక్కుఁడొక్కరిని గడవ పాఱుచున్నారు క్రోధమును స్పర్ధయును నెగడినవి. మఱియు మనుజులు పరహితముఁగోరక యాత్మసుఖంబె వెదకుచున్నారు. ఇట్టి వారికి ధర్మమాచరింప నేర్ప వలయు. బలవంతుఁడు దుర్బలులఁబీడింపఁజొచ్చినచో రాజువాని దండించి బీదలఁ గాలరాచరాదని చూపవలయు. సర్వసమంబుగ నీతినడుపుటయే రాజధర్మము. అట్లగు నేని ధర్మములకెల్ల జన్మభూమిగ రాజును ప్రజలు భావింతురు. ఇదియే దేవసమానుఁడగు రాజునకు ధర్మము. దీనినుపదేశింప రాముఁడవతరించె. అటుపిమ్మట శ్రీకృష్ణుఁడును దీనికై యవతరించె. మందబుద్ధులగు నరులింతకును దానిఁ దెలిసికొననైరి. క్షత్రియుఁడు దనభుజబలంబు స్వసుఖంబునకును బరపీడనంబునకుపయోగించె. పరధనమును స్వప్రయోజనార్థమై దోచుకొనియె. తనసుఖముకొఱకు నితరులఁ బాటుపడఁజేసి వైరమున కొట్టుపట్టగు భూలోకంబున ధర్మస్వరూపుఁడగు రాజర్షి గావలయుననుమాటయె తాఁడు మఱచెను. రాజట్టివాఁడు గావలయునని గదా యార్యులు విధించిరి. కాన వాఁడు ప్రజలసుఖంబుకొఱకు భూమిని పాలింపవలయు గాని తనసుఖంబునకు గాదు. శూరుఁడగువాని ధర్మము ఇట్టిదియే. దేశమందలి సమస్తకార్యములను నిర్విఘ్నముగఁ జరగవలయును గదా. పేదసాదలభివృద్ధిఁగనుచు సుఖంబుగఁ దమభార్యాపుత్రులతో నే భయమునుబొందక జీవింపవలయుఁ గదా. వైశ్యుఁడు తనధర్మమును సుఖంబుగ నడపవలయు గదా. దేశమందలిసమస్త వ్యాపారములను నిరుపద్రవంబుగ సాగవలయు గదా. కాన క్షత్రియుండు దీనరక్షాదీక్షవహించి యుద్ధమాడి వారిసుఖంబుకొఱకుఁ దనప్రాణంబులనైన నిచ్చుటధర్మమనిరి. వాఁడు స్వహితమభిలషించి యుద్ధమాడఁ జనడు. నృపుఁడు భూములగాని రాష్ట్రములగాని శక్తినిగాసి కోరి యుద్ధమాడఁ జనడు. రాజు తనప్రాప్తఁగాంచిన వారు నిరుపద్రవంబుగ సుఖంబుండ పరులదాడివమ్మై సెడం ప్రజలకునినుపకోటగ నుండవలయు. క్షత్రియధర్మమునందయోగమాచరింపవలయు నేని వాఁడు జగన్నాటక సూత్రధారుని భృత్యునిగఁ దన్ను భావించుకొనవలయు. అట్లగుటం జేసియే గదా.

మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్॥

నాచేనింతకుమున్న హతులయియున్నారు. సవ్యసాచీ! నీవు నిమిత్తమాత్రముగ గమ్ము అని శ్రీకృష్ణభగవాను లుపదేశించిరి. మనుజుఁడొనర్చు నెక్కుడొక్కకార్యమున

కును బరమేశ్వరుఁడే కర్తయని యెఱింగినవో నిష్కాముఁడై ధర్మాచరణ బుద్ధితోఁ గర్మమాచరింపవగు. దానవది వానికి బంధనంబును గాదు. అనంతరము, వైశ్యధర్మము, వైశ్యుఁడు ధనముఁ గూర్పవలయు. స్వప్రయోజనార్థమై గూర్పరాదు. ప్రజలకందఱకు నుపకరింపధనము నార్జింపవలయు. ధనసహాయంబు వలయు పనులకెల్ల మున్గిటి వెన్నిధానమగుచు పలు దేశంగుల కార్యములఁ గొనసాగుటకైఁ వాఁడు ధనవంతుఁడు గావలయు. దేశంబులనెల్ల యెడల బీదలకు సత్రంబులును, పాంథులకు విడిదలులును, నరులకుఁ, బశువులకును వైద్యశాలలును నీర్వరు భజింప దేవాలయంబులును నిర్మించుటకు వైశ్యుని ధనమూతఁగొమ్మ కావలయు. దేశప్రజ సంపూర్ణసుఖంబుఁ గనుటకై వలయు నీకార్యములనెల్లఁ బోషింపనధమెచ్చుటఁ గనిన సుండవలయునని గదా వైశ్యుడు ధనము గూర్పవలయుననిరి. స్వార్థపరుఁడు గాక లోకహితార్థమై ధనమార్జించుట వైశ్యునికి ధర్మము. ఇవ్విధంబున వాఁడును యోగమాచరింపనగు. కర్మయోగాభ్యాసము కైవల్యమునకు సంచుకరసుగు. శూద్రధర్మము నిట్టిదియె. దేశమునందు వాఁడు వాని ధర్మమును నడుపవలయు. దేశమునందు కొఱవడిన పదార్థములఁ దెచ్చుచు బహిర్వ్యాపారంబులు నడుపుచు దేశమునకు హస్తంబులం బోలివర్తించుట వానికి ధర్మము. వాడు స్వధర్మము నాచరంపఁ దలచిన యేని తన పనులవలనఁ గల్గు లాభముల లెక్కింపక పని చేయుటయె ప్రయోజనంబుగఁ దనధర్మమును సంతసముతో నడపవలయు. మొదట మనుజులు తమ మేలు గోరియే కర్మమాచరింతురు. దాన నను భవ జ్ఞానమలవడు. పిమ్మట విధి యనికర్మ మాచరింతురు. అప్పుడు నిత్యకృత్యముల చే యోగాచరణమునకు మొదలిడుదురు. తుదకుఁ గర్మపరిపూర్తికై తమ సర్వశక్తియు ధారపోయుచు ఫలకాంక్షమాని యజ్ఞాచరణ బుద్ధితో నానందభరితులై కర్మమాచరింతురు. ఇవ్విధంబున నైక్యభావంబు సిద్ధించు.

ఇట్లు నరుఁడు తొలుతొలుత స్వప్రయోజనార్థమై కర్మమాచరించి పిమ్మట కర్మాచరణమే ప్రయోజనంబుగఁ గర్మము నడుపుచుఁ దుదకు సర్వస్వమును యజ్ఞమని యొసంగుట మన మెఱుఁగవలయు. అప్పుడుగదా నిర్మలత యిట్టిదని మనకుఁ దెలియు. ఇట్టిదియే నిర్మలతకును మార్గము. మనుజుని సమస్త కర్మలును నారు రుత్తమమహోన్నతిఁ గనుటకై చేయుఁ బ్రయత్నము లగునటుల నిర్మలత్వమెట్లు సాధింపనగు? నరుని దేహంబును మనంబును పరిశుద్ధమై గనవలయు. దేహపరిశుద్ధత్వము గుఱించి విపులముగ వక్కాణింప నావకాశంబులేదు.

భగవద్గీత యందలి శ్రీకృష్ణభగవానుల యుపదేశమియ్యది మీకు స్మరణీయంబు. పరిశుద్ధత్వము నియత వ్యవహారముల సాధింపవలయుంగాని శరీరమును శరీరస్థుండగు నీశ్వరుని కృశింపఁజేయు ఘోరశారీర తపంబునఁగాదు. సావధానంబుగఁ బ్రాకృత నిజస్వభావమును గురించి ఇంద్రియంబులఁ గ్రమంబుగ నిగ్రహించుచు సాత్త్వికాహారుండై శారీరకర్మల నియతముగ జతనంబున నడుపుచు యోగమాచరింపవలయు. ఇత్తెఱంగున శరీరంబులెల్లఁ దనవశంబగునంతకుఁ గ్రమక్రమంబుగ నియతాహారంబుల నియతకర్మల వానిశిక్షింపనగు అట్టగుటంజేసి యేగదా గృహస్థాశ్రమము మేలనిరి. సుస్సాధ్యంబగు బ్రహ్మచర్యంబే నడపఁజాలిన వారెవ్వరో గదా? సామాన్యుల కది దుర్లభంబు గృహస్థాశ్రమంబున కామనిగ్రహంబు తత్పరిత్యాగముచే గాక మితవ్యవహారమున సాధించుటనరునకు ధర్మము. సామాన్యులకు కామపరాఙ్ముఖత్వము లవికాదు. అవివేకమున నిట్టిది సాధింపప్రయత్నించిరేని వ్రతభంగ మగుటయే గాక. యింతంతయన రాని విషయాసక్తి మునుంగుదురు కామమొక్క పెట్టిన భేదింపఁ జూడరాదు. నియత వ్యవహారంబుల గ్రమంబుగ శిక్షించుటవలనను గృహస్థధర్మంబగు నాత్మసుఖ పరిత్యాగంబునను కామమును నిగ్రహింపవలయు. విషయాసక్తి యతిచాంచల్యస్వభావంబు మాని మితంబుగ సాగుచు బుద్ధికి వశంబై ఈశ్వరాజ్ఞానువర్తియగునటుల గ్రమంబుగ శిక్షింపగృహస్థాశ్రమంబే తగినదిసుమ్ము. ఇప్పుడుగదా కర్మయోగ మాచరించుట కలుగు. గృహస్థుండు క్రమక్రమంబుగ నింద్రియమ్ముల నిగ్రహించి పరలోకసుఖంబు నకై విషయేచ్ఛదిగనాడుచు బుద్ధికి సంపూర్ణముగ వశంబగునటుల దానిగ్రమంబుగ శిక్షింపవలయు. ఇవ్విధంబున పరిశుద్ధత గాంచినవాఁడు యోగాధికారియగు.

మఱియు నపవిత్రపాపకృతమనోవృత్తులెల్ల నిర్మలత్వముగాంచ వలయు. ఇట్టి మార్పులఁ దెలుప మనోవృత్తుల మాట నుదహరించెద. దాని మీరనుష్ఠింతురు గాక క్రోధము:—దీనిస్వభావము మాఱునటుల కర్మయోగము నెట్లు నడపవలయునో యోచింపుడు. క్రోధము జీవవికాసమునకై బహిర్గతంబగు శక్తి. ఈశక్తి యశిక్షితుండగు మూఢునియందుఁ గ్రోధమై బహుముఖంబుల గ్రూరత్వముగఁ బరిణమించుచున్నది. మఱియువాఁడు దనయిష్టపరిపూర్తికి నడ్డముజొచ్చినదాని నెవ్విధముననైన యుక్తాయుక్తి విచారములేక పడగొట్టనేతలంచు. ఇట్టిదశయందది యశిక్షితంబును నాశహేతువునగు శక్తియగు. దీనినిరోధించుట కర్మయోగమాచరింప దలపెట్టువానికి నవశ్యముగదా. క్రోధము నిరోధించి శిక్షింపనెట్లులగు. మొదటనభిమానము విడువవలయు. తనకొగ్గుఁ

జేసినచో మాఱుచేయదలంప రాదు మీకెల్లరకు నిదియె కర్తవ్యంబు. ఎవ్వఁడైన నొక్కఁడు లకెగ్గుచేసినచో నీవేమిచేయుదువు? కోపమున మైమఱచి యెదిరి దన్నుదువేమో గదా. ఒకఁడు నిన్ను బొంకింప నీవు మాఱున కెగ్గుజేసివాని మీఱఁజూతువేమో గదా. మఱియొకఁడు నీకపకార మొనరింపుడు వానికి ప్రత్యపకారము నీవుచేయనెంచెదవు గదా. ఇవ్విధంబున క్రోధము ద్రేకింప మానవకోటియందెల్లెడల నాశనమే కొన్పించుచున్నది దీనికెట్లు నిర్మలత్వమ్ముకల్గు? లోకవ్యవహారంబులెల్ల నాత్మహితంబున కగునటులఁ గర్మయోగముపదేశించిన యాచార్యశ్రేష్ఠుల యుపదేశవాక్యముల వినుఁడు. మనువుచెప్పిన పదిధర్మములందు క్షమయొక్కటి గదా. పగచే నెచ్చటనైన పగయడంగునే, స్నేహమున నడంగుగాక యని బుద్ధుఁడుపదేశించె. ఇవ్విధంబున క్రైస్తవాచార్యులు నవినయంబున గాక వినయంబున నవినయంబును జయింపుమనిరి. ఇదియె కర్మయోగము. ఎగ్గుల సైరింపుము. అపకారికి నుపకార మొనరింపుము. అవినయంబును వినయంబున జయింపుము ఇట్టగునేని తానను మాట విడుచు. అప్పుడెగ్గు నాకయ్యెఁగాయని కోపింపవు. మమకార మవలద్రోయుటం జేసి క్రోధము గొంత నిర్మలతఁ గాంచు. అయినప్పుడును క్రోధ మొకవిధంబున వాసిగనుండవచ్చుగదా. దుర్బలులు పీడింపబడుటఁ గాంచి నీకు కోపము వచ్చు. పసరము నొక్కఁడు గొట్టుచుండఁజూచి కోపింతువు. బీదల బాధింపఁ గనుగొని బాధకుని కోపింతువు. తనకని కోపపడుటకంటె నితరులకని కోపమూనుట మేలుగదా. ఇట్టిదశయు జీవవికాసమునకు ముఖ్యము. పరులతో సమసుఖదుఃఖతఁ గాంచక మనసు ఱాయిచేసుకొని మొగమవలద్రిప్పుకొనుచు సాగిపోవుటకంటె పరులబాధించువాని యెడ క్రోధముజూపుటయే మిగుల మేలుగదా పరులకై క్రోధమూనుట యుపేక్షకంటె మేలుగాని యది పరమశ్రేష్ఠమైనది కాదు. ఇట్టికోపమును మాఱవలయు. బలయుతులకు దుర్బలులకు నొక్కవిధంబున దయఁజూపు గుణంబుగ దీని మార్పవలయు. బాధితునికొఱకును, బాధకుని కొఱకును సమత్వముగ బరితాపమందవలయు. బాధితునికంటె బాధించువాఁడధికముగఁ జెడునని యెఱింగి వీనికై వగచుచు వారిద్దర నొక్కటఁ గరుణతో నాదరింపవలయు. కోపమివ్విధంబుగ నిర్మలినదశఁ గాంచుఁడు నరుఁడు స్వధర్మమని కీడు మాన్చుటయేగాక దుర్మార్గుని సత్పథంబునకుఁ ద్రిప్పవలయుఁగదా యని వానియెడ దయతో వర్తించు. మొదల దనకెగ్గయ్యెనని ఘూర్ణిల్లు కోపగుణంబు బలవంతుఁడు దుర్బలుఁడనక యందఱ సమంబుగ రక్షించుచు దుర్నయంబెల్ల మాన్పుధర్మముగఁ బరిణమించుచున్నది

ఇదియే కర్మముచేనగు నిర్మలత్వము ఇదియే యైక్యభావంబు గనుటకై మనోవృత్తుల. మార్చు తెఱంగు.

రెండవది. ప్రీతి (అనురక్తి.) ఇయ్యది కేవలము నీచమును, పశుసామాన్యము నగు స్త్రీపురుష పరస్పరానురక్తిగ గన్పడు. అప్పుడిది గుణములుఁగాని విద్యావినయ సంపదలఁగాని గణింపదు. అవయవసౌందర్యమును, మనోహరత్వమును, విషయసుఖంబును మాత్రమే పరిగణించు. ఇది యతినీచమగు ప్రీతి. స్వసుఖంబు తప్ప వేఱొండు కోరదు. ఎవ్వఁడు గృహస్థధర్మమున తనయాలు బిడ్డలఁ గాపాడుచు స్వసుఖంబు మాని కుటుంబరక్షణార్థమై దేహధనంబులను, వృత్తులను ధారపోయునో యట్టివాఁడు కర్మయోగాభ్యాసముచే నిట్టినీచమగు ప్రీతిని పరిశుద్ధముగావించు. అట్టివాఁడు దనవారి సుఖంబుగోరుగాని తనసుఖంబొల్లఁడు. వాఁడు తనవారి రక్షింపనాపదలఁ దాఁజెందు. నరుఁడిట్టి కర్మయోగమాచరింపుచు స్వార్థపరాయణంబుమానును. మొదట మిథున సుఖంబె యభిలషించు. నీయనురాగము క్రమంబుగ భార్యాపుత్రులు, సోదరులు, బంధుగులు లోనగువారి దెస ప్రీతిగ పరిణమించుచున్నది. అప్పుడు నరుఁడు స్వధర్మమాచరింపుచు తనవారి సుఖంబునకై పాటుపడు. స్వార్థపరత్వంబుమానుడు లోకమునందలి యందఱిదెస యనురాగముఁ జూపనగు. ఇదియే పరమోత్కృష్టదశ. ఇట్టియనురాగముఁ గలఁవాఁడు తనకుటుంబమువారికేగాక లోకమునకెల్ల సహాయముజేయ దలంచు. అట్టిపుణ్యపురుషుఁడొకటిఁ గొన్నవారెల్ల దనకుసోదరులు గను దిక్కుమాలినయబలలెల్లరుఁ దనకుఁ దోఁబుట్టువులు గను దలంచి, వారికన్నమిడి రక్షించు. ఆనిర్మలాత్ముఁడనదలకు దండ్రియు సోదరుండగు సహాయుఁడునగు. అట్టువాత్సల్యము జూపుట సర్వభూతసమంబగు ప్రీతిచేగాని మోమోటమునఁ గాదు. పరులు తనదెస నట్టి ప్రీతితో నడవవలయునని యుఁ గాదు. అనురాగము వానికి సహజము గదా. కర్మయోగాభ్యాసముచేఁ గలుగు ననురక్తిప్రత్యుపకార మభిలషింపదు. పరులయందు కృతజ్ఞతఁగోరదు. లోకప్రశంస నొల్లదు. గుప్తముగ మేలొనర్చు. ఇంతయేల. యట్టివాఁడు పరులెరుగకుండ కీర్తియుఁ గోరక యితరులకు మేలొనర్చుటయే వానిగఁ దలంచు. నిర్హేతుక జాయమానమగు నీవ్యాజకరుణం బోలుటయే ప్రీతికిఁ బరమపరిశుద్ధత్వము. అప్పుడు గదా లోకమునకెల్ల సుఖదాయకుఁడగుట మనుజునకు సహజగుణమగు. అప్పుడు గదా నరుఁడు ప్రత్యుపకృతిగోరక ఇతరుల సంతసమునె కూర్చు.

మూఁడవది. లోభము. స్వసుఖంబును, ప్రాభవంబును, బెద్దఱికంబును గోరి నరుఁడు ధనమార్జించు. అటుపిమ్మట తనకుటుంబమువారు కూటిబీదలై కష్టముల పాలు గాక వానిగని గౌరవమందవలయునని ధనమపేక్షించేది మనుజునియందు లోభగుణంబు గొంతపరిశుద్ధత గాంచు. ఇవ్విధంబుగ స్వార్థపరత్వంబు కొంతమాను. ఇంతియకాదు. స్వకుటుంబమువారికే గాక పరులకును మేలొనరింపఁదలంచి ప్రాభవము మనుజుఁడు గోరును. ఇత్తెఱంగున ప్రీతింబోలె ధనాపేక్షయును తుదకు మాఱు గోఱక పరులకొసంగునది యగు. అట్టివాఁడు జ్ఞానమును ప్రాభవమును బరులకిచ్చి లోకమెల్ల గాపాడవలయునని గోరుగాని యెవ్వారికిఁ జేచాపక తానొక్కఁడే యనుభవింపవలయునని వానిఁ గోరఁడు. ఇట్లు కృపణత్వంబు దగ్ధమగు. మహాదేవ శబ్దవాచ్యుఁడగు నీశ్వరునకు శ్మశానంబు వాసస్థలంబగుట వింతగదా. సర్వేశ్వరున కిట్టి నివాసస్థానమేల యని జనులెఱుఁగరు గదా. శుద్ధస్వరూపునకిట్టి హేయ స్థలంబు కూడునే? శ్మశానంబన మనుష్యుని ప్రాకృతస్వభావంబు సుమ్ము. పరమశివుని కునికిపట్టగు నీశ్మశానంబున నరుని తుచ్ఛస్వభావంబు లెల్ల మంటఁగలియు. వాఁడచ్చో నివసింపఁడేని యైహికవిషయంబులెల్లఁ గ్రుళ్లికంపెత్తి భయదంబులగుచు నెల్లెడలనాధి వ్యాధులన శుద్ధత వెదజల్లెడు గదా. మనుష్యశ్మశానంబు పరమేశ్వరున కావాసంబై జ్ఞానాగ్ని నలుదెసల వ్యాపించినచో స్వార్థపరత్వము లోనగు నైహికేచ్ఛలెల్ల దగ్ధంబు లగు అట్టివాని కామంబులెల్ల యోగాగ్నిచే దగ్ధంబులగుటవలన దుర్మార్గ మలినవృత్తులు మాను అపుడు మమతవాసి షడ్వర్గజయంబుఁగొని యోగిజ్ఞానాగ్నివలన నుద్భవిల్లు. దానంజేసియే గదా శివునకు హరుఁడను నామంబు చెల్లె. హరుఁడన, జ్ఞానోత్పాదనంబునకై ప్రాకృతస్వభావంబును నశింపజేయు వాఁడని యర్థము. జీవుఁడు వాని యోగాగ్ని సంభవుడు గాదా. ఈశ్మశానంబునుండి యాత్మ నిర్మలత్వముగాంచి మీదికెగయు. ఇట్టిలీ యనుష్ఠాన మభివృద్ధినొసగు. ఇది యారురుక్షుస్థితికిఁ గొంపోవు. ఇది సద్గురుసాన్నిధ్యంబు జేర్చు. ఇయ్యది త్రిభువనగురు నివాసస్థానమగు. గర్భగృహంబుఁ జొరమార్గంబుఁ జూపు. ఇదియే మీకనుష్ఠేయము. మీరు నడవవలసిన మార్గమియ్యదియే. మీరు ప్రపంచమున సమస్తలౌకిక కార్యములఁ జరుపుచు నైహికవిషయంబులఁ దగులుంబడి యున్నారు. అయినను నిత్యానిత్యవస్తు వివేకముతో యోగమాచరింపఁ దలంచని వారెవ్వరుగలరు. మీరెల్లరిప్పటికంటె మేలుదశగాంచ నువ్విళ్లూరుచున్నారు గదా. ప్రపంచవిషయంబులఁ బ్రాకృత మనోవృత్తులచే నభిలషించునట్టు గన్ప

డినను స్వదేశంబును, స్వమతంబును, దిగఁద్రావి పరమతావలంబన మొనర్చిన వారటుండ తక్కిన స్వాభిమానులగు హిందువులు ప్రపంచసుఖంబులనె గాక పరలోకసుఖంబు నిప్పుడును గోరుచున్నారు. ఇదియ మీరునడవవలశినమార్గము. జనులు మహాత్ములు గారేని దేశమునకు గౌరవమెటుల గలుగు. ప్రజలు నీచులును కుక్షింభరులును స్వార్థపరులు నగుదురేని శక్తిమంతు లెట్లులగుదురు. ఈజన్మమునం దిప్పుడే మీరు యోగమునకుఁ బ్రారంభింపవలయు. సూక్ష్మముగ దెలుపఁబడిన ఈధర్మ మనుష్ఠించి యోగమార్గమున నడవ మొదలిడవలయు. చెప్పవలసిన విషయంబు లింకయుఁ బెక్కులు గలవు గాని యోగమార్గప్రవర్తనకు ఫలంబియ్యదియని ఇపుడు నిరూపించెద. యోగమార్గప్రవర్తనమున కుద్దేశ్యమైక్యభావంబు గనుటయే. మనమిపుడు విచారించిన కర్మయోగమునకు ఫలంబు కర్మచే నైక్యభావంబుఁ గనుటయె. ఐక్యభావంబుగనుట కింతయే చాలదు. ఐక్యభావంబన నేమి?

గుణాతీతుఁడై మోక్షామృత మనుభవించి బ్రహ్మంబునెఱింగి బ్రహ్మముతో నైక్యభావంబుఁ గనఁదగిన పుణ్యపురుషుని లక్షణంబు లివియని శ్రీకృష్ణభగవానులు వక్కాణించిరిగదా. అవిమీకు స్మరణీయంబులు. అట్టిజీవన్ముక్తుఁడు గుణంబులే కర్తలని తలంచు. వాఁడు సర్వాతీతమగు దాని నెఱుంగు. గుణంబులు చలింపవాఁడు సాక్షియై యుండు. గుణంబులు లేమికి వగవఁడు. గుణంబు లగవడినచో వానిఁ నవలఁద్రోయఁడు. వాఁడు శత్రులయెడ మిత్రులయెడ సమత్వంబువహించు. భూషించిన దూషించిన వాని కొక్కటయ. వాఁడు ధీరుఁడు. సర్వసముఁడు. సమలోష్టహేముఁడు. తనపారని పరులని యెంచఁడు. జీవన్ముక్తుఁడు. గుణచలనముచే మోసపోక గుణాతీతుఁడగుటంజేసి సర్వసముఁడగు. మనము కోరు పదవి యదిసుమ్ము. ఆపదవిఁ జేర్చుమార్గమున ప్రథమప్రయత్న మిదియసుమ్ము. దీని నేర్చినగాని మనమవల నడవఁజాలము. వీని గ్రమక్రమంబున ననుష్ఠించితిమేని మోక్షమార్గ మగపడు.

## శ్రీకృష్ణుల వాక్యము.

వీడు త్రిగుణాతీతుడని చెప్పబడును. అవ్యభిచారభక్తి యోగముచేత నన్ను సేవించువాడు త్రిగుణాతీతుడై బ్రహ్మానుభవము బొందుట కర్హుడగును. నేను బ్రహ్మ నివాసము. అవ్యయమైన మోక్షామృతకలశము. శాశ్వితమైన ధర్మాలయము కేవల ఆనందదాయకము.

ఇట్లు శ్రీదివ్య భగవద్గీతయందు గుణత్రయవిభాగ యోగమను పదునాల్గవ యధ్యాయమునకు మంగళము.

## పదియైదవ యధ్యాయము - పురుషోత్తమప్రాప్తియోగము.

## శ్రీకృష్ణులవాక్యము.

పైన వేరులుగలిగి, క్రిందశాఖలుగల సంసారమనెడు అశ్వత్థమవ్యయ మన బడును. దాని యాకులు వేదములు. దానిని తెలిసినవాడు వేదవిదుడు. గుణములచేత బోషింపబడి క్రిందు మీదగా దాని శాఖలు వ్యాపించియున్నవి. గుణములచే వృద్ధి పొందుచున్నవి. ఇంద్రియ విషయములు వానిచిగుళ్లు. భూలోకమున కర్మబంధము లను వేళ్లు విస్తరించియున్నవి. ఇచ్చట దానిరూపముగాని, అద్యంతముగాని, స్థితిగాని తెలియ సాధ్యముగాదు. ఈదృఢమైన వేర్లుగల అశ్వత్థమును, బలీయమైన విరక్తి యను నాయుధముచేత దెగగొట్టి పునరావృత్తిలేని మార్గమును సాధింపవలయును. అనాదియై, మొదట ప్రవృత్తిగలిగించిన యాదిపురుషునినే శరణుపొందవలయును. మానమోహములు వదలి, సంగదోషములను జయించి, అధ్యాత్మజ్ఞాన విద్యాసక్తులై, కామముల నణచి, సుఖదుఃఖ సంజ్ఞగల ద్వంద్వములనుండి విముక్తులైన వారు నాశరహిత మైన పదమును పొందుదురు. ఆపదమును సూర్యచంద్రాగ్నులు వెలుగించ జాలరు. అచ్చటికి వెళ్లినవారు మరలరారు. అది నాపరమపదము. నాయంశమే జీవలోకమున సనాతన జీవస్వరూపమై ప్రకృతి సంబంధమైన మనస్సుతో కూడిన యింద్రియముల నాకర్షించును. జీవుడు దేహమును ప్రవేశించునప్పుడు దానిని విడుచునప్పుడు వాయువు సౌరభమునుగొని పోవుభంగి ఇంద్రియములను గ్రహించి తీసికొని వెళ్లును. వాడు, త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణములను, మనస్సును తమతమ వ్యాపార

మనకు అనుగుణముగా జేసుకొని యింద్రియ విషయముల ననుభవించును. వాడు విడిచి పోవునప్పుడు, అనుభవించునప్పుడు, గుణయుక్తుడుగా నుండునప్పుడు మూఢులు వానిని తెలియరు. జ్ఞానదృష్టిగలవారు తెలియుదురు. ప్రయత్నముచేయు యోగు లాత్మ స్వరూపుడైన వానిని గనుగొందురు. ఆత్మనిగ్రహము లేని యవివేకులు ప్రయత్న పడియు దానిని కనుగొనరు. సమస్త జగత్తును ప్రకాశింపజేయు సూర్యచంద్రాగ్నుల నుండి వెలువడు దేజస్సు నానుండి గలిగిన దేజస్సని దెలియుము. నేను భూమిని బ్రవేశించి నాచేతన శక్తిచేత బ్రాణులను ధరించుచున్నాను. రసస్వరూపుడైన చంద్రుడనై సర్వౌషధులను బోషించెదను. ప్రాణులశరీరముల నాశ్రయించి జఠరాగ్ని నై ప్రాణాపానవాయువులతో గూడుకొని నాల్గు విధములైన యన్నమును జీర్ణింప జేయుదును. సమస్తుల హృదయములందు నేనున్నాను. నావల్ల స్మృతియు, జ్ఞానమును, వానిరాహిత్యమును గలుగును. వేదములలో దెలియవలశినది నేనైయున్నాను. నేనే వేదవిదుడు. వేదాంతకర్త. ఈలోకమున క్షరుడని, యక్షరుడని యిరువురు పురుషులు గలరు. క్షరుడు సర్వప్రాణులే స్వరూపముగా గలవాడు. అక్షరుడు కూటస్థుడందురు. వీరిరువురికంటె నుత్తముడు పరమాత్మయనబడును. సమస్తమును వ్యాపించి, త్రిలోకమును భరింపుచు నాశరహితుడైన ఈశ్వరుడే యతడు. నేను క్షరుని కంటె, యుత్తముడై యక్షరునికంటె నుత్కృష్టుడను గనుక లోకములయందు, వేదములయందును పురుషోత్తముడని ప్రసిద్ధి బొందియున్నాను. మోహవర్జితుడై నన్నిట్లు పురుషోత్తమునిగా దెలియువాడు అర్జునా! సర్వభావముల సర్వజ్ఞుడై నన్ను పూజించుచున్నాడు. అనఘా, ఈపరమ రహస్యశాస్త్రమును నీకు చెప్పితిని. దీనిని తెలిసిన వివేకులు, అర్జునా! బుద్ధిమంతులై, చేయదగిన కర్మలను జేసినవారగుదురు.

ఇట్లు శ్రీదివ్య భగవద్గీతయందు పురుషోత్తమ సందర్శన యోగమను పదియైదవ యధ్యాయమునకు మంగళం.

## పదియారవయధ్యాయము - దైవాసుర సంపద్విభాగ యోగము.

### శ్రీకృష్ణులవాక్యము.

నిర్భయము, చిత్తశుద్ధి, జ్ఞానయోగమున దృఢము, దానము, దమము, యజ్ఞము స్వాధ్యాయము, తపస్సు, ఆర్జవము, అహింస, సత్యము, అక్రోధము, త్యాగము, శాంతి

పరుల దోషములను జెప్పమానుట, ప్రాణులయందు దయ ఇంద్రియ లోల్యలత్వరహితము, మార్దవము, సిగ్గు, అచపలము, దార్ఢ్యము క్షమ, ధృతి, శౌచము, అద్రోహత్వము, నిగర్వము, అర్జునా! యివి దైవాంశమున బుట్టినవానికి గలుగును. దంభము, దర్పము, అభిమానము, క్రోధము కఠినోక్తి, అజ్ఞానము, యివి అసురాంశయందు బుట్టినవానికి గలుగును. దైవసంపత్తు మోక్షప్రాప్తికై యగును. దైవసంపద్యుక్తుడై నీవు జన్మించినవాడవు గనుక అర్జునా! దుఃఖింప పనిలేదు. లోకమున దైవ, అసుర మని ప్రాణిసృష్టి యిరుతెరగులున్నవి. దేవాంశ గుణములు విస్తరింపబడినవి. అర్జునా, యింక అసురాంశ గుణములను జెప్పెదను. అసురాంశ సంభూతులు ప్రవృత్తినిగాని! నివృత్తినిగాని నెరుగనరు. శౌచముగాని, యాచారము గూడగాని, సత్యముగాని వారియం దుండదు. జగత్తు సత్యస్వరూపముగాదని, ధర్మనియమములేక నియామకుడగు ఈశ్వరుడు లేక, కామమోహితులై స్త్రీపురుష సంయోగమువల్ల గలిగినదిగాని యితరమున గలుగలేదని వారు జెప్పుదురు. ఇట్లభిప్రాయ పడి, యల్పబుద్ధిగలిగి క్రూరకర్ములుజేయు నష్టాత్ములు లోకనాశముకొరకు శత్రువులై ప్రవర్తించెదరు. అపరమితమైన కోరికల నాశ్రయించి ధంభమాన మదాన్వితులై మోహముచేత దురాలోచనలను జేయుచు అపరిశుద్ధములైన వ్రతముల బ్రవర్తించుదురు. మరణాంతము వరకు నపరిమితమైన చింతాసక్తులై కామభోగానుభవమే పరమార్థమని యెంచి, యీదృశ్యమే సర్వమని నిశ్చయభావనచేసుకొని కామక్రోధపరాయణులై, యాశాపాశశతములచేత బద్ధులై కామభోగార్థమై యన్యాయ మార్గములచేత ధనరాసులనుజేర్చ యత్నించుదురు. " ఇది నేడు నాకు లభించినది. ఈమనోరథము ప్రాప్తించినిది. ఇంతధనము నాకు గలిగినది. ఇంత ముందు నాకురాబోవును. ఈశత్రువును జయించితిని. యితరులను జయించెదను. నేను నియామకుడను. నేనుభోగిని. సిద్ధుడు. బలవంతుడు. సుఖిని. నేను ధనవంతుడు. సత్కులవంతుడు. నాతో సరితూగువారితగు లెవరున్నారు. యజ్ఞము జేయుదును. దాన మిత్తును. సంతోషింతును. ఇట్లజ్ఞానులు యివివేకులై యనుకొనెదరు. అనేకవిధ చిత్తవిభ్రాంతులై మోహజాలసమావృతులై, కామభోగాసక్తులై అపరిశుద్ధమైన, నరకమున బడుదురు. ఆత్మసంభావితులై స్తబ్ధులై, ధనమాన మదాన్వితులై డంభమునకు శాస్త్రసమ్మతములుగాని యజ్ఞములను జేయుదురు. అంహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము, గలవారై కుత్సితులు, తమయొక్క, యితరులయొక్క దేహములనుండు నన్ను దూషించుదురు. ఈదూషకులు,

క్రూరులు, దయారహితులు, లోకమున నుండు నరాధములు. వీరిని అసురయోనుల
లోబడవైతును. అసురయోనులలోబడి, జన్మ జన్మమునకును మూఢులై నన్ను గానక,
కౌంతేయా! అధోగతిని జెందదురు. కామము, క్రోధము, లోభము యివి నరక
ప్రాప్తికి హేతువులైన మూడుమార్గములు. ఆత్మనాశము గలుగజేయునవి గనుక
యీమూటిని విడిచి తీరవలయును. తమోద్వారములైన యీమూటిని విడిచిన వాడు
కౌంతేయా! ఆత్మశ్రేయస్సును బొంది పరమగతిని జేరును. శాస్త్రవిధులను దిరస్క
రించి యిచ్ఛామార్గమున వర్తించువాడు సిద్ధినిగాని సుఖమునుగాని, పరమగతిని
గాని, బొందడు. కర్తవ్యాకర్తవ్యములను నిశ్చయించుటకు శాస్త్రములనే ప్రమాణ
ములుగా గైకొన శాస్త్రవిధ్యోక్తికమైన దానిని దెలసి యీలోకమున గర్మప్రవర్తన
గావించవలయును.

ఇట్లు శ్రీదివ్యభగవద్గీతయందు దైవాసురసంపద్విభాగ యోగమను పదునారవ
యధ్యాయమునకు మంగళము.

---

## పదునేడవ యధ్యాయము - శ్రద్ధాత్రయవిభాగ యోగము.

---

### అర్జునుని వాక్యము.

కృష్ణా! శాస్త్రనియమములను నిరాకరించి శ్రద్ధయాన్వితులై యజ్ఞము చేయు
వారిగతి యేమగుచున్నది. ఆయాచారము సాత్వికమా, రాజసమా?

### శ్రీకృష్ణులవాక్యము.

దేహధారులకు స్వభావమైన శ్రద్ధ, సాత్విక, రాజస, తామసములని మూడు
విధములగా నున్నది. వీనినిగురించి వినుము. ప్రతియొకనిశ్రద్ధ వాని స్వభావమును ననుస
రించి యేర్పడును. నరునియొక్క శ్రద్ధ వానినడతను చూపును. వానికెట్టి శ్రద్ధయు
న్నదో వాడట్టి స్వరూపియగును. సాత్వికులు దేవతలను బూజింతురు. రాజసులు
యక్షరాక్షసులను బూజింతురు. తామసులు ప్రేత, భూతగణములను బూజింతురు.
శాస్త్రసమ్మతము గాక దంభాహంకారయుక్తులై కామరాగబలాన్వితులై, యవివే
కులై, శరీరమున నుండు భూతములను బాధపెట్టి ఘోరతపస్సులను జేయువా రసుర
ప్రకృతి సంభూతులుగా దెలియుము. సర్వమునకు ప్రియమైన యాహారము యజ్ఞము

తపస్సు, దానము, గూడా త్రివిధములుగా నున్నవి. వీనిభేదములను వినుము. ఆయు స్సు, సత్వము బలము, ఆరోగ్యము, ప్రీతిని వృద్ధిజేయునట్టియు, రసవంతములై, ఘృతయుక్తములై, మనోహరములైన, ఘట్టియైన యాహారములు, సాత్వికులకు ప్రియ ములు, చేదై, పులుసై, అధికవుప్పున్ను మిక్కిలివేడియై, ఖారమై, యెండిన, కాల్ప బడిన, యాహారము, దుఃఖ, శోక, రోగములను గలుగజేయును. ఇదిరాజసులకు నిష్టము. ఝాముకాలమై, చల్లారి సారములేక, దుర్గంధమై, సద్దియై, ఉచ్చి ష్టమై, యపరిశుద్ధమైన యాహారమును తామసులకు ప్రియములు. యజ్ఞము విధా యకమైన కర్మయని దృఢమైనవమ్మకముతో శాస్త్రమున విధించినరీతి ఫలాపేక్ష లేక మనుష్యులచేత చేయబడిన యజ్ఞము సాత్వికమైనది. ఫలముద్దేశించి ప్రతిష్ట కొరకు జేసిన యజ్ఞము అర్జునా! రాజసయజ్ఞమని దెలియుము. శాస్త్రసమ్మతముగాక, అన్నదానము లేక మంత్రహీనమై దక్షిణలేక శ్రద్ధలేక జేయబడు యజ్ఞము తామస మని చెప్పుచున్నారు. దేవతుల, బ్రాహ్మణుల, గురువుల, ప్రాజ్ఞులపూజ, శౌచము, ఆర్జవము, బ్రహ్మచర్య అహింస, యివిశారీర తపమగును. నొప్పించని, సత్యమైన, ప్రియమైన, హితమైన వాక్కు, వేదాధ్యయనాభ్యాసము నివి వాక్తపస్సన బడును. మనఃప్రసాదము, సౌమ్యత్వము, మౌనము, ఆత్మనిగ్రహము, భావసుద్ధి, యివి మనస తపస్సనబడును. ఎక్కువైనశ్రద్ధతో, ఫలాపేక్షలేక, యోగయుక్తులైచేయు త్రివిధ తపస్సులు, సాత్వికమనబడును. సత్కారము, గౌరవము, డంభము, కొరకు జేయు తపస్సు చంచలమై నాశన కరమగుగాన రాజస తపస్సనబడును. మూఢుడై, యితరు లకు హింసాప్పదమై, లేక పరుల నాశముద్దేశించి చేయు తపస్సు తామసమనబడును. దానముచేయుట యవశ్యమను నమ్మికతో కాలదేశపాత్రముల నెరింగి ప్రత్యుప కారము చేయని వానికి నిచ్చుదానము సాత్వికమగును. ప్రత్యుపకారము నుద్దేశించి లేక ఫలముద్దేశించి, లేక మనస్సు నొచ్చుకొనుచు నిచ్చుదానము రాజసమనబడును. యనర్హమైన, కాల దేశమైన పాత్రులుగాని వారికి సత్కారములేక యమర్యాదతో నిచ్చుదానము తామసమనబడును ఓం. తత్, సత్, యని బ్రహ్మము మూడు విధ ములుగా భావించబడును. పూర్వము దానిచేత బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములు, నిర్మింపబడినవి. గనుక శాస్త్రోక్తమైన, యజ్ఞ, దాన, తపస్సుల క్రియలును, బ్రహ్మ వాదులు ప్రారంభించునపుడు ఓంకారమును మొదట నుచ్చరింతురు. మోక్షకాంక్షు లయిన వారిచేత, యజ్ఞ, దాన, తపఃక్రియలు ఫలాపేక్షలేక, తత్, శబ్దోచ్చారణము

జేయబడి సలుపబడును. సత్, శబ్దము సద్భావము అనగా సాధుభావమును సూచించును గనుక, అర్జునా! ప్రశస్త కర్మయందు సత్ శబ్దము ప్రయోగింపబడును. యజ్ఞమున, తపస్సున, దానమున స్థిరత్వము, సత్ అనబడును. భగవత్ప్రీతిగా జేయు కర్మ గూడ సత్ అనబడు అర్జునా! శ్రద్ధలేక జేయబడు హోమము, దానము, తపస్సు అసత్ అనబడును. యివి యిహపరములయందు ప్రయోజనకారి గావు.

ఇట్లు శ్రీభగవద్గీతయందు శ్రద్ధాత్రయవిభాగ యోగమను పదునేడవ యధ్యాయమునకు మంగళము.

## అపరవిద్య.

దీనివల్లనే యిప్పుడు శాండో అను ఇంగ్లీషువాడును, రామమూర్తియను మన దేశస్థుడును అనేక విచిత్రకార్యములు దేహబలమున నగునని చూపుచున్నారు. వీరి చర్యలు చూచిన, భీముడు హనుమంతుడు, రావణాసురుడు మొదలగు పరాక్రమంతులు నెగడిరనుటకు కొంచమైనను సందియంబులేదు. ఇట్టి నడవడికల వల్లనే కదా మనపూర్వీకుల చరిత్రములు హాస్యాస్పదములు కాక కేవల విశ్వసనీయమగుటకు దోవ ఏర్పడుచున్నది. ఈవిషయమును గమనించి మిక్కుటముగ మీ పెద్దలవద్ద తెలుసుకొనుడీ.

**పాముతోలు.** పాములతోలు సంచులు, దుద్దుపెట్టుగొను సంచులు నడము పట్టీలు చేయుటకు ఉపయోగకరమగును. ఈవ్యాపారము జావాద్వీపము వారు కనిపెట్టినారు.

కలమంద నారవల్ల ఎక్కువ లాభము పొందవచ్చునని తెలియవచ్చుచున్నది.

**కలమంద.** విదేశీయులు దానిని తెలిసి మనదేశములో ఎక్కువగా అనేక యకరములు పట్టాలకు తీసుకొని ఈకలమందను వృద్ధిచేయుట మనము చూచుచునే యున్నాము. దీని నిదివరకు మనము (1) అజ్ఞానమువల్లను (2) నారవచ్చు యితర పైరులను గమనించుటవల్ల (3) నారను తీయుటకు సులభమైన యంత్రములు లేకుండటవల్లను గమనించక యున్నాము. కలమంద ఎట్టి ప్రదేశములోనైనను మనదేశములో పెరుగుచున్నది.

దాని ఆకు 6 మొదలు 9 అడుగులు పొడవును, 6 అంగుళములు వెడల్పును గలిగియుండును. దానిని సాధారణము రైలు మార్గములలోను కల్లగావేయుదురు. అది ఎడలోను తీగలమధ్యమున సొంపుగా పెరగదు. దానిచుట్టు యితర తీగలు చెట్లు లేకున్న బయలులో బాగా పెరుగునని అనుభవజ్ఞులు చెప్పుచున్నారు.

ప్రకృతము కలమంద నారను తయారుచేయుటకు మాత్రము పాటుపడిన చాలును. దానిచేత వగ్గములు, గుడారములు, పచ్చడములు, చాపలు జింబఖానములు, కాకితములు మొదలగు యితరపదార్థములుకూడా చేయవచ్చును. అయితే వీటిని చేయుటకు తగిన యంత్రములు కావలశియుంటె చాలాద్రవ్యము కావలెను. గనుక నారతీయుట మొదట ప్రారంభించిన వెనుక యితర వృద్ధియగుటకు వీలుండును. సాధారణముగా ఎకరాకు ఒకొకటి 8½ అడుగులదూరముగా సాలుగా 600 చెట్లుపెట్టవచ్చును. ఒక చెట్టుకు 20 ఆకులు సంవత్సరమునకు కలుగును. ఒక ఆకు తూనిక 1¼ శేరుండును. 100-కి 2½ వంతున ఆకులో నారతీసుకొన నగును. ఈ ప్రకారము ఒక ఏకరాకు సంవత్సరమునకు 225 మణుగుల ఆకులై, దానినుండి 5 మణుగులు 28 సేర్ల నారసిద్ధమగుచున్నది. ఒక మణుగు నార తయారు కావలశియున్న 6 రూపాయలు యంత్రముల లాగుపడిలోకూడ తగులును. ఒక మణుగునార అంగడిలో 12 రూపాయలకు తీసుకొందురు. చెట్టునాటిన 4 ఏండ్లనుంచి నారతీయను ప్రారంభించవచ్చును. ఒకచెట్టు సాధారణముగ 25 లేక 30 ఏండ్లు బ్రతుకునట. పూర్వము ఆకులను గోకుట వల్లగాని లేక తునకలుగ చేయుటవల్లగాని నారతీయుచుండిరి. ఇప్పుడు కలమందనుండియు, అరటి పట్టనుండియు నారతీయను 15 నుంచి 50 రూపాయల వరకు వెలగల యంత్రము సిద్ధమైయున్నది. దానినుంచి ఎన్మ్యానతలేక పాడుగైన నారను తీయవచ్చును. మనమిది వరకు నారతీయు విధములు రెండును నాలాకష్టమైన వేకాక పాడుగైన నారకూడరాదు. అందుకై యంత్రమే ఉపయోగించవలశినది. ఈవిషయము ద్రవ్యాధికారుల మనస్సులో దూరుగాక!

# పండుగలు.

పరిహాసబుద్ధితో గాని లేక సదుద్దేశ్యముచే గాని హిందువులు నడచుటలోను, నిద్రించుటలోను, ఆహారమును గొనుటలోను గూడ మతప్రవిష్టులుగా నున్నారని కొందరు చెప్పియున్నారు. ఇప్పటికాలమున మతాభిలాషయును, నమ్మకమును కొంత తగ్గినను పూర్వకాలమున హిందువులు మతమువిడిచి యేపనియును నెరవేర్చెడివారు కానట్లు శాస్త్రములవల్ల స్పష్టపడుచున్నది. ప్రతిమనుజుడు నుదయమున నిద్రలేచినది మొదలు రాత్రి పరుండువరకును జేయు ప్రతిపనికిని శాస్త్రనియమములును కట్టుబాట్లు నేర్పడి యున్నవి. మలమూత్రవిసర్జన సమయమున ముఖమార్జనపట్ల స్నానము చేయువేళ భోజనకాలమున భార్యాసంగమమున నిద్రించునవసరమునను జరుపవలసిన శాస్త్రవిధులు పెక్కులు గలవు. గావున పై నుదహరింపబడిన నుడువులు నిజమైనవే. మతమనగా భగవంతు డొకడున్నాడనియును, ఆయనను గనుగొనవచ్చుననియు ఆయనసన్నిధికి జేరవచ్చుననియు నమ్మకము గలవారికి తత్సాధనమగు నెట్టి కర్మ చేయవలసినది యెట్టినడవడి గలిగియుండవలసినది అట్టి కర్మలు జేయుటవలనను అట్టి నడవడిక వలనను గలుగు లాభములను అట్టి కర్మలు చేయమిచే అట్టినడవడిక లేమిచే గలుగు బాధలును కష్టములును బోధించునది. సర్వేసర్వత్ర ప్రతిదేశములోను ప్రతిమనుజునకు నిట్టి మతమునందు నమ్మకము గలిగియుండుటచేతనె మొత్తమున పుణ్యపాపవిచారణయు, ధర్మాధర్మ విచక్షతయు గలిగి సంఘసంబంధమగు కట్టుబాట్లు గొంతివరకైనను జనులుమీరి నడువకుండుటయు, జనులు నెమ్మదిగలిగి జీవించుటయు తటస్థమగుచున్నది గాని మతమందలి నమ్మకము లేనిచో ప్రజలు స్వేచ్ఛాప్రవర్తకులై సంచరించుట కేమియడ్డు. శ్లో॥ ఆహార నిద్రాభయ మైథునాని సమాన మేతత్పశుభిర్నరాణాం॥ అనుచొప్పున నిద్రాహారభయమైథునములు పశుపక్ష్యాదులకును నరులకును సమానముగనె యున్నవి వాటినుండి మనుజుని వేరుచేయు నవినీతియును, మంచిచెడ్డలను, వివేచనముజేయు జ్ఞానమును నైయున్నవి. జీవుడు రాళ్ళలోను, రప్పలలోను పిమ్మట తృణములు, గుల్మములు, లతలు, వృక్షములలోను అటుపిమ్మట పశుపక్ష్యాదులలోను లెక్కలేని జన్మము లెత్తిన పిమ్మటనే మనుష్యజన్మమెత్తుట దటస్థించును. మను

ష్యుడనగా ఆలోచించ గలవాడని యర్థము. కార్యాకార్యముల నాలోచించు శక్తి యంకురించిన జీవునకే మనుష్యుడని పేరు. ఇంతగష్టముచే రాబడినజన్మము గనుకనె “జంతూనాం నరజన్మ దుర్లభతరం” అనగా జంతువులలో నరజన్మ బహుకష్టసాధ్యమని జెప్పబడినది. జీవుడు లోహవర్గములోను, వృక్షవర్గములోను మనుష్యేతరమగు జంతువర్గములోను అనేకసార్లు జన్మించి యావర్గములయందలి యనుభవములను గ్రహించిన మిమ్మట కార్యాకార్యవివేచన జేయగలశక్తి యంకురించి మనుష్యుడుగా జన్మించును. మనుష్యజన్మ మారంభమైన స్థితిలో మొదట జీవులు పశుప్రాయులుగానే సంచరించుచుందురు మనుష్యజన్మములు గడచిన కొలది యనుభవముమీద మొదట నంకురముగా మాత్రము యున్నజ్ఞానము క్రమక్రమముగ వృద్ధియయి ధర్మాధర్మ కార్యాకార్య వివేకము గలిగి యందును దగిన కట్టుబాట్లతో నడచుట యారంభనుగును పిమ్మట కొన్ని జన్మములు గడచిన తరువాత నిత్యానిత్య వస్తువివేక జ్ఞానము అనిత్య వస్తువులయందు నిరసనము నిత్యవస్తువునం దాసక్తియు గలుగును. ఇంతకష్టతరముమీద ప్రాప్తమైన జన్మకు ముఖ్యహేతువై అనేక జన్మములలో సుఖదుఃఖానుభవములచే బహుకష్టముమీద యభివృద్ధియగుచున్న జ్ఞానమును విడనాడి పశుపక్ష్యాదులవలెనే దారేషణ ధనేషణ పుత్రేషణముల జిక్కి ఆహారనిద్రా మైథునములయందే మునిగి యధోగతి పాలగుదురేమో ననుభీతితోను తలంపుతోను కరుణాళువులును మహనీయులును నగు బూర్వులు హిందువులు నిత్యముజరుపు ప్రతికర్మలయందననె గాకుండ హిందువులు ప్రతి పండుగయందును జేయవలసినట్లు విధించిన కర్మలయందు గూడ భక్తిజ్ఞాన వైరాగ్యములును తత్సాధనములును జ్ఞప్తికి వచ్చునటుల సూచనగా బోధించియున్నటుల గాన్పించుచున్నది వాటిని గొంతవరకు క్రింద యుదహరించెద.

## సంవత్సరాదిపండుగ.

ఈపండుగ దినమున తైలాభ్యంగనస్నానము చేసి నింబకుసుమ భక్షణముచేసి నూతనవస్త్రధారణము చేయవలయునని పంచాంగశ్రవణము చేయవలయునని విధి యేర్పడి యున్నది. ఈపండుగ సంవత్సరారంభముననే వచ్చునదియని దానిపేరుచేతనే దెలియుచున్నది. పండుగ దివసమనగా నుల్లాసదినము. యీపండుగదినమున జరుపబడు తైలాభ్యంగనస్నాన నింబకుసుమభక్షణ నూతనవస్త్రధారణములచే శరీరమాలిన్య

ములను బోగొట్టుకొని దేహసౌఖ్యమును గలుగజేసికొని యానందించుట సూచించబడు చున్నది. తైలాభ్యంగనముచే శరీరమాలిన్యము బోవును. నింబకుసుమముభక్షించినపుడు జేనుగనుండి గట్టుముగనున్నునగర్భమందలి పైత్యాదులును క్రిమికీటకాదులును నశించి పిమ్మట శరీరసౌఖ్యమునుగలుగజేయును. నూతనవస్త్రధారణముచే మనసునకొక యుల్లాసము గల్గును. ఈపండుగదినమున నీపయిన గనుపరచిన కర్మలచే నీపయిన జెప్ప బడిన అనిత్యమగు స్థూలశరీరసంబంధమగు సౌఖ్యానందములనే పూర్వులుద్దేశించిరా? లేక నిత్యానందమునుగలుగజేయు జ్ఞాన వైరాగ్యములు సూచించి బోధించిరా? యను సంశయమును విచారించవలసియున్నది. ప్రతి మనుజునకును, స్తంభమువలెనగుపడుచు జాగ్ర దవస్థయందు పనిచేయుచున్న అన్నమయకోశ మనబడెడి స్థూలశరీరముగాక స్వప్నా వస్థయందు బనిచేయు సూక్ష్మశరీరమును సుషుప్తియందు బనిజేయు గారణశరీరమును గలవని శాస్త్రములు బోధించుచున్నవి. లోతుగ నాలోచించగా యట్టిశరీరములు గలిగి యున్నట్లు అనుభవముచేగూడ దెలుసుకొనదగియున్నది ఈమూడుశరీరములలో స్థూల శరీరము మనము ప్రతిదినము పుచ్చుకొను ఆహారములచేతను సూక్ష్మశరీరము మనయందు జనించు కోరికలచేతను కారణశరీరము మనయందు కలుగు తలంపులచేతను కట్టబడి వృద్ధియగుచున్నది. స్థూలశరీరము అన్నపానాదులచే యభివృద్ధియగుచున్న సంగతి ప్ర త్యక్షముగ నందరికిని దెలిసినదే. మనుష్యుడు కోరికలచేత జేయబడినాడనియు కోరికల ననుసరించియాలోచనయుండునని యు యాలోచన ననుసరించి పనిచేయునని పనికి తగిన ఫలము బొందుననియు బృహదారణ్యకోపనిషత్తు 6 అధ్యాయము 4 బ్రాహ్మ ణము 5-వ శ్లోకములోను మనుజుడు సంకల్పముచే నేర్పడినాడనియు యీప్రపంచ ములో నీజన్మమందెట్లు సంకల్పించునో యట్లు రాగలజన్మమునగాగలదనియును ఛాం దోగ్యోపనిషత్తు 3-వ అధ్యాయము 14-వ ఖండము1వశ్లోకములో జెప్పబడియున్నది. ఈయుపనిషద్వాక్యములలో మనుజుడు కోరికలచేత సంకల్పముచే జేయబడినాడన్న చోట్ల మనుజునకు మనుజునికోరికలకు సంకల్పములకు సాధనములగునుపాధులుగా గ్రహించవలెను. మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః। యని భగవద్గీతలలో జెప్పబడియున్న ప్రకారము జీవులు భగవంతునిలోని యంశలు గాన గ్రొత్తగాసృష్టింప బడినవారుగారు. జీవునకేర్పడిన యుపాధులు యిహపరసంబంధమగు జ్ఞానమును సంపా దించుటకుగాను కలిగినసాధనములు లేక పనిముట్లవంటివై యున్నవి పనివాడు మంచి తెలివిగలిగి నిపుణుడైయున్నను పనిముట్లు మంచివిలేనిచో పనియందలి యతని చాక

చక్యము రాణించనట్లు జీవునికి జ్ఞానసాధనమైన యుపాధులు సున్నితములయినవిగాక బండలవంటివిగా నున్నయడల జ్ఞాన సాధనముగాక జీవుని బంధించునవిగానుండును స్వచ్ఛముగా ప్రకాశించుచున్న దీపముమీద నిర్మలమైనయద్దపుకుండను బోర్లించిన దానికాంతి తగ్గక ఎట్లు నిర్మలముగా నుండునో మట్టికుండనుబోర్లించిన దానిప్రతిభ యెట్లు బయలువెడలకుండునో అట్లె జీవులకు యావరణములుగనున్న యుపాధులు నిర్మలమైనవిగ నున్నయడల జీవుని తెలివికి యడ్డమును గలిగించక పరసాధనముగాను మలినవంతమైనచో జీవుని తెలివికి యడ్డముగలుగజేసి యజ్ఞానములో బడద్రోయునవిగాను యుండును. ఈ యుపాధులు సాత్వికగుణముతో గూడియున్న యణువులచేగట్టబడినయడల నిర్మలమైనవిగాను రాజస గుణముతోగూడిన యణువులచేగట్టబడినవి గొంతవరకు మలినముతోగూడినవిగాను తామసయణువులతో గట్టబడినయడల కేవలము మలినముతోగూడి జీవుని తెలివికి అడ్డు పూర్తిగ గలుగజేయునవిగాను యుండు సత్వరజస్తమోగుణములలో పరిశుద్ధమగుటవలన ప్రకాశింప జేయునదియు నిరుపద్రవమైనదియు నగు సత్వగుణము సుఖమందును జ్ఞానమందును ఆసక్తిగలిగించునని శ్రీభగవద్గీత 14 అధ్యాయము 6వ శ్లోకములోనున్నా రజోగుణము ఇహసంబంధమగు కోరికలతో గూడినదయి లభింపనిదానియందభిలాషను లభించినదానియందభిమానమును గలుగజేసి తత్సంబంధములగు గర్మలచేత జీవుని బందించునని 7వ శ్లోకములోనున్నా తమోగుణము అజ్ఞానముచే సత్యస్త్రప్రాణులకును అవివేకమును గలుగజేసి పరాకు సోమరితనము నిద్రమొదలగువానిచేత కట్టివేయునని 8-వ శ్లోకములోనున్నా చెప్పబడియున్నది యీగుణములతోచేరిన ప్రకృతినే అపరాప్రకృతియనియు ఆసురప్రకృతియనియుగూడ పిలుచుచున్నారు. ఈప్రకృతిబద్ధులైనవారియొక్క గుణములు 1 ఇహపరసాధనములగు కార్యముల నెరుంగకుండుట 2 బాహ్యాంతరశుద్ధి లేకుండుట 3 నడువడిలేకుండుట, 4 నిజమునుబలుకకుండుట 5 జగత్తు వేదాది ప్రమాణములు లేనిదనియును ధర్మాధర్మ వ్యవస్థలు లేనిదనియు గర్తయగు నీశ్వరుడు లేనిదయు స్త్రీపురుషుల నన్యోన్యసంయోగముచేగలుగునదియు స్త్రీపురుషుల కామోద్రేకమె కారణముగాగలదనియు వాదించుట, 6 యీపై హేతువులవలన దుష్టస్వభావముగలవారయి విషయములయందే బుద్ధినిబ్రవేశబెట్టి స్వప్రయోజనమునుగోరి పరులకు బాధకరమగు నష్టకరమగు దుష్టకర్మలనుజేయుటయు, 7 తృప్తి యెన్నటికిలేనికోరికల నవలంబించి దంభాహంకార రాగద్వేష కామ క్రోధలోభమోహ మదమత్సరములతో గూడుకొని

మద్య మాంసాది భక్షణంబుజేయుచు అవివేకముతో దుష్టకార్యములయందు పట్టిన పట్టును వదలకుండుటయు 8 విషయానుభవమునిమిత్తము అన్యాయముగా ధనమార్జించుటయు మొదలుగాగల వైనట్టును యిట్టి గుణములుగల యధములు నీచజన్మముల నెడతెగక నెత్తుచు భగవంతునిపొందజాలరని శ్రీభగవద్గీత 16వ అధ్యాయము 4 మొదలు 20 శ్లోకములలో చెప్పబడియున్నది రాగమనగా స్త్రీవిషయమైన కోరిక తనకుచేసిన కీడునకు ప్రతికీడుచేయవలెనన్న తలంపును ద్వేషమనిపేరు ధనధాన్యగృహారామక్షేత్రాగులు సంపాదింపవలెనన్న తలంపునకు గామమనిపేరు తానుసేయు ప్రయత్నములకు విఘ్నముసేయువానియందు గలిగెడుగోపమునకు క్రోధమనిపేరు తాను సంపాదించు పదార్థముల ఖర్చుచేయగట్టదను తలంపును లోభమని పేరు, ఐశ్వర్యమదముచేత కృత్యాకృత్యములను తెలియనిస్థితికి మోహమనిపేరు. నేనేమిజేసినను జెల్లుననుస్థితి మదమనిపేరు. తనకన్న నెక్కువస్థితిలోనున్నవారిని చూచు సహింపమికి మాత్సర్యమనిపేరు. తనకుగలిగినకీడు యితరులకురాక తనకెందుకు రావలెనను తలంపును యీర్ష్యమనిపేరు. తనవలెనే పరులు సుఖముగానుండకూడదను స్థితికి అసూయయని పేరు. తానుచేయుకార్యములకు పరులు మెచ్చవలయునను తలంపునకు డంబమని పేరు, తానుగొప్పవాడనియు యితరులు తనతో సరిగారను తలంపునకు దర్పమనిపేరు. పట్టినపట్టు విడువకూడదన్న తలంబునకు అహంకారమనుపేరు. అధోయోనులయందు నెడతెగక జన్మములెత్తించు నిట్టి మాలిన్యసంపద తనయందున్నదా లేదా యని ప్రతి సంవత్సరారంభమున యోచించి యీగుణములు తనయందు లేకుండజేసికొనుటయే తైలాభ్యంగస్నానము అసత్యములాడకుండుటచేతను భగవద్గీత 17-వ అధ్యాయము 9 18 శ్లోకములలో జెప్పబడిన రాజసతామస ఆహారములగు మధుమాంసములను చేదుగాను, పుల్లగాను, ఉప్పుగాను మిక్కిలి వేడిగాను, కారముగాను, చమురులేనివిగాను దాహమును కలుగజేయునవిగాను శరీరమునకు కష్టమును మనోవ్యాకులత్వమును రోగమును గలుగజేయునవిగాను, బాగుగనుండనివిగాను, సారములేనివిగాను, దుర్గంధముగలవియుగాను, వండిన తరువాత నొకరాత్రిగడచినవిగాను యితరులుతినగా మిగిలియుండినవిగాను భగవన్నివేదితము కానివిగాను యుండు ఆహారవస్తువుల తినకుండుటచేతను, దుష్కార్యముల జేయకుండుటచేతను, స్నానముచేయుటచేతను, మలినవస్తువులను తాకకుండుట, దనయింటియందు చట్టుపట్లుగూడ నుండనీయకుండుటచేతను, స్థూలశరీరమును, పరిశుద్ధము జేయవలెను. స్వప్రయోజనకరమగు నట్టియు పరజనభాధక

మగునట్టియు కోరికల బుట్టనీయకుండుటచే సూక్ష్మశరీరమును బరిశుద్ధత గావింపవలయును, అటులనె దుష్టమగు స్వప్రయోజనమును, పరిబాధకమునగు తలంపులుంచనిజనీయకుండుటచే కారణశరీరమును శుభ్రము చేయువలయును. ఇదియె సంవత్సరాది పండుగయందు జేయు తైలాభ్యంగనముయొక్క అంతరార్థము ఇక నింబకుసుమభక్షణమునుగురించి యాలోచించవలసి యున్నది. శ్రీభగవద్గీత 18-వ అధ్యాయము 36, 37, 38, 39-వ శ్లోకములలో నిట్లు బోధింపబడి యున్నది. "సుఖంత్విదానీం త్రివిధం శృణుమె భరతర్షభ। అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతంచనిగచ్ఛతి॥ యత్తదగ్రే విషమివపరిణామే మృతోపమం। తత్సుఖంసాత్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజం॥ విషయేంద్రియసంయోగా ద్యత్తద గ్రేమృతోపమమ్। పరిణామే విషమివతత్సుఖం రాజసం స్మృతం॥ యదగ్రేచానుబంధేచ సుఖం మోహనమాత్మనః। నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామనముదాహృతమ్॥" అనగా సుఖములు మూడువిధములుగానున్నదనియు దేనిని యభ్యాసము జేయుటచే యానందము నొందుచున్నాడో జననమరణములనియెడి దుఃఖనాశనముగూడ నొందుచున్నాడో అట్టి అభ్యాసమును ఆరంభించుకాలమున విషమువలె నుండుననియు, చివరకు అనగా జ్ఞానవైరాగ్య సిధ్యనంతరము పరమానందము నిచ్చి యమృతతుల్యముగాను స్వస్వరూపానుభవము వలన మనోవిశ్రాంతిని గలిగించునదిగాను నుండుననియు నీపైనిజెప్పినరీతిని గలిగిన సుఖము సాత్వికమనియు విషయానుభవకాలములో ప్రథమమందు అమృతతుల్యముగా నుండి చివరకు విషమువలె నుండు సుఖము రాజసమనియు నిద్రవలనను బద్ధకమువలనను వృథాలోచనవలనను పుట్టునదియగు సుఖము తామసమనియు వర్ణమైయున్నది. ప్రతిమనుజుడును భూలోక భువర్లోక సువర్లోకసంబంధములయిన విషయానుభము లందాసక్తిగలవాడై యుండుటచే పైజెప్పబడిన రాజస తామససౌఖ్యములనే యపేక్షించి యున్నాడు. ఈసౌఖ్యములు అనుభవారంభమున సంతోషముగా నుండునట్లగుపడినను అవి శాశ్వతసుఖములు గాకుండుటచే తుదకవి దుఃఖకరములే యగును. ధనమందాసక్తి గలవానికది లభ్యమయినపుడు సంతోషమును అదిపోయినపుడు సంతాపమును గలుగును. అటులనే భార్యాపుత్రాదులయం దాసక్తిజెందియున్నవానికి భార్యాపుత్రాదులు లభించియున్నతరిని యానందమును వారు మరణించినతరుణమున దుఃఖమును ప్రాప్తి మగును. ఈలాగుననె సమస్తవిషయానుభవములును పరిణామమందు దుఃఖరములు గానే యుండును. విషయానుభవములయందలి కోరిక జనన మరణములకే, గారణ

మగును. ధనేషణ దారేషణ పుత్రేషణములయందు జిక్కక ఇహ మూత్రార్థఫలభోగ ములయందు వైరాగ్యస్థితి నొందినవానికి స్వస్వరూపానుభవముచేకలుగు సుఖము శాశ్వతమగుటచే అమృతతుల్యముగా నుండును. అయితే యీసుఖము ధనేషణ దారేషణ పుత్రేషణములయందును యితరమగు యిహమూత్రార్థ ఫలభోగములయందును వైరాగ్యా భ్యాసానంతరము దొరకునదియైయున్నది. ఆశాశ్వతసుఖములయందు వైరాగ్యములేనిచో నమృతోపమగు శాశ్వతసుఖము దొరకదు కాని అనేకజన్మపరంపరలనుండి దృష్టముగ నున్న ప్రాపంచకసుఖముల యందేయలవడియున్న మనకుముందు కలుగబోవు అదృష్ట మగు సుఖమున పేక్షించి అనుభవించుచున్న దృష్టిసుఖములందు వైరాగ్యముగలిగి విడ వాడుట ముందుకలుగు సౌఖ్యముకొరకు తత్కాలమున చేదగు వేపపువ్వును తినుట వలెనే యారంభమున విషమునుండును. గాన నింబకుసుమభక్షణ యంతరార్థమిట్లుగ దోచుచున్నది.

ఇక నూతనవస్త్రధారణమన విచారింతము. అసురసంపదతో గూడిన మలిన శరీరములు జీవుని యధోగతిపాలుజేసి భగవంతుని సన్నిధికిజేరు జ్ఞానమునుగలుగ నీ యవనిపైన తెలుపబడెనుగదా శాశ్వతానందమునిచ్చు భగవంతుని సన్నిధికి జేరుటకు దైవీసంపదయనెడి నూతనవస్త్రములను నిర్మలముగాజేయ బడిన యుపాధులమీద మనము ధరించవలసికూడా యున్నది. శ్రీభగవద్గీత 16-వ అధ్యాయము 1, 2, 3 శ్లోక ములలో జెప్పియున్న ప్రకారం తాను జేయవలసి శాస్త్రీయములగు కార్యములయందు భయములేకుండుట లోకవ్యవహారములయందు పరులవిషయమయి మోసము, అసత్యము, మాయ మొదలగు వానిని విడుచుట ఆత్మజ్ఞానోపాయమును దెలిసికొని వానిని యను ష్ఠించుట తనశక్తికొలది నితరులకు నన్నవస్త్రములనిచ్చుట బాహ్యేంద్రియని గ్రహము దేవయజ్ఞము, పితృయజ్ఞము, మనుష్యయజ్ఞము, భూతయజ్ఞము మొదలగువానిచే భూత తృప్తినొందించుట తాను వేదాధ్యయనముజేసి ఇతరులకుజెప్పుట; శ్రీభగవద్గీత 17-వ అధ్యాయము 14, 5, 16 శ్లోకములలో దెలిపిన ప్రకారము త్రివిధతపస్సును జేయుట ఋజుత్వము యితరుల బాధింపకుండుట, నిజమును బలుకుట, కోపము లేకుండుట, అహంకార మమకారముల విడుచుట, యింద్రియముల నిచ్ఛవచ్చినరీతిని విషయముల యందు సంచరింపనీయక స్వాధీనములో నుంచుకొనుట, ఇతరుల దోషముల నెంచ కుండుట, ప్రాణులయందు దయగలిగియుండుట, యింద్రియార్థములజూచి చలించ కుండుట, మృదువుగనుండుట, తానుచేయు సత్కర్మలయందు డంబములేకుండ నడ

నుపతో జేయుట, విషయానుభవములయందు కోరికలుపుట్టకుండుట, ప్రాగల్భ్యము, ఇతరులచే యపకృతి నొందినను వికారము నొందక నోర్చియుండుట, దేహేంద్రియాదుల నిరసించుటయందలి ధైర్యము, బాహ్యాంతరశుద్ధి, పరులను హింసించకుండుట, ఇతరుల కన్న గొప్పవాడనియెడి తలంపులేకుండుట యనునవి పైనుదహరింపబడిన యాసురీ సంపదకు వ్యతిరిక్తమైన దైవీసంపదయొక్క లక్షణములయి యున్నవి. ఇట్టిలక్షణము లుగల మనుజుడు బంధనివృత్తిజెందుననియు దుఃఖపడవలసిన యవసరము లేదనియు శ్రీభగవద్గీతయందలి పైయధ్యాయము 5-వ శ్లోకములో జెప్పబడియున్నది గాన యా సురీసంపదతోగూడిన మలినమగు నుపాధుల నిర్మలపరచుటయేగాక దైవీసంపద యనెడి నిర్మలమైన నూతనవస్త్రము ధరించుటయే సంవత్సరాదిపండుగ దినమునజేయు నూతనవస్త్రధారణము సూచించుచున్నది. జీవితమును, ఉత్సాహమును, శరీరబల మును, వృద్ధిబొందించునవియును రసముగలిగి రుచిగలిగి యుండునవియును, చమురుగలిగి యును సులభముగజీర్ణమై దేహమునకు చాలాకాలము పుష్టినిచ్చునవియును చూచుటకు రమ్యముగనుండు నవియును నగు భగవద్గీత 16-వ అధ్యాయము 8-వ శ్లోకములో జెప్ప బడిన సాత్వికాహారములు తినుటవలనను దేవగురుప్రాజ్ఞులను బూజించుటచేతనుస్థూల శరీరము నిర్మలమైననూతనవస్త్రమును ధరించవలయును. భక్తితోగూడిన పరోపకారము తోగూడినకోరికలనెడతెగక గలిగియుండుటయును నిర్మలవస్త్రమును సూక్ష్మశరీరము ధరించవలయును. తత్వజ్ఞానసంబంధమగు భక్తిసంబంధమగు తలంపులనే యెడతెగక కలిగియుండుటయను నిర్మలమైన వస్త్రమును కారణశరీరము ధరించవలయును.

ఇక పంచాంగ శ్రవణమునుగురించి విచారింతము. పంచాంగ శ్రవణమువలన నడవబోవు సంవత్సరమున తన గ్రహసంపత్తును గ్రహసంపత్తుననుసరించి తనకుగలుగ బోవు శుభాశుభఫలములను దెలుసుకొననగును. ప్రతిమనుజునకును గలుగు శుభాశుభ ఫలములు అతను పూర్వజన్మములచేసిన కర్మల ననుసరించియే యుండును. గలుగబోవు ఆత్మకర్మఫలమునే యతనిని గ్రహసంపత్తు సూచించుచుండును. ఇది జ్యోతిషసిద్ధాంత సమ్మతము. ఇల్లును కట్టినవాడు ఆయిల్లును తానేయెట్లు నశింపుజేయగలడో అట్లనే సుఖదుఃఖములకు కారణమైన తనచే చేయబడిన కర్మనునశింపుజేయుటకు ప్రతిమనుజు నకు శక్తికలదు. ఇట్లు శక్తికలదు గనుకనే అనుభవముచే నశింపుగావలసిన ప్రారబ్ధ కర్మతప్ప ఆగామిసంచితకర్మలు జ్ఞానముచే నశింపుకాగలవని శాస్త్రముచే బోధింప బడుచున్నది. ప్రారబ్ధమనగా అనుభవము ప్రారంభమయిన కర్మసంచితమనుగా లోగడి

జన్మములలో చేయబడి అనుభవమయినదిపోను ముందు అనుభవము నిమిత్తము మిగల యున్నకర్మ. ఆగామి యనగా ముందు అనుభవనిమిత్తము వర్తమానకాలమున చేయబడుకర్మ. సుఖదుఃఖానుభవముల నిమిత్తము జననమరణ ప్రవాహములోనుండి తప్పించుకొనకుండ బంధకముగానుండు తాను గతకాలమున చేసిన ప్రకృతమున చేయుచున్న కర్మలను, ఆకర్మలచే బొందవలశినఫలితములను తెలిసికొని యవి తనకు బంధకము గాకుండనుండు సాధనముల గ్రహించి యాసాధనముల నుపయోగించి యాకర్మల కర్మఫలముల బంధకము గాకుండ నశింపుజేయుటయే జ్ఞానము. ఇట్టిజ్ఞానమునకు పంచాంగ శ్రవణము కొంతవఱకు సాధనమై యున్నది. గాన పైనుదహరించిన ప్రకారము ఆసురీ సంపదనువదలి దైవీసంపదను పొందినవారు జ్ఞానాగ్నిచేకర్మలను దగ్ధముచేయవలయు ననియెడిసంగతి పంచాంగశ్రవణముచే బోధించబడినట్లుతోచుచున్నది. ఇంవలి ఫలితార్థము, (1) బాహ్యాభ్యంతరపరిశుద్ధి, (2) నిత్యానిత్యవస్తువివేకము, (3) ఇహాముత్రార్థఫలభోగవిరాగము, (4) సత్కర్మానుష్ఠానము, 5 జ్ఞానసంపాదనము, (6) కర్మ బంధముల నాశనముజేయుటయయి యున్నది. సంవత్సరాదిపండుగతో వసంతఋతువు ప్రారంభమవును. సమస్తవృక్షజాతులును వాటి పాతయాకులను రాల్చివేసినక్రొత్త యాకులను వసంత ఋతువునందు చిగుర్చును అట్లనే ప్రతిమనుజుడును ప్రతిసంవత్సరారంభమున తనయందలి దుర్గుణముల వదలివేయుట మొదలుపెట్టి సద్గుణముల నలవడజేసుకొనుట యారంభింపవలయును. గావున సంవత్సరాదిపండుగయందు చేయబడు కర్మలయందలి యంతరార్థముల నెరిగి యనుష్ఠింతురు గావుత.

225. ఒక గాజుతునకమీద పాదరసమును పఱచిన నొకడు తనముఖమును జూచుకొనవచ్చును అట్లు కేవలవిషయరాహిత్యమైన మనుజునియొక్క స్వచ్ఛమైన హృదయమున దైవస్వరూపము వ్యక్తమగుచున్నది.

226. బాలునివలె సాదువైనగాని యొకనికి దైవస్ఫురణగలుగదు నీవుకేర్చిన లౌకికవిద్యను మరచి బాలునివలె మూఢుడైనవెనుకనె సత్యజ్ఞానానందమును బొందెదవు.

• 227. ప్రతిసంవత్సరమును వచ్చువర్షమును గురించి పంచాంగములలో ముందుగా దెలియజేయుదురు. గాని యాపుస్తకమును బిండిన నొక జలబిందువైన రాలదు. అట్లు పుస్తకములలో ననేక మంచివాక్యములున్నను వాటికి యూరక చదివిన ధార్మికుడుకాడు. వాటిలో జెప్పిన వాక్యముల సద్గుణముల నాచరించవలెను.

228. ప్రశ్న:— మతము లెందుకు ఖిలమగుచున్నవి.?

ఉత్తరం—వాననీళ్లు శుద్ధమైనదే అయితేదేనిగుండా పారునో దానిమలినము దానితో జేరును. నీళ్లు పడు మిద్దెగొట్టము మురికిగానుండిన నీళ్లు మురికియగును.

229. ద్రవ్యముచేత నాహారము మాత్రము సంపాదించవచ్చును. గనుక అదియే నీగతిగా భావింపకుము.

230. స్పర్శవేదితో బంగారు, నిత్తడిని స్పృశింప దాని నిజమైన వెల వెల్లడియగును. అట్లుబాధలు, విపత్తులను స్పర్శవేదిచే రాచిన నిజభక్తులు, కపటులు బయలు పడుచున్నారు.

231. శ్రేష్ఠమైన యుక్కుగుట కనేకమారులు కాచి యనుమును సుత్తెతో సాగగొట్టవలెను. ఆవెనుకనె యొకవాడియైన కత్తిగా జేయుటకును యిష్టమువచ్చినట్లు వంచుటకు వచ్చును. విపత్తులను కొలిమియందు మనుజుడనేకమారులు కాచబడి ప్రపంచబాధలచేత సాగగొట్టబడినకాని వాడు శుద్ధుడై నమ్రుడుకాడు.

232. నీమతమును ధైర్యముగా నచంచలభక్తితో నమ్మియుండుము గాని నీదురభిమానము అసహిష్ణుతను మానుము. బావిలోని కప్పవలె నుండకుము.

233. తానుండుభావికంటె గొప్పదియై మనోహరమైన దానిని నాకప్పతెలియదో స్వమతదురభిమాను లట్టివారు తమమతములకంటె నెక్కుడైనది గానరు.

234. ఒక కుటుంబములోని చిన్నపెద్దలను తనప్రేమను, మర్యాదను మామకు వత్తకు, నితరకుటుంబీకులకు జూపుచు తన భర్తనెక్కువగా ప్రేమించునట్లు నీయిష్ట

దేవతాసేవ యందు సుస్థిరుడై, భక్తిపరుడవై యితరదేవతలను నిందించక నందరిని పూజించుము.

235. నిజమైన ధర్మపరుడు, తత్త్వమును దెలుపుటకు నితరమతములు కూడ మార్గములే యని తెలియవలెను ఇతరమతములను మనము సదా నాదరించుబుద్ధి గలిగి యుండవలెను.

236. ప్రకృత బ్రాహ్మోమతమునకును, హిందూమతమునకును భేదమొక రాగమునకును, సంగీతమునకున్నంత భేదమువలె నుండును. బ్రహ్మముయొక్క యొకరాగముతో బ్రాహ్మోలు తృప్తి జెందుదురు. హిందూమతమన్ననో మనోహరమై, మాధుర్యమైన యనేక రాగములుగల శ్రావ్యప్రబంధమని తెలియవలయును.

237. హిందువులు బ్రాహ్మోలు నమపరస్పర మతముల నత్యాసక్తితో బోధించుచుండ, నాదివ్యతల్లి యిద్దరిద్వారా తనపని నెరవేర్చుచున్నది యని రామకృష్ణుడనెను.

238. హరియనుమాట, హార్ దొంగిలించుయను మాట నుండి బుట్టినది. హరి యన మనహృదయములను దొంగిలించు వాడని యర్థము. హరిబల అనగా మనబలము హరియని యర్థము.

239. పాపమును పాదరసమును వలె దాచ సాధ్యము కాదు. ఒకడు రసభస్మమును మ్రింగ శీఘ్రముగానె దేహముమీద రణరూపముగా బైటపడును.

240. పశ్చాత్తాపబాష్పములు ఆనందబాష్పములు కంటియొక్క రెండు వేరుమూలలనుండి స్రవించును ముక్కుదగ్గిర భాగమునుండి పశ్చాత్తాపబాష్పములు కారును. మరియొక కొననుండి యానందబాష్పములు కారును.

241. అద్భుతములను జేయువారి కడకు బోకుము. వారు తత్త్వమార్గమును విడచి తిరుగువారు. బ్రహ్మమార్గమున మనోవికారహేతువులుగా నుండు సూక్ష్మతత్త్వశక్తుల చిక్కులో వారిమనసు చిక్కినది. ఈశక్తులను జాగ్రతతో తెలసి వాటిని కోరకుము.

242. రామకృష్ణుని శిష్యులలో నొకడు నితరుల హృదయమున నుండు సంకల్పమును తెలుసుకొను శక్తిని పొందినవాడని గురువుకు జెప్ప నతడు ఛీ, నీకు సిగ్గులేదా, యట్టిపనికి రాని వస్తువులకు నీశక్తి తరుగ జేసుకొనవద్దనెను.

243. అనేక బట్టల మూటలును, యుద్ధమునకు గావలసిన యుడుపులును, చాకలవాని యింట మెండుగ నున్నవి. అయితే అవి వానివి కావు ఇవన్నియును శుద్ధి

జేయగానె యతని యిల్లు యుత్తదౌను. అట్లనే స్వకీయమైన సంకల్పములు లేనివాడు చాకలవానివంటి వాడు.

244. పాడనుగీలు సుఖముగానుండును. వెనుక చాలా యసహ్యమైన భాధను గలుగజేయును. అట్లు ప్రపంచ సుఖములు చాలాసంతోషకరముగా ప్రారంభమున నున్నను పిదప కలుగు ఫలములు యోచించ ఘోరమైనవి.

245. ప్రశ్న—జగ మెట్లున్నది?

ఉత్తరం—అమ్లఫలమువలె నుత్తచర్మము విత్తనముగలిగి లోపల సారములేక తినిన గడుపు శూలగలిగించు నట్లుండును.

246. బంగారమును గోరు లోభివలె దైవము నరయుము.

247. హృదయాకాశమున కామవాయువు వీచువరకు దైవప్రకాశము స్పష్టముకాదు. శాంతుడై సమాధియున్న హృదయముననె పరమానంద వైఖరి గోచరమగును.

248. ధూళిజేరిన యద్దము సూర్యరశ్మి బ్రతిఫలించనట్లు మాయాచ్ఛాదనముచే మాలిన్యమైన హృదయము భగవంతుని మాహాత్మ్యమును దెలిసికోజాలదు. నిర్మలమైన యద్దము సూర్యుని ప్రతిఫలించునట్లు శుద్ధహృదయము గలవారు పరమాత్మదర్శనము జేతురు. గనుక పావనుడుగా నుండుము.

249. పారుచుండు నీళ్లయొక్క చెదరిన పైభాగమున జంద్రుడు ప్రతిఫలించ తునకల తునకలుగా గనబడునట్లు లౌకికుని మాయావిష్టమైన చంచల బుద్ధియందు నఖండచైతన్యము ఖండములుగా ప్రకాశించును.

250. దేవునికై యేల భక్తుడు సర్వమును త్యజించును వెలుతురు చూచిన తక్షణమె పురుగు చీకటినుండి వెలువడును. చీమ బెల్లముననే యుండి చచ్చును. గాని దానిని విడువదు. అట్లనే భక్తుడు దేవుని నాశ్రయించి సకలమునుద్యజించును.

251. ధ్యానపరుడై యుండువేళ సాధువులను పరిహసించువారిని దూరమున నుంచుము.

252. మతభేదములను బెంచుట మంచిదా? నీళ్లప్రవాహమున తుంగ పెరుగదుగాని మురికినీళ్లు నిలచిన కుంటయందు పెరుగును. దివ్యస్వరూపమును బొందగోరు వానికి పరచింతనకు సావకాశములేకుండును. కర్త గౌరవమును సంపాదించ గోరు వాడు మతభేధములను బెంచును.

శ్లో. యస్య ప్రియౌ శ్రుతిధరౌ కవిలోకవీరౌ
మిత్రౌ ద్విజన్మవరపద్మశరావభూతామ్
తేనాంబుజాక్షచరణాంబుజషట్పదేన
రాజాకృతాకృతిరియం కులశేఖరేణ.

చం. పరమసుహృద్యులై నిగమపారగులై కవిలోకవీరులై
పరగెడు శ్రీద్విజన్మవరపద్మశరాఖ్యులకుం బ్రియుండు శ్రీ
వరచరణాంబుజభ్రమరవర్తి నినేఁ గులశేఖరుండు భూ
వరుఁడు రచించెన్ గృతిని వానికి నెక్కు ముకుందమాలనున్

ఉ. శాలిశకంబునందు వసుసంజదలుం గొనముల్ దిశల్ సహా
పాలుఁడు గూడు కీలకను బ్రాజ్ఞవిధేయుఁడు విండ్లచెర్వు గో
పాలక నామధేయుఁడు స్వభాషగడించెఁ బుణ్యవాసనా
వేల ముకుందమాలయను విష్ణుపుస్తోత్రము భక్తిసూత్రమున్.

ముకుంద మాలాస్తోత్రము సంపూర్ణము.

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.

'Rogistered No M 716.'

SWAN SERIES No. 3.

ఓం





# హంస

A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఒక తెలుగు బ్రహ్మజ్ఞాన మాసపత్రిక.

సత్యమునకంటె నెక్కుడగు ధర్మములేదు.

పుస్తకము 2.] | సౌమ్యసంవత్సర శ్రావణం 5010, ఆగష్టు 1909. | [సంచిక ౮.

విషయసూచిక.



చెన్నపట్టణము:

వైజయంతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

మానేజరు, హంసవిలాస్, 296 లింగిశెట్టి వీధి, జార్జిటవున్, మదరాసు. అని వ్రాయవలెను.

సంవత్సరమునకు చందా 1 రూపాయి.

ఓం

# హంస.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 2.] { సౌమ్యసంవత్సర శ్రావణం 5010, ఆగష్టు 1909. } [సంచిక ౮.

## మహాభక్తవిజయము.

### 6. బుద్ధుడు.

పూర్వము 2,500 వత్సరములక్రిందట, తనకులమునకు గోత్రమునకును గీర్తి దెచ్చు నొకకుమారునికై శుద్ధోదనుడను రాజు చాలా కాలము వగచుచుండెను. అతనికి మాయ ప్రజాపతియను ప్రియురాండ్రైన యక్కచెల్లెండ్రతని భార్యలుగ నుండిరి. వారి వయస్సు మీరుచున్నను వారిద్దరికి గర్భచిహ్నములగపడలేదు. తుదకు దైవవశమున మాయతన 45-దవ సంవత్సరమున గర్భవతికాగా నతనిరాజ్యమున నాసమాచారము దెలిసి యందరు అమితానందమును బొందిరి. కొన్నాళ్లకు మాయతన పుట్టిన యింటికిఁ బోవుటకు రానుద్దేశించ నారాజు తనరాజధానియైన కపిలవాస్తునుంచి కోలీ యనుపట్టణమున మధ్యమునందు దారిని మిక్కిలి సమముగా జేసి త్రోవప్రక్కల ననేక దివ్యాభరణముల చేతను, నరటివృక్షములచేతను నలంకరింప నాజ్ఞాపించి దారిలో కొంతకొంతదూరమున నిర్మలమైన నీటిభాండములు సిద్ధముజేయ నేర్పాటుజేసెను. ఆమెవెంట నొకవేయిప్రభువులును, గొప్పపరిచారక సమూహమును బంపెను. ఆమె కూర్చొనుటకు నొక బంగారు గద్దెను నిర్మింపజేసెను. ఈ వైభవముతో పట్టణము నుంచి వెడలి మార్గమున బోవుచుండ నొక రమ్యమైన తోపును జూచి, యందలి ఫల కుసుమవృక్షముల నవలోకించుచు కాలముగడుపుచుండ, మందమారుతము వీచుచున్న

సమయమున ఆమెయొక సుపుత్రుని గనెను. అయిదవనాడు రాజు నామకరణము సలుప 108 విద్వాంసులైన బ్రాహ్మణులను పిలువనంపి యొకగొప్పసమారాధన జేసెను. ఆబ్రాహ్మణులు రాజును ఆశీర్వదించి, లోకమున నీపుత్రుడు సిద్ధార్థుడగు నని పలుక సిద్ధార్థుడని నామకరణము గావించెను. వెనుక నాబాలుడు చక్రవర్తియైన యతనికి 80 వేలు బంధువులు యతనికి పరివారము కావలశివచ్చునని యెంచి లేక బుద్ధుడైన రాజ పురోహితులు కావలశివచ్చునని యెంచి యతని తోడ విద్యనేర్చుకొనుటకును నతనికి సహచరులుగా నుండుటకును యిదే సమయమని యెంచి యతనితో కూడ తమకుమార సమూహమును పాఠశాలకు నతనితోకూడ బంపిరి. ఆబాలునకు యోగ్యురాలైన యుపమాత నేర్పాటుజేయ కపిలవాస్తుకోశ పట్టణములనుండు రాజకన్యకల నందరిని శుద్ధోధనుడు సమకూర్చెను. ఆ యుపమాత పొడుగుగా నుండకూడదు అట్లున్న బాలునిగొంతు నిడువుగాజేయును. ఆమెకురచగా నుండకూడదు. ఉండిన బాలుని దేహమునువంచును, ఆమె గొప్పగానుండ కూడదు. ఉండిన బాలుని కాళ్లను ముడుచును. ఆమెబలహీనురాలుగా నుండకూడదు, ఉండిన బాలుడు కృశగాత్రుడుగా నుండడు. ఆమెవద్ద సేవాడు హెచ్చుగనుండకూడదు, ఉండిన నామెపాలు నుష్ణమై బాలునిచర్మ మెఱ్ఱనవును. ఆమెమిక్కిలి నల్లగానుండకూడదు. ఉండిన నామె పాలుచల్లనై బాలుని దేహమున నుండు మాంసము కొన్నిప్రదేశముల గఠినములుగాను గొన్నిచోట్ల మృదువుగా నుండు ముద్దలగా నేర్పడును. యిట్టిలోపములు కనబడని నూఱుగురు రాజకన్యకలను వారిలో ఉపమాతలుగ నేర్పఱచెను.

ఈ గోచారముగల జాతకుడు సంసారబంధముల ననుభవింపడు. అతడు నిజముగా బుద్ధుడగునని గొప్పజ్యోతిశ్శాస్త్రపండితు లూహించి రాజునకు తెలుప దేనినిజూచి యీప్రపంచమున బాలుడు త్యజించునని నారినడిగెను. నాల్గింటి దర్శనములచేత యని వారు ప్రత్యుత్తరమిచ్చిరి. అవి యేవి యని వారిని మరల రాజడుగ, వయస్సుచేత ముదిరినయొక ముసలివానిని ఒకరోగిని వకశవమును వకసన్యాసిని యని బ్రాహ్మణులు చెప్పిరి. అప్పటినుంచి అట్టివస్తువులు నాకుమారుని కండ్లబడగూడదు. నాకుమారుడు బుద్ధుడగుటవల్ల ప్రయోజనములేదు. నాకుమారుడు నాలుగు గొప్పఖండములును వానిచుట్టునుండు రెండువేల గొప్పద్వీపముల మీద రాజ్యాధిపత్యమువహించి పాలనసేయువలెనని నేనుకోరుచున్నానని రాజుచింతించుచు నగరుచుట్టు రెండుమైళ్ల పర్యంతము నలుదిక్కులపై చెప్పిన తరగతివారెవరును

తనకుమారునిదృష్టికి నగుపడనట్లు నేర్పాటుజేయ తనభటుల నాజ్ఞాపించెను. సిద్ధార్థుడు వయోవంతుడు కాగానే, కోళీపట్టణము రాజకన్యకయైన యశోధరాదేవిని నాతనికి ఇచ్చి పెండ్లిజేసెను. తొమ్మిది, యేడు, అయిదు మేడలు గలయున్నతమైన రాజగృహములను నిర్మించి యాదంపతుల నచ్చట నుండ నేర్పాటుజేసెను. తనకుమారుని మనస్సు భోగముల లీనమైయుండ నలువది వేలుసుందరరూపవతులైన కన్యకల నతనివద్ద విడిచియుండెను. ఆసుందరీసమూహమధ్యమున నుండిన సిద్ధార్థగౌతముడు గొప్పభోగానుభవమున నవలీలగా గాలము గడుపుచుండెను. ఆరాజు యశోధరను సిద్ధార్థుని పట్టపు భార్యగానియమించి వారిద్దరిని వెండి సింహాసనమున గూర్చుండబెట్టి ఒకటి బంగారొకటి వెండి యొకటి అలిచిప్పతో జేయబడిన మూడుశంఖములతో వారిని మంత్రపూర్వకంబుగ పట్టాభిషేకంబుజేసి వారిశిరములమీద రాజకిరీటములనునిచి సర్వరాజ్యమును వారికొప్పగించెను. వెనుక తనబంధుజనుల నందరిని పిలిపించి వారికన్యకలనందరిని పిలుపించి సిద్ధార్థుని భార్యలుగా నుంచనాజ్ఞాపించెను. రాజకుమారుడు కోమలగాత్రుడు. పసిబాలుడు. నేటివరకు నొకశాస్త్రమున్నైన పాండిత్యము గురులేశషకముండెప్పుడైన నొక యుద్ధము కలిగిన శత్రువుతో పోరాడ నసమర్థుడు. మాకుమారీరత్నములతడు పోషింప జీవనాధారములేక యున్నాడు. ఏయోగ్యతలేని యిట్టి నీకుమారునకు మాకన్యకల నొసంగ నిష్టములేదని యతని బంధువులందరతని యాజ్ఞ నిరాకరించిరి. దీనిని సిద్ధార్థుడువిని తనయోగ్యతను వెల్లడిపరచ నిశ్చయించి, ఆదినము మొదలేడుదినములలోగా తనసామర్థ్యమును జూడనిశ్చయించు జనులందరు తననగరు వద్ద హాజరుకావలెనని పట్టణమున దండోరా వేయించుమని యాజ్ఞాపించెను. ఆనిర్ధరించిన దినముననంతయుగాను గట్టినగొప్పమంటపమున నొకగొప్ప జనసమూహమువచ్చి చేరెను. అమితమై గొప్పపరివారముతో దేవేరి తననూటాఅరవైవేల బంధుజనులసముఖమునవంచను వేయమంది సామర్థ్యముగా వలసినట్టి గొప్పవిల్లును జేబూని, కుడికాల బొటనవ్రేలిగోరుతో నొకతట్టు నదిమిపట్టి దూదియేకువింటిని బట్టులాఘవముతో ధనుష్టంకారము జేసెను. ఆధ్వని వేయియోజనములవరకు వ్యాపించి జంబూద్వీపమున నుండువారు వర్షఋతువుగాని సమయమునవురుము శబ్దమెట్లగునని యాశ్చర్యపడిరి. ఇదిగాక ఒకచౌకముయొక్క మూలల నాలుగరటి వృక్షములననిచి వాటిని నొక్క బాణము చొచ్చునట్లు జేసెను. ఒక వెంట్రుకతో నేనైనను వ్రేలాడజేసిన నావెంట్రుక నీలునట్లు చీకటిలోనైనను సరియైనగురితో బాణము వేయగలిగియుండెను. ఆరాజ

కుమారుడు గురువులేకున్నను పదునెనిమిది శిల్పములను మరియుననేక శాస్త్రములను దెలిసినట్లు చూపెను. అతడు సామాన్యమైన మనిషిమాత్రుడు కాడని కావలసిన రీతిగా నతనిని బరీక్షించి యతనిబంధువులు తెలిసికొని పిదప రాజాజ్ఞాపించినట్లు 40,000 రాజకన్యకల నతని యంతఃపురమునకు బంపిరి.

ఒకనాడు సిద్ధార్థగౌతముడు తనక్రీడావనములకు వెళ్ల నిష్టపడి రథముగట్టుమని రథికునకు నాజ్ఞాపించెను. అతని దివ్యరథమును నానిపరికరములతో నలంకరించి నాలుగు గుఱ్ఱములను గట్టి తెచ్చి నిలిపెను. బుద్ధుడు కాబోవు రాజకుమారుడు రథము నెక్కి క్రీడావనములకు వెళ్లెను. కొన్నియడుగులు వెళ్లగానే ముసలితనముతో వంగిన జీర్ణమయిన దేహముగలవాడై యతిప్రయాసతో నడచు ముసలివానినొకనిజూచెను.

సారథీ! ఈబలహీనమై కృశించిన మనిషియెవరు? అతని మాంసమెండినది. అతని యెముకలు రక్తనరములు దేహముయొక్క చర్మముక్రింద నగుపడుచున్నవి. అతని వెంట్రుకలు తెల్లబారినది. పండ్లూడినవి. కట్టెనూతగొని తడవుచు వెళ్లు చున్నాడు.'

సారథి— దేవరా! వాడొక ముసలివాడు దేహము కృశించి నిస్సత్తువయైనది. ఇంద్రియపటుత్వము తప్పినది. పనిచేయసామర్థ్యత లేదు. పూర్ణముగా దిక్కులేని వాడు వానిస్నేహితులు, బంధువులు వానిని మృగపక్షు లెండనచెట్టును విడిచినట్లు నిరాదరణచేసి విడిచినారు.' అప్పుడు రాజకుమారుడు మహాదుఃఖముతో 'సారథీ' వీని వియమున మాత్రమిట్లున్నదా? లేక సాధారణముగా నందరికిని యిదియేనా? యథార్థమైన కారణమును చెప్పుము. దీనివిషయమై విచారించెదను,

సారథి— అయ్యో! ఇది ప్రకృతికి సహజమైన ధర్మము ప్రతిమనిషియు, స్త్రీయు, ఓడ్డలిట్టిగతిని పొందుదురు. నీతల్లిదండ్రులు నీబంధువులు నీవుకూడ నిట్టిదశను బొందవలయును. అయితే ఈ బ్రతుకునకు సిగ్గులేదనుచు రాజకుమారుడు తనరథమును వెనుకకు ద్రిప్పుమని ఇల్లు చేరెను. ఆదినము క్రీడావనములకు వెళ్లలేదు. దీనిని నతనితండ్రి వినగానే నాకుమారు డెందుకు నిట్లుఆతురముతో మరలివచ్చినాడని భటులనడిగెను.

అతడొక ముసలివానినిచూచి వెనుకకు తిరిగెనని వారు చెప్పిరి. 'అయ్యో! యిట్లు నన్నుపాడుచేయుదురు. త్వరగా వీణావాద్యములు శిద్ధము చేయుమూ, భోగానుభమున నుండువరకు లోకమును త్యజించు సంకల్పములు వానిమనసున దూరవు.' అనిరాజు కోపముతో పలికెను. కొన్నాళ్లకు వెనుక సిద్ధార్థుడు తనవనవిహారమునకు

వెళ్లుచు మరల వెనుకకు దిరిగెను. వాడు దోవప్రక్కన నెవరిచేత గమనింపబడక దిక్కులేని యొకరోగినిచూచి సారథిని యట్లు అడిగెను. సారథీ! వీడుయెవరు, వీడు హస్తిపంజరమువలె కనబడుచు మలమూత్రముల పొర్లుచు బాధచే మూల్గుచున్నవాడు

సారథి—అయ్యా! వీడు ఒకరోగి. వీనికి హెచ్చుబాధగల్గి, అవసాన కాలమును సమీపించినవాడు. వీనిరోగమునకు మందులేదు. వీనికికోరికలేదు. వీడు త్వరగా చచ్చును. అనిసారథిపలికెను. అదివిని రాజకుమారుడు కేవలచింతాక్రాంతుడై వ్యసనముజెంది తననగరునకు తిరిగిపోయెను. ఇట్లనే కొన్నాళ్లవెనుక మరియు బయటికివెళ్లి యనేకజను లొకశవమును మోసికొనిపోవుచుండ జూచి, సారథీ! ఇదియేమి? మంచముమీద నొకమనిషిని ఎందుకు కొనిపోవుచున్నారు. విరబోసుకొన్న వెంట్రుకలతో నెందుకు వెంబడించుచున్నారు. వారు యెందుకు ఏడ్చుచు నెదనుకొట్టుకొని ఏడ్చుచున్నారు, అని అడిగెను. అయ్యా, ఈమనిషి చచ్చినాడు. వీడు మరలతనతల్లితండ్రులను, కొడుకులను, స్నేహితులను, బంధువులను చూడజాలడు. ఈలోకస్పర్శ వానికి లేదనెను. దీనిని రాజకుమారుడువిని నిట్టూర్పువిడిచి, ముసలితనమాక్రమించు బాల్యమునకు సిగ్గులేదు. నానావిధముల రోగములచేత జుట్టుకొనబడియుండు ఆరోగ్యస్థితికి సిగ్గులేదు. భోగములమునుగు విద్వాంసునికి సిగులేదని రాజకుమారు డనెను. తననగరునకు రాజకుమారుడు వెనుకకుదిరిగి కొన్నాళ్లకు నతడు తన వనమునకు వెళ్లుచు నొకసన్యాసిని జూచెను అతనినిజూచి, సారథీ, కావివస్త్రమును ధరించినవాడు వీడెవడు? ఇతడు శాంతుడై మృదుమనోహరత్వములు కలిగి వేరువిషయమునువిచారించక యున్నవాడు. అయ్యా! వాడుసన్యాసి, వీడుసర్వకామరహితుడు. లోకమునుత్యజించినాడు. అందరిని సమదృష్టితో జూచును. భిక్షాన్నముతో బ్రతుకుచున్నవాడని సారథియనెను. సరే ఇదేనాకిష్టము. ఇటువంటి బ్రతుకెప్పుడు విద్వాంసులు సన్మానించుదురు. వీనిబ్రతుకే అన్నిటికంటె సుఖకరమైనది. యని రాజకుమారుడుపలికి నగరునకు రథము వెనుకకు ద్రిప్పుమని యిల్లు చేరెను.

253. వేదములు, తంత్రములు, పురాణములు లోకములోని యితరపావన గ్రంథములు వాంతిజేసిన పదార్థములవలె ననేకముఖములగుండా పలుమారు చెప్పబడుచున్నవి. గనుక యశుచియైనవి. అయితే బ్రహ్మ మెప్పు డశుచికాదు. ఎందుకన నతని నొకరైన యిదివరకు వాగ్రూపమున ప్రదర్శింపలేదు.

254. జీవాత్మ పరమాత్మలకుగల సంబంధమెట్టిది. ఒకప్రాని పలకను నీటిమీద పెట్టిన నీళ్లు రెండుభాగములుగా జేయబడి కనబడునట్లు మాయోపాధివల్ల అభేద్యమైన పరమాత్మతత్వ మనేకముగా గనబడుచున్నది. అయితే యదార్థముగా నన్నియు నొక్కటియే.

255. ఉత్తరదిక్కు ప్రదర్శించు యంత్రము చెడనివరకు నొకయోడ సముద్రము దారితప్పుటకు నవకాశముండదు. అట్లుమానవుని మనసు పరబ్రహ్మముతట్టు తిరిగియున్నంతవరకు నెట్టిసంకటములు నగపడవు.

256. ఒకమైదానమున వాద్యధ్వనులతో నడుచుచున్న నొకపెండ్లియుత్సవమును నొకయవధూతజూచెను. ఆయుత్సవమువద్ద నొకవేటకాడొక పక్షినిగురిపెట్టి యాయుత్సవధ్వనుల నించుకయైన గమనించకుండెను. ఆయవధూత వానినిజూచి అయ్యా నీవు నాగురువు నేనుధ్యానంబున నుండునప్పుడు నీమనసు పక్షినిగురిపెట్టినరీతి ధ్యేయముమీద నామనసు నిలువని అనిచెప్పెను.

257. చేపలు పట్టువాడొకగుంటలో చేపలుపట్టుచుండ ఒక యవధూత వానిని నాగ్రామమునకు దోవయేదియని యడిగెను. చేపలుపట్టు కట్టకుగట్టిన యెరను చేపతినునట్లు చిహ్నమునుజూపుచుండ వాడు బదులు చెప్పక కట్టెతట్టు గమనించుచుండెను. చేపనుపట్టగానే వాడు అయ్యా మీరేమిచెప్పితిరి అని యడిగెను. ఆయవధూతవానికి వందనముచేసి అయ్యా నీవు నాగురువు నేను పరమాత్మధ్యానమునన్న సమయమున నీదృష్టాంతము ననుసరించి ధ్యానముముగియక ముందితర చింతనము చేయక నుండనిమ్ము. అనిచెప్పెను.

258. ఒకకొంగ యొకచేపనుపట్ట మెల్లగ కదలుచుండెను. దానివెనుక నొక వేటగాడు దానితట్టొక బాణముగురిపెట్టియుండెను. గాని యాపక్షి దానిని గమనించకయుండెను. ఒకయవధూత కొంగనుజూచి నేను ధ్యానముననుండు సమయమున నీవలె నావెనుక నెవరున్నారని తిరిగి చూడకనుండనిమ్మని చెప్పెను.

259. ఒకగద్ద తనముక్కున నొకచేపను గరచుకొనియుండ ననేకకాకులు గద్దలగుంపు లాచేపనపహరింప దానిని బొడుచుచు, నఱచుచు దానివెంట వెంట సాగెను. యీతొందరకు నలసియాగద్దచేపను జారవిడువ మరియొకగద్ద దానిని గ్రహించ నాగుంపులాగద్దను తరుమ నారంభించెను. మొదటిగద్ద నిరాటంకముగా శాంతినిపొంది నొకచెట్టుకొమ్మమీద కూర్చొనియుండెను. దానినిశ్చలశాంతస్థితిజూచి ఓగద్దా నీవునాగురువు లౌకికవాంఛలబరువును విడనాడనంతవరకు నిరాటంకమైన శాంతస్థితినిబొందుట దుర్లభమని నీనుంచి నేర్చుకొంటినని యొకయవధూతచెప్పెను.

260. మానవగురువు చెవులో నొకపావన మంత్రోపదేశమును జేయును. దివ్యగురువుజీవునకు పరమాత్మస్వరూపోపదేశమును జేయును.

261. సూదిలో దారమెక్కించ దారమును మొనగాజేసి దానిలోని యితర నారలను దీసివేయవలెను. అప్పుడుసూదికంటిలోన దారమెక్కును. అట్లు దేవుని మీదనీమనసునునిలుపవలెనని కోరితేని నమ్రుడై, దీనుడై, నిరంహంకారుడై యుండుము ఆశలను నారను దీసివేయుము.

262. పక్షిపారిపోయిన వెనుక దానిగూటిని నొకడు గమనించనట్లు జీవము వెళ్లిన దేహము నొకరు గమనించరు.

263. గాలివీచునంత వరకు ఎండతాపమును బోగొట్ట విసనకఱ్ఱనుపయోగించుదుము. గాలివచ్చిన విసరుకొనము. పైనుండి మనకుసహాయము రానంతవరకు సద్గతిని బొందమనము సాహసము జేయవలెను. ఎవ్వరైనను గ్రహింప మనము సాహసము జేయపనిలేదు.

264. దేవుడెక్కడ యున్నాడు? వానిని మనమెట్లు బొందవచ్చును. సముద్రమున ముత్యములున్నవి నీవుపలుమారు మునిగిమునిగి వానిని తీయువరకు పాటుపడవలసినట్లు జగమంతట దేవుడున్నను నీ వతనినిజూడ ప్రయత్నము జేయవలెను.

265. సముద్రమధ్యమున నొకయోడస్తంభమున గూడుకట్టుకొన్న యొకపక్షి తనగూటినిమాచి విసికికొని వేరొకనెలవును గావించుకొన నాకాశమునయెగిరి యొక్కడను విశ్రాంతిబొందుట కవకాశములేక మరల తన నావస్తంభముమీది గూటిని దన్సి విసికికొని జేరునట్లు ఒకయభ్యాసి శిష్యునిశ్రేయస్సుగోరి యనుభవ సంపన్నుడైన గురువు జేయు శిక్ష యేకవిధముగా రుచిలేకయుండుటవల్ల నసహ్యాపడి, నీరాశజేసు

కొంనీ నమ్మికలేక మరియొక గురువున న్వేషించుచు లోకమున ద్రిమ్మరి, యెక్కడను దరి గానక పూర్వగురువు నెక్కువవిశ్వాసభయభక్తులతో జేరును.

266. ఒకసారి యొంటిమీఁది యసహ్యమయిన గాయముమీఁదను ఒకసారి దేవతల కర్పించిన నైవేద్యముమీఁదను కూర్చొను ఈఁగవలె లౌకికుని మనస్సొకవేళ ధర్మవిషయములమీఁదను మరియొకవేళ ధనవిషయ సుఖములమీఁద బారును.

267. ఆకాశమునుండి మిద్దెలమీఁదబడువాననీళ్లు చిత్రముగా నేర్పడ్డ పులినోటి నుండి భూమిమీఁదపడునట్లుగా భక్తుల ముఖాంతరము బోధవచ్చినను పరమాత్ముని నుండియే నిజముగావచ్చునని తెలియవలెను.

268. చినిగినసంచినుండి కారినలుదిక్కులుచల్లిన సాసువగింజల నేర్పరచ గష్టమైనట్లు వివిధదిక్కులకు వెళ్లినానా వ్యవహారములుగల మనస్సు నేకాగ్రత బడయజేయుట సులభసాధ్యముకాదు.

269. లోపలజనులు మేల్కొనిన సమయమునదొంగ యిల్లుచొరవ సాధ్యము కానట్లు నీవెప్పుడు హెచ్చరికతోనున్న నీసాధుత్వమును హరింప నేదుష్టబుద్ధియు నీమనస్సున బ్రవేశించదు.

270. పడవనీటిలోనుండవచ్చునుగాని నీళ్లు పడవలో నుండకూడదు. అభ్యాసి లోకమున నుండవచ్చునుగాని లోకమతనియం దుండకూడదు.

271. ఒకడు తనగురువును మనుష్యమాత్రునిగా భావించిన నతనినుండి యేలాటి ప్రయోజనము బొందడు.

272. నీవేమనుకొనెదవో దానిని జెప్పవలయును. మనోవాక్కులకు భేద ముండకూడదు. నీయోచనలు, మాటలేకగ్రీవముగా నుండవలెను. అట్లుకాకున్న నీవు దైవస్వరూపమైతివేని నీకేలాటి ప్రయోజనము కలుగదు.

273. మేకల, పశువుల, పిల్లల బాధలనుండి కాపాడను మొలకకుకల్లపాతవల యును. అదియొకవృక్షమైన మేకలగుంపులు, పశువులమందలు దాని కొమ్మలనీడల విశ్రమించి దానియాకులును మేయును. ఆభంగి నీయందు భక్తితక్కువైయుండ దుస్సంగము లౌకికత్వము జేరకుండ మనసును కాపాడవలయును. నీకు ఎక్కువభక్తి కలుగ ఏలౌకి కత్వము దుస్సంగము నీపావనమైన మనసునంట సామర్థ్యమును గలుగనేరదు. అనేక దుష్టులు నీసత్సహవాసమువల్ల సాధువులగుదురు.

## పదునెనిమిదవ యధ్యాయము - మోక్షసన్యాస యోగము.

### అర్జునుని వాక్యము.

కృష్ణా! సన్యాసము యొక్కయు, హృషీకేశా! త్యాగము యొక్కయు, కేశినిషూదనా! తత్వములను వేరువేరుగా తెలియగోరెదను.

### శ్రీకృష్ణుని వాక్యము.

కామ్యకర్మత్యాగము సన్యాసమనియు, కర్మఫలాపేక్షవిడుచుట త్యాగమనియు బుధులు చెప్పుదురు. కర్మ సదోషములగుటవలన విడువవలయునని కొందరుపెద్దలు చెప్పుదురు. మరికొందరు యజ్ఞ, దాన, తపో కర్మములను విడువరాదని చెప్పుదురు. అర్జునా! త్యాగవిషయకమైన నాయభిప్రాయమును వినుము. నరశ్రేష్ఠుడా! త్యాగము మూడువిధములని చెప్పబడుచున్నది. యజ్ఞదాన తపఃక్రియలను విడువగూడదు. వానిని చేసితీరవలయును. యజ్ఞదాన, తపస్సులు పండితులకు పావనకరములు. అర్జునా! అయితే యీకర్మలనుగూడ కర్మసంగమును, ఫలమునువిడిచి చేయవలయును. ఇదినానిశ్చయమైన యుత్తమాభిప్రాయము. నియమింపబడిన వేదోక్తమయినకర్మ సన్యాసము యుక్తమైనదికాదు. మోహమువల్లనైన కర్మత్యాగము తామసత్యాగమని పలుకబడును. కాయక్లేశభయమున్నదని దుఃఖకరమని చెప్పుచు కర్మనువిడిచినవాడు రాజస త్యాగముజేసినవాడై త్యాగఫలమును బొందడు. విధాయికమైనకర్మను చేయవలసినకర్మయని, ఫలమునువిడిచికర్మజేసిన, అర్జునా! అట్టివానిని సాత్వికత్యాగి మనబడును. సాత్వికత్యాగి జ్ఞానయుతుడై సంశయంబులుమాని దుఃఖకరమైనకర్మలను ద్వేషింపడు. సుఖకరమైనవానిని స్నేహించడు. దేహధారులు పూర్ణముగా కర్మను విడువజాలరు. కర్మఫలములను విడుచువాడు ముఖ్యమైనత్యాగి యనబడును. కర్మఫల త్యాగికానివానికి ఇష్ట, మిశ్ర, అనిష్టములని మూడుతెగలుగా నాఫలమున్నవి. అయితే ఫలత్యాగికి అవెన్నటికిని లేవు. సకలకర్మలసిద్ధికొరకు సాంఖ్యసిద్ధాంతమున చెప్పబడినవి దేహము, కర్త, కరణములు, వివిధచేష్టలు వానియభిమాన దేవతలని అయిదుకారణములను, అర్జునా! నావల్లనెరిగి తెలియుము. మనోవాక్కాయముల చేత చేయుకర్మలకు న్యాయమైనను విపరీతమైనను యీయైదును వానికికారణములు. అదిఇట్లున్నది గనుక బుద్ధిలేక ప్రత్యక్షరూపమైన యాత్మను కర్తగాభావించువాడు

మూఢుడై దుర్మతియై యాత్మతత్త్వము దెలియఁజాలడు. అహంకారభావములేక చెడిన బుద్ధిలేనివాఁడీ జనులను సంహరించినను వాడు సంహరించినవాడు గాడు. బద్ధుడు గూడ గాడు. జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాతయని కర్మప్రోత్సాహము మూడు తెరగులుగా నున్నవి. కరణము, కర్త, కర్మయని మూడువిధములుగా కర్మసంగ్రహము లున్నవి. జ్ఞానము, కర్మ, కర్త, గుణవిభాగములనుసరించి మూడువిధములుగా నున్నది. వానిని క్రమముగా వినుము. విభక్తమైనవానిలో నవిభక్తమై సమస్తప్రాణులయందు నాశరహితమైన పరమాత్మతత్త్వమును తెలియజేయునది సాత్త్వికజ్ఞానమని తెలియుము. సమస్తప్రాణులయందు వివిధస్వరూపములను భిన్నములుగా భావించుజ్ఞానము రాజసజ్ఞానమని తెలియుము. ప్రాణియొకనియందుండు చైతన్యముబుద్ధిలేక తత్త్వమును గ్రహించజాలక అల్పమును పూర్ణమని భావించుజ్ఞానము తామసజ్ఞానమనబడును. నియతమై ఫలకాంక్షలేక సంగరహితమై రాగద్వేషములులేక చేయు కర్మసాత్త్వికమనబడును. కోరికలుగలిగియో యహంకారముతోనో యధికప్రయాసతో చేయబడుకర్మ రాజసమనబడును. మోహముచేత యోగ్యతను, ఫలమును, యితరులకు నష్టమును, హింసయును గమనించక చేయబడుకర్మ తామసమనబడును. అనురాగములేక అహంకారరహితుడై ధైర్యోత్సాహములతోగూడి సిద్ధ్యసిద్ధులయందు నిర్వికారుడై యుండువాడు సాత్త్వికకర్తయనబడును. రాగయుక్తుడయి కర్మఫలమును బొందగోరి ద్రవ్యాకాంక్షగలిగి హింసించుచు ఆచారహీనుడయి సుఖదుఃఖములకు బెరగగువాడు రాజసకర్తయనబడును. విరుద్ధమై, పామరుడై, స్తబ్ధుడై, శఠుడై క్రోధయుక్తుడై సోమరియయి, విషాదముగలిగి జాగుచేయువాడు తామసకర్తయగును. బుద్ధిధైర్యము గుణభేదముల వల్ల మూడువిధములైనవి. వానిని విశేషముగా వేరుపరచిచెప్పెదను. అర్జునా! వినుము. ప్రవృత్తి, నివృత్తులను కార్యాకార్యములను భయాభయములను బంధమోక్షములను దెలియుబుద్ధి అర్జునా! సాత్త్వికమనబడును. ధర్మాధర్మముల కార్యాకార్యముల యథార్థమును దెలియ నేరనిబుద్ధి రాజసమనబడును. అజ్ఞానముచేత కప్పబడి అధర్మమును, ధర్మమని భావించుచు సమస్తపదార్థములను వ్యత్యస్తములుగా దలచు బుద్ధి అర్జునా! తామసమనబడును. మనఃప్రాణేంద్రియక్రియలను యోగాభ్యాసముచేత నిగ్రహించు నచంచలమైన మనోధైర్యము సాత్త్వికమగు. ఫలకాంక్షగలిగి ధర్మార్థకామముల నెడతెగక గోరువానిధైర్యము రాజసమగు. దుర్మతిబుద్ధిచే నిద్రను, భయమును, శోకను, మదమును విడువనివానిధైర్యము తామసమనబడును.

అర్జునా! త్రివిధములైన సుఖములను నావల్ల వినుము. అభ్యాసమున సంతోషమును గలిగించు దుఃఖోపశమనము జేసి ప్రారంభమున విషప్రాయమై, అంత్యమున నమృత తుల్యముగా నుండు సుఖము, ఆత్మయొక్క సుఖానుభూతమైన జ్ఞానమువల్లగలిగిన సుఖము సాత్వికమనబడును. విషయేంద్రియ సంయోగభూతమై ప్రారంభమున యమృతమువలెనుండి వెనుక విషముగానుండు సుఖము రాజసమనబడును. ప్రారంభమున, అంత్యమున, నిద్ర ఆలస్యము ప్రమాదమువల్ల గలుగుసుఖము ఆత్మకుభ్రాంతి పుట్టించి తామసమనుపించుకొనును. ప్రకృతివలనబుట్టిన ఈ త్రిగుణములకు లోపడని ప్రాణిపృథ్విలోగాని, స్వర్గలోకముగాని, పాతాళమునగాని లేదు.

వారి ప్రకృతివల్లబుట్టిన గుణములననుసరించి బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులకు, అర్జునా! కర్మములేర్పడి యున్నవి. శమము, దమము, తపము, శౌచము, క్షమ, ఆర్జవము, జ్ఞానము, విజ్ఞానము, దైవభక్తి నివి బ్రాహ్మణునికి స్వభావసిద్ధములు. శౌర్యము, తేజము, ధృతి, దక్షత, యుద్ధమున పారిపోవకయుండుట, దానము, ప్రభుత్వము, క్షత్రియులకు స్వభావసిద్ధములు. కృషి, గోరక్షణము, వాణిజ్యము, నివి వైశ్యులకు స్వభావసిద్ధధర్మములు. శూద్రులకు సేవస్వభావసిద్ధమైన ధర్మము. మానవుడుతన నిజధర్మమునందాసక్తి గలిగియుండిన సిద్ధిబొందును. అదికలుగు విధము వినుము. ఎవనివల్ల సకలభూతములు బుట్టునో యెవఁడీదృశ్యమును వ్యాపించియున్నాడో, యట్టి ఈశ్వరుని స్వకర్మానుష్ఠానముచేత బూజించిన సిద్ధిబొందును. చక్కగా చేయబడిన ఇతరులధర్మముకంటె గణ్యతలేని స్వధర్మము శ్రేష్ఠము. తన స్వభావమునకు విధింపబడిన ధర్మమును జేయువానిని పాపములుజెందవు. అర్జునా! స్వభావజన్యమై కులధర్మము దోషయుక్తమైనను విడువకూడదు. అగ్నిని పొగగప్పిన రీతి సమస్తకర్మలును దోషమావరించియున్నవి. సర్వత్రయసంగబుద్ధిగలవాడై, ఆత్మనిగ్రహముగలిగి, సకలాశనువదలి సన్న్యాసమువల్ల ఉత్కృష్టమైన నైష్కర్మ్యసిద్ధిని పొందును. అట్టిసిద్ధిని పొందినవాడు పరబ్రహ్మమును బొందుటకుదగిన పరమోత్కృష్ట జ్ఞాననిష్ఠను నావల్ల, అర్జునా! సంగ్రహముగా దెలియుము. విశుద్ధమైనబుద్ధియుక్తుడై ధైర్యముతో మనస్సునునియమించి, శబ్దాదివిషయములనువిడిచి, రాగద్వేషములనావల ద్రోసి, ఏకాంతనివాసియై వాక్కాయమానసములను నియమించి నిత్యము ధ్యానయోగపరుడై వైరాగ్యమునాశ్రయించి, అహంకారము, బలము, దర్పము కామక్రోధములను బారవైచి, మమతాదిరహితుడై శాంతుడైనవాడు పరబ్రహ్మభావమును పొందుటకు

నర్హుడు. బ్రహ్మనిష్ఠుడై ప్రసన్నాత్ముడైనవాడు శోకించడు కోరడు. సర్వభూతములకు సముడై నాయందుత్తమభక్తిగలవాడగును. భక్తిచేత నాతత్వమును, నే నెవ్వఁడ, నేనే మైనది దెలియును, నాతత్వము దెలిసి నన్ను జేరును. సకలకర్మల నెల్లప్పుడు జేయుచు నన్నే యాశ్రయించి నాయనుగ్రహముచేత శాశ్వతమైన, నాశరహితమైన స్థానమును బొందును. సకలకర్మలను మనసా నాకర్పణముజేసి నాయందాసక్తిగలిగి బుద్ధియోగము నాశ్రయించి నాయందే మనసుగలవాడవగుము. నాయందు మనస్సునుంచిన నాయనుగ్రహముచేత సకలవిఘ్నములు బాయును. అహంకారముచేత దీనిని జెవిని బెట్టకపోయె వేని నీవు నశింతువు. అహంకారావిష్టుడై నేను యుద్ధము జేయనని సంకల్పించుచున్నావు. నీనిశ్చయము వ్యర్థము. ప్రకృతి నిన్ను నిర్బంధపెట్టును. అర్జునా! ప్రకృతివల్ల గలిగిన నీస్వకీయమైనధర్మముచేత గట్టుబడియవివేకమున దేనిని చేయగోర నిచ్ఛయించవో దానిని నీవు యత్నములేకనే జేసిదీరుదువు. సర్వప్రాణుల హృదయములందు అర్జునా! ఈశ్వరుడుండి తనమాయాశక్తిచేత కుమ్మరివానిచక్రముమీద నెక్కినరీతి సర్వభూతములను దిరుగునట్లు జేయుచున్నాడు. అర్జునా! సర్వభావముల నాతని శరణు బొందుము. అతని యనుగ్రహమువలన కేవలశాంతిని బొంది నిత్యమైన స్థానముజేరుదువు. ఇట్లు రహస్యములలో పరమరహస్యమైనజ్ఞానము నాచేత నీకు చెప్పబడినది. దానిని వివరముగా విచారముజేసి నీకిచ్చవచ్చినట్లు నడుచుకొనుము. అన్నిటికంటె పరమ రహస్యమైనమరియొక నాయుత్కృష్టవాక్యమును వినుము. నీవు నాకు పరమప్రియుడవు, ధృఢభక్తుడవు గనుక నీహితముకొరకై నేనుపలికెదను. నాయందు నీమనసును నిలుపుము. నాభక్తుడవుకమ్ము. నాకొరకు యజ్ఞము చేయుము. నాకునమస్కారము చేయుము. నీవు నన్నే బొందుదువని ప్రతిజ్ఞ చేయుచున్నాను. ఇది నిశ్చయము. నీవు నాకు ప్రియుడవు. సర్వధర్మములను పరిత్యజించి నన్నొకనినే శరణుబొందుము. దుఃఖింపకుము. సర్వపాపవిముక్తునిగా జేయుదును. దీనిని తపస్వులుగానివారికిని, భక్తులుగానివారికిని, వినశ్రద్ధలేనివారికిని, నాయందసూయపరులకును, నుపదేశింపదగినది కాదు. ఈపరమ రహస్యమును నాభక్తులకుదెలుపువాడు నాయందు పరమభక్తిజూపినవాడై నిస్సందేహముగ నన్ను జెందును. వానికంటె నాకు నెక్కువైన భక్తిసలుపువాడు నరులలో వేరవడు లేడు. మరియు వానికంటె పృథ్వీమీద నాకుప్రియుడుండడు. ఈ మనపావన సంవాదమును జదువువాడు జ్ఞానయజ్ఞముచేత నన్ను బూజించినవాడని నాయభిప్రాయము. ఏవడసూయతలేక భక్తి, శ్రద్ధలచేత దీనిని వినునో వాడు పాపవిముక్తుడై పుణ్య

పురుషుల దివ్యలోకమును జేరును. అర్జునా! ఏకాగ్రచిత్తముచేత దీనిని నీవు వింటివి గదా! నీయజ్ఞానజన్యమైన మోహము, అర్జునా! వీడినదిగదా! నాకు చెప్పుము.

## అర్జునుని వాక్యము.

అచ్యుతా! నా మోహము తొలగినది నీయనుగ్రహముచేత జ్ఞానము లబ్ధమాయెను. నేను దృఢముగానున్నాను. నాసందేహములు నివర్తించెను. నీయాజ్ఞప్రకారము నడిచెదను.

## సంజయుని వాక్యము.

పులకాంకురము గలుగజేయు నీయద్భుతమైన శ్రీకృష్ణార్జునుల సంవాదము నేను వింటిని. యోగీశ్వరులైన శ్రీకృష్ణులు సాక్షాత్కారముగా జెప్పిన పరమోత్కృష్టమైన యీ పరమ రహస్యమగు యోగశాస్త్రమును శ్రీవేదవ్యాసుల యనుగ్రహమువలన నేను వింటిని. హే రాజా! ఈయద్భుతమైన పవిత్రమైన శ్రీకృష్ణార్జునులసంవాదము స్మరించి స్మరించి మాటిమాటికి ఆనందించుచున్నాను. ఓ రాజా! మరియు నాయత్యద్భుతమైన శ్రీకృష్ణమూర్తియొక్క విశ్వరూపమును స్మరించిస్మరించి నాకు యధికమైన ఆశ్చర్యము గలుగుచున్నది. మాటిమాటికి ఆనందించుచున్నాను. ఎచ్చట యోగీశ్వరుడైన శ్రీకృష్ణమూర్తి యున్నాడో, ధనుర్ధరుడైన అర్జును డున్నాడో అచ్చట సంపద, జయము, ఐశ్వర్యము, సిద్ధమైయుండును. ఇది నాయభిప్రాయము.

ఇట్లు శ్రీదివ్యభగవద్గీతలయందు మోక్షసన్యాస యోగమను పదునెనిమిదవ యధ్యాయమునకు మంగళము.

ఓం శ్రీకృష్ణార్పణమస్తు.

124. గొప్పకార్యములందువలె చిన్నకార్యములందుగూడ నిగ్రహము నభ్యసించి సాధించవలయును.

125. భూషణములేని చిన్నకార్యములయందే జీవుని యోగ్యత శోధించడమగును.

126. అనుదినము మనచుట్టునుండునవి చిన్నకార్యములే. గొప్పవి యరుదుగా వచ్చును.

127. అభ్యాసియగు ముముక్షువు దేనినైన దయారహితముగా జూడకూడదు.

128. దానియోగ్యతానుసారము దయ దానికి జూపవలయును.

129. ప్రతిప్రాణికి స్నేహితునిగా నుండవలెను.

130. జీవించు ప్రతిప్రాణికి ప్రియుడుగా నుండవలెను.

131. లోపలనుండు తిరస్కారమె వెలుపల హానిగా ప్రసరించును.

132. మనమితరుల శత్రువులగనుక వారు మనకు శత్రువులు.

133. మనము హింసజేయ బూనుకొనుచున్నాము గనుక ప్రాణులు మనలను మరల హింసించును.

134. ప్రాణుల స్నేహితులుగా నుండుట మనధర్మము. అయితే మనము వాటిని నశింపజేయుచున్నాము.

135. అప్పుడు ప్రాణులు మనలను జూచి పరుగిడిన మనమాశ్చర్యపడుదుము.

136. మనయజ్ఞానాంధకారమువల్ల బహిఃప్రపంచమున మనము జూచుద్వేషమంతయు మనలోనుండు దుర్గుణ ప్రతిఫలమేయని మనమెఱుంగము.

137. కేవలసుహృదునకు నసూయకరమైనది యుండదు. ఏదియును హానిగూడ జేయదు.

138. కేవలప్రేమగలవాడు కారడవినైన నేహానియులేక తిరుగనగును.

139. అట్లు క్రమక్రమముగా లోకమున నిర్భయముగా వర్తించుటకు మనము నేర్చుచున్నాము.

140. మనకు కెవరైన హింసజేసిన మనపూర్వజన్మసంచిత పాపఫలమని మనకు దెలియును.

141. జీవనమును, శక్తిని, సామర్థ్యమును ప్రతిమనిషి గలిగియున్నాడు.

142. వీటివల్ల మనిషి కార్యములను సాధించవలయును.

143. అల్పఫలములను, నుత్కృష్టఫలములను వీటివల్ల మనిషి సాధించును.

144. మొదలు లౌకిక కార్య సాధన జేసి వెనుక జ్ఞాన కార్యములను సాధించును.

145. వాటి నైజస్వభావమును మారునట్లు చేయక వాటిని నిర్మలముగా మార్చును.

146. జ్ఞాని యీశక్తులను గ్రహించి బలవత్తరములైనవని దెలిసి, ఉపయోగకారియని యు అవశ్యకమైనవని యు నెఱిగి గుర్తించి తదేకనిష్ఠతో మనఃపూర్వకముగ శుద్ధిజేయుచు నిర్మలము గావించుచు మార్చును.

147. తనమార్గమును గనిగుర్తెఱిగి, తనమనోభీష్టమును బొందుటకు సావధానముగ బ్రయత్నించును.

148. యజ్ఞవిధి దైవలీల ననుసరించి యున్నది.

149. కేవలానంద స్వరూపమైన దైవలీలవల్లనే యీప్రపంచసృష్టియను నుదారయీవి గలిగినదని తెలియవలయు.

150. గనుక సకలసృష్టియొక్క యుద్దేశము ఆయానందరసానుభవప్రాప్తియై యుండవలశివచ్చినది.

151. ఈవిఅనగా దానమునందు పరమసంతోషమున్నదని మననుభవ వేద్యముగ జేసుకొనవలెను.

152. శుద్ధాంతఃకరణము ప్రబలమైనకొల్ల నానందము వృద్ధికావలెను.

153. మలినాంత కరణమున నుండు రాపిడివల్లనే దుఃఖములు కలుగును.

154. అజ్ఞాననివృత్తియే దుఃఖముయొక్క ప్రయోజనము.

155. స్వసుఖాన్వేషణము తప్పక దుఃఖమునందంతమగును. దానిని వంతట సుఖము నెలపు గుణముగా ప్రసరింపజేయవలెను. దానివలన నొకడు బొందినదియంద రనుభవింతురు.

156. నియమెను ననుసరించి యుండు లోకమున న్యాయమార్గానుసరణము శాంతిని ఆనందమును తప్పక కలిగించవలెను.

157. ఇసుమంత విరోధమున్నను న్యాయమార్గానుసరణమునన్యూనత యున్నదని సూచించును.

158. కలిగినందుకు సంతోషము దానమువల్లనగును గాని దాచినందువల్ల గాదు.

159. తనకుమాత్రముండిన సంతోషమగునని యొకసమయమున దలచినవాడు ఇతరులకిచ్చుటవల్లనే సంతోషముగలుగునని యనుభవవేద్యముగ దెలియును.

# శిష్యశోధన.

## 'గురువులేనివిద్య గురుతుగా దొరకదు'

ఒక అడవియందు పక్షులు తమతమగూళ్లను చేరుచుండెను. వాటి కిచకిచ ధ్వని క్రమక్రమముగా తగ్గుచువచ్చెను. సుందరములైనపక్షులు చెట్లరెమ్మలమీద నొకటొకటిని తరుమ చాలించెను. ఐనను ఏదోయొక తోడుపక్షి రాకకై కూయబడుచున్న ధ్వనులుమాత్రము వినవచ్చుచుండెను. సంధ్యారాగము విలీనమగుట కుపక్రమించెను. ఒక జంబివృక్షముక్రింద ఒక తాపసోత్తముడు పద్మాసనాసీనుడై, తనహస్తములను మోకాళ్లపైనునిచి, దేహమును సమముగానిల్పి నిశ్చలమైనదృష్టితో ధ్యానారూఢుడై యుండెను. అచ్చట హఠాత్తుగవచ్చిన నాస్తికునికూడా కేవలభక్తిపరాయణుడై సాష్టాంగవందనము లాచరింపజేయునట్టి అనుగ్రహశక్తిగలిగినదై, ఉగ్రరూపములైన మృగములుకూడ ఆతాపసునివద్దను భయముతోను, ప్రేమతోను జేరునంత గంభీరమైన నిశ్శబ్దమాయడవియందు ఆసమయమున ఆవిర్భవించియుండెను.

ఇట్టిసమయమున ఆతాపసుని అంగవస్త్రమున విశ్రమించియున్న లేడియు తటాలున తలను నిక్కబెట్టి భయభ్రాంతులను ప్రదర్శింప నారంభించెను. మొదట గుబగుబధ్వని చిన్నగవినవచ్చెను. తర్వాత దూరమున మనుష్యుల శబ్దమయ్యె. తర్వాత రౌతులపదధ్వని సమీపించెను. త్వరలోనే పరివారమంతయు కంటికిపడిరి. ఆపరివారము వెంటనుండిన యతనిదేహమున ధరించియున్న నవరత్న ఖచితమైన మకరకుండలాద్యాభరణములనుబట్టి యాతడు ఒకరాజపుత్రుడుగ నుండవచ్చునని ఊహించవచ్చును.

చెట్టుక్రిందనున్న తాపసోత్తముని చూడగానే ఆరాజపుత్రుడు తనపరివారమంతయు దూరముననుండ సైగచేసి, తానుమాత్రము ఆతాపసోత్తమునియొద్దకు వెళ్లెను. శాంతుడై గంభీరుడైన మహానుభావుని సమీపించగానే, కేవలభక్తిపూర్వకంబుగ నారాజపుత్రుడు నతనిముంగల సాగిలపడెను. తర్వాతకొంతసేపునకులేచి చేతులుమోడ్చి, వ్రేలవేసిన ముఖముగలవాడై, భక్తితోపూజించువాడై చిత్తరువువలె కాచియుండెను.

ఆతాపసోత్తముడు నిశ్చలుడైయుండెను. కొంతసేపటికి కన్నులుదెఱచి కృపాదృష్టితో రాజపుత్రుని చూచెను.

'స్వామీ మీకువందనము. నేను దూరరాజ్యమునుంచి వచ్చినాను. నా పేరు కేతుడు. నేను రాజపుత్రుడు, యువరాజు, తమఅనుగ్రహామునకై ఇచ్చటికి వచ్చినాను. తమకీర్తిని నేను వినినదిమొదలు నాకు మనోవిశ్రాంతిగాని నిశ్చలతగాని లేదు. నానగరులోని వైభవమింతుకయైన నాకురుచింపదు. భార్యాపుత్రమిత్రులునన్ను సంతోషపెట్టజాలరు. సార్థకమైనజన్మముగా జేసుకొనవలయుననియు శ్రేష్ఠమైన ఆనందమును పొందవలయుననియు నాకుగొప్ప ఆశగలిగినది. నన్ను తమశిష్యునిగా గైకొనవలయు, నాకంటె భక్తివిశ్వాసముగల శిష్యుడు మీకుదొరకడు' అని రాజపుత్రుడు విన్నవించెను.

ఆతాపసోత్తముడు శాంతమైనచలించని దృష్టిని ఆరాజపుత్రునిమీద నిలిపి యుండెనుగాని నోరుతెఱచి ఒకపలుకును పలకలేదు. అప్పుడు రాజపుత్రుడు మరల విన్నవించుచున్నాడు.

'ఓమహానుభావా! నాతోపలుక దయరాదా? అంతనుకూడ యోగ్యతగలవాడను గాదా? చిన్ననాటినుండి మాలిన్యములేని జీవనముచేయుచు, ధర్మమునుష్ఠించుచు న్యాయశాస్త్రానుసారము, వర్తించుచున్నాను. నా దేశపు నీతివాదుకలనుసరించి కాలముగడపుచు శాస్త్రములను పరిశీలించినాను. తమఅనుగ్రహపాత్రుడగుటకు ఇదిచాలదా? తమశిష్యునిగా నన్నంగీకరించకూడదా?

'తగవు' అనిమాత్రము చెప్పెను.

'తమ ఆజ్ఞానుసారము వర్తించెద. ఈయనుగ్రహము కలుగుటకు నేనేమిచేయవలయును దయచేసిచెప్పుడీ, ఓమహానుభావా'

'వెదకుము. నీకుదొరకును'

'ఏమిదొరకును' అని రాజపుత్రుడు దీనుడై ప్రార్థించె.

ఆతాపసోత్తముడు బదులుచెప్పక యుండ, రాజపుత్రుడు విన్నవించసాగెను. 'దేవరవారిచిత్తము, కాని, వెదకెదను. ఇది తామనుగ్రహించిన యొకపరీక్షగా నుండవచ్చుననినాకు నిశ్చయము'

'ఉండవచ్చును.'

'తమయొద్దకు మరల నెప్పుడు రావు ఉత్తరువగునో.'

'వర్షాకాలముగడచిన ఏడు పౌర్ణిమలకు.'

ఆ ఆజ్ఞను శిరసావహించి, జేతుడు మారాడక, సాష్టాంగముగ సాగిలపడి చాలాకాలమునకు పైకిలేచి తిన్నగమరలెను. తనవెంటవచ్చిన పరివారమంతయు రాజపుత్రునివెంట రాజ్యమునకుమరలెను. ఎప్పటివలె నిశ్శబ్దము ప్రబలెను. భయముచే హెచ్చరికతోయుండిన లేడియు తనతలను తాపసోత్తముని తొడపైనిడుకొని తన పిల్లతోకూడా నెమ్మదిగ నిద్రించెను.

ఆతాపసోత్తముడు మరల సమాధినిష్ఠుడయ్యె.

* * * * *

వర్షాకాలమయిన వెనుక ఏడుపౌర్ణిమలు గడచెను. ఆదేజంబివృక్షముక్రింద తాపసోత్తముడు కూర్చొనియున్నవాడు.

సూర్యుడట్టనె అస్తమించెను. నల్లనిమేఘములాకసము నావరించెను. తుపానొకటి కొట్టునట్లు చిహ్నలగుపడెను. ఉష్ణముగాను, ఉమ్మరముసహించ శక్యముగాకయుండెను. అడవియందలి నివాసులన్నిటికి ఏదోయొక గూఢమైనచపలత యొకటి తోచుచుండెను. అనేకులు ఆతాపసుని శరణునొచ్చియుండిరి. అనేకపక్షులు ఆచెట్టుయొక్క కొమ్మలమీద గుంపులుగుంపులుగా గుమిగూడియుండెను. ఒక చిన్న చిరుత అతనివద్దరాబోవు తుపానునెఱుగక చెల్లాటలాడుచుండెను.

త్వరలోనె అంతభయంకరమైన ఒకతుపానుకొట్టసాగెను. అధికమైనవానవచ్చి చెట్లన్నియు సమూలముగ వంగిమూలుగునట్లు కనబడెను. జంబివృక్షమును మాత్రము వానతాకలేదు. ఒకనీటిబింధువైన దానిమీదపడలేదు.

తుపానుచెలరేగి చుట్టుప్రక్కల మోచుచుండెను. అయితేస్థైర్యమైన మనస్సు గలవానిని ఎట్టితుపాను తడయనోపదు. సంధ్యాకాలము సమీపించగానే రాజపుత్రుడైన జేతుడు ఆతాపసోత్తముని పాదములను సమీపించెను.

‘ఓభాగవతుడా! అతిఆతురముతో వేచియున్న సమయమిప్పుడు తటస్థించినది. మరలమరల ప్రాతస్సంధ్యలు అనేకములు కడచినవి. బహుసైరణతో కాచియున్న జన్మసార్థకమైన సమయమిప్పుడు కలిగినది. దయచేసి అనుగ్రహింపుమా, మహానుభావా. తాము అనుగ్రహించిన పరీక్షలు నాకు తటస్థముకాలేదు. నేను పూర్వము వలె నియతాచారపరుడై, ధర్మముదప్పక సకలవిధములైన నిగ్రహములను వ్రతములను సలుపుచు, విషయభోగములందు దాసీనభావమును వహించి. నానగరులోని భోగ

భాగ్యములందుగూడ అపేక్షలేనివాఁడై, ఏకాంత నివాసియై సదాధ్యానపరుఁడై యుంటిని. ఇప్పుడైనను నన్ను తమశిష్యునిగ చేకొనెదరా?'

'తగవు!'

అంత జేతుఁడు భయభ్రాంతచిత్తుఁడై, తనపంగొనతో తనముఖమును మూసుకొని, కన్నీరుకార్చుచు చాలా కాలము నోరు తెరవక ఊరకుండెను.

తర్వాత తత్తరపాటు నొందుచు భయముచే వణఁకుచు సన్నగ విన్నవించ సాగెను.

'తమ సేవకునితో మాటాడి నను గ్రహించకూడదా? మహానుభావా! ఇట్లు తిరస్కరించుటకు కారణము దయచేసి సేవకునికి దెలుపరాదా?'

అప్పుడు ఆతాపసోత్తముఁడు నిశ్చలమైనస్థితినుంచి కదలి, జేతునిచూచి గుఱ్ఱుమనుచున్న చిరుతను చేతితో తడవి తప్పుమనిట్లనెను. ఊరకుమ్మనిపిలిచెను. ఆమహానుభావుని మాటలనువినుటను శాంతమయ్యెనో యన వాయువుకూడ నిశ్చలమయ్యెను.

'ఘనుడైన రాజకుమారుడా నీకుతటస్థించిన శోధనలు సాధారణముగ ప్రపంచములో చెప్పకొనునవి కావు. నీభాగ్యలను భోగములను త్యజించుమని యు సన్యాసివలె సకలవిధములైన కష్టముల వ్రతముల పాలగుమని నేను నీకుచెప్పలేదు.

'వ్రతములెన్నియైన పట్టివిస్మృతికాని, ఆత్మవిస్మృతిగాని వలవికాదు.'

నీపురాకృతకర్మవల్ల నీకు తెలియకనే నీస్వభావము ననుసరించి ఆశోధనలు కలిగినవి. వాటిలో నీవుతప్పిపోతివి. నినగరునకువెళ్లి ధార్మికుడవై జీవించుటతో తృప్తిపొంది యుండుము. శిష్యుడగుటకు నీవింకను తగవు.

అంత జేతుడు చేయునదితోచక వివర్ణవదనుడై విన్నవించెను.

'ఓ భాగవతుడా! నేనుతప్పిపోయిన శోధనలను దయచేసి తెల్పుదురా? దానివల్లనాకు అవమానమెక్కువైనను, జ్ఞానాపేక్షతో అడుగుచున్నాను.'

'కాని చెప్పుచున్నాను.

పూజకన్నమంచి బుద్ధినిదానంబు, మాటకన్న నెంచ మనసుదృఢము
కులముకన్న నెంచ గుణముప్రధానంబు

నీమొదటి శోధన కుత్సితఛిద్రము నీతండ్రి కొలువుకూటమున నీనగరులో నీవు చేయని తప్పితము నీమీదమోపబడినది జ్ఞాపకమున్నదా? అందరికి యథార్థము తెలియు వరకు ఓర్పుతో నుండకను నీవు కర్మానుసారము ప్రాప్తమైన ఋణముతీర్చవలెనని

దీనినివిషయములో అనుభవించకను నీవునిరపరాధియనియు ఇట్లునిందించినది తప్పనియు నీసుశీలమును స్థాపించుకొనుటకై యత్నించితివికదా? ఇది మొదటితప్పు.'

'ఈ అపనింద వాస్తవమైయుండిన ఓర్చియుందును. నేను నిరపరాధియని దృఢముగా తెలిసియుంటిని.'

'లోకమున ధార్మికుడైన మంచివాడు ఇట్లు తన నిరపరాధత్వమును స్థాపించి అపనిందను తప్పించుకొనవచ్చును. అయితే నివృత్తిమార్గాసక్తుడై, నాశిష్యుడగుటకు యత్నించువాడు స్వగౌరవరక్షణకై యొకమాటనుకూడ చెప్పక అధర్మమును, అపనిందను సహించవలసినది.

మానావమానయోస్తుల్య స్తుల్యోమిత్రారిపక్షయోః
సర్వారంభపరిత్యాగీ గుణాతీతస్సఉచ్యతే.

అన్నట్లు కీర్తికిరీటమునుగాని అపకీర్తిబొంతగాని ధరించుటకు స్థైర్యముగలవాడుగా నుండవలయు.'

' జేతుడు తమచిత్తమని తలవంచెను.

'రెండవశోధనయందు తప్పిపోయినందుకు కారణము నీ అహంకారము' ప్రేమయందు మమకారము. యాచుడనువానిని నీవలె ప్రేమించుచుంటివి కదా? వానికి నీకు అనుబంధము ఎక్కువగనుండెను.

ఒకనాడు వేగాకుడు తనస్వకార్యసిద్ధికై యాచుని సహాయమునుగోరి వానిని పిలుచుకొనివెళ్ల మీతండ్రియాజ్ఞకై కొలువుకూటమునకు రాగా నీవు ఉదాసీన భావము గలవాడై నీలో పెరుగుచున్న కలుపుతీసివేయక అనగా యాచుని వానికై ప్రేమించక వానితోటి సఖ్యము నీకు ప్రియకరమగునను భావముతో ప్రేమించుచు, ద్వేషముగల వాడై భల్లికునియెడ కోపాగ్ని నెరపి వానిమనోరథమునకు అడ్డగింపు చేసితివి.'

'భల్లికుడు యాచుని తనస్వప్రయోజనమునకై ప్రేమించుచుండెనని నాకు తెలిసి యుండెను. భల్లికుని కుత్సితయత్నములకు యాచుడు పాలుగాక యుండునట్లుగా యాచునికి హెచ్చరిక చెప్పుట నాధర్మము కాదా?'

"భల్లికుని స్వప్రయోజన పరత్వస్నేహితము కాలక్రమమున పరిశుద్ధతకు రాదని నిశ్చయముగ చెప్పగలవా? ఎప్పుడో ఒకప్పుడు ఈ స్నేహము నిష్కపటముగ పరిణమించదనుకొంటివా? అదియునుగాక రాజపుత్రుడా! ప్రపంచమున తన గౌరవమును

ధర్మాత్ముడైన మంచివాడు కాపాడుకొనుటకు తనప్రియమైన పదార్థములను కాపాడు కొనుటకు ప్రయత్నించవచ్చును. జ్ఞానియు, నివృత్తిమార్గాసక్తుడై నాశిష్యుడుగా కావలెనని కోరువాడు, తనప్రియమైన వస్తుజాలమంతటిని త్యజించవలయును. హృదయమున అనాదిగా నాటియుండు స్వాభిమానమును, అహంకారమును, ఈర్ష్యాసూయలను వ్రేళ్లతోగూడ పెళ్లగించిపారవేయవలెను, తనపరమమిత్రుని మానభంగమునుకూడ నించుకయైన అసూయచూపక సహించవలయును.

‘ఓ రాజకుమారుడా! రాజైననీతండ్రియొక్క భాగ్యము, ఇంద్రియసుఖములు ఆత్మప్రశంససుఖముకూడ నీకు రుచింపవు.’ గనుక వాటిని నీవు విడిచినావన్న విశేషమేమియులేదు. నిజమైన త్యాగము చేయవలశినకాలము నీకుసంప్రాప్తమైనసమయమున నీధైర్యము చెడెను. ప్రశంసలను కోరక దానము చేయుత్యాగభావముయొక్క ప్రీతిని సంపాదింపజాలవైతివి.’

జేతుడు మరల తలవంచి కలతచెందినవాడై మరల నిట్లనెను.

‘మహానుభావా! మరల అనుగ్రహింపుమా! మరలనన్ను సిగ్గువచ్చునట్లు చేయుము! నన్ను అజ్ఞానరాత్రి ఆవరించియున్నది. ఇప్పుడు మనచుట్టునుండు చీకటికంటె దట్టమైయున్నది.’

“రాజపుత్రుడా! ప్రేమలేమిచే మూఢవతూరిపడిపోయినావు. నీభార్యలలో నందయనునది యొకగొప్పతప్పు చేసినప్పుడు, ఆమెయొక్క పసితనమునకు అజ్ఞానదశకు పశ్చాత్తాపపడక ఆమెను నీనగరునుండి వెడలగొట్టించితివి.”

‘స్వామీ! అట్టిసమయమున వేరువిధముగా నడచియుండవచ్చునా? నేరము చేసినచపలస్త్రీని నాప్రక్కనుంచనిమ్మటకంటె దానిని వెళ్లగొట్టి నాయొక్కయు, నా ఆస్థానగౌరవమును కాపాడినదిధర్మము కాదా? నాభార్యచేసినతప్పును తెలియక కండ్లుమూసుకొనిన నాదేవపునీతి తిరస్కరించినట్లు కాదా? నాపరిశుద్ధ నియమమునకు విరోధముకాదా?

‘రాజపుత్రుడా! పైమాటలను మరొకతూరిచెప్పవలెనా? ధార్మికుడైసద్గుణవంతుడైన జనుడు తనమంచిపేరును గౌరవమును నిలుపుకొనుటకు యత్నించవచ్చును. వాడువిచారణచేసి ఆలోచనచేసి శిక్షించవచ్చును. లేక సముఖమునుండి వెడలించవచ్చును. జ్ఞానియన్నవో తన అభిమతమును వెల్లడిచేయడు లోపమెందుకుకలిగెనని విచారించుచు మన్నించును. తప్పునుఎంచక ఆతప్పునుమన్నించు దోవను వెదకును.

సముద్రముననుండు జలబిందువులకంటె నధికమైన భూతదయపశ్చాత్తాపము అతని హృదయముననుండును.

"శుచిత్వమె ఒక సుగుణముకాదు. అదిచెడుగునుంచి వదలుకొనుటమాత్రమే జ్ఞాని దానిని ఒకవిశేషమని యెంచడు. నివృత్తిమార్గములో శుచిత్వము ఒక ఆటంకము గాగూడ నేర్పడును. శుచిత్వముతో ప్రేమదయ అను గుణములుగూడిన గాని అది గర్వము కఠినత్వము బహుళాగలిగించును. అప్పుడు శుచిత్వము పట్టి బూటకము అగును. సూర్యాస్తమయ సమయమున నీవెన్నడైన యాత్రలు చేయు నప్పుడు హిమాలయపర్వత ఉన్నతశిఖరములతట్టు నీదృష్టినిలిపితివా? అచ్చట ఘనీభవించిన మంచుగడ్డలమీద అతిమనోహరంబుగ ప్రసరించిన కాంతులసమూహములను శిఖరశృంగములను చూచితివా? అట్టిదే శుచిత్వము. ప్రేమలేని శుచిత్వము జీవునికి మృతప్రాయమైన కప్పు అని తెలియవలయు. ప్రేమ శుచిత్వముతోగూడిన పరమాత్మ జ్ఞానముపారను దోవయగును.'

జేతుడు కండ్లనిండ నీరుగార్చుచు మాటాడనూపక సాష్టాంగప్రణామముచేసి గద్గదస్వరముతో విన్నవించెను.

'స్వామీ! మరొకటి అనుగ్రహించుటకు ప్రసన్నుడవుకమ్ము. తమఅనుగ్రహము కలుగుటకై మరలప్రయత్నముచేయ ఆవతియిమ్ము. నేనెట్టు నడువవలయునని తాము కోరుదురో దానినిప్పుడు తెలిసికొనియున్నాను.'

'తథాస్తు' అని తాపసోత్తముడు అనుగ్రహించి కృపార్ద్రదృష్టితో రాజపుత్రుని జూచెను. అప్పుడు వనమంతయు ప్రకాశమానమైయుండ పక్షులు ఉదయమాయెనను భ్రాంతితో ఉదయరాగములు పాడసాగెను.

ఆపరివారమంతయు చీకటిలో దీపములంటించుకొని వెళ్లుచు అదృశ్యమయ్యె. జంబివృక్షముక్రింద తాపసోత్తముడు మరల సమాధినిష్ఠుడయ్యె.

*　　*　　*　　*　　*

జేతుడు రాజ్యమునకు వెళ్లిన కొన్నదినములకే, తండ్రిచనిపోయినందున రాజ్యభారమువహించి, సర్వకార్యములు యుక్తముగ నిర్వహించుచు ధర్మమునకు దయాళుత్వమునకు ప్రసిద్ధికెక్కినవాడయ్యె.

రాజ్యభారమువహించగానే మొదటయామునికి భల్లికునికి తగినమర్యాదలు చేసి సమీపమున చేరియొక నగరుకట్టించియిచ్చెను. వెనుక తనభాగ్యమైన నందను వెదికించి

తెప్పించి తననగరులోన పెట్టుకొనెను. ఈకార్యమొక గొప్ప విషాదమును కలిగించెను. తనతండ్రికాలపు నౌకర్లకు అతనియందు అగౌరవముకలిగి, అపనమ్మకములుహెచ్చి అతనికార్యములను పృచ్ఛచేయ సాగిరి. జనులహితమునకై న్యాయముగా ఉపయోగకరములైన కార్యములు రాజు చేయుచురాగా అతడు తనకిచ్చవచ్చినప్రకారముచేయు నవాబు అనిఎంచి మంత్రులు విసుకుకొనుచుండిరి.

గులాబిపువ్వుయొక్క పరిమళమునకై దానిముండ్లకొటులను సహించురీతి జేతుడు ఇట్టిరహస్యవేదనల నోర్చియుండెను. ఇటుండ రాజ్యమున కక్షి ప్రతికక్షి ప్రబలించి, జేతుడు నిరంకుశాధికారిగా నున్నాడనియు, ఆజంబివృక్షముక్రిందనుండు బిక్షగానిచెంత ఉపదేశముపొంది దేశమును నాశనముచేయుననుభీతిపుట్టించిరి. రాజద్రోహపుకూటమేర్పడి, దానికి జేతునితమ్ముడే రాజ్యమునపహరింపనిష్టపడి నాయకుడై జేతుని జంపయత్నముచేసినట్టు జేతునికి తెలిసెను. అరణుడనువానిని రాజునుజంపుటకు ఏర్పాటుజేసినది తెలిసి రాజుయొక్క స్నేహితులు వాడు రాజును తనబాకుతో పొడవబోవు సమయమున, జాగరూకులై పట్టుకొనివచ్చి రాజుఎదుట నిలిపిరి. అప్పుడురాజు

చంపదగినయట్టి శత్రుండుతనచేత, జిక్కెనేనికీడు నేయరాదు
పొసగమేలుజేసి పొమ్మనుటయేచాలు

అన్నట్లు చంపను వచ్చియుండినను క్రోధముతో చలించక ప్రియముతో అరదా! నన్నేల నాయనా! చంప నపేక్షించితివి? ' అని అడిగెను.

'నీవు రాజ్యమునకు ప్రమాదముగ నున్నావు. పూర్వాచారములకు విరుద్ధముగ నున్నావు. అన్ని పావనక్రియలను అనాదరించుచున్నావు. రాజ్యముయొక్క సౌఖ్యమును చెఱుపు ఆలోచనలను నెరపుచున్నావు.'

'భటులారా! ఇతడు నన్ను చంపయత్నించినను మంచిసంకల్పముతో నున్నవాడు. వీనిసంకెళ్లువిడదీసి సమీపమునకు తెండు' అని జేతుడు చెప్పెను.

భటులందుకు ఆశ్చర్యపడి, రాజుఆజ్ఞయిచ్చినట్లుచేయ 'అరణుని ఇక్కడనాతో విడిచి మీరందరు వెళ్ళుడీ' యని రాజు ఆజ్ఞాపించెను.

అంత తనస్నేహితులు భటులు భయపడి ఆలోచించుకొనుచు పోతూపోతు వెనుకకు పలుమారు తిరిగిచూచుచు ఆరాజుయొక్క ధైర్యమునకు వగచుచు వారిద్దరిని ఏకాంతముగవిడిచి వెళ్లిరి.

'Registered No. M 716.'

SWAN SERIES No. 3.

ఓం





A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఒక యాంధ్ర బ్రహ్మజ్ఞాన మాసపత్రిక.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 2.] సౌమ్యసంవత్సర శ్రావణం 5010, సెప్టంబరు 1909. [సంచిక 5.

విషయసూచిక.



చెన్నపట్టణము:

వైజయంతీ ముద్రాశాలయందు ముద్రింపబడినది.

మానేజరు, హంసవిలాస్, 296 లింగిశెట్టి వీధి, జార్జిటవున్, మదరాసు. అని వ్రాయవలెను.

సంవత్సరమునకు చందా 1 రూపాయ.

ఓం

# హంస.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 2.] | సౌమ్యసంవత్సర శ్రావణం 5010, సెప్టెంబరు 1909. | [సంచిక 8.

## మహాభక్తవిజయము.

### బుద్ధుడు.

---

ఇట్లు దేవతలు నాలుగురూపములను బుద్ధుడు చూచినవాఁడై, మహావిచారపరుఁడాయె. అంతనుమున్న తననగరిలోనుంచుకొని, ఎక్కడఁజూచినను స్త్రీలు, పుష్పములు, భోగములు, ఆహారములు, సకలవిధమనోహరములు నిండియుండ తిన్నమగపించ రాజు ఏర్పాటుచేసియుండెను. ఐనను దైవవిధి తప్పునే.

అనేక జన్మార్జితపుణ్యరాశి ఫలించకాలమాసన్నమై యుండ మనుష్యమాత్రుఁడు దానిని తప్పించజాలునే ?

ఒకనాఁడు తనవైభవములుమీర, గాయకులు తమసామర్థ్యమును జూపుచుండ బ్రాహ్మణులనాదరించుచు, వనములవిహరించుచున్న సమయమున, తనభార్య యశోధర ఒకకుమారునిగన్న పుత్రోత్సవము తండ్రి చెప్పపంప, 'మరియొక ప్రతిబంధకము కలిగినదని' బుద్ధుడు చాలావిసుకొని నిట్టూర్పువిడిచెను.

రాజు ఆసమాచారమునువిని నామనుమనికేమ పేరని చారుని యడుగ వాఁడు జరిగినసమాచారము జెప్పెను. దానినివిని నామనుమనిపేరు రాహుల (ప్రతిబంధకము) యని యుండుగాక యనెను.

సిద్ధార్థుడు చింతజేయుచు వ్యసనాక్రాంతుఁడై యిల్లు జేరను. పట్టణమున నాశిశువు కలిగినందుకు, రాజునకుమనుములు లేకుండినందున జనులు చాలాసంతసమును చెందిరి.

గౌతముడు పట్టణము బ్రవేశించ గొప్ప ఉత్సవము అయెను. తనబంధుజనులు చాలా సంతోషపడుచుండ నతడు పట్టణము బ్రవేశించెను. అప్పుడ నేక వాద్యములు ధ్వనించుచుండ నొకధ్వనిమాత్ర మతడు గమనించివినెను.

గౌరవమైన పతివ్రతయైన కిసాగౌతమి యనునతని చెల్లెలతనినిజూడ మేడమై యుప్పరిగమీదనిలిచి సిద్ధార్థుని సౌందర్యమును, గాంభీర్యమును జూడగోరి యతనిని జూచి చాలాసంతసమంది

'ఇట్టిమహానుభావుడైన ధీరను
బొందినతల్లి ధన్యురాలు
బొందినతండ్రి ధన్యుడు
బొందినభార్య ధన్యురాలు.'

అని బిగ్గరగా గానముజేయ నది సిద్ధార్థుడు విని యతడిట్లువిచారించెను. ఇటువంటి వానినిజూచిన తల్లిమనసుసుఖముబొందును, తండ్రిమనస్సు సుఖపడును, వానిభార్య మనస్సు తృప్తియగును. ఇట్లుఆమె చెప్పెనుకదా ? దేనివల్లనీసుఖము శాంతి సాధింపనగును. ఈపాటను విననాకు నేర్పదో చిననీతి యమనోహరముగ నున్నది.

తర్వాత తన మెడనున్న 100వేల రూపాయలు వెలగల హారమునుదీసి యామెకు బంపెను. దానితో చాలాసంతోషపడి యామె సిద్ధార్థుడు తన్ను ప్రేమించినాడని యనుకొనెను. అయితే రాజకుమారుడు సరకుగొనక తనయిల్లుజేరెను.

తర్వాత స్త్రీలు దివ్యవస్త్రములను ధరించి తమ వాద్యములను దీసికొని వరుసగానిలిచి పాడవాడ నారంభించిరి. అయితే ప్రపంచవాసన లేని యారాజకుమారుడు నిద్రబోయెను.

స్త్రీలుకూడ వానినిజూచి మేమెవరికిగాను పాడుచుంటిమో యతడునిద్రబోవ మేముకూడ నిద్రపోదమని నిగురించిరి.

ఆనాడు అర్ధరాత్రిసమయమున గౌతముడు నిద్రమేల్కొని కూర్చొనెను. దీపములుసువాసననూనెలతో మండుచుండెను. తనచుట్టు ననేక స్త్రీలు తమవెంట్రుకలు చెదరి, వస్త్రములుచెదరి, కొందరినోటబురుగును, కొందరు పండ్లనుకొరుకుచు, కొందరు ఆవులింపుచు, కొందరుగొణుగుచు, కొందరు నోరుతెరచుకొనిపడియుండజూచి చాలా విసుకుజెంది ఘోరమైనయాకారములనుజూచి కామభోగములయందు కేవలవిరక్తిబొంది, అపుడు • రాజగృహము అసహ్యమైన శవములుగల స్మశానముగా కనుగొనెను. ఏవ

యాధీనమైన లోకములలోను, రూపలోకములలోను, అరూపలోకములలో నుండుట నిప్పులచే నావరింపబడిన నింటియందుండు నట్లనుకొనెను. ఆఘోరమైన స్థితినిజూచి ఇదినన్ను తొందరపెట్టుచున్నది. దీనిని నేను సహించజాలననెను. ఇదే సమయమని వాకిలివద్దకువెళ్లి బైటఎవరున్నారని యరచెను. నేను చన్నా వున్నానని యొకడనెను. చన్నా నేడు గొప్పత్యాగము నేను చేయవలెనని యున్నాను. నాగుఱ్ఱమునకు జీని వేయుము.

'అతనియున్న యుత్సాహమును జూచి తడయుట సాధ్యము లేదని యెరిగి గుఱ్ఱపు లాయమునకు వెళ్లి దీపము వెలుతురున కంటకుడను గుఱ్ఱము సొంపుగా నిలుచుండు నదిగని దీనికి నేడుజీని వేయవలెను గాబోలని దానికి జీనివేసెను.

గుఱ్ఱపులాయమున గుఱ్ఱమును తయారుచేయునంతలో, తనభార్యబిడ్డలను కడపట సారి యొకమారు చూచుకొనగోరి, యశోధరాదేవిగదికి వెళ్లి, వచ్చటపూలపాన్పుపైని తన ప్రియభార్యబిడ్డను చేతులకౌగలించుకొని పరుండి నిద్రించుచుండజూచి తనకుమారుని చేత దీసకొన తల్లిచేతిని బిడ్డమీదనుండి తీయవలసివచ్చునని కనుగొని అట్లుతీసిన తనభార్య మేలుకొని కన్నీరువిడుచుచు తన్నువిడిచి పోవలదని నిర్బంధపెట్టునని తలంచి నిర్బంధపెట్టి తనమనోధార్ఢ్యమును చలింపజేయుటకు కారణముఅగునని యెంచి, భార్య బిడ్డలమీద వాకిలినుండియే యొక ప్రేమచూపువైచి, కాలును వెనుకదీసె, మరల వెనుకకు వచ్చి, మోహమునువిడనాడ నిశ్చయించి ఒకసారిమరల వారినిచూచి మేడదిగి రాజ గృహమువెలుపలికివచ్చి చెన్నా, అని కంటకమను అశ్వశ్రేష్ఠమునుయెక్కి పట్టణమును విడిచి అనోమానదిగట్టును చేరువరకు నెక్కడనిలువక సవారిచేసెను. అచ్చట గుఱ్ఱముదిగి, గుఱ్ఱమును దనమీదనుండిన యాభరణములన్నిటివిదీసి తనబంటుచేతికినిచ్చి నీవువీనితో పట్టణమునకు వెళ్లుమని సెలవిచ్చెను. అయితే చెన్న నతని వెంటనే యుండుటకు నిష్టపడి లోకమును విడుచుచున్నానని ప్రార్థించ సిద్ధార్థుడు ముందు యెప్పుడైనను నీప్రార్థన అంగీకరించెదను, ప్రకృతము నీవు కపిలవాస్తుపట్టణమునకు వెళ్లి నాతండ్రికిని, నాతల్లి ప్రజాపతికిని, నాభార్యకును, యితరగ్రామనివాసులకును నేనుసన్యాసి అయినాననియు నాకుగాను వారు వ్యసనపడ నవశ్యకములేదనియు వానికిచెప్పెను. చెన్న బిగ్గరగా నేడ్వప్రారంభించెను. బుద్ధుడు వానిని నూరడింప చేసి పట్టణమునకు మరలింపజేసెను. వెనుక తనచేతనున్న ఖడ్గముతో తన జుట్టును కోసివేసి, దోవనజూచిన బిక్షుకునివస్త్రములను తానుగైకొని, తనవస్త్రి

ములు వానికినిచ్చి భిక్షుకునివలెను సన్యాసివలె రాజగిరియను పట్టణము వెళ్లెను. అప్పుడు ఇతనివయస్సు ఇరువదితొమ్మిది యేండ్లు. యీపట్టణము మగధదేశమునకు రాజధానియై యుండెను. అదియొక గొప్ప ముఖ్యమైన పట్టణము. దాని సమీపమునయందు కొండల మీద మోక్షప్రదర్శకులైన తత్వవేత్తలనేకులు విద్వాంసులుండిరి. ఆపట్టణము ప్రవేశించగానే అతనిని అందరు ఆశ్చర్యముతో చూచుచుండిరి. ఎంతజర్ణవస్త్రములను ధరించియుండినను యతని రాజకళను నవిమార్చజాలకపోయి జనులందరతనియందు దృష్టినుంచి చూడనారంభించిరి. యితడు దేవతాధిపుడైన ఇంద్రుడో! అట్లుఅయిన వీని ఐరావతము, ధనస్సుయెక్కడ? లేక. వీడు మహాబ్రహ్మయో యని సందేహించుచుండిరి. ఆపట్టణమునకు రాజైన బింబసారునియొద్దకు వెళ్లి ఆగ్రామనివాసులు లెవరోగుహ్యమైన మహానుభావులు వచ్చియున్నారని సమాచారము తెలుప నారాజు బుద్ధుడుండుచోటికివచ్చి మీరెవరు అనియడిగెను. తానొక పేదసన్యాసియని తెలుప నారాజు తననగరులో కొఫురముండిన బెచ్చుధనమిచ్చెదనని చెప్పెను. దానిని బుద్ధుడు అంగీకరించక సమీపముననుండిన కొండలకు మోక్షాపేక్షగలవాడై వెళ్లెను.

అక్కడన నేకులు బ్రాహ్మణవిద్వాంసులు, తత్వజ్ఞులుండిరి. మొదట అలరాయను బ్రాహ్మణగురువును ఆశ్రయించి, అతడు కేవలవిద్వాంసుడుకాని తత్వజ్ఞుడు కాడని తెలసి ఉద్రకుడను బ్రాహ్మణుని శరణుసొందెను. అతనివద్ద యిహపరములనుగురించి వేదాంత తత్వశాస్త్రముననుండు విషయములనన్నిటిని గ్రహించెను.

యిట్లు అలరా ఉద్రకుల బోధలనుగ్రహించి తృప్తిలేనివాడై, యేకాంతముగా నివసించి, యీ వరబముగా చెప్పుకొనుమార్గమును పరీక్షించవలెనని యెంచి బుద్ధగయ సమీపముననుండు ఉరువెలవనములను జేరి అచ్చట నారుసంవత్సరములు కొడన్య, భద్దాన్, మహానామ, వప్ప, అసజి అని యైదుగురుశిష్యులతో నుపవాసములు జేయుచు దేహమునుకృశింపజేసె క్రూరతపమును జేసెను. యిట్లు సులభముగా కాలము గడుపుటవల్ల సరిఅయినమార్గమున నడుచువాడు గాడనియెంచి, ఇంతకంటె నెక్కువైన కష్టభముల ననుభవింపవలెనని అనుకొనెను. నూలగింజంత యాహారముదొరికినను జాలును. అంతకంటె నెక్కువ యవశ్యకములేదని చెప్పెను. గట్టిఆహారమును భుజించనందువల్ల వానిదేహము వివర్ణమాయెను. పదికోట్ల పదివేల ఏనుగులబలముగలిగియుండిన వాడు యిప్పుడు నిలుచుటకుశక్తి లేకపోయెను. ఒకనాడురాత్రి మూడవఝాముదనకు ధ్యానము జేయుచు, నడుచుచునుండ వాడు నేలమీద స్మృతితప్పిపడెను. అప్పుడు

తపోనుష్ఠానములను జాలించెను. తపస్సు వ్రతములు మనుష్యునికి మోక్షదాయకములు గావని భావించెను. నిరాశతో విసుకుజెంది అనేకబాధలు, దుఃఖములుపొంది, క్రూరమైనతపస్సు జాలించెను. ఆరుదీర్ఘవత్సరములు పడినకష్టములు వ్యర్థమాయెనని తలంచెను. అన్నములేక బహుప్రయాసపడుచుండు సమయమున సుజాతయనుబిడ్డ వానిని సమీపించిఅన్నపానములతో నాదరించెను.

ఆమెదయను బుద్ధుడుమరచిపోలేదు. వాడుచావుసమయమున నామెయిచ్చిన యన్నము తానుతనజీవమున తినిన యన్నములకంటె శ్రేష్ఠమయినది యనియు యా యన్నముతినినవెనుకనే తనకు బుద్ధత్వముకలిగినదనియు ననుకొనెను. వానికిబలము రాగానే తనపూర్వదండకమండలమును కావివస్త్రములను ధరించెను. దానిని చూడగానే ఆరుసంవత్సరములనుంచి భక్తితో నాశ్రయించిన ఆరుగురుశిష్యులు గౌతముడు ధర్మమార్గమును విడిచి భిన్నమతావలంభకుడుఅయినాడని యెంచి యతనిసాంగత్యము విడిచిపెట్టిరి. వానిస్థితిజూచి కరుణించవలసిన సమయమున తనస్నేహితులు శిష్యులు తన్ను విడిచిపెట్టుట చూచెను. వారువిడిచిపెట్టిన దినమే సుజాతచేతులనుండి నన్నముగైకొని ప్రాతఃకాలమున నిరంజననదీప్రాంత్యముల సంచరించుచు, ఒకగొప్ప వృక్షముక్రింద ఆయన్నమును యచ్చటభుజించుట నుద్దేశించికూర్చొనెను. ఆస్థలము నే బుద్ధగయయని యందురు.

నిరంజననదికి పశ్చిమభాగమున గయాపట్టణమునకు ఆయిదుమైళ్లదూరముననిప్పటికి ననేకఇటికరాళ్లతోకట్టిన కట్టడములు నగుపడుచున్నవి. అచ్చటబుద్ధుని దేవాలయముగూడ నొకటియున్నది. దానిచుట్టుప్రక్కల బౌద్ధమతము కొనసాగకున్నను ఆకట్టడములుచూడ నప్పుడప్పుడు కొందరుమాత్రము యాత్రచేయుదురు. ఆగుడివెనుక నుండు పిప్పలవృక్షము బ్రహ్మస్థాపన యనికూడ వాడుకయున్నది. యావృక్షము భూలోకమున మధ్యభాగముననున్నదని బౌద్ధులనుకొందురు 1812-వ సంవత్సరమున నీచెట్టుమహాప్రబలముగా నుండెను అప్పుడు నూరుసంవత్సరములు వయస్సుగలదిగా కనబడుచుండెను గాని ఆస్థలమున యనేకవృక్షములుపెరిగి పడిపోయియుండవచ్చును. నాచెట్టుచుట్టు గుండ్రముగా దిన్నెలు దిన్నెలుగా నేర్పాటుచేయబడియున్నది. యీ స్థలముచుట్టు 15 20 మైళ్లవరకు అక్కడక్కడ నగుపడు యసంఖ్యాకములైన విగ్రహములనుజూడ నివన్నియు దానిచుట్టునున్న దేవాలయవిగ్రహములుగా కనబడుచున్నవి. ఆచెట్టు 35 మూరలెత్తును చుట్టుకొలత 19 మూర్లు 10 వేళ్లవెడల్పు

గలది. యీచెట్టుయొక్క కొమ్మ అశోకమహారాజుబిడ్డ యిప్పటికి రెండువేలనూట డెబ్బది సంవత్సరములక్రింద లంకాపట్టణములో అనూరాధపురమునందు బూడ్చబడి వృక్షమై యున్నదట. ఇట్లుపురాతనమైనవృక్షములు భూలోకమున నింకను నెగుగలవు. ఇవి వేయిమొదలు నాలుగువేలు వత్సరముల వయస్సుగలవిగా చెప్పుదురు. సెనిగల్ పట్టణములోని (బోయబస్) అనువృక్షమున్ను టాస్మానియ యనుపట్టణములోని (యూకలిపటిస్) అనువృక్షమును, పోర్టోటవాయను పట్టణములోని నాగయనువృక్షమును, కాలిఫోర్నియాలోని విల్లింగ్టోనియా యనువృక్షమున్ను యట్నాయను అగ్నిపర్వతములోని అడవిబాదామివృక్షము ఇవి పురాతనములైనవని వాదుచున్నారు.

ఇట్లు బుద్ధుడు ఆవృక్షముక్రింద కూర్చొని, తానుపడిన శ్రమలు, చేసినతపము, వీడిన భోగములు, నేర్చినవిద్యయు, నడిపిన జీవనము తలచి, తలచి ఖిన్నుడై, ప్రాప్తించవలసిన పరవస్తువు కాంచగనక, చేయునదిదోచక, తనస్నేహితులుగూడ విడిచిపోవుచుండ, ధైర్యమువీడి, అసంతృప్తిపొందినవాడై దిక్కుదరిదోచక ఆలోచించు సమయమున, మరల రాజ్యమునకు దిరిగి పూర్వభోగభాగ్యములను, రాజ్యాధికారమును అనుభవించవలెనను కామములు మనసునపుట్టి అతని మనోదృఢమును చలింపసాగెను. అప్పుడు బుద్ధుడు తనసంకల్పమునన్నిటిని స్మరించి స్మరించి ఉప్పొంగివచ్చుచున్న కామములను దూరము చేసి, విచారపరుడై, మాయాశక్తిని నిగ్రహించ నిర్ధరించుకొని దైవసాక్షాత్కారమగుటవరకు తనస్థానమునుండి కదలనని నిశ్చలుడై ధ్యానాసక్తుడై కూర్చొనెను.

ఇట్లు సర్వత్యాగము చేసి దైవమునకు మనలనర్పణము చేసికొనునంతవరకు దైవానుగ్రహముకలుగదని అనేకదృష్టాంతము లిదివరకే గలిగినవిగదా? అశోకవృక్షమున ఉరిబోసుకొనుటకు యత్నించినప్పుడుగదా హనుమంతుడు సీతకుప్రత్యక్షమై అభయమిచ్చె! వస్త్రాపహరణమున 'కృష్ణానీవేగతి' ని వేడగా గదా ద్రౌపదికి మానభంగము కాకుండయుండె?

284. ఏనుగ దేహమును నీళ్లశుద్ధిజేసివిచ్చలవిడిగా విడచిన శీఘ్రముగా దేహమును మంటిలో బొరలాడించి మలినము జేసుకొనును. శుద్ధిజేసిన వెనుక దానినిగట్టి వేసిన నది శుద్ధిగానుండునట్లు సాధువుల సాంగత్యముచే పూర్వజన్మసుకృతమువల్లనాత్మశుద్ధి సంపాదించిన వెనుక లౌకికులసహవాసమును మిక్కుటముగ జేయ నిర్మలత్వము క్రమముగా క్షీణించుట నిశ్చయము. దైవస్మరణయందే నీమనస్సునుంచితివేని మాలిన్యమును బొందవు.

285. అభ్యాసిశక్తి యొక్కడనుండును? వానికన్నిటియందు. ఎక్కువగ నేడ్చు తనబిడ్డకోరికను శ్రద్ధతో దల్లి నెరవేర్చునట్లు తనభక్తుడు దేనిని శ్రద్ధతో నడుగుకొనుచున్నాడో దానిని దేవుడనుగ్రహించును.

286. విజనదేశమునకైని యడవినికైని లేక నీమనసున నేకాంతముగా దేవుని ధ్యానించుము.

287. నీచేతులతో తాళము వేయుచు హరినామమును స్మరణజేయుము. అట్లు జేసిన నేకాగ్రతను బొందగలవు. ఒక చెట్టుక్రిందనుండి నీచేతులను దట్టిన గొమ్మలనుండు పక్షులు నలుదిక్కులబారును హరినామస్మరణజేయుచు నీచేతులను దట్టిన నీదురాలోచనలన్నియు మనస్సునకు దూరమగును.

288. ఒకపదార్థమును కూరగాను, కూటుగాను, పులుసుగాను పచనముజేసి యొక్కొకరుచి నీకిష్టము వచ్చినవానిని యంగీకరించునట్లు దేవుడు తనభక్తుల కిచ్చప్రకారము నేకరూపముల దర్శనమిచ్చును. కొందరికి దేవుడు దయాపూర్ణుడైన యజమానునివలె, ప్రియతండ్రివలెను, మందహాసోజ్జ్వలమాతవలె లేక ప్రాణస్నేహితునివలెను, కొందరికి విశ్వాసముగల భర్తవలెను లేక కృతజ్ఞతకలిగిన కుమారునివలె నుండును.

289. ఇతరులు వంగినమస్కారము జేయు స్థలమున వంగి నమస్కారము జేయుము. ఎందుకనగా దేవుడు పరమదయాస్వరూపుడగుటచే యనేకహృదయములు చేరి యతని భజింపనచ్చోట దర్శనమిచ్చును.

290. లోకమునకొందరికి నాసక్తిపుట్టించువస్తువులు లేకున్నను తమకుదామే సంగములను కలిగించుకొని బంధకారణము గలిగించుకొనుచున్నారు. వారు ముక్తులగుటకు గోరరు. వారికిముక్తిగాబటదు. పోషించుటకు కుటుంబములేని బంధువులు లేని మనుజులొకపిల్లిని లేక కోతిని లేక కుక్కను లేక యొకపక్షిని ధనముదుపదార్థ

ముగా గావించుచుకొనును. పాలునుగోరువాడు పాలు పెరుగుకొఁగా మిగిలినసీళ్లను త్రాగి తృప్తిజెందును. మానవులమీద మాయాశక్తి యిటువంటిది.

291. హెచ్చుజ్వరమువచ్చి యుదాహముగొన్న మనుజుడు సముద్రమునైన ద్రాగుదుననియనుకొనును. అయితే జ్వరమునిలిచి తనదేహము సౌమ్యస్థితినిబొందనొక పాత్రజలముకూడ గ్రహించజాలక కొంచమునీళ్లతో దృప్తిపడునట్లు మాయాజ్వరావేశముచేతనుండు మనుజుడు తనకించిద్జ్ఞత్వమునుమరచి తనహృదయమున పూర్ణదైవస్వరూపమును గ్రహించవచ్చునని తలచును. అయితే యాభ్రమవీడగా పరమాత్మతేజముయొక్క యణుమాత్రమే తనకు శాశ్వతదివ్యానందము నివ్వజాలియుండునని తెలియును.

292. గొప్పజ్వరముగలిగి యుదాహముగొన్న మనుజునివద్ద శీతలజలముగల కూజాలను, రుచించు భోజనపదార్థములను బెట్టి వాటిని గ్రహింప తనదేహారోగ్యము చెడునని దెలసినను వాటిని చవిచూడకుండునా? స్త్రీవిలాసము భాగ్యసంచయము మధ్యనున్న నీతిచంచలమై స్వర్గమునకు యీడ్చిమున్నాదుచేయు యింద్రియశక్తికి లోబడిన మనుజునిగతులా లాగునుండును. సన్మార్గమున బ్రవర్తించ గష్టముగానుండును. ధర్మముదప్పి నికృష్టమైనగతి బొందును.

293. పాలుపోసినకుండలో మరలపాలను బెట్టిన పెరుగగునని పాలనుంచరు. ఆపాత్రలను వంటకుబెట్ట జెలునని యితరపనులకుగూడ వాడరు. అనుభవజ్ఞానియమోఘమైనబోధను లౌకికునకివ్వడు. దానికిచ్చిన విపరీతార్థములజేయుచు దుర్వినియోగముజేయును. అది గానుగాక గురువుశిష్యుని యూగక వేధించుననుకొనునని యూసమునుచ్చు స్వల్పపనులనగూడ నతనికి జెప్పకను వెనుకదీయును.

294. కొంతపాలును రెండంతలనీళ్లగలిపిన క్షీరమగుటకు చాలాకాలము పట్టును. లౌకికుని మనస్సుఅశుద్ధమైన దుర్మార్గాలోచనలతో నిండియుండును. గనుక నతనిమనస్సు సౌమ్యతనుబొంద చాలాకాలము కష్టముపట్టును.

295. అందరియహంకారము క్రమముగా వీడునుగాని జ్ఞానికిమాత్రము జ్ఞానవంతుడను యహంకారముమాత్రము పోగుటకష్టతరము,

296. వేపు పెనములోని వేగువడ్లగింజలలో పెనమునుంచియెగిరి యావలపడు గింజలు బాగుగవేగి మలినములేకుండయుండును. బాగుగవేగి పెనములోనుండుగింజలు కొంచమైనవల్లగా కాలిన మలినత్వముగలిగియుండును. లోకమునుద్యజించి యేకాంతి

## ఎట్లు జ్ఞానికావచ్చును?
## శిష్యలక్షణము.

### మననము, సుగుణసంపద, మనోనిగ్రహము.

నే నిపుడు శిష్యలక్షణముల వక్కాణింపఁబూనెదను. మొదట పునర్జన్మరహస్యంబు నిరూపించెద. మఱియు శిష్యత్వమిట్టిదని యనుభవముచే నెఱింగి దానిఁ బడయుమార్గ మిఁక నన్వేషింపఁ దలంపు పొడము తెఱంగును దెలిపెద. పూర్వోపన్యాసమందలి విషయముల జ్ఞప్తికిఁ దెచ్చికొనుఁడు. కర్మాభ్యాసమునకు దశాభేదంబుల నిరూపించితి గదా. నరుఁడు మొదట ఫలాపేక్షతో నైహికేచ్ఛాపరిపూర్తికై కర్మమాచరించు. అటుపిమ్మట క్రమక్రమంబుగ కర్మయోగాభ్యాసముచే నైహికఫలాపేక్ష మాని ఈశ్వరాజ్ఞానువర్తియయి ప్రపంచధర్మంబు నడుపుచు కర్తవ్యంబనిఁ గర్మమాచరించు. మఱియు నింకొకదశ కర్మకుఁ గలదు. నరుఁడిట్టిదశయందుఁ గర్తవ్యమని కర్మమాచరించుటయే గాక తనసర్వస్వముఁ బ్రీతితో నొసఁగు. నరుఁడు కృష్ణార్పణబుద్ధితోఁ దనసర్వస్వము నివ్వఁదలఁచినపుడుగదా యిచ్ఛాబంధములఁ దెగఁగోసి సంసారచక్రమునుండి వెలివడ సాధ్యంబగు. ఇచ్ఛయేగదా యిహలోకజన్మమునకు హేతువు. భూలోకమున ననుభవింపదగిన సుఖంబులను సాధింపదగిన పనులను గోరుటయే జన్మమునకు కారణము. ఐహికవిషయంబుల నుద్దేశించి వానిఁబడయుటయే జన్మసాఫల్యంబుగా వర్తించునరుఁడిచ్ఛాబంధములఁ దగులువడినవాఁడుగదా. నరుఁడు భూలోకసుఖంబు లెంతకాలము గోరు నంతదనుక వాఁడిచటికి మరలవలయును. క్షణభంగురములగు భూలోకసుఖంబులుగాని పదార్థములుగాని మరులుగొలుపఁజాలిన నవియే వానికి బంధకంబులగు. ఒక్కొక్క కోరికయు జన్మనకు బంధకంబగు. దానివలన వాంఛాఫలసిద్ధి కనువగుచోట నరునకు జన్మంబు మరలఁగలుగు.

మనుజుఁ డీశ్వరాంశసంభూతుఁ డగుటంజేసి విషయానువర్తియగు నీయిచ్ఛాశక్తియు నమోఘంబగు. వాఁడుకోరిన నెల్లఁ బడయు. పరిపక్వకాలమగుడు వానికోరికెలు సఫలమగు. దానంజేసియెగదా నరుఁడు తనకుదాన కర్తయనిరి. వాఁడుకోరిన వెల్లవానికబ్బు. నరుఁడెచ్చో నెద్దాని నభిలషించు నచ్చట నది వానింజెందు. కాన భూలోకపదార్థములఁగోరెనేని తనకోరికతీర నిచట జన్మించవలయుఁగదా. ఇంతయ కాదు. స్థూలదేహపతనానంతరమున నరుఁడు సొచ్చులోకంబులు నశ్వరంబులు.

ఆలోకసుఖంబులఁగోరుటయు భూలోకజన్మమునకు హేతువు. అశాశ్వతలోకంబులు
పునర్జన్మము నిచ్చుఁగదా. మనుష్యుఁడు స్వర్గలోకసుఖములఁగోరనేని యుక్తకాల
మున వాఁడు కర్మఫలమందు. నరుఁడుస్వర్గలోకసుఖంబులకై యైహికసుఖంబుల
విగనాడి నశ్వరంబగు నాలోకమునఁ దనకర్మఫలంబుఁ దాఁజెందఁగోరనేని వాని
కర్మఫలంబులగుస్వర్గసుఖంబులు తతితో వానిఁ జెందు. స్వర్గలోకంబును శాశ్వతపదవి
కాదు. కావున నానరుఁడు పునరావృత్తిహేతువగు చంద్రలోకమార్గమున బోయిన
వాఁడగును. చంద్రలోకము స్వర్గద్వారమని చెప్పుదురు. అటుపిమ్మట జీవుఁడు
స్వర్గలోకమునుండి మర్త్యలోకమును మగల ప్రవేశించు. అనిత్యమగు నీలోకమునగాని
మరియొకలోకమునగాని ఫలసిద్ధిఁ గాంచుకోరికలెల్ల జీవునిసంసారమునఁద్రోయును.
దానంజేసిగదా హృదయగ్రంథివిపాటనంజేయునదె మోక్షమార్గమనిరి. ఇచ్ఛానివి
రసనముచేత నొకమన్వంతరము జన్మమురాకముక్తుఁడు బడయువచ్చు. ఇట్టిముక్తికి గొప్ప
సిద్ధులేవియుఁ బడయనక్కఱలేదు. జీవుఁడును ఏ మోన్నతపదవి నొసఁగఁ జెందవలదు.
జీవునియందలి యీశ్వరశక్తులన్నియు వికసింపఁబడలేదు. లోకగురువులు నాచార్యు
లందినమహాపదవి నందవలదు. ఇట్టిమోక్షమును నరుఁడు గోరినచో నందవచ్చుగాక.
అదికేవలము స్వార్థపరత్వముగదా. వాఁడశాశ్వతంబగులోకమును దాటవచ్చు.
సంసారబంధములవలన వాఁడు విడుదలఁగాఁ బడగు. అయిన నిట్టిముక్తిచే దనసో
దరులగు నితరుల రక్షింపఁజాలఁడు. పరులసంసారబంధములఁద్రెంచి వారిని మోక్ష
మునకుఁ గొనిపోవఁజాలఁడు. ఒకఁడుమాత్రమే ముక్తికిఁబోయి లోకమంతయును
సంసారమున మునిఁగియుండుట లోకమునకెల్ల మోక్షము గాదు గదా. అనేకు లింత
మాత్రమె కోరుచున్నారు. ఇతరులెట్లైనఁ దాముమాత్రము ముక్తిఁగాంచఁ దలంచు
వారనేకులున్నారు. ఇట్టిమోక్షము సులభసాధ్యము. లోకమున సామాన్యజనుఁడు ప్ర
దినంబును గోరునవియెల్ల నిస్సారములనియు క్షణభంగురములనియు దృఢనిశ్చయము
గాంచిన నిట్టిమోక్షమందవచ్చు. ఇన్నిపాట్లుపడిసాధించిన యామోక్ష మొకమన్వంత
రము దనుకనె గదా. అనంతరమును మర్త్యలోకమునకు మగలవలయు. కావున నిట్టి
ముక్తిఁ బడయువారిప్పటికి నీలోకమున జన్మమెత్తకయుండ సంసారబంధముల
ద్రెంపఁజాలినను మఱియొకమన్వంతరమున వారు మరలిరావలయును. కావున నిఁకముందు
రానున్న బ్రహ్మాండములకు శిక్షకులున్నూ సహాయకులును మార్గదర్శకులు నగునట్టుల
జీవులీశ్వరునంతవారు గావలయును గదా. కావున నట్టి వారీశ్వరత్వము సాధింపజన్మ

మెత్త వలయు. ఇట్టిమోక్ష మటుండ నిమ్ము. దయానిధులు ప్రజ్ఞావంతులు నగుమహా
త్ములు సంసారబంధములఁ దెగఁగోయఁజూచినను దాముమాత్రమె సంసారకష్టములనుంచి
వెలివడవలయునని కోరరు. అట్టివారు శ్రేష్ఠతమంబుగాంభీర్యమ్ము నగుజీవన్ముక్తిపథమున
నడతురు. ఆమార్గము మానవులకుఁ జెప్పిన మహాత్ములు చన్న త్రోవనే వీరును పోవు
దురు. అధికారికుపదేశింపఁ బ్రసన్నచిత్తుఁడగు గురు నన్వేషింతురు. వారు గురు
సన్నిధిఁ జేరుట తాముకష్టములఁదొలఁగి మోక్షము తాముమాత్రము పొందవలయునని
కాదు. గురూపదేశంబుల లోకమున వదచష్ట జనులకెల్లరకు సహాయులు నాచార్యులు
రక్షకులుఁ గావలయునని సుమా. ఇట్టిశిష్యత్వమునుగుఱించి ప్రపంచమునందలి మతంబు
లెల్ల చెప్పుచున్నవి. లోకంబున బ్రహ్మానుభూతిఁ గనఁగోరు పుణ్యపురుషులెల్లరు నట్టి
గురువుఁగాంచి యుపదేశమందుటయె జన్మసాఫల్యముగఁ దలంతురు. ఈయభిప్రాయ
మేమతంబునఁజూచినను గలదు. [illegible]యుపనిషత్తునందును శిష్యుఁడు గురువు
నన్వేషించుట యువానిఁగాంచుట యుఁ జెప్పబడియున్నది. ఇయ్యదిమీరు గ్రహింతురు
గాత. శిష్యుఁ డిట్టిలక్షణములు గలవాఁడు గావలయు. శిష్యత్వమందుటకు పూర్వ
మెద్దికర్తవ్యమనియు గురువును వెదకుట సఫలంబుగావలయునేని నిది సాధింప
వలయుననియు ద్విజన్మత్వ మీఁజాలిన యాచార్యపదసరోరుహసేవకర్తృత గాంచ
వలయునేని పాఠశాలంబోలు నీలోకమున నిది యభ్యసింపవలయుననియు మీ కెఱిం
గింతు. ఈద్విజన్మత్వంబు సమస్తమతంబులందును బాహ్యకర్మచే సూచింపఁబడు
చున్నది. పరమపావనదశను బోధించు నీబాహ్యకర్మ నీచమందినది. తల్లిదండ్రులచే
నగుజన్మము గాక గురూపదేశమున రెండవజన్మము కలిగెనను సత్యమును బోధించు
ద్విజన్మశబ్దము హిందూమతమున నున్నది గదా. అది యిప్పటికటా! ద్విజన్ములను
పేరంబరగువారి యుపనయనములందు తండ్రిగాని పురోహితుఁడుగాని యుపదేశించు
దానినే తెలుచుఁగ బోధించుచున్నది. ఇట్టిబాహ్యకర్మమాతృకయైన నిజమగుబ్రహ్మో
పదేశంబు పూర్వమున నుండెనుటయు గా నిప్పుడును నట్టిది కలదు. అదిబాహ్యాను
లోచితంబగునుపదేశము కాదు. ఆయుపదేశమువలన దివ్యజన్మమలవడు. అది భువ
నైకగురుప్రసాదమున లభించు. ఇట్టివి పూర్వకాలమున నుండెనని గ్రంథములు చెప్పు
చున్నవి. ఇప్పు డిట్టివి గలవని స్వానుభవంబుచే మన మెఱుంగుదుము. అవి యదా
ర్థములని పూర్వచారిత్రము లుద్ఘోషించుచున్నవి. హిందూదేశమునందుఁ గొన్ని దేవా
లయములక్రింద నిట్టి యదార్థబ్రహ్మోపదేశ మొసంగు రహస్యస్థలము లున్నవి. అవి

సామాన్యజనులకు తెలియవు గాని యట్టి గోష్టులున్న వనుటమాత్రము యదార్థము. అట్టిస్థలములకుఁబోవ నర్హులగువారికి వానిఁ జేర సాధ్యంబగు. ఇట్టి రహస్యస్థలం బులు హిందూదేశమునందె కావు. పూర్వమున నీజిప్టుదేశమందు నుండెను. ఇప్పుడు మనుజుల కగుపడని పురాతన రహస్యస్థలములమీద మహాగోపురంబులున్నవి. అంత గొంతకాలమునకు పిమ్మట నీజిప్టుదేశమున సామాన్యజనుల కెల్లరకుఁ దెలియు వెలుపలి సాలలయందుఁ దత్వజ్ఞాన ముపదేశింపఁబడియె. ఈశాలలు రహస్యస్థలములకు వెలుపల నుండె. ఇట్టి యుపదేశంబుల జను లందిరని యీజిప్టుగ్రీసుదేశముల చరిత్రములఁ జెప్పబడియున్నది. మఱియు విద్వచ్ఛిఖామణులు కొందఱచ్చో నుపదేశమందిరని యు వినియుందురుగదా. ఈపరమరహస్యస్థలములఁ బ్రవేశింప పాండిత్య మొక్కటియే చాలదు. సనాతనంబులగు నియమములు గలవు. ఆనియమములు పూర్వమందువలె నిప్పుడు నున్నవి. ఇట్టి బ్రహ్మోపదేశస్థలంబుల బ్రహ్మోపదేశమందినవా రుండిరనుటకు లోకచరిత్రయే సాక్షిసుమ్ము.

ప్రపంచమందలి గొప్పమతంబుల స్థాపించినవారు మానవశ్రేష్ఠులు వారు వేదముల లోకమున కిచ్చిన పుణ్యపురుషులు. వారు సర్వజనసామాన్యంబులగు మతసిద్ధాంతముల నిరూపించినధీమంతులు. వారనన్యసాధారణంబగుజ్ఞానంబున బ్రకాశించుచుదివ్యదృష్టిచే సమస్తము నెఱింగి తమయెఱుకనుఁ బ్రకటించిన పావనమూర్తులు. ఇట్టియాచార్య శ్రేష్ఠుల కెల్లరకు సామాన్య మగు చిహ్న మొకటికలదు వారు తర్కింప నొల్లరు. వాస్తవ్య మిదియని శాసింతురు. వారు ప్రమాణంబులచే సిద్ధాంతము చేయఁ బూనరు. దివ్యజ్ఞాన ముచే వాస్తవ్యమెఱుగుదురు. వారు లోకమున నవతరించి కర్తవ్యంబుల విధింతురు. వారివాక్యాలే వారిప్రాభవమును దెలుపు. వారి యుపదేశ విషయము లతీంద్రియార్థ ములయినను మనుజులు వాని విశ్వసింతురు. నరునిహృదయసంపుటమున పారమార్థిక జ్ఞానబీజమున్నదిగదా. అది యమ్మహాత్ముల వాగమృతంబుచే నంకురించు. దానంజేసి యాయుపదేశంబులు మనస్సునకందరానివయ్యు నరులు వానిగైకొందురు. ఆచార్య శ్రేష్ఠులగు గురువులును తత్వజ్ఞానశిఖామణులను లోకమున నుండిరిగదా. వారెల్లరు బ్రహ్మోపదేశ మందినవారుసుమ్ము. వారమానుషత్వ మందినవారు అట్టిపుణ్యపురుషులు నాఁడనవేల నేడునుగలరు ప్రాకృతిస్వభావంబులడంచి భవసాగరంబు దాటిన యీమహా త్ములను మృత్యువు డాయదు వారింతకు నున్నచనిన యనేకకోటివత్సరంబులయందు మానవకులముమునుండి ప్రవృద్ధిగాంచినవారు.

# భ క్తి.

లోకమున జీవులు అనేక కార్యములు చేయుచుందురు కదా? ప్రతికార్యమునకు ఏదోయొక కారణముండును కదా? ఆకారణములలో భక్తియను కారణము ముఖ్యమైన కారణములలో నొకటియైనది. ఈ భక్తివల్ల అనేకులు అనేక గొప్పఅద్భుతములను చేసి యున్నారు. దీనికి వ్యతిరిక్తమైనది మతదురభిమానత్వము. భక్తికి తోడికోడలనికూడ దీనిని అనవచ్చును. అయితే భక్తి మనిషిని ఉన్నతదశకు దెచ్చును. దురభిమానత్వము అధోగతికి దెచ్చును. ఈ రెండును లోకమున సమానముగ ప్రసరించుచు, ఒకవిధమైన కార్యములనే చేయుచున్నట్లు అగుపడుచున్నవి. అయితే భక్తి జ్ఞానపూర్వకమైనది; మతదురభిమానము అజ్ఞానజన్యమైనది. భక్తి ప్రేమ ఫలములను తెచ్చును. స్వమతాభిమానము ద్వేషఫలమును దెచ్చును.

భక్తి ఎట్టి ప్రయోజనకారియో భక్తి మతదురభిమానము ఎట్లు వేరువేరుగానున్నవో వీటిని తెలియుటకు ముందు భక్తి అనగా నేమి యనుసంగతి స్పష్టముగా మనకు తెలియవలెను.

మనిషియొక్క స్వభావమునకు భక్తికిగల సంబంధమును విచారించవలయును. మనకు తెలియుట ఎందుకు? ఆచరించుటకే! ఆచరణలేనివిద్య ఫలించదు. అట్లనేవిద్యలేనిఆచరణ ఫలకారికాక వ్యర్థమగును. గొప్పవానలుకురిసి ఏరులునిండి గట్టులనుమించి ప్రవాహమురాగా ఆప్రవాహముపోవు చోటంత మునిగి అనేకవిధములైన చెరుపులు జనులకు, పట్టణములకు, ద్రవ్యమునకు కలుగుట మీరువినియే యున్నారు కదా! అట్లుకాక వానవచ్చిన సమయమున నదిలోని ప్రవాహము మడులకు, తోటలకు కాల్వలగుండా ప్రవహించిన వాటికెంతప్రయోజనకారిగానుండునో మీకు తెలిసినవిషయమే కదా! అట్లనే మనోభావముయొక్క గతికూడా ప్రవహించును.

మానుషస్వభావమును చక్కగా మనము పరిశీలించిచూచిన మూడుముఖ్యములైన విధములుగా నేర్పడుచున్నది. ఎట్లన ఆత్మజ్ఞానముగాను, బుద్ధికుశలతగాను, మనోవిషయ సంబంధముగలదిగాను ఏర్పడుచున్నది. జ్ఞాన స్వభావమనగా సర్వసృష్టియందు తత్త్వ మొకటియున్నదనియు వివిధజీవులు వృద్ధిపొందినట్టియున, ఒకటిగాయుండు తత్త్వ

జ్ఞానమును అనుభవమునకు దెచ్చుకొందుగనియు అభిప్రాయము. బుద్ధికుశలత విజ్ఞాన స్వభావమునకు వ్యతిరిక్తమైనది. అనగా భిన్నత్వమును స్థాపించి ఒకటిని అనేకములను చేయుస్వభావము. దీనివల్ల నేను వేరు. కంటికి కనుబడుచున్నదంతయు వేరు అని నిర్ధారము చేయును. ప్రత్యేకముగా నుండియే వృద్ధిపొంది యితరప్రాణులను సరకుగొనక ఆనందించుటయే యగును.

ఈ గుణమునుండి భక్తి కలుగుట అరుదు. మూడవది మనోవిషయానుగతభావము ఇది రెండువిధములు. ఇష్టము అనిష్టము అని విషయములు ప్రియములుగా నున్నవాని వద్దకు మనల నీడ్చును. అప్రియములుగానున్నవి దూరము చేయును.

మనోభావము మనస్సులను ఆకర్షించుభావములు ప్రేమయనియు దూరముచేయు భావములు ద్వేషమనియు రెండువిధములుగా నున్నవి.

ఇందులో ప్రేమ, మనము ప్రేమించునవి మనసమానముగను ఎక్కువగను తక్కువగను ఉన్నవి మూడువిధములుగ నున్నవి. మనకంటె తక్కువవారియెడ ప్రేమజూపిన దానిని దయయందురు, సమానులయెడజూపిన స్నేహమందురు. మనకంటె నెక్కువవారియెడ ప్రేమజూపిన భక్తియనియు, మర్యాదయనియందురు. ఇట్లు మనిషి స్వభావగుణములందు భక్తియనునది ప్రేమభాగమునకు చేరినదిగా ఏర్పడినదికదా! ప్రేమించువారికంటె నెక్కువైనవారియెడ చూపు ప్రేమయై యున్నది. ఒక గురువుయెడ మనము ప్రేమజూపిన, మన ప్రేమధారగా నతనిమీద పోయుచున్నాము. మనమతని కర్పించుకొనుచున్నాము. దానిని భక్తియనుట విపరీతముగాదు.

ఈ ప్రేమ అనుస్పర్శవేది భక్తిని మతద్వేషములను, కలహములను, యుద్ధములను కలిగించు మతదురభిమానమును స్పష్టముగ వేరుచేయుచున్నది. మతదురభిమానము ఇతర మతద్వేషమువల్ల కలిగిన దుర్గుణము; అన్యమతస్థులను దగ్గరకురానివ్వక దూరముచేయుచున్నది. దేవుని ప్రేమించు నెపముతో మనసహోదరులను ద్వేషించి హింసించుచున్నాము. మన మెందుకటుల చేయుదుమని కొంతవిచారించినను ప్రేమవల్ల కాదనియు, మనము సరియనియు ఇతరులు సరికాదనియు తెలియుటవల్లనైనదనియు, ఇతరులది తప్పనియు వారు వేరనియు ద్వేషించుభావమువల్ల కలిగినదిగా ఏర్పడుచున్నది. ఇట్టిద్వేషములవల్ల మనమనస్సులోని ఆర్ద్రభావము ఇంకిపోయి కఠినులగుదుము. కాని వేరుఫలము కలుగదు. కనుక సద్భక్తియొక్క లక్షణమేదియనగా అందరిని అణకువగాను, మార్దవముగాను, సహించుస్వభావము గలవారుగాను, అందరియెడ

సుహృద్భావము కలవారినిగాను చేయుటయే. ఆభక్తియనునది మనలగర్వము వృద్ధిచేసి కఠినచిత్తులుగాఁ జేసి భేదబుద్ధి కల్పించి, అందరియెడ అనుమానాస్పదముగ జేసిన నది చెత్తయే గాని బంగారు కాదు.

భక్తి ప్రేమయొక్క రూపముగనుక తనకు ఇష్టమైన అనగా సుఖమును కలిగించు పదార్థదర్శనమున భక్తియను భావము ప్రసరించును. అందరు మనుష్యులు సుఖము నన్వేషించుచున్నారు. ఈ సుఖాన్వేషణము అందరిని ఒకటిగా చేర్చుచున్నది. ఆ కూడికి సుఖమునిచ్చునట్లు తోషింపచేయుచున్నది. సుఖమనగా ఎక్కువజీవవికాసస్ఫురణము మాత్రభావమే. భేదబుద్ధిగల జీవుడు సర్వాంతర్యామియైన పరమాత్మచైతన్య స్వభావమును గుర్తించి దానియందు లీనమగుటయే సత్యమైన శాశ్వతానందము. సుఖమును పొందు ప్రయత్నములన్నియు అన్యపదార్థసంకలితము చేత కలుగు విలాసములే గాని వేరు కాదు. ఇట్టి కూడిక జీవులకు స్వభావముగా ఏర్పడినది. ప్రతిజీవిలోనునుండు చైతన్యమొక్కటే గనుక ఏకమగుటకు సదా ప్రయత్నపడుచుండును. దీనికై బృహదారణ్యకమునందు ఇట్లు చెప్పబడియున్నది.

'పురుషుని మగడని ప్రేమించుట గాదు కాని మగనిలోనుండు ఆత్మ ప్రియమైనది గనుక మగనిని ప్రేమించుట యనుచున్నది.' అట్లనే కొడుకులు, ధనము, బ్రాహ్మణులు క్షత్రియులు. లోకములు, దేవతలు, వేదములు, భూతములు ప్రియములు. ఇట్లు 'సర్వము సర్వమైనందున ప్రియము కాదు కాని. సర్వము ఆత్మ కొరకు ప్రియము' ఆత్మ ఆత్మను వెదకుచున్నది. ఇందుకై సర్వజీవులు సుఖాన్వేషణపరులై యున్నారు. ఇట్టి అన్వేషణమున రూపము లడ్డుగా నుండుటవల్ల ఆ సౌఖ్యము పూర్ణము గాక, ఖండమై ఎల్లెడల నేర్పట్టుచున్నయది

భక్తిగనమెట్లు వృద్ధిచేయుననునదియొక విచారాంతము.

---

160. దానమువల్ల గలుగుదానిని తప్ప, వేరుదానినిబొందుట తగుమైనదికాదు.

161. దానమువల్ల గలుగుసంతోషమే నిజముగా ముఖ్యమయిన యజ్ఞమగును.

162. సకల ముముక్షువుల సామాన్యలక్షణము శ్రద్ధ.

163. వారు నెరవేర్చుకొను నొకసంకల్పమును బూనియుందురు.

164. వారు సాధించవలసిన దానిని స్పష్టముగా గుర్తించి దానియందు గురి యుంచి యుందురు.

165. వారు లోకవ్యవహారములనుగూడ శ్రద్ధతో నడుపుదురు.

166. ఒకని నిర్హేతుకకృపాకటాక్షమున జీవసిద్ధిసులబ్ధమైనదికాదు.

167. ఏవిధమైన ఆకస్మిక సంభవమువల్ల గాని నిర్హేతుకముగా గాని లబ్ధమైనదికాదు.

168. సర్వభావపరిశుద్ధత్వమునకును, చిత్తనిరోధమునకు, ధర్మప్రవర్తనకు శ్రద్ధయే మూలము.

169. సత్యమైన యోగ్యతాలబ్ధమగుటకు ప్రతివ్రతము మార్గముగా నేర్పడియున్నది.

170. ప్రతిమనిషియు ప్రొద్దుపొడుచునప్పుడును ప్రొద్దుమునుగునప్పుడును దైవోపాసన చేయును. కాలానుసారముగా తుదకు వానిజీవనమంతయు నొకదీర్ఘమైన ధ్యానముగా నేర్పడును.

171. సదా ధ్యానము చేయుటకు సిద్ధమగుటకై మొదటయొకఘంట ధ్యానము చేయును.,

172. సకలసృష్టికృత్యములు ధ్యానఫలములు.

173. నిరంతరధ్యానసిద్ధికి క్లుప్తమైనధ్యాన మొక మెట్టు.

174. క్రమక్రమముగా జీవనమునందది యిముడునని మనుష్యులు దానిననుదినము సాధనజేయుదురు.

175. సత్యమైనజీవనము మానవులకు సిద్ధమగుటకొఱకు వ్రతములు, శ్రాద్ధములు మొదలగుక్రియలు సాధనములుగా నేర్పడియున్నవి.

# పురాణసారము - శ్రీమద్రామాయణము.

## అయోధ్యాకాండము.

అయోధ్యాపురిని జేరి రామలక్ష్మణులతోఁగూడ దశరథుండు సంతోషంబున కాలంబు జరుపుచుండెను. రాముండు సకలగుణాభిరాముండై యుండె. చతుర్వేదముల నధ్యయనించి, వ్రతంబులాచరించి, వేదవేదాంగముల తత్త్వార్థమెరిగి విలువిద్యలందు నిపుణుండై సకలకల్యాణ సంపన్నుడై, నిర్దోషుడై, ఏ యాపదలయందును దైన్యము నొందనివాడై, ఎట్టికష్టములనైన సత్యవాదియై, వక్రబుద్ధిలేనివాడై, ధర్మార్థంబులు నెరింగి నెప్పుడెప్పుడు వినియోగించవలయునో యాయానిర్ణయంబులు నెరింగి, మరపు లేనివాడై నిపుణులగు బ్రాహ్మణులచే శిక్షింపబడినవాడై, వాదములయందు ప్రతిభగల వాడై, లౌకిక వ్యవహారములందు న్యాయంబులు దెలిసినవాడై, పండితుండై, వినయ సంపన్నుండై, తనమనసునందుండు నభిప్రాయంబెవ్వరికి దెలియకుండునట్లు నడచుచు వ్యర్థంబైన కోపంబుగాని సంతోషంబుగాని బొందక, దానమిచ్చు నార్జించుసమయ ములు దెలిసినవాడై యుండెను.

దృఢభక్తిగలిగి, స్థిరప్రజ్ఞుడై, దుష్టుల గ్రహించక, దుర్వచనములాడక, ఆలస్య ములేక, ఏమరుపాటు లేనివాడై, తనదోషమును నితరుల దోషమును నెరింగినవాడై యుండెను. రాముడు సర్వశాస్త్రజ్ఞుడు. కృతజ్ఞుడు. శాస్త్రానుసారము మిత్రులను స్వీకరించి యనుగ్రహించుటయందు పండితుడు. పెద్దలనుస్వీకరించి పరిపాలించుట యందు నిగ్రహానుగ్రహములు సమయంబెరింగినవాడు, అర్జనయందు ఉపాయంబుగలవాడు, శాస్త్రోక్తమైన వ్యయముచేయువాడు. విహారార్థంబులగు సంగీతాది విద్యలజక్కగా నెరుంగును.

ధర్మాయ యశసేర్థాయ ఆత్మనే స్వజనాయచ।
పంచధా విభజన్విత్త మిహాముత్ర సశోభతే॥

అన్నట్లు ధనమువిభజించు ప్రకారంబు దెలిసినవాడై, ఏనుగుల గుఱ్ఱంబులనెక్కి నానావిధంబుల నడపి శిక్షించుటయందు సమర్థుడు, ధనుర్వేదవిద్యలలో సమర్థుడు. పెక్కువిలుకాండ్రతో బోరగలవారిచేత పూజితుడు. శత్రువుల దానెదిరించి జంపు

వాడు. సేననడుపుటయందును వ్యూహంబులదీర్ప సమర్థుండు. సురాసురులు కోపంబున వచ్చినను వాని నెదిరింపలేరు. రాముండు పురుషుని యనర్థము నారోపింపడు. గర్వితుండుగాడు. జితక్రోధుడు. మాత్సరము లేనివాడు. బ్రాహ్మణుల నవమానింపడు. కాలవశముచేత కోపగాజనములకు లొంగడు. ఓర్పున భూమికిని, బుద్ధియందు బృహస్పతికిని, పరాక్రమమున దేవేంద్రునికి సమానుండగువాడు. రాముండు సర్వాంగసుందరుండు. సమస్తజంతువులకు మనోహరుండు. సదాక్షిణ్యసంపన్నుండు. లోకమునకు జీవనమైనవాడు. వర్ణాశ్రమములన్యాయముగ రక్షించువాడు. స్వజనులను రక్షించువాడు. శత్రువులను దహింపజేయువాడు. లోకమర్యాదలనుష్ఠించి ప్రజలచే ననుష్ఠింపజేయువాడు, మిక్కిలి కాంతిమంతుండు. పౌరులచే పూజింపబడువాడు. పెద్దలకు ఉపకారము జేయువాడు. బ్రహ్మచర్యవ్రతనిష్ఠుడు. కర్తవ్యము నెరింగినవాడు. రాజవిద్యల నేర్చినవాడు, బ్రాహ్మణుల సేవించువాడు, సదాచార సంపన్నుండు. వినీతుడు, విశాలమైన మూపులును, సుందరముఖమును, పెద్దభుజములును, శంఖమువంటి మెడయును, ఎఱ్ఱనికండ్లను గలిగియుండెను. అతని దేహము సర్వసుందరమై అవయవంబులన్నియు నెచ్చుతక్కువలు లేక సమమై యుండెను. [illegible] బోలియుండెను. రాముడు సత్య[illegible]తుడు. శ్రీమంతుడై యుండెను. ఇట్టిరాముండెప్పుడు రాజ్యంబు జేయుట కండ్లారజూచెదనని దశరథుండొకనాడాలోచించి తనపురోహితమంత్రివర్యులను బిలుపించి దశరథుడు తన మనోగతంబు దెలిపెను.

అంత సర్వరు సంతోషించి రాముని రాజుగ జేయుము. అరువదివేల వత్సరంబులు రాజ్యంబు సేసి ముసలివాడవైతివి. నీవు విశ్రాంతి గొనుమని వారు ప్రత్యుత్తరము జెప్ప దశరథుడు "రాముడు ప్రభువు గావలయునని మీరు ముందువెనుక లాలోచింపక కోరితిరి. అదియేల" యని యడుగ నప్పుడు రామునికిగల కల్యాణగుణములను వర్ణింప సాగిరి. రాజా! రాముడు సత్యపరాక్రమము గలవాడు. ఇక్ష్వాకువంశపు రాజులలో శ్రేష్ఠుడు సత్పురుషుడు, సత్యధర్మపరాయణుడు, ప్రజలసుఖంబు ఒనరించుటయందు చంద్రునివంటివాడు, శౌర్యమున దేవేంద్రునకు, ఓర్పున భూమికి, బుద్ధియందు బృహస్పతికి సమానుండు. రాముడు ధర్మజ్ఞుడు, సత్యసంధుడు, సుశీలుడు, అసూయలేనివాడు, ఓర్పుగలిగి యూరడించువాడు. ప్రియభాషి. కృతజ్ఞుడు, జితేంద్రియుడు. మృదువైనను దృఢమైన మనస్సుగలవాడు. సదామంగళకరుండు, బహుశ్రుతుడు. వృద్ధబ్రాహ్మణులను సేవించుటవలన బొందిన కీర్తితేజంబును గలవాడు. సర్వశస్త్రాస్త్ర

నిపుణుడు. వేద వేదాంగాధ్యయన సంపన్నుడు. భరతునికంటె సంగీతమున శ్రేష్ఠుడు. సుగుణుడు, దీనమించుకయైన లేనివాడు. మహాబుద్ధిశాలి. రాముండు యుద్ధమునుండి జయము లేక మరలినదిలేదు. రాముండు సర్వ వర్ణాశ్రమ ధర్మరక్షకుండు. సర్వజనుల సుఖదుఃఖములయందు ననుతాపముబొందువాడు. ఎట్టికష్టములనైన నసత్యమాడడు. మహోత్సాహుడు. మంత్రశక్తిప్రాప్తికమైన వాక్కులవాడు. ఎట్టికష్టంబులనైన ధర్మంబు విడువడు. ఆశ్రితవత్సలుడు. కలహప్రియుండెన్నటికి కాడు. లోకాభిరాముండైన రాముండు మనుష్యత్వంబు నొందిన విష్ణువేయున్నాడు. ప్రజాపాలన తత్వజ్ఞుడు. త్రిలోకాధిపత్యమైన, నిర్వహింపగలడు,' నిగ్రహానుగ్రహసమర్థుడు. గొప్పదాత, కేవల శాంతుడు. ఇట్టి రామునకు పట్టాభిషేకంబుసేయ సమస్తజనులు గోరుచున్నారు నీవుగూడ విష్ణువుతోగూడ సమానుడవే. నీయందు లోపమెన్నటికి గలుగదు, గావున రాముండు యువరాజుగానుండ గోరినాము. నీవు మాకు సెప్పి పట్టాభిషేకంబునకు తగుసన్నద్ధంబు జేయుమనిరి. అప్పుడు వసిష్ఠ వామదేవాది పురోహితులు, గావలసిన వంతయు సమకూర్చి విద్యాభ్యాసంబు సేయుచున్న రాముని గొనివచ్చిరి. అప్పుడు దశరథుండు రాముని జూచి, రామా! నేను వృద్ధుండనైతి. నేగోరిన భోగంబుల ననుభవించినవాడను. సర్వఋణములు తీరినవి. నిన్ను యువరాజుగా జేయ గోరియున్నాను. అయితే స్వప్నంబున భయంకరంబులై యనేకరంబులైన దుత్పాతంబులు అవశకునములు, పిడుగులతోగూడిన [illegible], గొప్పధ్వనులు, గనబడుచున్నవి. గనుక నాకిప్పుడు దోచినతలంపు నామాటవిని మునుపె నీవభిషిక్తుండవగుము. అట్లు గాదేని, "చలాహిప్రాణినాంమతి" అనగా ప్రాణులబుద్ధి చంచలంబు గావున భేదంబు కలుగును. గనుక రేపు నీవభిషిక్తుండవగుదువు గాక. భరతుండు రాకుండ వరకు నీయభిషేకంబునకు దగినకాలమని నాకుదోచుచున్నది. భరతుండు సుగుణవంతుడే అయినను, "కింతుచిత్తం మనుష్యాణామనిత్యమితి మే మతిః। సతాంతుధర్మనిత్యానాం కృతశోభిచ రాఘవ॥" అనగా మనుజులమనస్సు చంచలంబని నాసిద్ధాంతము. రామా కేవలధర్మనిరతులైన పెద్దలుమాత్రము తనకుజేసిన యుపకారము దలంచి భేదంబు పొందరు. గనుక నీకు రేపు పట్టాభిషేకంబు జేసెదనని చెప్పెను. అప్పుడు రాముడు గౌసల్యయొద్దకువెళ్లి దశరథుని యభీష్టంబదెలిపి, "అమ్మా! పట్టాభిషేకంబునకై నేనును, సీత ఈరాత్రి యుపవాసంబుండవలయునట. ఇంక గావలసిన మంగళకార్యముల నన్నిటిని మాకువురతో జేయించు"మని చెప్పెను. తరువాత వశిష్ఠుండు రాముని

ఇంటికివెళ్లి “ ఈరాత్రి సీతతోగూడ యుపవాసంబునుండుమని సమంత్రికంబుగా నుప
వాసం జేయించెను. అప్పు డయోధ్యయందుండు జనులందరు రాజమార్గంబులయందు
నిండి ప్రతిప్రదేశము నలంకరించి సూర్యోదయం బెప్పుడగునో యని యతికుతూహలం
బుతో వేచియుండిరి. అంత రాముండు, నారాయణునికొరకు ఆజ్యహోమము జేసి,
దర్భలంబరచుకొని మౌనంబు నొంది మనస్సు నిశ్చలంబు జేసికొని సీతతోగూడ శయ
నించి నాల్గవ ఝామున నిద్రమేల్కొని తనగృహంబు నలంకరించి ప్రాతఃసంధ్య
నుపాసించి పుణ్యాహవాచనంబు చేసికొని తండ్రియాజ్ఞకు సిద్ధంబుగ నుండెను. అయోధ్య
పురియందంతయు త్సాహంబు పెరిగి యనేకపట్టణములనుండి రాముని పట్టాభిషేక
మహోత్సవంబుజూడ ననేకవేలకొలది జనులు నిండి కిక్కిరిసియుండిరి.

అప్పుడు కైకేయికి పుట్టింటివారు హరణంబుగానిచ్చిన మంథర యను దాసి
తనమిద్దెనెక్కి పూలుసముహములతో నిండిన యయోధ్యారాజ్య మార్గంబులంతయు
కలయజూచి అచ్చటసంతోషంబున నుప్పొంగుచున్న చిహ్నాలను గనుగొని సమీపమున
నున్న దాదిని నీయుత్సవంబేల కలిగినదని యడుగ, రామాభిషేకవార్తను జెప్పెను.
అప్పుడుమంథర కైకయియొద్దకు బరుగిడి “ తెలివిలేనిదానా! లెమ్ము, ఏలపరుండి
యున్నావు. నీ కిప్పుడు గొప్ప భయంబుగరాబోవుచున్నది. రాబోవు దుఃఖంబులనెంతకు
దెలిసికొనక యూరకున్నావు. నీ పెనిమిటికి నీవు ప్రియురాలవు కానిదానవు, భాగ్యంబు
గలదానవని పొగడుకొనుచుంటివి. ఇప్పుడు నిన్ను జెరుచుటకై యత్నము జేయబడినది
రామునకు పట్టాభిషేకంబు దశరథుడు జేయబోవుచున్నాడు. దశరథునకు నుత్తమ
భార్యనీవు అయినను రాజులనడతలు క్రూరంబులని నీకు దెలియదు. దశరథుండునోట
ధర్మంబులు జెప్పుచున్నను, రహస్యముగా గీడు సేయువాడు. ప్రేమగా మాటలాడినను
బహుక్రూరుండు. నీవు నిష్కపటివి. గనుక యతనిని నమ్ముచున్నావు. భరతుండులేని
సమయంబుజూచి రామునికి పట్టాభిషేకంబు జేయబూనియున్నాడు. మంచిమాటలచే
నిన్ను బొబ్బించుచు, నిప్పుడు కౌసల్యకు గొప్పఫలంబు సమకూర్చుచున్నాడు. పామువలె
నీవునమ్మి ఉపలాలించుచున్న నీనుగడు నీకు కీడుజేయును. నిన్ను, నీకొడుకును రక్షించు
కొనుము. యని మంథర సెప్ప, కైకేయి యామాటలకు విసుకుజెందక సంతోషవార్త
నుజెప్పిన దని మందరకు యొకయాభరణమును బహుమతిగ నిచ్చెను. మరియు నిట్టిశుభ
వార్త దెలిపినందుకు నింకేమిజేయుదును. రాముడు, భరతుడు వీరిరువురు నాకొకటియే
రాముండు నాకు పరమప్రీతితో సేవజేయుచున్నాడు.

39. దైవస్వభావ మెట్టిది యని యొకతత్వవేత్త నడుగ నాప్రశ్నకు నుత్తరము జెప్ప 3 దినములు యోచించవలెననెను. నాల్గవనా డడుగ మఱి మూడురోజులు గావలెననెను. నాల్గవనా డడుగ నింక మూడురోజులు గావలెననెను. తుదకు దేవుని గురించి యెంతనెక్కుడవగ జింతించ నంతయెక్కుడవగ ననిర్వచనీయ మగుచున్నదని యుత్తరము జెప్పెను.

40. ఒక క్రీస్తుమత ప్రవర్తకుడు వీధియందు జనులకు దనమతమును బోధించుచు మీవిగ్రహము నొక కట్టెతో గొట్ట నదియేమి చేయునని జనులనడిగెను. వారిలో నొకడు నీదేవుని నేనుదిట్టిన వాడేమి చేయగలడని పృచ్ఛజేయ నాక్రైస్తవు నీవు జచ్చినవెనుక దేవునిచేత శిక్షింపబడుదువనెను. అందుకు బదులుగా నాదేవుడు గూడ నీవు జచ్చినవెనుక శిక్షించుననెను.

41. శత్రువులచే రాజ్యాధికారము గోల్పోయి హిమాలయపర్వతమున నుండు సమయమున "నీవింత దౌర్భాగ్య మనుభవింపుచు నుండి నింకను దేవునిని భక్తితో నెందుకు గొలచెదవ'ని ద్రౌపది ధర్మరాజు నడుగ ప్రియురాలా! హిమాలయ మెంత మనోహరంబుగ నున్నది. నేను దానిని ప్రేమించెదను. అది నాకేమి ఫలకారికాదు. ఐనను ఘనమై సుందరమైన దానిని, ప్రేమించుట నాస్వభావము గనుక దానిని నేను ప్రేమించెదను. అట్లుదేవుని గూడ బూజించెదను. దేవుడు సౌందర్యమునకు గాంభీర్యమునకు గనియైన వాడు. ప్రేమించ దగినవాడు. అతనిని ప్రేమించుట నాస్వభావము. అతని కిచ్చవచ్చినట్టు నన్ను నుంచనిమ్ము. ప్రేమకై యతనిని ప్రేమించెదను. ప్రేమయందు వ్యాపారము జేయజాలను' అని బదులు చెప్పెను.

42. ఒకయోగి యొక జ్ఞానివద్దకు వెళ్లి తాను వాయువున నెగురగలననియు, భూమిలోపల నెలలకొలది వాసము జేయుదుననియు, నీటిమీద నడచెదననియు చెప్పెను. దానికి జ్ఞాని 'సహోదరుడా పక్షులాకసమున నెగురును. క్రిమి కీటకము లేండ్లకొలది భూమిక్రింద వాసముచేయును. చేపలు నీటబ్రతుకును. హీనజంతువులు చేయు కార్యములు నీవుజేసిన నేమియోగ్యత కలవాడవని చెప్పవలయు. ప్రయత్నముచేసి

దేవుని బోలయత్నించుము ఇతరులందు విశ్వాసమున జ్ఞానమున నణకువయందు దేవుని ననుకరించుము డంభము మానుమని' బోధించెను.

43. ఒకనదియొద్దున ముగ్గురు రాత్రిని దినువారు జేరి యవతల గడ్డనుండు దీపము యొక్క ప్రకాశము నీటియందు తళతళ లాడుచుండ దానినే దీపమనుకొనిరి. వారిలో నొకడు చుట్ట త్రాగ నుద్దేశించి ఆవెలుతురుతట్టు చుట్టతో కూడా చేయిని చాచి దీపమును ముట్టినట్లనుకొనెను. మరియొకడు మోకాలు లోతున నగ్ని గనుపడు చున్నదనుకొని తాను నదిలోనికి దిగి మోకాలులోతువరకు వెళ్లి యచ్చోట తన చేతనున్న చుట్టను ఆప్రకాశమున వెలిగించుకొనగోరి చుట్టను చేతిలోనుంచి దాచ నదినీళ్లదడిసి యంటుకొనలే దనుకొనెను. ఇట్టిదే మనజగత్సృష్టి జ్ఞానము. మనపూర్వికుల కంటె మనకు గొన్నివిషయములు తెలిసియుండినందున వారికంటె మనము జ్ఞానవంతు లనుకొనెదము. అయితే మనజ్ఞాన మెక్కువ చిక్కులు బెట్టును. మనపరిమితిగల మనస్సెప్పుడు అపరిమితమైన సృష్టిజాలముయొక్క రహస్యమును గనుగొనజాలదు.

44. ఒకశిష్యు డొక గురువును బ్రహ్మస్వరూపమును దెలుపుమని యడుగ, శిష్యుడా బ్రహ్మమును దెలుసుకొనుమా! యని తూష్ణీభావము వహించెను. శిష్యుడు దానిని గ్రహించజాలక యెక్కువ యుత్తరమునకు చాలాకాలము వేచియుండి గురువున పలుమారడుగ 'శిష్యుడా! నేను నీవడిగిన విషయమును బోధించుచుండ గ్రహించజాలకున్నావు. మౌనమే బ్రహ్మస్వరూపమని తెలియవలె' ననెను.

45. ఒకానొక కాలమున వేలయశ్వమేధయాగములతో సత్యమును సరితూగు నట్లు చేయ సత్యమెక్కువ భారమైయుండెను. సత్యమే పరమగతి. సత్యమేధర్మము. సత్యమే తపస్సు. సత్యమే యోగము. సత్యమే శాశ్వతపరబ్రహ్మము.

46. ఒకానొక మహారాజు మృగయాసక్తితో నడవికి వెళ్లి యొకఋషిని సందర్శించి యాతనితో కొంతసేపు సంభాషించి సంతుష్టుడై యొకబహుమానము నంగీకరించవలయునని నాఋషిని బ్రార్థించెను. ఆఋషి యందు కియ్యకొనక 'నాయవస్థతో నేను తృప్తిబొందియున్నాను. ఈవృక్షము నాకుగావలసిన ఫలముల నిచ్చును. ఈ మనోహరమైన నది నిర్మలోదకములనిచ్చును. ఈ గుహాల నేను విశ్రమించెదను. నీవు రాజవయ్యును, నీబహుమతులతో నాకేమి ప్రయోజనము. ఏపదార్థ గ్రహణము వల్ల నిజమైన సుఖముగలుగునో యది నావద్దయున్నద' నెను. అంత నారాజు బలవంత

పెట్టి నాఋషి యతనివెంబడి నగరునకు వెళ్లెను. అచ్చట కొంతకాలముండి రాజు ప్రతిదినము బిడ్డలను ధనమును రాజ్యమును దయచేయుమని దేవుని ప్రార్థించుచుండ, నాఋషి దిగ్గునలేచి తనయాత్రయునకు వెళ్ల, రాజు 'స్వామీ నాబహుమతుల నంగీకరించవలెన' ని ప్రార్థించ 'ఓభిక్షుకుడా, భిక్షుకులయొద్ద నేను బిక్షముగొనను. నీవే మిచ్చుజాలుదువు. ప్రతిదినము నీవేదేవుని భిక్షమడుగుచున్నావు. దేవునిని దీనిని దానినివ్వుమనియుడిగిన భక్తికిని వ్యాపారమునకు నేమిభేదము చేసియున్నావని' చెప్పివెళ్లెను.

47. సంసారవృక్షమునకు బ్రహ్మము మూలము. మాయబీజము. ప్రతిక్షణము నాశనార్హమై పైనవేళ్లుగలిగి క్రింద వ్యాపించిన శాఖలుగలదైన యశ్వత్థవృక్షము సంకేతముగ నున్నది. కర్మనియమముల ననుసరించు జననమరణ ప్రవాహరూపమగు కామములను నీటి నేతి వృద్ధిపొందును. దీనికి బుద్ధి మండేము. ఇంద్రియములు తొట్టలు. మహాభూతములు శాఖలు. ఇంద్రియవిషయములు కొమ్మలాకులు. ధర్మాధర్మములు పుష్పములు ప్రాణుల సుఖదుఃఖములు ఫలములు. దేవతలు ప్రాణులు. ఫలానుభవ ప్రదేశములా వృక్షములోని గూళ్లు, ఈవృక్షము గొప్పదై శాశ్వతమైనను సాక్షిమాత్రమైన యాత్మ తత్వస్ఫురణమాత్రముననె యదృశ్యమై ఎండమావులయందలి నీటివలె నసత్యమగును. ఇది సత్యము. సత్యము.

48. ఒకముసలివాడు ప్రతిదినము దేవాలయమునకు వెళ్లి తన్ను దేవుని పాదారవిందము లెప్పుడుజేర్చుకొనునో యని చాలాసేపు వేడుకొనుచుండెను. దేవాలయమునందరు వెళ్లినవెనుక చాలాకాలముపరకు నిలుచుకొని దేవునిని ప్రార్థించుచుండెను తాను బహుభక్తుడనియు ఇతరభక్తులకంటె శ్రేష్ఠుడని యనుకొనుచుండెను. వాడు ప్రతిదినము దేవాలయమున చాలాసేపుండుటవల్ల పూజారి చాలావిసుకుకొని వానిభక్తి పరీక్షించ నిచ్ఛయించెను. దీనికై యొకనాడు వాడు దేవునిని ప్రార్థించుచుండ పూజారి దేవునివెనుక దాచుకొనియుండి 'ఓముసలివాడా! ఇక్కడరమ్ము, నిన్ను నాలో నైక్యముచేసుకొనెద' నెను. ఇట్లు బిగ్గరగా వినబడినతక్షణమె దేవుడు తన్నెక్కడ మ్రింగునోయని దేవాలయమునుండి పరుబడి నాటినుండి దేవాలయముత్రోవ తిరిగిచూడక యింటిలో నున్నను దేవుడు తన్ను మ్రింగునని భయపడుచుండెను. ఇట్టికపటభక్తివల్ల నేమిప్రయోజనము.

49. యయాతి మహారాజు భూలోకమున నున్నప్పుడు దాను చేసిన యాత్మసుఖత్యాగపుధర్మకార్యములకొరకు స్వర్గసుఖానుభవము పొందెను. అచ్చట కల్పవృక్ష

'Registered No. M 716.'

SWAN SERIES No. 3.

ఓం






# A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఒక యాంధ్ర బ్రహ్మజ్ఞాన మాసపత్రిక.

సత్యముకంటె నెక్కువ ధర్మములేదు.

గుచ్ఛము 2.] సౌమ్యసంవత్సర భాద్రపదం 5010, అక్టోబరు 1909. [సంచిక ౧౦.

విషయసూచిక.



చెన్నపట్టణము:

వైజయంతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

మానేజరు, హంసవిలాస్, 296 లింగిశెట్టి వీధి, జార్జిటవున్, మదరాసు. అని వ్రాయవలెను.

సంవత్సరమునకు చందా 1 రూపాయ.

ఓం



సత్యముకంటె నెక్కుడు ధర్మములేదు.

గుచ్ఛము 2.] | సౌమ్యసంవత్సర భాద్రపదం 5010, అక్టోబరు 1909. | [సంచిక ౧౦.

## ఒక విన్నపము.

మహాభాగులారా! నా యుద్దేశము తామిప్పటికి సమగ్రంబుగ గ్రహించి యుండవచ్చు. నేను విశేషముగ దెలియ జెప్పుట కర్తవ్యంబగు. మన తత్వశాస్త్రములు అజ్ఞులకు గహనములుగ నుండుటచే, వాటిని సుకరముగ సంగ్రహించుట కై, బ్రహ్మవిద్యా సమాజమున కగ్రాసనాధిపతియై యోగాభ్యాసపరాయణులైన శ్రీ అనిబిసాంటు మహానుభావురాలు దివ్య వాక్యామృతము చిలికి నాంతర సమస్త మతములకు దెలిపిన జ్ఞాన మార్గము సుగమముచేసి యెంచి ఇట్టి గ్రంథములు ప్రచురించిన వెల లధికములగుటచేతను జనసామాన్యమునకు విద్యాపరిచయము చాలా తక్కువగుటచేతను అవని యెరుగుటకు కాదని యెంచి ఈ సులభ నవీనపత్రికా మార్గ మవలంబించవలెనని తమకు మీరలందరు ఇదివరకు నన్ను పోషించి నందులకు చాలా కృతజ్ఞుడనై యున్నాను. ఐనను ఇది వరకు జరిగిన పోషణ చాలాతక్కువగనే యున్నది. ఒక్కొక్క చందా దారును మీరొక్కొకరు సంపాదించి యిచ్చిన నాగతి నిరుపద్రవముగ

జరుగును ఈసంవత్సరము ఇంతలోనే ముగుచున్నది. దానితో నన్ను మూగనివ్వక, దయచేసినన్ను లపనెత్తిన మిమ్మును దివ్యస్థానమునకు ఎత్తుకొని పోవ సముకట్టి యున్నాను. కటాక్ష వీక్షణము తప్పక దయచేయుడీ!!!

హంస.

## జ్ఞాన యాత్ర.

మనము నివసించు ప్రపంచము కాక వేరులోకము లున్నవి. మనకు గోచరమగు ఇంద్రియములు శక్తులు కాక వేరు ఇంద్రియములు శక్తులు మనయందున్నవి. అవన్నియు కాలక్రమమున ప్రతిజీవునకు కొందరికి త్వరగాను, కొందరికి యుగములు కడచిన వెనుకను తెలియబడుచున్నవి. అయితే, అవకాశము, కాలము, ధైర్యము గల జనులు వాటిని శీఘ్రకాలములోనె తెలుసుకొన వచ్చును, సాధించ వచ్చును.

ఈ విషయము సత్యమని తెలిసినవారు, ఆ శక్తులను కోరరు. మహానుభావులు వినియోగించుకొనునది సాధకమును ఇట్టివి ఎప్పుడు లబ్ధమగునని అత్యాశతో కోరుదురు. అయితే దాని ఖరీదు యిచ్చినగాని అట్టి భాగ్యము సమకూరదు.

లోకమున జనులు ఇది మంచి పదార్థము దీని సంగ్రహించవలెనని దేనిని కోరుదురో అట్టి పదార్థముల నన్నిటిని త్యాగము చేయవలయును. స్వార్థపరత్వ మించుకయైన తలపెట్టకూడదు. ఇతరుల సేవను పూర్ణశ్రద్ధతో నడుపవలయును. స్వార్థపరత్వ వాంఛలు నశింపవలయును. ఐహిక పదార్థముల సంసర్గను బొత్తిగ వీడవలయును. ఇదియే చెల్లించవలశిన ఖరీదుయొక్క మొదటి కంతు.

ఇదియే జ్ఞాన యాత్రయొక్క మొదటిఅడుగు. ఈ అడుగు పెట్టుటకు మొదట భయపడిన, ముందు అడుగు పెట్ట తలంచుట కూడ వ్యర్థమే. సోమరితలంపులే.

ఈయాత్ర మార్గము ముండ్ల పొదపుగా నున్నది. ఈయాత్రకు ముండ్ల కిరీటమే కలుగును. దాని దండము ఏడుముడులు గలది. ఒక్కొక్క ముడి ఒక్కొక్క కంతు

చెల్లించుటకు సూచనగా ఉన్నది. దానిని చూచిన ప్రతిమనిషి భయముతో వణకి వెనుకకు దిరుగును.

గురువులు లేకపోలేదు. జ్ఞానమార్గము దాచబడలేదు. తెలుసుకొనవలయునను మనసు, ప్రేమ, కోరిక, ఇవియే లేకయుండునవి. ఇవి లేనందువల్లనే మనము అజ్ఞానములో పొర్లుచున్నాము. వేరు అజ్ఞానము కారణము కాదు.

లోకములోని అనేక మతముల ముఖ్య అభిప్రాయములను పరిశీలించి చూడ, అన్నియు ఒకమూలమునుంచి కలిగినట్లు ఏర్పడుచున్నది. మహానుభావుల సంఘమొకటి కలదనియు, వారు లోకధర్మములను గాచుచున్నారనియు, ఆ ధర్మములు శిథిలము కాకుండ అప్పుడప్పుడు లోకములకు తెలుపుచున్నారనియు కూడ ఏర్పడుచున్నయది. వారు అనేకయుగములుగా పెరిగి, జ్ఞానవంతులై లోకములకు జ్ఞానబోధజేయ నిలిచినవారు. వారు ఆసక్తిగల శిష్యులను ప్రోత్సహించుచు జ్ఞానపథమున నడుపుదురు. ప్రేమ, భక్తి, ఇతరులకు నేర్పవలెనను భావముతో స్వార్థపరత్వము లేక జ్ఞానము సంపాదించవలెనను కోరిక, ఈ సామగ్రితో జనులు వారిని సమీపింప వారప్పటికిని దర్శనమిచ్చి జ్ఞానబోధన ననుగ్రహింతురు. వారి గృహద్వార స్తంభములు ప్రేమ, విజ్ఞానము. ఆశ, స్వార్థపరత్వము ఈ రెండును విడిచినవారే ఆద్వారము ప్రవేశించ నర్హులు.

## దేహము.

శ్రీరాములవారు దేహస్థితి నిట్లు వర్ణించి యున్నారు.

ఓ వశిష్ఠమహాఋషీ! పిశాచులవీణవలె నాడులను తంతులచేత యుక్తమై లతామయమైన అరణ్యములె వికారమైన ఈదేహముకూడ దుఃఖమునకు చలించుచున్నయది. ఇది జడమైనను దృష్టిహస్తాభి నయనముల చేతను వాగ్విలాసముచేతను జ్ఞానివలె కనబడుచున్నది. సర్వవ్యాపకమైన ముఖ్యసత్త్వాశ్రయమైన బ్రహ్మజ్ఞాన దృష్టిచేత చూడగా చిదాత్మకమనియు మాయామయమైన జగత్తుదృష్టిచే చూచిన జడమని చెప్ప యోగ్యమైన ఈదేహము జ్ఞానసాధకమైనట్లయిన క్షేమకర మనిపించుకొనును. అట్లులేకున్న దీనికంటె అవివేకమై ఘోరమైన శత్రువు వేరొకటి లేదు. బాలుని మనస్సువలె

ఇది తృణము మొదలైన అతిస్వల్ప పదాపదార్థ లాభముచే సంతోషపడును. అది దొరక కున్న, ఒక నిమిషమాత్రమున చాలా దుఃఖించును. నవ్వు పూవుల చేతను, భుజ శాఖల చేతను, నేత్ర భ్రమరముల చేతను, కరచరణోష్ఠ పల్లవముల చేతను, వృక్షమును పోలి యుండు ఈ దేహము సంసారమార్గమున సంచరించు జీవులకు ఛాయావృక్షమువలె ఆశ్రయమగును నదిని దాటుటకు చేసుకొన్న తెప్పనే తానని తెలియునట్లుగా మూఢులే ఈ దేహమును తానని తెలియుచున్నారు. నాడీలతల చేతను, ఇంద్రియ పక్షుల చేతను, శుభాశుభ ఫలముల చేతను, చింతాకుసుమ గుచ్ఛముల చేతను, రోమ తృణముల చేతను, కర్ణ నేత్రాది బిలముల చేతను కూడుకొని కామక్రోధాది దుష్టమృగముల చేతను, ఆశా సర్పముల చేతను దుర్దృష్టి చోరుల చేతను, అడవివలె భయంకరముగా నుండు ఈ దేహము ఎవరికైనను విశ్వాసము కలిగించునా? చర్మ రక్త మాంస పూరితమై డవా డవా యను శబ్దమిచ్చు ఈ దేహమున నేను బోనులో చిక్కిన పునుగు పిల్లివలె బద్ధుడై తల్లడపడుచున్నాను. అహంకారమను యజమానుడు ఈ దేహమను యజ్ఞశాలలో విషయములను యూపస్తంభములందు, ఆశలను పాశముల చేత బిగింప బడిన ఇంద్రియములను పశువులను కామక్రోధములను ఋత్విక్కులతో, కత్తిరించుచు తానే నష్టమగుచున్నాడు. నాడులను పగ్గముల చేత మిథ్యాజ్ఞానమను మూలస్తంభము చేతను చర్మమాంసాది ధాతువికారమైన గోడల చేతను కాళ్లు చేతులను బైట పడ సాలల చేతను మలమూత్ర ద్వారములను బచ్చలుల చేతను, కడుపను వంటయింటి చేతను, ముఖమను మిద్దె చేతను, ఇంద్రియ ద్వారములను గవాక్షుల చేతను విషయ సమూహమను ఉగ్రాణము చేతను, గృహమును పోలిన ఈ దేహమున దుఃఖమను పిల్ల వాని రోదనము చేతను, మచ్చేలను దూతికల శబ్దము చేతను, గవాక్షులలో ఆడుచున్న తృష్ణయను యజమానుని దురాక్షేపము చేతను, ప్రాణాపానమను భృత్యుల పాద ఘట్టన చేతను అహంకారమను యజమానుని ఆక్రోశము చేతను, కామక్రోధాది అంతశ్శత్రువుల రావిడి చేతను, నాలుకయను వంటవాని అరపు చేతను, చింతలను స్త్రీల దుశ్చేష్టల వల్లను, దంతపఙ్క్తియను విసరరాయి మ్రోతవల్లను, అసహ్యమైన ఊర్ధ్వాధోవాయువులు వీచుటవల్లను, తెలియనట్లు లోపల చేరుకొని తొందరపెట్టు రోగముల సందడి చేతను, భోగాశలను లంజల నటనము చేతను, ఒక నిమిషమైన నిలువలేక, జ్ఞానమను ధనమును ఆశ చేత విడువనోపక, వ్యథపడుచున్నాను. మందహాసమను దీపముచే ఒక క్షణము సుందరమై కన్నీటి వానచే నొకక్షణము చూడనశక్యమై అంతస్సంతాపముల

చేత నొకక్షణము ఘోరమై సంతోష విలాసములచేత ఒకక్షణము మనోహరమై, తొండవలె క్షణక్షణమునకు వర్ణము మారుచున్న ఈ దేహమును నేను చూడలారెను. బురదగుంతలోపడిన ఏనుగను లేవనెత్త సామర్థ్యములేని పసిఏనుగువలె, జ్ఞానబలముచే ఈ దేహము నుద్ధరించుటకు శక్తిలేక చింతించుచున్నాను. మలమూత్రభాండమైనను జ్ఞానసాధన దృష్టిచే గ్రాహ్యమైన ఈ శరీరము నీటిబుగ్గవలె అస్థిరమైనది గనుక నమ్ముటకు యోగ్యమైనది కాదు. ఎన్నివిధముల రక్షింపబడినను మరణమను సంకటము వచ్చిన కొంచమైనను పనికిరాని కృతఘ్నులైన జనులకై మనము తొందరపడుట ఉచితముకాదు గనుక, రాజ్యసంపత్తు మొదలైన దానిని పరిగ్రహించక, ఈదేహము నన్ను విడుచుటకు పూర్వమె నేనె దీనిని విడువకోరుచున్నాను. ఎంతతినినను ఎంతత్రాగినను, ఎంతకట్టినను, ఎంతతొడిగినను, ఎంతసుఖించినను పాడుదోవ సేయుచును గనుక కొంచమైనను అభిమానపడక, నిర్బంధముచేత చెడ్డమార్గమున పోనివ్వక, నిగ్రహించు వానికి ఇది సుఖసాధనమగును గాని దుష్టబాలునివలె లాలనకు సాధ్యమై మంచి మార్గమునకు వచ్చుటలేదు. గుంతలో పడుటచే దుఃఖమును సింహాసనముపైన కూర్చొన్న సుఖమును ఏది సహజముగా దెలియదో, జడమూఢమైన ఈశరీరమున అభిమానపడుటచేత నాకేమి సుఖము కలుగబోవును. మనోవాయువులకంటె దీనిగతి తెలియ నసాధ్యము గనుక ఈ శరీరస్థితి నమ్మతగినది కాదు. లోకాభిమానమునకు శరీరాభిమానము కారణమైనది గనుక శరీర సౌఖ్యమును కోరువారు దృష్టిదోషములచే హానిచెందుదురు. జడాజడవిచారముచే దేహమునకు నాకు సంబంధమేమి యని విచారించుచు దేహమును తిరస్కరించుచు పరమానందమును పొందుదురు. మెఱపును, గంధర్వనగరమును, ఎవడు స్థిరమని నమ్మునో వాడు ఈశరీరము స్థిరమని నమ్మును గనుక ఈ క్షణికమైన శరీరమందలి అభిమానము వదలి శాశ్వత సుఖమున దృష్టినిలిపి ప్రతివాడు సుఖపడ యత్నించవలయును.

ప్రతిమనిషిలోపలనుండు భక్తిని వెలిదీయుటకు, అతని నాకర్షించు పదార్థములను అతనియెదుట నుంచవలయును, అప్పుడప్పుడు అవతరించుచున్న అవతారములు, మహానుభావులు మొదలగు దేవతాపురుషులటువంటివారు. అట్టివారు తమ నడవడికనుంచియు, తమ జ్ఞానప్రభావమునుంచియు, తమ దివ్యస్వభావము కొంత మరుగుపరచబడియున్నను, లోకులకు కేవలము గ్రాహ్యము చేయవలశిన దానిగా కనబడుదురు. సుందరము, ప్రేమ, ఆనందములే స్వరూపముగాగల దేవుడు, మనుష్యరూపము గైకొని, తనఅంశమును కొంత చూప, సంసారభారముతో నొచ్చిన మాపుగల జనులు, విసుకుజెందిన హృదయములైన జనులు, కొత్త ఆశతోను కొత్తబలముతోను ఆనందముతో ఉప్పొంగుదురు. ఇట్లుకదా మనము కృష్ణుని, రాముని, ఇతర దేవతలను ధ్యానించి సంతోషించుచుము, సద్గతిగనుదము. వారి చారిత్రములవిని, వారి నడవడికనుగని, వారి ప్రభావ దివ్యామృతమును గ్రోలి, మనుచున్నాముగదా! అట్లనే యితరమతములవారును వారివారి దివ్యపురుషులనుసరించి వారిగానంగాంచి పరమగతిని కనెదరు. విశేషప్రకాశమానమైన దైవస్వరూపమును మనదృష్టికి తగినంత జ్వాలగా అనగా అమోఘమైన దివ్యస్వరూపముయొక్క అనంత లక్షణములలో కొన్నిటిని మాత్రము ఈ మహానుభావుల ద్వారా జనులకు తెలియజేయబడును. అది జనుల భక్తికి ఆకరమై, వారిప్రేమ భావము అందరియందలి ప్రేమభావమును బహిర్గత మగునట్లు చేయును.

భక్తిపుట్టుట.

మహానుభావులయెడ గలుగు భక్తిభావము వివాదమునకుగాని ప్రసంగమునకుగాని దగిన విషయము కాదు. భక్తులు వారినిచూచినగానే, వారిమనసున వారిప్రభావము గోచరమై లోపలనుండి భక్తి ఉప్పొంగి సేవించుదురు. వస్తువిచారమువల్ల కూడ భక్తి కలుగునట్లు చేయవచ్చును. అయితే అది మనసులో పుట్టునది గనుక స్వాభావికముగా మనసులో ఉండవలశినదే గాని మనసులో లేకున్న కేవల విద్యావ్యాసంగము వలనను బుద్ధికుశలతవల్లను కలుగునది కాదు.

దైవ అవతారములుగాక, ముక్తిపొంది లోకోపకార నిమిత్తము మనుష్యశరీరములో నిలిచిన జీవన్ముక్తులుగూడ సేవించ దగిన మహానుభావులే.

వారు అవతారములకున్ను తమ శిష్యులైజీవన్ముక్తి దనుబొందని లోకగురువులకున్ను మధ్య అంతస్తుగలవారు. అవతారములకున్ను వారికిని జనులు తారతమ్య

మెంచరు. వారు అవతార పురుషులవలెనే జనులభక్తికి ఆదరమునకు పాత్రులుగా నున్నారు.

తర్వాత లోకమున నివృత్తిమార్గాసక్తులైన వారికి జ్ఞానబోధ సేయుచు జనులతో నివసించు గురువులుకూడ భక్తిరసమునకు అనుగుణ్యులే. వారికి అనేక కొదవలున్నను, సామాన్యజనులకు మార్గము చూపించ యోగ్యతగల వారు గనుక వారికంటె శ్రేష్ఠులని చెప్ప సందేహములేదు. అట్టివారు ఒవస్తుక్త దనను సమీపించినవారు. వారిని సేవించినమాత్రమున భక్తులయొక్క భక్తి ప్రేమ వృద్ధియై జ్ఞానము తనంతటతాను సిద్ధమగును. అందుకే గద గురుశుశ్రూష ముఖ్యమైనదని మనవారందరు ఒత్తి చెప్పుట ఇట్టి గురుశుశ్రూషా పద్ధతి శిథిలమైనది గనుక ప్రకృత కాలపు హీన, అజ్ఞాన స్థితి జనులకు సంప్రాప్తమైయున్నది.

భక్తిని ఎట్లు పుట్టించి వృద్ధి చేయుదుము? ఇంటిలోపలను బైటను సేవించతగిన పదార్థములను ఎఱిగి, సంకోచములేక వాటిని సేవించుటయే మార్గము. ఎక్కడెక్కడ సుగుణమున్న దానినంతయు సంతోషముతో గుర్తించి ఆనందించుచు, దోషములెంచుచు సుగుణములను గ్రహించుకొను అతిస్వభావమును అణచుచు నడచిన గురువు ప్రసన్నమగువేళ నతనిని గుర్తించు సామర్థ్యము జీవునకు గలుగబోవును. సుగుణములను గణించక దుర్గుణములనే చూచు వాడు కలుషితమనస్సుగలవాడు అనేకమారులు సద్గురువు సమీపించినను గుర్తించజాలడు. అది గాక సుగుణమును గ్రహించుభావము గలిగిన మనము ఆ సుగుణమును వర్తించుసామర్థ్యము మనయందు గలిగినట్లగును. ఒకగదిలో అనేకతంబురలను ఒకేనాదమునిచ్చునట్లు తంత్రులను శ్రుతి పెట్టియుండిన ఒకటిని స్పృశించిన తక్కిన తంత్రులుకూడ అట్టిధ్వని నివ్వచలించును ఇట్లు మనయందుండు గుణము ననుసరించి మనచుట్టునుండు నాగుణములను గ్రహించుదుము ఎక్కువ గ్రహించలేము. గనుక గొప్పగుణములను సంపాదించవలయును.

సద్గురు దర్శనము లభించి, అతని అనుగ్రహము కలుగ, మొదటికార్యమైనట్లగును. తర్వాత అతనికి శుశ్రూషలు సలుపుచు అతనిద్వారా ఇతరమహానుభావులకు, పరమాత్మకు శుశ్రూషలు సలిపినట్లగును గురువు సాధనమే గాని గమ్యము కాదనియు, దైవప్రసాద మార్గమే కాని మూలము కాదనియు మనసున నుంచుకొనవలయు. అతడు శిష్యుని తనసహాయముతో బలపరచి, వృద్ధికిదెచ్చును. తుదకు శిష్యునిలోను గురువులోను సదాప్రకాశమానమైయుండు ఆత్మయొక్క ప్రకాశస్ఫురణమే గతియగును.

భక్తి పెంచుట.

మహానుభావులైన దివ్యావతారములందలి భక్తి వారినుడువులను, వారిచరిత్రాంశములను, వారు చేసిన కార్యములను చదువుచు, మననము చేసిన, వృద్ధియగును, భాగవతరామాయణాది గ్రంథములను చదివి, వాటిలోని కథయొకటి జ్ఞాపకమునసుంచి, ఆకథను తదేకనిష్ఠతో తాను కన్నట్టు అనుభవించినట్టు ధ్యానించిన భక్తివృద్ధియగుటకు శ్రేష్ఠమైన మార్గము. అట్లు ధ్యానించుచు రాగా రాగా భక్తుడు ఆఅ అవతార లీలాసక్తుడై, సూక్ష్మదృష్టితో ఆ అంశములన్నియు అనుభవించినవాడగును.

భక్తిని వృద్ధిచేయుమార్గము సత్సంగము. జ్ఞానులతోటి సహవాసము. మంట తెగయుచుండు కట్టెను పొగరాజు చున్న కట్టెలలోన పెట్టిన ఆకట్టెలన్నియు ధగ్గని అంటి మండుట సహజముకదా! అట్లనే భక్తిపరులైన వారియొద్దకు ముముక్షువు సమీపించిన, వానిభక్తి ప్రసాదము సిద్ధమగును అందుకే గురుసాన్నిధ్య మహిమఎక్కువైనదని మనలో ప్రసిద్ధము భక్తిగేసరుడైన నారదుడు గూడ తనసూత్రములలో నిట్లు వర్ణించి యున్నాడు,

ఇట్లు గురుసాన్నిధ్యమే యింత ఫలకారిగానుండ, ఇష్టదేవతను పూజించి ధ్యానించుమార్గము ఎక్కువ బలకారియని చెప్పవలసిన అవశ్యక మేమియున్నది. ఈకాలమున ప్రపంచము శీఘ్రముగా తెలియవలయునని ఆతురపడుచున్నాము కదా! ఈ ఆతురములో శాంతమైన సంకల్పశక్తిని ఉపేక్షచేసి దానిని వృద్ధిపరచుటకు కాలము పట్టునని అలక్ష్యము చేయుదుము. మనము భక్తితో ధ్యానించు స్వరూపము యొక్క ధ్యానము మనభక్తిని వృద్ధిచేయును. గాన ధ్యానము కొంతకాలము సలుపవలయును. ఆసమయమున భక్తుని సంకల్పము మాత్రము కార్యకారియగుట కాదు ఎట్లన, సూర్యరశ్మిలేక మొలక పెరుగనట్లు, ధ్యానించు స్వరూపప్రసాదములేక ధ్యానపరుడు వృద్ధియగుట లేదు. ధ్యానింపబడు స్వరూపము ధ్యానపరుని, తనబలము, తేజస్సుతో, అతని ధ్యానబలిమికొలది నించును. గురువు శిష్యుని ప్రేమించును. శిష్యుడు తనగురువును ప్రేమించుట కంటెను భక్తుడు తనదేవుని ప్రేమించుట కంటెను దేవుడు తన భక్తుని నెక్కువగ ప్రేమించును దేవునియెడ భక్తుని ప్రేమ ప్రేమస్వరూపుడైన పరమాత్మ ప్రేమయొక్క అతిస్వల్ప స్ఫురణమే. భూమిమీద ఒకరాయి వేసిన భూమియంతయు ఆరాతిట్టు చలించి రాతిని ఆకర్షించునట్లు శాస్త్ర

జ్ఞులు చెప్పుచున్నారు. ఆకర్షణ రెండుపదార్థముల ననుసరించి యుండును. అట్లనే దివ్యాలోకములందు మఱింత హెచ్చుగా, మనిష దేవునితట్టు నడువ ఒకఅడుగు పెట్టిన, దేవుడు నూరడుగులను వానితట్టు పెట్టునట. ఏలన దేవుడు దయాస్వరూపుడనియు సర్వసుగుణ సంపన్నుడనియు చెప్పుట, మఱియు నట్టిగుణము లుండుట బట్టియే సముద్రమును పొందిన జలకణమునకు జలము తక్కువ కానట్లు దేవునిగొల్చిన కొఱువ లేమియుండు ?

భక్తి యనగా ఏమైనదియు, దాని యుద్దేశములను, దాని నెట్లువృద్ధి పరచవలసినదియు పైనవివరించినాము. భక్తివల్లనగు ప్రయోజన మింకను విచారింతము.

మొదటిది. భక్తి భక్తుని అతడు ధ్యానించు లేక ప్రేమించు దానిస్వరూపమును పొందచేయును. సొలమను అనుతత్వజ్ఞుడు మనిష ఎట్లు సంకల్పించిన నట్లగునని చెప్పియున్నాడు. ఛాందోగ్యోపనిషత్తున సంకల్పసృష్టి పురుషుడు వాడేమి సంకల్పించిన నట్లగును అని సిద్ధాంతము ఆయితే బుద్ధిమాత్రము పరమాత్మస్వరూపము పొందనేరదు. చల్లనియినుము కఠినమైన పనిముట్లు సాధనములు చేయుటకు నిప్పులోవేసి కరగించబడి కావలసినరూపముల పోతపోయబడిన గాని పనికిరాకుండునట్లు, భక్తియను అగ్నియందు బుద్ధిని కరగించిన, పరమాత్మ నైక్యమగును. ఇద్దరు సమానులకు స్నేహము బలమై చిరకాలస్థాయియై అన్యోన్యప్రేమబలమున్న ఇద్దరు ఒకటిగనుందురు. భార్యాభర్తలు ఏకవిధముగా నుందురు. ఇట్లుసమాన విషయమునందే యుండ, మన కంటె పెద్దల సాంగత్యముచేసిన వారిశక్తి ఎట్లు మనకు అభివృద్ధికరముగా నుండునో మీరే యూహింపుడు.

రెండవది. భక్తి కొత్తకర్మను చేయుట నిలుపును. పూర్వకర్మ నశించిన భక్తుడు సంసారబంధ విముక్తుడగును. పౌలను ఋషి తాను తనదేహమున నివశించ లేదనియు క్రీస్తువే చేయుచున్నాడని చెప్పియున్నాడు. ఇట్లనే ప్రభుభక్తుని విషయమందగును దేహము తనదేహము కాదనియు తనయిష్టదైవము లోకోపకారమునకై యుపయోగించు సాధనమనియు, తాను చేయు కార్యములు తన దైవము నిర్ణయించిన విధియనియు, తినిన తన జిహ్వాచాపల్యమునకు కాదు కాని తనదేవుని సాధనమునకు కార్యమునకు పదిలపరచుటకనియు, నాడుతలచిన, తనకు కలుగుసంతోషమునకు కాదు కాని తనప్రభువు పనిచక్కగా నెరవేర్చవలయుననియు, తలంచినను, తన యిష్ట దైవమునకు తాను చేయునది, తలచునది, ప్రేమించునది మొదలు సర్వకార్యములను

అర్పణచేసి, అతనిలో నైక్యముపొందును. గొప్పనదిలో చేరి పోవు వంకవలె తాను దైవములో చేరి పూర్ణుడగును, గనుకనె.

“యత్కరోషియదశ్నాసి యజ్జుహోషి దదాసియత్। యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వమదర్పణం। శుభాశుభ ఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః” అన నీవేమి చేసినను, ఏమి తినినను, ఏమి వేల్చినను, ఏమియిచ్చినను ఏతపస్సు చేసినను నాకు అర్పించుము. శుభాశుభఫలమునిచ్చు కర్మబంధము నుండి ఇట్లు విముక్తుడగుదువు.

అని భగవానులు చెప్పియున్నారు. కర్మఫలమును కోరక, యజ్ఞమునకై చేసిన, కర్త ఆ కర్మవల్ల లిప్తుడుకాడు జననమరణ సంసార చక్రమునకు బంధింపబడడు.

మూడవది. భక్తి హృదయమును శుద్ధిజేయును.

అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్।
సాధురేవ సమంతవ్యః సమ్యగ్వ్యవసితోహిసః।
క్షిప్రంభవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి॥

కేవల పాపులుకూడ నన్ను చలించని మనసుతో పూజించిన వారిని కూడ వారు సరియైన మార్గమునకు తిరిగినారు గనుక, సాధువు లనవచ్చును. త్వరగా ధర్మాత్ముడై శాశ్వత శాంతిని బొందును. అని భగవాను లనుగ్రహించినారు.

ఊర్ధ్వలోకములందు మనుష్యులు తలంచు సంకల్పములను బట్టి శోధించబడుదురు గాని వారి కార్యములనుబట్టి కాదు, అనగా అంతర్భావము ననుసరించి కాని బాహ్యసంకేతములనుంచి కాదు. మనుష్యుడు దేవునియందు భక్తిని చూప ప్రారంభించినవాడు చెడ్డతట్టు వీపుత్రిప్పి తనగతిని గనువాడని భావించవలయును. వాడు తడబడవచ్చును, మార్గముతప్పి నడవవచ్చును. క్రిందపడవచ్చును, ఎట్లైనను తనపూర్వపు నెలవు తట్టు తిరిగినవాడై సరియైన మార్గముతట్టు తిరిగినవాడౌను వాని విశేషభక్తివల్ల వాడు తన కార్యములు సరిగా నిర్వహించును. పరమపదమును చేర నిశ్చయించినవాడు గనుక దానికి ఆటంకమైన వాటినన్నిటిని దొలగద్రోయును. మొదటినుంచి తనగతిమీద లక్ష్యముంచినవాడు ధర్మముతట్టు ముఖము త్రిప్పిన క్షణము మొగట ధార్మికుడై యుండును. అతనిభక్తి అతడు పూజించు దేవతకున్ను అతనికి మధ్యనుండు తెరను దగ్ధముచేసి ఆదేవతా స్వరూపము అతనిని పొందునట్లు చేయును. భక్తియొక్క ప్రభావ

మిట్టిది గనక నె మహాపాపికూడ దేవునిని చింతించిన మాత్రమున ధార్మికుడవి ఎంచ వలె నని చెప్పబడి నది.

నాల్గవది. భక్తి సుఖునాశము కలిగించును. మనము ప్రేమించు వస్తువులకు చేయునదంతయు సంతోషముతో చేయుదుము యిచ్చుటయందు మొదట దుఃఖ మున్నను ప్రేమాస్పద వస్తువు గనుక సంతోషముతో ఇచ్చెదము. తాను కామించు స్త్రీయొక్క సంతోషమునకో లేక స్త్రీకి కావలసిన పదార్థమునకో పడరాని కష్టములు, దుఃఖములు, సంతోషముతో అనుభవింతుము కదా? ఆపరమాత్మ దివ్య ప్రభావముయొక్క గౌరవమించుక చూచినవాడు, అతనిని పొంద ఎట్టికష్టములను ఇడుములను దుఃఖములను పొందుట విచిత్రమా? మనము ప్రేమించు పదార్థమువద్ద ఉండుటకు ఎన్ని సుఖ ములనైనను అనానుకూలములైనను, మనసుఖములను పోగొట్టు కొనినయైనను, వియోగబాధను పోగొట్టుకొను చుండలేదా? ఇట్లు క్షణికసుఖములకే ఇంత శ్రద్ధయుండ శాశ్వతసుఖ మపేక్షించు జీవులెట్టి శ్రమలైన నెట్లుఓర్చుదురో మీరే యూహించుడు. ఇట్లు భక్తి కష్టమైనవాటిని సులభముగను దుఃఖకరములైన వాటిని సుఖకరములుగాను చేయును. ప్రేమ అనునది ప్రపంచమున సర్వమును బంగారుగా మార్చుచున్నది.

ఐదవది. భక్తి శాంతినిచ్చును. పరమశాంతిని పొందిన మనసు సర్వమందు శాంతినిగనును. భక్తుడు అంతట ఆత్మను కనుగొనును. సర్వభూతములు ఆత్మరూప ములని ఎంచును. ప్రతిపదార్థము ఆత్మను చూపుచుండ వాడు ఎట్లు ద్వేషముగాని స్నేహమునుగాని చూపగలడు.

“ విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని। శునిచైవశ్వపాకేచ పండితా స్సమదర్శినః ” జ్ఞానులు విద్యావినయ సంపన్నులైన బ్రాహ్మణులను, ఆవును, ఏనుగను, కుక్కను, కుక్కనుతిను వానిని కూడ సమదృష్టితో చూతురు.

అని భగవానులు తెలవిచ్చియున్నారు. సర్వము విష్ణుమయము గనుక భక్తునికి ఇతరభావము పుట్టించు పదార్థము లేనేలేదు. మనము ప్రేమించువారు తాకినవస్తులే మనకు ప్రియముగా నుండ మనము ప్రేమించు పదార్థముందు రూపముల నెట్లు ప్రేమించక పోదుము. పిల్లవాడు డాముసపుడు ముఖమునకు వేషము ధరించవచ్చును. అయినను తల్లికి తన పిల్లవాడని తెలుసును.

అట్లనే దేవుడు తనలీలావిలాసమున ననేకరూపములు దాల్చినను భక్తులు వానిని చూచి భయపడక తనదేవుడేకదా యని గుర్తించుదురు. దేవుడు తప్ప చరాచరమొక్కటియు లేదు. మహాపాపియైన చండాలుని హృదయమందు కూడ దేవుడు దాగియున్నాడు.

భక్తుని అతని విస్తారమైన ప్రేమవల్లను, అతని మార్దవమువల్లను, అతని దయ పశ్చాత్తాపము అతని అనురాగము అతని నమ్మకము, అతని మనోవాంఛలవల్ల గుర్తించ నగును. శ్రీరామానుజాచార్యుల వారికి వారిగురువు మంత్రోపదేశము చేసి దానినెవరికి చెప్పవద్దని చెప్ప, చెప్పిన నేమగునని శిష్యుడు గురువునడిగెను నీవుచచ్చెదవని గురువు ఉత్తరమిచ్చెను. వినినవారేమగుదురని యడుగ వారు ముక్తులగుదురని గురువు సెలవిచ్చిరి. అంత రామానుజులు గుడిగోపురద్వారమున నిలిచి తనక్షేమమును కోరని జనులు తరించిన చాలని తన కుపదేశమిచ్చిన మంత్రమును లోకమునకు వెల్లడిచేసెను. పూజించు దైవస్వరూపమును బొందిన భక్తుల లక్షణ మిట్టులుండు సర్వజ్ఞాన సాధనకు భక్తియే మూలము గనుక ప్రతినరుడు దానిని యథాశక్తి సాధించవలయు.

176. ఒకటివెంట నొకటి వేర్వేరుగాను, స్పష్టముగాను నిర్ధారముగాను సంకల్పించువాడే లౌకికవ్యవహారమున కూడ వృద్ధికివచ్చువాడు.

177. ధ్యానము దైవభక్తి పూర్వకముగను బుద్ధికుశలత పూర్వకముగ నుండవచ్చును.

178. శిష్యత్వమునకై సాధించుప్రాజ్ఞుడు రెండువిధములను ధ్యానము చేయును.

179. తనకు ప్రకృతము తెలియకున్నను ముందు తెలియవచ్చునను కోరికతో సద్గురువుపైన మనస్సునుంచి అతడు ధ్యానము చేయును.

180. ఇట్టి అమోఘమైన సంకల్పమును మనసున నుంచుకొని ధ్యానము చేయును.

181 ధ్యానించుదాని స్వరూపమును తాను బొందును.

182. ఇట్లు మానవజన్మ గమ్యమైన పూర్ణస్థితిని నిత్యము ధ్యానించుచుండిన అట్టి పూర్ణస్థితిని క్రమముగా బొందును.

183. ప్రతిమతము నుద్ధరించుటకు సామాన్యులు కాని మహానుభావులు ఇప్పటికి నున్నారు.

184. వారు బహిర్గతమై అధికారవముతో మాటాడుదురు. వారు మాటాడిన మాత్రముననే గౌరవింపదగిన అధికారముగా కనబడును.

185. జనుల యోగ్యతకు మించి బుద్ధికి గ్రాహ్యముగాకుండు విషయములను కూడా వారుబోధించినమాత్రమున మనస్సునకు పట్టును.

186. ప్రతిమనిషియందు దైవాంశమున్నది. ప్రతిమహానుభావుడు విస్తృవించుట దానికే.

187. అనేకయుగములు గడచి అనేక జన్మ సుకృతఫలమున మహానుభవులగుచున్నారు.

188. పూర్వమున మహానుభావులుండిరని వినుచున్నాము గనుక ఇప్పుడు వారుండి తీరవలయునని సిద్ధాంతము.

189. ఈ కాలమునకూడ నేటికిని ఒకరొకరు పూర్వపుజ్ఞానమార్గమును కనుగొనుచున్నారు.

190. శిష్యత్వ మనగా జీవుడు వృద్ధిగాంచుటయే.

191. ఈవృద్ధి కలుగుటకుముందు శిష్యుడుతనసంకల్పములను నిగ్రహించవలెను.

192. శుద్ధమైనట్టియు మేలిచ్చునట్టియు, ప్రయోజనకారియగు వాటిని దప్ప ఇతరమును మనసున నుంచకుండుటకు ప్రయత్నించవలయును.

193. మనుష్యుడు శిష్యుడైన అతని సంకల్పములు బలవత్తరములైనవగును.

194. అతడాలోచించు ప్రతిసంకల్పము ఎక్కువైన చైతన్యము ధైర్యము కలిగినదగును

195. అతడాలోచించు ప్రతిసంకల్పము ప్రపంచమున ఎక్కువఫలకారియగును.

196. గనుక శిష్యుడగుటకు, బుద్ధిచేత మనసును నిగ్రహించుట ఒక నిబంధనగా ఏర్పడినది.

197. తనఇష్టదేవతపైన మనస్సును దృఢముగా నిలుప, మలినమనోభావములు క్రమముగా శాంతమగునట్లుశిష్యుడుకనుగొనును.

198. మలినమనోభావములు శాంతముకాగా, మనసు గాలిచేత చలించని శాంతమైన తటాకమురీతిగ నుండును.

199. అపుడు శాంతమైనమలినమనోభావముయొక్క అద్దమందు శుద్ధచైతన్య స్వరూపము ప్రతిఫలించును.

200. అప్పుడు మనిషి తాను మనసుకంటెను బుద్ధికంటెను మించినశ్రేష్ఠుడని తెలియును.

201. అప్పుడు ఆశుద్ధసత్యచైతన్యముతో తాను ఐక్యము పొంద యత్నించ సాధ్యమగును.

202. నీవు శుద్ధచైతన్యస్వరూపుడవు మలినస్వభావుడవు కావని శ్రుతుల యందు చెప్పుచుండుట మరువకుము.

203. ధ్యానము చేయుచు చేయుచు క్రమముగా శుద్ధసత్వస్వభావమును తెలిసి పొందుదువు.

204. తన నడతను చక్కచేసుకొనుటకు జ్ఞానమపేక్షించు లౌకికుడు దైవసంపత్తిగుణముల నొక్కొకటిగా గ్రహించి, అనుదినము దానిని ధ్యానములోను కార్యములలోను అనుష్టించుటయే కర్తవ్యము.

205. శుచిత్వము వాటిలో నొకటియని దృష్టాంతముగా చెప్పవచ్చును.

206. అశుద్ధమైనతలంపు వానిని ఒక్కటియైన ఎన్నటికిని తగలకూడదు.

207. అశుద్ధమైన కార్యమొకటియైన వానిని మైలచేయకూడదు.

208. మనోవాక్కాయములను త్రికరణశుద్ధి గాంచవలయును.

209. ప్రాతఃకాలమున శుచిత్వము కోరతగిన వస్తువని ధ్యానించును.

210. ప్రపంచవ్యవహారమున వెలుపలికి వెళ్లి ధ్యానించిన దానిస్మృతిని మనసులో నుంచుకొని యుండును.

211. అశుద్ధమైన కార్యము చేతన దేహమును మైల చేయడు.

212. దినమంతయును ఏఅశుద్ధకార్యమును తాను చేయడు

213. అశుద్ధమైన మాట ఒకటియైన వానినోటరాదు.

214. అశుద్ధవిషయకమైన ప్రస్తాపన తనమాటలందు తాకదు.

215. తన గురువుముఖమున నైన మాటాడ ధైర్యముగలిగినట్లు అతని మాటలు ప్రతియొకటి శుద్ధిగానుండును.

216. తనమనసులోనికి ఒక అశుద్ధమైన తలంపునైన చొరనీయడు.

217. తనమనస్సును శుద్ధిచేయును అప్పుడు ఇతరుల చెడ్డతలంపులు కూడ వాని మనసులోనికి దూరజాలవు.

218 తర్వాత ప్రాతఃకాలమున సత్యమును ధ్యానించును.

219. సత్యమును ప్రపంచమున దాని ప్రయోజనమును చింతించును.

220. వెనుక జనసంఘములో దానిప్రయోజనమును చింతించును.

221. తనవడతలో దాని ప్రయోజనమును చింతించును.

222. అసత్యఅభిప్రాయ మిచ్చునట్టు ఒకకార్యమైన చేయడు.

223. అసత్య అర్థమునిచ్చునట్టు ఒకమాటనైన పలుకడు.

224. తాను అసత్యము పలుకకుండుటయేకాక కచ్చితముగ పలుకును.

225. నీవుచూచిన దానిని మరల చెప్పుటయందు కచ్చితముగా అనగా సరిగా చెప్పకున్న అసత్య దోషము సిద్ధమే.

226. శిష్యుడు కాగోరువాడు పెంచి చెప్పనే కూడదు.

227. శిష్యుడు కాగోరువాడు కథను వర్ణించకూడదు.

228. శిష్యుడు కాగోరువాడు వాస్తవ సమాచారమునకు సరిపోని ఒకమాటనైన పలుకకూడదు.

229. శిష్యుడు కాగోరువాడు అసత్యమునకు సంబంధమైన నీడనైన ఉపయోగించ కూడదు.

230. తలంపులలో కూడ శుద్ధముగ నుండవలసినది.

231. ప్రతితలంపు తన చేత సాధ్యమైనంతవరకు సత్యముగా నుండునట్లు చేయవలయును.

232. దయతో అట్లనే ప్రాతఃకాలమున దయనుగురించి ధ్యానించి దినమంతయును దానిని ఆచరణలోకి దెచ్చును.

233. తనచుట్టునుండు జనులందరియెడ దయను చూపును.

234. తనకుటుంబమునకు, స్నేహితులకు, ఇరుగు పొరుగు వారికి కావలసిన చర్యసలుపును.

235 ఎక్కడ కొదువలున్న వాటిని చక్కజేయును.

236. ఎక్కడ దుఃఖమున్న దానిని తొలగించును.

237. ఎక్కడ బాధయున్న దానిని తక్కువ చేయ యత్నించును.

238. దయాపూర్ణుడై దయాస్వరూపుడో యన నడచుకొనుట గాక దానినే మననము చేయుచు దయామయుడగును.

239. ధైర్యముతో అట్లనే బలవంతుల గాంభీర్యమును మననము చేయును.

240. వెలుపలి సంధర్భములెంతకైనః ఖిన్నుడుగా గాని ఉబ్బించునట్లుగా గాని చేయని వానిని గురించి మననము చేయును.

241. జయమైన సంతోషము, అపజయమైన దుఃఖముపడని వానిని గురించి మననము చేయును.

242. సకలము సందర్భముల దయకు పాత్రుడు గాక యుండు వానిని గురించి మననము చేయును.

243. తన స్వస్థానిని గా పొందుకొని, ఎల్లకాలము సమభావము కలవాడై ధైర్యుడై యుండును.

244. దుఃఖము కలిగిన, దుఃఖగంధము తగలని శాశ్వత పరమపదవిని తలంచుకొనును.

245. స్నేహితుండు యమాలయము నకు వెళ్ళ, ప్రాణముగల వస్తువేదియు చావదని యోచించును.

246. నిబ్బరముగా పని చేయును.

మును జేరువారు శుద్ధముక్తులని తెలియవలెను. లోకమునందు వారెంతజ్ఞానులైనను వారినడతయందేమో లోపమున్నదని గ్రహించవలయును.

297. మనకు నాహారమునిచ్చువాడు గనుక దేవుడు దయాళువనకూడదు. ఎందుకనగా తండ్రి తనబిడ్డలకు నాహారమిచ్చుట యతనివిధర్మము. మనలను దారితప్పిపోనివ్వక సన్మార్గములకు బ్రేరేపించుకనున్న నతిని దయాళుడనవలెను.

298. నీవుసాధించి మాయను గనుకొనిన నది దొంగనుజూడ వాడు పారునట్లు యదృశ్యమగును.

299. అగ్నికి నిర్దిష్టరూపములేదు! నవురుగప్పిన నిప్పును రూపములున్నట్లగుపడును. అట్లు రూపరహితమైన దేవుడు రూపసహితుడుగానున్నట్లు కొన్నివేళల గనపడును.

300. దేవునిగూర్చి బిగ్గరగా బ్రార్థించవలెనా? నీకిష్టమువచ్చినట్లు బ్రార్థించుము అతడు చీమపాదధ్వనిగూడ వినశక్తిగలవాడు గనుక నీప్రార్థన నిజముగా వినును.

301. కేవల పుస్తకజ్ఞానముగలవాడు దైవస్వరూపమును వర్ణింప కాశీపట్టణమును పటమునజూచినవాడు వర్ణించురీతియగును.

302. వడగింజయందు పొట్టు ముఖ్యముకాక బియ్యపుగింజ పైరుకు ముఖ్యమైనదైనను బియ్యపుగింజను మడిలోవేయ మొలచి పైరుకాదు. పైరగుటకు గింజను పొట్టుతోకూడ నాటవలెను. ములుముపదార్థము కావలెనన్న పొట్టు తీసివేయవలెను గనుక మతములను వృద్ధిజేసి కొనసాగ క్రియలు కర్తలవశ్యకములు. తత్వబీజములు వాటియందు గలవు ముఖ్యతత్వమునుబొంద నాటిననుష్ఠించవలయును.

303 ముత్యమునుకలిగిన ముత్యపుచిప్ప వెల కొంచమైనను ముత్యమగుటకు నది ముఖ్యము ముత్యమును బొందినవానికి చిప్పతో బనిలేదు. పరమతత్వమును బొందినవాని క్రియలు కర్తలనావశ్యకములు.

304. చేతులనూనెపూసుకొని పనసపండునుతరుగ దాని జిగట పాలు బంక చేతులనంటి తొందరజేయదు గనుక తత్వజ్ఞానమును సాధించి స్త్రీద్రవ్యాసులమధ్య గాపురముజేసిన నేలాటిబంధము కలుగదు.

305. ఈతనేర్చువాడు కొన్నిదినములు బ్రయత్నముజేయవలెను. ఒకనాటి యభ్యాసమున సముద్రమున నెవడీదజాలడు. బ్రహ్మసముద్రమునీద నీవు మొదట యనేక బ్రయత్నములువ్యర్థమైన వెనుక నీవు దానిసుఖమనుభవించగలవు.

806. ఒకని యరకాలున నొకముల్లు చేరిన, దానినిదీయ వేరొకముంటిని యుపయోగించును వెనుక రెంటిని పారవేయును గనుక పరస్పరసంబంధముగల జ్ఞానమే జ్ఞానమును మరుగుపరచునట్టి యజ్ఞానమును బోఁగొట్టగలదు. అట్టిజ్ఞానాజ్ఞానములు మాయయే గనుక తత్త్వజ్ఞాని ద్వంద్వము లేనివాడు గనుక జ్ఞానాజ్ఞానములనుండి విముక్తుఁడగును.

807. ఒకలోతులేని గుంటలో శుద్ధమైన జలమునుగ్రోల జలమునుగదలించక పైజలమును మెల్లగా గ్రహించును. జలమును గదలించిన నందలిమట్టి పైకితేలి జలమంతయు బురదయౌను. నీవు శుద్ధుఁడుగానుండఁగోరిన దృఢభక్తిగలిగి వ్యర్థమైన ప్రపంచముల వాదములను ద్రోసిపుచ్చి భక్తిపూర్వకసాధనకర్మలు క్రమముగా జేయుము. లేకున్న నీయల్పబుద్ధి వికలమగును.

808. మాదేహము నిరర్థకము. అసత్యమైన కీర్తిప్రతిష్ఠలుగలవారెందఱు కాపాడు కొనెదరు. ఒకముత్తపెట్టె నెవరు కాపాడుకొనరు. వెలగల నగలు బంగారువస్తువులు గల్లపెట్టె నందరు పదిలముగా భద్రము జేతురు. అట్లు మన దేహములు దైవవిలాసస్థానములు గనుక దివ్యచైతన్యముండు దేహముల నెక్కుడు కాపాడెదరు.

809. లేతవెదురును సులభముగా వంచవచ్చును. ముదిరినదానినివంచప్రయత్నము చేయ విరుగును. పసిబాలురను సద్విషయమునకు ద్రిప్పుట సులభముగాని వయోవంతులను నీడ్చినను పట్టువదలించుకొందురు.

810. ప్రతివాడు తనమతమునే యనుష్ఠించవలయును. క్రైస్తవులు క్రీస్తుమతమును, తురకలు మహమ్మదీయమతము ననుష్ఠించవలయును. హిందువులకు పూర్వ యార్యఋషుల మార్గమే శ్రేష్ఠమైనది.

811. తత్త్వజ్ఞానదీపము చేత వెలుగువానిదే సార్థకమైన జన్మము. ఇతరులజన్మము నామమాత్రము.

812. ఒకస్త్రీ తలమీద ముందుగ నీటిపాత్రల నొకటిమీద నొకటి మోయుచు నక్కడక్కడ దారిలో సుఖదుఃఖముల సుద్దులుచేయుచు పాత్రలలోనినీళ్లు చల్లనీయక జాగ్రతగ నుండునట్లు సన్మార్గమున నుండవాడు నడచుకొనవలయును. ఏ యవస్థలోనున్నను మనసును ధర్మసన్మార్గమునుండి దప్పకుండునట్లు జాగ్రతగానుండవలెను.

813. భాకలామాయను మార్గముకంటె సుఖమైన తొందరలేని మార్గములేదు. భాకలామా యనగా ఏదిగలుగు నాదియను ప్రజ్ఞలేక సర్వమీశ్వరార్పణము చేయుట.

314. కేవల విశ్వాసభావమెట్టిది? దినమంతయు శ్రమపడి, దిండుమీద నానుకొని చుట్టదీయుచు సుఖముగానుండు స్థితి. సకలసంకటములు బాధలులేని స్థితి.

315. ఎండినయాకులు గాలిచే నలుదిక్కుల వెదజల్లబడును గాని తమకు నేలాటియిష్టముగలిగి ప్రయత్నము చేయవు. దైవమును నమ్మినవారు ఇష్టానిష్టములు లేక స్వప్రయత్నమించుక లేక యతని సంకల్పానుసారముగా వర్తింతురు.

316. ఒకపండితుడైన ప్రాసంగికునకు భోదకునకు ఆత్మజ్ఞానములేకున్న నేమి తలంచెదవు? తనదగ్గరనుంచిన పసులసొత్తును సంగ్రక్షియము చేయువాని వంటివాడు. తానువచించు యభిప్రాయములు తనవి కావు గనుక తనకేమి కష్టములేమగనుక యితరులకు సులభముగా బుద్ధి జెప్పును.

317. మతవిషయమున నించుకయైన విశ్వాసములేమి వలన నాకికుని గుర్తుపట్ట వచ్చును ఏకీర్తనగాని వేదముగాని విననిష్టపడడు. దైవనామస్మరణకూడ సహించడు. ఇతురులనుకూడ నట్లు చేయుటకు ప్రోత్సాహపరచును. పూజలను పరిహసించును. మతసంఘములను పురుషుల నెక్కువగా దూషించును.

318. ఒక కంభముపట్టుకొన్న బాలుడు దానిచుట్టు పడుతానను భయములేక నెట్లు తిరుగుచున్నాడో దేవునిపట్టుకొని యతనియందు మనసునునిచి లోకవ్యవహారములు జరుపుము.

319. ఒకవిటకత్తె గృహకృత్యపుపను లింటసలుపుచున్నను విటునిమీద మనసు పెట్టునట్లు లోకవ్యవహారము జరుపుసమయమున దేవునిమీద మనసునుంచుము.

320. ఒకధనికుని యింటనుండు బిడ్డను బాలిచ్చుదాది తనయజమానుని బిడ్డ తనకేలాటి సంబంధము లేదని తెలిసియున్నను యాబిడ్డను తనస్వంతబిడ్డవలె నెక్కువగా ప్రేమించుచుండును అట్లునీబిడ్డలను నీకు కాపుదారికొరకు నివ్వబడినదని తెలియుము. అందరికి దేవుడేతండ్రి.

321. వేదములను శాస్త్రములను వివేకవైరాగ్యములు లేక యూరక చదువుట వ్యర్థము. ఆత్మజ్ఞానమించుకయైనకలుగదు.

322. కలియుగమునకు సరియైన భక్తిజ్ఞానమార్గము సదా దైవనామస్మరణయే.

323. దేవుని జూడగోరదవేని హరినామసంకీర్తనమును ఫలమును ధృడముగా నమ్మి నిత్యానిత్యవివేకమును చేయుము.

324. ఒకయేనుగను విచ్చలవిడిగా విడచిన వృక్షములను తీగలను పెల్లగించును. మావటివాడు దానిమెదడుమీద నంకుశముతో బొడువ నదియూరకుండునట్లు నిగ్రహములేని మనసు వృథాలోచనల కొలము కడుపును వివేకాంకుశముతో నిగ్రహించిన నది శాంతిని వహించును.

325. హరినామస్మరణము విన్నమాత్రమున నత్యానందబాష్పములు స్రవించని వరకు భక్తిపూర్వకమైన కర్మలను జేయుచుండవలయును. హరినామము విన్నమాత్రమున ఆనందబాష్పములు రాలునంతటి యార్ద్రహృదయుడైన నతనికి నీకర్మలవశ్యకములేదు.

326. ఆత్మజ్ఞానసిద్ధికి సత్సంగమావశ్యకమైన సాధనము.

327. అవసానకాలమున స్మరించిన దేహమున పునర్జన్మమెత్తును. కనుక భక్తి శ్రద్ధయుక్తములైన కార్యములు జేయుట యావశ్యకము. ఇట్టికార్యాభ్యాసమువల్ల లౌకికచింతలుమాని, దైవచింతన మనసుననాట నాయవిచ్ఛిన్నమైనభావము ప్రళయమునకూడ చలించదు.

328. దేవుని నెట్లు ప్రేమించవలెను? పతివ్రత తనమగనిని ప్రేమించునట్లును లోభి ధనమును కాపాడునట్లును భక్తుడు దేవుని మనఃపూర్వకముగా ప్రేమించవలెను.

329. మనలోని మాయ నెట్లు గెలువవలెను? పూలునుండి కాయకాగ పుష్ప రేకులు తమంతట యూడిపడునట్లు నీలో దైవత్వమధికము కాగ మానుషస్వభావ సిద్ధమైన లోపములు న్యూనతలు తమంతట మాసిపోవును.

330. లౌకికవిషయ సుఖములెప్పుడు రుచింపవు? సర్వసౌఖ్యములు ఘనీభవించిన శాశ్వతబ్రహ్మపదవిని బొందనవి రుచింపవు.

331. ఎట్టిమనస్థితియందు దేవునిస్వరూపము కనబడును? మనసు నిశ్చలమైన దేవుడు కనబడును సంకల్పవాయువుచేత మనోసముద్రము కలతజెందిన దేవునిని ప్రతిఫలించ నేరదు.

332. దేవుని నెట్లు కనుగొనెదము? ఎగనీటిలో వేసిఘుంటలకొద్ది తనకు కావలసిన చేప యాయెరను దినువరకు చేపలుపట్టువాడు కాచియుండునట్లు దేవుడు కనబడువరకు ధ్యానము నభ్యసించుచుండవలయును.

333. పాపిహృదయము ముంగరమువలె చుట్టుకొన్న వెంట్రుకలువంటిది. ఎంతచక్కగా నీడ్చినను చుట్టుకొని పోవుచుండును. అట్లుదుర్మార్గుల మనస్సు చక్కజేయుట దుర్లభము.

వారిలోఁ గొందఱిప్పటి మానవకులమున సంజనితులు. మఱికొందఱు తత్పూర్వ
మానవకులజులు. కొందఱు మానవకుల శైశవదశయం దితరగోళములనుండి వచ్చిన
వారు. మఱికొందఱు వర్తమానమానవకులము ప్రవృత్తిమార్గమునఁ గొంత దూరఁ
జనుదు. దానఁ బ్రవృద్ధిఁ జెందినవారు. వీరు తమవా రగుమానవులకుఁ బెంపు సంపా
దింపఁ బూనిన గురువులు. ఆబ్రహ్మమార్గమున వర్తించి పరమపద మందినవానికి మృత్యు
వన చిక్కఁడిది. వాఁడు చిరంజీవి గదా. అట్టివారు పూర్వకాలమున నుండిరనుటయు
ఇప్పుడు నున్నారని నిరూపించుచున్నది. ఆమహాత్ములయునికి నిజమన నింతయు
చాలదే. ఇప్పుడుఁ నట్టిమహాపురుషులఁ గాంచి తచ్చరణకమలసాన్నిధ్యంబుఁ జేరి
యుపదేశ మందినవారి సాక్ష్యమును. వలయునే? మస్సాధ్యంబు ప్రాచీనంబు
నగునాయసిధారావ్రతమున నిప్పు డొక్కనిపిఁబందన మఱియొకఁడు చరింపఁ బూను
చున్నాఁడు. ఆపథము శిష్యత్వమునకుఁ జేర్చు. దానఁ బ్రహ్మమార్గమునఁ బోవ సాధ్యం
బగు. ఇట్టు లొక్కఁ డొక్కరుగ నావృత్తమున గాంచ ప్రాచీనగ్రంథములు నిజముని
ప్రతిపాదింపఁబడుచున్నది. నారు నాపథమునఁ గ్రమక్రమంబుగ ప్రవృద్ధిఁ గాంతురు.

అదియుండనిమ్ము. ఆపథమున నడవ నగ్గాఁ డెట్టివాఁడగునో చూడుము. శిష్యత్వ
మున కర్హతఁ గాంచవలయునేని వరుఁడు ముఖ్యముగ సాధింపవలసిన దొకటి ప్రధమ
గణ్యమగు. అది మనోనిగ్రహము. మొదట మనోనిగ్రహమున నిద్దియనియు నిగ్ర
హింపఁబడు మనంబిట్టిదనియు దాని నిగ్రహించునది యిది యనియు విశదముగ నిరూ
పించెద. లోకమున పెక్కండ్రు మనుజుఁడన మనస్సుమాత్రమే యని భావింతురు.
అట్టివానికిఁ దానన మనంబని భావంబు. అట్టివాఁడు నేనను నపుడెల్ల పదార్థముల
గ్రహించుచుమనస్సు తానని తలంచు. అట్టివాఁడు నేనుతలంచెద. నే నెఱింగెద నను
నపుడు విమర్శింపఁబూనిన నా వాఁడు జాగ్రదవస్థయందలి బోధనె చెప్పుచున్నాఁడు
నేననుశబ్దమున కిదియే వానియర్థము. బోధశాలురగువారికెల్ల నిది మిథ్యయని తెలియు
గదా. వీరు నదిమిథ్యయని తెలిసియు దాని ననుష్ఠింపక యున్నారు. వీరు మాటమాత్ర
మునకు దాని నొప్పికొనినను లోకమున దాని ననుష్ఠించుట లేదు. మనోనిగ్రహమిట్టి
దనియు దాని నివ్విధంబున సాధింప నగుననియు మనముచక్కఁగ నెఱుఁగవలయుఁగదా.
దానికై సామాన్యజనుని జితేంద్రియుఁడన నేమియర్థమో విచారింతము. సామాన్య
జనుని జితేంద్రియత్వము సచ్చారిత్రలక్షణం బగుమనోనిగ్రహంబునకు సరిరాదు.
జితేంద్రియుఁడన కామక్రోధాదిగుణంబులేకంటే శుద్ధమనోదార్ఢ్యమెక్కుడనుటయే

గదా అట్టివానియందు కామక్రోధాదిమనోవికారంబు లొకతలయును శుద్ధమనో
భావంబులగు బుద్ధిలోనగునవి యొకతలయును గా నెన్నినచో శుద్ధమనోభావంబులే
బలవంతములు. అట్టివాఁడెప్పుడేనియుఁ జిత్తవిక్షేపముగాంచినచో నిట్టువితర్కించు,
నేనిట్టివికృతికిలోనుగాను. కామముచే నీడ్వఁబడ నొల్లను. ఇంద్రియమ్ములపిఱుందన
నేఁబరువెత్తను. ఈయింద్రియమ్ములు సారథ్యమునకుఁ గట్టినగుఱ్ఱములుగదా. నేనురథికుఁ
డనుసుమ్ము. వానినిష్టానుసారముగ వానిఁబోనిత్తును॥ఇటులనిశ్చయించువానిని జితేంద్రి
యుండందురు. ఇదియే యీశబ్దమునకు సాధారణమగు నర్థము. ఇదియుశ్లాఘనీయ
మగుగుణంబు. ఒక్కొక్కఁడును దీని సాధింపవలయుఁగదా. ఇంద్రియమ్ములకు లోనై
నియమమెఱుఁగని మనుజుఁ డిట్టిజితేంద్రియత్వమునైన సాధింప నెన్నియేనిపాట్లు
పడవలయుఁగదా. మనోనిగ్రహమునకు దానికంటె పెక్కుమడుంగు లధికముగ
వలయు. లోకమున నొకని ధీరుఁడనియు నొకని ధీరుఁడు కాఁడనియు చెప్పుదురు.
కదా. ధీరుఁడనవాఁడెట్టివాఁడు? ధీరుఁడు తన్ను నాపదలుచుట్టుకొన్నప్పుడును విషయము
లాకర్షించినప్పుడును తనవిజ్ఞానముచేతను బుద్ధిబలముచేతను సన్మార్గమును విడనాడఁడు.
అట్టివాఁడు పూర్వానుభవములచే బోధితుండై చక్కనడుచు. వాఁడుగదా ధీరుఁడు.
విషయములు వాని నాకర్షింపఁజాలవు. మనోవికృతికి లోఁబడఁడు. వాఁడు నదీ
ప్రవాహంబుచే నీడ్వఁబడి గాలిచేఁ దూగు నావవలె డోలాయమానమానసుఁడు
గాఁడు. అట్టివాఁడు ప్రవాహంబును వాయువును దన కనుకూలమగునటులఁ జేయ
దక్షుఁడగునావికునిచే నడపఁబడిననావం బోలినవాఁడు. వాఁడు బుద్ధియనుచుక్కా
నుచేఁ దనకోరినమార్గమున నావ నడపును. ఇట్టిధీరత్వమును దదితరమును నహంకార
తత్వ పరిపక్వ తారతమ్యమును సూచించు. ఈయహంకారతత్వమభివృద్ధికియుక్తి
యుక్తవిచారమే నిదర్శనము. అహంకారతత్వము గుఱించి చెప్పుచు బ్లావెట్స్కీగా
రివ్విధంబుగ వక్కాణించియున్నారు. నియతసందర్భములందు మనుజుఁడును పశు
వులును వర్తించువిధముఁ జూచినచో మనుజుని యందహంకారతత్వముకలిమియు,
పశువులయందది లేమియు స్పష్టమగు. అనేకమృగంబు లేకసందర్భమునఁ దఱుచుగ
నొక్కరీతిగ వర్తించు. అవి సందర్భానుసారముగ నడచు. బహిర్విషయంబుల
మార్చి తమ కనుకూలముగ నొనర్చుకొనఁజాలవు. తమమార్గమునకనువుగ వానిబలా
బలముల విచారింపనేరవు. అవియన్నియు నొక్కవిధముననే వర్తించు. జంతుస్వ
భావంబును సమయమిదియనియు నెఱింగినచో నొకజంతువు నడకచే నాజాతి

యంత ను నిర్విఘ్నంబుగ నడచునని యెఱుఁగనగు. ఇది యహంకారతత్త్వము లేమిగదా సూచించుచున్నది. మనుజులన్నో యిట్టుల వర్తింతురన నలవికాదు. ఈ అహంకార తత్త్వపరిపక్వ మనుసరించి సందర్భమొక్కటియె యైనను వారివర్తనములు భిన్నములై యుండు. ఒకఁడు మఱియొకనికంటె భిన్నుఁడుగదా. కాన వారివర్తనంబులును భిన్నంబులు, వారిబుద్ధియు వేరు కదా. కాన వారు భిన్నవిషయముల నభిలషింతురు. బుద్ధిదార్ఢ్యము చాలనిమనుజుని యందహంకారతత్త్వాభివృద్ధి కొఱవడినది. వాఁడు వికాసమునతక్కువప్రవృత్తిమార్గమున వాఁడు వెనుజిక్కినవాఁడు. శుద్ధమనస్సుచే నశుద్ధమనస్సును నిరోధింపఁజాలిన వెనుక, నరుఁడు సంకల్పశక్తిని గొంతసాధింప మొదలిడఁ దగు. ఇయ్యది సాధారణమనుజుని సంకల్పశక్తికంటె నధికము. అందులకు శాస్త్రజ్ఞానంబు వలయు. హింసాగ్రంథగాజములఁ బఠించినచో సంకల్పశక్తి యిట్టి దని విశదముగ నెఱుఁగవచ్చు. దాని గ్రహించినవెంబడినె మనస్సునకుమీద వేఱొకటి యుండుటయుఁ దెలియు. మనంబున సంకల్పములుఁ గల్పింపఁబడునేని నట్టుకల్పించునది వేఱొకటి యుండవలయు గదా. అది సంకల్పాత్మకంబగు మనంబుకంటె భిన్నంబై ప్రచ్ఛన్నముగ నున్నది. సంకల్పమునకు సృజనశక్తి కలదు గదా. నరుఁడిట్టి శక్తిచేఁ దనమనస్సు నితరులమనస్సును స్వాధీనము చేసుకొని శిక్షింపఁగలఁడు గదా. మనస్సుకంటె భిన్నపదార్థమొకటి కలదని నిరూపింప నిదియె చాలు. దానికి మనస్సె సాధనము కదా. మనస్సు జయించుట మిగులకష్టసాధ్యమని తన్నుఁదా నెఱుఁగఁ గోరినవాని కిపుడుగదా స్పష్టమగు.

మఱియు మనస్సునఁ దాఁదలంపని తలంపులు వలదన్న నిలువక పొంగి వచ్చుటయు వానికిదెలియు. మనోవృత్తుల విమర్శింపఁ బూనినపుడు దాను గోరనియసహ్యము గు తలంపులు మనంబునకు మిక్కుటంబుగ వచ్చుచుండుటయు నెఱుఁగు. పలుదెఱంగులను వింతతలంపులు వానిమనంబు దూఱ వాఁడు వాని నవలఁద్రోయ యత్నించుఁ గాని యది వానికి సాధ్యంబు గాకుండు పిలువని పేరంటమేగుఁదెంచి తనకు తోఁబడక తనమనస్సును జుట్టుకొన్న తలంపులపీడఁ దొలగించుకొనఁజాలక యుండు. వాఁడపుడిట్లు విర్కారింపఁ దొచ్చు. ఈ తలంపులెక్కడివి? వీనిస్వభావమెయ్యది? వానిని నిరోధించుటెట్లు? అంతఁ గ్రమక్రమంబుగ వాఁడు తనమనస్సునకు వచ్చు తలంపు లనేకములు పరులమనంబులఁ బుట్టిన వని యెఱుఁగు. నరుఁడు తనమనోవృత్తి కనుగుణమగుఁ దలంపులనే యాకర్షించు. తనతలంపులచే నితరులమనంబులు

మాఱుపడఁ జేయఁ జాలు. దీని నెఱింగినప్పుడు గదా. తనతలంపు లింత చేయఁగలవని వానికిఁ దెలియు. ఇంతకుమున్ను వాఁడు దాఁ బలికినపుడ పరులమనంబులఁ దాఁ దిగుచు ననియుఁ దా నెద్దియె యొనరింపఁ బరు లట్లు నడతురనియుఁ దలంచుగదా. వానిజ్ఞాన మభివృద్ధిఁగనుదు వాఁడు. మనుజునినుండి యొకయదృశ్యశక్తి వెలువడి పరుల మనంబుల నటునిటుఁ ద్రిప్పునని యెఱుంగు. ఆధునికప్రకృతిశాస్త్రంబులు నివ్విధంబుగనే బోధించు. మఱియు. మాటగాని వ్రాతగాని లేకయే యొకనిమనోభిప్రాయంబును మఱియొకనికిఁ దెలుపవచ్చుననియుఁ జెప్పుచున్నవి. తలంపున ప్రత్యక్షమగు నొకశక్తి కలదు. దాని విమర్శింప సాధ్యంబగు. అది యితరపదార్థములఁ జలింపఁజేయఁ జాలిన స్పందమనఁదగు. దానికి శబ్దోచ్చారణ మక్కఱ లేదు. స్థూలమార్గములచేఁ గాక మౌనమున నొకనితలంపు మఱియొకనికి నెఱిఁగింపఁ నగునని ప్రకృతిశాస్త్రజ్ఞులు నుడువుచున్నారు.

అది యట్లగునేని మాటగాని పనిగాని లేకయే మనము పరస్పరము మనోవృత్తులచే బాధింపఁబడుచున్నారముగదా. మనమనస్సులఁగలుగు తలఁపులు వెలివెడలి లోకమున నితరులమనంబులఁ జొచ్చుచున్నవి. ఇతరులతలంపులు మనమనోవృత్తుల బాధించుచున్నవి. సాధారణమనుజులతలంపులు మిగులస్వల్పములు. ఇతరులతలంపులఁ గైకొని వారితమతలంపులని భ్రమింతురు. మనుజులమనస్సులు బాటసారు లొక్కరేయి యుండి రేపకడ లేచి పోవు దిగు విడిదలల బోలినవి సుమ్ము. అనేకులమనంబు లింతకంటె వాసిగావు గదా. తలంపు వచ్చినట్టె పోవు. అది యించుకయైనఁ బ్రవృద్ధిఁ గనుట లేదు. అది వచ్చి కొంతవడి నిలిచి యుండి నె పోవు. కాన సావధానముగ నాలోచించుచుండుటయే మనకుఁ గర్తవ్యంబు. మనముతలంచిన కార్యము సాధింపఁ గోరి యోచింపవలయును.

# ప్రకటనలకు ద్రవ్యనిర్ణయములు.

| | | పూర్తిపేజి. | అర్ధపేజి. | ¼ పేజి. |
|---|---|---|---|---|
| సంవత్సరమునకు | ... రూ. | 40 | 30 | 20 |
| 6 నెలలకు | ... ,, | 24 | 18 | 12 |
| 3 నెలలకు | ... ,, | 18 | 9 | 6 |
| నెలకు ... | ... ,, | 5 | 4 | 3 |

## హంసావళి.

1. షట్త్రింశన్మంజరి:—(శ్రీశంకరాచార్యులు రచించిన భజగోవింద శ్లోకముల నాంధ్రగ్రహణ పద్యాత్మకముగా రచింపబడినది. ఆబాలవృద్ధులకు నానందకరమైనది. వెల 2 అణాలు మాత్రమే.

2. ఏకాదిరత్నావళి:—1 మొదలు 224 సంఖ్యవరకు గల విషయవిశేషములిందు సంగ్రహింపబడినవి (అయనద్వయము, వాసనాత్రయము, సాధన చతుష్టయము, మొదలగు 1008 విషయములు) వెల 4 అణాలు మాత్రమే.

3. హంస:—ఇది మాస తెలుగుపత్రిక 1908 జనవరినుండి వెలువడుచున్నది. స్త్రీజనసార్థకము జేసుకొనగోరువారు దీనిని నిరాకరించ జాలరు. చందా సంవత్సరమునకు నొక రూపాయియే.

విడుకటి నెల పత్రికలు 1 అణాకు ఒకటివంతున ఇవ్వబడును.

హంసవిలాస్,
296 లింగిచెట్టి వీధి,
జార్జిటవున్, మదరాస్.

ప. స. హనుమంతరావు,
కార్యదర్శి.

స్వధర్మప్రకాశిని:—ఇది తెలుగు మాసపత్రిక. హిందూమత విషయకమైన తెలుగుపత్రిక. సంవత్సరమునకు రూ. 1-8-0 చందా. కావలసినవారు మార్కండేయశర్మ, సుంకువారి అగ్రహారం, వేంకటాద్రిపేట, మద్రాసు అని వ్రాసికొనవచ్చును.

## ఘనమైన పట్టువస్త్రములు.

దేశమంతటను ప్రసిద్ధికెక్కియున్న మొలకాలుమురువులో శ్రేష్ఠమైన పట్టువస్త్రములు, చేతిగుడ్డలు, స్త్రీలుగాని, పురుషులుగాని, ఉపయోగించు నాణ్యమైన మొగటములు నవీనయంత్రములచే తయారు చేయబడుచున్నవి. వలయువారు యీ క్రిందివిలాసమునకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

హోసూరు సుబ్బరావు,
మొలకాలుమురువు.
Molkalmuru, Chitaldrug Dt.

Registered No. M. 716



ఓం.



# దివ్యజ్ఞాన దీపిక.

(పూర్వనామము "[illegible]").

## A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

సత్యమునకుమించిన ధర్మములేదు.

| | | |
|---|---|---|
| సంపుటము 1 | APRIL 1910. | సం॥ యునకు చందా |
| సంచిక ... 1 | ఏప్రిల్ నె 1910. | 1 రూపాయి. |

## విషయసూచిక.




CHITTOOR, N. A. Dt.:—PRINTED AT THE VICTORIA JUBILEE PRESS

FOR

P. NARASIMHA AIYA GARU, *Publisher.*

ఓం.

# దివ్యజ్ఞానదీపిక.

శ్రీగురుభ్యోనమః.

## స్వవిషయము.

ఈశ్వరుండీలోకములో ప్రతిదేశమందును తనవిభవమును శక్తిని వెల్లడిచేయుటకై ఒక్కొక్క పదార్థమును సర్వాతిశయముగ నిర్మించెను. మన భరతఖండమునందు స్థాపించబడిన పదార్థము బ్రహ్మజ్ఞానము. ఆబ్రహ్మజ్ఞానమునకు ఆదినుండి మనదేశము మాతృస్థానమై ఒప్పుచుండెను. ఇచట జనించి వృద్ధిపొంది దీనిం బ్రధానస్థానముగాం జేసికొని ఇందుండి ఇతరదేశములకు తనప్రకాశమును ప్రసరింపజేయుచువచ్చెను. అయినను కాలక్రమమున ననేక హేతువులవల్ల నీదేశమునందు దాని ప్రకాశము నానాటికి మసగబడి జనులకు పారమార్థిక విచారము క్షీణించి సదాచారములోపించి నాస్తికబుద్ధి యభివృద్ధిజెందెను. మన వేదములను శాస్త్రములను పురాణములను స్మృతులను వాని తత్త్వార్థమును గ్రహించి ఇతరులకు బోధించువారును తగ్గినకొలదిని మనదేశస్థులకు స్వమతమునందు నిరభిమానమును ఉదాసీనభావమును హెచ్చెను. ఇంతియగాదు. ఇతరమతస్థులు మనధర్మమును వెల్లడిగా పరిహసింపదొడగిరి. దానిని మనదేశస్థులు సహేతుకముగ సిద్ధాం

తపరుచుటకు చాలరైరి. ఇట్టిదురవస్థకాలమున దైవవశముగ దివ్య జ్ఞానసమాజము ఇప్పటికిదాదాపుముప్పది సంవత్సరములక్రిందట మన దేశమునకువచ్చెను. అదిమొదలు ఆసమాజపువారి ప్రయత్నముచే హిందూమతముజీర్ణోద్ధారమై జనులకు క్రమక్రమముగ మతాభిమానము మరలకలుగుచున్నది. మనమతగ్రంథములుపున రాదరణమును పొందుచున్నవి. ఆసమాజమువారు ప్రచురముచేసిన గ్రంథములును పత్రికలును దేశమంతటను విస్తరముగచదువఁబడుట చేనిట్టిశ్రేయస్సును మనముసురల బొందగంటిమి. అయిననాగ్రంథములును పత్రికలును ఆంగ్లేయభాషలోనుండుటచేతద్భాషాపరిచయ భాగ్యములేనివారికి వాటిచే ప్రయోజనము కలుగదయ్యె. ఇట్టికొఱత నివారించుటకును తత్సమాజమువారి యమూల్యగ్రంథరత్నములందలిజ్ఞానామృతమునాంధ్రదేశస్థులకు లభింపజేయుటకును ఉద్యమించి ఉపకారశీలురగుకొందరుసత్పురుషులప్రోత్సాహముచే నీపత్రిక 'హంస' నామముతో 1908 జనవరినెలయందు అనంతపురంజిల్లా గుత్తిపట్టణమందు ప్రారంభించఁబడియె. "మనదేశముననుండు సకలజనులకు మనధర్మములనుదెలిపి మనపూర్వసుఖస్థితినినీదేశమునకు మరలగలిగించుటకు నీప్రయత్నముచేయబడినది" యనిప్రథమ సంచికయందు వ్రాసితిమి. ఆప్రతిజ్ఞను నెరవేర్చుటకై మాయావచ్ఛక్తియు వినియోగించి కడచిన రెండు సంవత్సరములు ప్రయాసపడితిమి. మాయుద్యమమెంతమట్టుకుకొనసాగినదో మాచదువర్లు గ్రహించగలరు. కొన్నియనివార్యములగు కారణములచే 'హంస' గుత్తినుండిఎగటివచ్చి చిత్తూరులో వ్రాలెను. హంసయనగా బ్రంహము. ఆబ్రంహముయొక్క స్వరూపమును తెలుసుకొనుటయే బ్రంహ

జ్ఞానము. అదియేదివ్యజ్ఞానము. దానికిందగిన సాధనముల వెల్లడిజే యుటయే యీపత్రిక యొక్క ముఖ్యోద్దేశముగాన ఈనవీనస్థాన మునదీనికి "దివ్యజ్ఞానదీపిక" యనుపేరుపెట్టఁబడియె. పేరుమా త్రముమారినదిగాని ఈపత్రికనునడపు పద్ధతి పూర్వమునసుసరించి యేయుండును. దివ్యజ్ఞానసమాజముయొక్క వృత్తాంతములును దా నియందలి ప్రముఖులచేనప్పుడప్పుడు ఉపదేశింపఁబడుజ్ఞానవిషయ ములును ఆసమాజమువారి యాంగ్లేయభాషాపత్రికలందు ప్రచు రింపబడునుపన్యాసములు మొదలగువాని సారమును భక్తి, జ్ఞానము, వైరాగ్యము ఇవి అభివృద్ధియగుటకు సాధనభూతమైన యనేక విషయములును నీపత్రికయందు ముద్రింపబడును. భగవద్గీత యోగ వాశిష్ఠము ఆదిగాగలమహాగ్రంథములలోని సద్విషయములు సులభ శైలిని సంగ్రహించి నిందుగూర్చఁబడును. రాజాంగసంబంధమగు సమాచారములకీపత్రికయందెంతమాత్రమును చోటుదొరకదు.

దేశాభిమానులు ప్రకృతమునఁజేయదగిన కార్యములలో మ తోద్ధారణ ప్రథమగణ్యమైయున్నది. మతము చక్కబడినగాని దేశ ము చక్కబడదు. మతవిషయముబోధబడినగాని ధర్మాధర్మ విభాగ ము దెలియరాదు. నిత్యానిత్యవివేకము కలిగిన పిమ్మటగాని దేశముయొక్క శాశ్వతసుఖసాధనమియ్యదియని బుద్ధికిగోచరింప దు. సర్వసహోదరభావము స్థిరముగా మనస్సుననిలుచువరకు లోకోపకారమునకు పాటుబడుటకై దృఢమైనవ్యవసాయముకలు గనేరదు. కాఁబట్టి స్వదేశాభిమానులగు సత్పురుషులందరును మాయుద్యమమునకుతోడ్పడి ఈపత్రికయభివృద్ధిగాంచునట్లు సర్వ విధములయినసహాయ్యమునొనరింతురుగాతయని నీశ్వరుని ప్రార్థిం చెదము.

# ధ్యానము.

ఈ విషయము మిగుల ముఖ్యమైనది. దీనినిగురించి అనేకులు అనేక అభిప్రాయములుగలిగి వేర్వేరువిధముల అభ్యాసములు చేయుటచే బహుమంది బహు విధములైన బాధలనుభవించియున్నారు. దానిచేత దీనినిగురించి బాగుగ తెలిసినవారి అభిప్రాయమునందు వెల్లడిచేయుట మాపత్రిక చదువువారికి మిగుల ప్రయోజనకారిగానుండుననెడి అభిప్రాయముచే తత్వజ్ఞాన సభలో మిక్కిలి ప్రసిద్ధిచెందిన దామోదరు, కే. మావలంకరు అనువారు ఈ విషయమై వ్రాసినదాని సారాంశమును పట్టి విపులముగా వ్రాయబూనితిమి.

వీరు అడియారులోనుండినపుడు బ్రహ్మవిద్యాపత్రికను (Theosophist) ఉపలేఖకులుగా (Sub-editor) నుండిరి. అప్పుడు యోగాభ్యాసము చేసినట్లుగ కొందరు కొన్ని పుస్తకములలో వ్రాసినట్లు అభ్యాసముచేసి దానిచే తామనుభవించినబాధలు వీరికి తెలియచేయుచుండిరి. వారందరి ప్రశ్నలకు ప్రత్యుత్తరముగా ఈ వ్రాయబోవునది వ్రాసిరి. ఫురకాబాదు (Furakabad) అనుపట్టణ నివాసియగు ఒకమెంబరు అనేక సంవత్సరములు గీతయందు చెప్పినట్లు, భ్రూమధ్యభాగమందు చూపునిలుపుట అభ్యసించుచుండెననియు, దానిచేత కొంతకాలమొకవిధమైన ఆనందము పొందియుండెననియు, అటువెనుక తనఇంద్రియములు తనఅధీనము తప్పిఅవ్యక్త చిత్తుడాయెననియు, అనంతరము హృదయమందు పెద్దగుండువేసినట్లు అతిభారముగానుండెననియు, దానిచేత మిక్కిలిబాధపడుచుండినదేగాక మనసంతయు వికలమైపోయెననియు ఆకారణముతో ఆయభ్యాసము వదలెననియు, నాటినుండి హృదయమందు భారముగానుండుట లేకపోయినను మనోవైకల్యమే పోవదలలేదని వీరియెదుట కేవలము దుఃఖముతో కన్నీరుపెట్టుకొనినట్లు వ్రాసియున్నారు.

జబ్బలపూరులో నింకొకరు పతంజలి యోగసూత్రములుచూచి ఆప్రకారము కొంతకాల మభ్యసించుచురాగా, ఎప్పటికిని చూచియుండనట్టి రూపములు అగుపడుటయు, వింతైనగంటలధ్వనులు వినబడుటయు సంభవించెననియు, అట్లుకొంత కాలముండినతరువాత, ఇవి తమంతటనే ఆయన ఆటోపమువిూరి అగుపడుటకును వినబడుటకును ప్రారంభమాయెననియు దానిచేమనసు స్థిమితములేక బాధపడుచుండినట్లు ఉదహరించినారు.

తిరుచినాపల్లెలో మరియొకరు ఇట్లనే అనుభవించినట్లు కనుపరచిరారు. ఇట్టిఅనుభవములు కలుగుటకు ముఖ్యకారణము. రాజయోగ రహస్యము తెలియక పుస్తకములలో వ్రాసినదాని యర్థము తెలియక అభ్యసించుటతప్ప వేరుకాదు. వీరు ఆ యోగాభ్యాసమునకు ముఖ్యసాధనముగా దేహమును, మనసును, ఇచ్ఛలను ఏకకాలమందు పరిశుద్ధపరచుచు పక్వముచెందించుట రావలెననుటమరచి తెల్లనిగోడమీద నల్లనిచుక్క పెట్టి, ఆచుక్కమీదనో లేక ఏదైన స్ఫటికముమీదనో చూపుమాత్రము చలింపనివ్వక నిలుపుట చాలునని దానికితగినఅభ్యాసముచేయుటచే నిట్టిదురవస్థలు పడుదురు. ఇదిసరిఅయిన రాజయోగధ్యానముకాదు. ఇట్టి అభ్యాసముచే మనసు ఇతరత్రపోక నిలచినపుడు ధ్యానయోగ్యమగు పదార్థమేదియు మనసున లేకపోవుటచే క్షుద్రదేవతలుగాని, పిశాచములుగాని వీరి మనసును స్వాధీనపరచుకొని బహుబాధలు పెట్టుట ప్రాప్తమగును.

మరికొందరు దినములో నొకగంటసేపో రెండుగంటలప్రొద్దో ధ్యానము చేయుచు ఇతరకాలమందంతయు ప్రపంచక వ్యవహారములందు ఇచ్ఛానుసారముగ వర్తించుచుందురు. ఇదియు సరియైన ధ్యానసంప్రదాయముకాదు. ఇట్లుచేయుటచే తైలధారవలె అవిచ్ఛిన్నముగా నిరంతరముధ్యేయపదార్థమందు మనసు లీనమగుటకు వీలుండదు. అదెట్లన, సమానవస్తువులు సమానవస్తువులనే చేరునను ధర్మమొకటికలదు. ఒక నదీప్రవాహమందు తెల్లయిసుక ఒకప్రదేశమందును నల్లని యిసుక ఒకప్రదేశమందును ఉండియుండ, నల్లయిసుకను తెల్లయిసుకవుండు ప్రవాహములోగాని, తెల్లయిసుకను నల్లయిసుకయుండు ప్రవాహములోగాని కలిపినపుడు ఈ రెండు ప్రదేశములకు మధ్యయేదైన అటంకముండనంతట తెల్లయిసుకలో కలపిన నల్లయిసుక అణువులు నల్లయిసుక ప్రవాహప్రదేశమునే చేరును. అట్లనే నల్ల యిసుకతో కలపిన తెల్లయిసుక అణువులు తెల్లయిసుకవుండు ప్రదేశములోప్రవేశించును. ఇది అనుభవ సిద్ధాంతముగాని ఊహామాటలుగావు. దీనికే సామాన్య వస్తువుల పరస్పరాకర్షణ ధర్మంబని పేరిడబడినది. (Law of affinity).

ఈ ధర్మమే జీవాత్మలకును పరమాత్మకును (ఈశ్వరునికిని) అన్వయించుచున్నది. ఈశ్వరుడు పూర్ణానందుడు, అనగా బహిరంతస్స్వానందుడు, వెలుపలను, లోను, ఎల్లప్పటికిని ఆనందమే అనుభవించుచుండువాడని భావము. జీవాత్మ పరమాత్మయొక్క అంశమేయని సకలశ్రుతులు నుడువుచున్నది. "మమైవాంశో

జీవలోకే జీవభూత స్సనాతనః" అని భగవద్గీతా వాక్యము. "యథాప్రదీప్తా త్పావకా ద్విస్ఫులింగా స్సహస్రశః ప్రభవంతేసరూపాః" అని ముండకోపనిషద్వాక్యము పలుకుచున్నది. ప్రజ్వలించుచుండెడి జ్వాలనుండి ఆరూపములేగల మిడుగురులు వేలకొలది ఎట్లుపుట్టుచున్నవో అట్లనే జీవులు ఈశ్వరునుండి అనేకములుగా సరూపులై ఉద్భవించుచున్నారని తాత్పర్యము. ప్రజ్వలించుమంటయు, దానినుండి ఉత్పత్తిఅయిన మిడుగురులును సమానవస్తువులేగాని భిన్నములైనవి కావని భావము. సమాన వస్తువులకు పరస్పరాకర్షణయుండుట సహజ ధర్మంబని పైనుదాహరించబడినది గనుక జీవాత్మలు పరమాత్మను పొందుటయు, పరమాత్మ జీవాత్మలను తనలోచేర్చికొనుటయు సహజముగానుండే తీరవలెను. ఈ కారణమును పట్టియే, జీవులందరు సదా పూర్ణానందమును పొందవలెననే కోరుచున్నారు. పూర్ణానందుడు ఈశ్వరుడే (పరమాత్మ) తప్ప మరేమియుకాదు.

అట్లయినప్పుడు జీవులందరు సదా పరమాత్మనే ధ్యానించుచు నిత్యానందమును పొందియుండవలసినది సహజమాయె. ఆప్రకారమందరు పొందియున్నారా? లేదనియందరి అనుభవమే. అదిస్వభావ సిద్ధమైనపుడు ఎందుకు లేకపోయెనని ప్రశ్న కలుగుట సహజము. అదెందుకన, పరమాత్మ స్వరూపముగాని, పరమాత్మకు సహజమగు పూర్ణానంద లక్షణముగాని ఇట్టిదని అవగాహన అయితేనేతప్ప ధ్యానించుటకు సాధ్యముకాదు. అది అవగాహనకు వచ్చుటకు తదంశమగు జీవాత్మలక్షణము తెలిసికొనుట అత్యంతావశ్యకము. జీవాత్మజ్ఞానముకలవారే పరమాత్మచే ఆకర్షింపబడుదురు.

ఇట్టి ఆకర్షణకు అటంకమెద్ది? ఆయటంకమెట్లు కలిగె? దానిని తొలగించుదారి యెయ్యది? ఇవి విచారించుట ముఖ్యము. (పైరెండు అంశములను గురించి, సంచిత ప్రారబ్ధ ఆగామికర్మలు అనెడి పుస్తకమును, ధర్మము, అనుపుస్తకమును చదివినంతట తెలియవగును). ఆయటంకమును తొలగించుదారులే సకల యోగములు, ధ్యానములు, కర్మలు మొదలగునవి. దానిని తొలగించినట్లంతయు జీవాత్మప్రకాశమునకు వచ్చుచు పరమాత్మచే ఆకర్షింపబడును. ఆత్మానాత్మ వివేకమను చిన్నగ్రంధములో నిత్యానంద స్వభావమగు ఆత్మకు దుఃఖమెందుకు గలిగెనని ప్రశ్న వేయబడినది. "ఆత్మనః కింనిమిత్తం దుఃఖం" యిందుకు శరీరపరిగ్రహనిమిత్తందుఃఖమని వుత్తరమివ్వబడినది. దీనిచే జీవాత్మ, పరమాత్మచే ఆకర్షింప

బడుటకు ముఖ్యమైన ఆటంకము శరీరములేయని పై ప్రమాణముచే తేటబడుచున్నది. ఇచ్చట శరీరమన, స్థూలదేహముఇంద్రియములు, మనసుఅని తెలియవలెను. "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః। మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థానికర్షతి। శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః। గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్" నాఅంశమైన సనాతనముగు జీవుడు ప్రకృతియందుండు మనసుతోకూడిన ఆరింద్రియములనులాగుచున్నాడు శరీరమును పొందునపుడును, విడుచునపుడును వాయువుగంధమును తీసుకొనిపోవునట్లు వీనిని తీసుకొనిపోవుచున్నాడని తాత్పర్యము.

ఇవ్విధమున జీవాత్మ, పరమాత్మను పొందుటకు ఆటంకములుగానుండి జనన మరణరూపకంబైన సంసారమునకు ముఖ్యకారణంబును మోక్షమునకు బాధకంబునుఅగు దేహేంద్రియమనంబులను జీవాత్మ, పరమాత్మనుపొందుటకు సాధకంబుగాచేసికొనుటయే ధ్యానముయొక్క ముఖ్యప్రయోజనము. ఇదిధ్యానముచేతనే లభించును.

శరీరము, ఇంద్రియములు, మనసు, ఇవి పరమాత్మను ధ్యానించుటకు అటంకముగానుండునది లేనిది యోచింతుదము. ఎవరుగాని లోకవిషయములకు వేరైన పరమాత్మను ధ్యానించుటకు ఏకాంత ప్రదేశమందు చలించక కూర్చుండుటకు ప్రయత్నముచేయగానే శరీరము స్థిరముగ నిలువదు. ఇంద్రియములు మనసును నానాస్థలములకును, నానాకార్యములకును లాగుచునేయుండును, ఆత్మకంటె వేరువస్తువులందే పోవుచుండునుగాని ఆత్మ తత్వమును చూడనివ్వదు. "పరాంచిఖానివ్యతృణత్స్వయంభూ స్తస్మాత్పరాన్పశ్యతినాంతరాత్మన్" అనికఠోపనిషత్తు నుడవుచున్నది. కాబట్టి దేహేంద్రియ మనంబులు జవాత్మ పరమాత్మను పొందుటకు ప్రబలమైన బాధకములనుట స్పష్టము.

ఇట్లుబాధకములుగానుండునవి ధ్యానముచే ఎట్లుసాధకములగు విషయమును, శ్రీకృష్ణులు ఉద్ధవునకు ఉపదేశించిన ధ్యానలక్షణమును దీనికితరువాయి సంచికయందు వ్రాయబడును.

# దేవుఁడు.

ఈ ప్రపంచమునకంతయు నీశ్వరుండొక్కరుండె. ఆయన సమస్తమునకును మూలకారణము. భూమి, ఆకసము, సూర్యచంద్రులు, నక్షత్రములు, స్థావరజంగమాత్మకములగునన్ని పదార్థములు, దేవమనుష్య పశ్వాది సమస్తభూతములును ఆయనచే సృజింపఁబడినవి. ఆయన సర్వవ్యాపియై సర్వాంతర్యామియై అన్నిచోట్లను నిండియుండును. ప్రతివస్తువుకు బైటను లోపలను వ్యాపించియుండును. ఆయనలేనిచోటులేదు. అతిసూక్ష్మమగు పరమాణువుకంటెను సూక్ష్మమై అందణఁగియుండును. మిగుల గొప్పదగు బ్రంహాండమునకంటెను అధికమై దానినావరించియుండును. సర్వభూతముల హృదయమందు నివసించియుండును. ఆయనశక్తిచేతనే లోకములోని, అన్నిభూతములకు శక్తికలుగుచున్నది. దేవతలలోగాని, రాక్షసులలోగాని, మనుష్యులలోగాని, పశ్వాదులలోగాని, స్థావరములలోగాని యెచట యేశక్తియున్నను నది యీశ్వరశక్తిగాని ఇతరముగాదు. లోకములోజరుగు వ్యాపారములన్నియు ఆయనశక్తిచేతనే జరుగుచున్నవి. అగ్నియందుష్ణమును, వాయువునందు చలనమును, ఉదకమునందు రసమును, శిలాదులయందు కాఠిన్యమును, నీశ్వరశక్తిచే గలుగును. ఆశక్తివినా గడ్డిపోచయైనను కదలదు. ఆయన కోటిసూర్యప్రకాశుఁడు. సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని మొదలగుజ్యోతిష్పదార్థముల ప్రకాశమంతయు భగవత్ప్రకాశమునుండి కలుగునది. సర్వమును తనజ్యోతిచేఁ బ్రకాశింపఁజేయుచు తాను స్వయంప్రకాశియై వెలుఁగుచున్నాఁడు. ఆయన లోకములకన్నిటికి నాధారభూతుఁడు, నిత్యుఁడు, ఆదిమధ్యాంతరహితుఁడు, ఒకప్పుడు జగముల వెలినిడును, ఒకప్పుడు లోపలికిగొనును. అన్నిలోకములకు ప్రభువై సర్వనియామకుఁడైన ఆయన యాజ్ఞననుసరించి జగద్వ్యాపారములన్నియు నడచును. ప్రళయకాలమందు లోకములన్నియు నశించి ఆయనకుక్షియందడఁగును. ఆయన నిర్వికారుఁడై సకలమునకు సాక్షియైయుండును. ఆయనమనతండ్రి. తండ్రి బిడ్డను పోషించునట్లు మనుష్యులనందరిని దేవుఁడు గాపాడును. ఆయన దయాస్వరూపుఁడు, నిర్హేతుకజాయమైన కరుణారసమును ప్రపంచమునందంతయు వెదజల్లును. ఆయన సర్వజ్ఞమూర్తి, మనమనసులోని సంకల్పములెల్లఁ జక్కఁగ నెఱుఁగును. సర్వసముఁడు, అందరియందు సమదృష్టిగలవాఁడు.

ఆయనను లోకములో వేర్వేరు నామములచేతను, వేర్వేరుమూర్తులుగాను పూజించెదరు. ఒక్కొక్క మతమునందొక్కొక్క పేరుచే వ్యవహరించెదరు. బౌద్ధులు, క్రైస్తవులు, మహమ్మదీయులు, సర్వమతస్థులు ప్రత్యేక నామములచేఁ గొలుచునది ఆయననేసుమ్ము. మనదేశమందు విష్ణువనియు, శివుఁడనియు నానా నామములతోను, నానారూపములతోను భజించునది ఆయననేసుమ్ము. నామములెన్నియైనను, రూపములెన్నియైనను సర్వేశ్వరుఁడొక్కఁడేయను పరమార్థతత్త్వమును మరచి లోకములో జనులు మాదేవుఁడు హెచ్చనియు మాదేవుడు హెచ్చనియు మతవైషమ్యము గల్పించుకొని, పరస్పర ద్వేషబుద్ధిగలవారై బహువిధములగు ననర్థములకు కారణభూతులగుదురు. ఇది మిగులవెఱ్ఱితనము. ఒకేవస్తువు వేర్వేరు భాషలయందు వేర్వేరు పేళ్ళుకలిగియుండునట్లే నామరూపములులేని అద్వితీయుడైన సర్వేశ్వరునికి వేర్వేరుమతస్థులు, వేర్వేరునామములు, వేర్వేరురూపములు గల్పించుకొని భజింతురు. జగదీశ్వరుఁడొక్కరుఁడేను భావము మనుష్యులందరి హృదయములలోను దృఢముగా నాటుకొనుఁగాక.

## శ్రీశంకరాచార్యులు.

ఈభూలోకమను దేహమునకు భారతదేశము హృదయమునుబోలినది. హృదయము దేహమునంతయుఁబోషించువిధంబున నీదేశము పారమార్థికజ్ఞానమును లోకమునకెల్లనొసంగి రక్షించుచున్నది. ఇట్టిభారతదేశమున ననేక మతంబులుద్భవిల్లి ప్రపంచమంతటను వ్యాపించినవి. ఇప్పుడును నీదేశపుసిద్ధాంతములు పశ్చిమదేశములందువ్యాపించి యాదేశస్థులకు పారమార్థికబుద్ధికలిగించుచున్నవి. మఱియు నిట్టిపారమార్థికజ్ఞానమే యీదేశమునకు వన్నెయు నాగరికతయు దెచ్చినది. భారతదేశచరిత్రమన దానిమత సిద్ధాంతముల ప్రవృత్తియేసుమ్ము. భారతదేశప్రవృద్ధికేదోడ్పడిన సిద్ధాంతములస్థాపించిన వారనేకులుగలరు. వారిలో శ్రీశంకరాచార్యులు ప్రథమగణ్యులు. వీరుస్థాపించినమతంబునకు నద్వైతసిద్ధాంతమనిపేరు. వీరదీని శ్రేష్ఠముగఁగొనియాడినమాటచే దక్కినమతంబులెల్ల నీచములనుటగాదు. వీరికి షణ్మతస్థాపకాచార్యులనియు జగద్గురువులనియు బిరుదులుకలవు. ప్రకృతమున మనదేశమువారు వారిశిష్యులమనిచెప్పికొనియెదరుగాని యనేకులు వారిచరిత్రమునించుకైనఁ దెలియనివారుగానున్నారు. ఇదిగొప్పకొఱతగదా. ఈకొఱతమానిన నష్టహో

పురుషునియెడ నధిక భక్తియు వారిసిద్ధాంతముల గ్రహింపవలయుననుబుద్ధియుఁ బొడముననుటకు సందేహము లేదు. సర్వవ్యాపియగు నీశ్వరు నెఱిగినవారు లోకమున నెవ్వరో గదా, అట్టులనే శ్రీశంకరాచార్యులని యుచ్చరింపనివారు లేరన్నను వారిచరిత్ర మెఱిగినవారు మనదేశమునఁ గొందఱే సుమా. వారిచరిత్రము తెలుగ గోరినను దానినిప్పుడు నిశ్చయించుట మిగుల కష్టముగానున్నది. ఆమ్మహాపురుషుఁడు వేయిసంవత్సరములకు పూర్వమున నీదేశమున జన్మించిరని చెప్పుదురుగాని వారవతరించిన కాలమిదియని నిర్ణయింపఁదగు సాధకములు లేవు. వారిచరిత్రయంతయు మూఁడుమాటలలో ముగింపవచ్చు. ఈ మహాత్ముని గుఱించి చెప్పు పూర్వగ్రంథములు కేవలము స్వల్పములు. మాధవాచార్యులు, ఆనందగిరి, చిద్విలాసుడు, సదానందస్వామి శ్రీశంకర విజయములను గ్రంథముల రచించియున్నారు మఱియు స్కాందపురాణమున తొమ్మిదవయంశమున నొకయధ్యాయము శంకరాచార్యులగుఱించి చెప్పుచున్నది. ఇవియుఁగాక నారాయణాచార్య విరచితములగు మధ్వవిజయము, మణిమంజరియను గ్రంథములయందును వీరిగుఱించి వ్రాయఁబడియున్నది. కడపటి రెండు గ్రంథములును వేఱుమతస్థునిచే వ్రాయఁబడినవి. ఇవియుగాక ని కాలంబున దూరపు దేశస్థులు కొందఱును, హిందువులు కొందఱును వీరిచరిత్రమును వ్రాసియున్నారు. అయినను వీరిసుచరిత్రము దెల్పు గ్రంథములు పెక్కులు లేవు.

ఆచార్యులవతరించుటకు మున్ను భారతదేశమున బుద్ధదేవుఁ డవతరించి బౌద్ధమతము స్థాపించి వారు పరమపదమును జెందిరి. ఆటు వెనుక దయాసింధువగు వారి పావనసిద్ధాంతములు నానాటఁ గ్రిందుపడ భైరవశాక్త గాణాపత్యాదిమతంబులు దేశంబున వ్యాపించి జనులఁ బహువిధంబుల పామరులఁ జేయుచుండె. మఱియు వైదిక మతంబు మూలఁబడియె. అద్వైతమను మాట నరులు స్మరింపనైనఁ బూనకయుండిరి. ఇట్టి దుర్దశ పరమపుణ్యదేశంబగు భారతదేశమునకుఁ బుట్టగలిగె. బౌద్ధమతంబుతిన నిర్మల సిద్ధాంతముల విడనాడి లోకమునకు సహాయులగు కర్మలనుపదేశింప బౌద్ధసన్యాసులును సన్యాసినులును దేశమునకు భారముగ జీవింపుచుండిరి. ఇట్టికాలంబున నద్వైత మతంబు స్థాపింపఁబూని శ్రీశంకరాచార్యులవతరించిరి. కేరళదేశమున కాలటియను గ్రామంబు చూర్ణినదీతీరంబునఁ గలదు. అది యాల్వాయియను నూరికి వారుమైళ్లదూరమున నున్నది. ఆల్వాయి గ్రామము కొచ్చి షోరనూరు రెయిల్వేస్టేషను. ఈ కాలటి

గ్రామమున విద్యాధిరాజను బ్రాహ్మణోత్తముఁడొకఁడుండె. అతనికొమారుఁడు శివభక్తాగ్రేసరుఁడు పండితశిరోమణి శివగురువను మహాపురుషుఁడు పతివ్రతా శిరోమణియగు నార్యాంబయను నిజభార్యంగూడి పుత్రలాభార్థియై పరమతపంబొనరించె. అప్పుడు పరమశివుఁడు దంపతులకిద్దఱికిని స్వప్నంబునఁ బ్రత్యక్షుండై వారుకోరిన వరమొసంగె. తదనంతరమున నార్యాదేవి గర్భంబై కలియుగాబ్దంబులు 3889 విభవ సంవత్సరమున వైశాఖశుద్ధపంచమి నాఁటిమధ్యాహ్న కాలమున నార్ద్రా నక్షత్రముతోఁగూడినసుదినంబున నందనునిఁగాంచె. ఆదంపతులానందమున మునుఁగి యు నాకొమారునికి శంకరుఁడను పేరుపెట్టిరి. అంతనాబాలుఁడు నానాఁట సకలశాస్త్రములననాయాసముగ గ్రహించె. అంతనిమ్మహాశివగురువు కాలధర్మంబునొందె. శంకరాచార్యుల తల్లియగు నార్యాదేవి సకలగుణ సముద్రుఁడగు చిన్నికుమారునికైదవయేట నుపనయనాది వైదికకర్మంబుల నిర్వర్తించి గురుసన్నిధిం జేర్చె. శంకరాచార్యులా గురువునొద్ద వేదవేదాంగములును ధర్మశాస్త్రములును నభ్యసించి సర్వశాస్త్రవిశారదుఁడయ్యె. అనంతరము వారికి వివాహముఁజేయవలయునని తల్లియత్నించుచుండఁ దగినకన్యను వెదకుచుండె. ఒకనాఁడు శంకరాచార్యులు తల్లియుఁ బూర్ణానదికి స్నానార్థమై చనిరి. ఆచార్యులు నదియందు స్నానముచేయుచుండఁ నొక మొసలివారిపాదముఁ బట్టుకొని నీటిలోనికిలాగఁజొచ్చె. అప్పుడాచార్యులు తల్లిని జూచి "అమ్మా మొసలినన్ను మ్రింగఁజూచుచున్నది. నేవ్యర్థంబుగఁ జచ్చిన నాజన్మము వ్యర్థమగును. సన్యసించిన సద్గతిగల్గుఁగాన నాకు సన్యసింప నాజ్ఞయిమ్మని ప్రార్థించె. తల్లియు వల్లెయనియె. అప్పుడాచార్యులు మానససన్యాసమునుదీసికొనిరి. అంతనామొసలి గంధర్వరూపముధరించి యాచార్యులచే సెలవుగైకొని నిజస్థానంబునకరిగె. ఆచార్యులును పిమ్మట గృహంబుఁజేరి తల్లిచేననుజ్ఞవడసి క్రమసన్యాసంబుఁ బుచ్చుకొన తనకుఁదగినగురువును వెదకుచు బదరికాశ్రమంబుచెంగుంచఁదపంబుఁ జేయుచున్న గోవిందభగవత్పాదాచార్యులసన్నిధిం జేరె. వారు శంకరాచార్యులయొక్క సాధనచతుష్టయాది శిష్యలక్షణంబులం గాంచి యాచార్యులకుఁ గ్రమసన్యాసమొసంగి శిష్యునిగఁ గైకొనిరి. శంకరాచార్యులును నభ్యసించి మఱచినవానింబోలె సమస్తశాస్త్రములును నద్వైత విద్యయు సాంగముగ నేర్చె. అప్పుడు గోవిందాచార్యులు శిష్యుఁడగు శంకరాచార్యులకు చంద్రమౌళీశ్వర లింగమును గణాధిపతియునిచ్చి లోకోపకారంబుగ వ్యాససూత్రములకును దశోపనిషత్తులకును భగవద్గీతలకును విష్ణుసహస్రనామస్తోత్రమునకును భాష్యములు వ్రాయుమని యా

జ్ఞాపించిరి. అనంతరము శంకరాచార్యులు గురునియనుజ్ఞఁబడసి దేశమున సంచరించుచు నద్వైతసిద్ధాంతముల జనులకుపదేశించుచుండగ నొక్కనాఁడు విష్ణుశర్మయను బ్రాహ్మణుఁడు శంకరాచార్యులకు బ్రణమిల్లి యద్వైతవిద్యబోధింపుమని ప్రార్థించె. ఆచార్యులు విష్ణుశర్మకు సన్యాసమిచ్చి వారిం బ్రథమ శిష్యునిగఁ గైకొనిరి. వీరికిఁ బద్మపాదులని పేరు. అటుపిమ్మట నార్యాంబకు మరణముసమీపించెనని తెలిసి స్వగ్రామమునకుంబోయి జననికిఁ దగునుపచర్యలఁ జేయుచునుండగా నామె కాలధర్మమొందె. ఆచార్యులు "పుత్రమంతేచకర్మణి" యను న్యాయమునననుసరించి తల్లికి నగ్నిసంస్కారంబుచేసి ప్రయాగమునకుఁబోయిరి. ఆచార్యులు ప్రయాగయందు నివసించియుండు కాలమునందొకనాఁడొక విప్రుడు తనమూఁగకొడుకును దెచ్చి శంకరాచార్యుల సన్నిధినిడియిట్లనియె. "స్వామి వీఁడు పుట్టుమూఁగ, వీనికి జ్ఞానంబు ప్రసాదింపుఁడు" అని వేడిన నాచార్యులు వానిమూకత్వంబుమాన్పి నీవెవ్వఁడవని యడిగిన వాఁడు "నేనెవ్వఁడను గాను. ఆత్మస్వరూపమగు తత్వమని" ప్రత్యుత్తరంబునిచ్చె. అంత నాచార్యులు వానికి సన్యాసమిచ్చి శిష్యునిగఁ గైకొనిరి. వీనికి హస్తామలకుఁడను పేరు పెట్టిరి.

అటుపిమ్మట శంకరాచార్యులు కాశికిఁబోయి యాపట్టణంబున బహుదినంబులు నసించుచుండిరి. అప్పుడు పద్మపాదుఁడను శిష్యుడు గురునియాజ్ఞచే సంపూర్ణప్రవాహయగు గంగానదిని దాటి గురుభక్తియు నత్యంత శ్రద్ధయు బ్రకటించె. మరియు నొక్కనాఁడు శిష్యానాధ్యయనమూఢుఁడు కళినాగుఁడనువాఁడు శంకరాచార్యులకు నమస్కరించి యాచార్యునితోటకవృత్తములతో స్తోత్రముఁజేయ నాచార్యులు వానిశిష్యునిగ నంగీకరించి వానికిఁ దోటకాచార్యులని పేరు పెట్టిరి. మఱియొకదినమునందు వ్యాసులును బ్రహ్మయు ప్రత్యక్షమైన యాచార్యులు రచించియుండిన భాష్యమును పరిశీలించిరి.

అనంతరము శ్రీ శంకరాచార్యులు కుమారిల భట్టుగారినిజూచుటకై రుద్ధప్రయాగనకరిగిరి. అప్పుడు కుమారిల భట్టుగారగ్నిప్రవేశంబుఁజేసియుండగ నాచార్యులతనిం జూచి నీవేలయగ్నిఁజొచ్చితివని యడుగ భట్టుగారిట్లు జెప్పిరి. నేను గురుద్రోహంబుచేసినవాఁడను, కాన నాకిదియె ప్రాయశ్చిత్తము. మిమ్ముఁగాంచుటచే నాజన్మము సఫలంబాయెనని చెప్పి ప్రాణంబులు విడచె. ఇచ్చో గుమారిల భట్టుగారి చరిత్రంబుఁగొంతతెల్పుట యవశ్యము. కుమారిల భట్టుగారాస

దేశ బ్రాహ్మణుఁడని కొందరు చెప్పుచున్నారు. కొందఱు ద్రావిడదేశస్థుఁ డందురు. వీరు సమస్త విద్యలను నేర్చి బౌద్ధవేషముతో బుద్ధమత సిద్ధాంతముల నభ్యసింపఁదలంచి యొక బౌద్ధాచార్యునొద్ద శిష్యుఁడుగాఁ జేరె. ఈ మహాపురుషుఁడు విద్య నేర్చుట కెన్ని పాట్లుపడెనో చూడుఁడు. ఇవ్విధంబుగ భట్టుగారు బౌద్ధాచార్యునొద్ద విద్య నేర్చుచుండ నొక్కనాఁడు భట్టుగారి గురువు వైదిక మతంబును కర్ణకఠోరముగ దూషింపఁజొచ్చె. అదివినఁజాలక భట్టు కన్నీరు విడచుచుండె. తక్కిన శిష్యులు దానింజూచి వీఁడు పరమతస్థుఁడని నిశ్చయించి వానిం జంపఁజూచిరి. కుమారిల భట్టుగారది యెఱింగి సౌధాగ్రమునుండి "వేదములు సత్యములైనచో నన్ను రక్షించుగాత" యని నేలకుదుమికె. కొంచెము సందేహమున కెడమిచ్చినందున వారికి కన్నొకటి లొట్టయయ్యె. కుమారిల భట్టు బౌద్ధమతంబును ఖండించి వైదికమతంబును స్థాపించిన మహాపురుషుఁడు. వేదములందు కర్మకాండమె మోక్షమునకు సాధకమని వీరి సిద్ధాంతము. వేదములు "స్వతః ప్రమాణం, పరతః ప్రమాణ" మనివీరి సిద్ధాంతము. వీరు భారతదేశమునందు వైదిక మతము నుద్ధరించి యాచార్యుల సిద్ధాంతముల జనులుకైకొనునట్లుచేసిరి. శ్రీశంకరాచార్యులు కుమారిల భట్టుతో సంభాషించినపిదప మండనమిశ్రునితో శాస్త్రవాదంబుఁజేయ గాశ్మీరంబునకుఁజనిరి. ఆచార్యులాతనితో వాదించి యతనిఁ జయించి వానిం దనశిష్యునిగ నంగీకరించి క్రమసన్న్యాసంబిచ్చి సురేశ్వరాచార్యుడని పేరు పెట్టిరి. అంతనతనిభార్యయగు సరసవాణితో వాదించె. అప్పుడా వనితాశిరోమణి కామశాస్త్రంబున ప్రసంగము చేయఁ బ్రారంభించుటయు నాచార్యులకా శాస్త్రమునపరిచయము లేనందున నొక్కనెలగడువు పుచ్చుకొని శిష్యులతోడం బయలుదేరి మృతిఁజెందిన యొకరాజు శరీరంబుఁజొచ్చి యనేకసంవత్సరములు రాజ్యమేలుచు కామశాస్త్రంబుఁగఱచిరి. ఇట్టులాచార్యులు రాజదేహమునందుండు నపుడు రాజభార్య వారిప్రజ్ఞావిశేషంబునకు నివ్వెఱపడి యీదేహమునకున్న వాఁడెవ్వఁడో మహాపురుషుఁడని సందేహముఁజెంది యాసమీపమందున్న శవంబుల నెల్లఁ గాల్పనానతిచ్చె. అంత రాజభటులు దేశమందెల్లెడల వెదకుచు నాచార్యుఁడు వదలివచ్చిన దేహమునుగాల్పయత్నించిరి. అప్పుడా దేహమును రక్షించుచున్న శిష్యులుభయంబుఁజెంది కడువడితో నాచార్యునకుఁ దెలియునట్లుగఁగొన్ని శ్లోకంబుల వారిసన్నిధిం జదివిరి. అంతనాచార్యులు రాజశరీరమును వదలి కాలుచున్న స్వశరీరమును ప్రవేశించి, లక్ష్మీనృసింహస్వామిని స్తుతింప నాదేవుఁడు ప్రత్యక్షమై

యగ్నిని శమింపఁజేసె. అటుపిమ్మట శంకరాచార్యులు సరసవాణియొద్దకుఁబోయి యద్దేవిని కామశాస్త్రంబున జయించిరి.

అనంతరము దేశసంచారము చేయుచు తుంగభద్రానదితీరమున సుకరమ్యమగు స్థలంబునందు నొక్కమఠంబుస్థాపించి విద్యాపీఠంబు రచియించి యాపీఠంబున సురేశ్వరాచార్యునినియమించిరి.

పిదప శ్రీశంకరాచార్యులు కంచికిఁబోయి కామాక్షీదేవికి నాలయంబుగట్టించి యచ్చోట శ్రీచక్రంబునులిఖించిరి. అటుపిమ్మట తిరుపతి శ్రీకాళహస్తి మొదలగుపుణ్యస్థలంబులకుఁబోయి యచ్చటచ్చట నద్వైతసిద్ధాంతముల జనులకుదెల్పుచు శ్రీమదనంత పద్మనాభుని సేవించి యచ్చట వైష్ణవపాషండమతమును ఖండించి శివకేశవులకు వస్తుభేదంబులేదని స్థాపించి వారిట్లు వక్కాణించిరి.

‘‘హరిశంకరయోర్ధ్యైక్యబ్రహ్మాశ్చాపియోనరః భేదకృన్నరకం
భుక్త్వాయావచ్చంద్రదివాకరౌ॥

అటుపిమ్మట భారతదేశమునవ్యాపించియుండిన దుష్టమతంబులనెల్లఖండించి యద్వైతమతంబును జనులకుపదేశించిరి. మఱియు జగన్నాథంబునఁ భోగవర్ధనంబను నొకమఠంబును, ద్వారవతియందు నొకమఠంబును నిర్మించి పద్మపాదాచార్యులను, హస్తామలకాచార్యులను, వానికధ్యక్షులుఁగఁజేసిరి. మఱియు శ్రీశంకరాచార్యులు లోకమునందెల్లెడలను నద్వైతమతంబుపదేశించుచు బదరికాశ్రమంబునకుఁబోయి యచ్చటనొకమఠంబునిర్మించి తోటకాచార్యులను నచ్చోనిలిపిరి. అంత్యకాలమునకు దత్తాత్రేయముని శంకరాచార్యుల సన్నిధికివచ్చి వారురచించినగ్రంథములను జూచిసంతోషించిరి. అటుపిమ్మట శ్రీశంకరాచార్యులు దత్తాత్రేయమునితో గుహాప్రవేశంబుఁజేసి పరమపదంబునుజేరిరి.

శ్రీశంకరాచార్యులు గుహాప్రవేశంబుఁజేసినపుడు వారికిముప్పదిరెండేండ్లువయస్సని కొందరును ముప్పదియెనిమిది సంవత్సరములని కొందరును చెప్పుచున్నారు. వీరు రచించిన గ్రంథములనేకములుగలవు. వానిలో సూత్రభాష్యము, గీతాభాష్యము ఉపనిషద్భాష్యము ముఖ్యములు. సమయాచారమును బోధించుటకై సౌందర్యలహరియను గ్రంథమొకటి యాచార్యులువ్రాసిరి. వీరులోకమును గప్పికొనియుండిన నజ్ఞానాంధకారమును నద్వైతసిద్ధాంతముచేఁబోగొట్టిన పుణ్యపురుషులు.

ఓం.

ప్రపంచముననెల్లయెడలను, యిక్కాలమున "థియాసఫీ" యనుమాట ప్రసిద్ధి కెక్కుచున్నయది. ఈశబ్దమన్ని దేశములయందును అన్నిఖండములయందును వాడుకలోకి వచ్చుచుండుట తెలియవచ్చుచున్నది. ఈ శబ్దార్థమును వెల్లడిచేయుచు, తదర్థప్రతిపాదకమగు జ్ఞానమును పండిత పామర జనోపయోగముగ చేయుచు దివ్య జ్ఞాన సమాజమను పేర నొక సమాజముసయితము యిక్కాలమున లోకమునందన్ని దేశములయందును, ముఖ్యములగు పట్టణములయందును గ్రామములయందును ప్రబలియున్నయది. కావున, నీ "థియాసఫీ" యనునది యెట్టిది? ఇదియొక్క క్రొత్త మతమా? లేక ప్రపంచమున నిప్పటివఱకు ప్రబలియుండు మతములలో నొక్కటియా? అట్లయినచో నేమతము? పురాతనమతమా? లేక ఆధునికమా? ఈవిషయములు విచారింపఁదగినవి.

"థియాసఫీ" అనగా దివ్యజ్ఞానము. అనగా భగవంతుని విషయమగుజ్ఞానము. దేవతలచేతను, దేవసములగు మహర్షుల చేతను పొందబడియుండు, భగవత్సంబంధమగు జ్ఞానము. యిదియే "పరవిద్య" యని సనాతనముగ ఉపనిషత్తులయందు చెప్పఁబడినది. ఏవిద్యచే అక్షరమగు పరబ్రహ్మ తత్త్వమెఱుంగఁబడుచున్నదో, అవిద్యయే పరవిద్యయని ముండకోపనిషత్తు బోధించుచున్నయది. నాలుగు వేదములును, ఆరు వేదాంగములును, అరువదినాలుగు ఇతర విద్యలును, అపరవిద్యయేయని యాయుపనిషత్తే నిరూపించుచున్నది. ఇవి యన్నియును, పరవిద్యా సాధనములగుటంబట్టియేగదా విద్యలనఁబడఁదగియున్నయవి. శ్రీమద్భాగవతమునభక్తాగ్రేసరుఁడగు ప్రహ్లాదుఁడేమని చెప్పియున్నాడు! "చక్రహస్తుని ప్రకటించు చదువుచదువు, కుంభినీధవు చెప్పెడు గురుడు గురుడు। తండ్రి హరిచేరుమనిచెప్పు తండ్రి తండ్రి" గనుక భగవంతుని స్వరూపమును తెలుపు విద్యయొకటియే విద్యయనఁబడఁ దగియుండ, ఆవిద్యకు సహకారులగనుండు విద్యలన్నియుంగూడ విద్యలని పిలువబడుచున్నయవి. అయినను మొదటిది పరవిద్య అనగా శ్రేష్ఠమగు విద్యయనియు, తక్కువవిద్యలన్నియు అపరవిద్య అనగా తక్కువయగు విద్యలనియు నెఱుంగఁబడుచున్నయవి

ఈపరవిద్య ఎద్దియేని యొక్క మతమునందే బోధింపఁబడియున్నదా? అనేక మతములయందును గానవచ్చుచున్నదా? యను విషయము తెలియదగియున్నది.

అనేక మతగ్రంథములఁ బరిశీలించిన పండితులందఱును, ఏకవాక్యముగాఁ జెప్పనది చూడఁగా అన్నిమతములయందును బోధింపఁబడియుండు ముఖ్యాంశములు అనఁగా సారభూతమగు తత్త్వనిరూపణములు ఒక్కటిగనే యున్నవనియును నానాదేశములయందు, ఆయాజనసముదాయమునకు దగినట్లు ఒకటియగు తత్త్వమును పలువిధములుగ నిరూపింపఁబడినవనియును, చక్కఁగపరిశీలించిచూడఁగా, నానాదేశముల, బెక్కువిధములుగ పెక్కునామములతో నెఱుంగఁబడు వస్తువొక్కటియేయనియును స్పష్టమగుచున్నది. ఇంతియగాక, ఆయా మతావలంబులలో శ్రద్ధా భక్తి జ్ఞానవైరాగ్య సంపన్నులగు మహనీయులు అనేకులుండిరనియును; వారల సచ్చరిత్రములం జదువ, వారును, ఉత్కృష్టమగు పరమానందానుభవముగలవారలయి, పరులనుసైతము తరింపఁజేయు నుత్సాహముగలిగియుండినవారలనియు తెలియవచ్చుచున్నది. కావున నీయుత్తమోత్తమమగు పరవిద్య అన్ని మతములయందును రహస్యముగ బోధింపఁబడియేయున్నదని తలంపక తీరదు. ఇట్లన్నిమతములకును సామాన్యముగనుండు ముఖ్యాంశములెవ్వియో చూతము.

(1) ఏకము నద్వితీయమునగు బ్రహ్మము. ఆతత్త్వము అవాఙ్మానసగోచరము, అవిజ్ఞాతము, అవిజ్ఞేయము, ఇదియు నిర్గుణము. అనిర్వాచ్యము పరబ్రహ్మ..

(2) ఈతత్త్వమే ప్రకృతితోచేరి అపరబ్రహ్మ, సగుణబ్రహ్మ, ఈశ్వరుడు, అనునామముల బరఁగు తత్త్వము.

(3) ఈశ్వరుఁడు సచ్చిదానందస్వరూపుఁడు. లోకవ్యాపారముకొఱకు ముమ్మూర్తులుగ నభివ్యక్తమగుచున్నవాడు.

(4) మనుష్యులు యథార్థముగ శరీరములకంటే విలక్షణులగు జీవాత్మలుగాని శరీరములు మాత్రముగాదు. ఈజీవాత్మలు ఈశ్వరాంశములయి యుండుటంబట్టి, పర్యవసానమున ఈశ్వరస్వరూపమును స్వానుభవముచేనెఱుంగసమర్థులు.

(5) ఈయీశ్వరాంశములు మొదట అవిద్య లేక అజ్ఞానమునకు లోబడినవారలయి యిహలోకమున నుపాధులంగైకొని ప్రపంచమున దలి సుఖదుఃఖానుభవములచే పరమార్థజ్ఞానము సంపాదించుకొనుటకొఱకే ప్రపంచరూపమగు సంసారమున ప్రవేశించి యున్నవారు.

(6) ఆజ్ఞానము పరిపూర్ణముగ గలుగువరకు ప్రపంచమను గొప్పపాఠశాలయందు పెక్కుమారులు, పెక్కుస్థలముల, పెక్కురూపముల జననమొంది, పరిపూర్ణులుగాదగియున్నవారు.

(7) ప్రపంచమునందంతట కారణములేనిది కార్యముగలుగదను న్యాయము అనుల్లంఘ్యము.

జీవులునాధర్మమునకులోఁబడియే వర్తింపగలవారు. తాముచేయుమనోవాక్కాయికములగు సమస్తకార్యములు తత్తదనుగుణములగు ఫలములనీయక తప్పదు. ఆయాఫలానుభవముచేతజ్ఞానమభివృద్ధిచేసికొని యవిద్యనుండి తరింపగలవారు.

ఇందలి కడపటిరెండుమాత్రము ఆధునికములగు కొన్నిమతములయందు బోధింపఁబడియుండలేదని యామతావలంబులలో నిక్కులపువారు కొందరనెదరుగాని వారివారిగ్రంధములను సైతము చక్కగశోధించిన విచారపరులుగనుండు వారాగ్రంధములయందు నీసిద్ధాంతములు బోధింపఁబడియేయున్నవని నుక్కిచెప్పుచున్నారు.

ప్రపంచమునందలి మతములన్నింటియందును సారభూతములగు ముఖ్యాంశములన్నియు నొకటిగానుండుటకు కారణము వెదుకవలసియున్నది. మతస్థాపకులందఱును, దేవసములగు మహానుభావులని, వారిగ్రంధముల పరిశీలింప స్పష్టముగు మనే యున్నది. వారలు తత్త్వస్వరూపమును స్వానుభవముచే నెఱింగినవారు, గాని సామాన్యులుగారు. దృశ్యాదృశ్యములగు లోకములనన్నింటిని యోగదృష్టిమహిమచే స్పష్టముగ చూచి యనుభవించి, దృశ్యమగు నీభూలోకమునకును, అదృశ్యములగు భువరాదిలోకములకునుగల సంబంధమును ప్రపంచాతీతమగు తత్త్వముయొక్క యాథార్థ్యమును చక్కగనెఱింగి పామరజనోద్ధారణముకొఱకు ఆతత్త్వమును గ్రంధములమూలమునను యోగ్యులగు శిష్యులకు బోధించుటవలనను లోకమునకు వెల్లడిచేసియున్నవారు. కనుక దివ్యమగు చక్షువులచేస్పష్టముగచూచి యథాదృష్టముగ వ్రాయునదియంతయు సత్యము. అదియేకముగనుండును పరస్పరభేదములుగనుండుట కాస్పదముగలుగదు పరిపక్వముగాని బుద్ధులచేతను, అజ్ఞానముచేనిండియుండు మనస్సుచేతను, అల్పమగువ్యాప్తిగల బాహ్యేంద్రియములచేతను గ్రహింపఁబడు జ్ఞానము పరస్పరభేదములుగలదగు. కావున మతస్థాపకులందఱు పరిపూర్ణజ్ఞానులు బ్రహ్మవేత్తలుగనుండుటయే మతములన్నింటియందు ముఖ్యధర్మములన్నియు సామాన్యముగనుండుటకుకారణము. వేరుకాదు. సకలమతస్థాపకులును, ఐక్యభావము

గల యొక్క సిద్ధపురుషసముదాయము. పరస్పరమత వైషమ్యముల నెంతమాత్రము సహింపరు. అట్లయినచో లోకమున నిక్కాలమున మతాచారములలో పరస్పరభేదములు ఎక్కుడుగ గానవచ్చుచున్నయవియే! అట్టిభేదములకును, తత్కార్యములగు మతవైషమ్యములకును కారణమేమియో విచారింపఁదగియున్నది.

మతస్థాపకులందరొక్క సిద్ధసమాజమువారైనను, మతములయందలి ముఖ్యాంశములొక్కటిగనుండినను వేఱువేఱుకాలములయందు, భిన్నభిన్నములగు దేశములలో దేశకాల వైచిత్ర్యములననుసరించి, యీమతములు స్థాపింపఁబడియుండుటంబట్టియు ఆయా కాలప్రజల యోగ్యతానుసారముగ నుపదేశింపఁబడియుండుటచేతను పరస్పరభేదములుండకతీరదు. ఒక్క దృష్టాంతముచే నిది స్పష్టమగు. పర్వతాగ్రమున వర్షించెననుకొనెదము. ఆవర్షజలములు కొండపైనుండి నలుప్రక్కలం బ్రవహింప నాలుగునదులు వెలువడును. ఆనదులయందలి జలములం బరీక్షించిచూడ, నొకదిక్కున గట్టిదగుశిలాప్రదేశమునఁ బ్రవహించుటచే నొకనదీజలములు పరిశుద్ధములుగను, మఱియొక్క దిక్కున నల్లనిరేగడభూమిలో ప్రవహించి వచ్చియుండుటచే నల్లనిబురదవలెను, మఱియొక్క నదియందట్టులనే యెఱుపువర్ణముగలిగియుండుటయు నింకొకయేట పసుపువర్ణముగలిగియుండుటయు గలుగునుగదా. ఇన్నింటియందును జలములొక్క మూలమునుండి వచ్చినవియేగదా. మూలమొక్కటయ్యును స్థలవైచిత్ర్యములంబట్టి భిన్నభిన్నములుగ గనబడుచున్నయవిగదా! అటులనే సర్వజ్ఞులగు మహనీయులచే నుపదేశింపఁబడియుండుటచే సారమంతయు నొక్కటిగనుండ, దేశకాలానుసారముగను, శిష్యసముదాయముయొక్క రుచి భేదములకును యోగ్యతకుఁ దగినట్లును నిరూపింపఁబడియుండుటచేతను బాహ్యాచారములయందును, కొన్ని యితర అంశములందును పరస్పరభేదములు గనబడుచున్నవి. మనదగునీహిందూదేశమునందును అనేకములగుమతములున్నవిగదా! ఇవియన్నియును రుచివైచిత్ర్యములనుబట్టివచ్చినవియనియును, పరతత్త్వమును దెల్పుటయందన్నియు నన్యోన్యసహకారులేగాని పరస్పరవిరోధములుగావనియును విజ్ఞులగువారల యభిప్రాయము. ఈ యర్థము మహిమ్నస్తోత్రమునందు:—

త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతమ్ వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితిచ
రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిలనానాపథజుషామ్
నృణామేకోగమ్యస్త్వమసి పయసామర్ణవఇవ ॥

కాబట్టి దివ్యజ్ఞానము, బ్రహ్మవిద్య, పరవిద్య, అను నామములచే నెఱుఁగఁబడు సారము అమృతదాయకమగు కల్పవృక్షమునకు మూలముగను, ప్రపంచమునందలి మతములన్నియును శాఖలుగను నెఱుంగుటయే సుజ్ఞానము. అన్నింటియందు లక్ష్యమొక్కటిగ నుండుటచే, నొకమతమునుండి మఱియొక్కమతమునకు మాఱుట లనావశ్యకము లగుటయే కాక చెఱుపునకు కారణము సహితము కాదగు. ఒక్కొక్క మతమునందు భగవత్తత్త్వ మొక్కరీతిగ నిరూపింపఁబడియుండుటచేతను, జీవుడు, పెక్కుజన్మములయందు పెక్కుమతావలంబులలో జననమొందుటచేత వరుసగ ఆ యా మతమునందు నిరూపింపఁబడియుండు రీతిని భగవంతుని తత్త్వము నెఱుంగుచు, సారభూతమగు జ్ఞానమును వాసనారూపముగ గ్రహించుకొని, స్వస్థానము చేరుచుండుటచేతను, అనేకజన్మసంసిద్ధుడైన జీవుఁడు భగవత్తత్త్వమును పెక్కుభంగుల నెఱింగినవాఁడగు. ఏజన్మమున, నేమతమునఁ బుట్టునో, ఆజన్మమున, నామతము నవలంబించుటద్వారా పొందదగు జ్ఞానమును, పొందవలయుననియును. తన్మతాచారములవలనగలుగు శరీరనియమనము అభ్యసించి, దానివలని మేలుపొందవలయుననియును, భగవంతునియొక్కయు, భగవదాజ్ఞాప్రవర్తకులును, కర్మఫలప్రదాతలగు దేవతల యుద్దేశ్యము కావున ఎపుడుగాని జీవుఁడేమతమున జన్మించియున్నవాఁడో, ఆమతము అప్పటికి ఆజీవునకు ఎక్కుడగు ఫలమును నీజాలియుండును. దానివదలి మఱియొక్కమతమునకు బోవుటచే ముఖ్యముగ పొందదగిన ఫలము ఒనగూడదు. నానావిధములగు విద్యలను గ్రహింపదలచిన విద్యార్థి, తత్తత్కాలానుసారముగ నొక్కొక్క విద్యనుగఱపు పాఠశాలయందు జదివి, యావిద్యను పూర్ణముగ గ్రహించిన పిదప మఱియొక్క పాఠశాలకుఁబోయిన యుక్తముగాని, యుపాధ్యాయులొక్క పాఠశాలయందుంచిన, నదిబాగులేదని స్వతంత్రముగ మఱియొక్కబడికిఁబోయి చెడిపోవు విద్యార్థివలె నిష్ఫలమనోరథుడగు కావున యెల్లవారును, తమతమ మతస్వరూపముల చక్కగదెలిసికొని యభ్యసించుచు, పరమత వైషమ్యములువదలి యన్యోన్యమైత్రి గలిగివర్తించిన కాలపరిపాకమున నుత్తమపురుషార్థమును పొందగలుగుదురు. శ్రీభగవద్గీతా శాస్త్రమునందు భక్తునిలక్షణములు వక్కాణించుచు భగవంతుడు "అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ యేవచ, నిర్మమోనిరహంకారః" అని చెప్పియున్నాఁడు. సర్వభూతములయందు ద్వేషబుద్ధివదలుట కర్తవ్యమని చెప్పుచుండగా, ఇతరమతస్థులు అనగా భగవంతునినే వేఱువేఱు పేరులచేఁ బూజించు భక్తులను ద్వేషించుటయు దూషించుటయు, భగవంతునికి ప్రీతికరముగ

నుండునా! పరమేశ్వరప్రీతినపేక్షించుచు, వారి యితరపుత్రులను భక్తులను ద్వేషించినచో భగవంతుడెట్లు ప్రీతుఁడగును? తమమతమే సత్యమనియును ముక్తిదాయకమనియు, ఇతరములన్నియు, దుర్మతములనియు తాము నడుచుమార్గ మొక్కటియే సన్మార్గమనియు, నెంచునహంకారము భక్తలక్షణమని యెట్లు గ్రహింపఁబడును?

మొదట నుదహరింపఁబడిన "దివ్యజ్ఞానసమాజము" యొక్క ముఖ్యోద్దేశ్యములలో నీమర్మమును లోకమున వెల్లడిచేయుట మొదటిదిగనున్నయది. సమస్తభూతకోటి యందు సోదరభావము ప్రతిష్ఠించుటకే సమాజము అంకురముగావలయునని దీని మొదటి యుద్దేశ్యము. "అద్వేష్టాసర్వభూతానాంమైత్రఃకరుణ" అనునీమూడును "సోదరభావము" అనునొక్కమాటలో నిమిడియున్నవి. ఈభావము క్రమక్రమమున నభివృద్ధియగునటులచేయుటకు నీసమాజము బహువిధముల యత్నించుచున్నయది. దీనియందు ప్రపంచమునఁ బ్రబలియుండు అన్నిమతములవారును చేరి యన్యోన్యమైత్రితో వర్తించుచున్నారు. కనుక లోకమునందు వివిధమతస్థులు తమతమ మతములయందు విశేషఅభిమానముగలిగి మిక్కిలి శ్రద్ధతో వానిననుష్ఠించుచు, మతవైషమ్యములులేక మిత్రభావముతో నన్నదమ్ములవలె వర్తించుట సులభసాధ్యమని యీసమాజము దృష్టాంతముగఁ జూపుచున్నయది.

ఈమార్గము నెల్లవారును చక్కగ పరిశీలించి, తామనుష్ఠించి యితరులకుఁ బోధించి, లోకమునఁ బ్రబలియుండు వైషమ్యముల కొంతవఱకైనను తగ్గునటుల చేయుటకు ప్రయత్నించి భగవంతుని కృపకుపాత్రులగుదురుగాత.

## యుగసంధి

## I:—యుగధర్మములు.

యుగమనఁగాఁ జేర్పఁబడునది. సాధారణముగ యుగమొకటిగాఁ జేర్పఁబడిన కాలమునకు వ్యవహరింతురు. వస్తువులఁ జేర్చునప్పుడు సామాన్యలక్షణములను జూచి చేర్చుదురు. ధర్మములు సమముగనుండు కొంతకాలముయుగమగును. ఆ ధర్మములకు యుగధర్మములని పేరు. కాలక్రమమున ధర్మములుమారుచుండును. ధర్మములతోడ యుగములుమారును. ఇట్లుమారునప్పుడొక్క యుగముకడయు మఱియొక్కయుగము మొదలును గలయునప్పుడు యుగసంధియగును.

మన దేశమున ధర్మము హెచ్చుతగ్గులను గుఱించి నాలుగుయుగముల నేర్పఱచిరి. వానికిఁగృతత్రేతాద్వాపర కలియుగములని పేరులు. కలియుగాంతమున మఱలఁగృతయుగమువచ్చును. కావున యుగసంధులును నాలుగగును.

కృతయుగ చరిత్రములన్నియుఁబురాణరూపములుగనున్నవి. పురాణముల తత్వార్థములదెలుఁగుట కష్టము. కనుక కృతత్రేతాయుగసంధియందలి చరిత్రములను వివరించుట సులభముగాదు. దానిని విడిచిపెట్టెదను. త్రేతాద్వాపరయుగ సంధి చరిత్రము శ్రీ వాల్మీకి రామాయణమునయున్నది. ద్వాపరకలియుగ సంధి చరిత్రము మహాభారతమునయున్నది. కలికృతయుగ సంధిని రాఁబోవువృత్తాంతము కల్కిపురాణము మొదలగు భవిష్యోత్తరచరిత్రములందున్నది.

దీర్ఘకాలమగుయుగమంతయునుండిన ధర్మములను మార్చుటకు మహాజ్ఞాన శక్తిమంతులగుఋషులును రాజులును యుగసంధియందవతరింతురు. యుగమంతయుఁజెల్లుచుండుధర్మములు కాలక్రమమున క్షీణించును. క్షీణించిన ధర్మములను దొలఁగించి నూతన ధర్మముల స్థాపించుట యామహనీయులకార్యము. త్రేతాయుగమునందుండిన ధర్మము చెడి యుగముకడపట దుష్టరాజులఁదధర్మము చేగాఁబుండెరీ కాఁడుఁడు పరశురాముసందవతరించి క్షత్రియులఁజెండాడెను. శ్రీరామావతారమున మంచిధర్మములనిలిచి పదునొకండువేలేండ్లు భూమిని ధర్మముతో పరిపాలించి లోకులకు ధర్మమును నేర్పి భగవంతుఁడు వైకుంఠమునకుఁబోయెను. ఆధర్మముల నుదాహరణములుగఁజేకొని ప్రజలు ద్వాపరయుగమున నడచుచువచ్చిరి. మఱల నా యుగమున నాధర్మములునశించెను. మఱలభూమియందుఁజెడు రాజులేలుచుండిరి. అప్పుడు శ్రీవిష్ణువు కృష్ణావతారమెత్తి భారతయుద్ధమున క్షత్రియనాశమునుజేసి యుద్ధభూమియందు భగవద్గీతాశాస్త్రమును సత్తుమోత్తము శిష్యునకుపదేశించెను. ఆగీతాశాస్త్రమువనుసరించి కలియుగమున జనులునడువవలయును. అట్లుకావుండిన కాలవశంబున ధర్మమునశించినను గలియుగాంతమున మురాంతకుఁడు శంబలగ్రామంబున విష్ణుయశుఁడను బ్రాహ్మణునకుఁగల్కియైపుట్టి బ్రహ్మచర్య గృహస్థాశ్రమములనడిపి సూర్యచంద్ర వంశరాజులగు మరుదేవాపులకు రాజ్యమిచ్చి లోకంబునను నందు నధర్మమునుఖండించి కృతయుగమురావించును. ఇట్లుయుగసంధులందు మహనీయులగు దేవతలును దేవాంశసంభవులును వచ్చుచుందురు.

ఇట్లుయుగయుగమున ధర్మమునశించుచు వచ్చుటకుఁగారణములురెండని చెప్పవచ్చు. యుగాదిని జ్ఞానసంపన్నులగు మహాపురుషులు ధర్మమునిలిపి తామాచరిం

చియు జనులకు బోధించియు లోకమునఁబ్రకటింతురు. ధర్మకర్తలగువారును వారి శిష్యులునుండుదనుక ధర్మము సంపూర్ణముగనుండుననుటకు సందేహములేదు. పిమ్మటనుండువారు విద్యాబలములేదకున్నను వారగుటచే వారియాచరణయందు ధర్మమును దగ్గుచుండును. ఇదియొకకారణము. దీనిని మఱియొంచెమువివరించవ చ్చును. జనులనువారివారిజ్ఞానోదయమునకుఁదగినట్లు పెక్కుతరగతులుగ భాగించి నీకృతయుగమునఁ బైతరగతులఁగొన్నిటియందుండు వారుపుట్టిపెరిగి సంసారభ్రమణ మున జ్ఞానము పొందుదురు. వారిక్రిందితరగతులలోనుండు వారుత్రేతాయుగంబు నను వారిక్రిందితరగతులనుండువారు ద్వాపరయుగంబుననునట్లే కలియుగంబునను జ్ఞానము సంపాదింతురు. జీవులు నానావిధపరిపక్వమున నుండుటవలన ధర్మమునకుఁ దగినట్లుజనులవతరింతురు. జనుల జ్ఞానగతికిఁదగినట్లు ధర్మము మాఱుచుండును.

ధర్మముమాఱుటకు రెండవకారణము భాగవతముచే నీశ్లోకముచే సూచింపఁబడి యున్నది.

శ్లో॥ సత్త్వంరజస్తమఇతి దృశ్యంతే పురుషేగుణాః॥
కాలసంచోదితాస్తే వైపరివర్తంత ఆత్మని॥

భాగవతం 12 స్కం.

జనులు నానావిధజ్ఞానమును బొందవలయును గనుక నానాయుగములు వచ్చు చుండును. కృతయుగమున సత్త్వగుణమునిండిన కర్మలఁజేసిదనుభవజనితజ్ఞానము ను బొందియు త్రేతాయుగమున రజోగుణ సంబంధకార్యములఁజేసిననేకాని తదను భవజనితజ్ఞానముగాదు. ఈవిషయము మఱల వివరింపఁబడును.

ధర్మమను పదమునకర్థము విచారింపవలయును. భారతమున శాంతిపర్వ మున ధర్మస్వరూపము నిట్లునిరూపించిరి.

శ్లో॥ ప్రభవార్థాయ భూతానాంధర్మప్రవచనంకృతం యస్స్యాత్ప్ర
భవసంయుక్తః సధర్మ ఇతినిశ్చయః ధారణాద్ధర్మమిత్యా
హుః ధర్మేణవిధృతాః ప్రజాఃయస్స్యాద్ధారణసంయుక్తః
సధర్మఇతినిశ్చయః।

ధారణముతోఁగూడినది ధర్మము. ప్రజలను ధరించునది ధర్మము. ఒక యుగ కాలము ప్రజలు నిలుచుటకాధారమయినది యుగధర్మము. మఱియుఁ ప్రజా

ప్రభవమునకై చెప్పఁబడినది ధర్మము. ధర్మమునవలంబించిన భూతములు పరిభవమం దును. పరిభవమనఁగాఁ జక్కఁగాఁ గలుగునది*. ఈశ్వరాంశుఁడైన జీవాత్మజన్మానుభవమునఁ గొంచెకొంచెముగా జ్ఞానమును సంపాదించి వృద్ధిపడుట పరిభవమగును. విస్ఫులింగమాత్రయగు నీశ్వర చైతన్యము సంపూర్ణ దివ్యప్రభల వెలుంగుట పూర్ణపరిభవమగును. జనులకట్టి పరిభవము గలుగుటకై వారు నడవవలసిన మార్గమును జూపునది ధర్మము. ఈపరిభవము ప్రవృత్తినివృత్తిమార్గముల రెంటఁగలుగును. ఇవి పరస్పర విరోధములగు మార్గములు. కాఁబట్టి ప్రవృత్తిమార్గమున ధర్మమగునది నివృత్తిమార్గమునగాదు. ఇట్లు వర్ణాశ్రమాది నానావిధ భేదముల ధర్మము మారుచుండును. జ్యోతిషముఁ బండితుఁడయ్యు నొక్కండు వైద్యాభ్యాసము చేయఁబూనిన బ్రథమమునుండి యారంభము చేయవలయునుగాదే. అట్లు కృతయుగమున ధ్యానాధికరణముల నుపయోగించనేర్చియు జీవుఁడింద్రియముల నుపయోగించి వానిని బరిపక్వస్థితికిఁ దేవలయును. సర్వజ్ఞుఁడును సర్వశక్తిమంతుఁడునునగు నీశ్వరునితో దుల్యుఁడగుటకు సర్వకరణములను సాధించి సర్వసిద్ధుల బడయవలయును. జ్ఞానము నానారూపములనుండు గనుక నానావిధానుభవములయందు బ్రవేశించి దానిని సంపాదింపవలయును. ఇదియే యుగధర్మములు మారుటకు రెండవకారణమనఁబడినది. పిమ్మట II మన్వంతర ధర్మములు సంకీర్యగధర్మములు చర్చింపఁబడును.

---

*Evolution is the idea expiessed.

## వృత్తాంతములు.

దివ్యజ్ఞానసమాజము 1875 సం॥ం నవంబరునెల 17 తేది అమెరికాఖండములోని న్యూయార్కు పట్టణమున జననమొందెను 34 సంవత్సరములు గడచి 35.వది నడచుచున్నది.

ఈసమాజము లోకమంతటను వ్యాపించియున్నది. ఇందుఁ బ్రకృతమున 786 శాఖా సభలేర్పడియున్నవి. సుమారు 17000 మంది మెంబర్లు చేరియున్నారు మనదేశమునమాత్రము 5000 మందియున్నారు.

ఈసమాజము ఒక సంవత్సరము చెన్నపట్టణమునకు సమీపంబుననుండు అడయార్‌లోను, మరు సంవత్సరంబున కాశీపట్టణమందును, నీప్రకారము సంవత్సరప్రతిసంవత్సరము డిసెంబరునెలలో సభచేరును. కడచిన డిసెంబరునెల 27 తేది నీసభ కాశీలోఁ గూడినది.

ఆసభ నాలుగు దినములు జరిగినది. ఐరోపాఖండములో ననేక [illegible]ముల నుండియు అమెరికానుండియు ఇంకయు ననేక దూరదేశములనుండియు మనదేశములో ననేకచోట్లనుండియు దాదాపు నారువందల ప్రతినిధులాసభకువచ్చిరి. ఇంతదరికిని గంగాస్నానము లాభాంతరము.

ఆసభలో బాబూ భగవాన్‌దాస్ ఎం. ఏ. గారు మనుధర్మశాస్త్రములోని రహస్యార్థమును గురించి నాలుగుపన్యాసము లింగ్లీషుభాషలోఁ జెప్పిరి. అవి శీఘ్రములోనే గ్రంథరూపమున ముద్రించి ప్రకటింపఁబడును. దానియందలి ముఖ్యాంశముల గ్రహించి తెనుగుభాషయందీపత్రికలోఁ గూర్పఁబడును.

ప్రెసిడెంటుగారు దివ్యజ్ఞానసిద్ధాంత ప్రచారమునకై గడచిన యేప్రిల్ నెలలో అడయారునుండి భూసంచారార్థమై బయలువెడలి ఐరోపా, అమెరికా ఖండములందనేకదేశములందిరిగి నూరులకొలది నుపన్యాసములిచ్చి అనేకవేలమంది హృదయములందా సిద్ధాంతములస్థిరముగ నెలకొలిపి నవంబరునెలలో మనదేశమునకు మరలవచ్చిరి. వారు సంచారముచేసిన దూరము 37176 మయిళ్లు దూరముట.

లోకములో నన్ని మతములవారికి నుపయోగకరముగునట్లు మతసిద్ధాంతములను నీతిశాస్త్రమును చెప్పు యొక్క సద్గ్రంథమును రచియింపవలసినట్లు దివ్యజ్ఞాన [illegible] వారు ప్రార్థించినందున [illegible] ఆనిబెసంట్ దొరసానిగారట్లు జేయనిశ్చయించిరి. శీఘ్రకాలములోనే నాగ్రంథము ప్రచురము కాఁగలదని తోచెడిని ఆహా! అట్టిగ్రంథముచే లోకమునకు గలుగనున్న మేలింతింతయని చెప్పదరమా?

కాశీపట్టణములోనుండెడు సెంట్రల్ హిందూకాలేజియను విద్యాశాల హిందూమతమునొక్క జీర్ణోద్ధారణకై యేర్పరుపఁబడియున్నదిగదా. అందు బాలుర యొద్దనుండి ప్రతిసెల పుచ్చుకొనబడు జీతములు తక్కువగానున్నవి. పాఠశాలను నడుపుటకు కావలసినడబ్బు చాలమిచే బాలుర జీతమధికముజేయవలయునని పాఠశాల నిర్వాహకులలో ననేకుల యభిప్రాయమైయున్నదిగాని ఆనిబెసంటుదొరసానిగారి ప్రార్థనపై ఇంకొక సంవత్సరము దాక నట్లుచేయక నిలిపియున్నారు. ఇంతలోపల సంపన్నులగు వారెవ్వరైన నడ్డపడివలయు ద్రవ్యసహాయము జేసిరేని విద్యార్థులకు రానున్న కష్టము నివారింపఁబడును.

Registered No M. 716.

ఓం.





# దివ్యజ్ఞాన దీపిక.

( పూర్వము "హంస").

A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక

(సత్యమునకంటె నెక్కువ ధర్మములేదు).

సంపుటము 1. May 1910. మే నె 1910. సంచిక 2.

## విషయసూచిక.



సం॥రమునకు చందా 1 రూపాయ.

CHITTOOR N. A. DT.:—PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
FOR MR. P. NARASIMHA AIYA GARU, *Publisher.*

ఓం.

# దివ్యజ్ఞాన దీపిక.

(సత్యమునకంటె నెక్కువ ధర్మము లేదు).

సంపుటము 1. { May 1910. మే నెల 1910. } సంచిక 2

## మానవకుటుంబము.

ప్రపంచములోని సమస్తభూతములకును భగవంతుఁడు తండ్రినైయున్నవాఁడు. "పితాహమస్యజగతః" (అర్థము-ఈప్రపంచమునకు నేనుతండ్రిని) అనిభగవద్గీతలో శ్రీకృష్ణమూర్తియర్జునునకుపదేశించె. కావునమనుష్యులందఱును జగదీశ్వరునికి బిడ్డలైయున్నారము. లోకములో క్రైస్తవులనియు, మహమ్మదీయులనియు, జైనులనియు, బ్రాహ్మణులనియు, శూద్రులనియు, వైష్ణవులనియు, స్మార్తులనియు, స్త్రీలనియు, పురుషులనియు నీ తెఱంగున జాతిభేదములు, వర్ణభేదములు, మతభేదములు, మొదలగు కారణములచేత బాహ్యమునందనేక భేదములేర్పడియున్నవి. అయినను పారమార్థికబుద్ధితో విచారించునెడల మనుష్యులందఱును సహోదరులను భావము స్పష్టమయ్యెడిని. ఈవిషయమునన్ని మతస్థులవారు నంగీకరించియున్నారు

మనుష్యులందరును సమానులైయున్నయెడల మనదేశము నందేర్పడియుండు వర్ణాశ్రమభేదముల నెందుకనుసరింపవలయునని యు, బ్రాహ్మణులితర వర్ణస్థులతో బంక్తిభోజనమును, వివాహాది సంబం[illegible]లు జరుపఁగూడదనియుఁ గొందఱు వితండవాదములు [illegible]. అయినను క్షణమాత్ర మాలోచించిచూచిన యెడల [illegible] యాక్షేపణయందు లేశమయిన పుష్టిలేదని విశదమగును. మానవు[illegible]ందు బరస్పరభేదములున్నవనుటయుం దెల్లమైన విషయము. శరీ[illegible]మునందుగాని నీతికుశలతయందుగాని బుద్ధిచాతుర్యమునందుగాని యొకఁ డొక మనుష్యుఁడున్నట్టుమఱియొకఁడు లేఁడు. [illegible]ందఱు విగ్రహపుష్టిగలవారై, దృఢాంగులై, పరిపూర్ణారోగ్యము[illegible]లిగి శరీరప్రయాసచే సాధింపఁదగిన యెంతటి ఘనకార్యమున కైనను సాహసింపఁగలిగియున్నారు. మఱికొందఱు వామనులై కృశాంగులై రోగపీడితులై చక్కఁగ నాల్గడుగులదూరము నడుచుటకైన శక్తిలేకయున్నారు. కొందఱు సజ్జనులై సంపూర్ణనీతిమంతులై, పాపభీతిగలవారై "ఆత్మవత్సర్వభూతాని" యనుశాస్త్రవాక్యమును పాలించుచు సమస్తభూతములను తమవలెభావించి యెవరికిని కించిత్తైన హింసఁజేయక స్వప్రయోజనాపేక్షవదలి పరోపకారశీలురై "తమకార్యంబు బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్" అనువాక్యమును సార్థకముసేయువారై యున్నారు. ఇతరులుదుష్టులై కేవలస్వార్థపరులై స్వలాభార్థమితరులకెంత ఘాతుకమైనఁజేయవెనుద్రొక్కక కఠినులై

కం॥ తనకలిమి యింద్రభోగము

తనలేమియసర్వలోక దారిద్ర్యంబుగా

* * *

అనుపద్యార్థమును దృఢముగ బోధించుచున్నారు. కొందఱు కుశాగ్రబుద్ధులై సకలశాస్త్రార్థముల గ్రహించి జ్ఞానపారంగతులై భూత భవిష్యద్వర్తమానముల సయితమెఱుఁగఁజాలియున్నారు. ఇతరులు కొందఱు వ్రాయఁజదువనైననేరక తెలివి కొంచెమైనను లేక ఇతరులుచెప్పినను తెలిసికొనఁజాలక నతిమూఢులై ద్విపాద పశువులుగనున్నారు. ఇట్టివారందరును బరస్పర సమానులని చెప్పఁదగునే? భేదములుండుట నిశ్చయము. సమానధర్మముండుటయు సత్యము. ఏవిషయమున సమానులు? ఏయంశముల భేదములేర్పడియున్నవి? అనివిచారింపవలసియున్నది.

జీవులందఱు పరమాత్మయొక్క అంశములైయున్నారు. అందరియాత్మయు నొకటియైయున్నది. ఆత్మస్వరూపమందు భేదమించుకయులేదు. సమస్తభూతములందు నాత్మయైప్రకాశించునది భగవంతుఁడేగాని ఇతరముకాదు. "అహమాత్మాగుడాకేశ సర్వభూతాశయస్థితః" భగవద్గీత అ. 10 శ్లో. 20 (అర్థము. సమస్తభూతముల హృదయమందున్న ఆత్మ నేను) అని భగవద్వాక్యము. అట్టియీశ్వరాంశము కొందఱియందధికముగను కొందఱియందుఁ దక్కువగను ఉన్నదనుటకు వీలులేదు. "సమంసర్వేషుభూతేషు తిష్ఠంతం పరమేశ్వరం" (భగ. 13-28) అనువచనముచొప్పున సమస్తభూతములందును పరమేశ్వరుఁడు సమముగనుండును. కాఁబట్టి యాత్మస్వరూపమున మనుష్యులందరును సమానులైయున్నట్టు తేర్పడుచున్నది.

అయిననట్టియాత్మకుగలశక్తి కొందఱియందధికముగను కొంద ఱియందు తక్కువగను వికసించియుండును. అది వారివారి పూర్వ జన్మసంఖ్యనుబట్టియు సంస్కారమునుబట్టియు భేదించును. మను ష్యులందరు నీభూమిపైన మానవజన్మపరంపరలోనికి ఒక్కసారిగ వచ్చినవారుకారు. తెగలుతెగలుగా నప్పుడప్పుడు కాలక్రమముగ వచ్చిరి. మొదటవచ్చినవారు పిమ్మటవచ్చినవారికంటె నిప్పటి కెత్తినజన్మములసంఖ్య అధికమైయుండును. జీవుడు ఒక్కొక్క తూరి ఒక్కొక్కచోట జన్మమెత్తి ప్రతిజన్మమందు నాయాదేశ కాలవిశేషములకు లోఁబడినవాఁడై వానికనుగుణ్యమైన యనుభవ ములఁబొందును. అట్టియనుభవములచే దెలివి వృద్ధినొందును. లో కములో పసివాండ్రకును, వయసు చెల్లినవారికిని వివేకమునందె ట్లు తారతమ్యముకలదో ఆటీగుననే కొన్నిజన్మములుమాత్ర మెత్తిన వారికిని అనేకజన్మములు గడచినవారికిని జ్ఞానవికాసమునందుఁ దారతమ్యముకలదని చెప్పవలసియున్నది. ఇప్పుడు జ్ఞానమందు దక్కువగానుండువారును ఇఁకఁగొన్నిజన్మములకుఁ గ్రమక్రమము గ విశేషజ్ఞానవంతులగుదురనుట నిశ్చయము. తుదకు జీవులంద రు బరిపూర్ణులై సర్వజ్ఞులగుదురనుటయు నిస్సంశయము. అయినను ప్రకృతస్థితిని యాలోచించిన నరులలోఁ దారతమ్యమున్నదనియే చెప్పవలయు.

ఎల్లవారికి నాత్మయొక్కటియైనను శరీరమొక్కటిగాదు గదా. శరీరములు భిన్నముగనుండుటచే శరీరధర్మములును వేర్వే రయియుండును. ఒకరిదేహతత్త్వమున్నట్లు మరియొకరిదియు నుండదు. ఒకరిగుణములున్నట్లు మరియొకరి గుణములుండవు.

ఒకరిమనోభావములున్నట్లు మరియొకరి మనోభావములుండవు. ఇంతయెందుకు? ఒకేమనుష్యునిస్థితి యాలోచించినను వానిశరీరస్థితియు, గుణములును, మనోభావములును ఒకసమయమందున్నట్లు ఒకసమయమందుండక ప్రతిక్షణమున మారుచుండును. శరీరములు, గుణములు మనోభావములును ప్రకృతిసంబంధములు, ప్రకృతిమయమైనవానికి క్షణక్షణము మారుచుండుట సహజముగాని వానికి నిత్యత్వము (అనఁగా నెల్లప్పుడేకరీతిగ నుండుట) సంభవింపదు. నిత్యమైనట్టి ఆత్మవస్తువుమాత్రమంతటియందు తుల్యమైయున్నది.

ఒక కుటుంబమందు పలువురు సహోదరులున్నయెడ నందరును సమానముగనుందురా? వయస్సునందును, శక్తియందును, ప్రపంచానుభవమందును, విద్యయందును, పరస్పరభేదముగలిగియుందురుగదా. అట్లున్నను తల్లిదండ్రులకు వారియందు సమబుద్ధి కలిగియుండును. అన్నదమ్ములును పరస్పరానురాగము కలవారైయుందురు. కుటుంబముయొక్క లాభనష్టములు వారినందరి సమానముగనంటు. కుటుంబమున కేదైన మేలుకలిగినచో నందరికిని మేలగు. కీడు వాటిల్లెనేని యందఱకిని కీడగు.

ప్రపంచములోని మానవకోటియంతయు నొక్క-కుటుంబమై మెలగుచున్నది. కుటుంబపోషణభారమంతయుఁ దండ్రియగు నీశ్వరునిచే వహింపఁబడియున్నది. ఈకుటుంబములోని వారందఱును సాక్షాత్సహోదరులు. వేషభాషలందును, ఆచారవ్యవహారములందును, వర్ణాశ్రమములందును, స్త్రీపురుష విభాగమందును, ఇంకయు ననేకవిషయములందును భేదములుండవచ్చును. భేదములు కనఁబడక తప్పదు. భేదములు బాహ్యలక్షణములు. జ్ఞానవంతుఁడు

బాహ్యలక్షణములచే మోసపోడు. సర్వసహోదర భావము చిరకాలాభ్యాసమునగాని మనస్సున నాటదు. భేదబుద్ధిని క్రమక్రమముగ తొలఁగ ద్రోసికొనవలయును. అన్యదేశస్థుల యెడగాని అన్యమతస్థులయెడగాని వైరబుద్ధికూడదు. సర్వజనులయందును ప్రేమకలిగియుండవలయును. పరులకష్టములు తనవిగాభావించి తన్నివారణమునకై పాటుపడవలయును. పరులశ్రేయస్సునకు సంతోషింపవలయు. ఒకరినికి మేలుచేసిన లోకమునకంత మేలగుననియు, ఒకరినికి కీడుచేసిన లోకమునకంతయు గీడు జేసినట్లగుననియుఁ దెలిసికొనఁదగు. ఎవరికిగాని సర్వజనలాభ మేస్వలాభము. లోక పీడనమే తనకుపీడనము. అనునీధర్మమును మనస్సున దెచ్చుకొని పరోపకారమునకై పాటుబడుచున్నయెడల కాలక్రమమున సర్వసహోదరత్వము మనస్సున గోచరించు. తుదకు భేదబుద్ధి నిశ్శేషముగ నశించు. అపుడు

విద్యావినయసంపన్నే
బ్రాహ్మణేగవిహస్తిని
శునిచైవశ్వపాకేచ
పండితాస్సమదర్శినః ॥ భగ. 5-18.

అనుభగద్వాక్యము సార్థకమగు.

## సహవాసబలము.

మనచుట్టుప్రక్కలనున్న సమస్తవస్తువులనుండియు వాని తేజస్సు నిరంతరము మనమీదికి ప్రసరించుచుండును. అందుచే క్రమక్రమముగ వానిస్వభావము మనకుబట్టుబడుచుండును. మన సమీపమునసుండు మన్ను, రాళ్ళు, నీళ్ళు, వృక్షములు, పశ్వాదులు ఇవియన్నియు వానివాని స్వభావమున కనుగుణ్యముగ మనగుణములను మార్చుచున్నవి. ఈపదార్థములలో నొక్కొక్కదాని స్వభావము వేరుగనుండును. ఇసుకనేల, బంకమంటినేల, సున్నపుగడ్డ మొదలగు భేదములచేత భూమిలోనుండిబయలువెడలు తేజస్సు వేర్వేరుగుణములుగలదై యుండును. తటాకములు, సముద్రములులోనగు జలాధారములప్రక్కన వాని తేజస్సు ప్రసరించుచుండును. సముద్రతేజస్సుమిగుల బలవత్తరమైనది. వృక్షములకును నిట్టితేజస్సుగలదు. ముసలిచెట్లయందధికముగనుండును. వానియందు కామక్రోధములును కొంతమట్టుకు నంకురించియుండును. సూర్యరశ్మియు, వానయుఁదగిలినపుడు వృక్షములు ఙ్లానముగనుండు. అట్టి సమయమందు వానినుండి సంధ్యారాగంబునుంబోలిన మనోహరమగు నొక్క తేజస్సు ప్రసరించుచున్నట్లు దివ్య దృష్టిగలవారు చెప్పెదరు. వృక్షముల స్వభావమునందుగల రహస్యము మిగుల వింతగానుండును. కొందఱు మనుష్యులకువలెనే చెట్లకును తమకుసంతానముకలుగవలయు ననుకోరిక యధికముగనున్నది. అట్టికోరిక యీడేరినప్పుడవి మిగుల యానందమును జెందును. చెట్లు తమపువ్వులు పలుదెఱంగులగురంగులతో మనోహరంబులుగాగతుమ్మెదలు, తేనెటీఁగలు

తమచుట్టురోద చేయుచు నాశ్రయించుటచే పరమసంతోషమునుబొం దును. మనుజులు తమ్ముఁబ్రీతితోఁ బోషించుటకు చెట్లుముదమందు చున్నవనుటకు సందేహములేదు. అవియు నరులు తమ దెసఁజూపు ననురాగమున కుప్పొంగి వారియెడఁ దామును బ్రీతిఁజూపును. వృక్షములశక్తి యధికముగ మనమీద బ్రసరించుచున్నదని యిప్పుడు మనకుఁ దెలియుచున్నదిగదా. మనచుట్టుప్రక్కలనున్న మనుజులతోడనేగాక మృగములతోను, వృక్షములతోడను బ్రీతితో వర్తించుట మనకు కర్తవ్యము. అట్టునడచెడువాఁడు తానును సుఖమంది యితరులకును సుఖమునిచ్చువాఁడగు. దానివలన వాని జీవితము సఫలతఁగాంచు.

వృక్షవర్గము భూతకోటిలో నొకర్తరగతియైయున్నది. మృగములందును, మనుష్యులందునువలెనే యిట్టి జాతిభేదము వృక్షవర్గమునందును గానవచ్చుచున్నది. ఒక్కొక్క తెగకును వేర్వేరగు తేజస్సుగలదు. అదియొక నరునకు సుఖకరముగను మఱియొకనికి బాధకరముగనుండును. మఱియొకనికి నేవిధమగు ఫలమునివ్వకయునుండును. వృక్షవర్గమిట్లు నరునకు సుఖదుఃఖములనిచ్చుట వానివానిప్రకృతి ననుసరించియు తారాస్థితి ననుసరించియునుండును. వృక్షములను నానాతెగయని తెలియుటకు జ్ఞానమును, నభ్యాసమును గావలయును. అయినను చింత, కానుగ, మఱ్ఱి, వేప, తాటిచెట్టులోనగు వృక్షములవలనను, తామర, సంపెగ, జాజి మొదలగువానివలనను మనుజునికి వేర్వేరు మనోభావములు గలుగుననుట లోకవిదితముగదా.

బహుకాలమునుండి మనుజుఁడు జంతువులయందు క్రూర
త్వమునే చూపుచున్నాఁడుగదా. దానివలన నడవిమృగములన్ని
యు వానికి భయపడి వానిం జేరరావు. అట్లగుటవలన జంతువుల
నుండి మనుజునకుఁగలుగుఫలము కేవలము స్వల్పము. వాని
సమీపమున వర్తించు మచ్చికపడిన మృగములవలనమాత్రము కొద్ది
ఫలము వాఁడుపొందును. అట్టిజంతువులదెసకు మనుష్యుని తేజస్సు
అధికముగ ప్రసరించుచున్నది. జంతుశక్తి మనుజుని దెసనంత
ప్రవహించుటలేదు. ఇది కొంచెమైనను కొదువకాదు. నిష్కా-
పట్యముగా జంతువుదెస నెవ్వఁడైనఁ బ్రీతిఁజూపినయెడల నది
వానికిసహకారియగు. నరుఁడుజంతువునకంటె జ్ఞానసంపద్ధిముఁడు
కాన వానిప్రీతి మిగుల బలముకలదిగానుండును. అయినను జం
తువు యొక్క ప్రీతి యేకముఖముగా వర్తించునుగాన జంతువు తన
శక్తినంతయు నొక్కనియందె చూపును. మనుజుఁడు మిగుల
ప్రవృద్ధిఁ జెందిన వాఁడగుటవలన ననేకవిషయముల గమనింప
వలసియుండుటచే తనశక్తిని ననేకమార్గముల ప్రవహింపఁ జేయు
చున్నాఁడు. జంతువున కట్టులకాదు. కనుక నధిక ఫలమునిచ్చు
చున్నది. నరుఁడ నేక విషయములను యోచింపవలసియున్నది.
కాన వానిప్రీతి బహుముఖమగుచున్నది. పిల్లికిగాని, కుక్కకు
గాని యొక్కనియందు ప్రీతిగలిగినయెడల సర్వకాల సర్వావస్థ
లందును వానియందె దానిప్రీతి ప్రసరించుచుండును. ఇట్టిదాని
ఫలము కొంచెమనుటెట్లు? ఇవ్విధంబున మనుజుఁడు తనక్రూరత్వ
ముచే జంతువులకు కోపమును భయమును పుట్టునట్లుగా వర్తించు
నేని నాశహేతువులగు ననేకశక్తులు వానియందావేశమందును.
అట్టిక్రూరునియందు సమస్తదేవతలకును భూతగణమునకును కోప

ము కలుగును. సదేహులగువారేగాక విదేహులగు సత్పురుషులును వానింగటగటఁజూతురు.

కుక్క పిల్లి లోనగు జంతువుల కోపమునకు పాత్రుఁడగుటయే నరునకుఁగూడదని చెప్ప తనచుట్టుప్రక్కలనుండు మనుజులతో పోరాటముకూడదనియును చెప్పవలయునా? నరుఁడు తానెల్లప్పుడు కలిసిమెలిసియుండువారియెడ ననురాగముతో వర్తించి వారిప్రీతిఁబడయుట ముఖ్యమని చెప్పవలసియుండునే? బాలురు ప్రీతితోఁదన్నుఁ గౌరవించుట యుపాధ్యాయునికి ముఖ్యముగదా. సేవకులు ప్రీతితోఁచూచుట వర్తకునికి ముఖ్యముగదా? అధికారిని సేవకులు భక్తితోఁగొలుచుట ముఖ్యముగదా. ఇయ్యది లోకవ్యవహారములయందు కలిగించుమేలది యటులుండగ సూక్ష్మలోకములందు మిగుల ఫలమిచ్చును. యజమానునియందు వానికిలోఁబడినవారు ప్రీతిగలిగి భక్తితోఁగొలిచినయెడల యజమానునిదెసకు వీరిప్రీతి ప్రవహించి మేలునిచ్చును. ఇట్టిప్రీతి యజమానునికి బలమును సుఖమును నిచ్చును. మఱియువాఁడు నీశక్తినెఱింగిన యెడల తనవారికి మిగుల సహకారికావచ్చును. వారి సహాయముచే గొప్పకార్యములనైన సాధింపవచ్చును.

మనుజులు పరస్పరము భిన్నాభిప్రాయములు కలవారైయున్నను నిట్టిప్రీతిని సంపాదింపవచ్చు. దృఢమగుప్రీతి యొకటియుండినచాలు. అయినను యజమానుని దెసభక్తియు దుర్భావమును నితరులకున్నచో వానిదెసకు సర్వకాలమును దుష్టతేజస్సు ప్రవహించుచుండును. ఇవివాని సూక్ష్మ దేహములందు బలహీన

తయు విపరీత స్పందనమును పుట్టించును. దానివలన వాఁడే కార్యమునుగాని నిర్విఘ్నముగ కొనసాగింపఁజాలక పోవును. నరుని స్నేహితులె వానిగుణమును దెలుపుదురని లోకోక్తిగలదు గదా. ఇంతియె కాదు, సాంగత్యముచే నరునకు గుణాగుణముల లవడునుసుమ్ము. పలుమాఱు కలిసియుండు స్నేహితులు వానికిఁ దెలియకయే తమస్వభావమును వానిపైఁబ్రసరింపఁజేయుచు క్రమక్రమముగా తమయంతటివానిగాఁజేయుదురు. గొప్పబుద్ధిగల్గి స్వప్రయోజన మభిలషించని మహాత్ములసన్నిధి చిరకాలము వసింపఁగల్గినయెడల వీఁడును నట్టివాఁడగు. మహాత్ములశక్తి యెడతెగక వానిపైఁబ్రసరించుటవలన వాఁడును నట్టిమార్గమున వర్తింపనగును. ఇట్లులనే సోమరిపోతులును దుర్మార్గులగు వారితో నెల్లపుడు సత్రముల తిన్నెలమీఁద బ్రొద్దుపుచ్చువాఁడు తానునట్టివాఁడె యగుగదా. సర్వ విషయంబుల రహస్యార్థమును విమర్శించినపుడు సహవాసముచే దోషగుణంబులు గల్గునను లోకోక్తియథార్థమని తెలియు. సత్పురుష సాంగత్య మిట్టిమహిమగలదని మనవారికిఁ దెలియును. దానివలననె గదా శిష్యుఁడెల్లపుడును గురుకులవాసముచేయుచు గురుని సమీపమున వర్తించుట ముఖ్యమని విధించిరి. గురుని దేహములన్నియు మిగులబలముతో నియతపద్ధతిఁదప్పక చలించుచుండు. మఱియు నట్టిచలనము శ్రేష్ఠమైనదిగానుండును. శిష్యుఁడు తనదేహముల నివ్విధమున నుంచుకొనఁజాలఁడు. గురుసన్నిధియందు నట్టిస్థితి నొకానొకప్పుడు చెందునేమోగదా. అయినను గురుని దేహమునుండి ప్రసరించు దృఢమగు మహిమచే నానాట శిష్యునిదేహములును నట్టిస్థితిఁగాంచు. సంగీతము పాడుటకు చక్కఁగా నేరని యొకఁడు గొప్పసంగీతగానితోకలిసి పాడుచు

వచ్చినయెడల వీఁడును క్రమముగ సంగీతము నేర్చునుగదా. అట్టులనే గురునిస్థితి శిష్యుఁడును పొందవచ్చు. గురుని ప్రధాన గుణము సార్వకాలమును చలించుచు శిష్యునిదేహమును మార్చుచుండును. దీనికై వారిప్రయత్నముపనిలేదు. శిష్యుని దేహములు నానాటమారుచు ప్రవృద్ధిఁగాంచునుగదా. గురునిమహిమ యిట్టి ప్రవృద్ధికిఁదోడ్పడి సన్మార్గమునకుఁద్రిప్పి విమార్గమునఁజోరనివ్వక చేయును.

పరమార్థగురువు ప్రయత్నముతో తనమహిమనువిస్తరింపఁజేయును. సామాన్యమనుష్యునినుండి వెలివడుశక్తి ప్రయత్నపూర్వకమైనది కామకాన మిగుల స్వల్పముగానుండును. అయిన ననేకులశక్తిమనయందు ప్రసరించుటచేఁగొంతబలము దానికి గలుగవచ్చు. ఇతరులమనోభిప్రాయములును స్వభావమును నెల్లకాలమును మనదిక్కునకై ప్రవహించుటచేత వారిరాగద్వేషములు మనకునుకలుగును. ఇదిమనకు తెలియకయేకలుగుచున్నది. అట్లగుటవలన నొక్కవిధముగు మనుజులతోనెల్లపుడుఁగూడియుండుటగాని యొక్కచోటనే నివసించుటగాని యొక్కవిధమగు నభిప్రాయములనెల్లప్పుడువినుచుండుటగాని మేలుకాదు. ఇతరులయభిప్రాయమును నెరుగుటముఖ్యము. దానివలన నెగదా యన్నిటియందలి గుణాగుణంబులనెఱుగవచ్చు. ఏవిషయమునందుగాని మనుజుఁడు భయవాదములనెఱింగినగదా వాఁడొక్క తెరంగునతీర్మానింపసాధ్యమగు. దురభిమానియగువాఁడు తెలివిలేనివాఁడు. ఇట్టియజ్ఞానమును పోగొట్టుకొనుటకు తనగొందినివిడిచి బయటపోయి సమస్తవిషయముల తనకుఁదానే గ్రహించుచు వానివాస్తవ్యమునెరుంగుట

యేముఖ్యసాధనము. వాస్తవ్యమున తెలియనివారి యభిప్రాయములుకావుసుమా.

మనచుట్టుప్రక్కలనుండు సహవాసులనువదలి వేఱొకచోటికిఁబోయినపుడు సాంగత్యబలమిట్టిదని తెలియవచ్చును. పరదేశమున సంచారముచేయుటచే నిదిచక్కగా తెలియును. తనయూరివారితోఁగలిసి గ్రామమునుండి గ్రామమునకుఁబరువెత్తుచు నెచ్చటనైన నాచారభేదముగాన్పించినపుడు చిడిముడిపడుచు తిరుగుచుంట దేశాటనముకాదుసుమా. పరదేశమునఁ గొంతకాలము నెమ్మదిగాఁగాపురము చేయవలయును. అచ్చటిజనుల యాచారములను గుణాగుణంబులను దెలియఁబ్రయత్నపడవలయును. ఆచారభేదములను చక్కగావిమర్శించి వానికిఁగారణములును వానియందలి గుణంబును తెలిసికొనవలయు. అవిమనయాచారములకంటె భిన్నములని వాస్తవ్యమెఱుగక వానినిందింపరాదు. ఇవ్విధంబుగఁజేసినయెడల మనుష్యజాతులలో నొక్కొక్క జాతియొక్క సహజగుణంబులుగానవచ్చు. ఇంగ్లీషు దేశస్థులు, పారసీకులు, చీనావారు, హిందువులు, మొదలగువారికిగల పరస్పరభేదములు తెలియవచ్చును. ఇట్టిభేదములను దెలిసినపుడు వారిలో నొక్కరు మఱియొక్కరికంటె శ్రేష్ఠులుగారనియు నిట్టినానావిధములగు భేదములెల్ల జీవవికాసమునకు ముఖ్యములనియును దెలియవచ్చును.

ఒక్కొక్కదేశపుస్వభావమును జీవవికాసమునకుఁగావలసియున్నది. ఏజీవునియందు నేగుణములేకుండునో యాజీవుఁడా

స్వభావమునిచ్చు దేశమునందు జన్మించుట యాగుణమునందుట కనుకూలముగనుండును. ఒకొక్క మనుష్యజాతికిని నొక్క దైవ మధిపతిగానున్నాఁడు. ఆ దేవత మనువుయొక్క యాజ్ఞానుసారము గ నామానవజాతిని మనువుచే నియమింపఁబడియుండు మార్గమున నడపుచు దానివిశేషగుణంబుల రక్షించుచుండు. జీవవికాసమునకు నూతనస్వభావములు గావలసినప్పుడు క్రొత్తమానవజాతులు స్ృష్టింపఁబడును. జీవులందఱును నేజాతిగుణమును సంపూర్తిగఁ బొందుదురో యట్టిజాతినశించును. ఒక్క జాతికధిపతియగు దేవతయొక్క శక్తి యతనియధికారమునకు లోబడిన దేశమునందంతటను వ్యాపించియుండును. కనుక యాదేశమునకుఁ గ్రొత్తగఁబోవువానియందును నాశక్తి ప్రవేశించును. దేశాటనముఁజేయు సామాన్యమనుజుఁడు స్వదేశమందలి దురభిమానముచేఁగప్పఁ బడియుండును. అట్టివాఁడు తనదేశపువారె యందరికంటె శ్రేష్ఠులను గర్వముచేఁ గన్నుగానకయుండునుగాన వానికి పరులయందలి సుగుణంబులు గానరావు. జ్ఞానవంతుఁడు సద్విషయములభిషించుగాన నిట్టిదేశాటనముచే విశేషజ్ఞానమును లోకానుభవమును సంపాదించును. ఇట్టివిగోరెనేని యావిషయముల దెసనున్ముఖతఁ గాంచవలయు. మాటాడక వినవలయు. గర్వింపక యభ్యసింపవలయు. తప్పులెన్నక గుణంబుల గ్రహింపవలయు. త్వరలో నిందింపక వాని నెఱుగవలయు.

వ్యాధిగ్రస్తులు గ్రామాంతరమునకుఁబోవుట మేలని చెప్పుట మనమువినలేదా? మనోవ్యాధులకు దేశాటనము మంచిమందుగదా. ప్రయాణముచేయుట యలసతఁబుట్టించుగాని దేహము నిశ్చయము

గా తేలికగానగును. ఇట్టులగుట వాయువును నైసర్గిక వస్తువులును మాఱుటచేఁగలుగును. ఇంతియెగాదు. ఒక్కొక్కప్రదేశమునకు సంబంధపడిన యాకాశ తత్వమును సూక్ష్మలోక ప్రకృతియును వేఱుగదా. దానిచేనిట్టిది సంభవించు. సముద్రము, పర్వతములు, అడవులు, జలపాతములులోనగునవి యొక్కొక్కటియు నొక్కొక్క విధమగు శక్తిగలవి. వానికి మున్లోకములకును సంబంధపడినశక్తి వేర్వేరుగనుండును. దానివలన దానిశక్తి ప్రసారమును భేదించును. సూక్ష్మలోకములందలి భూతగణము తమశక్తిని వెదచల్లుచున్నవి. ఇట్టిశక్తి ప్రసారముచే మనదేహములందంతకుమున్ను చలింపనిభాగములు చలింపనారంభించును. దానివలన నప్పటికి నలతతోచినను నానాట దేహారోగ్యము కలుగును. దేహవ్యాయామమునందును నిట్టులనేగదా.

పట్టణములో నివసించువానికి తనచుట్టుప్రక్కలనుండునవి వాడుకపడి వానియసహ్యము వానికిఁదోచదు. వానివిడిచి దూరముపోయినపుడవి యసహ్యములని వానికిఁగాన్పించు. రాకపోక లధికముగనుండు వీధిలోఁ గాపురముచేయుట కంపులెగఁజిమ్ముచు పాఱు పెద్దజలదారి ప్రక్కన నుండునట్టుగా దివ్యజ్ఞానదృష్టికిఁదోచు. ఎట్టిమోటుగాఁడైనను నిట్టిచోట చిరకాలము వసించినయెడల నీచదశఁజెందును. అప్పుడప్పుడుపల్లెగ్రామమునకుఁబోవుట దేహారోగ్యమునకును గుణవృద్ధికిని సాధకములగు. పట్టణమునుండి గ్రామమునకుఁబోయినపుడు పట్టణములోనుండు మనుష్యుల కామక్రోధములు కొంతమట్టుకైన మనలవిడుచునుగదా. గ్రామమునందు పట్టణమునందుకంటె వాసియగు సత్సంకల్పములు

గలవు. మహోచ్ఛ్రితములగు గొప్పజలపాతముల సమీపించినపుడు నెలంపు దినవెచ్చముల దుఃఖములు మఱచి మనంబుకరగి స్వార్థపరత వదలి మహోన్నతములగు సంకల్పములకుఁ జొచ్చుఁగదా. దానం జేసి యట్టిస్థలంబులందు సద్భావబింబములె వసించుచుండు. ఇవి యన్నియు యోచించినపుడు దేశాటనము చేయువాఁడు నైసర్గిక విషయంబులనే గమనింపవలయునని తెలియును. వాఁడు ద్రవ్యము లేదని దుఃఖపడుచు మూతిముడుచుకొని కూర్చుండి తన వ్యాధి వదలలేదని చింతించుచుండిన నేట్టిప్రయోజనమును వానికిఁ గలుగదు. గ్రామమునకు బయట స్వారి వెడలుట దేశాటనము చేయుటం బోలినది. అట్టిస్వారి చేఁ బ్రయోజనము కలుగవలయు నేని మున్ను చెప్పినవిషయములన్నిటిని చక్కఁగా గమనింపవలయు. అవియన్నియు మనమూఁడు దేహములమీదికి తమశక్తిని బ్రసరింపఁ జేసి లోకవ్యవహారములవలనఁ గలుగు వేదనలను పోఁగొట్టును. ఇప్పుడు చెప్పిన సంగతులన్నియు యథార్థములని లోకములోని కొన్ని వాడుకలవలనఁ దెలియవచ్చు. కొన్నివృక్షములనీడలో నిద్రించిన యెడల రోగములు వదలునని చెప్పుదురుగదా. సామాన్యమనుష్యులకుఁ దెలియని యొకమహిమ యావృక్షములనుండి ప్రవహించుచున్నది. అదిసూక్ష్మదేహములందలి యనారోగ్యములను క్రమక్రమముగా పోఁగొట్టి దేహములకు నారోగ్యమునిచ్చును.

## ధ్యానము.

ధ్యానియనగా ధ్యానము చేయనుపక్రమించు వాఁడు. ధ్యేయపదార్థమును (ధ్యానము చేయు) లక్షణమందును, గుణమందును

మఱియు సకల విషయములందును తనకంటె సర్వవిధముల శ్రేష్ఠమైనదిగా నుండుదానినే ఉంచుకోవలెనుగాని సామాన్యమగు దానినుంచదగదు. అదెందుకన ఎవఁడు ఎట్టిదానిని ధ్యానించుచున్నాఁడో వాఁడు అట్టివాఁడగునని అనేక ప్రమాణములుగలవు. "యద్భావంతద్భవతి" "As one thinks so he becomes" ఎవఁడేది భావించుచున్నాఁడో వాఁడదేఅగునని సిద్ధాంతమును అందరు అంగీకరించుచున్నారు. ఎందుకన అదిప్రకృతి ధర్మలక్షణము. ధ్యానించుభావముల ననుసరించి దానికితోడ్పడునుపాధులునుమారును. ఉపాధులు మారినల్లంతయు భావములునుమారును. (ఉపాధులన దేహాదులు). జనులు సర్వదా విషయములను (ఇంద్రియ ప్రియవస్తువులను) ధ్యానించుచుండుటఁబట్టి వారి యుపాధులు అట్టివస్తువులనే ధ్యానించుట కుపబలములగు భూతములు గలవిగా నైనవి. "ధ్యాయతోవిషయాన్పుంసస్సంగస్తేషూపజాయతే। సంగాత్సంజాయతేకామః కామాత్క్రోధోభిజాయతే। క్రోధాద్భవతిసమ్మోహస్సమ్మోహాత్ స్మృతివిభ్రమః। స్మృతిభ్రంశాద్బుద్ధినాశోబుద్ధినాశాత్ప్రణశ్యతి"॥ విషయములనే సర్వదాధ్యానించుటచేకలుగు అనర్థములెన్నియో లెక్కగొనుఁడు. విషయములను ధ్యానించుటచే కామమును, కామముచే క్రోధమును, క్రోధముచే మోహమును, మోహముచే స్మృతితప్పుటయు, దానిచే తెలివిపోవుటయు, తద్వారా సంపూర్ణమైన నాశనమును ప్రాప్తమగునని తాత్పర్యము. ఇప్పుడు మనకుండునుపాధులు యీపైచెప్పబడిన గుణములను వృద్ధిజేయు భూతములతో నేర్పడినవనుటకు సంశయములేదుగదా. ఇట్టిసర్వనాశకరమగు ఉపాధులు మన భావనలచేత నేకదా పొందితిమి.

అదెట్లన ఆధునిక ప్రకృతి తత్వశాస్త్రకారులు మనుష్యుని దేహము యెడతెగక సర్వదా మారుచునేయుండుచున్నదని కని పెట్టినారు. అనగా దేహమందుండు భూతఅణువులు ఎల్లప్పుడు

వెడలిపోవుచు వానికి బదులుగా బ్రహ్మాండమందుండు వేరు భూత అణువులు దేహమందు చేరుచునేయుండునని తాత్పర్యము. పదు సంవత్సరముల కొకతూరి దేహమంతయుమారి క్రొత్తభూత ములుకలవిగానగుచున్నదనియు సిద్ధాంతపరచినారు. ఇదినిశ్చయ మనుటకు సంశయములేదు. ఎందుకనన ఇట్టిమార్పులు లేకుండినం తట బాల్య కౌమార యౌవనవార్ధక్యదశల ననుసరించిన దేహ భేదముకలుగుట కవకాశము పొసగదు. కనుక నిదిస్వభావధర్మ మనుటకు సంశయములేదు. ఈమార్పులు జనులు ధ్యానించు (భా వించు) భావనలననుసరించే మారుచుండును.

జనులు అనేకజన్మములనుండి విషయములనే ధ్యానించుచు ఆధ్యానమున కనుకూలములైన యుపాధిబీజములుగల శాశ్వత అ ణువులతో *(Permanent Atoms) కూడిన శరీరమీజన్మమున నెత్తి, ఇప్పుడును అట్టివిషయములనే ధ్యానించువారు ఇట్టి పరమార్థ మునకు భంగకరములైన యుపాధులను పోగొట్టి సద్భావనలను ధ్యా నించుటకు అనుకూలమగు నుపాధులనుపొందుట కెంతకాలము, యెంతశ్రమ, కావలసివచ్చునో యోచించుడు. భావించవలసిన భావనలెంత పరిశుద్ధముగా నుండవలెనో కనుగొనుడు. ఇట్టి భావనలనెట్లు అభ్యసించవలెనో తెలిసికొనుడు.

ఈ కారణముచేతనే మహనీయులును, సర్వతత్వజ్ఞులునైన మహామునులు ధ్యానమునకు పరమయోగ్యమైనవాడు ఈశ్వరుడే యని నిర్ణయించియున్నారు. ఈశ్వరుడు సమస్తకల్యాణగుణ సంపన్నుడని అందరు అంగీకరించియున్నారు. జనులయందుండు అత్యంత అమంగళకరమైన గుణములను పోనాడవలసియున్న, త ద్వ్యతిరేకములగు కల్యాణగుణములుగల వస్తువును ధ్యానించవల సినది అవశ్యకము. భగవద్రూపమందు కల్యాణగుణములను ఆరోపణచేసి ఆరూపమును ధ్యానించుటచే, ఆగుణములను సులభ

*Note:—వేదాంతగ్రంథముల నివి భూతసూక్ష్మములనఁబడును.

ముగా పొందనగును. అదేలనన భగవంతుడు ధ్యానముచేయు వానికంటె అత్యంతోన్నతస్థితియందుండుటనుపట్టి ఆయనయందు వినయభయభక్తులు కలిగియుండును. ఆయన అనుగ్రహించు వాడనియు, తాను పరిగ్రహించువాడనియు తలంచియుండును. దానిచేత ఆగుణములు సులభముగా పట్టుబడును. కేవల గుణములనే ధ్యానించినచో నింతసులభముగా ఆగుణముల పొందజాలరు.

## ధ్యానించవలసినక్రమము.

కేవల విషయములందుచొచ్చిన మనసుగలవారు ఆదియందు ఆమనసును విషయములనుండి మరలించవలసియున్న ప్రతిదినమును కొంతతడవు యేకాంతముగా నొకగదిలోకూర్చుండి తలుపు మూసికొని అభ్యసించవలెను. తానుగదిలోకూర్చుండినసమయమందు భగవద్రూపమును ధ్యేయపదార్థముగానుంచుకొని దానినే ధ్యానము చేయవలెను. ఆరూపము తనకు అత్యంతప్రియ రూపముగానుండవలెను. అదేదిఅయిననుసరే. శివరూపమో విష్ణురూపమో పద్దైనను బాధలేదు. ఇట్టివారి కనుగ్రహించుటకే భగవంతుడు రూపములెత్తినాడని ప్రమాణములు కలవు. “ఉపాసకార్యార్థం బ్రహ్మణా రూపకల్పనా” ॥ అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమా రూపకల్పితా । సాధకస్యతు కార్యార్థం స్వరూపమిదంస్మృతం ॥ భక్తానుగ్రహ కరణాయతత్తదాకార గ్రహణం ॥ ఇట్టిప్రమాణములు పెక్కుగలవు.

గదిలోకూర్చుండి భగవద్రూపమునుధ్యానించుట కుపక్రమించినతోడనే మనసు సర్వవిధముల తప్పించుకొని విషయములను ధ్యానించుటకే పరుగెత్తుచున్నదిగాని అచ్చటనిలువదు, అదెట్లన

శ్లో॥ “ప్రసక్తబుద్ధిర్విషయేషుయోనరో ।
నబుధ్యతేహ్యాత్మహితంకదాచన॥

ససర్వభావానుగతేన చేతసా ।
నృపాఽవిషేష్టైవ ఝుషోవికృష్యతే" ॥

అని భారతమున నుదాహరింపబడినది. అనగా నెవరిమనసు విషయములందు చొచ్చియుండుచున్నదో అది ఎప్పటికేగాని ఆత్మ హితమునుగురించి యెరుగజాలదు. ఎందుకన అది సర్వదా విషయములనే భావనచేయుచుండుటనుపట్టి, చేపను ఏవిధమున మాంసము గాలములోబడుట కీడ్చుచున్నదో అట్లనే విషయములు వానినీడ్చుచున్నవని తాత్పర్యము. దానికి కారణము వానికేర్పడిన దేహభూతములు ఆయాకర్షణకే తగియుండుటే. ఈకారణమునుపట్టి భగవంతుండగు శ్రీకృష్ణులు ఉద్ధవునికీ విధమున ఉపదేశించినారు.

శ్లో॥ విషయాన్ ధ్యాయతశ్చిత్తం విషయేషు విషజ్జతే ।
మామనుస్మరతశ్చిత్తం మయ్యేవప్రవిలీయతే ॥

విషయములను ధ్యానించుచిత్తమెట్లు విషయములందు లీనమగుచున్నదో అట్లనే నన్నుధ్యానించుచిత్తము నాయందే లీనమగుచున్నదని స్వామి బోధించియున్నారు గనుక ఏకాంతమున గదిలోకూర్చుండి భగవదాకారమును ధ్యానించునపుడు ధ్యానము చేయువాని దేహమునుండు విషయాకర్షణకు తగినఅణువులు దేహమునుండివెడలి వానికిబదులుగా భగవద్ధ్యానమునకు తగిన అణువులు చేరుచున్నవి. అవియెందాక భగవదాకారము ధ్యానమునుండునో అందాకమాత్రమే ఆయణువులు దేహమందునిలిచియుండును. ఎప్పుడు మనసువిషయములందు మరల ప్రవేశించునో అప్పుడే తదనుగుణ్యములగు అణువులు పునహా దేహమందు జేరును. కాబట్టి సర్వదా భగవద్ధ్యానము చేయుచుండవలెనని ఆజ్ఞయిచ్చినారు. ఇదిసులభముగాదు. ప్రతిదినమును అభ్యసించుచుండవలెను. అభ్యసించునపుడు మనసు వీని అధీనమా తప్పిపోయినప్పుడంతయు త్రిప్పుకొనుచుండవలెను.

శ్లో॥ యతోయతోనిశ్చరతిమనశ్చంచలమస్థిరమ్ ।
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవవశన్నయేత్ ॥

ధ్యానముచేయునపుడు అస్థిరమైనమనసు ఎచ్చటెచ్చటకి పోవుచున్నదో అచ్చటచ్చటినుండి మరల్చి స్వాధీనములోనుంచుకొమ్మని అర్జునునికి శ్రీకృష్ణులు గీతయందుపదేశించినారు. ఈ ప్రకారము అతి దీర్ఘకాలము నిరంతరము ఒకరోజైనను తప్పక అభ్యాసము చేయుచుండినంతట ఆరూపమే మనసున దృఢముగా నిలుచుటచే ఆరూపమే యేగుణములకు అధిష్ఠానముగానుండెనో ఆగుణములే పట్టుబడి ఉపాసకుఁడు ఈశ్వరసమానుడగునని అనేక ప్రమాణములుగలవు.

శ్లో॥ యదామనఉపాధాయ యద్యద్రూపంబభూషతి ।
తత్తద్భవేన్మనోరూపం మద్యోగబలమాశ్రయః॥

అనగా మనసు యెప్పుడు యేయేరూపమునుపొంది అట్లుకావలెనని అపేక్షించుచున్నదో నాయోగబలాశ్రయముచే ఆమనోరూపమట్లనే యగుచున్నదని స్వామి ఉపదేశించినారు. ఇది గొప్పధర్మము. ఈధర్మమును అందరు మనసునందుంచి అభ్యసించవలెను. సర్వదా ఏకనిష్ఠచే భగవంతునే ధ్యానించుచుండువాడట్టివాడేఅగునని తాత్పర్యము. దీనికి నిరంతరాభ్యాసము కావలెను. „నిరంతరాభ్యాస వశాత్తదిద్ధం పక్వంమనోబ్రహ్మణిలీయతేయదా'' ॥ ఇట్టినిరంతరాభ్యాసముచే మనసుపక్వమై బ్రహ్మమందు లీనమగుచున్నప్పుడు వాడట్టివాడగుచున్నాడని శ్రీశంకరాచార్యులానతిచ్చినారు.

ధ్యానక్రమమిట్లుండ కొందరు ప్రతిదినముతప్పక తాము గదిలో కూర్చుండియుండువరకు యోగమో, ధ్యానమోచేయుచు, లోకవ్యవహారములందునీతిగాని ధర్మముగాని అవలంబింపక యిచ్ఛానుసారముగా వర్తించెదరు. ఇట్టివర్తనచేనెప్పటికిగాని ధ్యానఫలమును పొందలేరు. ఎందుకనవీరి దేహ సంబంధమైన అణు

వులు వీరుభావించుభావనలనే అనుసరించియుండుటనుపట్టి వీరుఅట్టి స్థితి చెందజాలరు. ఇట్లన్నప్పుడు సర్వదాగదిలోనే కూర్చుండి ధ్యానించుచునే యుండవలెనాయని కొందరడుగుదురు. అది అవశ్యముగనుండదు. సర్వదా ధ్యానించుటనగా ధ్యానియే వృత్తియందుండి యేపనిచేసినను అవృత్తియు ఆపనియు ధ్యానమునకు తగినయుపాధిని కలుగజేయుటనుగురించి లక్ష్యమందుంచికొని వర్తించును. భుజించునపుడు భోజనపదార్థములు ధ్యానమునకు తగిన భూతములను వృద్ధిచేయు సాత్వికపదార్థములనే భుజించును. ఇట్లనే ఆహారమందుగాక విహారమందును తదనుకూలముగానే వర్తించును. కామక్రోధములను వృద్ధిజేయు వాక్కులు పలుకడు, అట్టిసంభాషణవినడు, అట్టికార్యములు చేయడు. లోక వ్యవహారములందంతయు తానుధ్యానించు పదార్థమును పొందుట కనుగుణ్యముగా వర్తించును. ఇట్లువర్తించువాడే నిజమైనధ్యాని, ఇదియే నిజమైనధ్యానము. ఇట్టివాడే ధ్యేయస్వరూపుడవును.

శ్లో॥ పుంఖానుపుంఖవిషయేక్షణతత్పరోపి ।
బ్రహ్మావలోకనధియంనజహాతియోగీ ॥
సంగీతతాళలయవాద్యవశంగతోపి ।
మౌళిస్థకుంభ పరిరక్షణధీర్నటీవ ॥

అనేకవిషయసమూహాము మధ్యనుండి వీక్షించుచుండినను యోగి అనగా ధ్యాని బ్రహ్మావలోకనబుద్ధిని కొంతతడవైన విడువడు. ఏవిధమున నెత్తిమీద నిండుకుండపెట్టుకొని నాట్యమాడువాడు సంగీతమునకు లయమునకు తాళమునకు గమనించుచు నృత్యముచేయుచుండినను తలమీదనుండిన నిండుకుండమీద దృష్టి తప్పకయెట్లునిలిపియుండునో తద్వతే ధ్యానియు సకలకార్యములు చేయుచుండినను సకలమును జనకమహారాజువలె ధ్యేయపదార్థ

మున కనుగుణ్యముగనే చేయుచుండును, ఇదినిజమైన సాకార ధ్యానమార్గము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

సగుణ నిర్గుణధ్యానములనుగురించి దీనికితరువాయి సంచిక యందు వ్రాయబడును.

జం. శ్రీ ని వా స రా వు.

## యు గ సం ధి.

## II. మ న్వం త ర ధ ర్మ ము లు.

భూలోకముననుండినవారు నుండువారుఁ గలసి యయిదు తెగలుగ నేర్పడుదురు. మొదటిమూఁడు తెగలవారు భూమిలోఁ గొందతే యుండెదరు. మిక్కిలిభాగము మరణద్వారముప్రవేశించి తక్కిన తెగ లనుగ్రామములను జేరిరి. నాల్గవ తెగవారు జపాన్, చీనా, బర్మాదేశములనుండువారు. భాగవతము వీరిని దితిసుతులని పేర్కొనును. (ద్వితీయస్కంధమున బౌద్ధావతార వర్ణనముఁ జూడుఁడు). అయిదవ తెగవారు భారతదేశమునం దుఁ బారశీక యవ నైరోపాదేశములయందు నుండువారు. వీరి కార్యులని పేరు. లోకమునందు మున్నుండినజనులకంటె రూప లావణ్య విద్యాబల శీలములం దధికులై వీర లాపేరు వడసిరి. వీరిలో సమర్థ్యములగు పంచశాఖలుండును. అందు మొదటి శాఖ భరతఖండజనము. వీరికిని నార్యులని పేరు. ద్వితీయము పారశీకలోకము. తృతీయులు నశించి నామావశిష్టులైరి. యవనులు నాల్గవశాఖయయిరి. ఆంగ్లేయులు పంచమమగు శాఖ. మఱియు రెండుశాఖ లుద్భవిల్లును.

ఏడు తెగలగువారికి ధర్మస్థాపకులై యోగక్షేమధురంధరు లగుమహాత్ములు గలరు. వారిలో నిద్దఱిద్దఱొక్కొక్క తెగకు నొక్కరుమనువు నొక్కరు జగద్గురువుగనుండుదురు. బౌద్ధుఁడు

నాల్గవ తెగవారికి జగద్గురువు. ఏనవ తెగవారికి వైవస్వతుఁడు మనువు. మైత్రేయుఁడు జగద్గురువు. మనుపదమును జగద్గురుశబ్దమును ఉద్యోగసూచకము లగుబిరుదులు గాని విశేష నామధేయంబులు గావు.

మనువును జగద్గురువును దమప్రజలగు నొక్క తెగమానవులను మలినసత్త్వప్రధానులగువారిని శుద్ధసత్త్వప్రకాశమార్గమునఁ గొంతదనుకఁ గొనిపోవఁ బూఁటపడి యవతరింతురు. జను లొకొక్కొక్క తెగయందుఁ బుట్టిపుట్టి దానంగలుగు నభివృద్ధిని జెందఁగా నామనుజగద్గురువుల యధికారమునకులోఁబడియు దానిలోపలనే స్వతంత్రవ్యాపారమునుఁగలవారై నానాజన్మములసంసర్గతిని బొందినపిమ్మట నా తెగయందు లభ్యమగుజ్ఞానము సంపూర్ణముగ లభించినపదపడి మఱియొక తెగయందుఁ బుట్టుదురు. కాదేని తమ యోగ్యతానుసారముగఁ దమకుఁబొసఁగు జ్ఞానాభివృద్ధి యొక తెగయందు లేకుండిన నయ్యది వేఱు తెగయందుండిన నందు జనింతురు. లోకము విద్యాశాల: జననపరంపర మగుసంసారము విద్యాభ్యాసము. విద్యల నేకములు. ఒకవిద్యను సంపూర్ణముగ గ్రహించి మఱియొకదానికై పాటుపడవచ్చును. కాదేని యావిద్యనభ్యసించుచోఁ దనకదిజతపడకుండిన దానినివిడిచి జతపడువిద్దెఁ జదువవచ్చును. బడియందుఁ గొందఱు లెక్కలను వ్యాకరణమును జదువుచుండియుఁ గొంత నేర్చినంతట లెక్కలందభిరుచి లేనివారు వ్యాకరణమును, వ్యాకరణమునం దభిరుచిలేనివారు లెక్కలను మిక్కుటముగ నభ్యసించెదరు. మఱియు గొందఱు రెంటనభిరుచిఁగలవారై యొక్కదానిని సంపూర్ణముగఁ గఱచి తక్కినదానిని గఱవఁ దలపడుదురు గదా. అట్లు నానావిధ జ్ఞానసంసిద్ధికై లోకులు తెగలను తరగతులందుఁ బ్రవేశించుచున్నారు. లోకహితముఁగోరువారు గావున ధరణీ విద్యాశాలయందలి జగద్గురువులు పరస్పరమిత్రభావమున పను లొనరింతురు.

ఇట్లు బౌద్ధుఁడు నాల్గవ తెగవారికి గురువయ్యెను భరతఖండమున నార్యులందు జన్మించెను. మైత్రేయుఁడేనవ తెగవారికి గురువయియుండియు బౌద్ధుఁడే చిరకాలము వారికి జ్ఞానోపదేశము చేయుచుండెను.

ఇట్లు నూతనజ్ఞానోదయ మావశ్యకముగాఁ గలుగుననుటకుఁ బ్రమాణముగ గీతాశాస్త్రమునందలి

శ్లో॥ కాయేన మనసాబుద్ధ్యా కేవలైరింద్రియైరపి ।
యోగినః కర్మకుర్వంతిసంగంత్యక్త్వాఽఽత్మశుద్ధయే ॥ యని

చెప్పవచ్చును. జనులు కృతత్రేతాద్వాపరయుగంబుల ధ్యానశక్తియు నుగ్రతపశ్శక్తియు సంపాదించియు వారికినింద్రియముల శక్తి యెదిగి యింద్రియములు పరిశుద్ధము లగుటచే వారు కలియుగమునఁ బుట్టెదరు. అట్టి నూతన విద్యాదానమును జేయు భగవంతుఁ డవతరించుననుటకుఁ బ్రమాణముగ నీశ్లోకములఁ జెప్పవచ్చును.

శ్లో॥ వేదా మా మీశ్వరం ప్రాహు రవ్యక్తం వ్యక్తి మత్పరం ।
తే వేదా బ్రాహ్మణముఖే నానాధర్మే ప్రకాశితాః ॥
యో ధర్మో బ్రాహ్మణానాం హి సా భక్తి ర్మమపుష్కలా ।
తయాహం తోషిత శ్శ్రీశః సంభవామి యుగే యుగే ॥

కల్కిపురాణం ॥

నాల్గవ తెగవారియం దభివృద్ధిచెందినవి కామమును సంకల్పమును. ఏనవ తెగజనులం దభివృద్ధిగాఁగలది మనోవ్యాపారమును బ్రతిభాశక్తియు. నాల్గవ వారియందుఁ బ్రాణమయకోశము దృఢమయ్యెను. ఐదవవారియందు మనోమయకోశము దృఢముపడును. ఇఁక నాఱవ తెగ వచ్చునది. వారియందు బుద్ధి యధికమై నెగడును. విజ్ఞానమయకోశము బలవంతమగును.

ఇఁక నొక్క తెగనుండి మఱియొక తెగ యెట్లు గలుగునని వివరింపవలయును. ఈవిధమున్న దత్త్వజ్ఞులగు వారెఱఁగింతురు.

ఏనవ తెగవారి యభ్యుదయమును వివరించిన నాక్రమము విశద మగును. ఏనవ తెగవారికి మను వగు వైవస్వతుఁడు నాల్గవ తెగ వారిలోఁ గొంతదనుకఁ గామప్రాణములందు బలవంతులయ్యె నంతలో మనీషాశక్తియు మనోమయకోశ ప్రకాశమును గలిగినవారలను గొందఱిని వెదకి వేఱుచేసి వారిని జక్కఁగా శిక్షించి పోషించి పెంచెను. అట్లు వారిజనసంఘ మాధికమగుచుండ వారలలో శ్రేష్ఠులను నెడనెడ దూరదేశములకుఁబంపి యందు స్థాపించుచుండెను. మొదటిశాఖవారగు నార్యులట్లు వచ్చి హిమగిరివింధ్యాచల మధ్యభూమియందు నిలిచి భరతవర్షమున నాగరికమును నెలపిరి. అట్టులే తక్కిన వారు పారశీకయవనదేశములందును నుత్తరైరోపాఖండమునను స్థాపింపఁబడిరి.

ఇఁక నేనవ తెగనుండి యాఱవ తెగ యెట్లు లేర్పడు ననియు నేనవ తెగయందాఱవ శాఖ కెట్టిలక్షణములుండు ననియు వివరింప వలయును. ఆఱవ తెగయందె జ్ఞాన మభివర్ధిల్లునో యదియుఁ గొంత నాఱవ శాఖయందుఁ గుదురును. ఆఱవ తెగవారికి విజ్ఞానమయకోశమును బుద్ధియుఁ బ్రకాశిల్లును. కావున నేనవ తెగ వారిలో నాఱవశాఖయందుఁ బ్రతిభాశక్తితోడ బుద్ధియు విజ్ఞానమును గొంతఁ గలుగును.

జగత్తంతయు నీశ్వరమయ మనుజ్ఞానము శుద్ధబుద్ధి. మానవులంద ఱీశ్వరాంశములనుప్రజ్ఞ. ఈశ్వరాంశములగుటచే నీశ్వరునకుఁ బుత్రసంబంధమున నుండువారు. ఒండొరులందు భ్రాతృబాంధవమున నుండువారు. ఇప్పటిజనులు మనఃప్రతిభాకౌశలమున నేను బృథగ్భూతుఁడ ననియు నాశక్తి యెక్కుడనియు, నితరులమించెద ననియుఁ బూనికతో నొండొరుల గడవనిశ్చయించి నొరులకలిమి కుబ్బి వేఱుపడి యుండువారు. ఇట్టిగుణములు మనోభివృద్ధి కవశ్యములు. అవి లేనిచో నెవ్వఁడును వర్ధిల్లఁ డెట్లు. ఉత్సాహమున కుద్యోగమున కవసరము లుండునే. పృథగ్భావ

స్ఫురణమున జను లొక్కరొక్కరు విద్యావంతులగుటకు మనోవృద్ధిఁబొందుటకు నవకాశము గలిగెను. మఱియును దీనికి ద్వేషము సహాయమగును. ద్వేషమున వేఱుపడి జనులు తమంతటఁ దాము నిలువ నేర్చుచుండుదురు. ఇట్లు దుర్గుణములు నొక్కయెడ సత్సాధనము లగునుగదా. ఇప్పు డనేకులకుఁ బృథగ్భావమే రుచించుచున్నది. వారు తుదిముట్టఁ బ్రతిభాకౌశలము నార్జింతురు. కొందఱి కీపృథగ్భావము రుచింపదు. రుచికరముకాకుండియుఁ గాలదేశ సందర్భ నిబద్ధులై దానికి లోఁబడెదరు. లోఁబడి యుండియు సర్వభూతములం దాత్మ యున్నదనియు నాత్మయందు సర్వభూతము లున్నవనియు బుద్ధిచేఁ జూచెదరు. వారుభావమున భ్రాతృత్వమును బాటించి వ్యవహారమున సాధ్యమగునవసరముల దాని ననుష్ఠించెదరు. అట్టివారు గూడి యేనవ తెగయందలి యాఱవ శాఖ యగుదురు. ఆఱవ శాఖయందలి శ్రేష్ఠులే కొందఱాఱవ తెగయందుఁ బుట్టుదురు. వారా తెగకుఁ మూల పురుషులై యుండి యామనువువలన శిక్షింపఁబడి వంశాభివృద్ధిఁ బొంది లోకమునఁ గ్రమక్రమముగ మించుచుందురు.

మీఁదిసంచికయందు III. అంతర్యాగ ధర్మములు చర్చింపఁ బడును.

విం. గోపాలయ్య.

## దివ్యజ్ఞానసారము.

## II. సోదరభావము.

దివ్యజ్ఞానము సర్వమతసార మనియును, మతము లన్నియు నాయొక్క మూలమునుండి వెలువడిన బహుశాఖలనియును, వివిధమతస్థులు నొక్కభగవత్తత్త్వమునే పెక్కునామముల, పెక్కుభంగుల, నిరూపించు చున్నవారనియు, లోకమున వివిధమతా

వలంబనములు మత ద్వేషములుమాని తమతమమతములనుజక్కఁగ నెఱింగి యనుష్ఠించవలయుననియును, ముఖ్యములగు నీయంశము లను వెల్లడిజేయుట కిక్కాలమున "దివ్యజ్ఞానసమాజ" మను పేర నొకసమాజము స్థాపింపఁబడి ప్రపంచమునందెల్లయెడల వ్యాపించి యున్నదనియు గతమాసమున నుడివియుంటిమి. ఆసమాజము యొక్క ముఖ్యోద్దేశ్యము మానవకోటియందును, మఱియు సమస్తభూతకోటియందును "సోదరభావము నభివృద్ధి చేయుటయే యనియు ఏర్కాఱించంబడియె. ఇట్టిసోదరభావము భక్తిలక్షణ మనియును, "అద్వేష్టా సర్వభూతానాం మైత్రఃకరుణ ఏవచ ॥ నిర్మమో నిరహంకారః" అనుస్మృతివాక్య మీసోదరభావమునే ఓశదీకరించుచున్నవనియుఁ జెప్పితిమి. ఇపు డాసోదరభావము మానవులు తమతమప్రవర్తనమునం దెట్లభ్యసింపవలయునో యించుక విచారింతము.

సోదరభావ మనఁగా సమస్తజీవకోటులు అన్నదమ్ములవలె నడచుకొనవలయు ననియర్థము. అనఁగా నన్నదమ్ము లన్యోన్యానురాగము గలిగి యితరులసుఖదుఃఖములను దమసుఖదుఃఖములవలె భావించుచు నన్యోన్యసహకారులుగ నడచుకొనవలయును. ఒక కుటుంబమునందు ఒక్కొక్కరును దనసుఖమునుమాత్రము చూచుకొనుచు నితరులసుఖదుఃఖముల నెంతమాత్రమైనను లెక్కపెట్టక యుండినచోఁ గుటుంబమునకు సుఖము సమకూరదు గదా! అందఱును సమష్టికుటుంబక్షేమమును గోరుచుఁ గుటుంబమునకుఁ గీర్తియు నభివృద్ధియుఁ గలుగులాగున నడచుచుండినంగాక యొక్కొక్కరును స్వప్రయోజనపరులై, స్వకార్యధురంధరులైనచోఁ గుటుంబయాత్ర చక్కఁగ జరుగఁ గలుగునా? అన్యోన వైషమ్యములు గలిగి పెనుగాలిచేఁ గొట్టఁబడినయోడవలె నీదిక్కున కాదిక్కునకుం బొర్లుచు, కలహసముద్రమునఁ దుదకు మునుఁగును గదా. అట్లుగాక కుటుంబమున నొక్కొక్కరును దనసుఖమున

కంటె నితరులసుఖమె యెక్కుడుగ భావించుచు, నందరసుఖమే తనసుఖముగ నెంచుచుండినచో నందఱకును సుఖము నిస్సంశయముగ నొనఁగూడు ననుట యందఱ కనుభవసిద్ధము గదా! భగవంతునిసృష్టియం దెల్లభూతము లొకకుటుంబముగను, భగవంతుని జగదేకపితగను నెంచి "ఆత్మవ త్సర్వభూతాని" యను న్యాయము ననుసరించి సర్వభూతహితమునకుఁ బాటుపడుటయే భగవంతునకుఁ బ్రీతికరమనియును దెలిసికొని వర్తించుటయే సోదరభావము.

ఐనను ఇక్కాలమున సోదరభావమున సమస్తజీవులు సమభావము ననుష్ఠించవలయుననియు ననఁగా నందఱును పఙ్క్తిభేదము లేకయే భోజనమజ్జనాదులను జరపుటయనియును, జాతిభేదములను, ఆచారభేదముల నెంచక వివాహముల జరపవలయుననియును బండితపామరు లొకరీతిగఁ దలఁపఁబడవలయుననియు, అట్లుచేయనిచో భ్రాతృభావ మసంగతమనియు, సంఘమునందలి నిబంధనల నున్మూలనము చేయక సోదరభావము మాటలాడుట దబ్బరయనియుఁ దలంచుచున్నారు. ఇవ్విషయము విచారణీయము గదా! సోదరు లన్నమాత్రమున నందఱును సములగుదురా? నామమాత్రముననే తారతమ్యములు రూఢియగుచున్నవి. అన్నలయందుఁ దమ్ములు గురుత్వమును, చిన్నలయందుఁ బెద్దలు వాత్సల్యమును జూపవలయును గాని యన్నదమ్ములు సమత్వము నవలంబించుట లేదుగదా! అటులనే భగవంతుని జగదేకపితగ నెంచి సమస్తభూతములను ఏకోదరులుగ భావించుటయనఁ బెద్దలగువారలయందుఁ జిన్నవారు నమ్రభావము నవలంబించి, వారల యాజ్ఞకు లోఁబడి వర్తించుటయు, చిన్నవారియందుఁ బ్రేమ, పుత్త్రిభావము గలిగి వారలయభివృద్ధికొఱకు పెద్దవారలు పాటుపడి వారలఁ దమంతటివారలను జేయుటయు సహజధర్మముగఁ గన్పడుచున్నది.

జీవులందఱు నీశ్వరాంశములనియును, ఆదియందు కించిజ్జ్ఞత్వాది గుణములకు లోనైనవాఁడయ్యును బర్యవసానమున నీశ్వరసాయుజ్యమును జెందఁగలవాఁడనియును ముందు సూచింపఁబడియెను. జీవులందఱు నీశ్వరాంశములైయుండ నందఱు సములే యని చెప్పఁదగు. అయినను బీజములన్నియు నొక్క తెఱఁగైయుండఁగా వేలువేలు కాలములయందు భూమిలో విత్తఁబడిన బీజములలో నొక్కటి ఫలభరితమగుగొప్పవృక్షముగను, మఱియొకటి యిప్పుడే యంకురించుచుండు మొలకగను, అభివ్యక్తములగు నీరెండింటికిఁ దారతమ్యము లేదనుట యసాధువు గదా! అటులనే పరమార్థమున జీవులందఱు సములేయగుచుండ నందుఁ గొందఱు కేవలబాలిశులై తెలివి యొకింతయును లేక పశుప్రాయులుగ నుండువారును, మఱికొందఱనేకజన్మముల నానావిధానుభవములు గలిగి జ్ఞానవృద్ధులై సర్వజ్ఞకల్పులైయుండు వారును, ఈయిరువురనడుమ వేలకొలఁది తారతమ్యముల జూపుజీవకోట్లును గానవచ్చుచున్నారు. అందఱును సమత్వముగ నెన్నఁబడుట వివేకమని యెన్నఁబడదు. అయినను తారతమ్యము లున్నవనుటచే హీనదశయం దుండువారలను దక్కువారలు తిరస్కారభావముతో హేయపదార్థములుగ నెంచుటయు వారిని దైవోపహతులుగ నెంచి వారల యభివృద్ధికొఱకుఁ బాటుపడకుండుటయును తప్పని నొక్కివక్కాణించుటకు సందేహము లేదు. అయినను సోదరభావ మెట్లభ్యసింపవలయును? ఎల్లవారును ఇతరులయందు ప్రేమ గలిగి యాప్రేమను దమకంటె నుత్కృష్టులయందు భక్తిగౌరవములుగను, సములయం దనురాగముగను, తనకంటెఁ దక్కువవారలయందు దయగను ప్రకాశింపఁజేయుచు, నెవరెవరికి నెయ్యేకాలములయందు నేయేవిధమగు సహాయము కావలయునో ఆయాకాలములయం దాయాసహాయము నిచ్చుచు సదా పరోపకారమున కవకాశముగలుగున్నాయని వెదకుచునుండఁదగు.

పెద్దలగు వారలయందు భక్తిగౌరవముల, జూపవలయునని న వారల సమ్ముఖములో వేలకొలంది నమస్కారములు జేయుచు, వినయోక్తులు మాటలాడుచు, నుత్తమాసనమునఁ గూర్చుండఁబెట్టుచు, వారలకు శరీరపోషణమునకు వలయుసహాయము చేయక యుండినచో నాయుపచారములు భక్తిగౌరవసూచకములు లనిపించుకొనఁజాలవు. అవియే శుష్కోపచారము లనఁబడునవి. అనఁగా సారములేని నిష్ప్రయోజకము లగునటనలు గాని ప్రేమను సూచించునవి గావు. అట్లుగాక భక్తిగౌరవములకు బాహ్యాచిహ్నము లగువందనాదులు కొద్దిగఁ జూపినను, పెద్దలగువారలకు వలయుసహాయము యథాశక్తిగ నిచ్చుచు, వారలయాజ్ఞానుసారముగ వర్తించుచుండినచో నాయుపచారము శ్రేష్ఠమైనదగు. యథార్థ మగుప్రేమను జూపినవా రగుదురు. అటులనే హీనదశయందుండి యన్నపానాదులు లేకయు, విద్యలేకయు, అజ్ఞానమున మునిఁగి మిగులకు రాచారములకు లోనై శ్రమపడువారలకు నప్పటికివలయు సహాయము చేయవలెను గదా! బీదఱికముచే బాధపడువారల కాబీదఱికముం దొలఁగించు నుపాయముల వెదకి వారలకుఁదగిన కార్యాలయములను నిర్మించి, పనుల నియోగించి వారలకు జీవనోపాయములఁ గల్పించుట యావశ్యకము. అట్లుచేయుటచే వారలు కాలము వృథపుచ్చక జీవనోపాయమును ఆర్జించుకొని దారాపుత్రాదుల రక్షించుకొనుటయే గాక వారలయందు నైజముగునిద్రాలస్య ప్రమాదములను తమోలక్షణముల నతిక్రమింతురు. మఱియు వారలు వసించుస్థలములు మిగుల నపరిశుద్ధములుగ నుంచుకొని యుండినచో వారలనివాసములును, వారలుండువీధులను శుభ్రముగ నుంచుటకుఁ దగినపర్పాటులు చేయుటయు, వారలకుఁ ద్రాగుట కుపయోగించు శుద్ధములగు నీటియాధారముల నిర్మించుటయు సోదరభావమును సూచించుసత్కార్యములు.

మఱియు వారలకుఁ దక్షిణవిద్యాదానము చేయుటకుఁ బాఠశాలలు నిర్మించి విద్యగఱపుట, శిల్పముల నేర్పుట, వారలు నేర్చినశిల్పముల వినియోగించి తన్మూలమున జీవనము నార్జించుకొనుటకుఁ దగినయనుకూలములను గల్పించుట యీమొదలగు కార్యము లన్నియు దయాసూచకములు. వార లజ్ఞానముచేఁ జేయుదుష్కార్యముల నివారించునటుల మద్యపానము మొదలగు దురాచారములవలని కీడులను వారలకు బోధించి వానిని వదలునట్లుచేసి మంచియాచారముల నభ్యసించునటుల వారలకు బోధించుటకుఁ దగినమనుష్యుల నియమించి వారలుండుహీనస్థితినుండి క్రమక్రమముగ నుద్ధరించుట సోదరభావమును సూచించును గాని వీని గమనించక వారలను మాటమాత్రమున సోదరులని పిలుచుయు, కలిసి మెలసి వర్తించుచు, సమానులవలెఁ జూచుటయుఁ బ్రీతిసూచకములు కాఁజాలవు. ఎవరెవరి కేయేకాలమున నేయే సహాయము కావలయునో ఆయాసహాయము చేసిన మేలు గలుగును గాని ఆఁకలిగొనియున్నవాని కన్న మిడక ఆలింగనాదులు చేసి గొప్పమర్యాదలు చేసిన నేమి మేలు? బాహ్యాచారములయందు వారల నాలింగనము చేయుచు నంతరంగమున వారిని ద్వేషించుచుండిన ప్రయోజనమేమి? అంతరంగమున నెల్లవారియం దేకరూప మగుదయాసముద్రముప్పొంగుచుండ బాహ్యమున నెవరెవరి కెట్టికార్యములుత్తమమగు మేలు గలిగించునో యట్టికార్యములు చేయుటయే జ్ఞానవంతులు చేయఁదగినకార్యము. బిడ్డలందఱియం దేకరూపమగు ప్రేమగలతల్లి యందఱ నొక్కరీతినే యుపచరించునా? చూడుఁడు. చేతిబిడ్డకు స్తన్యమిచ్చి, యెడబిడ్డ కల్పాహారము నిచ్చి, యుక్తవయస్కులగుకుమారులకుఁ బుష్టికరములగు లడ్వములు మొదలగునాహారములను, రోగబాధలఁ జెందియుండువారలకుఁ బథ్యాహారము నిచ్చును గాని యందఱి కేకరూపముగ నాహారమిచ్చునా? అట్లిచ్చిన వారలకుఁ గీడు సంభవించును గాని మేలగునా?

కావున సోదరభావ మన్నమాత్రమున నందఱ నొక్కరీతిగఁ జూచుటకాదు. తారతమ్యముల గుఱుతెఱిఁగి యెవరెవరి నెట్లుచూడవలయునో అట్లుచూచుటయే సోదరభావము. హృదయమున నందఱియం దేకరూపమగుప్రేమయు, బాహ్యకార్యములయందు వారివారి క్షేమము నుద్దేశించి యుక్తానుసారముగ వర్తించుటయు నిజమగుభూతదయ.

కడప
21—4—1910.

ఛి. రామయ్య.

## ప్రకటనలకు ద్రవ్యనిర్ణయములు.

| | | | పూర్తి పేజి | అర్ధ పేజి | కాల్ పేజి. |
|---|---|---|---|---|---|
| సంవత్సరమునకు | ... | రూ. | 40 | 30 | 20 |
| 6 నెలలకు | ... | ,, | 24 | 18 | 12 |
| 3 నెలలకు | ... | ,, | 18 | 9 | 6 |
| నెలకు | ... | ,, | 5 | 4 | 3 |

## నోటీసు.

ఈ ద్వితీయసంచికను పుచ్చుకొన్నవారందరును వెంబడిగానే చందా పైకము పంపవలయునని ప్రార్థించెదము. ఇష్టములేనివారు వెంటనే ఈ సంగతి తెలియజేయవలెను. అట్లు చేయనివారికి మూడవసంచిక వాల్యూపేయబుల్ ద్వారా పంపబడును.

చందా సంవత్సరమునకు తపాలుహర్జిగాక ఒకరూపాయమాత్రమే.

ఇందుకుసంబంధించిన పత్రికలు పైకము, క్రింద చేవ్రాలు చేయువారికి పంపవలయును.

పరమాత్ముని నరసింహయ్య,
చిత్తూరు.

“అనేకపత్రికయను వరహాల్ప్రహసనము” ఇదియొకనేకముల [illegible] హాస్యాత్మకమగు నాటకము. మిగులమనోహరమగునది. వరహాల్ముఖ్యమగు [illegible] గాములన్నిటిని చక్కగా వర్ణింపబడియున్నది. చదివి చూడవలసిన గ్రంథము. వెల 0—2—0. ఇది నార్త్ ఆర్కాడు డిస్ట్రిక్టు చిత్తూరు గ్రామములోని శ్రీ శాశ్వతనిధిగుమాస్తా రాఘవగురుక్కల్ గారివద్ద వెలకుచిక్కును.

# ప్రకటన.

## శ్రీవెంకటాచలయాత్ర.

ఇది తిరుపతియాత్ర చేయువారికిని, భగవద్భక్తులకును, అన్నివిషయములను [illegible]రముగా తెలుపునట్టి సులభశైలిని వ్రాయబడిన వచనగ్రంథము. ఇందు శ్రీవెంకటే[illegible]గుల చరిత్రము, తీర్థవ్యుత్పత్తిమహాత్మ్యములు, ఉత్సవములు, సేవలు, స్తోత్రపాఠములు మొదలగువిషయములుమిగుల చక్కగావివరింపబడియున్నవి. వెల 6 అణాలు. తిరుపతిలో ప్లీడరు కే. చెంగయ్య, బి. ఏ. గారివద్ద పుస్తకము [illegible]రుకును.

Registered No M. 716.

ఓం.



# దివ్యజ్ఞాన దీపిక.

(పూర్వము "హంస").

## A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె నెక్కువ ధర్మములేదు).

సంపుటము 1. **June 1910.** జూన్ నెల 1910. సంచిక 3.

## విషయసూచిక.



సం॥రమునకు చందా 1 రూపాయి.

CHITTOOR, N. A. Dt.:—PRINTED BY M. RAMANUJA CHARIAR AT THE VICTORIA JUBILEE PRESS FOR P. NARASIMHA AIYA GARU, *Publisher.*

ఓం.

# దివ్యజ్ఞాన దీపిక.

(సత్యమునకంటె నెక్కువ ధర్మములేదు)

సంపుటము 1. June 1910. జూన్ నెల 1910. సంచిక 3.

## సర్వమత సామాన్యత.

ఈ జగత్తునకంతయు ప్రభువుగానుండు నీశ్వరుఁడొక్కఁడుండెయనియు మనుష్యులందఱును వానిబిడ్డలనియుఁ బూర్వము నెఱిఁగియుంటిమి. అట్లయినను భూలోకమున ననేకమతంబు లేర్పడియున్నవి. వానియందుఁ బరస్పరభేదములు గన్పట్టుటయు నన్యమతస్థులయెడ జనులకు సాధారణముగ ద్వేషబుద్ధిగలిగియుండుటయు ప్రత్యక్షానుభవముగ నున్నది. పూర్వమున మతభేదములచే దేశమునం దనేక కలహములు, పెక్కుబాధలు, లెక్కలేని మర్దితులుం బుట్టి మానవకోటియనుభవించిన యన్నిబాధలలో మతమరభిమానముచే కలిగిన బాధయే మిగుల పీడాకరముగానుండినట్లు చరిత్రము మొఱబెట్టుచున్నది. ఇప్పటికిని హిందువులు మహమ్మదీయులు క్రైస్తువులులోనగు వారన్యమతస్థులయెడ భేదబుద్ధిపాటించుటయు వారిమత గ్రంథములను దేవాలయములను ఆచారములను చులకనగఁజూచుటయు వాడుకయైయున్నది. ఇదియట్లులుండ హిందూమతము నొక్కదాని

నాలోచించినను దానినవలంబించు వారియందైన నైకమత్యము గానరాదు. అది సనాతనమై యన్నిమతములకు మేల్బంతియై సమస్త ధర్మములకు స్థానభూతమై యొప్పుచున్నది. దీని కాధారములైన వేదములను స్మృతులను హిందూ మతస్థులందఱును ప్రమాణములుగ నంగీకరించియున్నారు. శాస్త్ర కర్తలగు మహర్షులనందఱు సగౌరవముగ బూజించెదరు. ఇట్లున్నను మతమునందంత ర్భేదములఁ గల్పించుకొని, ద్వైతవాద ముతప్పనుచు నద్వైతులును, అద్వైతసిద్ధాంతముతప్పనుచు ద్వైతులును, ఈరెండునుసరిగావని విశిష్టాద్వైతులును, ఒండొరులయెడ వైషమ్యమును జూపుచుండుట యెంతయువిచారకరమైయున్నది. ఎవ్వఁడేని తనమతమును పరమతమును చక్కఁగబరిశీలించి తారతమ్యమునుకనిపెట్టి, తనకు గుణమని తోచినదానియందభిమానమును, గుణములేనిదానియందు లాఘవమును జూపిన కొంతవఱకు బాగుగనుండు. ఏమియులేక తనమత మెట్టిదియోయెఱుఁగక యన్యమతస్వరూపమును చెవులనైనవినక కేవలమురభిమానముచే మతవైరముపాటించు మనోవృత్తి మిక్కిలి హేయమైనది.

మతమన నేమి? ఈశ్వరునిస్వరూపమును జీవస్వరూపమును ఈరెండింటికింగల పరస్పరసంబంధమును జీవుఁడీశ్వరసాన్నిధ్యముం జేరుటకుఁ దగినసాధనమును ఇందుకు ప్రపంచమాధారముగ నుండుటయు వీనినివిశదపఱచుటయే ఏమతమునకుగాని ముఖ్యప్రయోజనమైయున్నది. లోకములోనిసమస్తమతములను స్థాపించినవారు మహనీయులుగాని సామాన్యులుగారు. సామాన్యపురుషుఁడొక్కఁడొక నూతనమతమును స్థాపింపఁబూనెనేని వాని ప్రయత్నముకొనసాగునే? వానిసిద్ధాంతముల బహుజనులంగీకరించుదురా? లోకములోనట్టిది దీర్ఘకాలమునిలిచియుండునే? కాఁబట్టి ప్రపంచములోనిపుడు దీర్ఘకాలముగ వ్యాపించియుండు గొప్పమతములన్నియు భూతభవిష్యద్వర్తమానముల నెఱిఁగినవారును

త్రిలోకసంచారులునగు సిద్ధపురుషులచే స్థాపింపఁబడినవనుకుట వేఱునిదర్శనము కావలయునే? అట్టిమహాత్ములు భగవదాజ్ఞను శిరసావహించినవారై, అవసరముపొసగినపుడెల్లనచ్చటచ్చట భూలోకమునందవతారమెత్తి, ఆయాదేశకాల సందర్భములకుఁదగిన సద్ధర్మములను ప్రజలకుబోధింతురు. ఏసుక్రీస్తు, మహమ్మదు మొదలగు నన్యమతస్థాపకులును, మనదేశమందు మతత్రియము నేర్పఱిచిన శ్రీశంకరరామానుజ మధ్వాచార్యులును అట్టిమహనీయగోష్ఠిలోఁజేరినవారు. వారొకరిమనస్సునొకరు పరిపూర్ణముగ నెఱిఁగి యన్యోన్యసహకారులై యున్నవారు. ఇట్టివారలచే నేర్పరుపఁబడినమతములందు భేదముల కాస్పదముండదు. వారి సిద్ధాంతము లేకరీతిగనుండును. కనుకనే లోకమందు సర్వమతములలో ముఖ్యసిద్ధాంతము లొక్కటియైయున్నవి. అన్నిమతములకు సామాన్యములగు సిద్ధాంతములు పెక్కులుగలవు. అప్రధానములగు కొన్నివిషయములందుమాత్రమే వ్యత్యస్తములు దోచును. వైద్యుఁడొక సిద్ధౌషధమునే యనేకరోగులకు ప్రయోగించునపుడు వారివారిశరీరతత్త్వమునకుఁదగినట్టు వేర్వేరగునను పానముల విధించులాగుననే సర్వజ్ఞమూర్తులగు మహర్షిసంఘము వారొక్కటియగు బ్రహ్మవిద్యను వేర్వేరుకాలములందును వేర్వేరుదేశములందును జనులకుపదేశించునపుడు వారివారిజ్ఞానపరిపక్వమున కనుగుణ్యములైనట్టియు వారికత్యంత హితకరములైనట్టియు కొన్నియంశములమాత్రమే బాహాటముగఁబ్రచురించితక్కిన వానిని కొంచెముమఱుఁగుననుంచిరి. ఇట్లుఒకప్పుడాత్మసమర్పణమును ఒకప్పుడహింసయు ఒకప్పుడుజ్ఞానమును ఒకప్పుడుభక్తియు నివ్విధమునవారు బహుధర్మములజనులకనుగ్రహించిరి. భగవంతునిసన్నిధానమునుజేరుటకివియన్నియు విశాలములైన రాజబాటలైయున్నవి. ఏమార్గమునఁ జనినను నాయుత్తమస్థానముంజేరుటయే ముఖ్యప్రయోజనముగదా. ఏమార్గముననడచుచున్నను నాపవిత్రస్థానముం

గూర్చియాత్రపోవువారందఱు సహయాత్రికులుగారా! ఒకరి మార్గమునందొకరు రంధ్రాన్వేషణముచేయుట యేమిగొప్ప? అట్టి వారిబ్రతుకు "నిర్మలావయవంబుల నెమ్మివిడిచి, వ్రణములకుఁబాఱు మక్షిక ప్రతతిభంగి" నిరర్థకమైయుండు. బుద్ధిశాలియైనవాఁడు తనమతసిద్ధాంతముల లెస్సగనెఱింగి యందుసారవంతములగువాని నితరమతస్థులకుబోధించుచు వారిమతములయందుఁబ్రకాశించుచుండు విషయములఁ దానుగ్రహించుచు క్రమక్రమంబుగ సర్వమత సారమొక్కటియైయున్నదని తెలిసికొనవలయు.

## ౬౦. ధ్యానము.

హిందువులందు సమస్త కర్మములనగా మూత్రపురీషణ విసర్జనాది శౌచము పరమాత్మను పొందుటకు ముఖ్యసాధనము లగు భక్తి, ధ్యాన, యోగములవలెనే మత ధర్మములుగా (religious duties) నెంచియుండుటకు కారణములు.

శ్లో॥ యత్కరోషియదశ్నాసి యజ్జుహోషిదదాసియత్।
యత్తపస్యసికౌంతేయ, తత్కురుష్వమదర్పణమ్॥

ఏది చేయుచున్నావో ఏది తినుచున్నావో ఏది వ్రేల్చుచు న్నావో ఏదియిచ్చుచున్నావో ఏదిఆలోచించుచున్నావో అది నాకర్పణచేయుమని శ్రీకృష్ణులవారు అర్జునునికుపదేశించినారు.

ఇదిజగదీశ్వరునియాజ్ఞ. రాజ్యముల కీశ్వరులగు రాజేశ్వరు లును ఇవ్విధమున నేజనులందరు చేయుకార్యములు తమతమఆజ్ఞాను సారముగా నేయుండవలెనని శాసనములు(చట్టములు)పర్చరచినారు. ఆజ్ఞయన్నను శాసనమన్నను ఒకటె. రాజుయొక్క శాసనముల న్నియు జనులయొక్క క్షేమమునకై యుండవలసినదిధర్మము. ఏ రాజులే రాజ్యమందు శాసనములేర్పరచినను ఆరాజ్యమందుండు జనులక్షేమముకొఱకేయని యూహించవలెను. ప్రాయశః అన్ని

దేశములందును శాసనముల ఈ యుద్దేశముచేతనే నియమించు చున్నారు.

శ్లో॥ రక్షితారంచ రాజానం బ్రాహ్మణంచ తపస్వినం।
అభిగమ్యాభిపూజ్యాథ సద్యఃపాపాత్ప్రముచ్యతే॥

అని భారతమందుదాహరింపబడినది. ప్రజలనురక్షించు రాజును, తపమాచరించు బ్రాహ్మణుని వెంటనంటిపోవుటవల్లను పూజించుట వల్లను తక్షణమే పాపములనుండి విడువబడుచున్నాడని తాత్పర్యము. రక్షించువారె రాజులనుటకు సంశయములేదు.

ఆధునికరాజులగు మనదేశమేలుచుండు బ్రిటిషురాజులును ఇప్పుడు మనదేశమందూర్జితములోనుండు గ్రామపారిశుద్ధ్యతయొక్కయు సంఘసౌఖ్యములయొక్కయు విద్యాభివృద్ధియొక్కయు జనులఆరోగ్యముయొక్కయు మఱియుననేకవిషయములనుగుఱించి యేర్పరచినశాసనములన్నియు జనులహితముననేగాని వేఱుకాదు. ఈవిషయములందు వేర్వేఱుశాస్త్రజ్ఞుల అభిప్రాయములనుఅడిగి ఆవిషయమై యెంతద్రవ్యము వ్యయముచేయవలసియుండినను వ్యయముచేయుచు జనక్షేమముకలుగజేయుదురు.

ఆధునికరాజులకుండు జనులక్షేమముయొక్క పరమావధి, సమష్టియందు జనసంఘముయొక్క దేహారోగ్యముతోను దేశపారిశుద్ధ్యతతోను స్థూలభూతతత్త్వ విద్యలతోను సంఘమందుజనులకొకరివలన నొకరికి ఉపద్రవములేకుండఆపియుంచుటతోను అంతమైయున్నది.

ఈశాసనములన్నియు ఎందాక నెవరిచేగాని సంఘమునకుబాధలేక నుంచవచ్చునో అందాక వ్యాపించియున్నవి. వ్యష్టియందనగా ప్రతిమనుష్యుఁడు ప్రత్యేకముగా నాచరించు ఆచారములనాపుటకుపూనియుండవు. ఒకత్రాగుబోతు, ఎంతత్రాగినను. వానివలనయితరులకుబాధయెందాక లేకుండునో అందాకయీశాసనములు వానికన్వయించవు. వ్యష్టియందివన్నియు ఈభూలోకము

నకును స్థూలదేహమునకునుమాత్రము సంబంధపడియుండును. మతమునకును (Religion) ఆధునిక శాస్త్రమునకును (Science) పరస్పరవిరోధమున్నట్లు అనేకులు సాంప్రదమందును భావించుచున్నారు. ఇవియే, లోకహితమునకు చాలియుండినంతట ప్రతిమనుష్యుండు ఈశాసనములచొప్పున ఆచరించువాడు సర్వసుఖమునుపొంది ఎట్టిదుఃఖమును అనుభవింపకుండుట సహజముగానుండెను. అందఱి అనుభవము అటులేదని దృఢపరచుచున్నది.

హిందువులలో మతమును విడచియుండు కార్యమేలేదని ప్రథమమందుదాహరించిన శ్రీకృష్ణుల వచనమేవిశదపరచుచున్నది. శ్రీకృష్ణులు జగదీశ్వరుడు, జగత్తుయొక్క హితమునే కోరువాడు.

శ్లో॥ జగద్ధితాయ కృష్ణాయ । గోవిందాయ నమోనమః ॥

అనిచెప్పబడినది. ఆయనత్రిలోకాధిపతి, దానిచేతనే జనులకు మూడులోకములందును హితముగానుండుటకు ఎవరెవరికెట్టి భోజనము, ఎట్టికార్యము, ఎట్టిఆలోచన, ఎట్టివృత్తి, ఎట్టిశౌచాచారము తగియుండునో అట్టివి ఆయనశాసనములగు శ్రుతిస్మృతులలో నియమింపబడియున్నవి.

శ్లో॥ శ్రుతి స్మృతిర్మమైవాజ్ఞా యస్తాముల్లంఘ్యవర్తతే ।
ఆజ్ఞాచ్ఛేదీమమద్రోహీమద్భక్తోపినమేప్రియః ॥

అని శ్రీకృష్ణులు బోధించినట్లు భారతాశ్వమేధపర్వమందు చెప్పబడినది. ఈ దేహానంతరమును గుఱించినదంతయు మతవిషయముగాగదా అందఱునెంచుచున్నారు. ఈలోకమందెట్టి ఆచారములవలన యీలోక సౌఖ్యముమాత్రముగాక, నితరములగు రెండులోకములందు సుఖానుభవమునకు కారణములుగానున్నవో అట్టిఆచారములను నియమించియుండినందున హిందువుల ఆచారవిధులన్నియు మతమునకు సంబంధించియున్నవి. ఇట్లనుటచే హిందువుల

శాసనములు ఆధునిక (ఇప్పటి) శాసనములవలె ఆరోగ్యవిషయమందును గ్రామపారిశుద్ధ్యతావిషయమందును, సంఘసౌఖ్యవిషయమందును జనులందఱకి తగిననియమములు' విధింపక, ఆధునిక శాస్త్రములకు విరోధములు గానుండు వేరైన విలక్షణమార్గములను చెప్పుచున్నవని యూహించదగదు. ఈ విషయములందంతయు ఆధునిక శాస్త్రములకంటె శ్రేష్ఠములైన ధర్మములుబోధించుచున్నవని దృఢముగా చెప్పవచ్చును. హిందువులందు మతాచారములకును ప్రకృతితత్వముల ననుసరించియుండు లోకాచారములకును భేదమించుకైన లేదనుటే సిద్ధాంతము. మతమునువిడచిన యితర శాస్త్రవిచారములన్నియు జనులఆనందమునకు చాలవనియు మతాచారములకును, ప్రకృతితత్వ శాస్త్రాచారములకును భేదము లేదని ఇప్పుడు జీవించియుండు గొప్పప్రకృతి తత్వవేత్తయగు సర్ ఆలివరు లాడ్జు (Sir Oliver Lodge) అనువారు తామువ్రాసియుండు మానవుడు-బ్రహ్మాండము (Man and the Universe) అనుగ్రంథమందిట్లుదాహరించియున్నారు. "The region of true religion and the region of Complete Science are one" నిజమైన మత విషయము, పూర్ణమైనప్రకృతి తత్వ విషయములును యొకటేఅని తాత్పర్యము. ఇట్లనే అనేక ఆధునిక శాస్త్రజ్ఞులు యితర లోకములున్నవనియు, వానికితగిన వేరు దేహములున్నవనియు మైర్సు (F. W. Myers) మొదలగువారుచెప్ప మొదలిడినారు గనుక హిందువులలో సకలాచారములును మతముతోచేర్చియుండుట మిక్కిలిశ్రేష్ఠమనుటకు సంశయములేదు. ఆయాచారములు లౌకిక పారమార్థికముల సుఖములకెట్లు తోడ్పడువిషయములను గుఱించి ఒక్కొక్క ఆచారమును ప్రత్యేకముగాతీసికొని మాప్రతిమాస పత్రికయందు సప్రమాణ సయుక్తులతోవ్రాయబడును.

జం. శ్రీనివాసరావు.

## స్వ ప్ర తి ష్ఠ.

లోకమునందలి మనుజులు సాధారణముగ స్వార్థపరులై యున్నవారు. సామాన్యజనుఁడు పరులహింసించియైనఁ దన మేలుఁబొందయత్నించును. ఇట్టిస్వార్థపరత్వము కేవలము సహ్యమగునది. ఈనీచగుణమును దాటిన పండితునియందు నయితము తనభావంబులు, తనజ్ఞానము, తనశక్తిలోనగునవియే తక్కిన వారి జ్ఞానాదులకంటె మేలైనవియనుభావము దాగియుండును. ఇట్టి మనోభావమును స్వప్రతిష్ఠయనవచ్చు. దీనిఫలము మిగులవిస్తారము. ఇదిబ్రహ్మమార్గమునఁ జరింపఁదలంచువానికి ప్రత్యక్ష శత్రువు. ఇట్టియాత్మశత్రువు తనయందు దాగియుండుట విద్వాంసుఁడును నెఱుంగఁడు. అయినను గొంతయోచింపనిది తెలియు. మనుజుని మనోభావంబులెల్లఁ దనదెసకె పోవుచున్నవి. వాఁడితరులఁ దలంచినఁదలంచునేమోగానియప్పుడును దనప్రభావమె ముఖ్యముగానుండుసుమ్ము. వాఁడెన్నియేని గొంతెమకోరికెలుకోరు. అప్పుడును తనప్రాముఖ్యతయె ప్రకాశించుచుండు. నక్షత్రములలోనెల్లఁ జంద్రునివలె లోకమునఁ దనప్రకాశముమిక్కుటముగనుండఁదలంచు. విధివశంబుగఁ దనకుమించిన వానిమతియొకనిఁగాంచినపుడు మొగంబుతెల్లవాఱునీసుచే లోలోన నుడుకుచు పెదవి గఱచికొను. లోకముతన్నుఁ బూజింపక వానిఁగొలుచుటకు చిడిముడిపడుచుండు. ఇట్టిగుణమునుమార్పఁ బ్రయత్నించుట లోకమెల్లక్రిందు మీదైనయట్లులగదా. అప్పుడు మనుజుని స్వభావమెల్లమాఱును. కొందఱిట్టి మార్పు సాధ్యమగునే యని సందేహించుచు మిన్నుపైఁబడినట్లు నిశ్చేష్టితులగుదురు. వారికట్టిదశ లోకమునఁగలదనియుఁ దెలియదుకాబోలు. స్వప్రతిష్ఠయెగోరుట బ్రహ్మమార్గమునకు ముల్లడిచినట్టుసుమ్ము. ఇది సంపూర్ణముగ నశింపవలయు. అయినను దీనిసాధింపఁబ్రయత్నించువారెవ్వరోగదా. ఈవ్యాధికి మందొక్కటిగలదు. అది

యనురాగము. సామాన్యజనుఁడీ యౌషధసేవచే నామనోవ్యాధిని గొంతమైన నణపఁజాలు. అనురాగము బలవత్తరమగునది. ఇది నరుని నాక్రమించి వానిగుణంబుల మార్చును. నరుఁడొక మనోహారియగు ముగ్ధగుస్త్రీయందు ప్రీతిఁగలవాఁడై లోకమెల్ల నాప్రియురాలి మయముగాఁదలంచు. అప్పుడు గొంతకాలమైనను వానికి స్వప్రతిష్ఠయను దుర్గుణముమానును. ఆయువతి ముక్కుడితోత్తైనను వానికదియొప్పులకుప్పయగు స్వర్గలోకరంభగాఁ గాన్పించు. ఇంతయేల, అదివానికి దైవస్వరూపమగు. సమస్తమున నీశ్వరుఁడుండుట యథార్థము. ఈవాస్తవ్యమెఱింగినవారు లోకమున నరిదిసుమ్ము. ఇట్టిపరమప్రీతియు నానాఁటఁ దగ్గుచు తుదకు వేఱొక్కదాని దెసఁబ్రవహింపఁజొచ్చుటయు లోకవిదితము. అయిన నేమి? కొంతకాలమైనను వానికిస్వప్రతిష్ఠయను దుర్గుణముమానెనుగదా.

ఇదిసామాన్య జనునిస్థితి. బ్రహ్మజ్ఞానాధికారియగువాఁడు ప్రయత్నముతో దీనిసాధింపఁబూనవలయు. వాఁడుతన పెద్దఱిక ముఁబ్రకటించుటమానవలయు. సమస్తమును లోకగురునకునివేదింపవలయు. లోకమునఁనొక్కొక్కవిషయముఁగాంచి యిదినాకు మేలగునే యిదినాకులాభకారియు సుఖదాయినియునగునేయని స్వసుఖమునేకోరి వాఁడింతకుపూర్వము భావించుచుండెఁగదా. ఇప్పుడట్టుభావింపక గురునకిది మనంబునకెక్కునేయని భావింపవలయు. గురువులోకహితార్థమైచరించుచున్నవాఁడు. దానంజేసి యొక్కొక్కకార్యమును లోకమునకిది హితమాయహితమాయని యోచింపవలయు. ఇట్టుభావించికార్యముల నడపుట మొట్టమొదట దుష్కరముగనుండుగాన మిగుల ప్రయత్నముతోఁ జేయవలయు. అంతనదియభ్యాసముచేసుకరమగు. వానికిపుడుస్వసుఖమును భావించుటయెంతసహజముగనున్నదో చూడుఁడు. అట్టులనేయిదియును సహజముగావలయును.

స్వసుఖాభిలాషసంపూర్ణముగఁ మానిపరహితమె పరమార్థముగ భావింపవలయుననుగురూపదేశంబును స్మరింపవలయు.

నరుఁడు పరహితాచరణమె జన్మవ్రతంబుగఁ బూనినప్పుడును నీస్వప్రతిష్ఠాగుణంబు వేఱురూపమునఁ దన్నునాక్రమించుకొనకయుండ మిగులజాగరూకతతో నడవవలయు. ఇట్టివ్రతంబుఁబూనిన మహాపురుషులెందరేని యీబ్రహ్మజ్ఞానసమాజమునఁగలరు గదా. అట్టివారిలోఁగొందఱిట్టిప్రమాదమునకులోనైయున్నవారు. వారుతమయభిప్రాయములకంటె భిన్నములగు నభిప్రాయములు గలవారెల్లరు బ్రహ్మజ్ఞానసమాజమునకు శత్రువులనిభాషించుచున్నారు. మఱియువారు తమమార్గమే మార్గముగఁదలంచి తదితరమార్గములఁబోవువారి దూషింపఁజొత్తురు. ఇట్టిమనోభావము స్వప్రతిష్ఠను బ్రకటింపఁదలఁచుటయేసుమ్ము. కాననీగుణమును దిగఁద్రావఁబ్రయత్నింపవలయు. బ్రహ్మజ్ఞానికిలోకులు తన్నుభూషించిననేమి? తిరస్కరించిననేమి?

వాఁడు దాసత్వమెపూని కొలఁదిగానివానివలెఁ జరింపవలయుగదా. ఇదియెవానికిమహాశక్తియగు. ప్రతిష్ఠఁగోరినఁగార్యములఁజక్కనడపిననడపునేమో? అయిననపుడు "అహంకర్తా" యనుభావంబు మనంబుననిండియుండు. గురునాజ్ఞశిరసావహించి కార్యములఁ జొచ్చినప్పుడు వాఁడీకార్యమెట్టులైనఁ ముదఁగాంచవలయునని తలంచు. అట్టివాఁడేకార్యమును గర్తృత్వమభిలషించిచేయుఁడు. కర్తవ్యమను బుద్ధితోసమస్తకృత్యంబులనడపు. ఇది నాయది యది వానిపనియను భేదబుద్ధివానికిఁ గలుగరాదు. అన్నిపనులును తనవిగా భావింపవలయు. కార్యనిర్వహణంబె ముఖ్యముగఁదలంపవలయు. దానినెవ్వఁడుపూనిననేమి? అట్టగుటంజేసి స్వకార్యమున దురభిమానంబును బరకార్యమున రంధ్రాన్వేషణబుద్ధియు విడువవలయు. ఇంతియెగాదు. తన్నితరులు పొగడవలయు ననుదలంపుతో నైచ్యానుసంధానంబుఁ జేయుట తగ

డు. ఈకార్యమెవ్వరిదైన నేమి? నాదియైనను మఱియొకరిని దైనను, చక్కగఁ జేయఁబడెగదా యని నిర్మమతతోఁ బ్రశంసింపఁ బూనవలయు.

మఱియు లోకులయభిప్రాయమునకంటె శ్రేష్ఠములగు నభిప్రాయములఁ గాంచితినని గర్వింపరాదు. బ్రహ్మజ్ఞాన సమాజమునఁ జేరినవారు తమునిట్టి మనోభావముచుట్టుకొనకుండ మెలఁకువ నుండవలయు. బ్రహ్మజ్ఞాన సిద్ధాంతములచేఁ బ్రపంచమెల్ల వేఱుగఁదోఁచు. దానంజేసి వారులోకమెల్ల వేఱుగ భావించుట సహజము. దీననొక కీడును వాటిల్లును. అయినను వారిలోఁ గొందఱు తమకిట్టివివేకంబుగలిగెఁ గాయనిగర్వింతురు. ఇదిసరికాదు. అట్టివివేకంబుఁ గాంచినంతనె వారితరులకంటె శ్రేష్ఠులుగారు. లోకమున నొక్కొక్కరు నొక్కొక్క మార్గమవలంబించియున్నవారు. ఒక్కొక్కరు వారివారిమార్గమున నెంతప్రవృద్ధిఁ గాంచినవారో మన మెఱుఁగఁజాలము. మనమునడచుమార్గమున వారికింగొంతప్రవృద్ధిలేకయుండునేమో. ఉన్ననేమి? సర్వమార్గముల సర్వతోముఖంబుగఁ బ్రవృద్ధిఁ జెందినవాఁడుగదా జీవన్ముక్తుఁడు. అట్లగుటంజేసి మనము వారివలన నేరువవలసిన విషయములెన్నియేనియుంగలవు. వారుమనవలన నేరువవలసినవి గొన్నియుండునేమో. అంతటనె వారికింకను బ్రహ్మజ్ఞానసిద్ధాంతములు దెలియ శక్తియైన లేదని దూషించుటకంటె తెలివిలేమిగలదే? కాన మనమివ్విషయంబున స్వప్రతిష్ఠఁ బ్రకటింపఁ బూనరాదు.

ఇట్టిదుర్గుణపంకంబునఁ బడకుండుట కొక్కయుపాయంబు గలదు. గ్రహంబులెల్ల సూర్యునిజుట్టి యతనియాజ్ఞానువర్తులయి చరించువిధంబు మీ రెఱుంగుదురుగదా. ఒక్కొక్కగ్రహంబును దనమండలమున ప్రాముఖ్యముఁ గాంచియు సూర్యమండలమునకు లోఁబడి చరించుచున్నది. అట్లనేమీరును విధివిహితములగు

కార్యములనడపుచున్నను గురువునాజ్ఞ శిరసావహించియుండవలయు.

మనుజుఁడుదన్నుఁ దాఁదలంచుట యటుండగనితరులును దన్నేతలంచుచున్నారని భ్రమఁజెందుచున్నాఁడు. ఇతరులుమాటాడుటయుఁ దలంచుటయుఁ దన్నుగుఱించియేయని యెల్లప్పుడు నువాఁడెంచుచున్నవాఁడు. ఇట్టిభ్రమాపిశాచిక యనేకులకుఁ బట్టినది.

అట్టివారితరులు తమ్ముఁగలనైనఁదలంపరనియు నొకరొకరును దనవలెనెయాత్మప్రతిష్ఠయెభావింతురనియు నెఱుంగఁజాలరు. దానంజేసి వారు నిష్కారణదుఃఖమును మనోవ్యాకులతయుఁ బొందుదురు. కొంతవివేకముతో యోచించిన నిట్టిలేనిపోని దుఃఖముకలుగనేరదు. స్వప్రతిష్ఠఁగోరుటయెకదా యిట్టిదుఃఖమునకుఁగారణము. అట్టివానికిదియె యగుసుమ్ము. గురువునాజ్ఞనడపుచు నతనియందె దృష్టినిలిపినడచినచో వానికిదుఃఖమెకడిది? అప్పుడువాఁడు గురునిమనఃప్రీతింగాంచనేనేమి చేయఁగలనని తలంచుచుండు. కార్యంబుపొసంగినచో నిదిమంచిపనియయినదీని నెవ్వఁడేనొకఁడు చేసినఁ జకగనుండు. నేనేలపూనవలయునని తలంపఁడు. ఇట్టులగదా సామాన్య జనుఁడుతలంచు. అట్టివాఁడు "దీనినెవ్వఁడైనను జేయవలయు. నేనేల చేయకుండవలయు" నని ప్రయత్నించు.

వాఁడుప్రజ్ఞావికాసంబు నానాఁటఁజెంది బ్రహ్మాండమంతయుఁదనదిగా భావింపఁజొచ్చు. "అప్పుడుబ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" యను వాక్యానుసారముగ నీశ్వరునితో నైక్యభావంబుఁగాంచు. లోకమంతటనీశ్వరుప్రతిష్ఠయె చెల్లుచున్నది. కానసట్టిస్థితియందిట్టివాని ప్రతిష్ఠ లోకముననిండు. *From the Adyar Bulletin.*

:0:

## III. ఈశ్వరాంశములు, జీవులు, నిత్యులు.

శ్లో॥ అజోనిత్యశ్శాశ్వతోఽయంపురాణో ।
నహన్యతేహన్యమానేశరీరే ॥గీతా॥

జీవులీశ్వరాంశములని చెప్పఁబడియెను. అనఁగా నీశ్వరున్నియొకర్ కళలు. ఈశ్వరుఁడు నిత్యుఁడగుటంబట్టి తదంశములగు జీవులును నిత్యులు. కావున జీవునకుఁబుట్టుట, చచ్చుటయను వికారములులేవు. ఈయర్థము శ్రీభగవద్గీతా శాస్త్రమునను, కోప నిషత్తునందును

శ్లో॥ "అంతవంత ఇమేదేహాః । నిత్యస్యోక్తాశ్శరీరిణః" ।
"దేహీనిత్యమవధ్యోఽయందేహేసర్వస్యభారత" ॥
"నజాయతేమ్రియతేవాకదాచిన్నా
యంభూత్వాభవితా వానభూయః" ।
"అజోనిత్యశ్శాశ్వతోఽయంపురాణో
నహన్యతేహన్యమానేశరీరే"॥

ఈమొదలగువాక్యములచే బోధింపఁబడుచున్నది. ఈయర్థమును జకర్ఁగమననముచేసి, దీనినుండి యూహింపఁదగిన విషయములను గ్రహించి స్వానుభవమునకుఁ దెచ్చికొనఁదగియున్నది.

జీవుఁడీశ్వరాంశమగుటచే నిత్యుఁడు. అజ్ఞానరూపకమగు సంసారచక్రమున నెందుకుఁ బ్రవేశించెను? ఈశ్వరునకును జీవునకునుగల సంబంధమెట్టిది? తారతమ్యమెట్టిది? ఈశ్వరాంశమగుటచే నీశ్వరునియందుఁ గలిగియుండు శక్తులన్నియును బీజరూపముగ జీవునియందున్నవని యెఱుంగఁదగు. బీజరూపముగనున్నవిగాని పూర్ణముగ నభివ్యక్తములైయుండలేవు. కావుననే జీవుఁడు కించిజ్ఞుఁడనియును, ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడనియును వ్యవహరించెదరు. గొప్పవటవృక్షమువంటిది యీశ్వర తత్త్వము.

వట బీజమువంటిది జీవతత్త్వము. వటవృక్షమునందలి భాగ ములన్నియు బీజముననున్నయవియే. అయిన నభివ్యక్తములు కాలేవు. కాలానుసారముగ నభివ్యక్తములై ప్రకాశించు నవి యే. బీజమునందుఁ బూర్వము లేనిది యొకటిగాని వెనుక నభి వ్యక్తమై ప్రకాశింపఁజాలదు. భూమియందుఁబడి శీతవాతాతప ములు దానిపైఁదగుల నదియంకురించి మొలకయై, చిన్నచెట్టయి, గొప్పవృక్షమగును. గొప్పదియగు మహాజ్యోతివంటిది యీశ్వ రతత్త్వము. ఆమహాజ్యోతినుండి వెలివడు విస్ఫులింగముల (అనఁ గా నిప్పురవల) పోలినవి జీవాత్మలు. జ్యోతికి విస్ఫులింగముల వలె, నీశ్వరునకు జీవాత్మలు సరూపములని యుపనిషత్తు నిరూ పించుచున్నది. ఈ నిప్పురవయును నొకగొప్ప దూదిరాశిపైఁ బడిన నదియు మహాజ్యోతియగునుగదా! అటులనే జీవుఁడాది యందల్పశక్తిగలవాఁడయ్యును కించిజ్ఞుఁడైయుండియు, బంచ భూతాత్మకమగుఁ బ్రపంచమునం బ్రవేశించి యనేకవిధములగు సు ఖదుఃఖానుభవములుగలవాఁడై సకాలమున నీశ్వరసారూప్యముఁ జెందగలవాఁడగును. ఈశ్వరశక్తులన్నియు మనయందుండుటచేఁ దగుయత్నముచే మనము సాధింపలేనిది యొకటియైననుండదు. ఇదిమొట్టమొదట దృఢముగఁ దెలిసికొనవలసిన విషయము. "నేనల్పుఁడను. ఇంతగొప్పకార్యము నాచేసాధ్యమగునా" యని శంకించువాఁడెప్పుడును శక్తిహీనుఁడేయగును. "ఆత్మశక్తి నా యందుఁగలదు. ఈశ్వరుశక్తిచే సాధింపరానిదొకటియైనను లేదు" అనుదృఢనిశ్చయముతో యత్నము చేయువానికసాధ్య మనునదియేలేదు. ఈశ్వరాజ్ఞ యొకటిమాత్ర మతిక్రమింపఁ జాలఁడుగాని యీశ్వరాజ్ఞకు లోఁబడి యెంతగొప్పకార్యముగాని పురుషప్రయత్నముచే సాధింపఁగలఁడు.

ఆదినుండి ప్రపంచమునఁ గొన్నికొన్నికార్యములు సుఖహే తువులనియును మఱికొన్నికార్యములు దుఃఖహేతువులనియును

ప్రకృతి ధర్మములుగనే స్పష్టమగుచున్నవి. అందుఁ గొన్నికార్యములవలనిఫలములు వెంటనేయగపడుచుండుటచే నందఱచే నెఱుంగఁబడుచున్నవి. మఱికొన్నికార్యములవలని ఫలములు వెంటనే కానరాకయుండుటచే నందఱెఱుంగలేక యున్నవారు. కొన్నింటిఫలములు కన్నుల కగపడుటచే నందఱు నంగీకరించుచున్నారు. మఱికొన్నింటిఫలములు వెంటనే కానరాకుండుటచే నదృష్టమను కొనుచున్నారు. ఇట్టిఫలములు తత్త్వజ్ఞులగువారిచే శ్రుతిస్మృతులయందు నిరూపింపఁబడి యున్నయవి. కాబట్టియే

శ్లో॥ శ్రుతిస్స్మృతి ర్మమైవాజ్ఞాయస్తా ముల్లంఘ్యవర్తతే।
ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ॥

యనిభగవంతుఁడు చెప్పియున్నాఁడు. శ్రుతిస్మృతులయందు నిషేధింపఁబడినకర్మములన్నియు దుఃఖహేతువులగుటచేతనే నిషేధింపఁబడియున్నవి. అకారణమని తోఁచుదుఃఖప్రాప్తియంతయుఁ బూర్వకాలమున భగవదాజ్ఞోల్లంఘనమువలనఁ గలిగినదేగాని వేఱుకాదు. అటులకారణముగఁ బ్రాప్తించినట్లుఁ గనఁబడు సుఖమంతయుఁ బూర్వకాలమునఁ జేసిన సుకృతఫలముగాని యన్యముగాదు. అజ్ఞానముచేతఁ బూర్వకారణములకును ఇప్పటిఫలములకునుం గలిగియుండు సంబంధము నెఱుంగమిచేనది యదృష్టమని పలువఁబడుచున్నది. అదృష్టమనఁగాఁ జూడఁబడనిది. కారణము మనకుఁ దెలియనిదనియేయర్థముగాని యకారణమని కాదు సుమా! ఇట్టీశ్వరాజ్ఞ నుల్లంఘింపఁ జాలముగాని, దానికిలోఁబడి యెంతటికార్యమైనను సాధింపఁగలుగుదుమను నుత్సాహము మిగుల యావశ్యకము.

శ్లో॥ ఉద్యోగినం పురుషసింహముపైతి లక్ష్మీః।
దైవేనదేయమితికాపురుషావదంతి॥
దైవం నిహత్య కురు పౌరుష మాత్మశక్త్యా।
యత్నేకృతే యదినసిధ్యతి కోఽత్రదోషః॥

ఈ దృఢనిశ్చయము గలిగియుండినచో వానికదృష్టము స్వాధీనమై వర్తించును. ఆనిశ్చయములేక "విధికృత" మని దైవమును దూఱువాఁడు పెనుగాలిచేఁ గొట్టఁబడిన గడ్డిపోఁచవలె స్వాధీనములేక పరాధీనుఁడై దిక్కు తెలియక వర్తించుచుండును.

మఱియు జీవుఁడు అజుఁడు, నిత్యుఁడు, శాశ్వతుఁడు అని యెఱుంగుటవలని ప్రయోజన మింకొకటియున్నది. జీవుఁడు పుట్టుకయు, జావును లేనివాఁడై యుండగాఁ బుట్టునది చచ్చునది యేది ?

శ్లో॥ "అంతవంత ఇమేదేహాః నిత్యస్యోక్తా శ్శరీరిణః ।
నహన్యతే హన్యమానే శరీరే ॥

ఈమొదలగు వాక్యములయర్థము పుట్టునది చచ్చునది శరీరముగాని జీవుఁడుగాఁడు. శరీరములు జీవునకు సుఖదుఃఖానుభవముల నిచ్చుజ్ఞానసాధనములు. జ్ఞానమును సంపాదించుటకు జీవునకిట్టివి యుపాధులు. వానివలనిపని తీఱిన వెనుక జీర్ణవస్త్రమువలె విడువఁదగినవి.

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ ।
నవాని గృహ్ణాతి నరో పరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణా ॥
న్యన్యాని సంయాతి నవాని దేహీ । భగవద్గీత॥

ఈమొదలగు వాక్యములయందు సూచింపఁబడినరీతిని శరీరమునుధరించువాఁడు జీవుఁడు. శరీరము పనిముట్టువంటిది. దానితోఁబనితీఱినను, అదిజీర్ణమై నిరుపయోగమైనను దానిం దృజించి మఱియొకదానిఁ గైకొనుటయే జీవునకు శ్రేయఃకారణము. అట్లు చేయకపోయినచో జీవునకు వృద్ధిలేకపోవును. పురుషార్థ మసాధ్య మగునుగదా! ఇవ్విషయము చక్కఁగ యోచించిచూడ మృత్యువు భయకారణము గాదు. జ్ఞానియగువాఁడు మృత్యువునుఁ దలఁచి భయపడక యుండుటయేగాక మఱియు దాని

నెక్కుడుప్రియమైనవము హెూపకారిగఁ దలఁచును గదా! మనకుఁ బ్రియులగు వారుమృతులగుచుండఁగా, నాజీవుఁడిచ్చటఁ బొందఁ దగిన జ్ఞానమునుఁబొంది విశేషజ్ఞానమునకై దేశాంతరమునుగూర్చి పోవుచున్నాఁడని యెఱింగి మనము దుఃఖించుటమానవలయును. స్నేహితుఁడొకఁడీదేశమున నొకగొప్ప ఉద్యోగమునందుండి కొంతకాలము గడచినపిదప నంతకంటె గొప్ప యుద్యోగమును వహింప దేశాంతరమునకుఁ బో నియోగింపఁబడినచో స్నేహితునికి శుభము గలిగెనని సంతసింతుము గదా! అతండు దేశాంతరమునకుఁ బోవుట మనకుఁ గొంతకొఱంతగానుండినను నాకొఱంతను లెక్కింపక దేశాంతరగమనమునకెల్ల సంతసింతుమో యాలాగున నే యాప్తులగు వారలకు మరణకాలముసమీపించునపుడు, ఆజీవులు దేశాంతరమునకు వెళ్ళుచున్నారనియును, అంతకుముందటిజన్మములలోఁ గలుగఁజేసికొనిన కర్మానుబంధములచే నీజన్మమున నొక్కచోటు జన్మించినరీతిని ఈజన్మమునను, ముందటి జన్మములను చేసికొనిన కర్మానుబంధముల కనుగుణముగ రాఁబోవుకాలమునఁ బునర్జన్మాగమ మగుఁగాకయనియు, నూర్ధ్వలోకములనుండు కాలమున జీవునకు మనశ్శాంతియు, దుఃఖమిశ్రముగాని సుఖమును గలుగుఁగాకయనియును దృఢమగుమనస్సుతో సంకల్పించుచు జీవుని భవిష్యత్సుఖమును గోరవలయును.

జీవుఁడు నిత్యుఁడు. ఐనచో నీజన్మమునకు ముందుండియుండవలయును. ఇట్లనేకజన్మములు ముందుగడచి యుండవలయును. అటులిఁకమీదసైత మనేకజన్మము లుండకతీరదు గదా! ఒక్కొక్కజన్మమునందును జీవునకు దల్లియుఁ దండ్రియు, సోదరులును, దారాపుత్త్రాదులును మిత్రులును, ధన గృహ వస్తు వాహనములు మొదలగునవియు నుండియుండును గదా! ఒక్కొక్కజన్మాంతమున వానినన్నింటిని వదలి స్థలాంతరమున జన్మించి తిరిగి సంసారమునమునిఁగి యప్పటప్పటిదారాపుత్రాదులకొఱకెఁ దన

కాప్తులగువారలు వేఱు వేరనుభ్రాంతికి లోనగుచుండెనుగదా! దీనిం జక్కఁగఁ జింతించినచో నిప్పటిమమకారమును, సంసార మూల మగువ్యామోహమును గొంతమట్టుకైనను దరింపఁజాలుదుము గదా!

శ్లో॥ నప్రహృష్యేత్ప్రియంప్రాప్య। నోద్విజేత్ప్రాప్య చాప్రియం॥
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః॥

అను గీతావాక్యమిట్టిజ్ఞానముఁ గలవారివిషయమై చెప్పినదేగదా! అస్మదాదులందఱును, ఈవిషయముఁ గొంతమట్టుకు మననముచేసె ప్రియాప్రియప్రాప్తియందు హర్షవిషాదములకులోఁబడక చిత్తసమాధానము నభ్యసింప నేర్తుముగాక.

మనదేశమున సామాన్యముగ నందఱును జీవుఁడు నిత్యుఁడనియును జీవున కనేకజన్మము లున్నవనియును, ఒకజన్మమునఁ జేసిన సుకృతదుష్కృతములు అనఁగాఁ బుణ్యపాపములు తదనంతర జన్మములయందు సుఖదుఃఖరూపముగ జీవుని వెంట నంటియే వచ్చుచుండుననియును నమ్ముచున్నారుగాని నడవడియందు మాత్రము అట్టినమ్మకమున్నట్లు గానరాదు. ఇపుడుచేయు కార్యము రాఁబోవుకాలమున దానికిఁదగినఫలము నీయక తప్పదను స్థిరమగునమ్మకమున్నచో నిమిషనిమిషము మనముచేయు మనోవాకాయికము లగుకార్యములనుఁ జక్కఁగఁ బరిశీలించి సుఖహేతువులగుకార్యములను అనఁగా సత్కార్యములను మాత్రము చేయుదుముగదా! నోటిమాటతో నమ్మునట్లు చెప్పుచుండినను, ఆనమ్మకమును నడవడియందుఁ జూపుటలేదు. ఇట్టినమ్మకము దృఢమై ప్రవర్తనమును బాగుచేసినచో లోకమున నిపుడు గానవచ్చు కలహములు, అసూయలు, అన్యాయపుఁగార్యములు, మనస్పర్థలు నశించి లోకమంతయు నిరంతర సౌఖ్యానుభవము గలదియగు ననుటకు సందియములేదు.

ఆలోచించిచూడ లోకమున ననేకులు తమస్వరూప మిట్టి దనిగాని; తాము పొందఁగలుగు గమ్యస్థాన మిట్టిదనిగాని, దానిం బొందుటకు విధింపఁబడియుండు మార్గము లివియనిగాని యించుక యైనను జింతించుటగానము. జీవయాత్ర యనునది గొప్ప ప్రయాణమువంటిది. జీవులందఱు ఆమార్గమున నడచుచుండు వారలే. ఐనను వేయింట నొకరైనను దాముపోఁదలఁచియుండు స్థానమిట్టిదనిగాని, ఆస్థానమును బొందుటకు మార్గములు పెక్కులా, ఒకటియాయనిగాని, యవియెవ్వియనిగాని విచారించువా రరుదు. సామాన్యముగ ననేకులు ఐహికసుఖమే పరమపురుషార్థమనియు, దానిసాధించుటకంటె నుత్కృష్ట మగుకార్యము లేదనియు నెంచు నాస్తిక చార్వాకులవలె నడచుచున్నారుగాని, శరీరమునకంటె విలక్షణుఁడును, అన్యుఁడును, నిత్యుఁడు నగు జీవుఁడొకడున్నాఁడని నమ్మువారివలె వర్తించుట గానము. తన స్వరూపమును దెలిసికొనుటకంటె నుత్తమమగుజ్ఞానము వేఱులేదని పరమార్థబోధకములగు గ్రంథములన్నియు నొక్క వక్కాణించుచున్నయవి. కావున జిజ్ఞాసులగువార లందఱు తమతమస్వ స్వరూపములం దెలిసికొనుటకు యత్నించి, తెలిసినంతమట్టుకు నట్టిజ్ఞానము ననుసరించి వర్తించుదురు గాకయనియు, అట్లు వర్తించుటకు వలయు వివేకజ్ఞాన స్థైర్యములు వారలకుఁ బరము దయానిధియగు భగవంతుఁడుదయచేయుఁగాక యనియు మాప్రార్థన.



## యు గ స ం ధి.

### III. అంతర్యుగ ధర్మములు.

లోకమున మానవకోటి యొకయుగకాల మభివృద్ధియై సంసారసంశుద్ధియం దొకఁడెట్టు నెక్కవారనియు వారికావృద్ధి కలుగుమార్గమును నేర్పుచు దానినిసమకూర్చుటకుఁ బూఁటపడి మహాత్ము లీశ్వరసంకల్పమును బ్రారబ్ధముగ వహించి జనులకు నానావిధములగు నుపదేశములను జేయుచుండుదురనియుఁ గ్రిందిటి ప్రకరణముల సంగ్రహముగ సూచింపఁబడియె. ఆమార్గములఁ గొన్నిటి నిప్పుడుపన్యసించెద.

వ్యాధిగ్రస్తునిఁ జికిత్స సేయుట కర్తవ్యముగఁ బూని వైద్యుఁడు మందిచ్చిన నదిచేదనియుఁ గారమనియు రోగిచేకొనకుండు. లోఁగొనియు జుగుప్సచేఁ గ్రక్కి వెడలించును. అట్లుగా కండ బెల్లము తేనె తములపాకురసము మొదలగు నిరపాయములగు ననుపానములలోఁ గలపికప్పి మఱపించి మందులోనికిఁ జెల్లునట్లు వైద్యుఁడుచేయును. విద్యాభ్యాస సమయమున బాలుని మనస్సున కెక్కనివిషయము నుపాధ్యాయులుపమానములచే నుదాహరణములచే స్వానుభవప్రకటనములచే నెఱిఁగింపఁబూనును. కొడుకునకుండు దుర్గుణంబులఁ బాపఁదండ్రికి శక్తిలేకుండిన ధృతరాష్ట్రుఁడు చేసినట్లు తల్లింబిలిచి నీవేని కొడుకునకుఁ గఱపుమా యనును, బంధువులను బెద్దలను బిలిపించి చెప్పుఁడనును. దానికిని మెలఁగఁడేని నొప్పించియు దిద్దును.

అవ్విధముగ జగద్గురువులుగ నేర్పడిన పెద్దలు లోకహితులై లోకోద్ధరణార్థము నానావిధముల విద్యల నేర్పి జ్ఞానాభివృద్ధిఁ గావించెదరు. ఎల్లనియు వారలుద్దేశించినఫలము లోకమునకుఁ గలిగినఁజాలుననని తలంతురుగాని దానికిసాధనములగు మార్గంబులు ప్రియంబులా యప్రియంబులాయని మిక్కిలి విచారింపరు. ప్రి

యంబులగు **మార్గంబులచే** గ్రహింపనేరనివారికి నప్రియంబులగు
మార్గంబులచే నేని బోధించి వారిని గడతేర్చుటయే కృతకృత్య
మని కరుణా సముద్రములు పాటింతురు. ఆనిమిత్తముంబట్టి వారు
నానా వేషభాషలతోఁబుట్టి యేయే దేశభాషల కేయేజనులు ప్రియం
బందియు భయంబుఁబొందియు జ్ఞానమభ్యసించి గ్రహించిన నాయా
జనుల నుద్ధరించినవార మగుదుమనియే వారియంతరంగభావము.
కావున జగద్గురువులుగ నవతరించి నానాదేశములం బుట్టినవార
లేకాభిప్రాయులయ్యు భిన్నజనాదరణీయులయ్యెదరని యెఱుంగ
వలయును. వైశ్యునకు వణిగ్వృత్తిచే ధనమును ధర్మమార్గ
మున నార్జించుట ముఖ్యోద్దేశ్యమైయుండ నతండు కందులమ్మియు
పంచులమ్మియుఁ బలుసరకులయంగడిపెట్టియు నప్పిచ్చిపుచ్చుకొని
యు నొకఁడుమార్గమున ధనము గడించిన దానిసహాయమున నితర
మార్గంబులఁ బ్రవేశించుట సులభమగుఁగదా. ఆప్రకారముగ యుగ
కాలమునందుఁ బ్రాప్యమగుస్థానమును మానవకోటికిఁ బొందించెద
మని పూటపడిన పుణ్యపురుషులు నానావిధజన స్వభావములకుఁ
దగినట్లు గొందఱిని గ్రమమార్గములందును గొందఱిని నడ్డత్రోవ
లందును గొనిపోవుదురు. ఒకనికిఁ బరోపకారముమంచిది దాని
నభ్యసింపుమని బోధించి వేఱొకనికిఁ బశుహింసకూడ దహింసయే
పరమధర్మంబని నేర్పి మఱియొకనికి దశేంద్రియ సహితదేహమును
దొలుఁత నిగ్రహింపవలయునని కఱపి యొండొకనికి నాత్మశక్తి పరి
పక్వముగావలయు నేని యనన్యసహాయమున నీవపాటుపడిన లెస్స
గ నీశక్తులుస్ఫురించి బలపడునని తెలిప యిట్లుసకలవిధముల నుప
దేశించియు నెందేని వాఁడొకఁడు దాని యందుఁబట్టుదలతోఁబూని
దానిని సాధింపడే యంతవానికితరసద్గుణము లేర్పడుట యెంత
యు సులభమగుఁగాదే యని దయాపయోనిధులు పెక్కుచంద
ములఁ బ్రవర్తించెదరు. అట్లొకఁడు కొంతజ్ఞానము గుదిరిన
వెనుక నితరజ్ఞానముల నేర్పుదుర్పు. ఇట్లుయుగపర్యంతముఁ బొం

దనగు జ్ఞానమును శక్తిస్ఫురణమును విభజించి వానిని నేర్పు చుండుమరు. ఇట్టివిభాగములు కాలమున నంతర్యుగంబులనం బడు. కలియుగమున, ననేకాంతర్యుగములుండు. అందు ని ప్పుడొకఁ యంతర్భాగము సెల్లె. వేఱొకఅంతర్యుగము పుట్టు చున్నది. ఇది రాఁబోవు సంచికయందు వివరింపఁబడును.

జ్ఞానమును విభాగించి నరకోటికి నేర్పువిధము భారతవర్ష మునందును ఐరోపాదేశమునందును వివరించెదను. కలియుగ మునఁ బశువధతోఁగూడిన యజ్ఞముచేయరాదనియు శ్రాద్ధాములం దును మాంసముల వర్జింపవలయుననియు యాజ్ఞ్యవల్కుఁడు ను బరాశరుఁడును జెప్పియుండ బ్రాహ్మణులు పశుపిశసనసహిత యజ్ఞముల వదలకుండిన మాంసాహారమున శుద్ధబుద్ధి దుర్లభమని యు శుద్ధబుద్ధిలేనివారాఅవ తెగయందుఁబుట్టరనియు వారికెట్టులేని మాంసవర్జనమును దెలిపింపనవలయునను సంకల్పమున బౌద్ధుఁ డై భగవంతుఁడుపుట్టి యహింసయే పరమంబగు ధర్మంబని భారత వర్షమునఁ బ్రకటించియుఁ దత్పూర్వము పలలాశినులనియుఁ బోల దిండులనియుఁ బ్రసిద్ధిఁబొందిన దితిసుతులకు ననఁగా నాల్గవతెగ వారికి నాధర్మ ముపదేశించుటంజేసి యికాఁలమున భారతవర్ష బ్రాహ్మణులును బర్మా జపాఁ చీనా దేశముల నుండువారును బశు వధసేయుట మానిరి. కలియుగమంతయు వేద ప్రమాణముగ నుండఁదగు భగవద్గీతా శాస్త్రమున నెల్లెడల సంగమునువిడిచి క ర్మములు సేయుమనియు నాశలందగులకుమనియుఁ జెప్పిన సర్వ సంగపరిత్యాగ ధర్మమును వచనమాత్రాచారముగనిలిపి ధనదారా పుత్రేషణలందగిలి జనులు కీడ్పడియుండ వారల కాజ్ఞానమును బునరుద్ధారణమును జేయ బౌద్ధుఁడవతరించి కర్మబంధముల నాశ ముచేతనే ముక్తియగునని నొక్కిచెప్పె.

అంతఁ గొన్నియేండ్లకు బౌద్ధమతము నెక్కొనిదానియంద లి. యహింసాకర్మఫలత్యాగధర్మములు ప్రబలియు నిరీశ్వరవాదం

బును ప్రబలినదానిని ఖండింపఁగ శ్రీశంకరాచార్యులువా రుద్భ
వించి సర్వ మాత్మమయమనియు ననాత్మయున్న దనుబుద్ధి మిథ్య
యనియుఁ బ్రతిభాకౌశలమున స్థాపించి జనులకు జ్ఞానమార్గమును
జక్కఁగఁ జూపించి యంతర్హితులైరి. అంతజనులెల్లఁ దాము బ్ర
హ్మము లని విఱ్ఱవీగి భక్తిలేక కర్మాచరణములేక దుర్గతులంబోయిన
రామానుజ మధ్వాచార్యు లవతరించి భక్తిమార్గమును గర్మమార్గ
మును నేర్పి శ్రద్ధాభక్తివైరాగ్యములఁ బురికొలిపిరి.

ఇకాఁలమున జ్ఞానభక్తికర్మమార్గములుమూఁడు నజ్ఞానమే
ఘుచ్ఛన్న దుర్దినంబులంబడినవి. నిరీశ్వరవాదంబు నాస్తికబుద్ధి
యుఁబ్రబలె. ప్రపంచమును నందలిజనులును బదార్థసంఘాత
ములనియు నాపదార్థముల స్వభావశక్తులంబట్టి ప్రపంచస్థిరత్వము
ను మానుష శరీర మనోభివృద్ధియుఁ గలుగుననియు నంచులకై నీ
శ్వరుం డొకఁడేల వాఁడున్న నేమిలాభము లేకున్న నేమినష్టము
ని వాదించుచుండిరి. దీనికి మూలమాంగ్లేయదేశవాసులగు శా
స్త్రాభ్యాసులు ప్రకృతిశక్తివేత్తలయి యాశక్తుల జనులకొఱ కుప
యోగించు సామర్థ్యమును గలశిల్పుల పనులు కారణంబు. దీ
నిని ఖండించవలయునని జగద్గురువుల సంఘమున నాలోచించి
వేఱుమార్గము తోఁపమి భారతాంగ్లేయదేశముల సాంగత్యమున ని
ది నేఁకూరు నని యట్లాంగ్లేయరాజ్యమును భారతఖండమున స్థా
పించిరి.

అట నత్తఱి నైరోపాఖండమునందును దానిలోముఖ్యముగ
నాంగ్లేయదేశమునందు నుండుధర్మస్థితి యెట్టిదనియు వారికి భా
రతదేశముతోఁ గర్మబంధనములు గూర్చినదాన నేమి మేలయ్యె
ననియు విచారింపవలయును. ఆదేశమున నెగడుధర్మము క్రై
స్తవధర్మము. దానిచే జనుల కలవడునవియు వర్తమాన ప్రసం
గోచితములునగు నుద్దేశములు పరోపకారమును నిస్సహాయత్వ
ముగనిలిచి స్వశక్తులఁ బెంచుటయు రెండు. పృథగ్వర్తనమునఁ

గఱవవలయు ధైర్యస్థైర్యములు నాత్మరక్షణము నార్జవము శౌర్య
ము లోనగుగుణములు వారలకుం జక్కఁగఁ గలిగెఁగాని పరోప
కార బుద్ధియించుకయేనిఁగలుగదయ్యె. పేదలకు బిచ్చముపెట్టరు.
వారికి రాత్రులందు విశ్రమింప సత్రములులేవు. వారుబయల ని
లిచి నిద్రించి చలికిఁగొంకుపోయి తిమ్మిరిపొంది శ్రమంపుదురు. స
త్రములఁ గట్టుఁడని ధనికులకు బోధించినవానిచే మాకేమిప్రయో
జనమందురు. త్రాఁగునీరును వెలయిచ్చికొనవలయును. తటా
కాది సంతానములు వారెఱుంగరు. రాఁగలకాలమున జనులుప
యోగింప దానాదులఁజేయరాదేయని కాఁటికిఁగాలుదాచినవారి
నడిగిన భవిష్యజ్జనులిప్పుడు నాకేమిమేలుసేసిరని వారికుపకారము
సేయవలయునని యడిగెదరు. కర్మమును బునర్జన్మమును నొప్పు
కొనమింజేసి యిట్టి నిర్దయవచ్చె. ఇఁక దీనిని బోఁగొట్టుటకై
వారికిఁ గర్మవిధిని నేర్పవలయును. మార్దవమును దయాళుత్వము
ను నెక్కొనఁజేయవలయును. కావుననే వీరిని భారతఖండము
న ననిచిన నందుఁబోయి వారిసాంగత్యమునఁ గర్మపునర్జన్మ విధు
లంగఱచి మార్దవానుకంప దయాగుణంబుల నభ్యసింతురను భావ
ముతోఁ గర్మదేవత లాంగ్లేయులకు భారతవర్ష పరిపాలనమిచ్చిరి.

భారతాంగ్లేయ దేశములు రెండును బాగువడిన నైదవ
తెగవారగు నార్యులందనేకులు బాగుపడుదురు. ఆసాంగత్యము
న నింతకు నెంతయు మేలయ్యె. భారత దేశమున నిరీశ్వర వా
దంబును నాస్తికమతంబును దొలఁగుచున్నది. వైదికులు సర్వ
కర్మత్యాగము సేయవలయుననియుఁ బరులు దుఃఖించుచుండఁగఁ
జూచి వారికర్మము వారనుభవించెదరు మనకేమిపని యనియు
లోకమెట్లులుపాడైననేమి మనయంత మనము ముక్కుఁబట్టుకొని
ధ్యానంబున నున్నజాలుననియు నుండినకాలము గడఁచెను. ని
ష్కామ కర్మమార్గములం దభిరుచి హెచ్చయ్యెడు. భక్తియుఁ
బ్రాచీన గ్రంథములఁబఠించి దానిచే జ్ఞానమును మఱలగ్రహించు

చుండుదురు. ఆంగ్లేయులకును నైరోపాదేశీయులకుఁ గర్మవిధి యందు విశ్వాసమును దానిచే నిప్పుడు చేయు మేలుత్తరకాలమునఁ బ్రాపించునను నమ్మకమును దానంజేసి మేలు సేయవలయునను పరోపకారబుద్ధియు నలవడెడు. ఇట్లగుటంజేసి మైదవ తెగవారి యందనేకులు పునరుద్ధారణాసక్తులైయుండ నాఅవశాఖను స్థాపించు కాలమనుకూలించెడు. కావున నంతర్యుగసంధి యనఁగాఁ గలికృతయుగసంధికిది సమయ మిప్పుడొకఁ మహనీయుఁడు పుట్టి లోకమున యోగక్షేమధురంధరుఁడై సకలశ్రేయఃప్రదోద్యోగియై మతోపదేశకరుఁడై బాహ్యాంతరవ్యాపియై సర్వజ్ఞుఁడై దయాకరుఁడై సర్వజనశంకరుఁడై వెలుఁగును.

పై సంచికయందు IV. కలిలక్షణములు చర్చించబడును.

## స్పర్శదోషము.

హిందూధర్మశాస్త్రములందు విధింపఁబడియుండు ననేకాచారములలో స్పర్శదోషమొకటియై యున్నది. బ్రాహ్మణాది వర్ణములవారు క్రిందిజాతులవారిని తాకఁగూడదనియు, వారుస్పృశించిన పదార్థముల కొన్నిటిం భుజింపఁగూడదనియు, ఆశౌచములోనుండువారిని ముట్టరాదనియు స్నానముచేసినపిమ్మట నైల వస్త్రములులోనగు వాటిని స్పృశించఁదగదనియు, ఇట్టినియమములనేకములు విధింపఁబడియున్నవి. దీర్ఘకాలమునుండి హిందువులీయాచారములఖండితముగ నడుపుచువచ్చిరి. అయిననిప్పుడీయాచారము సేనమట్టుకడుగంటిపోయినది. ధర్మశాస్త్రవచనములన్నియుస హేతుకములైయున్నవి. హేతువిచారముసేయుటకువలయు నోపికయు శక్తియులేనివారు కొందఱీ నిర్బంధముల ననుపయుక్తములని నిరాకరించుచున్నారు. "స్వధర్మప్రకాశిని" యనునాంధ్రపత్రికయందీవిషయమై వ్రాసినయంశమీక్రిందఁ బొందుపరపఁబడియున్నది.

"స్పృశ్యాస్పృశ్యవిచారమువలన జఘన్యజాతీయులను బ్రాహ్మణజాతులు తాఁకుటకును వారితోడ దేహసంబంధము నధికముగ చేయుటకును సంశయించునది నిశ్చయము. దీనివలన హీనజాతులు బ్రాహ్మణులందు ద్వేషించుటయు ద్వేషమువలన అన్యోన్యము నష్టమునందుటయు కలుగును గావున, అందఱొకచోట కలసి భుజించుచు వివాహాదికము పరస్పరము నొనర్చుకొనవలయునని కొందఱును, వివాహాదికముతప్ప తక్కినవన్నియు కలుగజేసికొనుటమంచిదని కొందఱును తలంచుచున్నారు. ఇఁక దీనినిగుఱించి విచారింతము:—మనధర్మ శాస్త్రములయందు అగ్రజాతులగు ద్విజాతులు హీనజాతులతోపాటు భోజనాదికము కలుగజేసికొనవలదని నిషేధించియున్నారుగాని వారితో ద్వేషించుఁడనియు వారి అభివృద్ధికి తగినవిషయముల చూడవలదనిగాని చెప్పియుండలేదు. మన ధర్మశాస్త్రములు వారిక్షేమమునకు తగినకృత్యములు చేయుటయందు నిందచేయవు. వారితో కలసిభుజించుటయే వారినిఅభివృద్ధిచేయుటయని అందురేని అట్లయిన మీతోకలసి భుజించుటయే అభివృద్ధికి లక్షణమా? ఒకచోట కలసిభుజించుచుండు సోదరులే పరస్పరము కలహించుచు వేలకువేలుఖర్చులు పెట్టుకొనుచుండుట మనముచూచుట లేదా, భిన్నజాతులలోనివారలెందఱెందఱు కలసిమెలసియుండుటలేదు. పల్లెటూళ్ళయందు చూడుడు. బ్రాహ్మణుఁడును శూద్రుఁడును కలసి మఱొక బ్రాహ్మణుని సమూలముగ పెళ్ళగింప మొదలుపెట్టుదురు. ద్వేషించుటయు, స్నేహించుటయు దుస్సహవాసమువలనను సద్గుణములవలనను కలుగుపనులుగాని భుజించుటచేత వృద్ధినందునవియు అది లేకపోవుటచేత పోవునవియు కావు.

వస్తువులకన్నింటికి ఇతరవస్తువుల పరిచయాతిశయమువలన స్వభావగుణములు మారుచుండును. పరిమళములుగల పూలను మృత్తికయందుంచితిమేని కొంతకాలమునకు ఆమృత్తిక పరిమళము

గలదియగును. మృత్తికపరిమళ రహితమయినదైనను పరిమళముగల ,వస్తువులతోపాటు చిరకాలముండుటచేత పరిమళముగలది ఆయెను. దుర్గంధముగల వస్తువులతోడ ,పరిమళముగల పుష్పము నుంచితిమేని కొంతకాలమునకు పుష్పము దుర్గంధముగలదియగును. ఇట్లగుటకు కారణము సంసర్గముచేత వస్తువులగుణములు మారుటయేగాని మఱొకటికాదుగదా. కావుననే పవిత్రతాతిశయము గల వస్తువులు పవిత్రాహీనములగు వస్తువులతోడ కలియుటయంము ప్రాచీనులు ఇష్టపడకపోయిరి.

శ్లో॥ హన్యాదశుద్ధఃశుద్ధంతు శుద్ధేఽశుద్ధంతుశోధయేత్ ।
అశుద్ధస్తుతమోభూతః శుద్ధవాసేనశుద్ధ్యతి ॥

దీనివలన గుణాతిశయముగలవస్తువు తక్కువగుణములుగల దానిని తిరస్కరించునని భావము.

ప్రతివస్తువునుండి అతిసూక్ష్మములగు పరమాణువులు బయలువెడలి అన్నితావుల వ్యాపించునని తెలియవచ్చును. వాయువిహీనమయిన ప్రదేశమందు పరిమళవంతమయిన పుష్పమునుంచితిమేని సమీపముననున్నవారికి దానిపరిమళము తెలియవచ్చును. సూక్ష్మతమములగు పరిమళపరమాణువులు వ్యాపించనియెడల పరిమళము నెఱుంగుట యసంభవముగదా, జలమునందు పరిమళముగల పుష్పముల నుంచితిమేని ఆజలమంతయు పరిమళించును. దీనివలన పుష్పపరమాణువులు జలమునందు వ్యాపించి జలమునకు తమగుణమును కలుగచేసినవని తెలిసికొనవలయును. అచేతనములగు పుష్పాదులనుండి సూక్ష్మతమములగు పరమాణువులు బయలువెడలి ఇతరత్రతమగుణముల నెట్లువ్యాపింపచేయునో అట్లేచేతనముల శరీరములనుండియు పరమాణువులు నిరంతరము బయలువెడలుచుండును. అవి సత్వాదిగుణ సంయుతములనియు, గంధాదిగుణ విశిష్టములనియు ద్వివిధములుగ నుండును. కొందఱు జీవిషయమునందు తమయ నంగీకార్యమును చూపుదురుకాని అంత

మాత్రము చేత ఉన్న విషయమును తీసివేయ నెవనితరము? మనుజుని శరీరమునుండి గంధాదికముగల పరమాణువులు బయలు వెడలుట అసత్యమాయెనేని బహుదూరముననున్న మనుజుని వ్యాఘ్రాదికము లెట్లు తెలిసికొనును? మనుష్యునిజాడ వాసనచేతనే పులులు కనిపెట్టుటయు, గోవులు వాసనచేతనే పులి సమీపముననున్న సంగతిని కనిపెట్టుటయు ప్రత్యక్షానుభవమునందుండ ఎవరోకొందఱు నమ్మకపోయిన మనకేమిలోటు? మహారాష్ట్రదేశమున కొండభూమియగు కొంకణప్రాంతమున "అగ్నిసర్ప" మను ఒక సర్పజాతిగలదు. ఆసర్పము ఇంటినడికప్పునందు వచ్చియుండెనేని ఆయింటియందుండువారలు మృతిచెందుదురట. ఇదిఎందువలన? ఆసర్పదేహమునుండి విషపరమాణువులు బయలువెడలి పరులయందు సంక్రమించుట చేతనేగదా, ఇందువలన నీచేతనములనుండియు పరమాణువులు బయలువెడలి ఇతరత్రతమగుణములను వ్యాపింపచేయుచున్నవని తెలిసికొనవచ్చును. మనకనులకు కనంబడనివన్నియు లేవనివాదించుట తెలివితక్కువయనిన తప్పేమియున్నది? పరమాణువుల సేవనమువలన వానిగుణము ఇతరత్రవ్యాపించుననుటకు సాంక్రామికరోగములు సాక్ష్యమునిచ్చును.

శ్లో॥ కుష్ఠం జ్వరశ్చ శోఫశ్చ నేత్రాభిష్యందపవచ!
ఔపసర్గికరోగాశ్చ సంక్రమంతి నరాన్నరం ॥

పైరోగములుగల వారితోటి చిరకాలపరిచయము నొనర్చునేని వారికారోగములు సంభవించుచుండుటయు మనకు అనుభవములోనున్న విషయమేగదా. గ్రంథిజ్వరము మొదలగు వ్యాధులకును సూక్ష్మపరమాణువులు పరులను వ్యాపించి వారలకు చెరుపుకలుగచేయుననియేకదా రాజకీయాధికారులు తమకుతోచిన విధంబుగ నిర్బంధములధికముగ చేయుచున్నారు. ఇదేవిధంబుగ సత్వాదిగుణ బాహుల్యముగల బ్రాహ్మణజాతులతోపాటు తమోగుణాధిక్యత కలిగియుండు ఛండాలాది హీనజాతులు తరుచుగ

కలసి మెలసి యుండుటచేత పరిశుభ్రతపోవునని తలంచి స్పర్శాది కమును, అంగీకరింపకపోయిరి. విరుద్ధగుణములుగల సూక్ష్మాంశముల సమ్మేళనమువలన చెరుపుకలుగునని ఆయుర్వేదవిదులు చెప్పి యున్నారు:—

వృద్ధిస్సమానై స్సర్వేషాం విపరీతేవిపర్యయః ॥

ఈ పరమాణువులను సూక్ష్మజీవులని పాశ్చాత్యులు వ్యవహరింతురు. ఈ పరమాణువులు తేజస్సమూహ సమీపమునగాని సూర్యసమీపమునగాని తరుచుగ తమప్రచారమునందు కొంతతగ్గియుండును. కావుననే రాత్రిళ్ళు గనంబడునంత దుర్గంధము పగలు పట్టణములందంతగా గనంబడదు. చెట్లనీడలయందు ధాన్యములు అంకురించుటయందు వెనుకబడినను సూర్యకిరణములచటచటక్కగ వ్యాపించుచుండెనేని అచటతప్పక అంకురించును. అనగా అంకురములను మొలవనీయకచేయు దోషముగలతావునందున్నదోషమును సూర్యకిరణములు వ్యాపించి ఆదోషమును పోగొట్టుచున్నవని అర్థమగును.

మనుష్యుఁడెప్పుడును పవిత్రమైన సత్వగుణాతిశయమును ఆరోగ్యమును సంపాదించుటకు ప్రయత్నించవలయును. అనారోగ్యమెప్పుడును మనోవాక్కాయ భేదములచేత ద్వివిధముగ నుండునని ఆయుర్వేదీయుల అభిప్రాయమైయున్నది.

ఆరోగ్యమును కోరువాఁడు తనఆరోగ్యమును చెడగొట్టు వస్తువుల సంపర్కమును పరిహరించిన ఆరోగ్యమును పొందుట సహజము. అట్టి సంపర్కమును పరిహరించువానిని నిందించి వానితోకలహించుట ఏపాటినీతియో అదేవిధంబుగ స్పృశ్యాస్పృశ్యమును పాటించు గౌరవము నాదరించువారితో కలహించునది యు నదేవిధంబని చెప్పవచ్చును.''

-:o:-

దా న ము.

శ్లో॥ దాతవ్యమితియద్దానం దీయతేఽనుపకారిణే,।
దేశేకాలేచపాత్రేచ తద్దానంసాత్వికంస్మృతమ్ ॥
భగవద్గీతా.

దేశము, కాలము, పాత్రత యిమ్మూఁటిం గుర్తెఱిఁగి దానముచేయవలయు.

దేశము:—భరతఖండమందలి సమస్తపుణ్య స్థలములలోఁ గాశీక్షేత్రము పరమపవిత్రమైనది. అచటఁ గొంతకాలమైన నివసించువారికిని, అచట శరీరమును విడుచువారికిని, సమస్తపాపములు తత్క్షణమనశించి, నిత్యానందస్థానము సేకూరునని శాస్త్రములు ఘోషించుచున్నవి. దానముసేయుట కామహాక్షేత్రము సర్వోత్కృష్టమైన స్థలము.

కాలము:—కలియుగమందైదువేల సంవత్సరములు గడిచినవి. పూర్వము మహోన్నత దశలోనుండిన మనదేశముయొక్క పారమార్థికము, విద్వత్తు, పరాక్రమము, ఐశ్వర్యము క్రమక్రమమున తగ్గినవి. అవిబొత్తిగా నశించకుండు నట్లాపుటయు, మరల మనదేశముఁ బూర్వపు గౌరవస్థితికిం దెచ్చుటయు మనకు కర్తవ్యంబైయున్నది. మనదేశపుప్రాచీన నాగరికతయు, పశ్చిమఖండపు నవ నాగరికమును, రెంటిని సమ్మేళనము జేసినగాని దేశాభివృద్ధిగానోపదు. ఆంగ్లేయ భాషాపాండిత్యము పశ్చిమనూతన శాస్త్రాభ్యాసమున కాధారమైయుండు. సంస్కృత భాషాపరిజ్ఞానములేకున్న మన వేదశాస్త్రపురాణాదులఁ జదువ సాధ్యముగాదు. కాఁబట్టి యీ రెంటిని మనబాలురకు చక్కఁగ బోధించుట ఇకాలమున నత్యావశ్యకమై యున్నది.

పాత్రత:—హిందూదేశాభి మానులగు కొందఱాంగ్లేయులును, మనదేశస్థులు కొందఱును కలిసి కాశీయందు సెంట్రల్ హిందుకాలేజీయను పాఠశాలను 1898 సం॥రమున స్థాపించిరి.

అచట సంస్కృతాంగ్లేయ భాషలును, మన శాస్త్రములును, పశ్చిమ,నవీనశాస్త్రమును బాలురకుఁ గఱపఁబడుచున్నవి. బొత్తిగా జీతములులేకనే కొందఱును, స్వల్పవేతనములఁ బుచ్చుకొని కొందఱును ఆంగ్లేయ విద్వాంసులును, హిందూవిద్వాంసులును అచట ఉపాధ్యాయురుగా నేర్పడి పాఠముల నేర్పుచున్నారు. ఆసేతుహిమాచల పర్యంతము నన్నిస్థలములనుండి సుమారు 850 మంది హిందూబాలురచట విద్యనభ్యసించుచున్నారు. పాఠశాలనిర్వాహకులు పరోపకారబుద్ధితోఁదమధనమును, కాలమును, యావచ్ఛక్తిని పాఠశాల పురోవృద్ధికై వినియోగించి పాటుబడుచున్నవారు. అచట సరస్వతి అత్యానందముతో తాండవమాడు చున్నదిగాని లక్ష్మీపూర్ణముగా బ్రసన్నమయి యుండలేదు. విద్యార్థుల నివాసమునకై 80 గదులుగల గృహమొకటి కట్టఁబడుచున్నది. ఒక్కొక్కగదికి 500 రూపాయలు పట్టును. ఎవరేని 500 రూపాయ లిచ్చినట్టయిన వారిశాసనముతోడ నొకగది కట్టఁబడును. యత్కించిద్ద్రవ్య సహాయమొనర్చినను కృతజ్ఞతతోఁ బరిగ్రహింపఁబడును.

ఇట్టి సత్పాత్రదానమునకై తమద్రవ్యమును వినియోగించునట్టి మహాభాగ్యము మాచదువరులలో కొందఱికైన గలుగుగాక.

శ్రీకృష్ణస్వామితన నిర్యాణసమయమున మైత్రేయమహర్షిని సమీపమునకుంబిలిచి యతనికివిజ్ఞానంబెల్ల నుపదేశించినట్లు శ్రీభాగవతములో విదురమైత్రేయ సంవాదమునఁ జెప్పఁబడియున్నది. ధర్మసంస్థాపనార్థమై యవతరించిన మహానుభావుఁడు గలియుగ ప్రారంభమున నవతారముంజాలించువేళఁ బెక్కుఋషులుండ మైత్రేయమహర్షికేఁ బరమార్థోపదేశంబుఁ జేయగతంబేమి? మానవకోటికిఁగలియుగ ధర్మములబోధించుటయందును ఆచరింపఁజేయుటయందును మైత్రేయ మహర్షికే దైనసంబంధముగలదోకో!

## ప తి వ్ర తా ధ ర్మ ము లు .

సీ. నిలయము వాటించి, నిర్మలదేహియై శృంగార మేప్రొద్దుఁ
యవలయు । సత్యప్రియాలాపచతురయై ప్రాణేశు చిత్తం
ప్రేమరంజింప వలయు । దాక్షిణ్యసంతోష ధర్మమేధా
దైవతమని ప్రియుఁ దలఁపవలయు । నాథుఁ డేపద్ధతి నడచు నా
పద్ధతి నడచి తద్బంధుల నడపవలయు । మార్దవమునఁ భతి
మజ్జనభోజన, శయనపానరతులు జరపవలయు । విభుఁడ
పతితుఁడయిన వెలఁది పాతివ్రత్య, మహిమఁ బుణ్యుఁ జే
మనుపవలయు ॥

కం. తరుణి తనప్రాణవల్లభు, హరిభావముగా భజించి యతఁడున
దానుఁ ; సిరిహరికైవడి నుండును, హరిలోకమునందు సం
తానందమునన్ ॥

కం. ఉపవాసంబులు వ్రతములుఁ, దపములు వేయేల భర్తదైవ
మనిని । షట్పటతఁ గొల్చిన సాధ్వికి, నృపవర దుర్లభము లే
నిఖిల జగములన్ ॥ (భాగవతము)

శ్లో॥. నాకృత్వా ప్రాణినాంహింసాం- మాంసముత్పద్యతేక్వచిత్ ।
నచప్రాణివధస్స్వర్గ్య స్తస్మాన్మాంసంవివర్జయేత్ ॥
(మనుధర్మశాస్త్రం 5—48)

తాత్పర్యము॥ జంతువులనుహింసచేయక ఒకప్పుడునుమాం
సముదొరకదు. జంతువులఁ జంపినయెడ స్వర్గాదిలోకములు దొ
రకవు. కావునమాంసమును వర్జింపవలయును.

-:o:-

## ప్రకటనలకు ప్రస్యన్నిర్ణయములు.

| | | | పూర్తిపేజి | అర్ధపేజి | కాల్ పేజి. |
|---|---|---|---|---|---|
| సంవత్సరమునకు | ... | రూ. | 40 | 30 | 20 |
| 6 నెలలకు | ... | ,, | 24 | 18 | 12 |
| 3 నెలలకు | ... | ,, | 18 | 9 | 6 |
| నెలకు | ... | ,, | 5 | 4 | 3 |

## నోటీసు

మాపత్రికను పుచ్చుకొన్నవారందరును వెంటనే చందా సైకము పంపవలయు నని ప్రార్థించెదము. చందా సం॥రమునకు తపాలాచార్జితోడ ఒకరూపాయ మాత్రమే. ఇందుకు సంబంధించిన పత్రికలు సైకము ఈక్రిందచేర్వాలు చేయువారికి పంపవలయును.

పరమాత్మునీ నరసింహాయ్య,
చిత్తూరు.

## పుస్తకములు.

1. పినేకచంద్రికయను వరశుల్క ప్రహసనము. వెల రెండణాలు. చిత్తూరులో శాశ్వతనిధిగుమాస్తా రాఘునగురుక్కల్ గారికద్ద దొరుకును.

2. శ్రీ వెంకటాచలయాత్ర. వెల 6 అణాలు. తిరుపతిలో ప్లీడర్ కే. వెంకయ్య, బి. ఏ. గారికద్ద దొరుకును.

## ఇతరపత్రికలు.

1. "స్వధర్మప్రకాశిని" మకవిషయ ఆంధ్రమాసపత్రిక. సంవత్సరచందా పోస్టేజితో రూ. 1—8—0. మానేజర్, "స్వధర్మప్రకాశిని" చింతాద్రిపే., మదరాసు అని వ్రాయవలయు.

2. "ప్రథమపాఠశాలపత్రిక" ప్రథమపాఠశాల విద్యార్థులకును ఉపాధ్యాయులకును ఉపయోగమైన ఆంధ్రమాసపత్రిక. సంవత్సరచందా ముందిచ్చిన ఒక రూపాయ; ఆలస్యమైన $1\frac{1}{2}$ రూపాయ. రాజమహేంద్రవరములో వల్లూరుసంసహారాయుడుగారికి వ్రాయవలయు.

Registered No M. 716.

ఓం.



# దివ్యజ్ఞాన దీపిక.

(పూర్వమున "హంస").

**A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.**

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె నెక్కువ ధర్మములేదు).

సంపుటము 1. **July 1910.** జూలై నెల 1910. సంచిక 4.

## విషయసూచిక.



సం॥రమునకు చందా 1 రూపాయ.

CHITTOOR, N. A. DT.:—PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
FOR P. NARASIMHA AIYA GARU, *Publisher.*

ఓం.

# దివ్యజ్ఞాన దీపిక.

(సత్యమునకంటె నెక్కుడగు ధర్మములేదు).

సంపుటము 1. { July 1910. జూలై నెల 1910. } సంచిక 4.

## మహర్షి సంఘము.

ప్రాచీనకాలమున మనదేశమందు శ్రేష్ఠులగు మహర్షులు సంచరించుచు మనుష్యులతో గలసి మెలసి వర్తించుచుండెడివారని యనవచ్చెదను. అయోధ్యాపట్టణమున నిక్ష్వాకు వంశస్థులు ప్రభుత్వము చేయుచుండెనపుడు వసిష్ఠమహర్షి యయోధ్యాస్థాన వాంసియై వారికి గులగురువుగను మార్గదర్శిగ నుండెను. దశరథ మహారాజు పుత్రకామేష్టి యాగంబొనరించు వేళ

శ్లో॥ ఋష్యశృంగం వాసుదేవంచ జాబాలి మథ కాశ్యపం ।
పురోహితం వసిష్ఠంచ యే చాన్యే ద్విజసత్తమాః ॥

ఈఋషులనందఱిని ఋత్విక్కులుగా బిలుపించ వారందఱు వచ్చి యాయజ్ఞము నెరవేర్చిరి. విశ్వామిత్రుండు తనయాగ సంరక్షణార్థమై రామలక్ష్మణులం దోడ్కొనిపోవ దశరథమహారాజుకడకు వచ్చినతరుణమున వారిరువురకును జరిగిన సంభాషణ యందిన్నహారి యిట్లనియె.

శ్లో॥ అహంవేద్మిమహాత్మానం రామంసత్య పరాక్రమం।
వసిష్ఠోపి మహాతేజా యేచేఽమేతపసిస్థితాః॥

మహాత్ముఁడును సత్యపరాక్రముఁడగు రాముని (స్వరూప మును) నేనెఱుఁగుదును. మహాతేజస్వియగు వసిష్ఠుఁడెఱుగును. ఈఋషులందరెఱుఁగుదురు. అని చెప్పినపుడా సభయందగస్త్య పులస్త్యవామదేవ మార్కండేయాది మహర్షులనేక లుండినట్లు స్పష్టమయ్యెడిని. మఱల దశరథమహారాజు సీతాకల్యాణమున కై యయోధ్యనుండి మిథిలానగరమునకుం జనునపుడు

శ్లో॥ వసిష్ఠో వామదేవశ్చ జాబాలిరథకాశ్యపః।
మార్కండేయస్సుదీర్ఘాయుః ఋషిఃకాత్యాయనస్తథా॥

మొదలుగాగల యనేక తాపస శ్రేష్ఠులను ముందిడుకొని ప్రయాణముచేసిరి. జనకమహారాజు నిమిత్తమాత్రము రాజ వేషముతోనున్న మహర్షి. వారిసభయందును శతానంద ప్రభృ తులగు నాస్థానఋషులు పెక్కండ్రుండిరి. అకాలమున నిస్పృ హాత్ములనేకులు దండకారణ్యము నివాసస్థానముగాఁ జేసికొని యచట నాశ్రమముల నిర్మించుకొనియుండిరి. శ్రీరామచంద్ర మూర్తి యరణ్యవాసమునకేగునెడ ప్రప్రథమమున గంగాతీరం బున భరద్వాజ ఋషిందర్శించి యతనిచే నాతిథ్యముఁబడసె. పదంపడి యరణ్యమధ్యమున శరభంగ సుతీక్ష్ణాగస్త్యాద్యనేక ఋష్యాశ్రమములసేవించి వారిచేనుచితవిధ సత్కారంబులందు కొనెను. రాముఁడు శరభంగాశ్రమమునవేంచేసియున్నపుడు ఋ షిసంఘమంతయువచ్చి వారిదర్శనంబుజేసికొని శరణాగతిగావిం చి రాక్షసులచేఁ దమకుఁగలిగియుండు నుపద్రవముల విజ్ఞాపించు కొని తత్ప్రతీకారంబుంబ్రార్థించిరి. వారిమాహాత్మ్యము వాల్మీకి రామాయణమునం దిట్లువర్ణింపఁ బడియున్నది.

శ్లో॥ వైఖానసా వాలఖిల్యాస్సం ప్రక్షాళ్యా మరీచపాః ।
అశ్మకుట్టాశ్చ బహవః పత్రాహారాశ్చ ధార్మికాః ॥
దంతోలూఖలినశ్చైవ తథైవోన్మజ్జకాః పరే ।
గాత్రశయ్యా అశయ్యాశ్చ తథైవాభ్రావకాశకాః ॥
మునయస్సలిలాహారాః వాయుభక్షా స్తథాపరే ।
ఆకాశనిలయాశ్చైవ తథా స్థండిలశాయినః ॥
వ్రతోపవాసినో దాంతా స్తథార్ద్ర పటవాససః ।
సజపాశ్చ తపోనిత్యా స్తథా పంచ తపోఽన్వితాః ॥
సర్వే బ్రాహ్మ్యా శ్రియాజుష్టా దృఢయోగాస్సమాశ్రితాః ।
శరభంగాశ్రమే రామ మభిజగ్ముశ్చ తాపసాః ॥

వీరికందఱికిని శ్రీరామచంద్రుఁడభయంబొసంగి వారలకుపద్రవ మొనరించు రాక్షసుల వధించి తాపసాశ్రమము నిరుపాధికముఁగావించె. మరల వీర్లయం దనేకులు పట్టాభిషేక సమయమున నలుగుదెంచి యనుగ్రహించిరి.

శ్లో॥ వసిష్ఠో వామదేవశ్చ జాబాలిరథ కాశ్యపః ।
కాత్యాయనస్సుయజ్ఞశ్చ గౌతమో విజయ స్తథా ।
అభ్యషించన్నరవ్యాఘ్రం ప్రసన్నేన సుగంధినా ॥

ఈ ఋషులందఱును శ్రీరాములకుఁ పట్టాభిషేకంబుఁ గావించిరి. ఇట్లు రామాయణకథయందంతయు నిమ్మహాత్ముల సలదర్శనంబు మనకుఁ బొడగట్టుచున్నయది. ఇఁక నితర చరిత్రముల విచారింతము. నలమహారాజు రాజ్యభ్రష్టుఁడై భార్యయగు దమయంతి నరణ్యంబున నొంటరిగ విడనాడి చనిన నక్కోమలి నిజనాథు నన్వేషించుచు నరణ్యంబునం దిరుగునప్పుడు

మత్త॥ వారిభక్షులు పర్ణభక్షులు వాయుభక్షులు శాకనీ ।
హారభక్షులు వృక్షమూలనివాస సక్తులునైతపం ।
బారఁ జేయుమహామునీంద్రుల యాశ్రమంబెడగాంచెనం ।
భోరుహాక్షి పురాసమార్జిత పుణ్యకర్మఫలంబునన్ ॥

ఇట్లొక పుణ్యనదీతీరంబున నొకమునిపల్లెయందు వసిష్ఠ వామదేవవాలఖిల్య భృగునారద సదృశులైన మహామునులం దమయంతిగనుంగొని •వారివలన నభయంబు నొందె. ఇంక ప్రాచీనవృత్తాంతవిచారముం జాలించి యతిసమీపభూతకాలచరిత్ర మగు ద్వాపరాంతమునం జరిగినభారత కథాపరిశీలన మొకింత యొనర్చెదము. భారత చరిత్రమునకు వేదవ్యాసుఁడు మూలాధారమైయొప్పు. ధృతరాష్ట్ర పాండురాజుల జన్మప్రకారంబెల్లరకు దెలిసినవిషయమేగదా. ఇతఁడనేకమార్లు రాజసభల ప్రత్యక్షమై సమయోచితకార్యముల ఘటింపఁజేసె. లాక్షాగృహమునుండి గప్పించుకొని పాండవు లరణ్యంబుననుండునపుడు వారికి దర్శనమిచ్చి కొన్నిహితోపదేశంబులొనరించె. ద్రౌపదీస్వయంవరంబువేళ ద్రుపదునకుఁ బ్రత్యక్షమై ధర్మసందేహముమాన్పె. ఇంకను ధృతరాష్ట్రులకనేకమార్లు గానవచ్చె. మఱియును మయునిచే నిర్మింపఁబడిన యపూర్వ నూతనసభయందు ధర్మరాజు కొలువున్నసమయమున నచటి కనేకమహర్షులు వచ్చిరని వైశంపాయనుఁడీక్రింద పద్యమునఁ జెప్పియున్నాఁడు.

సీ. సుబలమార్కండేయ శునక మౌంజాయన మాండవ్య
శాండిల్య మందపాల। బకదాల్భ్యరైభ్యక భాలుకిజతుకర్ణ
• గౌతమకౌశిక కణ్వవత్స। సావర్ణి పర్ణాద సత్యగోపతి
గోప వేషమైత్రేయి పవిత్రపాణి। ఘటజానుకాత్రేయ
కఠకలాపసుమిత్ర, హారీతతిత్తిరి యాజ్ఞవల్క్య॥

ఆ. వాయుభక్ష భార్గవవ్యాసజైమిని। శుకసుమంతుపైల
సువ్రతాదు। లయినమునులు నేమునరిగితిమెంతయు। రమ్యమయినధర్మ రాజుసభకు॥

మఱియు ధర్మరాజుచేసిన రాజసూయయాగమున యాజ్ఞవల్క్యుండధ్వర్యుండుగా ద్వైపాయనుండు బ్రహ్మగాసుసాముండుద్గాతగా నింకను ననేక ఋషులు ఋత్విక్కులుగానుండిరని తెలి

యవచ్చెడిని. ఇదియునుంగాక నారదమహాముని యకాలమున నెందఱికో గోచరమై భావి కార్యములఁ ద్వరసేయుటకై వల యునాలోచనలఁ జెప్పె. మైత్రేయమహర్షి దుర్యోధనునికిని, విదురునికిని, మఱిగొందఱికిని ప్రత్యక్షమై హితోపదేశంబు సేసె.

ఇవ్విధంబున బూర్వయుగంబులందు కలియుగ ప్రారంభ ముదనుక నీభరత ఖండమునందనేక మహర్షులు వసించుచున్న వారై కొందఱుపురంబులను కొందఱు దేశమధ్యారణ్యములను నా శ్రమంబులగావించుకొని సాధారణముగ జనులకుదగ్గన మొసంగుచు రాజసభల కప్పుడప్పుడు విజయంచేయుచు వారికివలయు ధర్మ ములను పరమార్థమునుం దెలియఁజెప్పుచు ప్రజాక్షేమమునకుఁ దో డ్పడుచుండిరి. ఇకఁలికాలంబున ధర్మముక్షీణించి పాపమభివృద్ధి నై జనులంధకారమునమునిఁగి తోవఁజూపువారైనను లేకదురవ స్థలోనుండు నిపుడుగదా యట్టి మహాత్ముల ప్రాపును ఆదరణ యు సాహాయ్యమును మనుష్యజాతి కత్యంతావశ్యకములు. ఇపు డట్టిమహర్షు లెకఁడనుగానరారు. అరణ్యములందు కావలివారిల గుడిసెలుదప్ప ఋష్యాశ్రమములుకనఁబడవు. రాజకీయగొప్పసభ లయందును వారిదర్శనంబు సేకూరదు. ఇట్టిఇకఁట్టునవారు జను లయెడ నిర్దయులై యెకఁడికేనింజనిరే? ఏమయిరి ?

వీరినిగుఱించియేకదా శంకరాచార్యులవారు "వివేకచూడా మణి" యందిట్లువ్రాసిరి.

శ్లో॥ శాంతామహాంతోనివసంతిసంతో।
వసంతవల్లోక హితంచరంతః।
తీర్ణాస్స్వయం భీమభవార్ణవంజనా।
నహేతునాన్యానపితారయంతః॥

శాంతస్వరూపులగు నమ్మహాత్ములు లోకహితార్థమై ఇప్పు డునుసంచరించుచున్నారు. వారుసంసార సముద్రమునుదాటి దరిఁ జేరినవారు. దయాపరిపూర్ణులు. ఇంకను నాసముద్రమున మునిఁ

గుచుం దేలుచునుండు జనులదమన్నిర్వేతుక జాయమాన కటాక్షము చేఁ దరింపఁజేయువారు. అట్టిమహర్షిసంఘము వారుజనుల నెన్న డును విడనాడరు.

అయిన నాసంఘమునుండి కొందఱుఋషులు వెళ్లిపోవుకొల దిని నూతనముగా కొందఱు చేరుచుందురు. త్రేతాయుగంబున శ్రీరాములవారి యవతార కాలమున నున్నఋషులు వేఱు. ద్వాపరాంతమున పాండవులకాలమున నున్నవారు వేఱు. ఇప్పుడు కలియుగంబున ననేకులు సేరియున్నారు. సంఘముమాత్రమవిచ్ఛిన్నమైయున్నది.

వీరిలో ననేకులు పరమపావనమై సాత్త్విక తేజోభూయిష్ఠమై దేవతానివాసయోగ్యమగు హిమవత్పర్వత ప్రాంతముల విజనంబులును దుర్గమంబులునగుచోట్ల నాశ్రమంబుల నిర్మించుకొని లోకానుగ్రహార్థమై వేంచేసియున్నారు. లోకమునకు భగవత్ప్రసాదము వారిద్వారా ప్రవహించుచున్నది. ఇట్టిదివ్యసంఘములో జేరిన సిద్ధులు మహాపురుషుల ప్రేరణముచేత నే ప్రకృతపు దివ్యజ్ఞాన సమాజము స్థాపించఁబడినది.

## దేవాలయముల స్థితియు సంస్కారమును. I ఇప్పటిస్థితి ॥

1\. ఎల్లచోనిండి తానెల్లమై యెల్లవాని నడపించుచుండియుఁ దాను నిర్వికారుఁడు నచ్యుతుఁడునై నిలిచి యగోచరుఁడైనభగవంతుని మార్గమున మానవుల నడుప సమకట్టి మహర్షులు దేవాలయముల స్థాపించి వానిలో వేదాగమశాస్త్రవిధానమునఁ బ్రతిష్ఠాదులచే విగ్రహముల నెలకొలిపిరి. ఈవిగ్రహముల వేదాదిశాస్త్రసమ్మతప్రకారము ప్రాణప్రతిష్ఠ చేయుటం జేసి యందీశ్వర తేజస్సు సేరియుండు. స్వామికరుణచేఁ బ్రకాశించునవి. సు

రభివస్తువులచే నూదువత్తులం జేసి వాని నొకచోట వెలిఁగించిన యావాసన బహుదూరము వ్యాపించి జనములకింపుఁగొలుపునట్లు, దీపము చీఁకటినడంచి వెలుఁగు వెలివఱచునట్లు, మంత్రశక్తింజేసి ప్రతిష్ఠితవిగ్రహము దేవాలయమునందును దత్సన్నిధానమునను జ్ఞానప్రకాశమును జనానుకూలశ్రేయస్సులను గావించును. ఎంతెంత సమంత్రకారాధనలు చేకూరునో వేదమంత్రపఠనము ద్ఘోషించునో స్తోత్రాదికీర్తనములు పాడుదురో యంతకంత నీశ్వరకరుణానుగ్రహములు సకలదివ్యసంపత్తులు జనులకులభించును. ఆతపవర్షాది సమ్యగాగమనమును ధనధాన్యలాభమును లోకక్షేమయోగంబులును జేకూరును. సన్మార్గములజనములునడుతురు. దుర్భావదుస్సంకల్పములుగల్గవు. ఉండిన నుపశమిల్లును. వ్యాధులు రావు. అంటువ్యాధులు దేశప్రవేశము చేయవు. ఎల్లవియు నెలమి కొలిపి పొసఁగుపడు. చదువును జ్ఞానమును నాచారమును నీశ్వరభక్తిని సర్వజనము లాదరింతురు. ఇట్లు మంత్రాదులఁబుట్టినశక్తి యనూనమైనిలిచియుండుపొంటె నిరువదియేనేండ్లకొకసారియైనఁ గుంభాభిషేకక్రియల నొనరించుటొప్పు. దానినష్టమంత్రాదిశక్తులు పునరుజ్జీవితములై పొందుపడును. ఇది యాగమవిధానము.

2. దేవాలయమునఁ బూజయు నుత్సవములు శ్రద్ధాసక్తులతో నడవకుండిన వానలుతఱగి కఱవు పెఱుగు. విషవ్యాధులు సంభవించును. ఘాతుకము దొంగతనము మొదలగుదుష్కార్యము లధికములగు.

3. గుళ్లయందు బూజలును మహోత్సవములును జక్కఁగ నేర్పుతో నడుచుపొంటెఁ బూర్వకాలమున వేదాగమవేత్తలు సుభక్తులు నగువారిని నర్చకులుగ నియమించుచుండిరి. వారు చొక్కపుఁగనికరము నెక్కొనసదాచారశీలురై యోగాభ్యాసమున నుత్తమదీక్షులం బడసి యీశ్వరకైంకర్యము చేయుటయు నీశ్వరుఁడు నెమ్మది శాంతిల్లి భక్తజనక్షేమంకరుఁ డగుచుండు.

ఈశ్వరప్రసాదప్రవాహము పాఱుచుండు. సద్విద్య వెలుగు చుండు. అట్లుకాక, వేదాగమశాస్త్ర పరిచయ విహీనతతోడను, సదాచార దూరతతోడను, వేదమంత్ర రాహిత్యముతోడను జేయునారాధనలు భస్మహోమము లట్లు నిష్ప్రయోజనములు గావే.

4. తొల్లిఁ బూజావిధుల నడపిన యౌన్నత్యమును గూర్చి పెక్కుమాటలఁ బలుకవలయునే. మనదేశము మేలుపదవికి రావలయుననికోరి యాస్థతో దేహధనప్రాణదత్తమున శ్రమపడు మాతుశ్రీ అనిబెసంటాంబ వచనంబుల బ్రదర్శించెద. చూచి గమనింపుఁడు. "పూర్వకాలమున దేవగృహము లున్నయున్న తస్థితిని నేమనికొనియాడుదు. కోవెలలందీశ్వర తేజస్సు వ్యాపించి నిండియుండె. దేవతాసాన్నిధ్యము వెలుంగుచుండె. గుళ్ళలోనికి వచ్చుభక్తులకు దేవతాకరుణ ప్రసన్నమగుచుండె. స్వామి దర్శనకాంక్షులైలోని కరుగు నొక్కొక్క భక్తునియందు శ్రద్ధాభక్తులతిశయింపఁ బ్రపంచభావములు మఱఁగిఁ బారమార్థిక భావంబులుదయించఁ దమంతట నిరాటంకముగ స్తోత్రగానము లుప్పతిల్ల, స్వర్గవాసులకుంబలె సద్భావములు దోఁచ, దేవునికరుణ జనుల కవతరించుచుండె. భక్తివిశ్వాసములులేని వాఁడేని గుళ్ళలోఁ బ్రవేశించినంతట నంమఁ దాండవమాడు సంపూర్ణ కరుణారసముచేతను నీశ్వర విగ్రహముననుండి నిర్గమించు తేజశ్శక్తిచేతను దాను దుదముట్టమాటె యానందమనుభవించును."

"ప్రాచీనకాలమున నివ్విధము పారిశుద్ధత నిండియుండె. జ్ఞానశీలము లర్చకులందు నిరంతరము మూర్తీభవించియుండె. వారరజ్ఞానముతో మంత్రములఁ బఠించువారు. దివ్యాగ్నితత్తశుద్ధములగు మనోవాక్కులులేని వారర్చింపకుండిరి. భక్తజనంబు భక్తితోఁ దెచ్చునివేదనముల నర్చకులు పవిత్రకరంబులఁగొని దేవునకు సమర్పింపఁగా నానివేదనము లధికశ్రేయస్సులంగాంచి

భక్తులంజేరి వారిననుగ్రహపాత్రులం జేయుచుండె. ఆలయ
మూర్తిశక్తియెందును బరఁగియుండు. అగోచరులయ్యుఁ బూ
జ్యమూర్తులు మంత్రఘోషములందు గానములందుఁ బూజలందు
మనుజులతోఁగలసి సలుపుచుండిరి. ఇది కలకాదు. నిక్కముగ
మానవులు దేవసాన్నిధ్యము ననుభవించుచు వచ్చిరి. ప్రతిష్ఠిత
మూర్తులు గుఱుతుగ సంజ్ఞగ నీశ్వరలక్షణవిశేషముల వెలుంగఁ
జేయుటయ కాక, తచ్ఛక్తియు వెలుంగుచుండె. ఆశక్తియందలి
యుత్తమగుణము కరుణయనియు నవరగుణము శాంతియనియు
నెఱుంగఁదగు. ప్రకృతిశాస్త్రజ్ఞులు పార్థివ పదార్థమునఁ గాం
తశక్తినిజొనిపి దానిస్పర్శమున లోకుల రోగములఁ బాపుదురు.
ఆవిధమున నీశ్వరానుగ్రహ పాత్రులగు మహర్షులు దేవతాశక్తిని
సిద్ధిపూర్వకముగఁ బిడసి ప్రతిమలందు నారోపించి ప్రాణప్రతిష్ఠ
ముఖ సంస్కారములచే వానిశక్తి వెలుంగఁజేసిరి. కావుననట్టి
శక్తియుక్త విగ్రహారాధనచే లోకులుపశాంతి పొందుచుండిరి.
భక్తుల స్థూలసూక్ష్మోపాధుల యణువులు విగ్రహాశక్తి విశేషము
వలన సౌమ్య స్పందనము లందుచుండె.'' అని శ్లాఘించి పలికె.

మనదేశమునందు, నందులో ముఖ్యముగఁ జెన్నపురికి దక్షి
ణమునందు, నుండు పెద్దగుళ్ళఁజూచిన వాని యౌన్నత్యము గోచ
రమగును. విస్తరమండపములు సుందరానేకగోపురములు మొద
లగు కట్టడముల నిర్మించుచో నంతకుమున్నుజనుల భక్తిశ్రద్ధాగు
ణంబు లెంతవర్ధిల్లి యుండనోపు. అట్లుండుటకు నీశ్వరసాన్ని
ధ్యమును బ్రత్యక్షానుభవమున నెంతమట్టు జనులయందు నెక్కొని
యుండవలసె. అట్టిప్రత్యక్షానుభవము గలుగుటకు నెంతటి మ
హాపురుషులు వేదాగమవిధివిధానమున నాలయములఁ బూజాది
కైంకర్యముల భక్తితోఁ జొక్కమున నమర్చుచుండ వలసె.

5. అప్పుడున్న దేవాలయముల యున్నతస్థితియు నిప్ప
టిస్థితియు సరిపోల్చి చూడఁగా నెన్నఁగ నెన్నఁగ మనస్సు తల

రును; కన్నుల నశ్రుధారలు గాఱు; నయ్యో! యెంతటి చెడ్డ కాలము వచ్చెనని మనము వాపోవవలదే? మనదేశమున వానకురియుటలేదు. పదిపదునొకండు వత్సరముల కొకక్కతడవ నియమించినట్లు కరవేర్పడెడు. విషవ్యాధులగు స్ఫోటకమును వాంతిభేది మనదేశమునఁ గాపురమున్నవి. ప్లేగను నశుభవ్యాధి నవీనముగఁబుట్టి యిందుఁబాయక నిలుతునని భయపఱచెడు.

ఆలయములలోను వెలిని నొకరీతిగ నుండెడు. ఎట్టిశక్తియుఁ బ్రసాదమునులేక తొలంగెను. అట్లయ్యు నొకకొన్నిగుళ్ళయందు భక్తులభక్తిచేఁ బూర్వశక్తి విశేషమింక నిలిచియుండెడు. అదియు వెడలిపోవఁ బూనినట్లు మలినమగుచున్నది. దానికారణము లేమనఁగా దేవాలయ ధర్మకర్తలయుఁ బూజారులయు దురాచారమును నజ్ఞానమును భక్తిక్షయమును వేదాగమశాస్త్ర పరిచయమునఁ గొఱయుననునవియే. కోవెలలన్ని చీకటిగుహలయ్యె. ఏకాంతకాంతామణి సంచారార్హములుగాని యాలయము లున్నవి. స్త్రీజన రక్షణలేని గుళ్ళలో నీశ్వరప్రసన్నత యుండునే. శాస్త్రోక్తారాధనలులేవు. వేడుకలు, నాటలుఁ, బాటలు, మనస్సును గవియు పలుతెఱంగులగు విషమవిషయములు, నట్టిప్రవర్తనలు, సకలేంద్రియోద్రేక భాజనములగు పదార్థములను దఱచుగ నందున్నవి. పెక్కు-చెడు సరకులఁగల యంగళ్ళు పొడసూపుచున్నవి. ఈయయుక్తపదార్థ ప్రదర్శనమున వ్యర్థముగ రచ్చలు ముచ్చటలు చర్చలుపుట్టి (పోలీసు) యారెకుల ప్రచారమున కెడ మిచ్చుచున్నవి. ఈదుర్గతికిఁతోడై గ్రామాంతరములందుఁ గుళ్ళకుఁ బూజలునిలిచె. ముఖ్యపత్తనములనుండు గుళ్ళయందును దూష్యులగు నర్చకులచే విధివిరోధముగఁ బూజల నడపెదరు. వేదమంత్రముల నొకక్కఁడేనిఁ బూజాసమయమునఁ బఠింపరు. రుద్రము చమకము పురుషసూక్తము మొదలగు మహామంత్రములు శివవిష్ణు నామావళులు చదువరు. ఇవిలేక

బూజ లుపయోగములుకావు. వెండియు గుళ్ళయందుండు కొ
ఱంతలుఁ జెప్పఁబూనిన నంతముకలదే. వినువారికి విసుకుపుట్టు.

## II. సంస్కరించువిధము.

6. ఇఁక నెమ్మెయి నీయాలయములు మున్నున్నయున్నత
పదవికి వచ్చు? వానికిందగు దిద్దుపాటు లెయ్యవి? వానినింగొంత
విచారింతము.

(1) ఒక్కొక్క పెద్దదేవస్థానమునఁ బూర్వమున్నట్లు
వేదాధ్యయన పాఠశాల యొకటియు దేశభాషయందుఁ గీర్తన
లుఁ బాటలు మొదలగునవి నేర్పించు బళ్లును సరస్వతీవిలాసమను
వేదాగమ శాస్త్రపురాణేతిహాసాది గ్రంథశాలయు నేర్పఱచ
వలయును. దేవాలయమునకు ముఖ్యమగునది పూజ. దానిని
వేదాగమవేద్యులు సదాచారులునగు నర్చకులే చేయవలయును.
పూజాకాలముల శ్రోత్రియులగు బ్రాహ్మణులు రుద్రము చమకము
పురుషసూక్తము మొదలగు మంత్రముల జపింపవలయును. అ
ర్చకులు ముఖ్యులుగాన వారిని శిక్షించుటకు వేదాగమ పూజా
విధుల నేర్పుబడి యొక్కటేని నొకమండలమునకు (జిల్లాకు) నుండ
వలయును. ప్రతిదేవస్థాన మొకబడినిఁ బెట్ట శక్తిలేకుండిన
మండలముననుండు నాలయములన్నియుఁ గలసి యొకదాని నడు
పవలయును. అదిసాధ్యమగును. ఈబడులందుఁ జదువుబాలు
రకు నన్నవస్త్రము లియ్యవలయును. ఆపాఠశాలాపరీక్షలం
దుఁ దేఱినవారినే గుడిలోఁ బూజింప నియమింపవలయు. వారికి
నధికముగ సంబళమియ్యవలయును. వంశానుగత బాధ్యతనుండు
వారీపాఠశాలలందుఁ జదివి తేఱునట్టి ప్రోత్సాహములఁ గల్పింప
వలయును. ఇట్టికార్యములకై ధనమియ్యవలయును. అట్టియోగ్య
త లేనివారిని గుళ్ళలో నర్చకులుగఁ జేయరాదు.

(2) ఒక్కొక్క దేవాలయంబున నభిషేకపూజాకాలము లందు రుద్రము చమకము పురుషసూక్తము నామావళి మొదలగు నవి చదువ నొక్కని నేని యిద్దఱ నేని వేదవిత్తులగు విప్రులనియమిం చవలయును. వేదమంత్రము లుచ్చరించు నావర్తిసంఖ్యకుఁ దగి న శ్రేయస్సు గలుగును. మఱియు భక్తిరసప్రధానములగు పాటలఁ బాడు గాయకుఁ డొక్కఁడేని గుడికుండవలయును.

(3) ఇప్పుడ నేక ముఖ్యక్షేత్రములందు నాటుకోటసెట్లు వే దశాస్త్ర పాఠశాలల నేర్పాటుసేసియున్నారు. వానియం దాగమశాస్త్రంబునుం గఱప నుపాధ్యాయుల నియమించి వాటి యం దర్చకులఁ జదువునట్లు శాసించవలయును. దేవస్థాన వి చారణకర్తలును వేదాగమ శాస్త్రతత్త్వముల సామాన్యముగ నేసి గ్రహించవలయును. వారు సచ్ఛీలురుగను నిశ్చలభక్తులుగ నుం డవలయు.

(4) ఉత్సవాదుల నధికడంభముగఁ జేయక శాస్త్రవిధినిఁ దొలఁగకుండ నడుపవలయును. ఆకాలములందు వేదాదిపారా యణమును దత్కాల స్థితికిఁదగినట్లు భక్తిజ్ఞాన వైరాగ్యము లభి వర్థిల్ల విద్వాంసులచే నుపన్యాసములను జేయించవలయును.

(5) మఱియుఁ జెల్లుబడిగల దేవాలయంబులం దాకాల మున విద్వత్సభల నియమించి వేదాగమ పరీక్షలంజేసి విద్వాం సులకు సంభావనల నియ్యవలయును. ఉత్సవములిప్పుడు నడచు నట్లు రాజసతామసగుణ భూయిష్ఠములు గాక సాత్త్వికములు గా వలయును.

(6) ఉత్తరమునఁ దీర్థములు ముఖ్యములగునట్లు దక్షిణ మున క్షేత్రములు ముఖ్యములు. ఈక్షేత్రములు యోగశాస్త్ర తత్త్వములు వెల్లడియగునట్లుకట్టఁబడినవి. దానిచే నచటికిఁబోవు వారికి నాయర్థములు తోఁచి స్మృతికివచ్చి తత్స్మరణమున సద్భావ ములును శరీర సంస్కారములును గలుగునని మహాత్ములట్లు తత్త్వ

ర్థములతోడ నిర్మించిరి. కావున విద్యాభ్యాసమెట్లు ముఖ్యమో యట్లు, దేవాలయ గమనమును ముఖ్యము. మఱియు మిక్కిలి జీర్ణించినంగాని వానిని సమగ్రముగఁ బడఁగొట్టి కట్టుటమంచిది గాదు. ఏలననఁగా నెందఱో మహానుభావులందుఁ బూజించి దేవునిగీర్తించి యాయుత్కృష్టకీర్తనములచేతను వారియుత్కృష్ట తేజస్సుచేతను నాక్షేత్రమునసద్భావములనిలిపి పవిత్రముగఁ జేసిరి. కడ, వెళ్లఁబడఁగొట్టిన నాశక్తినశించును. కావున సాధ్యమగు నేనిఁ బురాతనక్షేత్రములందుఁ బడిచెడిన భాగముల బాగుసేసి నిలుపఁ గూడు వానిని నిలుపుటయే శ్రేయస్కరము.

(7) ఒక్కొక్క గ్రామమునందును నొక శివాలయము నొక విష్ణుమందిరముండును. లోకసంపద లోసంగ విష్ణుగుడి యు జ్ఞానసంపదలియ్య శివునికోయిలయు నాదియందుఁ బెద్దలు నిర్మించిరి. వానిలో ననేకములు పడిపోయినవి. వానిని గట్టించి కాపాడవలయు.

(8) ఒక్కొక్క పెద్దగుడియందును జనప్రయోజనమునకు నాయుర్వేద వైద్యశాలయొకటి యుండవలయు.

(9) మంచిస్థితికిఁ దేవలయుమనను నిశ్చయబుద్ధితో నొకధర్మ కర్త నిర్వ్యాజప్రయత్నము సేసినేని నింకను ననేక సంస్కార ములు మనస్సునస్ఫురించును. అన్నియుఁజక్కగా నడువవలయు నేని దేవస్థానాధికారులకుఁ జొక్కపుభక్తియు శ్రద్ధయు నుండవ లయు. ఇవిలేనిచో నెన్నియేదిద్దుపాటులబోధించిననవి నిష్ప్రయో జనములేయగు. మఱియునొకగుడి మంచిస్థితియందుండక పూజా దుల విధ్యుక్తక్రమంబున నందకయున్ననాపాపమునకు దేవస్థానా ధికారులుపూటపడుటయకాక యాయూరివారును భాగరులయ్యెద రు. కావున దేవస్థానకైంకర్యములు చక్కగాబొంచుపడునట్లుకఁ అ గలిగియుండవలయు. పూజాక్రమమున నేదేనివక్రములు దప్పు లు తోఁచినప్పుడా దేవస్థానమునకు ముఖ్యముగ సంబంధించిన

యధికారులకు దెలుపవలయును. వారాలకింపని పక్షములందు న్యాయస్థానమున న్యాయము కోరవలయును. వార్తాపత్రికలందుఁబ్రచురము సేయ్యవలయును.

(Translated from Mr. P. Narayana Aiyer's Tamil essay by
V. GOPALAYYA).



సగుణధ్యానమునుగురించి.

సగుణమనగా గుణముతోకూడినది. సామాన్యజనులందరికి వస్తువునధిష్ఠించిన గుణము గ్రాహ్యమగుచున్నదిగాని, కేవల గుణము గ్రాహ్యమగుటలేదు. తీపు అనునది గుణము. తియ్యని గుణము. ఒకవస్తువుతో చేరియుండినపుడు తెలియదగును. బెల్లము, పంచదార, చెరుకు, ఖర్జూరపుపండు, మామిడిపండు, అరటిపండు, పనసపండు, లడ్డు, జిలేబి మొదలగు వస్తువులందంతయు తియ్యనిగుణమున్నది. ఒక్కొక్క వస్తువులోనుండు తియ్యని గుణము భేదముగా నుండుగాని ఒకటే విధముననుండదు. ప్రతి వస్తువులోనుండు తియ్యనిరుచి వేరని అందరికి తెలిసినదే. ఒక్కొకవస్తువును భుజించినపుడు ఆవస్తువునందుండు తీపుగ్రాహ్యమగును. సమస్తతియ్యని వస్తువులందుండు తీపునకుమూలమగు వస్తురాహిత్యమైన తియ్యనిగుణము సామాన్యజనులకు గ్రాహ్యము కాదని సర్వజనానుభవము. వస్తురాహిత్యమైన సకలగుణములకు మూలకారణమగు నవ్యక్తధ్యానమునకే నిర్గుణ ధ్యానమనిపేరు. దీనిని ధ్యానించుట సామాన్యజనులకు సులభముకాదు. అట్లుధ్యానించుటకు ప్రయత్నించుటచే కడుబాధపడుదురు.

శ్లో॥ క్లేశోధికతరస్తే షామవ్యక్తాసక్తచేతసామ్ ।
అవ్యక్తాహిగతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥

అనఁగా అవ్యక్తమును ధ్యానించుట కపేక్షించువారికి దుఃఖము లధికముగనుండును. దేహధారులకు అధికకష్టములుగలుగకనే అవ్యక్తనిష్ఠ సిద్ధింపదు.

ఈకారణమునుపట్టి యేసగుణధ్యానము దేహధారులకు సుకరమని చెప్పఁబడినది. సగుణధ్యానమన్నను, సాకారధ్యానమన్నను, మూర్తిధ్యానమన్నను ఒకటే. వీటిలో తారతమ్యము లేదు. సమస్త సుగుణములకు అధిష్ఠానము ఈశ్వరుడు, గనుకనీశ్వరధ్యానము సగుణధ్యానములలో శ్రేష్ఠమని చెప్పఁబడినది. ఈశ్వరునియందు యేగుణమునైనను ఆరోపింపవచ్చును. ఇతరయేవస్తువునందుగాని అట్లారోపించుటకు సాధ్యపడదు. ఈశ్వరునిపరమదయానిధియనియందురు. సర్వవిధములైన దయను ఈశ్వరుఁడు కలవాఁడని ధ్యానించవచ్చును. తల్లులకు పిల్లలందుండు దయయొకటి, భార్యలకుభర్తలందుండుదయమఱియొకటి, తండ్రికి పుత్రులందుండు దయవేఱు, రాజులకు భృత్యులందుండు దయప్రత్యేకము, గురువుకు శిష్యులందుండు దయయింకొకటి. దయాగుణలక్షణము వేర్వేరు భావముల ననుసరించి వేర్వేరురీతినుండును. స్త్రీకి తనభర్తయందును, పుత్రునందును ఉండుదయ యొకటేయని తలంచుటకు శక్యముకాదు. భర్తభార్యయందుండు ప్రేమచే సమీపించిస్పృశించినపుడు భార్యకుగలుగు దేహమనోభావము వేరు. తనశిశువు తల్లియందుండు ప్రేమతో సమీపించి స్పృశించినపుడు జనించు దేహమనోభావములువేరు. కాఁబట్టి ఈశ్వరుఁడు తప్ప ఇతరుఁడెవ్వఁడుగాని సర్వదయోపేతుఁడని చెప్పుటకలవికాదు. ఈశ్వరునైతేనో సకలదయోపేతునిగా భావించుటకు నేలాటిబాధకమును యుండదు.

శ్లో॥ త్వమేవమాతాచపితాత్వమేవ ।
త్వమేవబంధుశ్చ సఖాత్వమేవ ॥

త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ ।
త్వమేవ సర్వం మమ దేవ దేవ ॥

తల్లియు నీవె, తండ్రియు నీవె, బంధువు నీవె, సఖుఁడును నీవె, విద్యయు నీవె, ద్రవ్యము నీవె ఓ దేవ దేవ! సర్వమును నీవె యని స్వామిని ధ్యానింతురు గదా. ఇదియు త్త్రోత్రుగా చెప్పిన శ్లోకము కాదు, కాదు కాదని ముమ్మాటికిఁ జెప్పవచ్చును. ఎందుకన, నిజముగా నీశ్వరుని ధ్యానించుటచే నీశ్వరుని ప్రత్యక్షముగా పొందిన వారికి తల్లికి శిశువునందుండు దయచే శిశువుకు కలుగు ఆనందమును, తండ్రికి పుత్రుని యందుండు దయచే పుత్రునికిఁ గలుగు నానందమును, బంధువులకు పరస్పరముండు దయచే కలుగు ఆనందమును, స్నేహితులకు పరస్పరముగా నుండు దయచే కలుగు ఆనందమును, సమస్త విద్యలు నేర్చిన దానిచే కలుగు నానందమును, భార్యాభర్తలకుండు పరస్పర దయచే కలుగు ఆనందమును, ఏకకాలమందు సమష్టిగా ప్రత్యక్షానుభవమునకు వచ్చునుగనుకనే ఆరీతిన స్తోత్రము చేయుచున్నారు.

కొందఱు జగత్పతియనియు, కొందఱు హృదయేశుఁడనియు, కొందఱు దీనబంధువనియు, కొందఱు జగద్గురువనియు, కొందఱు అనాధరక్షకుడనియు, మఱికొందఱు ఆర్తత్రాణుఁడనియు, ఇట్లు పలు తెరఁగుల వారి వారి మనోభావములను బట్టి ధ్యానింతురు. స్తుతియును చేయుదురు. ఎవరెవరే యేభావములచే ధ్యానింతురో తదనుగుణముగనే ఈశ్వరుడు ఆనందమిచ్చును. సగుణధ్యానముచే, క్రమక్రమముగా నిర్గుణధ్యానము లభించును. సగుణధ్యానము విడిచి ప్రారంభమందే నిర్గుణధ్యానము లభింపజాలదు.

శ్రీకృష్ణమూర్తి ఉద్ధవునికి సగుణధ్యానమునుండి యెట్లు నిర్గుణధ్యానమును పొందశక్యమగునను విషయమును గురించి శ్రీమద్భాగవతము, ఏకాదశ స్కంధమందిట్లుపదేశించినారు.

శ్లో॥ తత్సర్వ వ్యాపకం చిత్తంఆకృష్యైక త్రధారయేత్।
నాన్యానిచింతయే ద్ధ్యాయస్సుస్మితంభావయేన్ముఖం।
తత్రలబ్ధ పదంచిత్తం ఆకృష్యవ్యోమ్ని ధారయేత్।
తచ్చత్యక్త్వామదాగ్లో హ్యా నకించిదపిచింతయేత్।
ఏవంసమాహిత మతిర్మామే వాత్మాన మాత్మని।
విచష్టేమయిసర్వాత్మ జ్యోతిర్జ్యోతిషిసంయుతం।
ధ్యానేనేద్ధం సుతీవ్రేణయుంజతేయోగినోమనః।
సంయాస్యత్యాసునిర్వాణంద్రవ్యజ్ఞానక్రియాభ్రమః॥

సమస్త ప్రదేశములందు వ్యాపించిన చిత్తమును ఆకర్షించి ఒకచోటనుండి, అనగా నొకరూపమందుంచి వేరొక పదార్థము మును స్మరించకుండవలయు. అట్లు ఆపాదమస్తకమువరకు ధ్యానించుచుండ, ఆరూపమందే మనసు చలించక నిలిచినపుడు క్రమముగా ఆరూపముయొక్క ఒక్కొక్క అంగమును ధ్యానమునుండి వదలుచు, చివరకు చిరునవ్వుతో యుక్తమగు ముఖమునుమాత్రము ధ్యానించవలయు. ఆహాసన్ముఖమందునిలిచిన చిత్తమునులాగి హృదయాకాశమందుంచవలయు. ఇట్లుహృదయమందు ఆముఖమును ధ్యానించుచుక్రమముగా దానిని ధ్యానించుటయువదలి ఏదియు చింతించకుండవలెను. అనగా గాఢనిద్రయందేరీతిన ఈభూలోక సంబంధమైనదేదియు స్మరణకు రాకుండుచున్నదో ఆరీతిననే బాహ్యవస్తువేదికాని స్మరణకు రాకుండుస్థితిని పొందవలయును. ఇది అత్యంతోత్కృష్టస్థితి. ఈస్థితిని పొందువరకు నిర్గుణధ్యానము పొందనలవిగాదు. పైనుదాహరించిన శ్లోకమందు "నకించిదపి చింతయేత్" అని చెప్పియుండుట యీస్థితికివచ్చుటే. భగవద్గీత యందు శ్రీకృష్ణమూర్తి అర్జునునికికూడ నీస్థితిని పొందుమని ఉపదేశించినారు.

శ్లో॥ శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యాధృతిగృహీతయా।
ఆత్మసంస్థంమనఃకృత్వానకించిదపిచింతయేత్॥

ఉపనిషత్తులందును యీస్థితిని పొందవలయునని చెప్పబడినది.

శ్లో॥ ఖంమధ్యేకురుచాత్మానమాత్మమధ్యేచఖంకురు ।
సర్వంచఖమయం కృత్వానకించిదపిచింతయ ॥

శ్రీశంకరాచార్యులవారు గీతాభాష్యమందు "నకించిదపిచింతయేత్" స్థితికివచ్చుటే యోగముయొక్క పరమావధియని చెప్పినారు. అనగా నెన్నియోగములుఅభ్యసించిననుఆస్థితికివచ్చుటకేయనియర్థము. దీనినేతురీయ్యావస్థయని చెప్పుదురు. ఈప్రకారము మనసును స్వాధీనపరచుకొని పరమాత్మస్వరూపుడైన నన్ను జ్యోతి, పరంజ్యోతిలో నైక్యమైనట్లెవరు ధ్యానింతురోవారుశీఘ్రము గాద్రవ్యజ్ఞాన క్రియలందు భ్రమవదలి ముక్తిజెందుదురని శ్రీకృష్ణులుద్ధవునికుపదేశించినట్లు శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధము పదునాలుగవ అధ్యాయమందు చెప్పఁబడినది.

దీనిముఖ్యాభిప్రాయమేమన ఎందాకనింద్రియ గోచరంబులగు బాహ్యవస్తువులను గురించిన స్మరణయుండునో అందాక పరమాత్మజ్ఞానము కలుగుటలేదని యర్థము. సామాన్యముగ జనులందరికిగాఢనిద్రయందు తప్ప వేరుసమయమందు బహిర్ప్రపంచస్మరణయుండకుండదు. గాఢనిద్రయందు బహిర్ప్రపంచ స్మరణలేదుగదా అప్పుడెందుకు పరమాత్మజ్ఞాన ముండదని అడుగవచ్చును. నిద్రయందు తత్వము తెలియదు. "నిద్రాతత్వమజానతః" అనిమాండూక్యోపనిషత్తునుడువుచున్నది. నిద్రయందు తత్వము తెలియదుగాని ఏలాటిదేహమనోదుఃఖములు గానియుండవు. పుండువల్లగాని లేకయితరవిధమైనదేహబాధవల్లగాని, నష్టమువల్లగానిఅవమానమువల్లగాని, సమీపబంధువులమరణమువల్లగానిఅనుభవించుదుఃఖములేవి యునిద్రయందు గన్పడదు. అయితేజ్ఞానమేమో యుండదు. తురీయమందుఅనగా "నకించిదపిచింతయేత్" స్థితికితానేధ్యానాభ్యాసముచేపొందినపుడు బహిర్ప్రపంచవిషయవాసనలేకుండుటే గాక ఆత్మానుసంధానముకలుగును. గనుక నేవివేకులందరు బాహ్యానుస

ధానమును వదలుకొనుటకు ఏకాంతమున దినదినమును అభ్యసించుదురు.

శ్లో॥ బాహ్యానుసంధిః పరివర్ధయేత్ఫలం, । దుర్వాసనా మేవతతస్తతోధికాం । జ్ఞాత్వావివేకైః పరిహృత్య బాహ్యం । స్వాత్మానుసంధింవిదధీతనిత్యం॥ బాహ్యే నిరుద్ధేమనసః ప్రసన్నతా । మనఃప్రసాదేపరమాత్మదర్శనం । తస్మిన్ సుదృష్టేభవబంధనాశో బహిర్నిరోధోపదవీవిముక్తేః ॥

అనివివేకాచూడామణియందు చెప్పబడినది. అనగా బాహ్య వస్తువులను స్మరించినట్లంతయు దుర్వాసన అనగా కామక్రోధాదులు వృద్ధియగుచునేయుండుచున్నది. గనుకనీవిషయము తెలిసి వివేకులు బాహ్యవస్తుస్మరణవిడచి ఆత్మాను సంధానముచేయవలయు. బాహ్యవస్తుస్మరణను నిరోధించుటచే మనసుప్రశాంతమగును. మనసుశాంతమగుటచే పరమాత్మదర్శనమగును. దానిచే ముక్తిలభించును. గనుక బాహ్యవస్తునిరోధమేముక్తిహేతువని తాత్పర్యము.

బాహ్యవస్తునిరోధమును అభ్యసించువారు ప్రతిదినమును యేకాంతముగా నొకగదిలోకూర్చుని సంధ్యావందనాదులుగాని పూజలుగాని, ధ్యానముగాని చేయవలయును. ఇప్పుడనేకులు సంధ్యావందనాదులుచేయునట్లు సకలవ్యవహారములుసలుపుచు అభ్యసించినకైన యెన్నిజన్మములకును ఆస్థితిలభింపదు.

హిందువులలోనెవరుగాని పరమాత్మను సాక్షాత్కరించుకొనుటకు వారివారిఅధికారమును (యోగ్యతను) పట్టిధ్యానాదుల పద్ధతులనేర్పరచి యుంచినారు. అందరునిర్గుణధ్యానము చేయవలయుననిన అదిసాధ్యమగునా? ఆపద్ధతులేవియన.

శ్లో॥ అగ్నిర్దేవోద్విజాతీనాం మునీనాంహృదిదైవతం ।
ప్రతిమాస్వల్పబుద్ధీనాం సర్వత్రవిదితాత్మనాం ॥

బ్రాహ్మణులకు అగ్ని దైవమనియు మునులకు హృదయమున దైవమని యు, మందాధికారులకనగా సామాన్యజనులకు ప్రతిమ(విగ్రహము) దైవమనియు, ఆత్మవేత్తలకు సర్వము దైవమనియు పైశ్లోకాభిప్రాయము.

బ్రాహ్మణులు అగ్నిముఖముగా హోమాములుచేసి సమస్తదేవతలను తృప్తిజెందించి సకాలమునకు వర్షములుకురిపించుచు, లోకమునకు నీతిబాధలేవియు లేకుండునట్లు సర్వజనక్షేమమును చూచుచుండవలెననియు, మునులుహృదయమందుపరమాత్మనునిలిపి ధ్యానించవలెననియు, అల్పబుద్ధిగలవారు ప్రతిమార్చనలచే ధ్యానించుచు అభ్యసించవలెననియు, ఆత్మవేత్తలై తేనో సమస్తమును దైవముగా చూడవలెననియు తాత్పర్యము.

శ్లో॥ "యోమాంపశ్యతి సర్వత్రసర్వంచమ యిపశ్యతి ।
తస్యాహంన ప్రణశ్యామి సచమేనప్రణశ్యతి" ॥

అని శ్రీభగవద్గీతావచనము. ఈశ్లోకాభిప్రాయముతో దీనికి తరువాయిసంచికయందు ప్రారంభించి ధ్యానవిషయము ముగింపబడును.

## యుగసంధి.

## IV. కలిలక్షణములు.

ఐదువేలపదిసంవత్సరములు గలియుగ మారంభమయి కడచె. ఇంకనుఁ బెక్కేండ్లుసెల్లును. అట్టులయ్యు ముఖ్యమగు యుగకాలమున నవాంతరయుగములుండునని సూచించియుంటిమి. జ్యోతిషమున గ్రహములదశ లందొకటి దానిలోఁ దొమ్మిదిగ్రహముల కంతర్దశ లుండునట్టు లొకటి-యుగమున గృతత్రేతాద్వాపరకలియుగ చక్రము లనేక పర్యాయములు వచ్చుచుండును. అట్టి నాలుగుయుగముల చక్రమొకట్టి యయిదువేలేండ్లకు ముగిసె.

శ్లో॥ కలౌ పంచసహస్రాంతే జాయతే వర్ణసంకరః ।
కలౌ ఖలు భవిష్యంతి నారాయణ పరాయణాః ॥

ఇత్యాదిప్రమాణములంబట్టి ఇప్పుడునడచునది యవాంతర కృతయుగమని పెద్దలుచెప్పుదురు. కృతత్రేతాద్వాపరయుగంబులందును గలియుండెనని యితిహాసంబుల వలనఁదెలియవచ్చు. నలుఁడు త్రేతాయుగమునఁ గలిపీడితుఁడయ్యె. ద్వాపరంబునఁ గలిదుర్యోధనునందుజనించె. అవ్విధమునఁ గలియుగమందు నవాంతరకృతయుగ మిప్పుడు నడుచునని పెద్దలు వచింతురు.

కలియుగారంభ మియ్యదియని నిర్ణయించుటయు సులభము గాదు. శ్రీకృష్ణునిపాదారవిందములు పుడమినుండునందాఁకఁ గలి భూమిం జేరకయుండి కృష్ణావతారనిర్యాణమున వృద్ధుఁడై ప్రవేశించెనని వ్యాసులు వ్రాసిరి. అప్పటికిఁ గలికెన్నియేండ్లయ్యెనో దెలియదు. మఱియు నిష్కళంకభక్తితో భక్తులుగూడి హరిభజన సేయుచోటు లందుకాలదేశ నియమము లేక కలిప్రవేశింపకుండు. ఏము హరిహరభక్తుల మని ధర్మధ్వజులయ్యుఁ గలివర్తనంబుల (జగడముల) గ్రచ్చలాడువారిని యథార్థభక్తిశూన్యులని గణింపవలయు.

కలియుగమునకు జగడములకాలమనియర్థము. కలివంశపరంపర శ్రీభాగవతమున నిట్లున్నది. అధర్మునకు మృష (బొంకులు) యనుభార్యయందు దంభుండు మాయ యనునంగనయుంబుట్టి యధర్మసంతానంబగువారిరువురును మిథునంబైరి. వారినిసంతానహీనుండగు నిరృతిగైకొనియె. వారలకు లోభుండును నికృతి (స్వకార్యపరత్వము) యనుసతియునుం గలిగి మిథునంబైరి. ఆమిథునమునకుఁ గ్రోధుండు హింసయనునంగనయుంబుట్టిమిథునంబయ్యె. ఆమిథునమునకుఁగలియు దురుక్తి (యపవాదము) యనునతివయు జన్మించి దాంపత్యంబుఁ గైకొనిరి. ఆదంపతులకు భయమృత్యువులు పుట్టి మిథునంబైనవారికి యాతనయు దుఃఖము నిరయంబునుం(నర

కము) బుట్టిరి. వీరలు సంసారహేతువగు నధర్మతరుశాఖలై నె గడిరి. వీని శ్రేయస్కాముండగుజనుం డీషన్మాత్రంబు ననువర్తింప జనదు. ఇప్పుణ్యకథ నెవ్వండేని ముమ్మాటువినినవతండు పాపర హితుఁడగు.

ఇట్లు కలిపూర్వులు ప్రకటిత దుర్గుణులని దెలియఁదగు. వెండియు ధర్మంబునకుఁ గృతయుగంబున నాలుగుపాదంబులై తప శ్శౌచ దయాసత్యంబులు నెగడెనని ప్రథమస్కంధమునను సత్య దయాతపోదానంబులు నెగడెనని ద్వాదశస్కంధమందును జెప్పఁబడు. ఈనాలుగుపాదంబులచేధర్మంబు స్మయ సంగమ దానృతంబుల విఱుగఁగొట్టె. ద్వాదశస్కంధమున నియ్యవి యనృత హింసాఽ సంతోష విగ్రహములనంబడు. పరీక్షిత్తు పాపహేతువైన కలిరూపుమాప నుద్యోగించిన వాఁడుభయవిహ్వ లుండై రక్షింపుమని మ్రొక్కి నరేంద్రా నేనెక్కడనుండుదు నాన తిమ్మనిన రాజన్యశేఖరుండు ప్రాణివధ, స్త్రీ, ద్యూత, పానంబు లనియెడు నాలుగుస్థానంబులనిచ్చి మఱియు నడిగిన సువర్ణమూలం బగు నసత్య మద కామహింసా వైరంబులనియెడి పంచప్రదేశం బుల నొసంగి యితర స్థలంబుల స్పృశింపకుండ నియమించెనట్లు కలినిగ్రహంబు సేసె. వెండియుఁ గొండొకయెడ నర్థంబునఁ బమ్మనేననర్థంబులు పుట్టుననియున్నది. కావున నధర్మ మర్థ మూలంబని యర్థాశ విడువవలయు.

ఇఁకఁ గలిలక్షణంబులు దేశంబున నెట్టులగఁబడుననునది విచారింతము. రాజ్యవిషయంబున రాజులనేకులై దుర్బలులై కతిపయ గ్రామాధిపతులై

మ॥ ధరణీరక్షణ మాచరింపక నృపుల్దర్పంబునంబశ్యతో ।
హరులై సాధులఁద్రోచిచేకురుతదీయస్త్రీధనక్షేత్రముల్ ।
హరియింపంగలవారు దారుణతరంబై పెల్లుఁజెల్లుంబర ।
స్పరవైరంబుధరాతలేంద్రులకువిశ్వప్రాణినాశంబుగ_ ॥

కం॥ అరుల మిగులఁ గొని రాజులు ।
నరులకు నెంతయును భయ మొనర్తురు ॥

మఱియు నొక్కదేశమున నేఁడొక్కవంశము రేపొక్క కులము నేలు. రాజవంశంబులు నీటిబుగ్గలవలె బెల్లునఁబుట్టి గిట్టు. చోరభయంబు మెండగు. ఇది కలియుగమున రాజ్య విషయిక లక్షణంబు. భారతఖండమున నేఁబదియేండ్లకు ముందు న్నస్థితి యిట్టిదకదా. అట్టిదశ (1858 సం॥) యాంగ్లేయరాజ్య స్థాపనమున నంతమయ్యె. అప్పుడు రాజ్యవిషయమునఁ గృత యుగము వచ్చెనని చెప్పనగు.

మఱియు వర్ణాశ్రమ నియమములందు నాచారమునందుఁ గలిలక్షణంబుల వివరించెద. అందుఁ దొలుత వర్ణసంకరమును వ్యాపార సంకరమును బేర్కొనందగు. మనుమతంబున జన్మ లక్షిత వర్ణసంకరమునకంటె వ్యాపారలక్షితసంకరము నింద్యతర మగు. భారతమున.

గీ॥ అశేషవర్ణు లన్యోన్య ।
పీడ సేయుచును విభిన్నబుద్ధి ।
నొక్కఁడొకని మేర నుండక వర్ణసం ।
కరము సేయఁగలరు కలియుగమున ॥

అనియున్నది. స్పర్ధాయుక్తవైరమునసూయయుఁ బుట్టు. బ్రాహ్మణ స్వభావముగలవారు శూద్రయోనియందును శూద్ర స్వ భావముగలవార లుత్తమ కులంబుల నుదయింతురు.

"ధరణీసురులు గడగి వాణిజ్యము కరిసనమును జేయఁగల్గు రు కలికాలమునఁ" ఇదియే వర్ణసంకరము. నిక్కంబగు ధనాశ నెక్కొనినతండు తా నైశ్యుఁడని పేరిడికొని ధనమార్జింపరాదే. ఆచందమునఁదా బ్రహ్మచారియని మెలఁగుచు మెలఁతలపొందునఁ దిరుగువాఁడును, దా గృహియని మనికిఁగొని యతిథిపూజనుఁ బం చ యజ్ఞంబుల విడిచి భిక్షుకియై పరుల వేచుచుండువాఁడును, దా

సన్యాసినని జడలఁదాల్చియు ధనభోజనవనితాలోలురై రాజ్య
వైభవాభిలాషులై దేశాటనముఁ జేయువాఁడును, నాశ్రమ సంక
ర మొనరింతురు. వర్ణాశ్రమ సంకరములవలన నిర్ణీత జీవన
ములుదప్పి జనులు క్షామరోగ పీడితులగుదురు. మఱియుఁగలి
వశంబున నల్పపదార్థమునకై యామరణాంతము గురుభ్రాతల
తోనేని పోరాడుటయు, గురువుల నవమానించుటయు బిడ్డలు తం
డ్రుల రక్షింపకుండుటయు, జనములల్పాకారు లల్పాయువులగుట
యు నత్యంత బాల్యంబుల బిడ్డలం గనుటయు నతిభోజన ప్రియు
లగుటయు, పంటయు పాఁడియు దఱుగుటయుఁబుట్టు. పూ
జనీయ దేవపితరులయెడ నవమతియు సమానజనులతో సాంగత్య
ము విడుచుటయు దీనులయెడ దయఁజూపక తిరస్కరించుటయు
వేయేల నెల్లెడల స్వకార్యధురంధరత్వము ప్రబలును. జూదము,
సమయభంగము, మాంసాహారము, ధనదేవతారాధన, పానంబు
బలవంతంబులగు. ధనమే పూజ్యత పడయు. ధనహీనుఁడెట్టి
సదాచారుఁడయ్యు నిందింపంబడు. ఇట్టిదుర్గుణంబులు భరత ఖం
డమునఁ గలిపంచ సహస్రాంతమున నిబిడమై నిలిచెనని మీరెఱుం
గరే చెప్పవలయునే. ఇఁకఁగృతయుగమున కర్హులమగుదుమేని
యీదుర్గుణములఁ బాపుటయవశ్యము.

అధ్యాత్మ విషయంబునఁ గలిలక్షణంబులు గనఁబడును.
దైవస్మరణతప్పనియు అనివార్యకర్మవిధానము లేదనియు వాదించి ని
చ్చమెయివర్తింతురు. పాషండదర్శనులును హేతువాదులును బ్రబ
లుదురు. నిరీశ్వరవాదంబుల జనహృదయములు మలినములగు.
వేదంబులఁ బుక్కిటిపురాణములని నిందింతురు. మూఢభక్తుల వి
ద్యలనివానిని నిరాకరింతురు. వివిధదర్శనులకుఁగలి (జగడము) కలు
గు. జాతివిరోధము మెండగు. ద్వైతాద్వైతవిశిష్టాద్వైతులపోరాట
మువడగలతెంగలల కలహములు మహాయనహీనాయనుల సంగ్రా
మము ప్రాటెస్టాంటు కాథలికుల కలతలు పెల్లగు. నిరుపయోగము

లగు బాహ్యాచారముల భేదములు ముఖ్యములని పాటించి తమవి హె చ్చని రొచ్చులాడుదురు. ముఖ్యమగు నేకాత్మజ్ఞానము గ్రహింపనొల్ల రు. జాతికుల మేధా గర్వంబుల జేసి శ్రీకృష్ణునివాక్యము నెవ్వఁడె వ్వఁడు నన్నునెట్టులెట్టు ల్లర్చించు నతని నేనట్టులట్టు లాదరింతున నుదాని మఱతురు. ఇట్టివి కలిలక్షణంబులైన నయ్యవి భారతఖం డమున ముప్పదియేండ్లమున్ను ప్రబలియుండెనని యెవ్వ రెఱుంగరు. ఇప్పుడును నాలక్షణములు గోచరములు గాకపోవు. స్వార్థరక్ష ణార్థమై యొక్కొక్కజాతియు సమకట్టి ప్రత్యేకసభల బ్రత్యేక సాధనంబుల నేర్పఱచు. భారతఖండము సౌఖ్యములేని దుర్దశ యందున్న దనుటకేమి సందేహము. రాజపుత్రులొక్కసభను గూర్చిరి. వైశ్యసమాజముండు. కాయస్థులు, సింహులు, జై నులు, నామశూద్రులు వంగదేశమునఁ బృథక్సదస్సుల నిర్వహించె దరు. దక్షిణభాగమున నబ్రాహ్మణసభయు నున్నది. వెండి యులింగాయత్తులు, తియ్యులు, నాయరులు, బ్రాహ్మణులు, తొండ మండలవల్లాలురు, సానారులు, మహమ్మదీయులు, వక్కలిగులు ని ట్లు పెక్కుభంగుల భంగపడి సభలంగుమిగూడి ప్రత్యేకించువారై రి. దానంజేసియంతరంగమైత్రి వర్ధిల్లిన మేలయగుంగాని ముఖ్య వర్ణములకుఁ బరస్పరస్పర్ధాకారణంబులైన నయ్యవి కలికృత్యంబు లేయనందగు.

ఇట్టి త్రివిధకలి లక్షణంబులఁ బడఁగొట్ట రెండుసాధనము లేర్పడె. మున్ను వచించినట్లు రాజ్యవిషయిక కలికిహంతయై నాంగ్లేయరాజ్య స్థాపనము గుదిరె. ఏకచ్ఛత్రాధి పత్యమునఁ గలుగుమేలు లగఁబడవె. నానాజాతులు గలిసిమెలఁగు. జా తి దురభిమానంబులు తగ్గు. చట్టములు తుల్యములై నానాకుల ములఁ బ్రవర్తించుటంజేసి జనుల సమత్వ మధికమగు. మార్గ యానములు సులభములై యన్యోన్య సుఖదుఃఖవార్త లతిశీఘ్ర మునఁ దెలిసి దయాగుణం బభివర్ధిల్లు. రాజ్యాంగ విషయములఁ

జర్చించి తెలుప సభలుకూడు, విద్య వెలయు, జగద్ధితబుద్ధి నెగడు. సత్యన్యాయ ధర్మాచరణంబు లవశ్యములని వాదింతురు. దీని కెల్ల నాంగ్లేయప్రభుత్వ మెంతయుఁ గారణంబగు. ఇయ్యది భారత దేశాభిమానులగు దేవతలు ఋషులు సమకూర్చిన మేలకాని వేఱుగాదు.

మఱియొక్క సాధనమును వారొనరించిరి. అది బ్రహ్మజ్ఞాన సమాజము. ఈరెండు సాధనంబులుం జేరి కృతయుగాగమనమార్గము పాటవము చేయు. ఈకలియుగాంతర్గత కృతయుగము వచ్చునప్పుడు భగవదంశ కళావతార ముదయించు. యుగాంతరముల సంపూర్ణ భగవదవతారములు పుట్టునట్టు లంతరయుగ సంధులందు నంశావతారములు జనించు. అంత నెల్లెడల భ్రాతృభావము వర్ధిల్లు. జగడములుమాని యొడంబడికలుమించు. శాంతి యెసఁగు. ఇంక ముప్పది నలువదియేండ్లకా యవతార పురుషుని దర్శనముగలుగు.

మహర్షినిర్మితమగు నీబ్రహ్మజ్ఞాన సమాజము లోకమునం దెల్లెడల నిబిడమై యెల్లమతముల కుదారగుణంబు నెక్కొలుపు. దాన మతవైషమ్యములు నశించు. మతముల (పునాదులు) మూలబంధములు విస్తరిల్లి యన్యోన్యానురాగములు వెలుంగఁగూరిమిఁ గల యక్కసెల్లంద్ర చందముండు. నవతులట్లు కొట్లాడవు. దానంజేసి సకలమతములందలి సమానధర్మంబులు ప్రకటితములై యవియే ముఖ్యాంశములుగావునఁ దద్దీప్తిచే నముఖ్యాంశములును వాక్పారుష్యవాదంబులు మూఢభక్తులు నాఁబడు శలభంబులు దగ్ధములగు. మానవకోటి భగవదంశములగు జీవాత్ములు. మనమీశ్వరుని బిడ్డలము. ప్రజ్ఞావికాసమునకై కర్మవిధానమునకు లోఁబడియుండియు స్వేచ్ఛావృత్తిఁగలవారమై రామకార్యసహాయులగు వానరసైన్యములట్టు లీశ్వరకార్యముల నొనరించువారము. ఈకార్యమే మనప్రజ్ఞావికాసము. కావుననాత్మసమర్పణ

మున నీశ్వరేచ్ఛా ధౌరేయులమై వర్తించుట బాగుగదా. భగవదాజ్ఞచే నర్జునుండు ఖండనంబు సలుపఁడే. మఱియు దేహార్పణంబుగఁ గొలఁదిపనినేని పుణ్యము సేసిన దానం దృప్తిచెంది యీశ్వరుఁడతుల సుఖమ్మును నీకలియుగంబుననిచ్చు.

పైసంచికయందుఁ గృతయుగలక్షణములు చర్చింపఁబడును.

**(Adopted from Mr. T. Sadasiva Aiyar's English paper by V. GOPALAYYA).**

ప్రహ్లాదుఁడు మాతృగర్భస్థుండయి యున్నపుడు నారద మహర్షి యాభక్తశిఖామణికిం బరమానుగ్రహంబున నుపదేశించిన నిర్మలజ్ఞానసార సంగ్రహము.

జన్మము, స్థితి, వృద్ధి, క్షీణత, పరిపక్వము, వినాశముననుషడ్భావ వికారములు దేహమునకేఁగాని యాత్మకులేవు. ఇఁక నాత్మలక్షణము లెవ్వియనిన: నిత్యుఁడు, క్షయరహితుఁడు, శుద్ధుఁడు, క్షేత్రజ్ఞుఁడు, ఆకాశాది పంచభూతముల కాశ్రయుఁడు, క్రియా శూన్యుఁడు, స్వప్రకాశుఁడు, సృష్టిహేతువు, సర్వవ్యాపకుఁడు, నిస్సంగుఁడు, పరిపూర్ణుఁడు, అద్వితీయుఁడునను నీపండ్రెండును నాత్మస్వరూపంబులు. దేహాదులందు మోహజనకంబులగు నహంకార మమకారంబుల విడువవలయు. మూల ప్రకృతియు మహదహంకారంబులును, పంచతన్మాత్రలును నివి యెనిమిదియుం బ్రకృతులు. రజస్సత్వతమంబులు మూఁడును ప్రకృతి గుణంబులు. కర్మేంద్రియంబులయిన వాక్పాణి పాదపాయూపస్థంబులును జ్ఞానేంద్రియంబులైన శ్రవణనయనరసనాత్వగ్ఘ్రాణంబులును మనంబును, పృథివ్యాపస్తేజో వాయురాకాశంబులును నివి పదాఱును వికారంబులు. ఈ యిరువదేడింటను నాత్మ గూడియుండు. మణిగణంబులఁ జొచ్చియున్న సూత్రంబు చం

దంబున నాత్మ యిన్నింటియందునుంజొచ్చి దీపించు. వివేకశుద్ధమయిన మనంబుచే విచారించి దేహంబునందాత్మ వెదుకవలయు. కుసుమధర్మంబులయిన గంధంబులచేత గంధాశ్రయుండైన వాయువు నెఱింగిన భంగిం బ్రకృతిభేదములయిన బుద్ధ్యాదులచేత తదాశ్రయుండగు నాత్మ నెఱుంగందగు.

సంసారము స్వప్నమువంటిది. నిత్యముగాదు. సర్వార్థములును మనస్సంభవములు. గుణశూన్యుఁడగు మహానుభావునికి జాగ్రత్స్వప్నములు సమానములు. గుణాశ్రయంబుచే జననమరణంబులు నిక్కమనిదోఁచుఁగాని జక్కఁగ విచారించిన నయ్యవిలేవు. పురుషునాశ్రయించియుండు నజ్ఞానమును జ్ఞానాగ్నిచే దహించి కర్మవిరహితులై మోక్షసామ్రాజ్యము నొందవలయు.

అదిగావున గురుశుశ్రూషయు సర్వలాభ సమర్పణంబును సాధుజనసంగమంబును నీశ్వర ప్రతిమాసమారాధనంబును హరితత్త్వపఠనంబును వాసుదేవునియందలి ప్రేమయు నారాయణగుణకర్మకథాకర్ణనంబును వైకుంఠచరణ కమలధ్యానంబును విశ్వంభరమూర్తివిలోకన పూజనంబులును మొదలయిన విజ్ఞానవైరాగ్య లాభసాధనంబులయిన భాగవత ధర్మంబులపయి రతి గలిగి సర్వభూతంబులయందు నీశ్వరుండు భగవంతుండాత్మ గలండని సన్మానంబు సేయుచుఁ గామక్రోధ లోభ మోహమదమత్సరంబులం గెలిచి యింద్రియవర్గంబును బంధించి భక్తి సేయుచుండ నీశ్వరుండయిన విష్ణుదేవునియందుల గతి సిద్ధించు.

కావున రాగాదియుక్త మనస్కుండయిన శరీరికి హరిచింతనంబు సంసారనివర్తన కారణంబగు. హరిభజనంబు దుర్గమంబుగాదు. భగవంతుండు సకలప్రాణి హృదయంబులందు నంతర్యామియై యాకాశంబు భంగినుండు. విషయార్జనంబు నిష్ప్రయోజనంబు. మమతాస్పదంబులును, జంచలంబులునగు ధనకనకవస్తువాహనాదులు నిరర్థకంబులు. స్వర్గభోగంబులును పుణ్యా

నుభవ క్షీణంబులుగాని నిత్యంబులుగావు. కర్మంబులు ఫలాపేక్ష రహితంబుగఁ జేయవలయు, కోరిచేసిన సుఖంబులు ప్రాప్తించు. పురుషుండు దేహంబుకొఱకు భోగంబులనపేక్షించు. దేహంబు నిత్యంబుగాదు. తోడరాదు. మృతంబయిన దేహంబును శునకాదులు భక్షించు. ఫలసంగంబునం బురుషుండు కర్మంబు లాచరించి కర్మబద్ధుండయి క్రమ్మఱం గర్మానుగుణ్యంబయిన దేహంబు దాల్చు. అజ్ఞానంబుచేఁ గర్మదేహంబులు విస్తరించు. జ్ఞానంబున మోక్షంబు లభించు. మోక్షప్రదాతయగుహరి సకలభూతంబులకు నాత్మేశ్వరుండు. ప్రియుండు. నిష్కాములై హృదయగతుండైన హరిని నిజభక్తిని భజింపవలయు. లక్ష్మీనాధచరణ కమలధ్యానంబుననెట్టి వాఁడైన ధన్యతంగాంచు. ఈశ్వరుఁడు భక్తిచేఁ జిక్కినట్లు వ్రతదాన శౌచశీలతపాములఁజిక్కఁడు. భగవదనుగ్రహమునకు భక్తింబోలె బ్రాహ్మణత్వాది యుత్కృష్టతలు ప్రధానములుగావు. ప్రపంచమంతయు హరిమయమని భావింతురేని శూద్రులైనను, స్త్రీలైనను, పాపులైనను ఎట్టివారైనను ముక్తికింబోదురు.

## కర్మ పురుష ప్రయత్నములు.

రమారమి 5,000 సంవత్సరముల క్రిందట ధర్మస్వరూపమని చెప్పదగిన భీష్ముఁడు శరశయ్యామీదయుండెను. వారు కర్మస్వరూపమును జక్కగ నెఱిఁగినవారు. వారియనుమతిలేనిది వారికి మరణము రాగూడకుండుటచేతను వారి మరణమునకింక కొంతకాలము జరుగవలసినట్లు వారు తలచినందుచేతను వారిననేకమైన ప్రశ్నలడుగుట కవకాశము గలిగినది. అందులో నొకటి విధియనబడు పూర్వ "కర్మ" యధికమా లేక "పురుష ప్ర

యత్న'' మధికమాయనునది. దీనివిషయమైన సర్వాంశముల దేటపరచి పూర్వకర్మకంటె పురుషప్రయత్న మధికమని వారభిప్రాయమిచ్చిరి.

వారీవిధముగా జెప్పిన మనహిందూదేశములో విధియనఁబడు పూర్వకర్మపురుష ప్రయత్నములకుండు సంబంధము జనులు చాలామట్టుకు మరచిపోయిరి. విధిబల మెక్కువనియు పురుష ప్రయత్నము నిష్ప్రయోజనమనియు నభిప్రాయము బలమయి పోవుచున్నది. ''కర్మ'' అనుదాని స్వరూపము దెలియపరచి దానికి యెంతబలముండునది స్పష్టముగా విచారించి బహిరంగముగా తెలియపరచుట దివ్యజ్ఞాన సమాజమువారియొక్క పనులలో నొకటియైయున్నది. ''కర్మ'' యనుపదమునకు ''పని'' యని యర్థము. పూర్వకర్మనుజేసినట్టి పురుషులైన మనము ప్రస్తుత కాలములోను ''కర్మ'' జేయుటకు శక్తిగలవారము. అట్టిశక్తి పూర్వజన్మములందే మనకు ఉడిగిపోలేదు.

యూరపు దేశములలో ప్రకృతకర్మయనఁబడు పురుషప్రయత్నము మిక్కిలి గొప్పగా భావింపఁబడినను, కర్మస్వరూపమును జదివినతోడనే యూవనులలో కొందరు పూర్వకర్మయెదుట పురుష ప్రయత్న మల్పఫలదమని యభిప్రాయపడుట చిత్రముగా నున్నది. ''పూర్వకర్మ'' జోలికి పోకూడదనుమాటలు పలుమారు వినబడుచుండును. విధియనునది యొకగొప్పదేవతయై దాని యెదుట మనము పలుకకుండ సాష్టాంగప్రణామము లొనర్చవలసినంత భీతియున్నట్లుతోచెడిని. తద్విషయమై ప్రసంగమాత్రమననే చాలా సంకటములు సంప్రాప్తమగు భీతియున్నట్లు కన్పట్టెడిని. ఇదిసరికాదు.

కర్మయనునది భగవదాజ్ఞలలో నొకటిగాన యితరమైన భగవదాజ్ఞల లక్షణములు దీనికి జెల్లును. తల్లివంటివి పిల్లలుండుట భగవదాజ్ఞలలోనొకటి. • అయినను మనుష్యుఁడు తనబుద్ధి

చాతుర్యముచేత నొకజాతిపావురాయిపక్షిని తెచ్చి దానివలన మరి యొకజాతి పావురాయిపుట్టునట్లు జేయును. అడవిలో పెరుగు పుష్పవృక్షముల దెచ్చి వాటికి ఎరువు నీళ్ళు, సూర్యరశ్మి మొదలగు వాటియందు భేదములు గల్పించి చిత్రవిచిత్రములైన వర్ణము వాసనలుగల పుష్పములు బుష్పించునట్లు మనుష్యుఁడు చేయుచు న్నాఁడు. ఈపురుష ప్రయత్నము విడిచినయెడల లేక చేయ కుండినయెడల తల్లి జాతినివిడిచి పిల్లవేరుజాతికానేరదు. ఇట్టి పురుష ప్రయత్నమువల్ల మనుష్యుఁడు భగవదాజ్ఞను మించినవాఁ డుకాఁడు. ఇవ్విధముగానే కర్మయనఁబడు పూర్వకర్మయొక్క సూచనను పురుషప్రయత్నముచేత మార్చుటతప్పుగాదు. అసా ధ్యముగాదు. పూర్వకర్మలనునవి బీజరూపములుగానుండును. మనము కాయవాఙ్మానసములచేత పెక్కు కర్మముల జేయుచుం దుము. వాటిలో చాలామట్టుకు కొత్తజన్మములో బీజములుగా నుండి సమయము తటస్థపడినపుడు వెలువడి ఫలమునిచ్చును. మ నపూర్వ జన్మల కర్మలలో మంచివనేకములు చెడ్డవనేకములు నుండు. ప్రస్తుతమున మనము జేయుప్రయత్నములవలన ఆబీజము లలో కొన్నిటిని నాశనము చేయవచ్చును కొన్నిటిని మార్చవ చ్చును. ఇట్లుచేయుటయే పురుషప్రయత్నమనునది.

ఒకమనుష్యుఁడు వ్యాధిగ్రస్తుడైనపుడు వాని పూర్వకర్మ కొలది వానికి జరుగునని మనమేమియు జేయకయుండరాదు. మనముచేయు పనివలన వానికర్మ బీజములను మార్చవచ్చును. సాధారణముగా ననేకులయందు పుణ్యకర్మపాపకర్మబీజముల బ లములు సమానముగానుండును. అట్టిమనుష్యునికివ్యాధి సంప్రా ప్తమగునపుడు మనమూరకుండక ఔషధసేవ మొదలగునవి చే యించిన పుణ్యకర్మ బీజములుఫలవంతములై వానినిబాగుపడునట్లు చేయును. అటుకాక ఏమనుజునియొక్క కర్మమైనను చాలాచెడ్డ దిగానుండి వానికి దేహారోగ్యము కాగూడనట్లుండినను మనము

చేయుపనివల్ల మనకుపుణ్యము సంభవింపక తప్పదు. ఎట్టి సంద ర్భములలోను మనముపకారము చేయుటవలన మనకును నితరుల కును చాలామంచిది.

ఈపైయంశములు శ్రీయుత అనిబెసంటమ్మగారు వ్రాసిన వ్యాసములలోనుంచి సంగ్రహించఁబడినది. దీనివలన నేర్పడిన సారాంశమేమన యెట్టి సందర్భములలోను మనము మంచిపని జేయుచుండినయెడల మనకును ఇతరులకును బహు మంచిది. "కర్మ! కర్మ!" యని యూరకుండక మనము మంచిపనికెల్లపు డు ప్రయత్నము సేయుచుండవలయును.

ఇట్లు ప్రవర్తించినవారు మనపూర్వీకులనేకులు గలరు. మార్కండేయుఁడుతన కల్పాయువని తెలిసియు తనప్రయత్నముచే త స్థిరజీవియాయెను. సావిత్రిదేవి పూర్వకర్మవలన భర్తమృతు డయ్యెను ఆయమ మంచి ప్రయత్నముచేత తనభర్తను బ్రతికించు కొనెను.

గు రు దా సు డు.

-:0:-

ఈపత్రిక జూన్ నెల సంచికయందు జం. శ్రీనివాసరావు గారు వ్రాసినవ్యాసమునకు "ధ్యానము" అని శిరోనామమిడినది పొరబాటు. "హింసాధర్మములు" అని సవరించుకొనవలయు.

-:0:-

చెన్నపురిరాజధానిమధ్య జిల్లాల దివ్యజ్ఞానసమాజశాఖల సభ ఈ సం॥రం ఆగస్టునెల 20, 21 తేదులలో కడపజిల్లా మ దనపల్లెయందుఁ జేరగలదు. శ్రీమతి అనిబెసంటమ్మగారు దయచేసి యగ్రాసనమును స్వీకరింతురు. బయటనుండు వచ్చెడువారికి మదనపల్లెశాఖాసమాజమువారు స్వాగతమొసంగి యాతిథ్యము నివేదింతురు.

## ప్రకటనలక్కు ద్రవ్యనిర్ణయములు

| | | | పూర్తిపేజి | అర్ధపేజి | కాల్ పేజీ |
|---|---|---|---|---|---|
| సంవత్సరమునకు | ... | రూ. | 40 | 30 | 20 |
| 6 నెలలకు | ... | ,, | 24 | 18 | 12 |
| 3 నెలలకు | ... | ,, | 18 | 9 | 6 |
| నెలకు | ... | ,, | 5 | 4 | 3 |

## ఇతర పత్రికలు.

"బాల" నీతి, మత, విద్యావిషయములనుగూర్చి ముచ్చటించు మాసపత్రిక. తపాలాఖర్చుగాక సంవత్సరమునకుచందా మూడణాలుమాత్రమే. ఆ. జగన్మోహన రాయ్, మచిలీ బందర్ అనివ్రాయవలయును.

## విన్నపము.

మాపత్రికను పుచ్చుకొనుచుండు వార్లలో కొందఱుమాత్రమే చందాలు పంపినారు. కొందఱు పత్రిక తమకక్కఱలేదని తెలియపఱచిరి. మఱికొందఱు పత్రికల వెనుకకుఁబంపిరి. వీరికందఱికిని వందనములు. బహుమంది చందా సొమ్ము చెల్లించక పత్రికకావలయునని అక్కఱలేదని పలుకక నెమ్మదిగా సంచికలు పుచ్చుకొని చదువుకొనుచున్నారు. ఈపత్రికయొక్క సంపాదకులు, ఉపలేఖకులు, కార్యనిర్వాహకులు, చిల్లరపనిచేయువారు అందరును వేతనములులేక ధర్మార్థముగా పనిచేయుచున్నారు. కాకితములమ్ము వర్తకులును, అచ్చువేయు ముద్రాక్షరశాలాధికారియు, తపాలాఫీసువారును నటులజేయసమ్మతింపమిచే మాచదువరులకు కొంచెము ప్రయాస మివ్వవలసియున్నది. ఇది లోకోపకారార్థమై తలచుకొన్న కార్యముగాని వేరుగాదు. సంవత్సరమున కొకరూపాయ యివ్వజాలనివారెవరు? శక్తిలేనివార్లకు పత్రికను ఉచితముగా బంపెదము. తక్కినవారందరునుదయచేసి వెంటనే చందా సొమ్ము పంపవలయునని ప్రార్థించెదము. లేనియెడల ఆగష్టుసంచిక వాల్యూపేబుల్ తపాల్‌లో పంపఁబడును.

పరమాత్ముని నరసింహయ్య,
చిత్తూరు.

Registered No. M. 716.




# దివ్యజ్ఞాన దీపిక

( పూర్వమున "హంస").

**A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.**

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక

(సత్యమునకంటె వేఱగు ధర్మములేదు).

సంపుటము 1. { **August 1910.** ఆగష్టు నెల 1910. } సంచిక 5.

## విషయసూచిక.



సం॥రమునకు చందా 1 రూపాయ.

CHITTOOR, N. A. DT.:—PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
FOR P. NARASIMHA AIYYAGARU, *Publisher.*

ఓం.

# దివ్యజ్ఞాన దీపిక.

(సత్యమునకంటె నెక్కుఁడగు ధర్మములేదు).

సంపుటము 1. { August 1910. ఆగష్టు నెల 1910. } సంచిక 5.

## నరజన్మము.

లోకములో ప్రతిమనుష్యునకును 'నేను' అనుభావము కల మగదా. పండితోత్తములును, పామరజనులును, ధనవంతులును, బీదలును, బాలురును, వృద్ధులును, అన్నిదేశములవారును, సమస్తమతములవారును, సర్వవర్ణస్థులును, స్త్రీలును, పురుషులును, ఎల్లవారును నట్టిభావమును కలిగియుందురు. సుఖముగనున్నప్పుడును బాధపడునపుడును నేస్థితినున్నను నెచ్చోనున్నను నయ్యది వదలకుండు. బాల్యకౌమారాది శరీరావస్థలు మారినను నది విడువదు. 'నేను బాల్యమునందు మిగుల కష్టపడితిని. యౌవనము సుఖముగ గడపితి. ఇపుడు ముసలివాఁడనై యున్నాను.' అని ఒకానొకఁడనును. జాగ్రదాద్యవస్థలు మారినను నదిస్థిరముగనుండు. 'నేను రాత్రి కొంత సేపు సుఖముగ నిద్రించితి. తెల్లవారుజామున నొక స్వప్నముంగంటి' అని వేఱొకఁడు సెప్పు. ఇట్లు కాలముమారినను, దేశముమారినను, అవస్థలుమారినను, బంధుమిత్రాది పరివారము మారినను, సంపదలుమారినను నేననెడు వస్తువుమాత్రము బాల్యప్రభృతి ఆమరణాంతము నిలుకడయై యుండు. ఇంతియకాదు. 'నేను పూర్వమేజన్మమున నేమిచేసి

తినో ఇప్పుడనుభవించుచున్నా' ననెడి దీనవాక్యము వినుటలేదా? జన్మములుమాఱినను నదిమాఱుటలేదు. ఇవ్విధమునఁబురుషు నికిఁగల సమస్తము మాఱినను తానుమాత్రము మాఱక సర్వకాల సర్వావస్థలయందును నేకరీతిననిలిచి జన్మజన్మముల నంటివచ్చుచు నేనను శబ్దమునకు వాచ్యమైన పదార్థమెయ్యది? అయ్యది శరీర మందమా? లోకములో 'నాశరీరము' అనెడు సంజ్ఞయున్నదిగాని నేనేశరీరమని యెట్టివెట్టియుం దలచఁడు. పూర్వజన్మమున నిప్పటి శరీరముండినది కాదుగదా. కావున నయ్యది దేహము గాదు. ఇఁకనది మనస్సని యెన్నదమా? సామాన్య వచనము లందును 'నామనసు' 'నీమనసు' అని జనులు వ్యవహరింతురు గాని నేనేమనస్సనెడు వ్యవహారము లేదు. అదియునుంగాక మనస్సు చంచల స్వభావముగలది. దానివృత్తులుక్షణభంగుర ములు. అదినిత్యముగాదు. కావున శరీరమున కంటెను మనస్సు కంటెను విలక్షణమై వానికాశ్రయమై, వానివ్యాపారములకుం గారణమై నిత్యమగువస్తువు మఱియొకండుండవలయు. దాని నాత్మయంద్రు, జీవుఁడను సంజ్ఞయుంగలదు.

జీవుఁడన నెవ్వఁడు ? వానిస్వరూపమెయ్యది ? జీవుఁడీశ్వ రునియంశమని శ్రీకృష్ణమూర్తి భగవద్గీతయందు (15 వ అధ్యాయ ము 7-వ శ్లోకమున) నర్జునునకుపదేశించె. చకచకఁగా బ్రజ్వలింపు చుండు నగ్నిజ్వాలనుండి మిణుగురులు వెలివడునట్టు లీశ్వరునుం డి జీవులు వెలివడుదురని ముండకోపనిషద్వాక్యము బోధించుచు న్నయది. అట్లగుటంజేసి యీశ్వరునికిని జీవునకును స్వరూప మునందైక్య భావమైయుండు. కనకపర్వతమునుండి యొకబంగా రపుతునుక వెలిదీసినచో నత్తునుకకును పైడికొండకును వస్తుభేదము లేని చందమునను, సముద్రమునుండి యొకపాత్రలోనికి గొంత జలంబుదీసికొనిన నజ్జలంబునకును సముద్రోదకంబునకును భేదము లేని తెఱంగునను అఖండ సచ్చిదానందస్వరూపుఁడైన పరమాత్మ

కును తదంశభూతుఁడై యొప్పు జీవాత్మకును వస్తుభేదమించుకయు లేదు. ., జీవాత్మస్వరూపము భగవద్గీతయందిట్లు వివరించఁబడి యున్నది.

శ్లో॥ నజాయతే మ్రియతే వాకదాచి।
న్నాయంభూత్వా భవితావానభూయః।
అజోనిత్యశ్శాశ్వతోయం పురాణో।
నహన్యతేహన్య మానేశరీరే॥

జీవాత్మకు జననమరణాది వికారములులేవు. నిత్యుఁడు, శాశ్వతుఁడు, పురాణుఁడు, శరీరమునశించినను తానునశించఁడు. భగవంతుని మహిమాతిశయంబులెల్లను జీవునియందు కారణ రూపంబున నిగూఢంబై యుండు. ఇదియ వృక్షబీజన్యాయంబునాఁ బరగు. వృక్షాంగంబులగు వ్రేళ్లు, బోదె, కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పుష్పములు, ఫలములులోనుగాఁగలవన్నియు బీజమున నెట్లుడఁగియుండునో నట్లుంగి నీశ్వరశక్తియంతయు జీవునియందు గోప్యమైయుండు. బీజాంతర్గతంబగు వృక్షము బహిర్వ్యాపకము గావలసినచో దానినొక క్షేత్రమున నాటి యుచిత సన్నివేశముం గల్పించి యెరువువేసి నీళ్లుపోసి కాపాడుట యెట్లులావశ్యకమో అట్లెఱింగున జీవునియందు గూఢమైన భగవచ్ఛక్తి బహిర్గతంబు గావలయునేని యోగ్యంబగు క్షేత్రంబున జీవుని నెలకొలిపి యుచిత సంస్కారంబు లొనర్పవలయు. అట్లగుటం జేసియేగదా భగవద్గీతయందు "ఇదంశరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే" ఈశరీరము క్షేత్రమనఁబడునని శ్రీకృష్ణస్వామి సెలవిచ్చె. వ్యష్టియందు శరీరము క్షేత్రంబగు. సమష్టిని నీబ్రహ్మాండము క్షేత్రమననొప్పు. జీవుఁడను విత్తనమును ప్రకృతియను క్షేత్రమున క్షేత్రస్వామియగు నీశ్వరుండు ప్రతిష్ఠించు. జీవుఁడవ్విధంబునం బ్రకృతిబద్ధుఁడై దానివలన కారణసూక్ష్మస్థూలంబులగు శరీరత్రయంబుం గల్పించుకొని నిజస్వరూపముమఱచి జ్ఞానమించుకయు

నులేక కేవలము మూఢదశయఁదువచ్చి యీభూలోకమునంజేరు. ప్రథమమున బహుకాలముదనుక పాషాణాది స్థావరమ్ము లితనికి నివాసంబైయుండు. అప్పుడు జీవుఁడేమియు నెఱుఁగక యెట్టి చలనమును లేక నిర్జీవివలె యుంచినచోటనుండి కదలకుండు. దీర్ఘ కాలానంతరమున తరుగుల్మలతాదులంజొచ్చి పెక్కు వేలేండ్లు గడపు. అచ్చోనించుక చలన శక్తిగలుగు. ఆహారవాంఛ పొడసూపు. శీతోష్ణాదిద్వంద్వవిభేదజ్ఞానమంకురించు. పిమ్మ టతిర్యగ్యోనులం బ్రవేశించిపశుపక్ష్యాది రూపంబులం బుట్టుచుఁజ చ్చుచు నెంతోకాలంబునవయు. అట్టియెడనంతకంతకు బహిఃప్ర జ్ఞవికసించి నేనుదాననియెడువివేకముజనించి స్వవిషయ పరవిషయ జ్ఞానమొకింతగలిగి క్రమక్రమంబుగ నింద్రియ వ్యాపారములు ప్రా ఢిమంగాంచు. కామక్రోధాదులు బలిష్టంబులైగుదురు. ఇట్ల నేకయుగంబులు గడిచినపిమ్మట జీవుఁడుమనుష్యజన్మంబున కర్హుం డగు. ఇవ్విధంబునజీవులు నానాయోనులంబుట్టుదురు.

శ్లో॥ జలజానవలక్షాణి దశలక్షాణిపక్షిణః।
త్రింశల్లక్షంగవాశ్వాద్యాః స్థావరాణాంచవింశతిః।
క్రిమయోరుద్రలక్షాణి చాతుర్లక్షాణిమానవః।

ఈప్రకారము క్రమక్రమంబుగ నభివృద్ధిఁజెంది మానవ కోటింజేరినజీవుఁడు మఱల స్థావరతిర్యగ్యోనులయందుమజన్మమెత్తుట లేదు. భూపతనమైనశిశువు మరలమాతృగర్భములోనికిం బ్రవేశిం చునే? అన్నిజన్మములలోను నరజన్మముసర్వోత్కృష్టమైనది. అ య్యది సులభముఁగలభించునదికాదు.

కం॥ మానుషదేహముకలుగుట।
భూనాయకదుర్లభంబు బుట్టినమీదన్।
దానముపరోపకారము।
భూనుతకీర్తియును వలదెపురుషునకెందున్॥

## ధ్యానము.

దీనికి వెనుకటి సంచికయందు సర్వమును వాసుదేవునిగా (బ్రహ్మముగా) చూచెడిస్థితికివచ్చుటే ధ్యానముయొక్క పరమావధియని చెప్పుచు

శ్లో॥ యోమాంపశ్యతి సర్వత్ర సర్వంచమయిపశ్యతి।
తస్యాహంనప్రణశ్యామి సచ మేనప్రణశ్యతి ॥

ఈశ్లోకమును ఉదాహరించియుంటిమి. భగవద్గీతయందు జగద్గురువైన శ్రీకృష్ణభగవానులు తనప్రియశిష్యుఁడైన అర్జునినికిదియుపదేశించినారు. ఎవఁడు అంతటనునన్ను (వాసుదేవుని) నాయందు (వాసుదేవునియందు) అన్నిటిని చూచుచున్నాడో వానికి నేను నాకు వాఁడు ప్రత్యక్షస్వరూపులుగానుందుమని తాత్పర్యము. ఇదిధ్యానమునకు ముఖ్యఫలము. ఇదిఅనుభవమునకు వచ్చుట సులభమా? ఈశ్వరుఁడంతట వ్యాపించియున్నాఁడని నోట అందఱు చెప్పగలరుగాని ప్రత్యక్షానుభవజ్ఞులు కోటికొకరుగాని అగపడరు. ఇట్లుచూచువారెవరో వారే అద్వైతులుగాని, నోటమాత్రము "సర్వంఖల్విదంబ్రహ్మ, నేహనానాస్తికించన" అని యుచ్చరించుచు కామక్రోధాదులు, ఆశాపాశములువిడువక సర్వవిషయలోలురుగా నుండువారు అద్వైతులెప్పటికినికారు. దీనికొక కథ చెప్పుదురు. పూర్వము కనకదాసనెడు ఒకపరమభక్తుఁడుండెను. ఆయనఆకాలమందుండిన వ్యాసరాయస్వాములశిష్యుఁడు. ఆస్వాములవారాయనయందతిప్రేమగలవారై, మఠమునందుండు నితరశిష్యులందరికంటె వీనియందు విశేషముగాదయచూపుచు, మాటిమాటికిపిలచి సద్విషయములనుగుఱించిమాటలాడుచు సమీపమున కూర్చుండబెట్టుకొనుచు, పూజాసమయమందు బ్రాహ్మణులతో బాటుసాన్నిధ్యమునకురానిచ్చుచు, ఏకాంతమున రహస్యపు సంగతులంగఁజెప్పుచుండిరి. స్వాములవారిట్లు జాతియందు

శూద్రుఁడైన కనకదాసునందింత విశ్వాసముచూపుచుండినది మఠ
ములోనుండు బ్రాహ్మణులైన యాచార్యుల కెవరికి సమ్మతముగా
నుండలేదు. మఱియువీనియందందఱికి నసూయతకలిగియుండెను.
దానిచేత స్వాములవారి పరోక్షమందు వీరందఱు కనకదాసుని
తిరస్కరించుచు, కేవలము హీనముగాఁజూచుచుండిరి. ఈసంగ
తి స్వాములవారికి తెలిసి కనకదాసుయొక్క జ్ఞాన విశేషమును
మఠములోనుండు నజ్ఞానులైన యాచార్యులకందఱికి నగుపరచవ
లెనని సమయము నిరీక్షించుచుండిరి. ఇట్లుండగా సంచారము
చేయుచు నొకనాడొక గ్రామమునకు వెళ్ళిరి. ఆగ్రామ నివాసు
లందఱు స్వాములవారిని సమస్తమర్యాదలతో పిలుచుకొనివచ్చి త
గిన ప్రదేశమందుదించి భిక్షలుచేయ నారంభించిరి. ఒకశిష్యుఁ
డు భిక్షకుపిలచి స్వామినివేదనమున కనేకగుత్తు లఱటిపండ్లు స
మర్పించెను. స్వాములవారు వానినంగీకరించి స్వామికినివేదన
చేసి యాప్రసాద మందఱికి నివ్విధమున పంచిరి. పురాణము
చెప్పు నాచార్యులను, దేవతార్చనచేయు నాచార్యులను, హరికథ
చెప్పు నాచార్యులను, వేదాంత శాస్త్రవాదమందు నిపుణులైన
యాచార్యులను, తర్క, వ్యాకరణ, సాహిత్యాది శాస్త్రములం
దు పండితులని గణనకెక్కిన యాచార్యులనందఱింబిలచి ఒకొ్క
క్కఱికి రెండేసి యరటిపండ్లిచ్చి యీఅరటిపండ్లెవరును లేని
చోటతిని తమకు మరునాడు చెప్పవలెనని ఆజ్ఞచేసిరి. అవ్విధ
మున నే కనకదాసుని పిలచి రెండుపండ్లిచ్చి ఆయాజ్ఞయే వాని
కొసంగిరి. రెండవనాఁడు పండ్లుపుచ్చుకొన్న ప్రతిశిష్యుఁడును
తానుతినినచోటు స్వాములవారికి చెప్పుచు, ఆచోటునం దెవరు
గానియుండలేదని ప్రమాణమునుచేసిరి. అందరు స్వాములవా
రికి విన్నవించికొనినవెనుక, కనకదాసువచ్చి తనకిచ్చిన రెండు
పండ్లను స్వాములవారి పాదసన్నిధియందుంచి ముకుళితహస్తుఁడై
నిలిచెను. స్వాములవారదిచూచి, ఏమిరా, నేనీపండ్లను తినుమని

ఆజ్ఞ చేసియుండ, తినకయట్లనే తెచ్చియిచ్చుటకు కారణమేమని అడుగఁగా కనకదాసు వినయభయభక్తి పూర్వకముగా నిట్లు విన్నవించికొనెను. మహాస్వామీ ! ఎవ్వరును లేనిచోట తినుమని నాకాజ్ఞయిచ్చితిరి, నేను వెతకివెతకి వేసరి అట్టిచోటుకానక పాద సన్నిధియందు పండ్లనునిచితిని. నేనెక్కడపోయినను ఎంచుచూచినను వాసుదేవుఁడగపడుచున్నాడుగాని వాసుదేవుఁడు లేనిచోటు నాకెక్కడను గన్పడలేదు. దానిచే నేనీపండ్లను తినలేదని చెప్పెను. అప్పుడాచార్యులనందఱినిచూచి, కనుగొంటిరా మీకును కనకదాసునకునుండు తారతమ్యము, వాఁడుశూద్రుఁడని తిరస్కరించుచుంటిరే వానిజ్ఞానమునకు, మీజ్ఞానమునకుండు భేదము తెలిసికొంటిరిగదా. ఇంకనైనను వానిని తిరస్కరించుట మానుఁడనిచెప్పుచు సాదశ నొందవలసియున్న నందఱికి సులభమాయని,

శ్లో॥ “బహూనాంజన్మనామంతే జ్ఞానవాన్మాంప్రపద్యతే ।
వాసుదేవస్సర్వమితి సమహాత్మాసుదుర్లభః ॥

జ్ఞానవంతుఁడు అనేకకోటిజన్మముల కావలసర్వము వాసుదేవుఁడని నన్నుపొందుచున్నాఁడు. అట్టిమహాత్ముఁడు కేవలముదుర్లభముఅని శ్రీభగవద్గీతయందుశ్రీకృష్ణులుపదేశించినట్లుచెప్పబడినదని స్వాములవారు తమమతశిష్యులకు ఈశ్లోకార్థముబోధచేసి కనకదాసును తిరస్కరించకుండఁజేసిరని చెప్పుచున్నారు, కనుక “అహం బ్రహ్మాస్మి, సర్వంఖల్విదంబ్రహ్మ”యనెడు వాక్యములుచ్చరించువారి నంతటచూడగలముగాని నిజముగావాసుదేవుని నంతటచూచువారిని చూడగలమా? అట్టివారికిరాగమెక్కడిది, ద్వేషమెక్కడిది, తిరస్కారపురస్కారములెక్కడిది, “నాసిద్ధాంతమెక్కువ, నా సిద్ధాంతమెక్కువ” యనెడిఅభిమానమెక్కడిది. వారుసర్వదా ఆనందమేఅనుభవించుచు, అంతటనుఆనందమే చూచుచుందురు.

శ్రీశంకరాచార్యులు అంతటను వాసుదేవుఁడున్నట్లు, అన గా సర్వం బ్రహ్మయని ధ్యానించుస్థితి సనకాదులు వంటివారికే లభించునని హరిమీడే స్తవమందుదాహరించినారు.

శ్లో॥ "యద్ద్వేద్యంవస్తుసతత్త్వం విషయాఖ్యం।
తత్త్వద్బ్రహ్మేవేతి, విదిత్వాతదహంచ।
ధ్యాయంత్యేవంయంసనకాద్యాముసయోః।
జంతంసంసారధ్వాంతవినాశం హరిమీడే" ॥

అనగా విషయములని పిలువబడు వేద్యమగు సమస్తవస్తువులు బ్రహ్మమేయని తెలిసి అదినేనని, ఏతత్త్వమును సనకాదిమునులు ధ్యానించుచున్నారో, ఆసంసారధ్వంసుఁడగు హరిని నమస్కరించెదనని శ్రీశంకరాచార్యులు వారు పైశ్లోకము చేస్తుతించినారు.

సర్వముబ్రహ్మయనెడి భావము పరమమునులగు సనక సనందనులవంటి మహానుభావులకు పట్టుపడునుగాని అందరికిసాధ్యమెప్పటికిని కాదు. ఇదినిజమనుటకు సంశయమేమాత్రము లేదు. భాష్యాదులుచదివి వేదాంతవాదములందు సమర్థత చెందియుండు వేదాంతులు విషయవస్తువులను విషయవస్తువులుగా చూచుచున్నారుగాని బ్రహ్మముగా చూచుట లేదని వారినడతనుపట్టి అతిదృఢముగా చెప్పవచ్చును. కనుక సామాన్యులకు సర్వముబ్రహ్మయని ధ్యానించుటకు సాధ్యము కాదు. అయితే ప్రతిజీవుఁడును సర్వమును బ్రహ్మగా ధ్యానించుస్థితిని పొందుటకే సర్వప్రయత్నములు చేయవలసినదని ముఖ్యధర్మము. ఎట్లులా ప్రయత్నము చేయవలెనన:—

మొదట తానెవఁడైనదియు తెలిసి ఇతరులయందుండు "తాను" అనునదిఒకటేయని గుర్తెరిగి తనయందుండు "తాను" అనుపదార్థమునకును యితరులందుండు "తాను" అనుపదార్థమునకును భేదమేమాత్రము లేదని స్వానుభవమునకు తేవలెను.

శ్లో॥ యస్తుసర్వాణి భూతానిఆత్మన్యేవానుపశ్యతి।
,సర్వభూతేషుచాత్మానంతతోనవిజుగుప్సతే।
యస్తుసర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః।
తత్రకోమోహః కశ్శోక ఏకత్వమను పశ్యతః ॥

ఎవఁడుసమస్త భూతములను తనయందును సర్వభూతములందు త న్నుఁజూచుచున్నాఁడో వాఁడు జుగుప్స చెందడు. ఎవఁడు సకలభూత ములను తనవలెనే తెలియుచున్నాఁడో వానికి మోహ మెక్కఁడిది, శోకమెక్కఁడిదని ఈశావాస్యోప నిషత్తునుడువుచున్నది. భగవ ద్గీతయందును "యోమాం పశ్యతిసర్వత్ర" యను శ్లోకముపదే శించుటకుముందు శ్రీకృష్ణభగవానులు.

శ్లో॥ సర్వభూతస్థమాత్మానంస ర్వభూతానిచాత్మని ।
ఈక్షతేయోగయుక్తాత్మాసర్వత్ర సమదర్శనః ॥

అనెడు శ్లోకము నుపదేశించినారు. అంతటను సమదృష్టి గల యోగయుక్తుఁడు తన్ను సకల భూతములందును తనయందు సకలభూతములను చూచుచున్నాఁడని తాత్పర్యము. అట్టివాఁడే, అనగా ఆత్మవేత్తే బ్రహ్మవేత్తయగు ననుటయే సిద్ధాంతము. ఆ త్మయనెడు (త్వం లేక అహం) పదార్థ జ్ఞానము లేనివాఁడు (తత్ లేక బ్రహ్మ) పదార్థము నెప్పటికినియెరుగజాలఁడు. ముం డకోప నిషత్తునందును ఇట్లనే చెప్పఁబడినది.

శ్లో॥ "హిరణ్మయేపరేకోశేవిరజం బ్రహ్మనిష్కలం।
తచ్ఛుభ్రంజ్యోతిషాంజ్యోతి యద్యదాత్మవిదోవిదుః" ॥

శ్రేష్ఠమైన హిరణ్మయకోశమందు ప్రకాశించుచున్న, ని ష్కళమైనట్టియు శుభ్రమైనట్టియు జ్యోతులకు జ్యోతియైన బ్రహ్మ ను ఆత్మవేత్తు లెరుగుదురని తాత్పర్యము. శ్రీశంకరాచార్యు లును ఇవ్విధమునన్నే వక్కాణించినారు.

శ్లో॥ "యద్యద్వేద్యంత త్తదహం నేతి విహాయ స్వాత్మ ।
జ్యోతిర్జ్ఞానమయానం దమవాప్య ।
తస్మిన్న స్మీత్యాత్మవిదో యం విదురీశం ।
తం సంసార ధ్వాంత వినాశం హరిమీడే"॥

ఏదేది తెలియఁబడుచున్నదో అది తాను కాదని విడుచుచు జ్ఞానమయమును, ఆనందమయమునగు స్వాత్మజ్యోతినిపొంది దాని యందు తానున్నానని తెలిసిన ఆత్మవేత్తలు ఈశుని (బ్రహ్మను) ఎఱుగుదురని తాత్పర్యము. ఈ కారణమునుపట్టి బ్రహ్మవిచారమునకు పూర్వము ఆత్మవిచారము చేయవలెను.

ఈ ఆత్మవిద్య బ్రహ్మవిద్యాభ్యాసమునకు పాత్రత (యోగ్యత) సంపాదింపక మొదలిడదగదు. శ్రీశంకరాచార్యులవారు దీనికి పాత్రతను గురించి యిట్లు చెప్పినారు.

శ్లో॥ "మేధావీ పురుషో విద్వానూహాపోహవిచక్షణః ।
అధికార్యాత్మవిద్యాయ ముక్తలక్షణలక్షితః॥
వివేకినో విరక్తస్య శమాదిగుణశాలినః ।
ముముక్షోరేవ హి బ్రహ్మజిజ్ఞాసా యోగ్యతా మతా" ॥

కుశలబుద్ధిగలవాఁడును విద్యావంతుడును ఊహాపోహ విచక్షుణుఁడు నగు పురుషుఁడు ఆత్మవిద్యకును, సాధనచతుష్టయ సంపత్తిగలవారు బ్రహ్మవిద్యకును అర్హులని తాత్పర్యము. ఈ యోగ్యతను సంపాదింపక ప్రస్థానత్రయ భాష్యములుమాత్రము చదువుట చేయుక్తివాదములందు నేర్పరులై అహంకారబలముచే బహుమంది వేదాంతులని పిలుచుకొనువారు గుప్తవిద్య (Occultism) లేదనియు, భాష్యాదులుమాత్రము చదువుటె సకలంబనియు చెప్పుచు, గుప్తవిద్యను పరమగురువులగు మహర్షుల అనుగ్రహము

చేపొంది స్వానుభవముచేవా(వ్ర)చ్చిన సద్వాక్యములు తమ వేదాంత వాక్యములకువిరోధంబులని మనమతమును పునరోద్ధారము చేయుచుండు మహనీయులనిందించుచున్నారు. ఇదియే అనధికారులు పరావిద్యగ్రంధములు చదువుటచేగలిగిన ప్రత్యక్షఫలము. ఈవిషయముప్రశంసయందుండు విషయమునకు సంబంధము లేదుగనుక చర్చించనక్కఱలేదు. పరంతుసర్వమును తన్నుగా (ఆత్మగా) గాని బ్రహ్మగాగాని ధ్యానించుటకుపక్రమించుటకుముందు సాధన చతుష్టయమును సంపాదించుటకు ప్రయత్నించవలెను. దానినెట్లు పొందవలయుననిన.

శ్లో॥ "స్వవర్ణాశ్రమధర్మేణ తపసాహరితోషణాత్ ।
సాధనంప్రభవేత్పుంసాంవైరాగ్యాది చతుష్టయం ॥

స్వవర్ణాశ్రమ ధర్మాచరణచేతను, తపస్సుచేతను రామకృష్ణాద్యవతారార్చనలచేతను సాధనచతుష్టయసంపత్తి కలుగుచున్నదనితాత్పర్యము. కనుక ఆదియందు తమతమధర్మములను వదలక నియమింపఁబడినకర్మలనుష్ఠించుచు ఇంతకుపూర్వపుసంచికలందుధ్యానవిషయమును గురించివ్రాసినట్లు ప్రారంభమున సాకార ధ్యానముచేయుచు, విగ్రహములనావాహ్వన, అర్ఘ్యపాద్యాదులచేయుక్తనియమముతో నర్చించుచు క్రమక్రమముగా సమాధినిష్ఠజెంది స్వాత్మానుసంధానము, అనంతరము బ్రహ్మాను సంధానముచేయుచు పరమానందమునుపొంది అందరికిని ఆయానందము లభించు దారిచూపుచు సర్వదాజగద్ధితమునకు భగవంతునివలె సర్వమును సమర్పింపవలయు. అట్టివారికి విగ్రహారాధనచేగాని, సాకార ధ్యానముతోగాని ప్రయోజనముండదు. అదెందుకనవారుబ్రహ్మయొక్క నిజస్వరూపముచూచుచుందురు. ఎట్లుమనవలెవర్తింతురు? కనకదాసు అరటిపండ్లు తినకయెట్లువ్యాసరాయ స్వాముల సన్నిధియందుంచెనో అట్లనేవీరికిని మందబుద్ధిగలవారికేర్పరిచిన పూజయు క్షముగానుండదు.

శ్లో॥ పూర్ణస్యావాహనంకుత్ర సర్వాధారస్య చాసనం।
స్వచ్ఛస్యపాద్య మర్ఘ్యంచ శుద్ధస్యాచమనంకుతః ।
నిర్మలస్య కుతస్స్నానం వస్త్రంవిశ్వోదరస్యచ ।
నిరాలంబస్యోపవీతం రమ్యస్యాభరణంకుతః ।
నిర్లేపస్యకుతోగంధః శబ్దాతీతస్యచాక్షతాః ।
నిర్వాసనస్య కింపుష్పం బుధ్యతీతస్య ధూపనం ।
సాక్షాత్ జ్ఞానస్వరూపస్య కుతోదీపప్రభాభవేత్ ।
నిత్యతృప్తస్య నైవేద్యం తాంబూలంచకుతోహరేః ।
స్వయంప్రకాశమానశ్చ కుతోనీరాజనంభవేత్ ।
ప్రదక్షిణమనంతస్యాద్వితీయస్యకుతోనుతిః ।
వేదవాచా మవేద్యస్యకుతఃస్తోత్రంవిధీయతే ।
అంతర్బహిశ్చపూర్ణశ్చ కథముద్వాసనంభవేత్ ।
ఇయమేవపరాపూజసర్వా వస్థాసుసర్వదా ।
ఐక్యబుధ్యాతుదేవేశేమనో దేవేనివేశయేత్ ॥

సాకారధ్యాన పూజలతోప్రారంభించి ఈపైచెప్పినధ్యానముతోనంత మొందించవలెను.

ధ్యానవిషయము దీనితోముగిసెను.

ఓంతత్సత్.

ఓంశాంతిశ్శాంతిశ్శాంతిః.

---

నీచమైయయోగ్యమైన కార్యములనుజేయుటకు గలుగుభయము శౌర్యమగును. అట్టివిమనకు నితరులుజేసినవాటిని క్షమతోననుభవించుటగూడ శౌర్యమే.

ఎప్పటికిఁ బౌరుషముడుగకుము. పురుషప్రయత్నమును గఱపుధర్మములను శ్రద్ధతోగమనించుము. తర్కహీనధర్మములెంత పురాతనమైనను సత్యముమీదదృష్టినుంచి నిరాకరించుము. (వాసిష్ఠము)

శ్రీగురుభ్యోనమః.

# శ్రీగీతామృత తరంగిణి.

## ప్రథమ తరంగము. మోహ నివృత్తి.

శ్రీమన్నారాయణుఁడు లోకహితార్థమై దేవకీదేవి గర్భంబున లీలామానుష విగ్రహుండై యవతరించి యర్జునుని నిమిత్తముగఁ జేసికొని ధర్మద్వయంబగుఁ బ్రవృత్తిధర్మమును నివృత్తి ధర్మమును భారతయుద్ధ ప్రారంభంబున నర్జునునకుపదేశించె. ఆ ధర్మద్వయంబును సర్వజ్ఞుఁడగు వ్యాసమహర్షి గీతాశాస్త్రంబని యేడునూరు శ్లోకంబులు రచియించె. ఈగీతాశాస్త్రము సర్వోపనిషత్సారభూతమై ప్రస్థానత్రయంబులలో నొకటియైయున్నది. అన్నిమతములవారును దీనిఁగొనియాడుచున్నారు. ఇట్టి భగవద్గీతార్థమును విమర్శింపఁబూనుట బ్రహ్మాండమునెల్ల విమర్శింపఁ బూనుటగదా. ప్రపంచమందలి జనులమనోవృత్తులను గర్మలను బహువిధంబులగు వ్యాపారములను దెలుపుటకు నెవ్వనికి శక్తిగలదు? గీతాశాస్త్రము కృష్ణుఁడర్జునునకుపదేశించిన యుపదేశముమాత్రమె కాదుసుమా. సమస్తదేశములవారును భగవద్గీతాశాస్త్రమును వేవిధంబులఁ బొగడుచున్నారు. హిందూదేశమునందగాక యితరదేశములందును శ్రీకృష్ణుని మురళీ గానము భక్తుల మనంబుల గరగించుచున్నది. శ్రీభగవద్గీతను మిగుల శ్రద్ధతోడను భక్తితోడను బఠించి దానియందలి యర్థము నెఱుఁగఁగోరువారనేకులు గలరు. అయిననది దురవగాహంబగుచు మనస్సునకుఁ గలవలము పుట్టించు. ఒకసారి కర్మయోగము శ్రేష్ఠమనియు మఱియొకచోట జ్ఞానయోగము ముఖ్యమనియు బోధించు. పరస్పర విరుద్ధములగు విషయముల శ్లాఘించిచెప్పు. జీవహింస పాపమనియొత్తిచెప్పుచు జీవహింసలలోనెల్లఁ గడు ఘోరమగు ప్రాణివధఁజేయుట పరమ ధర్మంబని యుపదేశించి

యుద్ధముచేయుమని బోధించు. ఇట్టివిరుద్ధ వాక్యములచేఁ బర మోపదేశమిదియని నెఱుఁగరాకుండు. గీతాశాస్త్రమను నడవి యందు చిక్కుకొనక, దానియందలి పరమార్థమును గ్రహింప నేర్చినవాఁడు బ్రహ్మాండమునెల్ల నెఱుఁగఁగలఁడు. గీతాశాస్త్రమునకును బ్రహ్మాండమునకును నాధారమగువాఁడు శ్రీకృష్ణమూర్తియెగదా. బ్రహ్మాండమెట్టుల దురవగాహముగనున్నదో యట్టులనే గీతాశాస్త్రమున్నది. జ్ఞానియగువాఁడు శ్రద్ధాభక్తి సమన్వితుండై వీనిరెంటిని విమర్శింపఁబూనవలయు.

లోకమున సామాన్యుఁడగు నుపాధ్యాయుఁడు శిష్యులకు పదేశించు విధంబున లోకగురువగు భగవంతుఁడుపదేశింపఁడు. సామాన్యగురువు శిష్యున కర్థమగునటులఁ గొంతకొంతగ బోధించు. మఱియుఁ దానికనుకూలమగునటులఁ బుసకములను జూపు. శిష్యుఁడర్థమును గ్రహించినను గ్రహింపకున్నను పాఠముల గ్రుడ్డిపాటగానైన వచ్చునట్టు వల్లెవేయించు. జగద్గురువు లోకానుభవంబుచే జ్ఞానము వికసింపఁజేయు. ఈశ్వరుని స్థూలదేహమగు నీవ్యక్త ప్రపంచంబు మనుష్య భాషణంబులచే మనకు ధర్మమును బోధించుట లేదుగదా. గీతాశాస్త్రము జగద్గురుని యుపదేశమార్గ మవలంబించినది. దానంజేసి మనస్సు కళవళపడుటయు నది సుబోధంబు గాకుండుటయు సహజముగనుండు. ఇంతియెకాదు. శిష్యునకు విసుకుపుట్టి దాని నిందింపబూనును. శ్రీకృష్ణభగవానులు తనకుపదేశింప మొదలిడినపుడు పార్థుఁడుతనకది తెలియలేదని యెన్నిమాఱులు మొఱయిడెనో చూడుఁడు. నిశ్చితార్థమును నిస్సందేహముగ దెలుపుమని విసుకుతో నర్జునుఁడెన్నిమార్లు లోకగురువునడిగెనో చూడుఁడు. అర్జునుఁడుపదేశమును గ్రహింపఁజాలక గురువు నొక్కొకసారి ప్రార్థించు. ఒక్కొకతూరి వేసటతోమాటాడు.

శ్లో॥ యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితంబ్రూహితన్మే ।
శిష్యస్తేహంశాధి మాంత్వాంప్రపన్నమ్॥ (గీ 2—7)

ఎయ్యది శ్రేయస్కరంబై యుండు నట్టినిశ్చితార్థము ను దెలుపుము. నేనునీకుశిష్యుండను. నిన్నుశరణంబు వేడెద. నన్నుశిక్షింపుమని పార్థుఁడు శ్రీకృష్ణునివేడెను. దీనికిఁబ్రత్యుత్త రముగగురువు పరమరహస్యార్థమును దేనెలొలుకు మాటలతోను పన్యసించె. ఇట్టిమహోపన్యాసంబును వినియుశిష్యుఁడు మఱి ల''ఇట్టిసందిగ్ధవాక్యంబులచేనాబుద్ధినికలవర పెట్టుచున్నవాఁడవు. దేనిచేనాకు శ్రేయస్సుగలుగు దానినొకటిని నిశ్చయముగఁదె ల్పుము''ని గురువుతోఁబలికె(గీ 3—2). మఱల లోకగురువగు శ్రీకృష్ణుఁడుమృదు మధురగంభీర భాషణంబులనధ్యాయంబుల రెం టినుపన్యసించె. దానినెల్లవినియు మఱలనర్జునుఁడు విషాదము తోనిట్లనియె. ఓకృష్ణ,

శ్లో॥ ''యచ్ఛ్రేయఏతయోరేకం ।
తన్మేబ్రూహిసునిశ్చితమ్''॥

ఈరెంటిలో నెయ్యదిశ్రేష్ఠము. దాని నాకునిశ్చయంబు గఁ దెల్పుము. (గీ 5 అ. 1 శ్లో). ఇవ్విధంబుగ శిష్యుఁడు విసుకు తో మాటిమాటికి గురువునడుగుట యాశ్చర్యముగదా. జ్ఞాన స్వరూపుఁడు యోగేశ్వరుఁడగు శ్రీకృష్ణమూర్తిగురువఁట. అర్జు నుఁడు శిష్యుఁడట. అయినను గురువు శిష్యునకుఁ దెలియునట్టు ల నుపదేశింపఁ జాలఁడట. ఏమివింత. అదికాదుసుమా. జ్ఞానోపదేశంబుఁజేయ గురువు సిద్ధముగనున్నాఁడుకాని శిష్యు నకు దాని గ్రహింప శక్తిచాలదు. శిష్యుఁడు గురువుపదేశించు దాని గ్రహింప శక్తిగలవాఁడగు పూర్ణాధికారి గావలయు. స ర్వజ్ఞుఁడును దయాళువగు గురువు లభింపవలయు. అప్పుడుగదా యుపదేశంబు సఫలమగు. ముల్లోకములఁ బ్రకాశింపఁజేయు సూర్యునికాంతివల్లన గ్రుడ్డివానికి నేమిప్రయోజనము? మనోహ

రంబగు వీణాగానముచే చెవిటివానికి నేమిఫలంబుగలుగు? శిష్యుని యందు దోషంబెగాని గురుని తప్పొకటియు లేదు. గుర్వుఁడు దివ్యజ్ఞానమును వర్షించు. సముద్రమందలి నీరెల్ల చిన్నకుండ గ్రహింపనేర్చునే? శిష్యుఁడు జ్ఞానమభిలషించి బహువిధముల వేడినను గురువు జ్ఞానముపదేశింపనొల్లనివానివలె మనకుఁదోచు. అదిసరికాదు. గురువు పరమార్థమునుబోధింప సిద్ధముగనున్నాఁడు. ఇంతియెకాదు. గురునినుండి జ్ఞానప్రవాహము మనదెసకుఁ బ్రవహించుచున్నది. దాని మనమెఱుఁగనేరక యున్నారము. రాళ్ళు సయితము కరగుచున్నవి. మనహృదయములు మాత్రము కదలవు. బ్రహ్మజ్ఞానమును గోరువాఁడు బహుకష్టములంది స్వయంకృషిచే శిష్యత్వమున కర్హతఁగాంచవలయు. ఇదియే మొదటి యుపదేశము. శాస్త్రంబులనెల్ల సామాన్య గురువువలన గ్రహింపవచ్చుగాక. అప్పుడును విద్యార్థి తనశక్తికొలదియె గదా గ్రహింపనేర్చు. గురువును వానిశక్తికిఁ దగినంతయె బోధించు. బ్రహ్మవిద్య యట్టులగాదు. ఒక్కొక్క యక్షరమును ననుష్ఠించినగాని యదిలభింపదు. వల్లెవేసినంతనె బ్రహ్మవిద్య చిక్కదు. శ్రీగీతార్థ మెఱుఁగఁగోరినవాఁడు దానిననుష్ఠింపవలయు. అనుష్ఠింప ననుష్ఠింప దానియర్థము మనంబునకు గోచరించు. క్రమక్రమంబుగ ననుష్ఠించుటచేఁ బరమరహస్యంబులెల్లఁ దేటతెల్లముగఁ గాన్పించు. లోకమునఁ గొందఱు భగవద్గీతనెల్ల నొక్కపెట్టునఁజదివి దానియందుఁ దామెఱుఁగని విశేషంబు లెవ్వియులేవని వాదింతురు. మఱియుఁగొందఱు దానిఁజదివి చదివి యేఫలంబును గాంచరు. శ్లోకమైనను శ్లోకార్థమైనను, నొక్కపాదమునైనను బఠించినచో నిట్టిఫలంబు గల్గునని మనశాస్త్రములు చెప్పుచున్నవిగదా. దానియర్థము కేవలపఠనము గాదుసుమా. పఠనంబు ఫలకారిగావలయునేని దానిననుష్ఠింపవలయు. శ్లోకమున నొక్కపాదమైనను చదివి దానియర్థము

ననుష్ఠింపవలయు. పరులు తనయనుష్ఠానంబుచే దాని గ్రహింప వలయు. అప్పుడుగదా గీతాశాస్త్రపఠనము సఫలతఁగాంచు. అట్టివాఁడె గీతాశాస్త్రమును చదివినవాఁడు. వానికది ఫలకారియగు. అట్టియథార్థ పఠనముచే నరుఁడు ప్రవృద్ధిఁగాంచు. వట్టిమాటల మాటిమాటికి నుచ్చరించిన నేమిఫలము. హృదయ సంపుటమున వసించు పరమాత్మను గనుగొనుటయె ఫలముసుమ్ము.

(సశేషము).

---

పౌరుషము, ఓర్పు, మనోనిగ్రహము, పరధనకాంక్షారాహిత్యము, శుచిత్వము, ఇంద్రియనిగ్రహము, బుద్ధి, ఆత్మజ్ఞానము, సత్యము, కోపరాహిత్యము, ఈపదియును సత్యమైనమతలక్షణములగును. (మనుస్మృతి)

మతమనగానడతయే. నడతలేకున్న మనుష్యునకువిశ్రాంతి లేదు. సన్మార్గములేకున్న నేనరుఁడును సుఖమునుగాని, శాంతినిగాని, జ్ఞానమునుగాని పొందజాలఁడు. గనుక నడతయేముఖ్యము. మంచినడతయున్న, దుఃఖము, అజ్ఞానము, పాపము, స్వార్థపరత్వము మొదలగుదుర్గుణములన్నియుఁబాయును. క్షణక్షణమునకును, దినదినమునకును, ఏటేట, నడతనెవరుబాగుచేసికొనెదరో, గాంభీర్యమై స్థైర్యమైనపౌరుషముసాధించుదురో, న్యూనతలేనిఋజుత్వమును న్యాయమును సాధించుదురో, పాపములను జయించి లోపములనునివారించుకొన్నామని దెలియుదురో, దయార్ద్రహృదయులగుదురో, శుచిగానుందురో, తమయభిప్రాయములకు విరోధమైనయభిప్రాయములుగలవారియెడ గోధమువహింపరో, వారేమతము నవలంబించు ధర్మాత్ములు. ఇతరులెన్నటికి గానేరరు. (అల్గర్)

# గ ణ ప తి త త్త్వ ము.*

కాశీమొదలు కన్యాకుమారి దనుక నెందుఁబోయినను భారతవర్షమందెల్లెడల గణపతిదైవము నారాధించుచుందురు. శివాలయములందు, విష్ణుగుళ్ళయందు, వాపీకూపతటాక సమీపములందును, జెట్లనీడలందును, బల్లెలయెల్లలందును, సందులకడలందును మఱియు నెందెందు జనసందోహముండునందెల్ల గజముఖుని మూర్తిని గనవచ్చును. నల్లఱాయియు, స్ఫటికమును, దారువును, లోహమును, మంటిప్రతిమయునివియెల్లఁబిళ్ళారికివిగ్రహములగును.

ఆర్యులీస్వామికిఁ దొలుతఁ బూజభజన కీర్తనాదులఁ జేసి యే యేపనినేనిఁ దొడరుదురు. పండితులు ప్రసంగమును విఘ్నపతిస్తోత్రముసేసి ప్రారంభింతురు. సత్కార్యములందును శుభముహూర్తములందును మొదలాదేవుని నారాధించినఁగాని యవి చక్కఁగా నెఱవేఱవు. ఏకార్యమునకుఁ బూనినను వేదవేత్తలు ప్రాణాయామము లేనిదే చేయరుకదా. ఇట్లుచేయు ప్రాణాయామమును గణపతిపూజయు నొకటియేయని తత్త్వజ్ఞులాడుదురు.

పూర్వోక్తప్రకారము శిలాదారులోహాదివిగ్రహములు లేకుండియుఁ బసుపు గందము నావుపేడ మొదలగుద్రవ్యములచేసంక్షేపముగనొకరూపమేర్పఱచి గణపతియనిప్రతిష్ఠచేసి తద్భావనతో దానిని బూజాదులఁ దనుపుదురు. గణపతియేముఖ్యదేవునిగా భావించి యారాధించు గాణాపత్యులనేకు లార్యావర్తభూమినున్నారు.

గణపతికి సహస్రనామావళి యుండఁగా నందు విఘ్నేశ్వర గజానన నామములు సాధారణముగ వాడుక యందుండు.

గణపత్యుపాసనానంతరముతదనుగ్రహపాత్రులై ప్రారంభించుకార్యములుసిద్ధించుననుట పండితపామర జనైకాభిప్రాయము.

---

* పూర్ణచంద్రోదయమను నఱవమాస పత్రికనుండి తెనిఁగింపఁబడియెను. 1910 సంవత్సరం మేనెల 15-వ తేది సంచిక.

పరమశివునకుఁ బరాశక్తికిఁబుట్టిన మొదటికొడుకు పిళ్ళారి. పరాశక్తి పరమశివులేకకాలమున నొక్కయద్దమందు దృష్టి నిలుపఁగా ప్రతిబింబములయి యమ్మూర్తిద్వయ మేకమైన గణపతి మూర్తి యావిర్భవించెనని యొకపురాణ కథయున్నది. విఘ్నేశ్వరాంకితమగు నొక యుపనిషత్తును నొకగొప్ప యుపపురాణము నున్నవి. ఆపురాణము గజవదనుని బూజించి మోక్షసామ్రాజ్య మందినవారిఁగూర్చియు గణేశమాహాత్మ్యమును వెండియుఁ గొన్ని విషయములును విస్తరించి చెప్పుచున్నది.

పశ్చిమసముద్ర ప్రాంతములగు కేరళ మళయాళ దేశములందు బాలబాలికాక్షరాభ్యాస మహోత్సవములందు "ఓం గణేశాయనమః" యని తొలుత వ్రాయించినేర్పుట వాడుక. ద్రావిడదేశమున "ఓం నమోనారాయణాయ సిద్ధం" అనియు నాంధ్రదేశమున "ఓం నమశ్శివాయ సిద్ధంనమః" అనియు పిల్లవాండ్రకుఁ గఱపుటయుఁ బురాణాచారము.

ఇమ్మెయిభారతఖండమున నిండిన ప్రాబల్యమును సర్వజనారాధనగౌరవమునుబొందు నీమూర్తితత్త్వమువిచారించదలంచితిమి. ఈవిచారమువల నిప్రయోజన మెట్టిదనిన:— ఆర్యధర్మతత్త్వములరయనివార లీమూర్తిరూపమునుజూచి యనాదరణముఁ జూపెదరు. దానంజేసి మన బాలురహృదయములందు గణేశునిపైనొప్పు భక్తి కొఱవడనోపు. కావున నీతత్త్వమును మనవారలెఱింగిన నాభక్తికొఱఁత లేక నిలువహేతువై యుండుటయేకాక యాగణనాథారాధనయు బలవంతమై ప్రయోజనకరమైయమరును.

గణపతియనఁగా గణములకురాజు. గణములనఁగా విభక్తములైన నామరూపములు. గణపతి నామరూప ప్రపంచాధిపతి. నామరూపములకు బీజమగు పదార్థమతఁడు. వేదాంతులు లోకమున మన మరయునవియెల్ల నామరూపములందురు. నామమనఁగా నొక్కొక్కవస్తువునెడ దానిదానియెఱుకకు గుర్తు

గ దానిదాని లక్షణముగ దానిదాని స్వభావముగ నేర్పడిన ధ్వని, స్వరము. ఆయావస్తువునకుండు ధ్వని ప్రత్యేకమగు. ఈ ధ్వనికి నాదమనియుఁ బేరున్నది. ఇది యాయావస్తువులందము రిన యణువుల చలనమునఁ గలుగు. అణువుల స్పందనముల కూడిక ధ్వని, నాదము. ఈనాదమే సూక్ష్మదశయందు వ్యోమ మనఁబడు హృదయాకాశమున నుండునట్లు శ్వేతాశ్వతరోపనిష త్తుపదేశించును. దానియధిష్ఠానదేవత యీశ్వరుఁడు. తక్కుంగల దేవతలెల్ల నాయీశ్వరుని యొక్కొక్కయంశములు. దానం జేసి మంత్రములకు దేవతలు, ఋషులు, ఛందస్సులు, నను వ్యవస్థలుండును. దేవత యావ్యోమాకాశమున కొక్కయల. ఋషి యాయలను సూక్ష్మదృష్టితోఁ జూచినవాఁడు. ఆయలయొక్క గుణవిశేషమే ఛందస్సనఁబడు. దానంజేసియే యీలోకము "చిన్మాత్ర విస్తారితం" అని శ్రీశంకరాచార్యులు వచించిరి. ప్రజ్ఞయే లోకముగఁ బరిణమించెనని జ్ఞానులయభిప్రాయము. ఒకయుపమానమున నీసూక్ష్మతత్త్వము నొక్క తెఱఁగున నరయఁదగు. గాలిచేమ్రోఁగు (Organ) నార్గన్నను వాద్యయంత్రమునఁ బెద్దక్రోవుల వెంబడి గాలిలోఁజొచ్చి యంతకంతకుఁ బల్చత్రోవలఁ జిన్న చిన్నక్రోవులదారి పోయిపోయి తుదినత్యల్ప కేశమాత్రలగు కూపములం బ్రవేశించి చెవికింపగు నాదమును గావించునట్టు లీశ్వర చిత్తచలనమగు చిన్మాత్రయనునది బహునామములుగ ధ్వనించును. ఒక్కొక్కధ్వనియు నొక్కొక్కవస్తువునకు (ప్రాణము) గరుడు, బీజము. కర్ణేంద్రియమున దానిం దెలిసిననామమనియు నేత్రేంద్రియమునఁ దెలిసినరూపమనియుఁ జెప్పుదురు. అణువుల స్పందనము నొక్కమొగమునఁ గాంచునప్పుడు నాదమనియు మఱియొక్క మొగమునఁ జూచునప్పుడు బిందువనియు నేర్పడును. ప్రపంచమెల్ల ఓంకారమగు ప్రణవమునుండి విస్తరిల్లెనని యుపనిషత్తులు పలుకు. ప్రణవమునకుఁ బదార్థము దానియంతర్యామియగుశక్తియు గణ

పతియను దేవత. గణపతికిఁ బ్రణవార్థవాచకమున్నది. మాండూక్యోపనిషత్తు ప్రణవమునుగుఱించి చెప్పు మొదటిమంత్రమున మనకెదురఁదోఁచులోకము సర్వము భూతభవిష్యద్వర్తమానకాలములఁ గడచిన యకాలమును బ్రణవస్వరూపమేఅనియుపదేశించుచున్నది.

విఘ్నేశ్వరుఁడనఁగా నెల్లవిఘ్నముల నెల్లయరిష్టములఁ బోకార్చునతఁడు. మనయుద్దేశించు నొకొక్క కార్యమునకు నొకొక్కయంతరాయము గలుగుఁగాన దానిరాక నడ్డగించు స్వభావముగల దీమూర్తియనుగ్రహము. దానంజేసియే యీ మూర్తిని నేకర్మమునందును దొలుత నారాధించెదరు.

. గజాననుఁడనఁగా నేనుఁగమొగము గలవాఁడు. ఈతనికీముఖము గలుగనేలయని విచారించుచోఁ బురాణకథలవిడిచి తత్త్వము నరయఁదగు. శరీరమెల్ల మనుష్యరూపమును శిరస్సుమాత్రము గజరూపమునగు. మనస్సనుతత్త్వ మేనుఁగతొండముఁ బోలి చంచలించునది. ఒక్కనిమిషమేని యూరకుండదు.

"చంచలం హిమనః కృష్ణ" (భగవద్గీతా).

అని యర్జునుఁడు మొఱయిడె. గాలినిబట్టి గాజలోనడచి పెట్టినను బెట్టవచ్చుఁగాని మనస్సడఁచుట కష్టమని యనుభవజ్ఞులెఱిఁగిన యదియే. ఈవిషయమైకదా తాయుమానస్వామి ద్రావిడభాషయందొక పద్యము నందిట్లుచెప్పిరి.

"మదమాతంగమును వశముగ నడపించఁదగు. ఎలుంగు మోమును గృధ్రవ్యాఘ్రవాక్కును బంధించనగు. సింగము మూపునెక్కవచ్చును. పామునుపట్టి యాడించవచ్చును. దీప్తాగ్నిలో రసభేదమున లోకమునంతయు బంగారుసేసి జీవించి వచ్చు. ఒక్కరికంటఁబడక లోకమున సంచరించవచ్చును. దేవతలఁ గింకరులుగ నేలవచ్చును. సంతతము యౌవనమున నుండవచ్చు. పరకాయప్రవేశము చేయవచ్చును. జలములపై నడువవచ్చు. నిప్పుపైని నిలువవచ్చు. తనప్రమోల సకలసిద్ధులఁ బొం

దవచ్చును. చింతనువిడిచి మనస్సునడఁచి యూరకుండుట నా చిత్తముననిండించు జ్ఞానస్వరూపమగుదైవమా తేజోమయ్యానంద మా, యరుచు".

మనముతో సంబంధించిన యింద్రియముల దంతావళమని తిరుమూలకవి యుపమించియున్నారు!

ఏనుఁగులగు నైదింద్రియముల నడఁచి జ్ఞానదీపమును వెలింగించి దానిలోఁజొచ్చి తమోమయమునగు దేహమునఁ జీకట్లు పాపనేర్చువానికి నాకాశము నెక్కుమార్గము సులభమగునని చెప్పిరి. మనస్సునకు గజవదనమునకు సరియగు నొకపోలిక యున్నది. మన స్తత్త్వ స్థూలోపాధి గజమస్తకమట్లు రెండుగుబ్బలును వానిరెంటినడుమ వీణాదండములోపల నేనుఁగు తొండము వలె వ్రేలాడు నరమునుండు. కపాలముఁజీల్చిచూచిన రెండు మెదడులుండును. ఆరెంటినడుమ క్రిందుమొగనై వ్రేలాడు తెల్లనరమొక్కటియుండు. ఇది వెన్నెముకలోని యిరువదిమూఁడేని ముప్పదిరెండేని వలయములమధ్యఁ బ్రవేశించును. ఆవలయముల క్రోవికి వీణాదండమనిపేరు. దీనిని నాలయములందు ధ్వజస్తంభమంద్రు.

మన స్తత్త్వమార్యులందే మొట్టమొదట వికసింప నారంభించెను. అంతకుముందున్న మానవవర్గమందది గుప్తమైయుండి ఆర్యులందధికాభివృద్ధిపొందె. శిరస్సు (నెత్తి) యెంతపెద్దదియగునో యంత మెదడును బెద్దదియని యూహించెదము. ఆమెదడు పెద్దదియగునంత మనోబలమగు మెలుకయు నధికమని గణించెదము. నానావిధమగు నామరూప ప్రపంచానుభవమును జ్ఞానమును సంపాదించుట మనోవ్యాపారము. ఈప్రపంచ విషయులచేత మనస్సు వేత్వేఱుగ భిన్నమగును. ఈ విషయములు మనస్సునఁ బలుతరంగములఁ బుట్టించును. గణపత్యుపాసన మనఁగాఁ బ్రాణాయామ మూలముగ, శ్వాసమును నిరోధించి తన్మూల

ముగ మనస్సునఁదరంగములు పుట్టకుండ నిలుపుట. మనస్సెందుం డునో యందుఁ బ్రాణములుండు. మనస్సునిలిచిన ప్రాణములుల యించును. ఈయర్థమే సాధారణముగ నెల్లరు సులభముగఁ దెలిసికొనుపొంటెఁ దిరుమూలకవి యిట్లుపదేశము సేయు.

మనస్సుండుచోట వాయువు (ప్రాణములు) నుండు. అది లేనిచోట వాయువులేదు. మనస్సున సంతోషించువారు మ నస్సునందు లయించియుందురు. ప్రాణములు మనస్సును బాయవు. అణఁగి ప్రాణములుండినట్లులైన జననమరణములులేవు. ప్రాణ ములు సత్పథము మాటిపలుకులు స్మరణములు లేకపోయినఁ బ్రాణ ములు వెడలిపోవును.

భగవంతుఁడగు పతంజలి యోగము చిత్తవృత్తి నిరోధమని యె. మనోభంగములు నిలిచిన శాంతియగు. దానిచే మనశ్శ క్తి చెదరక యేకముఖముగఁ బ్రయుక్తమగు. ఏకాగ్రము కాఁ గా సంకల్పించినపని కొఱలేక నెఱవేఱును. దానిచేతనే ప్రాణా యామము చేసియు గణపతినిబూజించియు బిదప నుద్దేశించినకా ర్యమును సంకల్పమూలముగఁ జింతించెదము. చింతయేకార్యము గఁ బరిణమించుననుట ఛాందోగ్యోపనిషత్తునందుద్దేశ్యము. గ ణపతియుపాసనయనఁదగు నిజమగు ప్రాణాయామమును జేయు దుమేని మనసంకల్పించు పనులెల్లఁ జేకూఱును.

కావునమనస్సుచెదరక యేకాగ్రముగనిలిపి గణపతిపూజయు విధివిధానప్రాణాయామమును జేయుచో దాన మనస్సునమానము ను దాల్చును. పిమ్మట మనసంకల్పము నిశ్చయముగముగియును.

ఈవ్యాసము చకచగా నేర్పుతో నెల్లరకుఁ బ్రయోజనమ యి వఱలుపొంటె విఘ్నేశ్వరుఁడగు స్వామిని బ్రార్థించెదము.

## కౌశికుని చారిత్రము.

కౌశికుండను బ్రాహ్మణుం డొకరుండుండెను. ఆయనసతతము శాస్త్రాధ్యయన తత్పరుండయి, ధర్మతపశ్శీలుండని పేరుపొందెను. ఆయయ్య యొకనాడొక వృక్షముక్రింద శాస్త్రాధ్యయనముచేసిచేసి యలసిసొలసి యొకింత విశ్రమించి కన్నుమూసెను. ఆ చెట్టుపై కొక్కెరపక్షి యొకటి యాహారంబు గొనుచుచుండెను. అత్తరి యొక పలలఖండము (ముక్క) క్రింద నిద్రించుచున్న బ్రహ్మచారిపై బడియె. అట్లుపడగా నా బ్రాహ్మణుండులికిపడి లేచి తన నిద్రాభంగమున కేమిం గతంబని విచారించి, తనచెంతబడియున్న పలలఖండంబునుగని, యుగ్రుండయి రూక్షవీక్షణంబుల తలపైకెత్తి జూచుటయు నా కొక్కెరంబు తక్షణంబనిర్జీవిమై క్రింద బడుటయు నొక్క నిమిషంబుననే జరిగెను. ఇట్లు వర్జితదేహియయి క్రిందబడియున్న కొక్కెరను వీక్షించి బ్రాహ్మణుండిట్లు వితర్కింప జొచ్చె. "ఏమి? నాశక్తిబలము!! నాతపఃప్రభావము!!! నాయొక్క వీక్షణమాత్రంబున నింతదనుక సజీవంబయియున్న పక్షిని విగతజీవినిగా గావించిన నామహిమకేమని తలంచువాడ! యెంతయాశ్చర్యము, యేమియద్భుతము, యెట్టివింత, ఇక నేకోరవలసిన దేమున్నది? యేమియు గాన్పించదు. సరే! కానిమ్ము! ఇక నేనుంటి! యీ నాటకారూపంబయిన ప్రపంచంబుండెను! నా శక్తిప్రభావంబుల జూపి ప్రపంచంబుబ్బితబ్బిబ్బులగునట్లు చిత్రవిచిత్ర చెయిదములంచే చూచువారలకబ్బురంబు గలుగజేసి వారివలన గౌరవంబుం బడిసి ధనవంతుడనయి, మదకు రాజునుగూడ లోబరచుకొని నాయానత్రాయనిశాసనంబయి నాఘాటి కట్టనికోటయయి, నామాట సామంతుల పాటయయి, వెలంగ యీభూవలయంబును వలయాకారంబుగ ద్రిప్పెద. ఇదెచూడుము! యనికౌశికుడు ప్రతిజ్ఞ యొనర్చి బయలుదేరి దగ్గర

లోనున్న యొకపల్లెవైపునకు బోవుమార్గముపట్టి బయనమయ్యె. గ్రామముజేరి బ్రాహ్మణవీధిఁబోవుచు యందొక గృహముముందర నిలువబడి "భిక్షాందేహి" యని యరచెను. అంత యందున్న యొకయిల్లాలు యాకేకవిన్ని, బయిటికివచ్చి సవినయ పూర్వకంబుగా బ్రహ్మచారి గూర్చుండనియమించి నర్ఘ్యపాద్యంబుల దేను లోనికింబోయె. అంతగృహ యజమానుండును యెండఁబడి యిల్లుజేరుటయు తద్గృహిణి భర్త పాదములఁగడిగి తనచేలాంచనంబుతో నద్ది తడియార్చి యొక పీఠంబున సుఖాసీనుఁగావించి మృదుమధుర భాషణంబుల తన మనోహరు మనంబును రంజిల్లజేయుచు విసనకఱ్ఱచేబట్టిపథికాయాసంబు శ్రమింపజేసినపిదప, యాయన భోజనపానాదుల దృప్తుంజేసి పదంపడి శయ్యాగృహంబుజేరి యాయయ్య నిదురించువరకు సోపచర్యలుగావించి పాదములొత్తి తత్పాదముల తననేత్ర పద్మముల నద్దుకొని, యప్పుడు యొక శుద్ధపాత్రంబున శీతలోదకంబు నొకచేతఁగొని రెండవచేత భక్ష్యాన్నములిడియున్న వేఱొకపాత్రముంగొని బ్రహ్మచారి వేచియున్న తావునకుఁ జనఁ యాబుడుతఁడు క్రోధానల దత్తమానసుండయి, యదిరిపడి జువ్వున లేచిచురచురజూచుచు నిట్లనియె. ఏమి! పథికుఁడనక బ్రాహ్మణుఁడనక బ్రహ్మచారియనక యింతతడవేల జాగుచేసితి. సకలశాస్త్రవిదితుఁడ, తపోగరిష్ఠుండ, బ్రాహ్మణుండ, మిగులబ్రహ్మచారుండ నేనిట్లువేచియుండ ముందుగ భోజనముగావించి హాయిగశయనించి యున్నట్టియు, శాస్త్రి పరిచయము లేనట్టియు, విద్యాగంధమేమియు లేనట్టియు నీభర్త నాకన్న నాధిక్యుడా! నీవు బుద్ధిమాలినదానవగుటఁజేసి యిట్లు బ్రహ్మచారిని రోతబెట్టి పాపము మూటఁగట్టుకొంటివి. చాలు చాలు నీభక్తి, నీయుపచర్య, నీమభిక్షము, ఇదె నేపోయివచ్చెద. ఇఁకనయినను బ్రహ్మచారుల, యతిథుల, బ్రాహ్మణుల, నిరసింపక, బుద్ధితెచ్చుకొని, పాపముమూటగట్టుకొనకుండప్రవర్తింపుముగాక"

యనిరోషంబున పలుకుచు రువ్వునలేచి చివాలున గుమ్మము దాటు చుండ యా మహాసాధ్వి, గుమ్మమున కడ్డముబోయి యిట్లనియె. "ఓ బ్రాహ్మణోత్తమా! నేజెప్పంబోవు మాటలవిని యటుపిమ్మట బోనుచితంబుగాని, యిట్లు వేగిరిపడుట ధర్మంబుగాదు. నీవు యెఱుగనిధర్మంబులు, శాస్త్రంబులు నీతులు వేఱుగలవే! నేను వేఱు జెప్పవలయునా! సర్వము దెలిసిన నీవుగూడ యిట్లు క్రోధమునకు లోఁబడి ప్రమత్తునివలె ప్రేలుట నీకుచితంబె? వనితకు పతికంటె వేఱుదైవము గలడే? పతిసేవకన్న వేరుకర్మగలదే! పతినిసంతోష పెట్టుటకన్న వేరుధర్మముగలదే! నీవెరుగవే! ఆగ్రహింపక, నేజేయు సత్కారముల గ్రహించి యీయాహారమును భుజింపుము. నీకుహితంబఁగు" ననుటయు బ్రహ్మచారియుకనులుదెరచి, నిజము రసి, తామసమడంచుకొని యాయమఁ జెప్పినట్లొనర్చి తిరుగబయ నముకానున్న తరిఁ యాసాధ్వీమణి యిట్లులనియె "నాయనా! క్రొక్కెఱరయొకటి జచ్చిపడినంతమాత్రమున సర్వజ్ఞత్వము లభించెనని దలంచితివా? ఇంకను నేర్చుకొనవలసినది ముందుండె! సత్యము శాంతము సమత్వము యనునవిమూడును నేర్చినవాడేపూర్ణుఁడు సత్యమన్నయున్నదియున్నట్లు జూచుట, తెలుపుట యయియున్నది. శాంతమన్నకష్టసుఖములందొకరీతినుండుట. సమత్వమన్న, సర్వజీవులను, తనవలెజూచుటయు నెద్దానికయిన నేవిధముననయిన మనోవాకాయ కర్మంబులహింసజేయకుండుటయు ననునవిగానున్నవి. ఇవిబొందినగాని యేవారును పూర్ణులుగారు. గాన వాటిని బొంద బ్రయత్నింపుమా, కుమారా!" యని జ్ఞానోపదేశము జేయునంత, యా బ్రహ్మచారి నిశ్చేష్టితుండయి, నిగర్వుండయి, నిర్మలమనస్కుండయి యాపతివ్రతాతిలకముయొక్క పాదపద్మములఁబడి తనకుదారిజూపప్రార్థింప నామె "నాయనా నేను స్త్రీని, జ్ఞానోపదేశము జేయుట నాకు ననర్హముగాన మిథిలానగరమున ధర్మవ్యాధుండను నొక కసాయివాడుండు. ఆ

తండు "జితేంద్రియుండును సత్యవాదియు, మాతాపితృభక్తుండును నయినవాడు" ఆకిరాతుండు నీకు ధర్మంబు లెరింగించి నీ సంశయ చ్ఛేదనంబు సేయువాడు గాన పోయిరమ్ము. బుద్ధిమంతుడవు గమ్ము, లేలెమ్ము" యని పాదాక్రాంతుఁడయియున్న యా బ్రహ్మచారిని లేవ నాజ్ఞాపింప నాతడును లేచి సవినయంబుగా నాసతీమతల్లికి నమస్కరించి యామె యాశీర్వచనముఁగొని మిథిలానగరమునకుం బయనమయిపోయె.

అంతకొంత కాలమునకు మిథిలాపురంబునుఁగని తత్పురంబు ప్రవేశించి ధర్మవ్యాధునిదర్శించి యాతనిఁ డాయంబోవ హేయంబయిన యాతండు జేయు వ్యవహారనిమిత్తమచ్చట జేరియున్నవారి సంపర్క దోషమునకు వెఱచి యాబ్రాహ్మణుండు దూరముననున్న చిరుతయరుగుమీదగూరుచుండి ధర్మవ్యాధుని బరీక్షించి జూచుచుండె. అత్తరినాతఁడు తనయంగడియందుంచఁబడినమాంసఖండముల గొనుటకయివచ్చెడివారల నెల్లర మృధుమధురభాషణంబుల మెప్పించుచుఁ బాలురకు, వృద్ధులకు, యబలలకు, బేలలకు, గడుసులకు, బీదలకు, భాగ్యవంతులకు నొకరీతిగనమ్ముచు న్యాయమయిన లాభమును గ్రహించుచు ధర్మపథంబు దప్పక ధర్మరాజువలె వ్యవహరించుచుండె. అత్తరి యాతండీ కౌశికునిరాకఁ గ్రహించి సవినయంబుగ వాని దరిఁజేరి నమస్కరించి కుశలమడిగి, యాయవ్వ (కౌశికునంపిన పతివ్రత) క్షేమంబు లరసి తెలిసికొని, వాని నొకించుక సేపు అక్కడ నేయుండ నియమించి తిరిగి తన వ్యాపారమును సాగింపబోయె. అంత నాబ్రహ్మచారి యిట్లు వితర్కింపఁ దొడంగె, "ఏమి యీయద్భుతము. ఇది కలయా లేక సత్యమా ఇంతకాలమునుండి కలయందుండు టెట్లు? లేక నేభ్రమగొనుచున్నానా? ఆ కొక్కరసంగతి మొదటయాస్త్రీ కేల దెలియవచ్చెను? ఆపె పంపగా నేనిటుల వచ్చితిననిమాంసమునమ్మికొను నెఱుక కులమునబుట్టిన యీకసాయివాని

కెట్లు తెలియవచ్చె. ఇదంతయు యోగాభ్యాసమువలన గలిగెడు అష్టవిధసిద్ధుల ప్రభావముగానోపు, అబ్బా! నేనింత కాలము శాస్త్రాధ్యయనము జేసి,జేసి తపంబాచరించినను నాకలవడని యీ శక్తులు వీరల కెట్లు సాధ్యంబులయి యుండు? వీరిద్దరును గృహస్థాశ్రమమందుండి, విషయసుఖముల ననుభవించుచు నేయుండిరే! ఏమిది! అద్భుతము! అనుచుందనలో దాను తలపోయుచుండగా గుభుల్ మని ఫిరంగి ధ్వని వినఁబడియె. అంతట నెల్లరు వేవేగ నిండ్లకుబోవువారును, కొట్లుకట్టివేయువారును, సందడిగొనునట్లు వీధియంతయు నొక్కపెట్టు గొణగొణధ్వనిలో మునింగిపోయెను. ఇదియేమనియడుగగా ఫిరంగి వేసిన 12 గంటలాయెనుగాన యెల్లరు తమతమనివాసముల కేగుచుండిరియని దెలిసికొనియెను. పిమ్మట కొన్నినిమిషములలో ధర్మవ్యాధుండును తన కొట్టుమూసి బ్రహ్మచారి కూర్చునియున్న ప్రదేశమున కేగుదెంచి వానిఁదన గృహమునకు దీసికొనిపోయెను. తదనంతరంబ తానుతనదల్లి దండ్రులకుజేయు నుపచారక్రమంబును, హింసాస్వరూపంబును జీవలక్షణంబులను, తనపూర్వజన్మ వృత్తాంతంబును జెప్పి కౌశికుని ధర్మ సందేహంబులదీర్చి యాతని సంతుష్టాంతరంగునిగ జేసె. ఆతండును సంతుష్టాంతరంగ హృదయుండయి తనస్వదేశంబున కేగి సుగుణలక్షణ సమన్వితయు, సత్కులజాతయు, సౌభాగ్యవతియునగు నొక్కచిన్నదానివరించి విధివిహితముగవివాహంబయి గృహస్థాశ్రమంబున అనేకవత్సరములు గడిపి, కాలక్రమమున వానప్రస్థ యతివృత్తులఁగడపి తుదకు నిత్యపదవి నొందెను.

('బాల' పత్రికనుండి స్వీకరింపఁబడియె.)

## శ్రీమన్నారాయణమూర్తి కపిలాచార్యుండుగ నవతరించి తల్లియగు దేవహూతికి నుపదేశించిన భక్తిమార్గము.

సంసారబంధమునకును మోక్షమునకుం గారణంబు చిత్తంబ. అయ్యది విషయాసక్తంబయ్యేనేని బంధహేతువగు. నారాయణాసక్తంబయిన మోక్షకారణంబైదనరు. మఱియు నహంకార మమకారరూపమగు నభిమానమువలనంబుట్టెడు కామక్రోధాదికలుషవ్రాతంబులచే విముక్తంబై చిత్తంబెప్పుడుపరిశుద్ధంబగు నప్పుడది సుఖదుఃఖ వర్జితంబై సమత్వంబుం గాంచు. అందువలన పురుషుండు జ్ఞాన వైరాగ్య భక్తియుక్తుండగుచు సుఖదుఃఖవర్జితుండు, నేకరూపుండును, ప్రకృతికంటెఁ బరుండును, బరమపురుషుండును, నిర్భేదనుండును, స్వయంజ్యోతియు, సూక్ష్మస్వరూపుండు, నఖండితుండునగు పరమాత్మునిం దర్శించు. మోక్షసిద్ధికొఱకు నిఖిలాత్మకుండగు భగవంతునియందు నియుజ్యమానంబగు భక్తికి నితరమార్గంబులు సరిగావని యోగివరులు సెప్పుదురు. పురుషుఁడు దుస్సంగంబున సంసారబంధంబునం దగులు. సాధుసంగంబుచే ననర్గళ మోక్షద్వారంబుం జేరు. సాధువులెట్టివారనినః పరులుదమకొనరించునెగ్గు సహించువారును, దయాపరిపూర్ణులును, సర్వభూత సుహృత్తులును, అజాతశత్రులును, పరమశాంతులును, నాయందుదృఢమై యనన్యమగు భక్తిగలవారును, సర్వకర్మ ఫలంబుల నాకర్పణంబుఁ జేయువారును, మత్పదాశ్రయులును, మద్గుణధ్యాన పారీణులును, మదీయకథల నుడువుచు వినుచు నానందించుచుండు పరమభాగవతోత్తములు సాధువులు. అట్టివారి నాధ్యాత్మికాది తాపత్రయంబు తపింపఁజేయంజాలదు. సర్వసంగవివర్జితులగు నట్టిమహానుభావులసంగంబపేక్షణీయంబు. అది సకలదోష నివారకంబగు. అట్టిసత్సంగంబున గర్ణరసాయనంబులగు మదీయ కథాప్రసంగంబు లభించు. మదీయకథా శ్రవ

ణంబువలనఁ గ్రమంబున మోక్షమార్గదంబులగు శ్రద్ధాభక్తులు దయించు. భక్తిగలిగినవెనుక నింద్రియ సుఖంబులు రుచింపవు. ఐహికాముష్మిక భోగంబులయందు విరక్తిపొడము. అట్టివాఁడు జ్ఞానవైరాగ్యములచేతను సద్భక్తిచేతను నన్నుంబొందు.

ఇదియునుంగాక ఎట్టివృత్తియందు దశేంద్రియంబులును మనస్సుతోడంగూడ నితరవ్యాపారముల జాలించి ఏకముఖంబై శుద్ధసత్వమయంబగు భగవద్దివ్య రూపంబునందును, భగవత్సేవయందును సుఖించునో అట్టిభక్తిముక్తికంటె శ్రేష్ఠంబు. అదిజఠరాగ్నిభుక్తాన్నమును జీర్ణంబుచేయుచందంబున లింగశరీరమును భరిగంబుగావించు. కావునఁ గొందఱు మహాత్ములు నాచరణారవిందముల హృదయముననిలిపికొన్నవారై పరమానందముతో నాచరిత్రంబు లొండొరులకుం జెప్పికొనుచు నన్నుంగీర్తించుచు సర్వకర్మముల నాకర్పించుచు మనంబున మోక్షంబు గోరకుందురు. అట్లుండియు వారలణిమాద్యష్టవిభూతులుగలదియు, నిత్యానందస్వరూపమైనదియు, నప్రమేయంబును, సర్వలక్షణ సంయుక్తంబునునైన మోక్షపదవిఁబొంది నాకాలచక్రంబునం జిక్కక శాశ్వతంబునుం బరిపూర్ణంబునగు సుఖంబనుభవింతురు. ఏలయన నట్టివారికేనాత్మసముఁడనై ప్రియుఁడనై సఖుఁడనై గురుఁడనై ఇష్టదైవమునై కాలచక్ర భయంబుఁ జేరక వారింతు. మఱియు సర్వాంతర్యామియై మెలంగునన్నెవ్వరేని నిజభక్తితో సేవించిననట్టివారిని ఘనంబగు మృత్యుసాగరంబునుండి తరింపఁజేయుదు. జగత్ప్రభుండగు నాకంటె నన్యంబులగు దైవంబుల భజించువారు సంసారభయపీడితులగుదురు. మదీయంబగు నాజ్ఞాభయంబుచే వాయువువీచు, అగ్ని ప్రజ్వలించు, సూర్యుండు ప్రకాశించు, ఇంద్రుండు వర్షించు, మృత్యువు పరువిడు. కావునవిజ్ఞాన వైరాగ్యకలితమగు భక్తియోగంబునం బరమపదముకొఱకు యోగివరులు నిర్భయంబున మచ్చరణంబుల భజింతురు.

## "ఔ కు గ్రా మ హిం దూ స భ"

ఈ సాధారణ సం॥రం ఆషాఢ శు. ౧౫ లు శుక్రవార మున కర్నూలుజిల్లా ఔకుగ్రామమునందలి బ్రాహ్మణులందఱు గలిసి ఔకు హిందూమతోద్ధారణ సభయను నామమున నొకసభ నేర్పాటుచేసిరి. ఆదినము వ్యాసపూర్ణిమయగుటంబట్టి యా పుణ్యదినమున మొదటిసభ నుపక్రమించిరి. సమీపముననుండు నితరులకు సహిత మాహ్వానపత్రికలు పంపియుండిరి. గ్రామస్థులు గాక పెణ్షన్డ్ సబ్జడ్జిగారగు మ-రా-రా-శ్రీ, టి. రామచంద్ర రావుగారును, కర్నూలు ప్లీడరు మ-రా-రా-శ్రీ, టి. చిదంబర రావుగారును, నందియాల ప్లీడరు మ-రా-రా-శ్రీ అ. వెంకట సుబ్బరావుగారును కడప హైస్కూలు ప్రధానోపాధ్యాయులు మ-రా-రా-శ్రీ, చిట్టమూరు రామయ్యగారును, వచ్చియుండిరి.

తొలుదొలుత పూర్ణిమా ప్రతిపత్సంధికాలమున గ్రామము నకు వెలుపటనుండు శ్రీ శ్రీ చెన్నకేశవస్వామి యాలయమునందు సభవారందరును జేరి, వ్యాసమహర్షి నుద్దేశించి పూజసలిపి, సభ నుపక్రమించిరి. మ-రా-రా-శ్రీ, టి. రామచంద్రరావుగారిని సభ కగ్రాసనాధిపత్యమును వహింప వేడుకొన, వారంగీకరించిరి.

ఆదినమునను, మరునాడును గ్రామమునందలి హిందువు లందఱును ఆయాలయమునొద్దనేయుండి, వనభోజనముచేసి సభా కార్యములందే పూనియుండిరి. వర్షాభావముచేతఁ బానీయమున కు సయితము జలములేక బాధపడుచుండిన నీగ్రామమున, నీసభ యుద్యమించిన దినముననే ప్రాతఃకాలమునఁ గుంభద్రోణములుగ వర్షించి, గ్రామమున కిరుప్రక్కలనుండు నదులు రెండును పరిపూ ర్ణముగ ప్రవహించెను. సభ నుద్యమింపగనె వర్షముగురియుట దైవానుగ్రహసూచకమని జనులందఱు సభాకార్యములం దత్యం త శ్రద్ధయు నుత్సాహమును నెక్కుడుగఁజూపిరి.

పూర్ణిమనాడు సాయంత్రము మ-రా-రా-శ్రీ, అలవకొండ వెంకటసుబ్బరావుగారు "ఆచారము"ను గురించి యాంధ్రమున నుపన్యసించిరి. తిరిగి యారాత్రి 'మనోనిగ్రహము'ను గురించి చిట్టమూరు రామయ్యగారును, టి. రామచంద్రరావుగారును, ఉపన్యసించిరి. ప్రతిపత్తిథినాడుదయకాలమున చిట్టమూరు రామయ్యగారు 'ధర్మము'ను గురించి యుపన్యసించిరి. ఆదినము భోజనానంతరమువారును, టి. రామచంద్రరావుగారును "ఇది మంచి సమయము" అనువిషయమునుగురించి యుపన్యసించిరి. అందుముఖ్యముగ మనహిందూదేశమున పెక్కుమతములవారలున్నవారనియును, వారందఱు అన్యోన్యమత వైషమ్యములుమాని సోదరభావమున వర్తింపవలయుననియును, మఱియుని కాలమున "సంఘేశక్తిఃకలౌయుగే" యను న్యాయానుసారముగ జనులు ఐకమత్యముగలిగి సర్వజనక్షేమముకొఱకు పాటుపడవలయునని యును, భేదబుద్ధులు మానవలయుననియు, అహంకార మమకారములుమాని పరోపకారపరులు కావలయుననియును, అట్లువర్తించువారలకు భగవదనుగ్రహ మీకాలమున సులభముగ నబ్బుననియును, ఈలోనగు విషయములు నొక్కివక్కాణించిరి. సాయంసంధ్యావందనాదులు ముగిసినపిదప తిరిగి సభచేర "భగవద్ధ్యానము" విషయము టి. రామచంద్రరావుగారు పన్యసించిరి.

ఈసభ శాశ్వతముగ జరుగునటుల కార్యనిర్వాహక సభనొకటి నియమించిరి. బ్రహ్మశ్రీ అక్షితల రామసుబ్బయ్యశాస్త్రిగారు సభాధ్యక్షులుగను, మ-రా-రా-శ్రీ, వెంకటేశమయ్యగారు కార్యదర్శిగను, బాలవెంకటేశయ్యగారు సహాయ కార్యదర్శిగను నియమింపఁబడిరి. ప్రతివత్సరమును ఆషాఢ శుద్ధ పూర్ణిమా దినమున సభ వర్షోత్సవము జరుపునటుల నిర్ధారణచేసికొనిరి. అంతటనీ సంవత్సరపుసభ ముగిసెను.

Registered No. M. 716.

ఓం.



# దివ్యజ్ఞాన దీపిక.

(పూర్వమున "హంస").

**A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.**

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె నెక్కువ ధర్మములేదు).

సంపుటము 1. { **September 1910.** / సెప్టంబరు నెల 1910. } సంచిక 6.

## విషయసూచిక.

పుట.



సం॥రమునకు చందా 1 రూపాయ.

CHITTOOR, N. A. DT.:—PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
FOR P. NARASIMHA AIYA GARU, *Publisher.*

## పత్రికాధిపతుల నోటీసు.

—:0:—

మాపత్రికెను పుచ్చుకొనుచుండువార్లనేకులు చందాపైక ము పంపలేదు. పత్రిక అక్కరలేనివారు ఆసంగతి మాకు తెలియపరచవలయును. లేదా పత్రికెలనైనా వాపసుచేయవలయును. అట్లుచేయనివారు చందాచెల్లించుటకు సమ్మతించినట్టు భావించి వారికి అక్టోబరు సంచికె వాల్యూపేయబిల్ పోస్టులో పంపబడును.

చిత్తూరు
1—9—1910.

పరమాత్ముని నరసింహయ్య,
పబ్లిషర్.

ఓం.

# దివ్యజ్ఞాన దీపిక.

(సత్యమునకంటె నెక్కువ ధర్మములేదు).

సంపుటము 1. **September 1910.** సంచిక 6.
సెప్టంబరు నెల 1910.

## జననమరణములు.

శ్లో॥ జాతస్యహిధ్రువోమృత్యు ర్ధ్రువంజన్మమృతస్యచ।

పుట్టినవానికెటుల చావుసిద్ధమో చచ్చినవానికిని ట్లే పునర్జన్మముసిద్ధమని భగవంతుఁడగు శ్రీకృష్ణమూర్తియర్జునునకుపదేశించె. ప్రతిమనుష్యుఁడును పుట్టుచుఁ జచ్చుచు మరలఁబుట్టుచు తిరిగిగిట్టుచు నిత్తెఱంగున లెక్కలేని జన్మములెత్తుచుండు. జీవునికించుస్వాతంత్ర్య మించుకయులేదు. జననమరణ రూపమగు నీయవిచ్ఛిన్నప్రవాహమే సంసారమనఁబరగు. ఈజననమరణ పరంపరకు లోనైయుండుటయే సంసారబంధంబు. దానినుండి విడువఁబడుటయే మోక్షంబనఁదగు. కావునవీని స్వరూపంబు చక్కఁగా విమర్శించి యరయుటొప్పు. సామాన్యనరునకు జననమున సంతోషభావమును మరణమున దుఃఖభావమునుబొడము. లోకములో మనుష్యజాతినంటియుండు సమస్త భయహేతువులలో మరణము తిదారుణమైనది. దానివలనగలిగెడునంతభయము మఱిదేనివలనగానిగలుగుటలేదు. మృత్యుభయము పామరజనులను మాత్ర

ముగాక పండితులను సయితముపీడించు. విశ్వామిత్రునిశాపముచే నిజపుత్రులు హతులైనపుడు వసిష్ఠమహర్షి చెందిన వ్యాకులమును, యుద్ధరంగమున లక్ష్మణస్వామి మూర్ఛాక్రాంతుఁడై విగతజీవునివలె గన్పట్టినపుడు శ్రీరామచంద్రమూర్తి పడినదుఃఖమును, భారతయుద్ధమున భీష్మద్రోణాది స్వజనులు మడియుదు రేమోయన్న భీతిమనంబున బొడమినపుడర్జుసునకుగలిగిన విషాదంబును దలంచుకొన్నచో పామరజనులకు మరణమతిభయోద్రేకమగుట యేమిచోద్యము. కావుననే 'చావుకంటె కీడు జగతిలేదు' 'తనచావు జగత్ప్రళయము' ఇత్యాది సత్యవిరుద్ధవాక్యములకుల్లోకమునఁబ్రచారముగలిగె. దానినిజస్వరూప మెఱుఁగమిచేనది యింతభయావహముగను దుఃఖకరముగనుతోచెడినిగాని వివేకముతో నరసిచూచినపుడది సర్వభూతములకు స్వభావసిద్ధమైనట్టియు నిరుపద్రవమయినట్టియు కేవలయవస్థాభేదమునిస్పష్టమగును.

అట్లగుటంజేసి సర్వవిధముల నిదివిచారింపవలసినయంశము. జననమరణములు రెండునుద్వంద్వములు. ఒండొంటివిడిచి యుండవు. ఆత్మకు జననమరణములు లేవు. 'నజాయతేమ్రియతేవాకదాచిత్' అయ్యదియొకప్పుడైన బుట్టదు చావదని కఠోపనిషత్తు బోధించుచున్నది. అట్లైనిజననమన నేమి? మరణమన నేమి?

శ్లో॥ వాసాంసిజీర్ణాని యథావిహాయ ।
నవానిగృహ్ణాతినరోపరాణి ।
తథాశరీరాణి విహాయజీర్ణా ।
న్యన్యానిసంయాతినవానిదేహీ ॥

పురుషుఁడు ప్రాతవస్త్రములను పరిహరించి నూతనవస్త్రములను గ్రహించునట్లు జీవుఁడు జీర్ణదేహములనువిడిచి క్రొత్తశరీరములను స్వీకరించును. జీర్ణశరీర పరిత్యాగమే మరణము. నూతనశరీరమును దాల్చుటయే జననము. ప్రతిమనుష్యుఁడును నింత

వఱకు లెక్కలేని శరీరములధరించి పరిత్యజించినవాఁడే. శరీర పరిత్యాగమన్నచో భీతిఁజెందుటెందుకు? అజ్ఞానమే కారణము.

శరీరము విడిచినవెనుక జీవుఁడెచటికేగు? ఏగతింజను? ఎందుండు?, ఎట్టిసన్నివేశంబుల మెలఁగు? అప్పుడువాని స్థితియె ట్లులుండు? అస్లెంతకాలమ్ము గడుపు? పిమ్మట నేదారిఁ దిరిగివచ్చు? రాఁగతంబేమి? అనువిషయములు ప్రతిమనుష్యునికి నవశ్యమెఱుఁగదగినవిగదా. ఎవఁడుగాని వీనితో దనకక్కఱలేదని చెప్పఁగలుగునే. ఒకమనుష్యుఁడొక దూరదేశమునకు పోనిశ్చయించుకొనెనేని యెంతకాలమునుండి ప్రయాణసన్నాహము చేయు? ఎందరిని విచారించు? ఎంతవస్తుసామగ్రి సేకరించుకొనును? పయనముకొఱకెన్ని విధములఁ బ్రయత్నించు? అట్టివాఁడు పరలోకప్రయాణమునకై యించుకయినఁ బ్రయత్నించక మనంబున నావిచారమేలేక ప్రమాదము నొందియుండుట యెంతయుచోద్యమైయున్నది. ఈవిషయము దివ్యజ్ఞానసమాజ గ్రంథములందు బహు స్పష్టముగ వివరింపఁబడియున్నది. దీనిం బ్రత్యక్షానుభవముచేఁ గరతలామలకముగ నెఱిఁగిన మహనీయులును గొందఱుగలరు.

మరణమునుగూర్చియు, తదనంతర స్థితినిగూర్చియు చక్కఁగ నెఱుఁగఁగోరితిమేని జీవునికిఁగల శరీరములివియనియు వానిస్వరూపమిట్టిదనియు సాంగముగ నెఱిగియుండవలయు. సంసారబద్ధుండగు జీవుఁడు సంచరించుచుండు లోకములుమూఁడు. భూలోకము, భువర్లోకము, సువర్లోకము. వీనికే మనుష్యలోకము, పితృలోకము, స్వర్గలోకమనియు నామాంతరములుగలవు. ఇవి ప్రత్యేకప్రత్యేకస్థలములనుండునవిగావు. ఒక స్థలముననే ఓతప్రోతములవలె నొకదానితోనొకటి పెనగియుండు. ఒక్కొక్క లోకమందును దానిప్రకృతిచే నిర్మించఁబడిన శరీరమొకటి జీవునకుఁగలదు. భూ

లోకదేహము పార్థివశరీరమనియు, భువర్లోకదేహము ఆపశ్శరీర మనియు, సువర్లోకదేహము తేజశ్శరీరమనియు వ్యవహరింపఁబడు.

ఇమ్మూడు శరీరములతోడ నరుఁడీలోకమున సంచరించుచుం డు. లోకములవలెనే 'యీశరీరములునునొకఁ స్థలమ్మున పరస్పర ము పెనగియుండు. ప్రాణముస్థూలదేహాంబున నాపాదమస్తకము వ్యాపించియుండు. అట్టిప్రాణమునుత్క్రమణకాలమున పాదాగ్రము లనుండిప్రారంభించి క్రమక్రమముగనన్నియంగంబులనుండి విడదీసి హృదయమునం జేర్చికొని జీవుఁడచటినుండి సూక్ష్మసుషుమ్నానాడి మార్గమున శిరస్సునం బ్రవేశించి బహిర్గతుఁడగు. ఇదియేమరణము. అట్టి ప్రయాణసమయఁబున నొకఁ క్షణకాలము జీవునికంతఃప్ర జ్ఞవికసించి బాల్యము మొదలు తానుచేసిన మనోవాకాఁయ కర్మములన్నియును వానివలన ఇఁకమీఁధుతనకు రానున్న ఫలములును పటమునందలి చిత్తరువులవలె మనోదృష్టికి స్పష్టముగ గోచరమగును. అట్టిసమయంబున చుట్టునున్న బంధువులు దుఃఖ పరవశులై శోకాలాపములచే పెనుబొబ్బలిడుచు పెద్దరోదనఁబు గావించినచోఁ బ్రయాణోన్ముఖుఁడైన జీవునిచిత్తశాంతికి భంగ ముకలిగి దివ్యదృష్టికిలోపము సంభవించి జీవితచరిత్రప్రదర్శన మునకంతరాయముగలుగు. కావుననట్లుచేయుట మరణ సన్నద్ధునికి మహాపకారము. సమీపవర్తులందరత్తరుణమున శాంతమనస్కులై భగవద్ధ్యానంబును నామసంకీర్తనంబునుం జేయవలయుగాని దుఃఖమునుపొర్లిరానివ్వరాదు.

స్థూలశరీరమునువిడిచి వెల్లినపిమ్మట జీవుఁడు భువర్లోకము నందలియధోభాగమగు ప్రేతలోకమునుబ్రవేశించు. అదియం ధకారబంధురమై దుర్గంధపూరితమై మనుష్యావాసమునకు సర్వ విధములననర్హమైయుండు. ఇదియ మనశాస్త్రములందు నరకమ నిచెప్పఁబడియున్నది. ఆజన్మమునఁజేసిన పాపసంచయమున కను

గుణ్యముగ నిందు కొంతకాలముజీవుఁడు దుఃఖమనుభవించు. దీనినివిడిచి యూర్ధ్వముఖుఁడై పుణ్యలోకములకుఁ బోవునట్లుచేయుటకే మొదటపదిదినములు జరుగునపరక్రియలును సంవత్సరాంతమువరకు జేయఁబడు మాసశ్రాద్ధాదులును నియతములైయున్నవి. శ్రద్ధాభక్తులతో జ్ఞానవంతులచేనివివిధ్యుక్తముగ జరుపఁబడినయెడల సంవత్సరాంతమునమృతుఁడు ప్రేతత్వమునుండి విముక్తుఁడైపితృగణముంగలిసి భువర్లోకముయొక్క యూర్ధ్వభాగమగు పితృలోకముంబ్రవేశించు. కామక్రోధాదులను జయించి యింద్రియనిగ్రహముగాంచినవారు పితృలోకమున పెద్దకాలము నిలిచియుండరు. అదియును పాప కర్మానుభవస్థలంబైయుండు. ఎవ్వఁడేనియు బ్రతికియుండునప్పుడు కేవలము స్వార్థపరుఁడై తనలాభము తనసుఖమును తనప్రతిష్ఠయున్నపేక్షించుచు పరులకెగ్గుచేయుచు పరధనముల నపహరించుచు పరులమనంబునకు ఖేదంబుగావించెనేని నట్టివాఁడు దేహపతనానంతరము పితృలోకంబునుండి తప్పించుకొను వెరవుగానక దీర్ఘకాలమచట పెకిఁ-డుములఁబడు. అట్లగుటంజేసియే

శ్లో॥ శక్నోతీహైవయస్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్।
కామక్రోధోద్భవంవేగం సయుక్తస్ససుఖీనరః॥

ఎవఁడీలోకమునందే శరీరమును విడుచుటకుముందు కామక్రోధములవలనఁ బుట్టెడు మనఃక్షోభమును నణచుటకు సమర్థుఁడగుచున్నాఁడో వాఁడెజ్ఞానవంతుఁడు వాఁడే సుఖపురుషుఁడని గీతాశాస్త్రమందుఁ జెప్పఁబడియున్నది. సామాన్యమనుష్యుఁడు పితృలోకంబున నేఁబది యరువది సంవత్సరములఁగడపు. దీనినుండి విడువఁబడియూర్ధ్వలోకములకేగుటకై పితరులకు సాంవత్సరీకశ్రాద్ధములుసలుపుదురు. కొంతకాలమునకు నాపశ్శరీరంబునచట త్యజించిపితృత్వమును విడిచి తేజశ్శరీరధారియైస్వర్గలోకంబున కేగు. అదియదేవలోకము.

స్వర్గలోకము దుఃఖలేశములేక రమ్యమై మనోహరమై అత్యంత సుఖకారియై మిగులభోగ్యమైయుండు. కాఁబట్టి దానికి నాకలోకమనియుపేరు. జీవుఁడచటఁ జేరితానొనరించిన సుకృతమునకనురూపముగ దీర్ఘకాలముసుఖమనుభవించు. భూలోకమున తానుగ్రహించిన విద్యయు తాను సంపాదించిన జ్ఞానమును తానుపొందిన యనుభవములన్నిటిని జ్ఞప్తికిఁదెచ్చుకొన్నవాఁడై వానిసారమును గ్రహించు. ఇదియంతయు నించుమించుగ వేయి సంవత్సరములు పట్టును.

శ్లో॥ తేతంభుక్త్వా స్వర్గలోకంవిశాలం।
క్షీణేపుణ్యేమర్త్యలోకంవిశంతి॥

పుణ్యకర్మఫలమంతయు ననుభవింపఁబడిని శ్శేషముకాఁగానే జీవుఁడుస్వర్గశరీరమునువిడిచి విదేహియైస్వస్వరూపంబున స్వల్పకాలముండియంతట యధోముఖుండగు. ఆసమయంబున దివ్యదృష్టికలిగితనయథార్థస్థితియు ననేకజన్మములనుండి తానొనరించిన కర్మసంచయశేషమును తనకు సిద్ధపరచఁబడియుండు జన్మవృత్తాంతమును వీనికిఁగలకార్య కారణసంబంధమును నొక్కనిమిషకాలంబు పర్యాలోకనంబుచేయు. అంతట మఱల మాయచేతఁగప్పఁబడినవాఁడై నూతనజన్మమునకు వలయు స్వర్గశరీరమును భువర్లోకశరీరమును పరిగ్రహించుకొని ఋణానుబంధకారణమున నిర్ణీతంబైయుండు మాతృగర్భంబునంబ్రవేశించి మరల జన్మమెత్తి ప్రారబ్ధమనుభవించు.

శ్లో॥ పునరపిజననం పునరపిమరణం।
పునరపిజననీజఠరేశయనం।
ఇహసంసారేబహుదుస్తారే।
కృపయాపారేపాహిమురారే॥

## స నా త నా చా ర ము లు.

ఈ పత్రిక జూన్ నెల సంచికయందు హిందూశాస్త్రముల లో సమస్తకర్మలాచరించుటకు నియమింపఁబడిన పద్ధతులన్నియు ప్రకృతిధర్మముల(natural laws) ననుసరించియున్నవని వ్రాయబఁడియుండెను. ఇంకప్రతికర్మకును విధించఁబడిననియమములట్లున్నది లేనిదివిచారింతము.

ఈ విచారమతిముఖ్యము. జనులు నిత్యమాచరింపవలసిన కర్మలు శాస్త్రరీతిని ఆచరించినపుడు, ఉన్న ఆరోగ్యము చెడక, చెడిన ఆరోగ్యము చక్కఁబడుట నిశ్చయమని తెలిసినపుడు, ఎందరు ఆకర్మాచరణచే వ్యాధులకు చికిత్సశ్రమపడకుండుటయు, ఆ వ్యాధులు నివారణచేసికొనుటకుగాను మందులకైకోట్లకొలది ధనము పరదేశమునకు పోక ఆపుటయు సంభవించునో చూడుఁడు. మఱియు ఆరోగ్యభాగ్యమనుభవించువాఁడు ఐహిక పారమార్థిక ధర్మములభ్యసించగలఁడేగాని సర్వదారోగముల నుభవించువాఁడేకార్యముచేయుటకు సమర్థుఁడుకాఁడు. వాఁడేదియుచేయుటకు సామర్థ్యములేనివాఁడుగానుండును. ఎంత సంపదయున్ననేమి, ఎంత విద్యనేర్చిననేమి, సంపదననుభవించుటకును, నేర్చినవిద్యననుసరించి ఆచరించుటకును తగినదేహములేనపుడు అవివ్యర్థములేకదా? కనుకనే శ్రీశంకరాచార్యుల వారు ప్రశ్నోత్తరరత్నమాలికయందు

శ్లో॥ కింసౌఖ్యందేహభృతా మారోగ్యం।
కఃఫలీకృషికృత్॥

అని చెప్పినారు, అనగాదేహధారికి సౌఖ్యమేది? ఆరోగ్యము, ఎవఁడుఫలమనుభవించును? కృషిచేయువాఁడు. అని తాత్పర్యము. ఇంతియగాక సద్గురువులు సత్కర్మానుష్ఠానము

నకును, ధ్యానయోగాభ్యాసములకును తగినపూర్ణారోగ్యము గలిగి దేహపాటవము బాగుగనుండువారిని శిష్యులుగానంగీకరించి ఉపదేశాదులుచేసి, ఆత్మవిద్య బ్రహ్మవిద్యలభ్యసింప జేయుదురు గాని నానారోగములతోనిండియుండు దేహముగల బలహీనుల నంగీకరింపరనుట నిశ్చయము. ఐహికలాభమునకును, పరమార్థలాభమునకును ఆరోగ్యభాగ్యమతిముఖ్యమనుటయందందరు ఏకీభవింతురు.

మన దేశప్రజనులు పూర్వముండిన స్థితికిని ఇప్పుడుండు స్థితికిని పోల్చిచూడ, ముఖ్యముగా నింగ్లీషుచదివిన వారు ఆరోగ్యమందు చాలలోపముగలవారై నానాబాధలనుభవించుచు అల్పాయువులై మృతినొందుచున్నారని తెలియుచున్నది. వీరిలో ననేకులు మలబద్ధరోగులు, మఱికొందఱు బహుమూత్రవ్యాధి గలవారు, మఱికొందరు నేత్రపాటవములేక అతిబాల్యదశలోనే ఉపనయనములు (జ్ఞానచక్షువుల సంపాదనకుగాను పొందునుపనయన సంస్కారముకాదు సుమా) ముకర్ద్దములు, సులోచనములు ధరించితిరుగువారు. వీరెక్కడికిపోయినను, ఎవరింటగుడిచినను తమభత్యము తాము మోసుకతిరుగుదురు. వీరికి శాల్యాన్నము భుజించు ప్రాప్తములేదు. గోధుమనూకలు చంకబెట్టుకొనియేపోవలెను. మందుబుడ్లబుట్ట వెంటనంటేయుండవలయు. పూర్వమందు రాచపుండ్లు దేహసుఖమతిగాననుభవించుచుండిన రాజులకు మాత్రముప్రాప్తమగుచుండెను. ఇప్పుడు తఱుచుగా ఆపుండ్లతోనే అనేకులు యమునివాతఁబడుచున్నారు. ఇట్టిదురవస్థలను తొలగించుటకు ప్రయత్నముచేయవలసినది ముఖ్యమైనకర్తవ్యముగదా? ఈ యవస్థలు శాస్త్రానుష్ఠాన కర్మలచేనివారణమగుట నిశ్చయమనితోచి వానినిగురించి అప్పుడప్పుడు కొంచముగా వ్రాయబూనెదము.

సనాతనధర్మశాస్త్రములందు నియమింపఁబడిన ప్రతికర్మ కునువిధి,కాలక్రమము లేర్పరుపఁబడినవి. ఏకర్మ చేసినను దాని కేర్పరుపఁబడిన విధికాలక్రమముల ననుసరించియుండవలెను గాని విడిచియుండఁగూడదు. వానినివిడిచి చేసినకర్మ చేఁగలుగవలసిన ఫలముకలుగదు. కొన్నిసమయములందు విపరీతము గు ఫలమును, విరోధమగు ఫలమును సంభవించును. దానిచే ఆరోగ్యములు వృద్ధి అగుటకుమారుగా రోగాదులే వృద్ధి యగును. కనుక ప్రతికర్మకు విధికాలక్రమములతిముఖ్యములు. దేహమునకు జీవమెంతయవశ్యమో సర్వకర్మలకును విధికాలక్రమములంత అవశ్యము. విధికాలక్రమములు కర్మలన్నిఁటికి జీవమువంటిది. విధికాలక్రమము విడిచిచేసినకర్మ జీవములేని దేహమువలెనుండు. చైతన్యములేని దేహముతో నెంతప్రయోజనమో అంతప్రయోజనమే వీనియందును ఉండును.

విధియనగా కర్మచేయుటకుగాను నియమింపఁబడిన వస్తువును, పద్ధతియు. విధ్యుక్తకర్మయనగా నేకర్మకు ఏవస్తువు యేస్థితిలోనుండునపుడెట్లు ఉపయోగించవలెనని శాస్త్రములలో నియమింపఁబడినదో ఆరీతిన లేశమైన తప్పకచేసినకర్మ. సకాలయుక్త కర్మ అనగా ఏకర్మ ఏకాలములో చేయవలెనని శాస్త్రములలో శాసింపఁబడినదో ఆకాలమునకు సరిగాచేయుటె. క్రమయుక్త కర్మయనగా ఏదిమొదలు ఏది ఆవలచేయవలెనని శాస్త్రములలో నాజ్ఞాపింపఁబడినదో ఆవరుసక్రమమువదలక చేయుట. కర్మ లాచరించునపుడివియన్నియు లక్ష్యమందునిచికొని ఆచరించినట్లయిన ఆకర్మఫలము తప్పకలభించుననుటయు, విడిచిచేసినపుడు ఆఫలము లభింపదనుటయు స్వభావసిద్ధము. అదెందుకన, ఏకర్మకుగాని ఇతర వస్తువులుకావలసియుండును. ఇతరవస్తుసంబంధములేక బాహ్యకర్మచేయనలవికాదు. వస్తువులు, స్థితిభేద

మును పట్టియు, కాలభేదమును పట్టియు వ్యత్యస్తగుణములు కలిగి యుండును. ఉదాహరణః—లవంగములు నిప్పులోఁ వ్రేల్చినపుడొక గుణమును, వ్రేల్వనపుడొక గుణమును గలిగియుండును. జొన్నదంట్లు, ఆముదపాకులు లేతపుడొకగుణమును, ముదిరినపుడొకగుణమునుపొందియుండును. లేతజొన్నదంట్లుగాని లేత ఆముదపాకులనుగాని పశువులుతినినచో చచ్చును. వానినేముదిరినపుడు తినినచో బలిసిసత్తువగలవిగానగును. ఇవ్విధముఁగనే వేర్వేరు వస్తువులు కాలభేదమునుపట్టియు, స్థితిభేదమును పట్టియు వ్యత్యస్తగుణములు పొందియుండును. ఈకారణముచేకర్మలకు విధికాలక్రమములతిముఖ్యములని చెప్పఁబడినది.

నిద్రలేచినది మొదలు మఱల నిద్రించువరకును జనులాచరించుచుండెడు కర్మలన్నిటికిని నియమము తేర్పరుపఁబడినవి.

మొదట నిద్రమేల్కొనుటయొక్క నియమములనుగురించి విచారింతము.

ఈ కర్మకనగా నిద్రమేల్కొను కర్మకు కాలముప్రధానము. ఏకాలమున నిద్రమేల్కొనవలెనని చెప్పఁబడినదో ఆ కాలముననే మేల్కొనవలెను. **దానికికాలమేదనః—**

శ్లో॥ బ్రాహ్మేముహూర్తే ఉత్థాయచింతయేదా
త్మనోహితం॥ అనియాజ్ఞవల్క్యులు.

శ్లో॥ బ్రాహ్మేముహూర్తే బుధ్యేతధర్మార్థావ
నుచింతయేత్॥ అనిమనువును.

శ్లో॥ బ్రాహ్మేముహూర్తఉత్థాయధర్మమర్థంచ
చింతయేత్॥ అనికూర్మపురాణమును.

శ్లో॥ బ్రాహ్మేముహూర్తముత్థాయమానసే
మతిమాన్నృప, విబుధ్యచింతయేద్ధర్మమర్థం
చాప్యవిరోధినం॥ అనివిష్ణుపురాణమును.

ఇవియన్నియు ఏకవాక్యముగా చెప్పుచున్నవి.

అనఁగా బ్రాహ్మ్యముహూర్తమున నిద్రలేచి ధర్మమును చింతించవలెనని తాత్పర్యము. బ్రాహ్మ్యముహూర్త మెప్పుడనగా:—

"సూర్యోదయాత్ప్రాగర్ధప్రహరే
ద్వౌముహూర్తౌ తత్రాద్యో బ్రాహ్మః
ద్వితీయో రౌద్రః॥"

సూర్యోదయమునకు పూర్వము రెండు ముహూర్తములున్నవి, వానిలో మొదటిది బ్రాహ్మ్యముహూర్తము. రెండవది రౌద్రముహూర్తము. ముహూర్తమునకు రెండున్నర గడియలు. అనగా. తెల్లవారకమునుపు ఐదుగడియలకుముందు నిద్రమేల్కొనవలెననుట. రెండున్నరగడియ ఒకగంటకాలమగుచున్నది. సూర్యుఁడుదయించుటకు రెండుగంటలుండగా నిద్రమేల్కొనవలెనని తాత్పర్యము. అనగా వేకువజామున కొంచమెచ్చుతక్కువ నాల్గుగంటలపుడు నిద్రలేవవలెనని అభిప్రాయము. ఈకాలమందు నిద్రలేచుటచే నేవిధమున నధికప్రయోజనముండుటనుగురించి కనుగొందము. ఈకాలమందు నిద్రనుండిలేచినగాని ఇతరకర్మలు సకాలమునకు చేయవల్లపడదు. లేచినతోడనే ధర్మచింతన చేయవలెనని పైశ్లోకములచే తేటపడుచున్నది. ధర్మచింతనను గురించి ఆవల వ్రాయఁబడును. తదనంతరము శౌచాదికర్మలు విధ్యుక్తముగా తీర్చికొని, స్నానముచేసిన వెనుక సంధ్యావందనాదులుగాని, ఇతరధ్యానాది పూజలుగానిచేయవలెనని నియమింపఁబడినది. ఇవన్నియు సూర్యోదయాత్పూర్వమే ముగించియుండవలెను. సూర్యోదయానంతరము వీనికిసకాలము కాదు. బ్రాహ్మ్యముహూర్తమున కావలవచ్చునది రౌద్రముహూర్తము. ఇదిసంధిసమయము. ఈసంధిసమయమందు నిద్రపోవుచుండగూడదు. అదెందుకన.

శ్లో॥ "చత్వారిఖలుకర్మాణి సంధ్యాకాలేషువర్జయేత్।
ఆహారంమైథునం నిద్రాంస్వాధ్యాయంచతథైవచ।
ఆహారాజ్జాయతేవ్యాధిః క్రూరగర్భస్తుమైథునే।
శ్రియంహరతివై నిద్రాస్వాధ్యాయాన్మరణంధ్రువం॥"

సంధ్యాకాలములందనగా 'సూర్యోదయాత్పూర్వ మొక గంటకాలమందును, సూర్యాస్తమయానంతర మొక గంటకాలమందును నాలుగు కర్మలు చేయతగవు. అవే వన:—భుజించుట, స్త్రీసంపర్కముసేయుట, నిద్రపోవుట, వేదముపఠించుట. ఎందుకన, అప్పుడుఆహారము పుచ్చుకొను టచే వ్యాధిగలుగును. స్త్రీసంపర్క మొనర్చుటచే బీజము గర్భమందునిలిచినట్లయిన క్రూరసంతాన ముత్పత్తియగును. నిద్రించుటచే సంపదతొలుగును. అధ్యయనము సేయుటచే మరణ ముతప్పక సిద్ధించునని తాత్పర్యము. సూర్యోదయాత్పూర్వము నిద్రనుండి మేల్కొనక సూర్యోదయానంతరము లేచుటచేసోమరి తనమువదలకుండును. ఏపనిచేయువారును వేకువలేచి శౌచాది కర్మలు తీర్చికొని తెల్లవారగానే తమతమపనులుచేయుటకు మొద లిడి ద్రవ్యముసంపాదించి సంపదనొందుదురు. సూర్యోదయా నంతరము లేచువారు శౌచాదిక్రియలుతీర్చుకొని తమపనులు సేయ వలసివచ్చును. దానికిగాను సూర్యోదయానంతరము కాలముపో గొట్టదలసియుండును. ఇతరజీవిక సంబంధమైన కార్యములుగా ని పరమార్థ సంబంధమైన కార్యములుగాని చేయవలసినకాల ము నిద్రయందును, శౌచాది కర్మలందునుపోవును. దానిచే ధననష్టముకలుగును. దానివలన దరిద్రముప్రాప్తమగును. వేకువ నిద్రలేవనివారు దినమంతయు జబ్బుగానుందురు గానిపని సేయుట కు చాకచక్యముండదు. ఇంతియేకాక ఆకాలమందునిద్రించుటచే దేహారోగ్యమునకును, పరమార్థమునకును చేయవలసిన ముఖ్య

కర్మలు సేయుటకు భంగమగును. స్నానము సూర్యోదయా త్పూర్వమే చేయవలెను. అదెంయకన నుదకమునకు సూర్యోదయాత్పూర్వముండు గుణము వేరు, సూర్యోదయానంతరముండుగుణము వేరు. సూర్యోదయాత్పూర్వము నీళ్లలోనుండు సమస్తమగు అతిసూక్ష్మమైన క్రిమికీటకములు (పురుగులు) అడుగున యుండు అడుగునంటుండుచున్నవిగాని నీటియందుండవని ఐతరేయ సహ్మితయందు చెప్పబడినదని తెలియవచ్చినది. దానిచేతనే వైద్యశాస్త్రమందు సూర్యుడుదయించుటకు పూర్వమెనిమిది పుడిసెళ్లు నీరుదావినచో వాతపిత్త కఫదోషములన్నియుపోయి మనుష్యుఁడు నూరుసంవత్సరములు సుఖముగా జీవించునని చెప్పఁబడినది.

శ్లో॥ అంభాంసిప్రసృతీరష్టావవను దితేపిబేత్ ।
వాతపిత్తకఫాన్జిత్వాజీవేద్వర్షశతంసుఖీ॥

అనియు, దీనియర్థము పైన వ్రాయబడినది. మఱియు,

శ్లో॥ అర్శశ్శోభగ్రహిణ్యోజ్వరజఠరజరాకోష్ఠమేదో
వికారాః।
మూత్రాఘాతాస్రపిత్తశ్రవణగళశిర
శ్శ్రోణిమూలాక్షిరోగాః।
యేచాన్యేవాతపిత్త క్షతజకఫకృతా
వ్యాధయస్సంతి జగతోస్తాంస్తాన
భ్యాసయోగాదపహరతిపయః
పీతమంతేనిశాయాః॥

అనగా అర్శరోగము, శోభజాడ్యము, జ్వరము, కడుపుపూళ్ళ, నడుమునొప్పి, మేదోవికారము, మూత్రవ్యాధులు, పిత్తరోగములు, చెవి, కంఠము, నెత్తి, పిరుదులు వీనికిసంబంధించిన వ్యాధులు వాతపిత్త శ్లేష్మదోషములచే జగత్తునందుండురోగములన్నియు

నిశాంతమందనగా వేకువజామున నీళ్లుత్రాగుటభ్యసించినట్లయిన పరిహారమగుచున్నవని తాత్పర్యము. వైద్యశాస్త్రమందు నీళ్లచేని న్ని రోగములు నివారణమగుచున్నదని చెప్పబడినదేగాక శ్రుతి యందును అట్లనే శాసింపబడినది. అరుణమందు •

"ఆమయావీచిన్స్వత।
ఆపోవై భేషజం।
భేషజమే వాస్మైకరోతి।
సర్వమాయురేతి॥"

అనగారోగములు నివారణచేసికొన్నుండు, నీరేఔషధము ఔషధముగానే నీరువర్తించును, సర్వమును ఆయువును పొందునని తాత్పర్యము. ఎప్పుడునీటియందు ఆరోగ్యగుణమున్నదో అప్పుడుదానినుపయోగించినట్లయిన ఔషధముగారోగముల నివారణ సేయగలముగాని లేనప్పుడెట్లుచేయగలము? ఈవిధముననివార ణయగుట కల్లమాటగాదు. మాఅనుభవమునకు వచ్చిన కొన్ని దృష్టాంతములుదాహరించెదము. మేము వివాహానిషేకప్రదీపి కయను గ్రంథము ప్రచురించితిమి. ఆగ్రంథములో ప్రశంసాను సారముగ నీపైచెప్పబడిన శ్లోకములు వ్రాయబడియున్నవి. నీరు సూర్యోదయాత్పూర్వముత్రాగుటచే రోగములు నివారణ మగు చున్నవను నమ్మకము గ్రంథకర్తయగు మాకుండలేదు. ఇట్లుండగా మేమొకనాడు తరణికల్లను గ్రామమునకు వెళ్లియుంటిమి. ఆగ్రామ మందుండొక వైద్యుడుమాకొమార్తెతో ప్రతిదినమునుసూర్యోదయా త్పూర్వము నీళ్లుత్రాగుట అభ్యసించమనిచెప్పెను. అట్లుచేయుచు ండగాఆమెకు బాధక్రమముగా తగ్గుచువచ్చెను. మేమకడికివె ళ్లినపుడు ఆవైద్యుడు, అయ్యామీరు ప్రచురించిన పుస్తకములో వ్రాసినప్రకారము మీకొమార్తెను నీళ్లు వేకువజామున పుచ్చుకొ మ్మని చెప్పితినిగాని వేరులేదు. మీరెందుకు అట్లుచేయమని యిం

తనుముందు చెప్పలేదని ఆక్షేపణచేయుచు, ఆయన, యీఅభ్యాస మొకశూలవ్యాధి యుండినవానికిని, అల్పముగా కుష్ఠురోగము గ న్పడినవానికిని చేయించినట్లును వారిద్దరికి ఆరోగములుపూర్తిగనివా రణఅయినదని చెప్పి, ఆపుస్తకము మహదుపకారముచేసినదనెను. అప్పుడుమాకును ఆశ్రుతి, శాస్త్రముల వచనములందు నమ్మకము కలిగెను. తదనంతరము మేమును ఒకమాసమునుండి ఈయభ్యా సము చేయుచున్నారము. అభ్యాసము మొదలిడిన యెనిమిదిరో జులనుండి ఏమాత్రమైనను మలబద్ధము లేకవిరోచనమగుచున్నది. వీప్నన బహుకాలమునుండియున్న శూలక్రమముగా తగ్గుచున్నది. వార్తాపత్రికలలోను, ఇతర పత్రికలలోను శ్లాఘనచేసి డబ్బుసం పాదనకుగాను ప్రచురించుచుండెడు వార్తలకు భ్రమజెంది ఇతర దేశీయులమందులకు మితిమీరి వ్యయముచేయుటకు ఇచ్ఛపుట్టినట్లు మనశాస్త్రవచనరీత్యా ఆచరించుటకు ఇచ్ఛపుట్టదు.

"కం॥ తనయూరితపసితనమును, తనపుత్రునివిద్య
పెంపుతనసతిరూపున్, తనపెరటి చెట్టుమం
దును, మనసునవర్ణింపరెట్టిమనుజులుసుమతీ॥".

అనినీతిశతకమునుడువుచున్నది. సుమతులు విన్దురుగాని దుర్మతులెట్లువిన్దురు? కొందరు ఇంటియందు యజమానులుగా నుండిన ముసలివారు ఈకార్యములుచేయుటకు కుఱ్ఱవాండ్లను బలవంతపెట్టగా, "దీనివలన నివారణమైతే వైద్యశాస్త్రమెందు కు వైద్యులెందుకని" ఆవచనముల తూలనాడుచు, ఇంచుకైనదా నియందు నమ్మకములేక ఆకార్యములుచేయుదురు. అట్టివారికి నివారణమగుటకష్టము. ఎందుకన

శ్లో॥ దైవేతీర్థేద్విజేమంత్రేదైవజ్ఞేభేషజేగురౌ।
యాదృశీభావనాయస్యసిద్ధిర్భవతితాదృశీ॥

దైవమందును తీర్థాదులందును, బ్రాహ్మణులందును దైవమును తెలిసిన మహాత్ములందును, వైద్యునందును, గురువునందును, ఎట్టిభావనలు కలిగియుందురో ఆభావనానుసారముగనే సిద్ధించుచున్నదని తాత్పర్యము. మందుపుచ్చుకొనుటకు మునుపే నివారణకాదని జపించుచు, ధ్యానించుచు పుచ్చుకొనుటచే ప్రయోజనముండదు.

ఇతర దేశీయులమందులకు విస్తారముగావ్యయముచేసి పుచ్చుకొన్నవారి వ్యాధులు పూర్తిగా నివారణ మయినదా? ఎప్పుడును మందులు పుచ్చుకొనవలసినస్థితియు, సంపాదనయందు నాల్గింటనొకపాలు అందుకైవ్యయము చేయవలసిన స్థితియును ఏర్పడినది. వీనికిగానువ్యయముచేసి సకలద్రవ్యములు త్రాగుటకు మారుగా నేవ్యయమునులేక నీరు ద్రాగి మనదేశభాగ్యమును పోనివ్వకుండచేయగూడదా.

అది యట్లనుండనిందు. మనశాస్త్రములలో సూర్యోదయాత్పూర్వము నీరు ద్రావుటచేత నన్నివిధముల మేలున్నదని చెప్పియున్నది గనుక నిద్ర సూర్యోదయమునకు పూర్వము రెండు ఘంటలకుముందే లేవవలెనని విధింపబడినది. శాస్త్రములు, ఆచరించుటకు చెప్పబడినవిగాని చదువుటకుమాత్రము కావు.

తత్వజ్ఞాన సభయందు గుప్తసభకుచేరినవారు బహుమంది తప్పక లేచి స్నానాదులు తీర్చికొని తమనిష్ఠలు సల్పుచున్నారు.

ఈ యాచారము అనగా వేకువజామున నిద్రలేచు యాచారము, సదాచారములలో ముఖ్యమైనదిగా, సదాచారములను గురించి భీష్మాచార్యులవారు ధర్మరాజుకు బోధించినట్లు మహాభారతము శాంతిపర్వము మోక్షధర్మపర్వములో నూటతొంబదిమూడవ అధ్యాయమందిట్లు చెప్పబడినది.

“సూర్యంసదోపతిష్ఠేత। నచసూర్యోదయేస్వపేత్॥”

మఱియు పతివ్రతలకు వేకువజామున నిద్రమేల్కొనుట ముఖ్య లక్షణముగా నదేగ్రంథమందే వివరింపబడినది.

"కల్యోత్థానరతానిత్యం॥"

ఈ కారణములనుపట్టి ఆసేతు హిమాచలమువరకు వ్యాపించిన మన దేశపు వారందరికి వేకువ నాలుగు ఘంటలకు లేచుట విధి. ఇతర దేశీయుల పద్ధతులు మనకు అన్వయించదు. ఆ దేశస్థితికిని మన దేశస్థితికిని సంబంధములేదు. వారి దేశస్థితినిపట్టి వారి దేహములేర్పడినవి. శీతోష్ణాదులనుపట్టి పద్ధతులును ఏర్పడినవి గనుక మనకు మన శాస్త్రములే ఈవిషయములందు ప్రమాణములుగా గైకొనవలెను. వేకువ లేచుటచే సోమరితనముండదనుట స్వభావసిద్ధము గనుక, నందరు ఈసదాచారమవలంబించి ఆరోగ్య భాగ్యమొంది, సుఖమనుభవించుచు దేశమునకు ముఖ్యముగా చేయదగిన కార్యములు చేయు సామర్థ్యముగల దేహములను బొంది అట్టికార్యములు సేయుటకు ప్రయత్నింతురుగాత, భగవత్ప్రేరణయుగల్గుగాత.

ఇతర కర్మలనుగురించి తరువాయిసంచికలయందు వ్రాయబడును.

---

మావటివాడు సృణి సహాయములేక యేనుగును హద్దులో నుంచునట్లు ముముక్షువు సాధన లెఱుంగక మనసును బడయ జాలడు. సాధనలేవన, వేదాంతశాస్త్ర శ్రవణము, సత్సంగము, సంకల్పత్యాగము. ఇవి లేకున్న నట్టి దేహసాధనలు వ్యర్థము. చీకటిని దీపముతోగాక చీకటితో బోగొట్ట బ్రయత్నము జేసినట్టగును. (వాసిష్ఠము).

## శ్రీగీతామృత తరంగిణి.

శ్రీభగవద్గీతకు రెండర్థములు గలవు. ఒకయర్థమ్ము సామాన్యము, మఱియొకటి విశేషార్థము. అవి పరస్పరము సంబంధపడినవి. అట్టి పరస్పర సంబంధమును దెలియుట ముఖ్యము. ఈకాలమున మనవారు పశ్చిమదేశ శాస్త్రములఁ బఠించి భక్తిశ్రద్ధలుమాని యిట్టియర్థములున్నవనిన నవ్వెదురు. సామాన్యార్థమగు చరిత్రమును మతగ్రంథములలో వ్రాయ నేల యనివాదింతురు. పురాణములయందుఁ జెప్పఁబడియుండు రాజవంశములును, మహాయుగాదికాల,పరిమాణములును, భయంకరములగు యుద్ధములును కేవలము కట్టుకథలుగా భావింపుదురు. సృష్టియందీశ్వరుని సంకల్పమివ్విధముగ సాగుచున్నదని సామాన్యార్థము తెలుపు. ఇంతియెగాదు! అదిభవిష్యత్కాల బ్రహ్మాండమునకు నీశ్వరత్వము వహింపనున్న యొకానొక పురుషుని వికాసమును సూచించు. విశేషార్థమన్ననో కైవల్యమార్గమును బోధించునది. దీనియందును దానియందును ముఖ్యాంశముల భేదమించుకయు లేదు. ఇది దానిప్రతిబింబమనవచ్చు. సామాన్యార్థ మీశ్వరుని సంకల్ప ప్రవాహమార్గమును దెలుపు. అది సమస్త లోకంబులనిండి భూలోకమునందు వ్యక్తమై మనకుఁగాన్పించుచున్నది. దానం జేసి దానిగ్రహించుట మనకుఁగర్తవ్యము. విశేషార్థమొక్కొక జీవునియందును గానంబడుచున్నది. అట్టగుటంజేసియియ్యది మనకుమిగుల ముఖ్యముగదా. పరమేశ్వరునకు బ్రహ్మాండముదేహమనియునిఁకరానున్న యీశ్వరుడుజీవుఁడనియు నొకటిబోధించు. మఱియొకటి యీశ్వరుఁడు జీవునితో వానిదేహములే దనదేహముగఁ జేసికొనియున్నాఁడని తెలుపు. రెంటియందును నంతర్యామియగు వాఁడొక్కఁడే. ఈయర్థములలో నొక్కదాని నెఱిఁగినవాఁడు రెండవయర్థము నెఱుంగఁజాలు.

జ్ఞానియొకఁడే యారహస్యార్థముఁగననేర్చు. జీవవికా
సమునందె యీశ్వరవికాసము జరుగుచున్నదని యెవ్వఁడెఱుఁగఁ
గలఁడు. అండమునం దెయ్యదిగలదదిపిండమునందును గలదు
కానమనమతగ్రంథముల కెల్ల రెండర్థములుగలవు. దానంజేసి
మనమీరెండర్థములను జక్కఁగ విమర్శింపవలయు. ఏయర్థమును
గాని ప్రమాదమునవిడువరాదు. విడిచినయెడల మనజ్ఞానముకొఱ
తవడు. జీవుఁడీశ్వరుని ప్రతిబింబమని మనపూర్వులుచెప్పిరిగదా.
అదికలగాదు. తెలివిలేమియుగాదు. పురాణకథలెల్ల కల్పనాకథ
లన్నియు, నుత్ప్రేక్షలనియు భావింపవలదు. ఆకథలు తత్త్వమును బో
ధించుచున్నవి. మహాపురుషచరిత్రలుజీవవికాసమును దెల్పు. భగ
వద్గీతను సామాన్యార్థమునువిచారించినపుడు మనుష్యవ్యాపారము
ల ప్రయోజనంబును దత్ఫలంబును దెలుపుచున్నది. దానివలన
మనము దేశములందును మనుజ సంఘములందుఁగలుగు కార్యముల
కిదియర్థమని గ్రహింపవచ్చు. ఇట్టిరహస్య మెఱిఁగినవాఁడు
బ్రహ్మాండములు తుత్తుమురైనను జలింపఁడు. గీతావిశేషార్థమును
బరిశీలించినపుడు జీవుఁడు నివృత్తిమార్గమున నివ్విధమునఁ జరింప
వలయునని తెలియు. దానిచేఁ దెలివియు ధైర్యమును లభించు;
మోహనివృత్తియునగు. మనమిపుడీరెండర్థములను విచారింతము.
మొదలగీతాశాస్త్రమీశ్వరుని సంకల్పమిట్టిదనియు నది యీభూలో
కమున నివ్విధమునసాగుచున్నదనియు నెట్లుఁదెలుపునో చూత
ము. ఈరహస్యమును నర్జునుఁడెఱిగినపిమ్మట నేగదా కురుక్షేత్రము
నఁదన ధర్మమును నడపె. అనంతరము జీవుఁడివ్విధమున వికాస
మందుననియెట్లు బోధించునో చూతము. ఈరెండర్థములును యథా
ర్థముసుమా. మొదటి యర్థము మనహిందూదేశపు వర్తమాన
స్థితికిని భవిష్యత్కాలస్థితికిని బీజములగువానిఁ దెలుపు. మఱియు
మహాభారతమున “నేనుగురువు. మనస్సు శిష్యుఁడ”ని చెప్పి

యున్నది. కాన శ్రీకృష్ణుఁడు జగద్గురువు. అర్జునుఁడు మనస్సు.
ఇవ్విధంబున జీవపరంబుగ విశేషార్థమును గ్రహింపవచ్చు.

ఈ బ్రహ్మాండమునకుఁ బ్రభువగు నీశ్వరుఁడు లోకమున న
ధర్మము ప్రబలి ధర్మము సుక్కినపుడు మానుషరూపమున నవతార
మెత్తు. అవతారమను శబ్దమునకు క్రిందికి దిగుటయని యర్థము.
ఈశ్వరుఁడు దిగివచ్చుననుట సరికాదు. అతఁడు సర్వాంతర్యా
మి సర్వమునకు నాధారమగువాఁడు. కానలోకమున దర్శనం
బిచ్చుననవలయు. శ్రీకృష్ణావతార మట్టి యవతారము సుమ్ము.
అతఁడు లీలామానుష విగ్రహధారియై లోకమునందు ధర్మమును న
డపవచ్చినవాఁడు. మఱియొక్కనికట్టి సామర్థ్యముగలుగునే.
మఱియునవతారమును బరమాత్మగ భావింపవచ్చు. జీవుఁడట్టిప
రమాత్మయంశముగదా. ఈ రెండర్థములను మనము గ్రహించిన
యెడల మనకు సమస్తమును స్పష్టమగు.

ఇఁక సామాన్యార్థమును విమర్శింతము. శ్రీకృష్ణావతార
మునకుఁ బూర్వమున నీభారతదేశము సకలసంపదలఁగాంచి
మహోన్నతపదవిఁ జెందియుండె. మహాపురుషులనేకులు జన్మించి
దేశమునకు వన్నెయు వాసియుఁ దెచ్చిరి. రాజకులశేఖరుఁ
డగు శ్రీరామచంద్ర చక్రవర్తి ధర్మపథము దప్పక ప్రజలఁ బాలించి
తనసద్వర్తనముచే జనులకు నీతిబోధించె. ఆ కాలమెన్నడో గతించె.
అటుపిమ్మట దుర్బలులగువారు రాజులయి తమలోఁ దామకల
హింపఁజొచ్చిరి. మఱియుఁ బరశురామునిచే నిర్మూలంబు చేయఁ
బడిన రాజకులంబు మఱలఁ బ్రబలి దేశము నాక్రమించుకొనియె.
ఇట్టికాలమున శ్రీకృష్ణభగవానులవతరించిరి. అనేకసంవత్సర
ములకుఁ బూర్వమున నార్యులుభారతదేశమునుత్తరభాగమునందు
వసించిరి. అప్పుడీయార్యశాఖ ప్రజాధర్మమున లోకమునకెల్ల
మేల్బంతియైయుండె. అదియీశ్వరుని సంకల్పము. మఱి

యు వారిమత సిద్ధాంతములాబాలగోపాలము సులభముగనుండె. అది సకలవిద్యాపారంగతులగు విద్వాంసులకును నడవులనొంటిగఁ దిరుగు బ్రహ్మజ్ఞానికిని నగమ్యముగనయ్యె. ఇట్టిమతంబును మహార్షులు జనులకుపదేశించిరి. ఇంతియెగాదు, రాజనీతియు ప్రజాధర్మములును మనువు వారికిఁదెలిపె. మనువువారికి రాజై వారిని బాలించె. ఇదియునుగాక యొక్కొకజీవుఁడును ననేకజన్మ పరిపక్వముచేఁ బ్రవేశింప నగువర్ణములును, నొక్కొకజన్మమునందుఁ బ్రవేశింపవలసిన యాశ్రమములును. నిర్ణయింపఁబడియె. ఇవ్విధంబుగ సమస్తమునుజక్కగ నియమింపఁబడియుండె. దానంజేసి యీశాఖలోకమున కెల్ల మేల్బంతియై జ్ఞానదయాసముద్రులగు మహాత్ములకెద్దియునసాధ్యంబుగాదని తెల్పుచుఁ బ్రపంచమున వన్నెకెక్కె.

భారతదేశము లోకమునకెల్ల ధర్మస్వరూపంబునుబోధించె. అంతఁగ్రమక్రమంబుగ ధర్మముకృశించి క్రిందుపడఁజొచ్చె.. తక్కినదేశములవారు ధర్మమును గొంతకొంతగ దానివలనగ్రహించిరి. అంతఁ గొంతకాలమునకు భారతదేశపు వన్నెయువాసియుఁ గొఱతవడియె.

ఈపుణ్యదేశ మిఁకమున్ను ధర్మమును బోధించుటకంటె మిగులనెక్కుడగు పదవిఁజెందవలసియున్నది. అట్టిపదవి కర్హతఁ గాంచుటకై శ్రీకృష్ణుడిట్టిస్థితి దీనికి వచ్చునట్టుగఁజేసె. . ధర్మమార్గప్రవర్తకులగు ప్రజలతోనొప్పుచుఁబ్రపంచమునకు మేల్బంతిగనుండిన యీభారతదేశము భవిష్యత్కాలమునందు లోకగురువుగ నుండవలయునని శ్రీకృష్ణభగవానులసంకల్పము. భూతభవిష్యద్వర్తమానములెల్ల వర్తమానముగ నెవ్వనికిఁగాన్పించునట్టిమహాత్మునకుభవిష్యత్కాలమననెట్టిది? కృష్ణావతారమునకుపిమ్మట నీదేశమునకుసంభవించిన కష్టములెల్లను లోకగురువగుటకు సామగ్రిసుమ్ము.

దుఃఖసముద్రమునమునిఁగి పడరానిపాట్లుపడినగాక యట్టిమ హోన్నతపదవి యెవ్వరందఁగలరు? శ్రీకృష్ణుఁడవతరించుట భారతదేశమునిట్టిపదవికిఁ జేర్పనెగదా. అట్టియున్నతస్థితి దాని కేలరాకయుండు? జ్ఞానదయాస్వరూపుఁడగు నమ్మహాపురుషుఁడీ దేశమును నామార్గమున నడపఁజాలెగాక మఱియెవ్వరికది సా ధ్యమగు? దుఃఖకంటకమయంబగు నావిషమమార్గమున నీ దేశమునునడపి యా మహాపదవింజేర్చుటయె తనకుఁగర్తవ్యము గ సమస్తకార్యములను శ్రీకృష్ణుఁడునడపెను. ఇది యిట్టిదేయని మనమాతని చరిత్రమునుబఠించినచోఁ దెలియు. తనసంకల్పము నెప్పుడుగాని వదలఁడు. వెనుదీయఁడు. ఇట్టిదృఢసంకల్పము తో నన్నికార్యముల నొనర్చెను. ఆ సంకల్పమువలన హిందూ దేశము చెప్పరానియవమానములందవలసివచ్చె. పూర్వకాల మునందలి యీదేశపు మహిమ యింతయంతయనరాకయుండె. ముల్లోకములజయించి లోకమునఁబ్రథమగణ్యతగాంచె. దాని యధ్యాత్మవిద్యయింతయనవచ్చునె. దానిశాస్త్రములకుఁబారమె య్యది? దానిసంపదలనింతయని యెన్నవచ్చునే? ఇవియన్ని యునిపుడేమూలడాగె? దానిప్రకృతపుస్థితిఁజూచినచోఁగటిక వానికైనఁగన్నులనీరు రాకుండునా? అయిననేమి? ఇదియంత యునమ్మహాత్ముని సంకల్పమేగదా. దయానిధియగు శ్రీకృష్ణుఁడు కురుక్షేత్రయుద్ధమువలన నిట్టిస్థితి నీదేశమునకుఁదెచ్చె. భారత దేశమునకు బెట్టనికోటయగు క్షత్రియకులంబునెల్ల నిర్మూలంబు చేసె. రాజులనందఱస్వయాధకలహంబుచే మడియునట్టుఁజేసె. వారికందఱికినమ్మహాపురుషుఁడు కాలస్వరూపుఁడయ్యె. "కాలో స్మిలోకక్షయకృత్ప్రవృద్ధో। లోకాన్ సమాహర్తు మిహప్రవృత్తః। ఋతేపిత్వాంనభవిష్యంతిసర్వే। యేవస్థితాః ప్రత్యనీకేషుయో ధాః॥". నేనులోకక్షయకరుఁడగు కాలుఁడను. ఈరాజలోకఁ

బుల సంహరింపనిపుడుద్యోగించినవాఁడను, వీరలనీవు సంహరిం పకున్నను వీరునాశంబునొందుట నిజంబని శ్రీకృష్ణభగవానులు వక్కాణించిరిగదా (గీ 11-32). రాజులకెల్లఁగాలమాసన్నమయ్యె. అంతఁగురుక్షేత్రమున రాజులు ఘోరరణమొనర్పఁజొచ్చి యమ పురముం జేరిరి. భారతయుద్ధమున రాజులెల్లరుమడియుటవలన నీదే శమునకునాథత్వముసంభవించె. భారతమాత తనకిరీటంబునేలఁ బడఁదల యెత్తనేరదయ్యె. అంతమాటిమాటికి పరదేశరాజుల దాడియను ప్రవాహంబు దానిని దుఃఖజలధిముంచె. గ్రీకుదేశపు రాజగునలగ్జాండరనువాఁడు లెక్కకుమిక్కుటమగు సేనతో నీ దేశముపైదండెత్తివచ్చి యుత్తరదేశమునంతయు నాక్రమించికొని యె. ఆరాజు దేశమందలి నవరత్నములఁగొల్లకొట్టికొని పోయి నదియేగాక యధ్యాత్మవిద్యయుఁదనదేశమునకుఁగొనిపోయె. ఇం తటితో నీదేశమునకు దుఃఖముదీరలేదు.

అటుపిమ్మట భారతమాతకుఁగలిగిన యవమానము లిట్టివని చెప్పనలవికాదు. ఆశియా ఖండమందలి మంగోలియా తురు ష్కస్థానములోనగు దేశములవారు గుంపులు గుంపులుగ నీదేశ ము మీదఁబడిరి. వారిమతము మహమ్మదీయమతము. వారు తమమతము నవలంబింపనివారినెల్లఁగత్తిపాలుచేసిరి. ఆర్యులస నాతనధర్మము రూపుమాసె. అజాతశత్రుఁడనపేరుగాంచిన యుధిష్ఠిరుని రాజధాని వారికిరాజధానియయ్యె. అంతఁగొంత కాలమునకుఁ బిమ్మట యైరోపాదేశస్థులు హిందూదేశమునందలి రాజ్యమునకును వాణిజ్యమునకును నొక్కరితో నొక్కరుపోరాడి రి. ఈదేశపుకోటలుపాడయ్యె. శూరాగ్రేసరులు పెద్దనిదుర్రఁ బోయిరి. శత్రుసైన్యప్రవాహమునకుఁజేతులడ్డమిడువారులేరైరి. పరదేశసైన్యములు సముద్రమందలి యలలవలెవచ్చి దేశమునంత యు నాక్రమించుకొనియె. ప్రపంచమందలి దేశములో నెల్ల

నీ దేశము మిగుల యవమానము బొందవలసిన కాలమువచ్చె. శత్రుసైన్యములు దానిసంపదలెల్లఁ జూఱఁగొనిరి. ఇట్టిదుర్దశయందు నీదేశమేండ్లుపూండ్లుగ మునింగియున్నది. నోటికింపుగానిమందు దేహమునకారోగ్యమునిచ్చునటుల నిట్టికష్టములతోడన మేలునుగల్గె. రాత్రి తెగుదల పగలేలరాకయుండు. ఇంతయవమానము నిట్టి కష్టములును నీపుణ్యభూమికిఁగలిగెగదాయని చింతించి కన్నుల నీరుఁదేనేల? అవి యన్నియు నీదేశమునకు సుఖదాయకము లయ్యె. పరదేశములను సముద్రమునుండి వెలివడిన యలలన్నియు నీదేశమును మొదలనాక్రమించెఁగాని దానికొకక్రొత్తశక్తి నొసంగె. ఆ యలలన్నియు నీదేశమునుండి తమదేశములకను కూలమగువానిఁగొంపోయెఁగాని హిందూదేశమునకుఁ క్రొత్తశక్తులను క్రొత్త యభిప్రాయముల ననేకములనొసంగె. దానివలన నీదేశము నానాటబలమెక్కి ప్రవృద్ధిగాంచనయ్యె. పరదేశస్థుల దండయాత్రలు మొదల నీదేశమును నిర్మూలంబు చేయునటులఁ గాన్పించినను దుదకవి సుఖదాయకములుగఁబరిణమించె. గంగానది యిరుప్రక్కల భూములను దనప్రవాహంబుచే ముంచినను నది యాభూముల సారవంతములుగఁ జేయుగదా. ఈశ్వరుఁడుగదా లోకముల నడపువాఁడు. వాఁడుదుఃఖముగఁదోచు దానివలననె నిరంతరసుఖమును జేయఁగలఁడు. అతడు జ్ఞానస్వరూపుఁడు, దయానిధి. కానఁదనవారినెట్టికష్టములయందును నవమానముల యందును నేర్పుననడపఁగలఁడు. పుటముపెట్టినబంగారమువలెఁ గష్టములచే నిర్మలత్వంబుఁగాంచి తన్నుఁజేరవచ్చిన పరదేశస్థుల వలన ననేక విషయంబుల ననుభవంబుచే గ్రహించి యీభారత దేశము సమయమువచ్చినపుడు లోకగురు సింహాసనము నలంకరించు. అప్పుడొకదేశమునందెగాక యన్నిదేశములందును దాని బ్రహ్మజ్ఞాన ప్రకాశము ప్రసరించుచుండు. (సశేషము).

## దివ్యజ్ఞానసారము.

## IV. జీవునియాత్ర.

జీవులీశ్వరాంశములని ముందుచెప్పఁబడెను. సూర్యుని కాంతి యాకసమునందువలె ఈశ్వరుని దీప్తులు మహదహంకార తత్త్వములం బ్రతిఫలింప మహాజ్యోతియందు నిప్పురవలు గానఁబడురీతిని అక్షరుఁడగు బ్రహ్మమునుండి జీవులుత్పత్తియగు చున్నారు. ఈశ్వరునియందు లీనమై సరూపులైయుందురు.

శ్లో॥ "యథాసుదీప్తాత్పావకాద్విస్ఫులింగాః । సహస్రశః
ప్రభవంతేసరూపాః । తథాఽక్షరాద్వివిధాః
సౌమ్యభావాః । ప్రజాయంతే తత్ర చైవాపియంతి"॥ముం.ఉ.

ఆస్థితియందు ఈశ్వరునకును తదంశములగు జీవులకును భేదము గోచరముగాదు. అయినను మహాజ్యోతియందలి విస్ఫులింగములవలె నంతర్భూతములైయుండును. మఱియును ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడును సర్వశక్తిమంతుఁడు. అందిమిడియుండు జీవుఁడన్ననో అల్పజ్ఞుఁడును, అల్పశక్తిగలవాఁడునగు. ఎటులననఁగా నీశ్వరుఁడు మాయాశక్తియను గొప్పశక్తిని స్వాధీనము చేసికొనినవాఁడై ప్రకృతిని వశపఱచుకొని యిష్టానుసారముగ నాప్రకృతిఁ దనకుపాధిగ నొనరించుకొని వర్తింపశక్తిగలవాఁడు. కావున నీశ్వరుఁడు ప్రకృతియందుఁ బ్రవేశించి వర్తించుచుండినను, ప్రకృతిలేనిచోఁ దాను వ్యాపారహీనుఁడైయుండియు, నాప్రకృతి యీశ్వరునిబంధించి మోహింపఁజాలకయున్నది. ప్రకృతిగుణములగు సత్త్వరజస్తమోగుణములు వారికధీనములైవర్తించునవి. జీవులన్ననో అట్లుకాదు. ఈశ్వరునియందంతర్భూతములై యున్నంతవఱను, ఈశ్వరస్వరూపకల్పులైయుండియు, ఈశ్వరుఁడు స్వేచ్ఛగాఁ బ్రకృతియిందుఁ బ్రవేశింపఁగా, జీవు

లును ఈశ్వరేచ్ఛావశవర్తులై పాంచభౌతికమగు ప్రపంచమునం బ్రవేశించి ప్రకృతివశులైరి. ప్రకృతియందుఁ బ్రవేశించియు స్వతంత్రుఁడై యధీశ్వరుఁడై వర్తించుశక్తిగలవాఁడు ఈశ్వరుఁడు. ప్రవేశించి పరతంత్రులై ప్రకృతికధీనులై వర్తించువారలు జీవులు. ఇట్లు తమ్ము బంధించు ప్రకృతియందుఁ బ్రవేశించి, యాప్రకృతియే తామనుభావముగలిగి, సంసారచక్రమునంబడి బహుకాలము పరిభ్రమించుటవలన తమ్ముబంధించుచుండు ప్రకృతిస్వరూపమును కొంచెము కొంచెముగఁ దెలిసికొనుచు కాలక్రమమున నాప్రకృతి తమకంటె భిన్నముగ నెఱింగి కట్టకడపట ప్రకృతిని స్వాధీనము చేసికొని యీశ్వరునివలె తామునుఁ బ్రకృతిగుణముల నతిక్రమించి ప్రకృతికధీశ్వరులగుటయే సంసారచక్రమునం బ్రవేశించుటవలని ప్రయోజనము. ఆదియందు ప్రకృతికి వశులైనంగాని తుదను ప్రకృతిని స్వాధీనముచేసికొనుట సాధ్యముగాదు. ఒక దృష్టాంతము దీనివిశదీకరించును. ఒకానొక పురుషుఁడు తన దేశమునంతయు చక్కఁగ పరిశీలించి సర్వముతనకుఁ దెలిసినదిగఁ జేసికొని, తన దేశమునఁదనకుఁ దెలియని దొక్కటిగాని లేకయుండెననుకొనెదము. అట్టిపురుషుఁడొకఁడు దేశాంతరయాత్రనుద్దేశించినచో నాదేశమున సర్వము దానెఱుఁగనిదియే. ఆదేశపు ప్రాంతములఁ జేరినది మొదలు దిక్కు తెలియక త్రోవచూపువాఁడొకఁడుండిన బాగుగదాయని పరితపించునుగదా! అప్పుడాదేశస్థని నొకనిఁదనకుఁ ద్రోవఁజూపుటకునియమించుకొనియాతఁడేదిక్కునకుఁ గొనిపోయిన నాదిక్కునకేగుచు, నామార్గదర్శికిలోఁబడి సంచరింపక తీరదుగదా! అట్లువానికి మొదటలోఁబడి దేశమంతయు సంచరించి యాదేశము నామూలాగ్రముగఁ బరిశీలించి దేశస్వరూపమంతయు చక్కఁగ నెఱింగినపిదప నామార్గదర్శి తనకు లోఁబడి వర్తించువాఁడేగదా! అటులనే జీవుఁడు తొలుదొల్ల

పాంచభౌతికమగు ప్రపంచమునం బ్రవేశింపఁగాఁ బ్రకృతికిలోఁ బడి, యంధప్రక్రియనుండి, బహుకాలము నానావిధములగు ననుభవములఁ బొందుచు ప్రకృతిస్వరూపము నెఱుంగుచు క్రమక్రమమునఁ బ్రకృతినిజయించి స్వాధీనముచేసికొని సర్వజ్ఞుఁడును, సర్వశక్తిమంతుఁడునయి బ్రహ్మస్వరూపుఁడగును. ఇట్టిపదవినిఁ బొందుటకు జీవుఁడేయే యనుభవములనుబొందునో విచారింపఁదగియున్నది. జీవులీశ్వరాంశములగుటంబట్టి మొట్టమొదట నీశ్వరునియందే లీనమైయుందురు. అపుడు జీవులుఅహంకారతత్త్వముననుండువారలు. అనఁగాసూక్ష్మాకాశమునకంటె సూక్ష్మతరమగుప్రకృతి నుపాధిగఁ జేసికొనినిష్ప్రపంచమనదగు స్థితిని వెలయుచుందురు. ఈశ్వరుఁడు యోగనిదురనుండి మేలొ్కంచి సృష్ట్యున్ముఖుడై “బహుస్యాంప్రజాయేయ” యనిసంకల్పింప, నాయీశ్వరునియందు లీనులైయుండుజీవులందఱును ఇంచుక బహిర్ముఖులగుదురు. అంతనాజీవులయందు కొంచముగ ఇచ్ఛయంకురింప నొక్కొక్కయీశ్వరాంశమును పాంచభౌతికమగు ప్రపంచమున, బ్రవేశించి క్రమక్రమమున నొక్కొక్కతత్త్వమునుండి యొక్కొక్కసూక్ష్మభూతమును స్వీకరించి వానినుపాధులుగఁజేసికొని యాయాలోకములోనియనుభవములను బొందుటకు అర్హుఁడగును. ఈయణువులు (సూక్ష్మభూతములు) అన్నియు వేదాంతగ్రంథములయందు దేహబీజములని యెఱుంగఁబడుచున్నవి. అనగా రాబోవుకాలమున జీవునకుంగల నానావిధములగు కర్మజాతములగు శుభాశుభవాసనలకునికి పట్టయి యనేకజన్మములయందు కర్మానుసారముగ దేహములను సృష్టి చేయుట కాధారములయియుండును. ఇట్లుక్రమముగ నీదేహబీజములద్వారా స్థూలములగు లోకములయందుఁబ్రవేశించి కట్టకడపటి పృథివీతత్త్వమున అనఁగా భూలోకమునఁబ్రవేశించినవాఁడగు. అపుడుజీవునిస్థితియెట్టిదన్నఁ ప్రపంచజ్ఞానమించుక యైనను లేక

కేవలాంధకారమగ్నఁడైయుండును. అపుడు పాషాణాదులు పాధిగగలిగి యతిస్థూలమగుప్రకృతియందు అంతర్భూతమైయుండు టచే నందుజీవకళయనునది యొకటియున్నదాయని సంశయమున కాస్పదమగుచున్నది. అపుడు జీవకళపాషాణాదులయందు గాఢ నిద్రయందుండునట్లు తమోమగ్నమై యుండును. అయినను పాషాణాదులయందును జీవకళయున్నదని యూహింపకతీరదు. పటిక, మైలుతుత్తము మొదలగు పదార్థములుకొన్ని పాషాణాదులలో చేరినవియే. అవిఖనిజములు. వానిచక్కగపొడి చేసి వేఁడి వేఁడినీట యందు కరిగించి యానీటినొక వెడల్పుమట్టిపాత్రమున గాలిసోఁకు స్థలమునందుంచి యారనిచ్చినచో నానీరావిరిరూపమున నదృశ్య మగును. అపుడు నీటియందుకరిగిపోయియుండిన పటికలోనగు పదార్థములు వెనుకనిలుచునుగదా! తొలుతపొడిచేయబడి నీటిలో కలిసిపోయియుండినవిగావున నీరెండిపోయిన వెనుక నాపదార్థము పొడిపొడిగానడుగున నిలిచిపోవుననుకొనుటసహజముగదా! అట్లుగ పడుటలేదు. ఆనలుసులన్నియు నొకటితోనొకటి చిత్రముగఁజేరి విచిత్రములగు సుందరమైనరూపములేర్పడును. ఆరూపములన్నియు ఒక్కొక్కవస్తువున కొక్కొక్కరూపముగనుండును. మనమెన్నివి ధములమార్పఁజూచినను, ఎన్నిమారులు పరీక్షించినను ఆవస్తువునీట నుండి బయటవచ్చునప్పుడెల్ల నారూపమునేధరించును. నున్నని పొడి గాఁజేయఁబడి నీటిలోఁగలిసిపోయిన నలుసులు తమంతటతా మొకటితో నొకటిచేరి దివ్యసుందరములగు రూపములధరించుట వలన నానలుసులయందుఁగూడ నొకశక్తియున్నదని తలంపక తీరదు. ఇంతియకాదు. రెండుమూడు వస్తువులు కలిపిపొడిచేసి నీటిలోకరిగించి పైనసూచించినవిధమున నారనిచ్చినచోనావస్తు వులు తిరిగి తమంతటతాము వేఱువేఱుగానేర్పడి యొక్కొక్క వస్తువును తనస్వభావమగు సుందరరూపమునుధరించును. ఇట్టి

శక్తిధాతువర్గమునందు (అనగా పాషాణాదులయందు) గలిగి యుండుటచే వానియందాత్మకళయున్నదని యూహింపక తీరదు. ఈవిషయము గీతాశాస్త్రమునందు భగవంతుఁడు నొక్కి చెప్పి యున్నాఁడు:—

"యావత్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజంగమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ॥"

స్థావరముగాని జంగమముగాని యెంతస్వల్పమైనదైనను వస్తువొకటి లోకమునఁ బుట్టినా, అది క్షేత్రక్షేత్రజ్ఞసంయోగముచేత నేపుట్టునని తెలిసికొనుము.

"నతదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్॥"
చరముగాని అచరముగాని భూతమొక్కటియైనను నేనులేకయే ఉండఁజాలదు॥

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి."
సమస్తభూతములలో హృదయప్రదేశమున, అనగా, అంతర్భూతుఁడై ఈశ్వరుఁడున్నాఁడు.

"అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః॥" సమస్తభూతములయందంతర్భూతుఁడనై యుండు నాత్మస్వరూపుడను నేనే సుమీ!

మఱియు నిట్టిప్రమాణములు లెక్కలేక శ్రుతిస్మృతులనుండి గ్రహింపనగు. ఇక్కాలపుప్రకృతిశాస్త్రి పారీణులలో ప్రథముఁగ ణ్యుఁడని లెక్కింపఁబడుచు, కలకత్తా కళాశాలయందు ప్రకృతిశాస్త్రిపండితుఁడు (Professor of Physical Science) నగు జగదీశచంద్రబోసు అను ప్రముఖుఁడును కొన్నియంత్రములనిర్మించి లోహములయందును చెట్లయందును, జంతువులయందును, మానవులయందును ఒక్కేరూపముగు ప్రాణమున్నదని స్పష్టముగ దృగ్గోచరమగునటుల నిరూపించి ఖ్యాతివహించియున్నాఁడు. విషపదార్థములు, మైకమును కలిగించువస్తువులను, జంతువుల

కిచ్చి, చెట్లమీదను, తీగలమీదను ప్రయోగించి, లోహములమీదను ప్రయోగించి, వారునిర్మించిన యంత్రములతో పరీక్షించినయెడల నన్నింటియందును ఒక్కవిధమైన గుణమేకనఁబడుచెను. ఆవిధమున అన్నింటియందు ప్రాణమనునదియొక్కవిధముననున్నదనియును సజీవములు నిర్జీవములను భేదము మిథ్యయనియును స్పష్టముగ నిర్ధారణచేసి పాశ్చిమాత్యులలో ప్రకృతిశాస్త్రపారీణులగు వారలలో కీర్తివహించినారు. మనదేశపుమతగ్రంథములయందు దృఢముగ చాటించియుండియు, పాశ్చిమాత్యులచేతను, వారలంజూచి మనదేశస్థులలోగొందఱచే నమ్మరానిదని యెంచబడుచున్న యీగొప్పవిషయము కడపట, పశ్చిమదేశపద్ధతుల ప్రకృతిశాస్త్రములంజదివి వారిమార్గములతోడనే యీగొప్పరహస్యము పశ్చిమదేశస్థులకు వెల్లడిచేయుపుణ్యము, మనదేశమునజన్మించి పాశ్చిమాత్యులచేత గౌరవపాత్రుఁడని కీర్తివహించిన జగదీశచంద్రబోసుగారికే కలిగెగదా! యెంత సంతసమునకు కారణము!

పాషాణాదులయందు జీవకళయున్నదంటిమి. అకాలమున గాఢనిద్రయందుండు నట్లుండుననియునుడివితిమి. బహిఃప్రజ్ఞయనునది యించుకయైనను లేదు. అయినను పాషాణాదులయందాత్మశక్తిసత్తామాత్రముగనుండునని శ్రుతులయందుచెప్పఁబడియున్నది. ఇట్టిస్థితియందీజీవకళలు ఎట్టియనుభవములఁబొందుదురో విచ్చటసూచించుట కలవికాదు. ఎండకెండి, వానకుతడిసి మంచుచేస్పృశింపఁబడి గాలిచేఁగొట్టఁబడి కొన్నివేళల కొలిమియందలి యగ్నియందును, మఱికొన్నిసమయముల భూమియందును జలమునందును పడిబహువిధములగు ననుభవములుగలిగి, పరిపక్వులైయీస్థితినుండి యంతకంటె నుత్తమమగు శరీరములదాల్చుటకర్హులుకాగా నాజీవకళలు ఓషధివనస్పతులయందు ప్రవేశింతురని గ్రంథములయందుసూచింపబడియున్నది. ఆయోషధివనస్పతులయందుండు

కాలమున ఆత్మశక్తి యెక్కుడుగ నభివ్యక్తమగుచున్నయది. వేసవి కాలమున సూర్యుని చండకిరణములకు వృక్షములు వాడి వ్రేలబడు టయు; ఇంచుక వర్షము కురియగా నా చెట్లుమిగుల ప్రకాశముగలిగి తలయెత్తుటయు, తమకాహారము, వెలుతురు ఏయే స్థలములయందు దొరుకునో ఆయాస్థలములకు వేరులను శాఖలను తీగలను వ్యాపింపఁ జేయుటయు, లతలు తమకాధారముదొరకునాయని యాకసమున నల్లాడి సన్ననిపుడక యొకటి దొరికినను దానిని చుట్టుకొని గట్టిగ పట్టుకొని మఱియొక యాధారమునకు వెదకుచు సంచరించుటయు కొన్నికొన్ని పుష్పములు లోనగునవి సూర్యుని కాంతి కెదురుచూచుచు, సూర్యుఁడే దిక్కునకుఁబోయిన నాదిక్కునకుందిరుగుటయు నీమొదలగు లక్షణములన్నియు నాయోషధివనస్పతులయందుండు నాత్మశక్తి పాషాణాదులయందుండుటకంటె నెక్కుడుగనభివ్యక్తమగుచున్నదని స్పష్టముగఁ దెలుపుచున్నది. ఓషధివనస్పతులయందు ప్రాణముకనఁబడుచున్నయదిగదా! రసరూపమున ప్రాణము ప్రసరించుచున్నది. వృక్షములలో బ్రతికియుండునవి, యెండిపోయిన వని భేదములుస్పష్టములుగనున్నయవి. పాషాణాదులయందు ఆత్మ సత్తామాత్రముగనున్నదని ముందు చెప్పితిమి. వృక్షజాతియందు ఆత్మయొక్క చిచ్ఛక్తియు కొంచెము పొడచూపుచున్నదిగదా! ఈస్థితియందుబహుకాలముండిన వెనుక నాజీవకళలువృక్షజాతి యుపాధులనువదలి యంతకంటె నుత్కృష్టమగు నుపాధులనొందుట కర్హములై తిర్యగ్జంతువులయందు గొంతకాలముండును. నిశ్చలములగు పాషాణాదులయందుండు కాలమున గలుగుననుభవముల కంటె నెక్కుడగుననుభవములు ఓషధివనస్పతులయందు జీవకళలకుగలుగును. వృక్షములుస్థావరములయ్యును కొంతమట్టుకు చలనముగలిగి యిష్టానుసారముగ నలుదిక్కుల వ్యాపించుటకు వృక్షములకును గుల్మలతాదులకును శకి గలదుగదా! తమకుసుఖదా

యకములగు సూర్యుని వెలుగు, జలములు ఆహారము, ఏదిక్కున నబ్బునో ఆదిక్కునకు శాఖలను, తీగెలను, వేరులను వ్యాప్తింపజేసి యాయనుభవములను బొందజాలియున్నవి. తిర్యగ్జంతువులలో నుండుకాలమున నాజంతువు ఇష్టానుసారముగ సంచరించి, యిష్టములగు నాహారముల సంపాదించుకొని భుజించి తమతమశక్తిని వృద్ధిచేసికొనుచు మఱియునితరజంతువులవలన బాధలంజెందుచు జాతివైషమ్యములకును భయమునకులోనగుచు, సుఖదుఃఖానుభవముల పలుమరుపొందుటచే ననేకములగు ననుభవములుగలిగి ఆత్మయందుబీజరూపముగనుండిన శక్తులను అభివ్యక్తములుగఁజేసికొనుచు బహుకాలానుభవమునకు తుదను ఆజాతి శరీరములవదలి మానవశరీరమును దాల్చుట కర్హములగును.

ఇంతకాలమువరకు శిశువునుగర్భమునసుంచుకొని రక్షించి వృద్ధిచేయుతల్లివలె జీవకళలు ఈశ్వరునిశక్తిచేతనే యభివృద్ధిఁ జెందుచు, బీజరూపముగనుండు శక్తులను, కొంచెకొంచెముగ నభివ్యక్తములుగఁజేసికొనుచుండును. మానవతనువు దాల్చుకాలము రాగా మనశ్శక్తివ్యక్తమై యుక్తాయుక్తవివేకము కొంతదనుక వికసించి, యీపైకాలమున చేయు సమస్తకార్యములఫలము ననుభవించుట కర్హుఁడగును. ఆపిదపపుణ్యపాపకర్మములవలని ఫలములననుభవించుటకుబద్ధుడగుచున్నాడు. ఈవివేకముకలుగుటంబట్టియే మానవజన్మము ఉత్తమమని శ్రీశంకరాచార్యులవారు చాటించియున్నారు.

శ్లో॥ “జంతూనాంనరజన్మముత్తమమతఃపుంస్త్వంతతో విప్రతా”॥

ఇట్టియపరూపమును, దుర్లభమగు మానుషజన్మము వచ్చినపిదప జీవకళయను సంజ్ఞమాని జీవుడుఅను సంజ్ఞను గ్రహించి, యీపైన నెట్లు పురుషార్థప్రాప్తి కర్హుఁడగునో యోచింతము.

### మదనపల్లెలోఁగూడిన దివ్యజ్ఞానసభ.

మధ్యజిల్లాల దివ్యజ్ఞానసమాజశాఖలవారు గడచినఆగస్టునెల 20, 21 తేదులలో కడపజిల్లామదనపల్లెయందు సభ జేరిరి. శ్రీమతి ఆని బెసంటమ్మగారు అగ్రాసనాధిపత్యమును వహించిరి. అనేకస్థలములనుండి బహుజనులు వచ్చియుండిరి. 21 తేది ఉదయం ఆని బెసంటమ్మగారు జరిగించినప్రారంభోపన్యాసమున చెప్పినముఖ్యాంశములెవ్వియన:—పశ్చిమఖండ శాస్త్రజ్ఞులు లోకములోని సర్వమతములను పరిశీలించిచూచినందులో నన్నిమతంబులందు నాధారభూతంబులగు ముఖ్యసిద్ధాంతములు నేకరీతినున్నవనియు, జీవన్ముక్తులగు మహర్షి సంఘమువారిచే నెల్లమతములును స్థాపించఁబడియుండుటచేతనే ఇట్టియైక్య భావముకన్పట్టుచున్నదనియు మఱియు దేశహితార్థమై పాటుబడుటయేదివ్యజ్ఞానసభలోఁజేరినవారికి ముఖ్యకర్తవ్యంబనియు సెలవిచ్చిరి. నాటిదినము సాయంకాలమున మి॥ ఆర్నెస్టువుడ్ గారు ఆంగ్లేయభాషయందును, బ్రం॥ కడప నంజుండప్పగారు ఆంధ్రభాషయందును బ్రహ్మవిద్యనుగూర్చియు దివ్యజ్ఞానసమాజమునుగూర్చియు నుపన్యసించిరి. పిమ్మట ఆనిబెసంటమ్మగారుసర్వమతసామాన్యతనుగురించిసభవారిమనంబుల నద్భుతానంద రసంబులుప్పొంగునటుల దాదాపున నొకటిన్నరగంట సేపు ప్రసంగించిరి. మన వేదశాస్త్రములందు ప్రతిపాదితంబులయియుండు సారవంతములగుసిద్ధాంతములే అనఁగా—(1) జగదీశ్వరుఁడొకఁడు. (2) ఆయనత్రిమూర్త్యాత్మకుఁడు. (3) ఇంద్రాదిదేవతలు వానియనుచరగణంబు. (4) జీవుఁడుబ్రహ్మస్వరూపుఁడు. (5) అదృశ్యంబులగు భువరాది యూర్ధ్వలోకంబులుగలవు. (6) జీవుఁడు కర్మబద్ధుఁడు. (7) వాఁడు పెక్కుజన్మములెత్తు; అనునీయంశములు లోకములోనన్నిమత గ్రంథములయందు బోధితములైయున్నవని యనేక ప్రమాణవచనములచేత సిద్ధాంతపరిచిరి.

మరునాటి యుదయమున దివ్యజ్ఞాన సభలోఁ జేరినవారు లోకములో నాచరించవలసిన ధర్మములవిషయమై అమ్మగారు కొన్ని హితవాక్యములుపదేశించిరి. ఎవఁడుగాని కేవల స్వకార్యధురంధరుఁడుగాక లోకోపకారముగ నేదయిన నొకకార్యము బూనుకొనవలయుననియు, బాల్యవివాహములు దేశ క్షేమమునకు పీడాకరములనియు, ఇంగ్లండు మొదలగునన్యదేశములకుబోయివచ్చినవారు సదాచారముల ననునర్తించియుండు రేని యట్టివారిని మరలజాతిలోఁ జేర్చుకొనుట మంచిదనియు, ఇవ్విధమైన సంఘసంస్కరణ పద్ధతుల విశదీకరించిరి. ఆదినముసాయంకాలమున బ్రం॥ మైసూరు మహాదేవశాస్త్రిగారు ఆర్యధర్మములనుగురించి ఇంగ్లీషు భాషయందును, బ్రం॥ వావిలాల శివావధానులవారు మహాభారతమునుగురించి తెనుఁగునందునుఉపన్యాసములిచ్చిరి. అంతటన గ్రాసనాధిపతిగారి యుపన్యాసముతో సభాకార్యములు తుదముట్టె.

పైయుపన్యాసంబులకు స్త్రీలును, పురుషులును ననేకులువచ్చియుండిరి. ప్రసంగములన్నియు వినువారికి శ్రావ్యములుగనుసుబోధములుగనుండెను. ఆనిబెసంటమ్మగారిదర్శనమునకై మదనపల్లె గ్రామవాసులును చుట్టుప్రక్కలూళ్ళవారును వేలకొలది జనులువచ్చిరి. అమ్మగారు రైలుబండిలో పోవునపుడును వచ్చునపుడును అనేక స్టేషనులలో నూర్లకొలదిజనులు గుంపుగూడిరి. అన్నిజాతుల స్త్రీపురుషులునుస్నానముచేసి పరిశుద్ధవస్త్రముల ధరించుకొని పూలదండలు, టెంకాయలు, ఫలములు మొదలయినవిచేఁబూనివచ్చి ఆమెకుసమర్పించి, చేతులుమోడ్చిదండములుపెట్టువారును, పాదములకు నమస్కారము చేయువారును, బిడ్డలను ఆమెపాదములపైనునుచు తల్లులును, గుంపునుతోసికొనిదగ్గరకురాను సాధ్యములేక దూరమునుండి గోవిందలుపెట్టువారును, శ్రీచూర్ణములూను వారునుగా తిరునాళ్ళుసాగినట్లుండె. అంతయు భగవంతునికిఁబ్రీతికరంబైగనపడెట్టె.

# ప్రకటనలకు ద్రవ్యనిర్ణయములు.

| | | | పూర్తిపేజి | అర్ధపేజి | కాల్‌పేజి. |
|---|---|---|---|---|---|
| సంవత్సరమునకు | ... | రూ. | 40 | 30 | 20 |
| 6 నెలలకు | ... | ,, | 24 | 18 | 12 |
| 3 నెలలకు | ... | ,, | 18 | 9 | 6 |
| నెలకు | ... | ,, | 5 | 4 | 3 |

———:o:———

## ప్ర క ట న లు.

| బ్రంహశ్రీ జంగంకోటి శ్రీనివాసరావుగారిచే రచియింపఁబడిన | | | రూ. అ. పై. |
|---|---|---|---|
| సంచిత ప్రారబ్ధ ఆగామికర్మలు | ... | ... | 0—3—0 |
| వివాహనిషేక ధర్మప్రదీపిక | ... | ... | 1—8—0 |
| ధర్మవిషయము ... | ... | ... | 0—3—0 |
| బ్రంహశ్రీ చిట్టమూరి రామయ్యగారిచే రచియింపబడిన బ్రంహవిద్య | | | 0—2—0 |

ఈ తెలుగుగ్రంథములు మదరాసుకుసమీపం అడయారులో థియాసఫిస్టుఆఫీసులో దొరుకును.

ఇదిగాక కడప తత్వజ్ఞానసభాధ్యక్షులగు బ్రంహశ్రీ నంజుండప్పగారిచే ప్రకటింపబడిన 1 మొదలు 14 నెంబర్లుగలసంచికలు ఉచితముగానివ్వఁబడును. కావలసినవారు కడపకు వారి కేటికి వ్రాసుకొనవలయును.

## దివ్యజ్ఞానదీపిక.

ఈపత్రికకు చంద్రాపైకముల్ను బాబులున్ను అడుగినచేవ్రాలుచేసినవారికి పంపవలయును.

పరమాత్ముని నరసింహయ్య.